# తెలుగు భాషా చరిత్ర


సంపాదకుడు:

భద్రిరాజు కృష్ణమూర్తి

భాషాశాస్త్ర శాఖ

ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు.



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాదు.

హైదరాబాదు – 500 004

1979

ప్రథమ ముద్రణ 1974
ప్రతులు 1500
రెండవ ముద్రణ జనవరి 1979
ప్రతులు 5,000

వెల రూ. 16-00

Paper used for the Printing of this book was made available by the Government of India at Concessional rate. (Partly)

ముద్రణ :
శివాజి ప్రెస్,
సికింద్రాబాదు.

ఎమ్. కందప్పచెట్టి స్మృతికి

# తొలిపలుకు

డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారి సంపాదకత్వంలో వెలువడుతున్న 'తెలుగు భాషాచరిత్ర' తెలుగులో ఇటువంటి గ్రంథాలలో మొదటిది. ఇంతవరకు తెలుగు సాహిత్య చరిత్రలేగాని సమగ్రమైన తెలుగు భాషా చరిత్ర రాలేదు. తెలుగుభాషపై భిన్నకాలాల, భిన్నాంశాలనుగూర్చి పరిశోధనలు జరిపిన పండితులు ఈ గ్రంథంలోని వివిధ ప్రకరణాలను రచించినారు. ఇటువంటి గ్రంథాన్ని ప్రకటిస్తున్నందుకు సాహిత్య అకాదమీ సంతోషిస్తున్నది.

అకాదమీ గత పదిహేడు సంవత్సరాలలో ఏ సంస్థలూ, ప్రచురణ కర్తలు చేయని ముఖ్యమైన ప్రచురణలు చేసినది. 'మాండలికవృత్తిపదకోశం' మొత్తం భారతీయ భాషలలోనే తొలిప్రయత్నము. మహాకవుల పదప్రయోగకోశాలు భావిలో తెలుగుభాషపై పరిశోధనలు చేసేవారికి కల్పతరువులు. ఈ కోవలో చెప్పుకో దగ్గ పనులలో 'తెలుగుభాషాచరిత్ర' ప్రచురణ ఒకటి.

తెలుగు భారతరాజ్యాంగము గుర్తించిన నాలుగు ద్రావిడ భాషలలో ఒకటి. భారతదేశంలో ద్రావిడభాషలను మాట్లాడేవారిలో తెలుగు మాట్లాడేవారి సంఖ్య అన్నిటికంటే ఎక్కువ. మొత్తం భారతదేశంలో హిందీ తరువాత ఈ విషయంలో తెలుగు రెండవస్థానం ఆక్రమిస్తుంది. దీనికి చాలా ప్రాచీనమైన సాహిత్యము, చరిత్ర ఉన్నది. నన్నయకు ముందు వెయ్యిసంవత్సరాలనాటికే తెలుగు స్వతంత్ర భాషగా స్థిరపడినట్లు కనిపిస్తున్నది. ఆనాటి తెలుగుభాషాస్వరూపాన్ని తెలుసుకోవటానికి శాసనాలే ఆధారం. నన్నయ తర్వాతకూడా తెలుగులో వచ్చిన మార్పులను తెలుసు కోవాలెనంటే శాసనాలే ప్రధానాధారాలవుతున్నాయి. సమకాలీన వ్యావహారిక భాషాస్వరూపం కొంతవరకైనా శాసనాల్లో కనిపిస్తున్నది. ఈ గ్రంథంతో నన్నయకు ముందునుంచి 19వ శతాబ్దివరకు సుమారు రెండువేల సంవత్సరాల శాసన భాషా చరిత్ర సమగ్రంగా దర్శన మిస్తున్నది. కావ్యభాషాచరిత్రకూడా ఇందులో ఉన్నది. అట్లాగే తెలుగులో ఇతర భాషాపదజాలం, తెలుగులిపి పరిణామం, అర్థపరిణామం, మాండలిక భేదాలు మొదలైన విషయాలు ఇందులో చర్చింపబడినవి. ఆధునిక భాషాస్వరూపం సంగ్రహంగానే అయినా సమగ్రంగా మొదటిసారి చర్చింపబడింది ఈ గ్రంథంలోనే తెలుగుకు ఇతర ద్రావిడ భాషలతోగల సంబంధం స్పష్టంగా

ఈ గ్రంథంలో కనిపిస్తున్నది. మొత్తంమీద ఈ గ్రంథం సమగ్రమైన, ప్రామాణిక మైన తెలుగుభాషాచరిత్ర లేని లోటును తీరుస్తున్నదని నమ్మకము. తెలుగును ప్రధానవిషయంగా అధ్యయనం చేసే విద్యార్థులకే కాక, అంతకంటె ఎక్కువగా తెలుగుభాషపై పరిశోధనలు చేసే పండితులకు గూడా ఇది సహాయకగ్రంథంగా ఉపకరించగలదని ఆశిస్తున్నాము.

కోరినంతనే ఈ గ్రంథానికి సంపాదకత్వం వహించటానికి అంగీకరించి, ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా, కొంత ఆలస్యమే అయినా గ్రంథాన్ని సమగ్రంగా వెలువరించిన ఉస్మానియా విశ్వవిద్యాలయ భాషాశాస్త్రశాఖాధ్యక్షులు భద్రిరాజు కృష్ణమూర్తిగారికి, ఆయా అధ్యాయాలను రచించిన వ్యాసకర్తలకు, సంపాదక సహాయకులకు సాహిత్య అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

హైదరాబాదు　　　　　　　　　　　　　　　　దేవులపల్లి రామానుజరావు

2–9–75　　　　　　　　　　　　　　　　　　　　కార్యదర్శి

# తొలిపలుకు

## (రెండవ ముద్రణము)

డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారి సంపాదకత్వాన వెలువడిన ఈ 'తెలుగు భాషాచరిత్ర' మొదటి ముద్రణకు సంబంధించిన ప్రతులన్నీ సంవత్సరంలోనే చెల్లిపోయి ద్వితీయ ముద్రణావశ్యకత ఏర్పడినది. దీనివలన ఈ గ్రంథం ఆవశ్యకత స్పష్టంగా తెలుస్తున్నది. అన్ని విశ్వవిద్యాలయాల్లోని తెలుగు ఎమ్. ఏ. పరీక్షలకు ఇది పాఠ్యగ్రంథంగా ఉన్నది. ఈ విధంగా ఈ గ్రంథం అధ్యాపకుల, విద్యార్థుల అవసరాన్ని తీర్చగలిగినందుకు ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ సంతోషిస్తున్నది.

ఈ ద్వితీయ ముద్రణలో ఆయా ప్రకరణాల రచయితలు అనేకమైన మార్పులు, చేర్పులు చేసినారు. ఒకరిద్దరు తమ ప్రకరణాలను నూతన పరిశోధితాంశాలు ఆధారంగా పూర్తిగా తిరిగి వ్రాసినారు. కాబట్టి మొదటి ముద్రణ తరువాత జరిగిన పరిశోధనా ఫలితాలుకూడా చేరటంవల్ల ఇదిమరింత ఉపయోగకారి కాగలదని చెప్పవచ్చును. ఆ యా ప్రకరణాల రచయితలందరికీ అకాడమీ పక్షాన కృతజ్ఞతలు. త్వరలోనే ఈ గ్రంథం ఆంగ్లంలో కూడా వెలువడనున్నది.

ఈ గ్రంథాన్ని రెండవ ముద్రణకుగాను సవరించి అందించిన సంపాదకులు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారికి కృతజ్ఞతలు. ప్రూఫులు చూడడం మొదలు కొని ఈ గ్రంథం ముద్రణలో అన్నివిధాల సహకరించిన డా. కె. కె. రంగనాథాచార్యులుగారికి, ముద్రణను నిర్వహించిన శివాజీప్రెస్ వారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

హైదరాబాదు
28-1-1979

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# విషయ సూచిక

# సంపాదకీయం

1971 జనాభాలెక్కల ప్రకారం తెలుగు మాట్లాడే వాళ్ళసంఖ్య 4.3 కోట్లు. తెలుగు భాషకు సుమారు రెండువేల ఏండ్ల చరిత్ర ఉంది. తెలుగులో బహుశా క్రీ. శ. 5, 6 శతాబ్దులకే కావ్య సాహిత్యం ఏర్పడి ఉంటుంది. ఏ భాషలోనైనా మొట్టమొదటిసారిగా సృష్టించిన సాహిత్యంలో ఉన్న భాష సమకాలీన విద్యావంతుల భాషకు అత్యంత సన్నిహితంగా ఉండి ఉంటుంది. నన్నయకాలానికే కావ్యభాష వ్యవహారభాష పరస్పరం దూరమౌతున్నట్టు మనకు స్పష్టంగా తెలుస్తుంది. కావ్య భాషకు పూర్వకవి రచనలు ఒరవడి అవుతాయి. వాడుకభాష సామాజిక వ్యవస్థలో వచ్చే మార్పులనుబట్టి ప్రజోచ్చారణ పరిణామాలనుబట్టి నియంతగా మారుతూ వస్తుంది. వ్యవహారభాషపై కావ్యభాషా ప్రభావం అన్ని శతాబ్దుల్లోనూ కనిపిస్తుంది. సమకాలీన వ్యవహారభాష ప్రభావం 15వ శతాబ్దిదాకా కావ్యభాషలో కొద్దిగాను, ఆ తరవాత ఎక్కువగాను కనిపిస్తుంది. ఈ రెండు శాఖల క్రమపరిణామాన్ని పరస్పర సంబంధాన్ని నిరూపించటమే తెలుగుభాషాచరిత్ర లక్ష్యం. అసమగ్రమైనా తెలుగుభాషకు శాస్త్రీయమైన పద్ధతుల్లో రచించిన మొదటి చరిత్ర ఇదే అనటంలో అత్యుక్తి ఏమీలేదు. జరిగిన రెండు మూడు దశాబ్దుల్లో వెలువడ్డ పరిశోధనవల్ల ఇది సాధ్యమైంది.

భాషా చరిత్రకు చెందిన ప్రత్యేక విషయాలపై పరిశోధనచేసి నిష్ణాతులైన పన్నెండు మంది పండితులను ఆహ్వానించి ఈ గ్రంథం కూర్చటం జరిగింది. దీని ప్రణాళిక 1968 లో తయారైనా పుస్తకరూపంలో వెలువడడానికి ఏడేండ్లు పట్టింది. ఈ ప్రయత్నం ఫలించటంలో తోడ్పడ్డ ప్రకరణ రచయితలందరికీ నా హృదయపూర్వకాభివందనలు.

ప్రూఫులు దిద్దటంలోను, ఒకటి రెండు వ్యాసాలు తిరిగి రాయటంలోను, పదసూచి, ఉపయుక్తగ్రంథపట్టిక, సంకేత వివరణం మొ. వి. తయారు చేయించ టంలో నాకు మొదటినుంచీ సహకరించిన మిత్రుడు రంగనాథాచార్యులకు నా కృతజ్ఞత. మాకీ అవకాశం ఇచ్చి తెలుగు దేశానికి మొదటిసారిగా ప్రామాణిక భాషా చరిత్ర అందించటానికి పూనుకొన్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారిని నేను అభినందిస్తున్నాను. మెత్తగాల త్రిడిచేస్తూ ఇప్పటికైనా పుస్తకం వెలువడటానికి

కావలసిన సంపూర్ణసహకారం ఇచ్చిన అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి మా వినతి.

మా ఆలస్యాన్ని సహించి ముచ్చటగా అచ్చువేసిన శివాజీ ప్రెస్సు వారు ప్రశంసార్హులు.

తెలుగుశాసనభాషలో అనన్యమైన కృషిచేసినవాడు కందప్పచెట్టి. అడిగిన వెంటనే ఈ గ్రంథానికి రెండు వ్యాసాలు పంపించాడు. పాపం ! అనుకోకుండా అకాలమరణం సంభవించింది. తెలుగుభాషా శాస్త్రాధ్యయనానికి తెలుగుదేశానికి అతని మృతి తీరని నష్టం. అతని దివ్యస్మృతికి ఈ సంకలనం అంకితం చేస్తున్నాము.

ఈ గ్రంథంలో వచ్చిన చిన్నచిన్న పొరపాట్లను, తప్పులను పునర్ముద్రణలో దిద్దుకోగలమని పాఠకులకు మనవి చేసుకొంటున్నాను.

— భ. కృ

# పీఠిక

(రెండవ ముద్రణ)

అచ్చువేసిన రెండేళ్ళలోపలే తెలుగు భాషా చరిత్ర కాపీలన్నీ అమ్ముడు పోయాయి. అన్ని విశ్వవిద్యాలయాల్లోను తెలుగు ఎమ్. ఏ. పరీక్షకు, ఓరియంటల్ పరీక్షలకు, కేంద్ర, రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్షలకుకూడా దీన్ని పాఠ్యగ్రంథంగా నిర్ణయించటం ఈ గ్రంథం అవసరాన్ని, ప్రాముఖ్యాన్ని తెలుపుతున్నది. ద్వితీయముద్రణలో మొదటి ప్రతిలో వచ్చిన అచ్చుతప్పులను చాలా వరకు సరిదిద్దే ప్రయత్నం జరిగింది. 2, 9, 13 ప్రకరణాల రచయితలు కొన్ని మార్పులు, చేర్పులు చేశారు. 6 వ ప్రకరణం పూర్తిగా తిరిగి రాయడం జరిగింది.

ఈ గ్రంథం ప్రధానంగా పరిశోధకవ్యాస సంకలనం. సామాన్య పాఠ్య గ్రంథాలకంటే ఎక్కువ వివరాలు, పరిశోధనగురుత్వం ప్రతి వ్యాసంలోను కనిపిస్తాయి. అందువల్ల ప్రధానంగా ఇది అధ్యాపకులకు సహాయగ్రంథంగా ఉపయోగిస్తుంది. ఈ వివరాలన్నీ సాధారణ విద్యార్థులు గుర్తు పెట్టుకోవటానికి ప్రయత్నించటం అనవసరం. నామ విభక్తులు, సర్వనామాలు, సంఖ్యావాచకాలు మొదలైనవి రెండువేల యేండ్ల చరిత్రలో ఏయే మార్పులు పొందినదీ భిన్న ప్రకరణాలనుంచి సేకరించి సమన్వయించుకోవలసి ఉంటుంది. నిజానికి ఈ మౌలిక గ్రంథం ఆధారంగా ఇలాంటి సమన్వయంతో మరొక పుస్తకం రావలసిన అవసరం ఉన్నది.

ఈ పుస్తకం కాపీలు అయిపోయి రెండేళ్ళకు పైచిలుకు అయింది. ఇది ఆంగ్లంలోకూడా రావలసి ఉన్నది. పునర్ముద్రణలో అయిన జాప్యాన్ని మన్నిస్తూ దీన్ని ఇతోధికంగా ఉపకరించటానికి సూచనలుచేస్తే సంతోషిస్తాను.

హైదరాబాదు — భద్రిరాజు కృష్ణమూర్తి

28-1-1979 — సంపాదకుడు

# సంకేత వివరణం

## (ABBREVIATIONS)

### గ్రంథాలూ–పత్రికలు

#### తెలుగు

| | |
|---|---|
| అప్ప. | అప్పకవీయము |
| ఆం. ప. | ఆంధ్ర పత్రిక |
| ఆం. భా. చ | ఆంధ్రభాషా చరిత్ర |
| ఆ. భా. భూ | ఆంధ్ర భాషా భూషణము |
| ఆం. భా. వి. | ఆంధ్రభాషా వికాసము |
| ఆము. | ఆముక్త మాల్యద |
| ఆం. సా. ప. ప. | ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక |
| ఉద్యో. | ఉద్యోగపర్వము |
| ఉ. హరి. | ఉత్తర హరివంశము |
| కళా. | కళాపూర్ణోదయము |
| కాళ. | కాళహస్తీశ్వర శతకము |
| కు. సం. | కుమార సంభవము |
| తి. తి. దే. శా. | తిరుమల తిరుపతి దేవస్థానం శాసనాలు |
| తె. శా. | తెలంగాణా శాసనాలు |
| నిర్వ. రామా. | నిర్వచనోత్తర రామాయణము |
| పం. చ. | పండితారాధ్య చరిత్ర |
| పాండు. | పాండురంగమహాత్మ్యము |
| ప్రౌ. వ్యా. | ప్రౌఢవ్యాకరణము |
| బ. పు. | బసవపురాణము |
| బా. వ్యా. | బాలవ్యాకరణము |
| భార. | భారతము |
| మను. | మనుచరిత్ర |
| మాం. వృ. కో. | మాండలిక వృత్తిపదకోశం |
| రా. ప. సం. | రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక |

| | |
|---|---|
| వ్యా. సం. | వ్యాస సంగ్రహము |
| శా. ప. మం. | శాసనపద్య మంజరి |
| శృ. నై. | శృంగార నైషధము |
| సం. | సంస్కృతం |
| సూ. ఆం. ని. | సూర్యరాయాంధ్ర నిఘంటువు |
| హర. | హరవిలాసము |

## English

| | |
|---|---|
| BSOAS | Bulletin of the School of Oriental (and African) Studies. |
| CII | Corpus Inscriptions Indicorum |
| CIT | A Corpus of Inscriptions in the Telingana Districts of H. E. H. the Nizam's Dominion |
| CP | Copper plates |
| DED | Dravidian Etymological Dictionary |
| EI | Epigraphia Indica |
| ESIP | Elements of South Indian Paleography |
| HGT | Historical Grammar of Telugu |
| HTL | History of the the Telugu Language |
| IA | Indian Antiquary |
| IP | Indian Paleography |
| JAHC | Journal of Andhra History and Culture |
| JAHRS | Journal of Andhra Historical Research Society |
| JVOI | Journal of Sri Venkateshwara Oriental Institute |
| KI | Kareemnagar Inscriptions. |
| Lg | Language |
| NI | Nellore Inscriptions |

| | |
|---|---|
| QJMS | Quarterly Journal of Mythic Society |
| RPS | RājaRāja narēndra Paṭṭābhishēka Sanchika |
| SII | South Indian Inscriptions |
| SIP | South Indian Paleography |
| TTDES | Tirumala Tirupati Devasthanam Ephigra-phical Series |
| VS | Vyasa Sangraham |

## భాషలు

| | |
|---|---|
| ఉ. ద్రా. | ఉత్తర ద్రావిడ భాషలు |
| ఒ. | ఒల్లారీ |
| క. | కన్నడం |
| కు. | కుడుఖ్ |
| కువి. | కువి |
| కూ. | కూయి |
| కొం. | కొండ |
| కొ. | కొడగు |
| కో. | కోలామీ |
| గ. | గదబ |
| గోం. | గోండి |
| త. | తమిళం |
| తు. | తుళు |
| తె. | తెలుగు |
| తొ. | తొద |
| ద. ద్రా. | దక్షిణ ద్రావిడ భాషలు |
| నా. | నాయికీ |
| ప. | పర్జీ |
| పెం. | పెంగో |
| ప్రా. | ప్రాకృతం |
| ప్రా.ద్రా.భా. | ప్రాచీన ద్రావిడ భాషలు |

| | |
|---|---|
| బ్రా. | బ్రాహుయీ |
| మం. | మండ |
| మ. | మలయాళం |
| మ. ద్రా. | మధ్య ద్రావిడభాషలు |
| మా. | మాల్తో |
| మూ. ద్రా. | మూలద్రావిడ భాష |
| సం. | సంస్కృతం |

## మిగిలిన గుర్తులు

* = కొన్నిసూత్రాలు ఆధారంగా నిరూపించిన పునర్నిర్మిత రూపానికి గుర్తు; వ్యాకరణ సిద్ధంకాని కృతకవాక్యానికి గుర్తు.

A > B = చారిత్రకంగా 'A', 'B' గా మారింది.

A⟶B = వర్ణనాత్మకంగా 'A' 'B' గా మారింది (సంధివశంగా)

/ / = వర్ణవిధేయ లిపిని ఈ గుర్తుల మధ్యరాస్తారు.

[ ] = ధ్వని విధేయలిపిని ఈ గుర్తులమధ్య రాస్తారు.

/ = ఈ గుర్తుకు ఇరువైపులా ఉన్న రూపాలు రెండూ సాధ్యం.

~ = ఈ గుర్తుకు ఇరువైపులా ఉన్న రూపాలు సపదాంశాలు; వాటి భేదం పూర్వాపర వర్ణాలను ఆశ్రయించి ఉంటుంది.

∞ = ఇరువైపులా ఉన్నరూపాలు సపదాంశాలు; వాటి భేదం పూర్వాపరపదరూపాలను బట్టి ఉంటుంది.

∅ = అభావం; ఒక రూపం ఉండవలసినచోట దాని లోపాన్ని సూచించే గుర్తు.

సూచన : శాసనరూపాల కుండలీకరణాలలో ఇచ్చిన వివరాల వరుస: ఆకర గ్రంథం. సంపుటసంఖ్య. శాసన సంఖ్య.శాసనంలో ఆ పదం వచ్చిన పంక్తి, సంవత్సరం. ఉదా : దేరా. (SII. 5.1216.6, 1314)

# ఆంధ్రం, తెనుగు, తెలుగు

— జి. ఎన్. రెడ్డి

**1.0.** మన భాషకు ఈనాడు ఆంధ్రం, తెనుగు, తెలుగు అని మూడు పేర్లు వ్యవహారంలో ఉన్నాయి. సంస్కృత గ్రంథాల్లో అంధ్ర శబ్దం ఆంధ్రకు రూపాంతరంగా కన్పిస్తుంది. తెలుగు కావ్యాల్లో తెనుంగు, తెనుఁగు, తెలుంగు, తెలుఁగు, త్రిలింగ అనే పదాలు భాషాపరంగా ప్రయోగంలో ఉన్నాయి. తమిళంలో తెలుగు భాషకు పేర్లుగా వడగు, వడుగ పదాలు గ్రంథస్థమైనాయి.[1] పోర్చుగీసు వారు తెలుగువారిని 'జెంతియొ' (Gentio) అనీ, తెలుగు భాషను 'జెంతూ' (Gentoo) అనీ, 16, 17 శతాబ్దాలలో వ్యవహరించినారు.[2] మొత్తం మీద మన భాషను తెలిపే పదాలు: అంధ్ర, ఆంధ్ర, తెనుంగు, తెనుఁగు, తెలుంగు, తెలుఁగు త్రిలింగ, వడగు, వడుగ, జెంతూ. ఏకార్థబోధకాలైన ఈ పదాల చరిత్రనూ, రూపనిష్పత్తినీ, పరస్పర సంబంధాన్నీ పరిశీలిద్దాం.

**1.1.** **అంధ్ర, ఆంధ్ర** : ఈ రెండు పదాలు రూపాంతరాలైన సంస్కృత పదాలు. ఇవి సంస్కృతంలో అతి ప్రాచీన కాలంలో జాతిపరంగా ప్రయోగింపబడి ఉన్నాయి. శునశ్శేపుని తమ జ్యేష్ఠభ్రాతగా అంగీకరించడానికి నిరాకరించిన మొదటి యాభైమంది పుత్రులనూ అనార్యజాతులైన ఆంధ్ర, పుండ్ర, శబర, పుళింద, మూతిబాది దస్యులలో కలసి పొందని విశ్వామిత్రుడు శపించి బహిష్కరించినట్లు ఐతరేయబ్రాహ్మణంలో (క్రీ. పూ. 600) ఒక ఐతిహ్యం ఉంది.[3] మనకు తెలిసినంతవరకు ఆంధ్ర శబ్దానికి సంస్కృతంలో మొట్టమొదటి ప్రయోగం ఇదే. మ్లేచ్ఛులైన ఈ అయిదుజాతుల వారూ ఆర్యావర్తానికి సరిహద్దు ప్రాంతాల్లో ఆనాడు నివసిస్తున్న ద్రావిడులో ముండా ప్రజలో అయిఉండవచ్చు. భారతదేశానికి ఆర్యులు ఆగంతకులనీ, ముండా ప్రజలూ, ద్రావిడులూ వారికి పూర్వముండిన ఆదిమవాసులనీ చరిత్రకారుల నిర్ణయం. కాబట్టి ఆంధ్రులు అనార్యులైన ద్రావిడులలో ఒక తెగవారని అభిప్రాయపడవచ్చు. అంధ్రుల ప్రశంస వ్యాస

మహాభారతంలో కూడా కన్పిస్తుంది. మయసభలో అంగ, వంగ, పుండ్రక, పాండ్య, ఓఢ్ర, ఆంధ్రరాజులు ధర్మరాజును కొలిచినట్లు వర్ణింపబడింది.[4] మనుస్మృతిలో కారావరవస్త్రీకి వైదేహునకు జన్మించిన నిషాదులు ఆంధ్రులని చెప్పబడింది.[5] నాట్యశాస్త్రంలో భరతుడు (క్రీ. శ. ప్రారంభకాలం) పాత్రోచిత భాషను గురించి చర్చిస్తూ బర్బర, కిరాత, ఆంధ్ర, ద్రమిల ప్రభృతి జాతులకు శౌరసేని మొదలైన ప్రాకృతాలను ఉపయోగించరాదని సూచించి ఉన్నాడు.[6] వాయుపురాణంలో ఆంధ్రరాజులైన ఆంధ్రభృత్యుల పేర్లూ, వారి పరిపాలనా కాలం వివరించబడి ఉన్నాయి.[7] ఆంధ్రభృత్యులే శాతవాహనరాజులు. వారి పరిపాలనా కాలం క్రీ. పూ. 230 క్రీ. శ. 225 అని చరిత్రకారుల నిర్ణయం. సంస్కృత భాగవతంలో శుకుడు హరిస్తుతి గావిస్తూ కిరాతహూణాంధ్ర పుళిందాది జాతులు తమతమ పాపాలనుండి విముక్తి పొందడానికి హరిని ఆశ్రయించినారని వర్ణించినాడు.[8] చంద్రగుప్తమౌర్యుని ఆస్థానాన్ని సందర్శించిన గ్రీకురాయబారి మెగస్తనీసు (క్రీ. పూ. 400) మౌర్యుల తర్వాత ఆంధ్రులు ఎన్నదగిన చతురంగబలం గలవారని ప్రశంసించి ఉన్నాడు.[9] అశోకుడు వేయించిన కొన్ని శాసనాల్లోకూడా ఆంధ్ర ప్రజల ప్రసక్తి కన్పిస్తుంది. అశోకుని 13వ ధర్మలిపి శాసనంలో ఆంధ్రులతని సామ్రాజ్యంలోని వారనీ, అతని ధర్మబోధలను అనుసరిస్తున్న వారనీ ప్రశంసించబడింది.[10] కువలయమాల అనే ప్రాకృత గ్రంథంలో ఉద్యోతనుడు (కీ. శ. 8వ శతాబ్దం) ఆంధ్రులు అందమైనవారనీ, ఆహార విహార ప్రియులనీ అభివర్ణించి ఉన్నాడు.[11] ఈ విధంగా ఆంధ్రశబ్దం ఐతరేయ బ్రాహ్మణకాలం నుండి జాతివాచకంగా గ్రంథస్థమై ఉంది.

**1.2.** సంస్కృత వాఙ్మయంలో అంధక ఆంధ్రక జాతుల ప్రశంస కూడా కన్పిస్తుంది. వ్యాస మహాభారతంలో ద్రౌపదీ స్వయంవరానికి విచ్చేసిన వారిలో అంధకులుకూడా ఉన్నట్లు వర్ణించబడింది.[12] పాండవులు వనవాసానికివెళ్ళిన వార్తవిని వారిని దర్శించడానికి భోజులు, వృష్ణులు, అంధకులు వెళ్ళినట్లు తెల్పబడింది.[13] భాగవతపురాణంలో అంధకులు యాదవజాతికి చెందిన ఒక తెగవారనీ, ద్వారకానగర సంరక్షకులనీ పేర్కొనబడి ఉన్నది.[14] మత్స్యపురాణంలో అంధకాసురుని సంతతి అంధకులని ఒక ఐతిహ్యం ఉంది.[15] వ్యాసభారతంలో అరణ్యపర్వ కథాభాగంలో శ్రీకృష్ణుడు ధర్మజుని ఓదారుస్తూ, రాజసూయయాగ సమయంలో ధర్మజుని సేవించడానికి వచ్చిన రాజుల్లో పాండ్య, ఓఢ్ర, చోళ, ద్రావిడులతో

పాటు ఆంధ్రకులు కూడా ఉన్నట్లు స్మృతికి తెచ్చినాడు.[16] కురుక్షేత్ర యుద్ధంలో ఆంధ్రకులు, పులిందులు, కిరాతులు మొదలైన మ్లేచ్ఛజాతులవారు కౌరవపక్షంలో యుద్ధం చేసినట్లూ, వారు పరాక్రమవంతులైనట్లూ వర్ణించబడింది.[17] శాంతిపర్వంలో భీష్ముడు ధర్మరాజుకు సర్వభూతోత్పత్తిని గురించి చెబుతూ దక్షిణాపథంలో జన్మించిన పుళింద శబరాది జాతులలో ఆంధ్రకులు ఒకరని పేర్కొన్నాడు.[18]

**1.3.** సంస్కృత గ్రంథాల్లో జాతి వాచకంగా ప్రయోగించబడిన అంధ్ర, ఆంధ్ర, అంధక, ఆంధ్రక పదాలు ఏకజాతి వాచకాలే అని అభిప్రాయపడవచ్చు. ఈనాడుకూడా బీరారు ప్రాంతంలో 'అంధ' అనే ఒక అనార్యతెగవారున్నారు. అంధ యొక్క ప్రాకృత రూపాంతరమే అంధక అనీ, దాని సంస్కృత రూపమే 'అంధ్ర' లేదా 'ఆంధ్ర' అనీ బరో (T. Burrow) అభిప్రాయం.[19]

**1.4.** ఇంతవరకు పేర్కొన్న గ్రంథస్థాధారాలను బట్టి ఆంధ్రజాతిని గురించి ఈ కింది అభిప్రాయాన్ని ప్రతిపాదించవచ్చు: ఆంధ్రులు అనార్యులు. ఆర్యుల్లో కొందరికి వీరితో సాంకర్యం ఏర్పడింది. ఆంధ్రులు సంకరజాతి వారని చెప్పడానికి మనుస్మృతి కూడా ఒక ఆధారం. శబర, పుండ్ర, పుళింద, కిరాతాది మ్లేచ్ఛజాతులలో ఆంధ్రులను కూడా జమకట్టి ఉండడం గమనించదగిన విషయం. ఆంధ్రశబ్దానికి సంస్కృతంలో వేటకాడు అనే ఒక అర్థం ఉంది.[20] సంగం యుగానికి సంబంధించిన తమిళ గ్రంథాల్లో తెలుగువారిని 'వడుగర్' అని పేర్కొంటూ వారు వేటకుక్కలతో సంచరించేవారని వర్ణించబడింది. ఆర్యుల ప్రాబల్యాన్ని ఎదుర్కోలేని ఆంధ్రులు దక్షిణాపథానికి తరలివచ్చి రాజ్యాన్ని స్థాపించుకొని ఆ ప్రాంతంలోని ప్రజలతో కలసిఉండవచ్చు. పాలకులైన వారిపేరే ఆ దేశానికి, ప్రజలకూ, భాషకూ కాలక్రమంలో సిద్ధించి ఉండవచ్చు.

**1.5.** ఆంధ్రశబ్దం జాతివాచకంగానే కాక దేశవాచకంగా కూడా ప్రాచీన సంస్కృత వాఙ్మయంలోనూ, శాసనాల్లోనూ కన్పిస్తుంది. వాల్మీకి రామాయణంలో సుగ్రీవుడు సీతాన్వేషణకై వానరులను దక్షిణ దిశకు పంపుతూ వారు వెదకవలసిన రాజ్యాలలో అంధ్ర, పుండ్ర, చోళ, పాండ్యాది దేశాలను పేర్కొని ఉన్నాడు.[21] దక్షిణదిగ్విజయయాత్రా సందర్భంలో సహదేవుడు జయించిన రాజ్యాల్లో ఆంధ్రదేశం కూడా ఉన్నట్లు వ్యాసభారతాన్నిబట్టి తెలుస్తుంది.[22] భాగవతపురాణంలో బలికుమారులు ఆరుగురు తమ పేర్లతో ప్రత్యేక రాజ్యాలు స్థాపించుకొన్నారని, వారిలో ఆంధ్రుడనేవాడు ఆంధ్ర రాజ్యాన్ని స్థాపించినాడనీ ఒక ప్రశంస ఉంది.[23]

బౌద్ధవాఙ్మయంలోని అంధరట్ట (<ఆంధ్రరాష్ట్ర) అనే పదం ఆంధ్రదేశ సూచకమే. శివస్కంధవర్మ మైదవోలు శాసనంలో (క్రీ. శ. 284) "అంధా పథీయో గామో విలిపరమ్" అను వాక్య భాగాన్నిబట్టి ఆంధ్రపదం దేశవాచకమని తెలుస్తుంది.[24] మల్లిదేవనందివర్మ దానశాసనంలో (క్రీ. శ. 340) "ఆంధ్రమండలే ద్వాదశ సహస్రగ్రామ సంపాదిత సప్తార్ధ లక్షవిషయాధిపతేః" అన్న వాక్యంలోని ఆంధ్ర శబ్దం కూడా దేశవాచకమే.[25] వరాహమిహిరుని బృహత్సంహితలోని (క్రీ.శ. 600) "కౌశిక విదర్భ వత్సాంధ్రచేదికాశ్చోర్ధ్వకంఠకాః" అనే వాక్యంలోకూడా ఆంధ్ర పదం దేశవాచిగా వాడబడింది. చారిత్రక యుగంలో ఆంధ్రపదం దేశపరంగా అనేక గ్రంథాల్లోనూ, శాసనాల్లోనూ కన్పిస్తుంది. కాబట్టి, మొదట జాతివాచకమైన ఆంధ్ర శబ్దం తర్వాత దేశవాచకంగా ప్రయుక్తమైందనీ, అది క్రీస్తు శకానికి పూర్వమే దేశవాచకంగా కూడా సంస్కృత గ్రంథాల్లోకి వ్యాప్తికి వచ్చిందనీ నిస్సంశయంగా చెప్పవచ్చు.

**1.6.** మనకు తెలిసినంతవరకు సంస్కృత వాఙ్మయంలో 11వ శతాబ్దానికి పూర్వం ఆంధ్రపదానికి భాషావాచిగా ప్రత్యక్ష ప్రయోగంలేదు. కాని, భరతుని నాట్యశాస్త్రంలో నాటకంలో ఉపయోగించదగిన 'విభాషలు' ఏడు విధాలనీ, అవి శకార, అభీర, చండాల, శబర, ద్రమిల, ఆంధ్ర, వనచరుల వ్యవహారంలోనివనీ సూచించబడింది.[26] నన్నయభట్టు రచించిన నందంపూడి శాసనంలో ఆంధ్రశబ్దం భాషావాచిగ మొట్టమొదటి సారిగా ప్రత్యక్షమవుతుంది. ఈ శాసనంలో నారాయణభట్టును "యస్సంస్కృత కర్ణాటప్రాకృత పైశాచికాంధ్రభాషాసు కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వ విభవేన" అని నన్నయ ప్రశంసించి ఉన్నాడు. ఈ ఆధారాన్నిబట్టి ఆంధ్రపదం 11వ శతాబ్దం నాటికి భాషాపరంగా రూఢి కెక్కిందని ఖచ్చితంగా చెప్పవచ్చు.[27] ఆంధ్రశబ్దచింతామణి కర్త నన్నయభట్టు అని అంగీకరిస్తే ఆంధ్ర శబ్దాన్ని భాషాపరంగా శాసనంలోనేకాక గ్రంథంలో కూడ నన్నయ ప్రయోగించినట్లు చెప్పవచ్చు. ఆంధ్రభాషాభూషణకర్త అయిన కేతన తెనుఁగు, తెలుఁగు పదాలతోబాటు ఆంధ్రశబ్దాన్ని కూడా భాషాపరంగా ప్రయోగించి ఉన్నాడు. తన లక్షణ గ్రంథానికి పెట్టిన పేరులోనే కాకుండా గ్రంథంలో కూడా ఆంధ్ర శబ్దాన్ని వాడి ఉన్నాడు. తెలుగులో గ్రంథరచన ప్రారంభమైన కాలం నుండీ ఆంధ్ర శబ్దాన్ని భాషాపరంగా కవులూ, పండితులూ వాడినారని నిస్సంశయంగా చెప్పవచ్చు. ఈ విధంగా మొదట జాతివాచకమైన ఆంధ్రశబ్దం తర్వాత దేశబోధ

కంగానూ, అటుపిమ్మట భాషావాచిగానూ వ్యాప్తిలోనికి వచ్చిందనీ నిర్ణయించ వచ్చు. ఈనాడు కూడా ఆంధ్రశబ్దం జాతి, దేశ, భాషలను సూచించడానికి వాడ బడుతూ ఉంది.

## తెనుంగు, తెనుఁగు, తెనుగు ; తెలుంగు, తెలుఁగు, తెలుగు ;

**1.7.** తెనుంగు, తెనుఁగు - ఈ రెండురూపాలు భాషాపరంగా నన్నయ భారతంలో మొట్టమొదటిసారిగా గ్రంథస్థమై ఉన్నాయి. తెలుగు ధ్వనిపరిణామంలో హ్రస్వం మీది పూర్ణబిందువుకు లోపం విభాషగా కావ్యభాషలో కన్పించడం వల్ల తెనుంగు, తెనుఁగు రూపాంతరాలే. నన్నయలో తెనుంగుకు ఒక ప్రయోగం, తెనుఁగుకు ఒక ప్రయోగం మాత్రమే ఉన్నాయి.

సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తిలో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగాన్.[28]

జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహితమహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్.[29]

నన్నెచోడుని కుమారసంభవంలో తెనుంగు పదానికి రెండు ప్రయోగాలు కన్పిస్తాయి.

మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశి కవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.[30]

సరళముగాఁగ భావములు జాను దెనుంగున నింపు పెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధు మృదుత్వ రసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయన లీలఁ గ్రాలఁగాన్.[31]

నన్నయ, నన్నెచోడులు తెలుంగు, తెలుఁగు రూపాలను ప్రయోగించలేదు. పాల కురికి సోమన తెనుంగు, తెలుఁగు పదాలను భాషాపరంగా ప్రయోగించి ఉన్నాడు.

ఉరుతర గద్యపద్యోక్తుల కంటె-సరసమై పరగిన జానుఁ దెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ-గూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱఁ
దెలుఁగు మాటలనఁగా వలదు. వేదముల-కొలఁదియ కాఁజూడుఁ డిలనెట్టులనిన[32]

తిక్కన నిర్వచనోత్తర రామాయణంలో 'తెలుగు కవిత్వము,'[33] 'తెలుఁగుఁబడి'[34]
భారతావతారికలో 'తెనుంగుబాస',[35] 'తెనుఁగుబాస'[36] అని ప్రయోగించి ఉన్నాడు.
తెలుంగు, తెలుఁగురూపాలు తెనుంగు, తెనుఁగులవలె రూపాంతరాలు. 13వ శతాబ్దం
నుండి భాషాపరంగా వీని ప్రయోగం కావ్యాల్లో సర్వసాధారణంగా కన్పిస్తుంది.

**1.8.** భాషావాచియైన తెనుఁగు, తెలుఁగు-ఈ రెండురూపాలు భిన్న పదాలా లేక ధ్వనుల మార్పువల్ల ఏర్పడిన రూపాంతరాలా అని పరిశీలించవలసి ఉంది.

**తెనుఁగు :** తెనుఁగు తద్భవమనీ ఇది త్రినగశబ్ద భవమనీ కొందరు ఊహించినారు. ఇది ఊహయేకాని నిజముకాదు. (చూ. చిలుకూరి నారాయణరావు, ఆం. భా. చ. ప్రథమభాగం (1936), పు. 32) తెనుఁగు దేశ్యపదమనీ, దిగ్వాచి అనీ సోమయాజిగారి అభిప్రాయం (చూ. గంటిజోగి సోమయాజి, ఆం. భా. వి. (1947), పు. 29-32). తెనుంగు, తెనుఁగు శబ్దాలలోని -ంగు -ఁగు ప్రత్యయ భాగం (పోల్చిచూడు : వడగు, బడగు, *DED* 4267 : కిటక్కు *DED* 1348; కుటకు, కొడగు *DED* 1374), 'తెన్' శబ్దము దిగర్థమున్న ద్రావిడ పదాంశం (చూ. *DED* 2839). తెలుగుభాషలో తెన్ శబ్దం నేటి వ్యవహారం నుండి తొలగి పోయింది కాని, తెమ్మెర, తెన్నేరు, టెంకాయ, తీరూ తెన్నూ, దిక్కూ తెన్నూ ఇత్యాది సమాస రూపాల్లో మాత్రం నిలచి ఉంది. సాధారణంగా ఒక సమాజంలో ఒకభాష రూపొందే ప్రాథమిక దశలో ఆ భాషకు నామకరణం జరగదు. ఈనాడు కూడా కొన్ని అనాగరిక భాషలకు ఆ భాషా వ్యవహర్తలలో ప్రత్యేకమైన పేర్లు లేని స్థితి కన్పిస్తుంది. ఒక భాషా సమాజంలోనే ఒక ప్రాంతంవారు మరొక ప్రాంతం వారిని సూచించవలసి వచ్చినప్పుడు దిక్కులను బట్టి తూర్పువారనీ, పడమటివారనీ, ఉత్తరాదివారనీ వ్యవహరించడం సాధారణంగా కన్పిస్తుంది. ప్రాచీన ద్రావిడభాషా సమాజంలోని వారు దక్షిణప్రాంతపువారిని దక్షిణదిగ్వాచి యగు 'తెన్' శబ్దముచే 'తెనుంగు' అని నిర్దేశించి ఉండవచ్చు. ఆ ప్రాంతపు మాండలికం ప్రత్యేకభాషగా పరిణమించినపుడు ఆ ప్రజలను నిర్దేశించిన తెనుంగు వారి భాషకు పేరుగా కూడా ఏర్పడి ఉండవచ్చు. ద్రావిడ ప్రజలు ప్రాచీనకాలంలో

భారతదేశమంతా వ్యాపించి ఉండినవారే. కాబట్టి ఆనాడు ఉత్తర ద్రావిడప్రజలు దక్షిణ దిక్కులోని వారిని 'తెన్' శబ్దంతో నిర్దేశించి ఉండవచ్చు అనడం అసంగతం కాదు. తమిళదేశానికి ఉత్తరాన ఉన్న తెలుగువారిని 'వడుగర్' అనీ, తెలుగు భాషను 'వడుగ' అనీ తమిళులు ప్రాచీనకాలంనుండి వ్యవహరించి ఉండడం పై అభిప్రాయాన్ని బలపరుస్తుంది. ఇటువంటిదే 'కొడగు' పదం కూడా.

**1.9.** **తెలుఁగు** : తెలుఁగు అనేశబ్దం భాషాపరంగా సంస్కృత గ్రంథాల్లో కన్పించడం లేదు. వాయుపురాణంలో మాత్రం 'తిలింగా' అనే పదం ఒక జనపదానికి పేరుగా పేర్కొనబడినది.[37] కాకతీయ ప్రతాపరుద్రుని ఆస్థానంలోని విద్యానాథుడు (క్రీ. శ. 13 వ శతాబ్దం) శ్రీశైలదాక్షారామ కాళేశ్వరములలోని శివలింగముల వలన తెలుగు దేశానికి త్రిలింగమనే పేరు ఏర్పడిందని 'ప్రతాపరుద్రీయం'లో తెల్పి ఉన్నాడు.[38] విన్నకోట పెద్దన (క్రీ॥శ. 14వ శతాబ్దం) కూడా ఆంధ్ర దేశానికి త్రిలింగదేశమనే పేరు కావ్యాల్లో ప్రయుక్తమై ఉన్నట్లూ, తెలుఁగు త్రిలింగ శబ్దభవమైనట్లూ, కావ్యాలంకార చూడామణిలో తెల్పి ఉన్నాడు :

ధర శ్రీపర్వతకాళే
శ్వరదాక్షారామసంజ్ఞ వఱలు త్రిలింగా
కరమగుట నంధ్రదేశం
బరుదారఁ ద్రిలింగ దేశమనఁ జనుఁ గృతులన్

తత్త్రిలింగపదము తద్భవం బగుటచేఁ
దెలుఁగుదేశ మనఁగఁ దేటపడియె
వెనుకఁ దెనుఁగుదేశమును నండ్రు కొంద ఱ
వ్వాస పంచగతులఁ బరఁగుచుండు[3]

త్రిలింగపదం దేశవాచకంగా బ్రహ్మాండ పురాణంలోనూ, స్కాందపురాణంలోనూ, గ్రంథస్థమై ఉన్నట్లు చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్ర ప్రథమభాగంలో తెల్పి ఉన్నారు.[40] రాజశేఖరుని విద్ధసాలభంజికలో (క్రీ. శ. 10 వ శతా.) "జయతు జయతు త్రిలింగాధిపో దేవః"[41] అని ఒక ప్రయోగం ఉంది. పురాణాల కాలాన్ని ఇదమిత్థంగా నిర్ణయించడం కష్టం. వాటిలో అర్వాచీనాలైన ప్రక్షిప్త భాగాలెక్కువ. 'తెలుగు' త్రిలింగ శబ్దభవం కాదనీ, తెలుగు యొక్క సంస్కృతీకృతరూపమే త్రిలింగమనీ కొమర్రాజు లక్ష్మణరావుగారు నిరూపించి ఉన్నారు. (లక్ష్మణరాయ వ్యాసావళి, పు. 122—26).

'తెలుఁగు' త్రికళింగ శబ్దభవమనీ, ధ్వనిపరిణామం వల్ల అది త్రికళింగ > తి అలింగ>తెలింగ > తెలుంగుగా మారిందనీ కొందరి ఊహ. (గం.జో.సోమయాజి, ఆం. భా. వి., పు. 21-2). ఈ అభిప్రాయానికి సహేతుకమైన ఆధారాలులేవు.

తెనుఁగు, తెలుఁగు రూపాంతరాలే కాని భిన్నధాతుజాలు కావు. ద్రావిడ భాషల్లో న/ల వినిమయం; -ణ-, -ళ->-న-, -ల- లు గానూ మారిన సందర్భాలున్నాయి (*DED*4524). ఈ మార్పు మూల ద్రావిడంలోనే జరిగినట్టు భద్రిరాజు కృష్ణమూర్తి నిరూపించి ఉన్నారు.[42] ఈనాటు కూడా కొన్ని ప్రాంతాల గ్రామీణుల వ్యవహారంలో తెలుగులో న, ల-ల వినిమయం కన్పిస్తుంది. మునగ-ములగ, చెనగు-చెలగు, మునుకోల-ములుకోల, జన్మం--జల్మం, లేదు--నేదు, లాగు-నాగు మొదలైనవి. కాబట్టి తెలుఁగు త్రిలింగ శబ్దభవంకాదనీ, దేశ్యమైన తెనుఁగు యొక్క రూపాంతరమే తెలుఁగు అనీ, ఈరెండు రూపాలూ ప్రాచీన కాలం నుండీ తెలుగు దేశంలో వ్యవహారంలో ఉన్నాయనీ నిర్ణయించవచ్చు.

**1.10.** దేశిపదాలను సంస్కృతీకరించడమో, లేదా వాటికి సంస్కృత సంబంధమైన కృతకవ్యుత్పత్తిని కల్పించడమో పండితుల సంప్రదాయం. ఇందుకు కారణం 'జనని సంస్కృతంబె సకలభాషలకును' అను నమ్మకమే. సంస్కృత భాషాభిమానం కొద్దీ ఓరుగల్లును ఏకాశిలానగరమనీ, పెనుగొండను ఘనగిరి అనీ, కందుకూరును స్కంధపురి అనీ, చెయ్యేరును బాహుదా నది అనీ-ఈ విధంగా దేశి పదాలను పండితులు సంస్కృతీకరించి ప్రయోగించిన సందర్భాలు చాలాఉన్నాయి. తమిళ శబ్దాన్ని ద్రవిడ లేదా ద్రమిల అనీ, కరినాడు శబ్దాన్ని కర్ణాట అనీ (కర్ణయోః అటతీతి కర్ణాటకః), అత్తిరాల గ్రామాన్ని హత్యరాల అనీ, నార్త్ సింహాచలాన్ని నారదసింహాచలమనీ దేశ్యపదాలకు సంస్కృత భాషానురూపాలు సృష్టించబడి ఉన్నాయి. ఇటువంటిదే తెలుఁగు నుండి ఏర్పడిన త్రిలింగ శబ్దం. తెలుగు దేశంలో తెలగలు, తెలగాణ్యులు అనే తెగల వారిపేర్లను త్రిలింగ శబ్దభవాలుగా నిరూపించలేము కదా! అసలు తెలుగు దేశానికి త్రిలింగదేశమనే పేరు కొన్ని గ్రంథాల్లోనే కాని లోకంలో వ్యవహారంలో ఉన్నట్లు కన్పించదు. శైవమతం ప్రాబల్యం వహించిన కాలంలో పండితులు తెలుంగును త్రిలింగగ మార్చి ప్రయోగించి ఉండవచ్చు.

**1.11.** ఈ వ్యాసంలో ఇంతవరకు చర్చించిన విషయ సారాంశం ఇది:

(1) ఆంధ్రులు ఆర్య అనార్య మిశ్రజాతి. వీరు ఉత్తరార్యావర్తం నుండి దక్షిణాపథానికి వచ్చి గోదావరీ ప్రాంతంలో రాజ్యాన్ని స్థాపించుకొని అక్కడి ప్రజలతో కలిసిపోయినవారు.

(2) జాతివాచకమైన ఆంధ్రశబ్దం క్రమంగా దేశవాచకంగానూ, భాషావాచకంగానూ రూఢిలోకి వచ్చింది.

(3) తెనుఁగు దేశ్యమైన దిగ్వాచి.

(4) తెలుఁగు శబ్దం తెనుఁగు శబ్దానికి రూపాంతరమే కాని త్రిలింగ శబ్దభవం కాదు.

## జ్ఞాపికలు

1. తమిళంలో సంగం సాహిత్యములో (క్రీ. శ. ప్రారంభం) కుఱుందొగై (పద్య సంఖ్య 11), అగనానూర్ (పద్యసంఖ్య 107), నట్రిణై (పద్య సంఖ్య 212)-గ్రంథాల్లో వడుగర్ (ఉత్తరదేశస్థులు) అనగా 'తెలుగువారు' అను పదప్రయోగముంది. జయగొండార్ (11వశతాబ్ది) రచించిన కళింగత్తుప్పరణిలో తెలుంగరు (పద్య సంఖ్య 469), వడుగు (పద్య సంఖ్య 43) తెలుగుభాషలో ప్రయోగింపబడింది.

2. "Gentoo. From Portuguese gentio, a gentile or heathen. The name formerly applied by Europeans to the natives of the country, especially to the Teloogoo people, for when the Portuguese arrived the Teloogoo Raj of Vijayanugger was dominant over great part of the peninsula". *Manual of the Administration of the Madras presidency*. Vol. III. Madras (1893).

3. "తస్యహ విశ్వామిత్ర స్యైకశతం పుత్రా ఆసుః ; పంచాశత్ ఏక జ్యాయాంసో మధుచ్ఛందసః, పంచాశత్ కనీయాంసః; తద్యే జ్యాయాంసో నతే కుశలమ్ మేనిరే. తాన్ అనువ్యాజహారన్ తాన్వః ప్రజా భక్షీస్తేతి త ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందా మూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి వైశ్వామిత్రా దస్యూనామ్ భూయిష్ఠాః"

(ఐతరేయబ్రాహ్మణమ్ Asiatic Society of Bengal (1906), 7వ సంచిక, 3వ అధ్యాయం, 6 వ ఖండం).

4 "... ... ... ....
... ... .... ...
తథాంగ వంగౌ సహ పుండ్రకేణ
పాండ్యోడ్ర రాజౌచ సహాంధ్రకేణ"

(వ్యాసభారతమ్, గీతాప్రెస్, గోరఖ్‌పూర్ ప్రథమ సంస్కరణం, సభాపర్వం, 4వ అధ్యాయం, శ్లో. 24).

5. "కారావరో నిషాదాత్తు చర్మకారః ప్రసూయతే
వైదేహికా దంధ్రమేదౌ బహిర్గ్రామ ప్రతిశ్రయౌ"

(మనుస్మృతిః, నిర్ణయసాగర్ ప్రెస్, బొంబాయి (1920), 10 వ అధ్యాయం, శ్లో. 36).

6. "సబర్బర కిరాతాంధ్ర దమిలాద్యాసు జాతిషు
నాట్యప్రయోగే కర్తవ్యం పాఠ్యం భాషా సమాశ్రయమ్"

(అప్పారావు, పోణంగి—నాట్యశాస్త్రము (అనువాదము) నాట్యమాలా ప్రచురణ 1, హైదరాబాదు (1959), 17 వ అధ్యాయం, పుట 486)

7. వాయుపురాణమ్, ఆనందాశ్రమ సంస్కృత ప్రచురణలు; పూనా (1905) 45-127.

8. "కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసా
ఆభీర కంకా యవనాః ఖసాదయః
యేஉన్యేచ పాపా యదుపాశ్రయాశ్రయా
శ్శుధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః

(శ్రీమద్భాగవతమ్, వావిళ్ల ప్రతి. మద్రాసు (1941), ద్వితీయ స్కంధం, 14 వ అధ్యాయం, శ్లో. 18).

9. "Next come the Andhras, a still more powerful race which possess numerous villages and thirty towns defended by walls and towers and which supplies its king with an army of 100000 infantry, 2000 cavalry and 1000 elephants".
(మెగస్తనీసు : 'Maccrindle's Magasthenes', *Indian Antiquary* (1877), Vol. VI, pp. 337-339.)

10. "ఏవమేవ ఇహరాజ విషయేషు యవన కమ్బోజేషు, నాభకే నాభపంక్తిషు, భోజపితి నిక్యేషు అన్ధ్ర పులిన్దేషు - సర్వత్ర దేవానాం ప్రియస్య ధర్మానుశిష్టి మనువర్తనే"

(*Edicts of Asoka*. Ed., G. Srinivasa Murthy and A. N. Krishna Aiyanagar, పు 47.)

11. "పియ మహిళా సంగామే సుందర గత్తేయ భోయణేరోద్దే
అటు పుటు రటుం భణంతే ఆంధ్రే కుమారో సలో యేతి"

ఉద్యోతనుని కువలయిమాల. (చూ. వ్యాసనంగ్రహం పంటాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, ప్రాకృత గ్రంథకర్తలు, ప్రజాసేవ)

12. "హలాయుధ స్తత్ర జనార్దనశ్చ
వృష్ణ్యంధకా శ్చైవ యథా ప్రధానమ్
ప్రేక్షాం స్మచక్రు ర్యదుపుంగవా స్తే
స్థితాశ్చ కృష్ణస్య మతే మహాంతః

(వ్యాసభారతమ్, గీతాప్రెస్, గోరఖ్‌పూర్, ప్రథమ సంస్కరణం, ఆదిపర్వం, 186 వ అధ్యాయం శ్లో. 8).

13. "భోజాః ప్రవ్రజితాన్ శ్రుత్వా వృష్ణయ శ్చాంధకై స్సహ
పాండవాన్ దుఃఖ సంతప్తాన్ సమాజగ్ముర్మహావనే"

(వ్యాసభారతమ్, గీతాప్రెస్, గోరఖ్‌పూర్, ప్రథమ సంస్కరణం, అరణ్యపర్వం, 12 వ అధ్యాయం, శ్లో. 1,)

14. భాగవత పురాణమ్, ఆనందాశ్రమ సంస్కృత ప్రచురణలు: పూనా (1905). 1-11-11.

15. మత్స్యపురాణమ్, ఆనందాశ్రమ సంస్కృత ప్రచురణలు, పూనా (1905) 179-7-37.

16. "యత్ర సర్వాన్ మహీపాలాన్ శస్త్రతేజో భయార్దితాన్
సవంగాంగాన్ సపౌండ్రో డ్రాన్ సచోళ ద్రావిడాంధ్రకాన్"

(వ్యాసభారతమ్, గీతాప్రెస్, గోరఖ్‌పూర్, ప్రథమ సంస్కరణం, అరణ్యపర్వం, (51వ అధ్యాయం, శ్లో. 22)

17. "ఆంధ్రకాశ్చ పుళిందాశ్చ కిరాతా శ్చోగ్రవిక్రమాః
మ్లేచ్ఛాశ్చ పార్వతీయాశ్చ సాగరానూపవాసినః"

(వ్యాసభారతమ్, గీతా ప్రెస్, గోరఖ్‌పూర్, ప్రథమ సంస్కరణం, కర్ణపర్వం, 73వ అధ్యాయం, శ్లో. 20).

18. "దక్షిణాపథ జన్మానః సర్వే నరవ రాంధ్రకాః
గుహాః పుళిందాః శబరశ్చుచుకా మద్రకై స్సహ"

(వ్యాసభారతమ్, గీతాప్రెస్, గోరఖ్‌పూర్) ప్రథమ సంస్కరణమ్, శాంతిపర్వం, 207వ అధ్యాయం, శ్లో. 42).

19. Burrow, T., *Collected papers on Dravidian Lingnistics*, Annamalai University, pp. 384–386 (1968)

20. "ఆంధ్రము. From (andhra, san. hunter)".

"....In pooranic times a dynasty of Andhra, Kings reigned in Northern India, probably Dravidian or some kindred race. The Andrae are represented by Pliny, after Megasthenes, as a powerful people, and the Andre Indi have a Place in the peutinger tables amongst the few Indian nations of which the author of those tables had heard. They were however placed by error north of the Ganges. Hwen–thsang makes An–to–lo one of the southern kingdoms, and this has been held to mean Andhra............"

*Manual of the Administration of the Madras Presidency. Vol. III,* Glossary, Madras (1898).

21. "తథా వంగాన్ కళింగాంశ్చ కౌశికాంశ్చ సమన్తతః
అన్వీక్ష్య దణ్డకారణ్యం సపర్వత నదీగుహమ్
నదీం గోదావరీం చైవ సర్వమేవాను పశ్యత
తథైవాంధ్రాంశ్చ పుణ్డ్రాంశ్చ చోళాన్పాణ్డ్యాంశ్చ కేరళాన్"

వాల్మీకి రామాయణమ్, వావిళ్ళరామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు (1954), కిష్కింధాకాండము, 41వ అధ్యాయము. శ్లో. 11, 12).

22. "పాండ్యాంశ్చ ద్రవిడాంశ్చైవ సహితాంశ్చోడ్ర కేరళైః
ఆంధ్రాం స్తాలవనాంశ్చైవ కళింగా నుష్ట్రకర్ణికాన్"

(వ్యాసభారతమ్, గీతాప్రెస్, గోరఖ్‌పూర్, ప్రథమ సంస్కరణం, సభాపర్వం, 31వ అధ్యాయం. శ్లో 71).

23. "అంగవంగ కళింగాంధ్ర సింహ పుండ్రాంధ సంజ్ఞికాః
జజ్ఞిరే దీర్ఘ తపసో బలేః క్షేత్రే మహీక్షితః
చక్రుస్స్వనామ్నా విషయాన్ షడిమాన్ ప్రాచ్యగాంశ్చతే"

భాగవతపురాణమ్, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు: 9వ స్కంధం, 23 అధ్యాయం, శ్లో. 5, 6).

24. *E. I. Vol. VI p.* 88.

25. *Indian Antiquary,* Vol, XV, p. 175.

26. శకారాభీర చండాల శబర ద్రమిలాంధ్రజాః
హీనా వనేచరాణాంచ విభాషా నాటకే స్మృతాః"

(అప్పారావు, పోణంగి, నాట్యశాస్త్రము (అనువాదము) నాట్యమాలా ప్రచురణ 1, హైదరాబాదు (1959), 17 వ అధ్యాయం, పుట 487)

27. *రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక*, రాజమండ్రి, పు. 114-115.

28. నన్నయ, *శ్రీమదాంధ్ర మహాభారతము*, వావిళ్ల ప్రతి, ఆదిపర్వము, పద్యసంఖ్య 1-26.

29. పై. అది పర్వము, 1-16.

30. నన్నెచోడుడు, *కుమారసంభవము*, మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణ, పద్య సంఖ్య 1-23.

31. పై. 1-35.

32. పాల్కురికి సోమన, *బసవపురాణము*, ఆంధ్రగ్రంథమాల, మద్రాసు, ద్వితీయ ముద్రణం (1952), పుట 4.

33. తిక్కన, *నిర్వచనోత్తరరామాయణము*, వావిళ్ల ప్రతి, మద్రాసు, 1-7.

34. పై. 1-8.

35. తిక్కన, *శ్రీమదాంధ్ర మహాభారతము*, వావిళ్ల ప్రతి, మద్రాసు, విరాటపర్వము 1-7,

36. పై. 1-18,

37, *వాయుపురాణమ్* - ఆనందాశ్రమసంస్కృత ప్రచురణలు, పూనా (1905), 45-111.

38. విద్యానాథుడు, *ప్రతాపరుద్రీయము*, నాటక ప్రకరణము, శ్లో. 44.

39. చిన్నకోట పెద్దన, *కావ్యాలంకార చూడామణి* వేదం వేంకటరాయశాస్త్రి & బ్రదర్స్, మద్రాసు 1 (1968), పు. 192.

40. "శ్రీశైల భీమ కాళేశ మహేంద్రగిరి సంయుతం
ప్రాకారంతు మహత్ కృత్వా త్రీణి ద్వారాణి చాకరోత్
... ... .... .... ...
అవసత్తత్ర ఋషిభిః యుతో గోదావరీతటే
తత్కాల ప్రభృతి క్షేత్రం *త్రిలింగ* మితి విశ్రుతం"

(*బ్రహ్మాండ పురాణమ్*)

"కర్ణాటాశ్చైవ త్రైలింగ ఘూర్జరా రాష్ట్ర వాసినః
ద్రావిడాః ద్రావిడాః పంచ వింధ్య దక్షిణ వాసినః"

(స్కాంద పురాణమ్)

41. రాజశేఖరుడు, విద్ధసాల భంజిక, నాల్గవ అంకం.

42. "§ 1.93. There was in PDr. an alternation between -ṇ-and-ḷ-, So wherever we have an alternation -n-/-l- in Telugu, we can normally trace it to PDr. altenation *-ṇ-/*-ḷ- which was also widely represented in the other South Daauidian languages"

"§ 1.95. "The alternation of -l-/-n- operates dialectally to a great extent in Modern Telugu, but in the early speech it was very much restricted. However there is evidence to show that there was -n-/-l- alternation in PDr. which is seen in many cases in Ta. The following Te. form with -n- has an alternant in -l- in the transitive, reflecting a similar alternation in the parent speech, canu 'to go'. to elapse, tr. calupu 'tō pass (time)'
Krishnamurti, Bh. *TVB*, p. 41.

# తెలుగు : మిగిలిన ద్రావిడ భాషలు

వి. ఎస్. సుబ్రహ్మణ్యం

**2.0.** తెలుగు ద్రావిడభాషా కుటుంబానికి చెందినది. ద్రావిడభాషా కుటుంబంలో 1. తమిళం (త.), 2. మళయాళం (మ.), 3. కోత, 4. తొద (తొ), 5. కొడగు(కొ.). 6. కన్నడం (క.), (మాండలికం :బడగ), 7. తుళు (తు.). 8. తెలుగు (తె.), 9. గోండీ (గోం) (మాండలికం : కోయ), 10. కొండ (లేక) కూబి (కొం.), 11. పెంగొ (పెం.), 12. మండ (మం.) 13. కూయి (కూ.). 14. కువి (కువి), 15. కోలామీ (కో.) (మాండలికం : నాయక్డీ,) 19. నాయకి (నా), 17. పర్జీ (ప.), 18. గదబ (గ.) (ఒల్లారీ, సాలూరు మాండలికాలు), 19. కూడుఖ్ (కూ.), 20. మాల్తో (మా.), 21. బ్రాహుయి (బ్రా.) అనే ఈ ఇరవై యొక్క భాషలు ఉన్నట్లు ప్రస్తుతం లెక్కల ప్రకారం తేలింది. వీటిలో తమిళం నుంచి తుళుదాకా ఉన్న భాషల్ని ఒక ఉపభాషా కుటుంబంగానూ (దక్షిణ ద్రావిడం), తెలుగునించి గదబదాకా ఉన్న భాషల్ని మరొక ఉపభాషాకుటుంబంగానూ (మధ్య ద్రావిడం), కూడుఖ్, మాల్తో, బ్రాహుయి అనే మూడు భాషలూ ఇంకొక ఉపభాషా కుటుంబంగానూ (ఉత్తరద్రావిడం) పరిగణించవచ్చు. (నీలగిరులలో ఉన్న ఇరుళ, కురుంబ జాతుల వారి భాషల్నీ, కర్ణాటకంలో దక్షిణ కన్నడ జిల్లాలో ఉన్న కొరగజాతివారి భాషనీ కొందరు పండితులు ప్రత్యేకభాషలుగా పరిగణిస్తున్నారు. ప్రస్తుతం వీటిమీదపరిశోధన పూర్తికాలేదు.) తెలుగులో ధ్వనులు, వ్యాకరణ నిర్మాణం మిగిలిన ద్రావిడభాషలతో పోల్చిచూస్తే తెలుగు మధ్య ద్రావిడ భాష అనీ, దానికి మధ్య ద్రావిడ భాషలైన గోండీ, కొండ, పెంగొ, మండ, కూయి, కువి భాషలతో అతి సన్నిహిత సంబంధం ఉందనీ స్పష్టమవుతుంది. (తెలుగు మధ్య ద్రావిడోపకుటుంబానికి చెందినదని మొదట చెప్పినవారు *భద్రిరాజుకృష్ణమూర్తి* 1961, అధ్యాయం 4). మూలద్రావిడభాష (మూ. ద్రా.) కాలంనించి తెలుగు ఎల్లా పరిణామం చెందిందో ఈ క్రిందస్థూలంగా చర్చిద్దాం. (కుండలీకరణాల్లో ఇచ్చిన సంఖ్యలు *DED* లోని ఆరోపాల్ని సూచిస్తాయి.)

## ధ్వ ను లు

**2.1. తె. అ < * అ**

తె. అక్క : త. అక్కా, మ. క. తు. అక్క (24)
తె. కన్ను : త. మ. కణ్, కో. గోం. కన్ (978)
తె. పల్లు : త. మ. కోత. క. కో. గోం. పల్ (3288)

**2.2. తె. ఆ < * ఆ**

తె. ఆవు : త. మ. ఆ, ఆన్, క. ఆ, ఆవు. (283)
తె. కాలు : త. మ, కోత, క. కో. గోం. కాల్ (1238)
తె. పాట : త. మ. పాట్టు, కోత పాట్, క. పాట (3348)

**2.3. తె. ఇ < * ఇ**

తె. ఇల్లు : త. మ. ఇల్, కొం. ఇలు, కూ. ఇడు (420)
తె. చిన్న : త. మ. క. చిన్న (2135)
తె. విల్లు : త. మ. విల్, క. బిల్, కో. ప. గోం. విల్,
బ్రా. బిల్ (4449)

**2.4. తె. ఈ <* ఈ**

తె. ఈఁగ , త. ఈ, మ. ఈచ్చ, కోత ఈవ్, కో. నా. నీంగ
(458)
తె. చీము : త. చీ, చీఱ్. క. కీము, కీవు, కూ. సీవెండి,
బ్రా. కీష్ (1337)
తె. నీరు : త. మ. కోత, తొ. క. నీర్, కో. నా. ఈర్,
బ్రా. దీర్ (3057)

**2.5. తె. ఉ < *ఉ.**

తె. ఉల్లి : త. మ. క. తు. ఉళ్ళి (605)
తె. గుడి : త. మ. కుటి 'ఇల్లు', క. తు. గుడి (1879)
తె. పురుగు : త. మ. క. పుఱు, గోం. వుడీ, కో. నా. పుర్రె
(3537)

**2.6.** తె. ఊ < * ఊ

తె. ఊరు : త. మ. కోత, తొ. క. కో. నా. ఊర్ (648).

తె. నూఱు : త. మ. క. నూఱు, తొ. నూత్,
గోం. నూర్ (3090).

తె. పూవు : త. మ. కోత, క. కొ. తు. ప. గ. పూ (3564).

**2.7.** తె. ఎ < * ఎ

తె. ఎలుక : త. మ. ఎలి, క. ఎలి, ఇలి, గోం. ఎల్లి (710).

తె. చెఱువు, చెఱ : త. చిఱై, మ. చిఱ, కోత కెర్,
క. కెఱె (1648).

తె. వెఱ, వెఱపు : త. విఱప్పు, క. బెర్చు, గోం. వెరే (4519).

**2.8.** (i) తె. ఏ < *ఏ

తె. ఏడు : త. మ. క. ఏఱు, గోం. ఏడూజ్ (772).

తె. తేలు : త. మ. క. తేళ్, మా. తేలె, బ్రా.
తేళ్హ్ (2855).

తె. వేరు : త. మ. కోత వేర్, క. బేర్, కో. నా. వేర్, ప.
వార్ (4554).

(ii) తెలుగులో పదాది ఏకారం మూ. ద్రా * యా-నించి కూడా
వస్తుంది.

తె. ఏది : త. మ. యాతు, ఏతు (4228).

తె. ఏడిక : త. యాటు, ఆటు, మ. అటు, క. ఆడు, గోం. ఏటీ
(4229).

తె. ఏఁడు : త. యాంటు, ఆంటు, మ. ఆంటు, క. ఏడు, గోం.
ఏండ్ (4230).

తె. ఏఱు : త. యాఱు, ఆఱు, మ. ఆఱు, గోం. ఏర్
'నీళ్ళు', కొం. ఏఱు 'నీళ్లు', కూ. ఏజు 'నీళ్ళు',
(4233).

తె. ఏనుగు : త. యానై, ఆనై, మ. ఆన, క. ఆనె,
గోం. ఏసీ (4285).

**2.9.** తె. ఒ < * ఒ

తె. ఒండు : త. ఒన్ఱు, మ. ఒన్ను, క. ఒందు, తు. ఒంజి,
గోం. ఉంది, కొం. ఉన్ఱి (884).

తె. బొట్టు : త. మ. పొట్టు, క. బొట్టు (3676).

తె. దొండ : త. తొంటై, మ. తొంటి. క. తొండె, దొండె
(2880).

**2.10.** తె. ఓ < *ఓ

తె. ఓడ : త. మ. ఓటం, క. తు. ఓడ (876).

తె. కోడి : త. మ. క. కోటి, తు. కోరి (1862).

తె. తోఁట : త. మ తోట్టం, క. తోట, త్రోంట (2927).

**2.11.** ద్రావిడభాషా ధాతువుల్లో దీర్ఘాచ్చు, ధాతువు తరవాత నిష్పాదక ప్రత్యయం లేనప్పుడూ, లేక హల్లుతో మొదలయ్యే నిష్పాదకప్రత్యయం ఉన్నప్పుడూ దీర్ఘాచ్చుగానే ఉంటుంది. కాని ధాతువు తరవాత అచ్చుతో మొదలయ్యే నిష్పాదక ప్రత్యయం వచ్చినప్పుడు మాత్రం ధాతువులో దీర్ఘాచ్చు హ్రస్వంగా మారుతుంది (కృష్ణమూర్తి 1955, 1961, §§ 1.288-94). ఇటువంటి మార్పు కొన్ని పదసముదాయాల్లో చాలా ద్రావిడభాషల్లో కనపడుతూ ఉండడం వల్ల ఇది మూలద్రావిడ భాషలోనే మొదలై ఉండాలి. అందువల్ల కొన్ని పదసముదాయాల్లో ఒకే భాషలో దీర్ఘాచ్చుగల ధాతురూపమూ (నిష్పాదక ప్రత్యయం లేకుండా), హ్రస్వాచ్చుగల ధాతురూపమూ (అచ్చుతో మొదలయ్యే నిష్పాదక ప్రత్యయంతో) మనకు కనపిస్తూ ఉంటాయి. మిగిలిన భాషల్లో దీర్ఘాచ్చు ఉండి తెలుగులో అచ్చుతో మొదలయ్యే నిష్పాదక ప్రత్యయం లేక పోయినా ధాతువులో హ్రస్వాచ్చు ఉంటే ఈ హ్రస్వానికి కారణమైన అచ్చు నిష్పాదక ప్రత్యయం మొదట ఒక కాలంలో (అంటే ముందు తెలుగులో) ఉండేదనీ అది తెలుగులో తరవాత నశించిందనీ మనం ఊహించాలి. (కింద 5, 6 ఉదాహరణలు చూడండి.)

(1) తె. అఱువది, ఆఱు : త. మ. అఱుపతు, ఆఱు, క. అఱువత్తు, ఆఱు (2051). (ఆఱులో ఉకారం ఉచ్చారణార్థం.)

(2) తె. కొడుకు. కోడలు : త. కుఱంతై 'పిల్ల(వాడు)', కూ. కోడ్డు 'లేతకొమ్మ, మొగ్గ' కు. ఖోర్ 'చిగురు, చిగుర్చు', మా. ఖోరా 'పిల్ల(వాడు)' (1787).

(3) తె. చెఱుగు, చేట : మ. చేఱు; క. కేఱు, కో. ప. కేద్-, కు. మా. కేన్-(1679).

(4) తె. పఱచు, పాఱు : త. మ. పఱ, పఱి, పాఱు, క. పాఱు (3311).

(5) తె. ప్రొద్దు : త. పొఴుతు, పోట్టు, మ. పొఴుతు, పోతు క. పొట్టు, గోం. పోడ్ద్ (3724).

(6) తె. ప్రుంగు : త. మూఴు, మూఴ్కు, ముఴుకు, క. ముఴుంగు, ప. బూడ్-(5096).

**2.12.** తె. ఎ, ఒ < *ఇ, ఉ (అకారం ముందు).

సాధారణంగా తెలుగుపదాల్లో రెండో అచ్చు (అంటే నిష్పాదక ప్రత్యయం మొదటి అచ్చు) అకారమైతే మొదటి అచ్చు స్థానంలో అ, ఎ, ఒ లే గాని ఇ,ఉ లు ఉండవు. కన్నడంలో కూడా ఇంతే. కాని ప్రాచీనతమిళంలోనూ, మలయాళం లోనూ అటువంటి అకారం ముందు అ, ఇ, ఉ లే గాని ఎ, ఒ లు ఉండవు. కాబట్టి కొన్ని సమాన పదాల్లో (cognates) అకారంముందు ధాతువులో తమిళ, మలయాళాల్లో ఇ, ఉ లు ఉండే తెలుగు, కన్నడాల్లో ఎ, ఒ లు ఉంటాయి. ఇటువంటి పదాలు కొన్నింటిలో ప్రాచీనమైన ఎ. ఒ లు తమిళ, మలయాళాల్లో ఇ,ఉ లుగా మారితే మరికొన్నింటిలో ప్రాచీనమైన ఇ, ఉ లు తెలుగు, కన్నడాల్లో ఎ.ఒ లుగా మారేయి. ఇటువంటి పరిస్థితిలో ప్రాచీనమైన అచ్చు ఏదో తెలుసు కోడానికి అకారంతో మొదలయ్యే నిష్పాదక ప్రత్యయం లేకుండా ఉన్న సమాన పదాలు సహాయపడతాయి. ఇటువంటి సమానపదాలు రెండు రకాలుగా ఉండవచ్చు : (1) దీర్ఘాచ్చుగాని, హ్రస్వాచ్చుగాని ఉన్న ధాతువుమాత్రమే ఉన్నవి; (2) ధాతువు తరవాత ఇ, ఉ లతో గాని, హల్లుతోగాని మొదలయ్యే నిష్పాదక ప్రత్యయం ఉన్నవి(*బరో* 1968 : 22). ఇటువంటిచోట్ల మూలద్రావిడంలో

ఇ/ ఎ, ఉ/ఒ లు మూల దక్షిణద్రావిడంలో ఎ, ఒ లుగా మారి అవి తెలుగు, కన్నడాల్లో అలాగే నిలిచి ఉండగా ప్రాచీన తమిళ, మలయాళాల్లో ఇ, ఉ లుగా మారేయని చెప్పడానికి ఆధారాలు ఉన్నాయి (కృష్ణమూర్తి 1958 b.) ఈ కింద ఇచ్చిన ఉదాహరణల్లో మూలద్రావిడంలో ఇ, ఉ లు తెలుగులో ఎ, ఒ లుగా మారేయి.

1. తె. కెలఁకు: త. కిళై, కిళ్ల 'తవ్వు' (1321).
2. తె. కొఱ, కొఱఁత (క. కొఱె) : త. కుఱు, 'పొట్టి', కున్ఱు 'తగ్గు' తె. కుఱు, కుఱుచ, కుందు (1687).
3. తె. తొఱఁగు (క. తొఱె) : కొం. తుఱ్హ్-కూ. తుహ్-(2768).
4. తె. దొరలు . త. చురి, చూర్ 'చుట్టూ తిరుగు', చురుళ్ 'చుట్టు కొను', చురుట్టు 'చుట్ట', తె. చుట్ట (2211).
5. తె. నెఱయు, నెరయు (క. నెఱె) : తె. నిండు, గోం. నింద్-, కొం. నిన్డ్-, కు. నీంద్-, కూ. నింద్-(3049).
6. తె. నెల, నెలవు (క. నెలె) : త. మ. క. నిల్, తె. నిలుచు, నిల్చు, గోం. నిల్- (3048).
7. తె. మొదలు (క. మొదల్) : త. ముతల్ 'మొదలు', ముతిర్ 'ఎక్కువ అగు' (4053).
8. తె. మొన (క. మొనె) . త. మున్, మున్పు, ముంతి 'ముందు', తె. మున్, మునువు, ముందు (4119).
9. తె. మొరయు (క. మొరె, మొరళ్) : ప. ముర్-'అరచు', కు. ముర్ర్-'ఉరుము, భయపెట్టు' మా. ముర్- 'మాట్లాడు' (4076).
10. తె. వెల (క. బెలె) : త. మ. విల్ 'అమ్ము', క. బిల్, బిలి 'అమ్ము', తె. విలుచు, విల్చు, విలువ (4448).

**2.13** వర్ణవ్యత్యయం. కొన్ని మూలద్రావిడధాతువులలో అచ్చూ దాని తరవాత హల్లూ పరస్పరం తెలుగులో స్థానం మార్చుకొంటాయి. అంటే అవి వర్ణ వ్యత్యయం పొందుతాయి (ఈ మార్పుని వర్ణవ్యత్యయమని గుర్తించి దానిని మొట్ట మొదట చర్చించినవారు కృష్ణమూర్తి 1955,237-52: 1961, §§ 1.121-59).

తెలుగులో ఈ వర్ణవ్యత్యయం ధాతువు మొదట హల్లు ఉన్న పదాలలోనూ లేని పదాలలోనూ కూడా కనిపిస్తుంది. ధాతువు మొదట హల్లు లేకపోతే వర్ణవ్యత్యయం పొందే హల్లు * ట (డ), * ఱ, *ళ, * ల, *ర, * ఴ లలో ఒకటి అయి ఉంటుంది / (సర్వనామాల్లో మరికొన్ని హల్లు లున్నప్పటికీ కూడా వర్ణ వ్యత్యయం జరిగింది.). దీనివల్ల పదాదికి వచ్చిన * ట కారం డ కారంగానూ (తరవాత అది ద కారంగానూ), * ళ కారం ల కారంగానూ తెలుగులో మారతాయి. ధాతువు మొదట హల్లు ఉంటే వర్ణవ్యత్యయం పొందే రెండో హల్లు ఴ*,*ఱ, *ర లలో ఒకటిగా ఉంటుంది. ఈ మూడూ వర్ణవ్యత్యయం తరవాత కావ్యభాషలో ఈ స్థానంలో ర గా మారతాయి. ఈ రేఫ వ్యావహారిక భాషలో తరవాత నశించింది. వర్ణవ్యత్యయం జరిగిన పదాల్లో ధాతువు మొదట ఉండే హల్లు క, గ. త, ద, ప, బ, మ, వ, స లలో ఒకటి అయి ఉంటుంది. వర్ణవ్యత్యయం జరిగిన తరవాత ధాత్వచ్చూ, నిష్పాదక ప్రత్యయంలో, మొదట ఉన్న అచ్చూ మధ్య వ్యవధానం లేకుండా ఉంటాయి కాబట్టి వాటిలో ఈ కింద ఇచ్చిన మార్పులు జరుగుతాయి. నిష్పాదక ప్రత్యయంలో మొదటి అచ్చు ఇ కాని, ఉ కాని అయితే అది పోతుంది. అది అకారం అయితే ధాత్వచ్చూ అదీ ఈ విధంగా మారతాయి :

అ + అ ⟶ ఆ

ఎ + అ ⟶ ఏ

ఒ + అ ⟶ ఓ

ఈ సందర్భంలో మూలద్రావిడంలోని ఇ, ఉ లు అకారం ముందు తెలుగులో ఎ, ఒ లు గా మారతాయనే విషయం గుర్తుంచుకోవాలి. ఈ మార్పు జరిగిన తరవాతనే వర్ణవ్యత్యయం జరిగింది.

వర్ణవ్యత్యయం తెలుగులోనే కాక పెంగో, మండ, కూయి, కువిలలో కూడా చాలా ప్రచురంగా కనపడుతుంది. గోండీ, కొండలలో కూడా మొదట్లో అజాదులై కొన్ని పదాల్లో వర్ణవ్యత్యయం జరిగింది. కాబట్టి ఈ మార్పు ఈ భాషలన్నీ ఏక భాషగా ఉన్న కాలంలో జరిగి ఉండాలి. ఇది తెలుగు గోండీ, కొండ, పెంగో, మండ, కూయి, కువి భాషలతో అతి సన్నిహితసంబంధం గలది అని చెప్పడానికి ఒక ప్రబలాధారం. వర్ణవ్యత్యయానికి ఉదాహరణలు :

1. తె. క్రింద, క్రీ- : త. మ. క. కీౙ్ (1848).
2. తె. క్రొవ్వు : త. మ. కొఱు, క. కొర్వు (1784).
3. తె. క్రోఁతి : త. కురంకు, మ. కురఙ్ఙు (1878).
4. తె. గ్రుడ్డి : త. మ. కురుటు, క. కురుడు (1487).
5. తె. గ్రుద్దు : త. కుఱు, కుఱ్ఱు 'దంపు, కొట్టు' (1586).
6. తె. గ్రొచ్చు, క్రొచ్చు (శాస, క్రొచ్చె) : త. కుఴి 'తవ్వు' (1511).
7. తె. డాఁగు, దాఁగు : త. అటంకు, క. అడంగు, కూ. డా- (౮6).
8. తె. డిగు, డిగ్గు, దిగు: త. క. ఇఴి, కూ. డీ- (426).
9. తె. డెబ్బది, డెబ్బయ్ : త. మ. ఎఴు-పతు, క. ఎఴుపత్తు, ఎప్పత్తు (772).
10. తె. ద్రంపి : త. తఴల్ 'మండు, నిప్పు', గోం. తఢ్మీ, (2542).
11. తె. త్రాచు : త. అర, అరా, అరవం, మ. అరవు, గోం. తరాస్, పెం. రాచ్, మం. త్రెహె, కూ. స్రాసు, కువి. రాచు (1949).
12. తె. దున్ను : త. మ. ఉఴు, క. ఉఴు, కొం. డ్యూ.-.కూ. డ్యూ-(592).
13. తె. దుప్పి : త. ఉఱై, కో. డుప్పి, ప. ఉడుప్ (598).
14. తె. ప్రా-, ప్రాఁత: త. మ. క. పఴ, కూ. ప్డాడి, కువి. ప్డా ? ఇ (8296).
15. తె. ప్రేఁగు : ప. ఫిడ్ల్, గ. పుడ్గ్, గోం. పీర్ (3445).
16. తె. ప్రొద్దు : త. పొఴుతు, పోఱ్ఱు క. పొఱ్ఱు (3724).
17. తె. ప్రొయ్యి : త. మ. పొరి 'వేగు, ఎండు', కూ. ప్రొఁద్ - 'మండు' (3705)
18. తె. ప్రోలు (శాస. ప్రోల్) క. పొఴల్ 'ఊరు'. (3721)
19. తె. బ్రదుకు, బ్రతుకు : త. వాఴు, క. బాఴు, బఴ్ దుంకు. (4402)
20. తె. మ్రాను, మ్రాఁకు : త. మ. మరమ్, గోం. మరా, మార్, కూ. మ్రహ్ను, కువి మ్డాను (8856)

21. తె. మ్రోఁగు : త. ముఱంకు, మ.ముఱజ్ఞు, క. మొఱగు (4092)
22. తె. రాలు : కో. నా. రాల్–, గోం. కొం. అర్– (197).
23. తె. రేయి, రే- : త. మ. ఇర, ఇరా, క. ఇరుళ్ (2102).
24. తె. రోలు : త. మ. ఉరల్, క. ఒరల్ (560).
25. తె. ఱెక్క : త. చిఱై, చిఱకు, ఇఱై, ఇఱక్కై, క. ఎఱకె, కొం. ఱెక (2133).
26. తె. ఱేఁడు : త. ఇఱై, మ. ఇఱాన్, క. ఎఱె (448).
27. తె. లే-, లేఁత : త. ఇళ, ఇళం, ఇళై, మ. ఇళ, క. ఎళ. ఎళె, గోం. రైయోలీ/లెయొర్ 'యువకుడు' (486).
28. తె. లొంగు, లోఁగు, లో, లోపల : త. ఉళ్. 'లోపలి', ఉళ్, ఒళ్ 'లోపల', గోం. రోన్/లోన్ 'ఇల్లు' (600).
29. తె. వ్రాయు : త. వరై, క. బరె, బరి, కూయి ప్రీస్- (4304)
30. తె. వ్రేలు : త. విరల్, మ. విరల్, క. బెరల్, కో. నా. వెండె (4433)
31 తె. స్రుక్కు : త. సురుంకు 'ముడుచుకొను, తగ్గు', సురుక్కు 'తగ్గించు'. క. సుర్కు 'ముడుచుకొను, తగ్గు, ప. చుర్క్– (2213).

2.14. (i) తె. క-<* క-(ఇ ఈ ఎ ఏ లు కాక మిగిలిన అచ్చుల ముందు)

తె. కట్టు : త. క. కట్టు (961).
తె. కాయ : త. మ. క. కాయ్, గోం. కాయా (1220).
తె. కుప్ప : త. కుప్పై, మ. కుప్ప, క. కుప్పె (1440)
తె. కూడు 'అన్నం' : త. మ. క. కూఱు (1592).
తె. కొడుకు : త. కుఱంతై 'పిల్ల, పిల్లవాడు', క. కొఱసు 'చిన్న క్రూరజంతువు' (1787).
తె. కోల : త. మ. క. కోల్ (1862).

(ii) తె. -క-/-క్క- <* -క్క-

(తెలుగులో ద్విత్వాక్షరాలు సాధారణంగా పదాదినున్న హ్రస్వాచ్చు తరవాతనే ఉంటాయి; మిగిలినచోట్ల మూల భాషలో ఉన్న ద్విత్వాక్షరాలలో ద్విత్వం నశిస్తుంది.)

తె. అక్క : త. అక్కా, మ. క. తు. అక్క (24).

తె. ఉక్కు : త. మ. ఉరుక్కు, క. ఉర్కు, ఉక్కు (569).

తె. కాకి : త. కాక్కై, మ. కాక్క, క. కాకె, కాకి (1197).

తె. పితుకు, పిదుకు : త. మ. పితుక్కు, క. హిదుకు (3426).

తె. ముక్కు : త. మ. మూక్కు, క. మూగు, తు. మూకు (4122).

**2.15.** (i) తె. చ- <* క -(ఇఈ ఎఏల ముందు)

మూలద్రావిడంలో ఇ ఈ ఎ ఏల ముందు ఉండే పదాది కకారం తెలుగులో చకారంగా మారుతుంది. దీన్ని తాలవ్యీకరణం (Palatalization) అంటారు. తెలుగు పదాల్లో మూ. ద్రా. *అయ్ నించి వచ్చిన ఏకారానికి ముందు ఉన్న కకారం కూడా తాలవ్యీకరణాన్ని పొందుతుంది. (కింద 10, 12 చూడండి).

1. తె. చిఱు, చిఱుత: త. మ. చిఱు, చిఱ్ఱు, కోత కిర్, క. కిఱు, తు. కిరి, కిరు (1326).
2. తె. చిలుక : త. మ. కిళి. క. తు. గిళి, గిణి, ప. కిల్ (1318).
3. తె. చీము : త. మ. చీ, చీఱు, క. తు. కీవు (1337).
4. తె. చీలు : త. కీళ్, కీల్, క. గీళు (1351).
5. తె. చెడు : త. మ. కెటు, క. కెడు, కిడు (1614)
6. తె. చెదరు, చిందు : త. చితర్, చింతు, మ. చింతు, క. కెదఱు (1294).
7. తె. చెఱువు : త. చిఱై, మ. చిఱ, కోత కెర్, క. కెఱె (1648).
8. తె. చెవి, చెవుడు : త. మ. చెవి, చెవిటు, క. కివి, కివుడు, కో. నా. కెవ్ (1645).

9. తె. చేను : త. చెయ్, మ. చెయి, క. కెయ్, కో. ప. కేన్ (1629).

10. తె. చేదు : త. మ. కయ, కచ 'చేదుగా ఉండు', క. కయ్, కయ్పు 'చేదు' (1047).

11. తె. చేయు : త. మ. చెయ్, క. కెయ్, గెయ్, గోం. కీ-(1628).

12. తె. చేయి : త. మ. కై, క. కయ్, ప. కెయ్, గోం. కయ్ (1688).

తెలుగులో కిట్టు, కినియు, కెడయు, కెంపు, కెలయు మొదలైన కొన్ని పదాల్లో తాలవ్యాచ్చు ముందున్న కకారం చకారంగా మారలేదు. కాబట్టి ఇటువంటి పదాలు తెలుగులో తాలవ్యీకరణం జరిగి ఆగిపోయిన తరవాత కన్నడం నించి ఎరువు తెచ్చుకున్నవి అయి ఉండాలి.

పై ఉదాహరణలవల్ల తెలుగులోలాగే తమిళ, మలయాళాల్లో కూడా తాలవ్యీకరణం జరిగిందని తెలుస్తుంది. కాని తమిళ, మలయాళాల్లో తాలవ్యాచ్చు తరవాత మూర్ధన్యాక్షరం ఉంటే తాలవ్యీకరణం జరగదు. తెలుగులో ఇటువంటి నిబంధన లేకపోవడమే కాకుండా దానిలో *అయ్ నించి వచ్చిన ఏకారం ముందు కూడా తాలవ్యీకరణం జరుగుతుంది. ఈ రెండు భేదాలవల్లా తెలుగులో తాలవ్యీకరణం, తమిళ, మలయాళాల్లో తాలవ్యీకరణం వేరువేరుగా జరిగినవే కాని యీ మూడు భాషలూ ఒక భాషగా ఉన్నకాలంలో జరిగినవికావు అని *బరో* (1968 : 45) చెప్పేరు.

(ii) తె. చ- < * చ-

తె. చను : త. మ. చెల్, క. సల్, ప. చెన్, కూ. సల్ (2286).

తె. చావు : త. మ. చావు, క. సావు (2002).

తె. చిక్కు : త. మ. చిక్కు, క. సిక్కు, క. సిల్కు, సిర్కు (2060).

తె. చుక్క. త. చుక్కై, క. చుక్కె, గోం. సుక్కుం (2175).

తె. చూలు : త. మ. క. చూల్ (2255).

తె. చేరు : త. మ. చేర్, క. సేర్ (2312).

(iii) మూలద్రావిడ పదాది చకారం పై పదాలవంటి వాటిలో తెలుగులో నిలిచి ఉన్న మరికొన్ని పదాల్లో అది లోదిదాపకపిందించి. చకార లోపం తెలుగులోనేకాక అన్ని దక్షిణ ద్రావిడభాషల్లోనూ కొన్ని కొన్ని పదాల్లో ఏర్పడింది. కాని పదాది చకారం లోపించడానికీ, లోపించకుండా ఉండడానికీ కారణం ఏమీ కనపడదు. తెలుగు తప్ప మిగిలిన మధ్యద్రావిడభాషల్లోనూ ఉత్తర ద్రావిడ భాషల్లోనూ పదాది చకారం లోపించదు కాబట్టి ఈ భాషలు మూలభాషలో పదాది చకారం ఉండేదని నిర్ణయించడానికి ఉపయోగిస్తాయి. తెలుగులో కొన్ని మాటల్లో పదాది చకారం ఉన్నరూపం, లేనిరూపం కూడా ఉన్నాయి.

1. తె. అందము, చందము: త. మ. అంతం, చంతం, క. తు. అంద, చంద (1921).
2. తె. అల్లుఁడు : క. తు. అళియ, ప. చల్‌ఞీద్, కో.నా. సాంజిన్, గోం. సడే (256, 1970).
3. తె. ఆఱు : త. మ. క. ఆఱు, గోం. సారూంగ్, కూ. సజ్‌గి (2051).
4. తె. ఇచ్చు : త. క. ఈ, ప. చీ-, కో.నా. గోం. కూ. సీ-, కు. చి ?-. మా. చియ్- (2138).
5. తె. ఉప్పు : త. మ. క. తు. ఉప్పు, కో. నా. గ. సుప్, ప. చుప్ (2201).
6. తె. ఏరు : త. మ. కోత, తొద ఏర్, క. ఏరు, గోం. సేర్, కూ. సేరు (2318).
7. తె. ఐదు, ఏను : త. ఐంతు, మ. అంచు, క. అయిదు, ప. చేఁదు (క్), గోం. సైయూంగ్, కూ. సింగి (2818).

(iv) తె. -చ-/-చ్చ- < * -చ్చ-

తె. ఎఱచి : త. ఇఱైచ్చి, మ. ఇఱ్ఱచ్చి, కొద. ఎరచి (450).
తె. నచ్చు : త. నచ్చు, క. నచ్చు, నర్చు (2951).
తె. పచ్చ : త. పచ్చై, మ. పచ్చ, క. పచ్చ, పచ్చె (3161).
తె. మెచ్చు : త. మెచ్చు, క. మచ్చు, మెచ్చు, మర్చు (3865).

**2.16.** (i) పదాది టకారం తెలుగులో టెంకాయ (త. తేంకాయ్ 2806)- టేఁకు (త. మ. తేక్కు, 2842), టెక్కియము మొదలైన చాలా కొద్దిమాటల్లోనే ఉంది. పై మాటల్లో మొదటి రెండింటిలోనూ ఈ టకారం తకారం నించి వచ్చినట్లు స్పష్టం.

(ii) తె. -ట-/-ట్ట- <* ట్ట

తె. ఆట : త. మ. ఆట్టం, క. ఆట, ఆటు (290).

తె. తిట్టు : త. క. తిట్టు (2632).

తె. పాట : త. మ. పాట్టు, క. పాట (3348).

(iii) -ట-/-ట్ట-<*-ఱ్ఱ-

తె. చాటు (క్రియ) : త మ. చాఱ్ఱు, క. సాఱు (2052).

తె. చుట్టము : త. మ. చుఱ్ఱం (2288).

తె. పుట్ట : త. మ. పుఱ్ఱు, క. పుత్తు, పుత్త, గోం. పుత్రీ, కొం. పుర్జీ, కు. పుత్రా, మా. పుతె (3556).

తె. మాట : త. మ. మాఱ్ఱం, క. మాతు, మాత (3960).

**2.17.** (i) తె. త- <* త-

తె. తప్పు : త. మ. క. తప్పు (2498).

తె. తల : త. తలై, మ. తల, క. తలె, తల, కూ. త్లడు (2529).

తె. తిను : త. మ. క. తు. గోం. కూ. కో. ప. తిన్ (2670).

తె. తేనె ; త. మ. తేన్, క. తేను, కో. నా. తేనె (2574).

తెలుగు త్రాడు (త. మ. చరటు 1947), త్రాచు (త. అర, అరా, కూ. స్రాసు, (1949), దురద (త. మ. చొఱి, క. తుఱి, (2848) మొదలైన కొద్దిమాటల్లో మూలద్రావిడంలో పదాది చకారం తెలుగులో త/దలుగా మారుతుంది. (ఎవో 1968 : 167).

(ii) తె. -త-/-త్త-<*-త్త-

తె. అత్త: త. అత్తై, క. అత్తె, అత్తి, గోం. అఠీ (121).

తె. తాత : త. తాత్తా. క. తాత, తు, తాతె (2580).

తె. సుత్తె : త. మ. చుత్తి, క. సుత్తిగె, తు. సుత్తి (2197)

**2.18.** (i) తె. ప- < *ప-

తె. పని : త. మ. కొ. పణి (3209).

తె. పాడు : త. మ. పాటు. క. పొడు, కో. ప. పాడ్-, గోం. పార్- (3348).

తె. పేరు : త. మ. పెయర్, పేర్ల్, క. పెసర్, కో. నా. పేర్, ప. పిడిర్-(3612).

(ii) తె -ప- /-ప్ప-<*-ప్ప-

తె. చెప్పు (నా.) : త. చెరుప్పు, మ. చెరిప్పు, క. కెర్పు, కో.నా. కెర్రి, గోం. సెర్పాం (1633).

తె. తోపు : త. మ. తోప్పు, క. తు. తోపు (2929).

తె. త్రిప్పు : త. తిరుప్పు, మ. తిరిప్పు, క. తిరుపు (2655),

తె. వేప (చెట్టు) : త. వేప్ప (4551).

**2.19.** తెలుగులో నాదస్పర్శాలైన గ, జ, డ, ద, బ లు కూడా పదాదిని ఉంటాయి. తమిళం, మలయాళం తప్ప మిగిలిన అన్ని ద్రావిడ భాషల్లోనూ కూడా ఇవి పదాదిని ఉన్నా ఇవి మూలద్రావిడభాషలో ఉండేవి కావని పండితుల అభిప్రాయం. తమిళ, మలయాళాల్లో ఇవి లేకపోవడంవల్లా, ఇవి ఉండే భాషల్లో కూడా ఒకపదంలో కొన్ని భాషలో నాదస్పర్శముంటే మరికొన్నిటిలో శ్వాసస్పర్శం ఉండి దీనికేమీ నియమం లేకపోవడంవల్లా మూలద్రావిడంలో శ్వాసస్పర్శాలు కొన్ని కొన్ని భాషల్లో కొన్ని పదాల్లో తరవాతకాలంలో నాదాలుగా మారడంవల్ల ఇవి ఏర్పడ్డాయని కాల్డ్‌వెల్ చేసిన సిద్ధాంతాన్ని *ఎరో* (Dravidian studies I 1968 : 1-17) సోపపత్తికంగా నిరూపించేరు. అద్విరుక్తంగా ఉండే స్పర్శాలు అచ్చులమధ్య, అనునాసికం తరవాత అన్ని ద్రావిడబాషల్లోనూ నాదాలుగానే ఉంటాయి కాని శ్వాసాలుగా ఉండవు (తెలుగులో ఈ స్థానాల్లో ఉండే శ్వాస స్పర్శాలు మొదట్లో ద్విరుక్తాలని గమనించాలి). కాబట్టి అచ్చుల మధ్యా, అను నాసికం తరవాతా వచ్చే అద్విరుక్తస్పర్శాలు మూలభాషలోనే నాదాలుగా మారి

ఉంటాయనీ, వాటి ప్రభావంవల్లా, నాదాలైన స్పర్శేతహల్లుల ప్రభావంవల్లా పదాది శ్వాస స్పర్శాలు కొన్ని కొన్ని పదాల్లో తమిళం, మలయాళం తప్ప మిగిలిన ద్రావిడభాషల్లో నాదాలుగా మారి ఉంటాయనీ కృష్ణమూర్తి (1961, §§ 1. 55-78) నిర్ణయించారు.

**2.20.** (i) తె. గ- < * క-

తె. గిల్లు : త. మ కిళ్ళు, క. గిండు, తు. కిబ్బు (1822).

తె. గీఱు : త. మ. కీఱు, తు. కీరు (1358)

తె. గూడు : త. మ. కూటు, క. తు. గూడు, ప. గూడు, గోం. గూడా (1563).

(ii) తె. -గ- < * -క -

తె. పగలు : త. మ. పకల్, క. పగల్, తు. పగెలు, గోం. పియ్యాల్ (3151).

తె. పొగడు : త. మ. పుకళ్, క. పొగళ్ (3478).

(iii) తె. -ంగ- < * - ంక -

తె. కలఁగు : త. కలంకు, మ. కలఙ్ఙు-, కొ. కలంగ్-(1906).

తె. పొంగు : త. పొంకు, మ. పొఙ్ఙు, క. పొంగు (3658).

(iv) తె. -గ్గ- < *-ఴు-గ, * -ఴ్ -గ-

తె. తగ్గు : త. మ. తాఴ్, క. తఴ్ గు, తర్గు, తగ్గు (2597).

తె. నగ్గు : త. మ. నూఴు, నుఴుక్కు-, క. నుఴుగు, నుర్గు, నుగ్గు (3089).

**2.21.** (i) తె. జ-< * చ-

తె. జారు : త. మ. చాఴు, క జాఱు (2048).

తె. జొన్న : త. మ. చోళం, క. తు. జోళ (2359).

(ii) తె. -ంజ- < * - ంచ -

తె. అంజు 'భయపడు' : త. మ. అంచు, క. తు. అంజు (51).

**2.22.** (i) తె. డ- < * -ట-, *-ఱ-

మూలభాషలో మూర్ధన్యాక్షరాలు పదాదిని ఉండవు. తెలుగులో పదాది డకారం మొదట అచ్చులమధ్యనేఉండి తరవాత వర్ణవ్యత్యయంవల్ల పదాదికి వచ్చినదై ఉంటుంది (చూ. 2. 13). ఈ స్థానంలో ఇది * టనించిగాని, * ఱ నించిగాని వస్తుంది. పదాది డకారం తెలుగు సాహిత్యంలోనే తరవాత కాలంలో ద గా మారుతుంది.

తె. డాఁగు, దాఁగు : త. అటంకు, క. అడంగు, కూ. డా- (56).

తె. డెబ్బది. డెబ్బయ్ : త, మ. ఎఴు-పతు, క. ఏటĭ-పత్తు, ఎప్పత్తు (772).

(ii) తె. -డ- < * -ట-

తె. ఆడు : త. మ. ఆటు, క. తు. ఆడు (290).

తె. పడు : త. మ. పటు, క. పడు (3190).

(iii) తె. -డ- > * -ఱ-

తే. ఏడు : త. మ. క. ఏఴు (772).

తె. కోడి : త. మ. క. కోఴి (1862).

తె. సుడి : త. మ. మఱి, క. సుఱి (2223).

ఱ కారం తెలుగు శాసనాల్లో ప్రత్యేక వర్ణంగా తొమ్మిదో శతాబ్దం మధ్యభాగం దాకా ఉంది. ఆ తరవాత అది అచ్చులమధ్యా, వర్ణవ్యత్యయంవల్ల పదాదికి వచ్చినప్పుడూ డకారంగా మారింది (పదాది డకారం తరవాత ద కారంగా మారింది). వర్ణవ్యత్యయంవల్ల పదాది హల్లుకి తరవాత వచ్చినప్పుడు అది రేఫగా మారింది (కృష్ణమూర్తి 1958 a.)

(iv) తె. -ండ- < * -ణ్ణ-, * -ం-ట-.

తె. ఎండ : త. ఎణ్ణు, గోం. ఎద్ది (738).

తె. మూఁడు : త. మూణ్ణు, మ. మూన్ను, క. మూఱు (4147).

తె. బండి : త. పంటి, వండి, మ. వండి, క. తు. బండి(3219).

(v) తె. -డ్డ- < *- ట్ట

తె. చెడ్డ : త. మ. క. తు. కెట్ట (1614).

తె. పడ్డ 'పడిన' : త. మ. క. పట్ట (3190).

**2.23.** (1) తె. ద- < * త -

తె. దిద్దు : త. మ. తిరుత్తు, క. తిర్దు, తిద్దు (2659).

తె. తొండ : త. తొంచ్చై, మ. తొంటి, క. తొండె, దొండె (2880)

తెలుగు దాఁగు, దాఁచు, దిగు, దున్ను, దుప్పిలలో పదాది దకారం డ కారం (< * ట, * ఱ) నించి వచ్చినది(చూ. 2.22). దురద (త. చొఱి, 2343), దొరలు (త. చురుళ్, 2211)లలో పదాది దకారం చకారం నించివచ్చినది (చూ. 2.17).

(ii) తె. - ద - < * - త -

తె. అది : త. మ. అతు, క. అదు, అతు (1).

తె. చెదరు : త. చితర్, చితై, క. కెదఱు (1294).

(iii) తె. -ంద- < * -ంత-, * - న్ట -

తె. పంది : త. పన్టి, మ. పన్ని, క. తు. పంది, కొం. పన్టి (3326).

తె. మందు : త. మరుంతు, మ. మరున్ను, క. మర్దు, మద్దు (3868)

తె. విందు :త. విరుంతు, మ. విరున్ను, క. బిర్దు, బిద్దు (4442)

(iv) తె. -ద్ద- < * -ర్ద-, * - ట్ద -

తె. అద్దు : త. మ. అఱుత్తు, క. అట్దు, (244).

తె. ఎద్దు : త. మ. ఎరుతు, క. ఎత్తు, ఎద్దు (698).

దిద్దు : త. మ. తిరుత్తు, క. తిర్దు, తిద్దు (2699).

**2.24.** (i) తె. బ - < * వ -, * ప -

తె. బీర : త. మ. పీర్, పీరం, క. హీరె, హీరి (3467).

తె. బెల్లము : త. మ. వెల్లం, క. తు. బెల్ల (4523).

తె. బొమ్మ : త, పొమ్మై, మ. బొమ్మ, క. బొంబె (3701).
తె. బ్రతుకు : త. మ. వాఴ్, క. బాఴ్, బఴ్ దుంకు (4402)

(i) తె. -ంబ- < * - ంప-
తె. చెంబు : త. మ. చెంపు, క. తు. చెంబు (2282).

(ii) తె. -బ్బ- < * - ప్ప-, *-ర్ ప్ప -
తె. ఉబ్బు : త. ఉప్పు, క. ఉర్వు, ఉర్బు, ఉబ్బు (573 (a) ).
తె. మ్రబ్బు, మబ్బు : త. మప్పు, క. మర్వు, మర్బు, మబ్బు (3848).

**2.25.** (i) తె. న -< * ఞ -
తె. నరము : త. నరంపు, మ. ఞరంపు, క. నర, నరవు (2364)
తె. నాఁగలి : త. ఞాంచిల్, నాంచిల్, మ. ఞేఞ్ఞోల్, క. నేగల్, గోం. నాంగేల్ (2368).
తె. నాఱు : త. మ. ఞాఱు, కూ. నేడ (2380).
తె. నేల : త. మ. ఞాలం, గోం. నేలీ (2374).
తె. నిప్పు : త. నెరుప్పు, మ. ఞెరుప్పు, మ. నిర్–'మండు' (2389).

(ii) తె. వ- > *న -
తె. నక్క : త. మ. క. తు. నరి (2981).
తె. నేయి, నెయ్యి : త, మ. క. తు. కో. ప. నేయ్ (3104).
తె. తిను : త. మ. క. తు. గోం. కో. ప. కూ. తిన్ - (2670).

(iii) తె. -న- < * - ణ -
తె. అన్న : త. అణ్ణా, అణ్ణన్, మ. అణ్ణన్, క. అణ్ణ, తు. అణ్ణె (112)
తె. కన్ను : త. మ. కోత కణ్, తు. కణ్ణు, గ. కొం. కణ్, గోం. కఢ్ (973).
తె. పని : త. మ. కొ. కొం. పణి (3209).

తెలుగు ఈఁదు (త. నీంతు. 3304), ఈవు (త. నీ, క. నీను, 5051). ఈరు (త. నీరు, 3055) మొదలైన కొద్ది మాటల్లో పదాది నకారం లోపిస్తుంది. ఈ మార్పు మిగిలిన భాషల్లో కూడా అక్కడక్కడ కనిపిస్తుంది.

**2.26.** (i) తె. మ < * మ

తె. మన్ను : త. మ. క. మణ్ (3817).

తె. మేయు : త. మ. క. తు. గోం. ప. మేయ్ (4179).

(ii) తె. మ < * మ, * - ంబ -

తె. ఇనుము : త. మ. ఇరుంపు (411).

తె. ఎడము : త. మ. ఇటం, క. ఎడ (368).

తె. కొమ్ము, కొమ్మ : త. మ. కొంపు, క. తు. కొంబు (1759).

తె. నమ్ము : త. మ. నంపు, క. నంబు (2975).

తె. పాము : త. మ. పాంపు, క. పావు, తు. హావు (3361),

**2.27.** తె. య < * య

తె. కోయు : త. మ. క. కొ. కొండ, ప. కొయ్-, (1763).

తె. మేయు : త. మ. క. తు. గోం. ప. మేయ్- (4179).

తెలుగులో పదాదిన యకారం ఉండదు.

**2 28.** (i) తె. ర < * ర

తె. రెండు : త. ఇరంటు, మ. రంటు, క ఎరడు, ప. ఇర్డు (401)

తె. పేరు : త. మ. పెయర్. పేర్, క. పెసర్, కో. నా. పేర్ (3612).

తె. వేరు : త. మ. కోత. వేర్, క. బేర్, కో.నా. వేర్ (4554).

తెలుగులో పదాది రేఫం ఎప్పుడూ వర్ణవ్యత్యయంవల్ల పదాదికి వచ్చినదై ఉంటుంది.

(ii) తె. ర < * ఱ

ఈ మార్పు వర్ణవ్యత్యయంవల్ల ఱ కారం పదాదిహల్లుకి తరవాత వచ్చినపుడే జరుగుతుంది (చూ. 2.13).

తె. క్రింద, క్రీ-: త. మ. క. కీఴ్ (1348).

తె. ప్రొద్దు : త. పొఴుతు, పోఴ్తు, క. పొఴ్తు (3724).

**2.29.** తె. ఱ < * ఱ

తె. తెఱచు : త. తిఱ, మ. తుఱ, క. తెఱ (2678).

తె. నూఱు : త. మ. క. నూఱు, గోం. నూర్ (3090).

తె. ఱెక్క-, ఎఱక : త. చిఱై, చిఱకు, ఇఱై, ఇఱకు, క. ఎఱకె (2138).

తెలుగులో పదాది ఱకారం ఎప్పుడూ వర్ణవ్యత్యయం వల్ల పదాదికి వచ్చినదై ఉంటుంది. వ్యావహారికభాషలో ఱకారం రేఫతో కలిసి పోతుంది.

**2.30.** (i) తె. ల < * ల

తె. తల : త. తలై, మ. తల. క. తలె, కో. నా. తల్, గోం. తల్లా (2529).

తె. నెల : త. మ. నిలవు, నిలా, ప. నెలిఙ్, గోం. నెల్లేంఙ్ (3113).

తే. లే-, లేదు : త. ఇల్, మ. క. ఇల్ల, ప. చిల్, గోం. సిల్, కూయి సిడ్ - (2106).

(ii) తె. ల < * ళ

తె. ఉల్లము, లో, లోపల : త. మ. ఉళ్, ఉళ్ళం, క. ఉళ్, ఒళ్, గోం. రోన్ (600).

తె. ఉలి : త. మ. క. ఉళి (601).

తె. పల్లము : త. మ. పళ్ళం, క. తు. పళ్ల (3307).

తెలుగులో పదాది లకారం ఎప్పుడూ వర్ణవ్యత్యయం వల్ల పదాదికి వచ్చినదై ఉంటుంది.

**2.31.** తె. వ < * వ

తె. వల : త. వలై, మ. వల. క. బలె (4326).

తె. వెన్న : త. వెణ్ణెయ్, మ. వెణ్ణ, కోత. వెణ్, క. బెణ్ణె (4511)

తె. చెవి, చెవుడు : త. మ. చెవి, చెవిటు, క. కివి, కివుడు, కో. నా. కెవ్ (1645).

పదమధ్యంలో మూలభాషలో అసంయుక్తమైన మూల *కకారం తెలుగులో కొన్ని పదాల్లో వైకల్పికంగా వకార మవుతుంది (బా. వ్యా. అచ్చిక. 27): తె. పగలు/పవలు (త. మ. పకల్, 3151), తె. నగు, నవ్వు (త. మ. నకు, క. నగు, 2944). మఱికొన్ని పదాల్లో మూల *వ కారం గకారంగా మారడం కూడా ఉంది : తె. మూవురు/ముగ్గురు (త. మ. మూవర్, 4147), నలువురు / నలుగురు (త. మ. నాల్వర్, 3024)

**2.32.** తె. స < *చ

తె. సుడి : త. మ. చుటి, క. సుటి, తు. సుళి (2223).

తె. సొలు, చొలు : త. మ. చుఱా, క. చొలు (2234).

**2.33.** హత్తు (త. మ. పఱ్ఱు, క. పత్తు, హత్తు, 3320), హెచ్చు (క. పెర్చు. పెచ్చు, హెచ్చు, 3613)- వీటిలో కన్నడంలోలాగా * పకారం హకారంగా మారింది కాబట్టి ఇవి కన్నడంనించి ఎరువు తెచ్చుకున్నవి అయి ఉండాలి. తెలుగు దేశ్యపదాలల్లో హకారం వీటిల్లో తప్ప ఇంకెక్కడా లేదు.

## నా మ వా చ కా లు

**2.34.** **లింగభేదం.** తెలుగులో లింగభేదం ఏకవచనంలో మహత్తు (వాఁడు) : అమహత్తు (అది), బహువచనంలో మనుష్యవాచకాలు (వారు) : అమనుష్యవాచకాలు (అవి)--ఇలా ఉంటుంది. తెలుగుతో దగ్గిర సంబంధం లేని కూడుఖ్-మాల్తో భాషలలో కూడా ఇటువంటి లింగభేదమే ఉండటంవల్లా, దక్షిణ ద్రావిడభాషలలో స్త్రీ వాచక ప్రత్యయమైన-అళ్ మొదట్లో ప్రత్యేకశబ్దమైనందు వల్లా (కృష్ణమూర్తి 1961, § 4.32) తెలుగు, కురఖ్-మాల్తోలలో ఉన్న లింగ భేదమే మూలద్రావిడంలో ఉండేదని పండితుల అభిప్రాయం (ఎమెనో 1955, § 10.17). కాబట్టి ఈ విషయంలో తెలుగు మూలద్రావిడంలో స్థితిని యథా తథంగా నిలుపుకుంది అని చెప్పాలి. మిగిలిన మధ్యద్రావిడభాషలలో బహు వచనంలో కూడా ఏకవచనంలో లాగా మహదమహద్భేదమే ఉంది. ఇది ఆ భాష లలో అర్వాచీనపరిణామం కావచ్చు. ఈ సందర్భంలో అమె/అవిడ అనే స్త్రీ వాచక పదాలు అర్వాచీనాలని గమనించాలి.

**2.35. బహువచనప్రత్యయాలు.** ప్రాచీనాంధ్రంలో కొన్ని మహన్మహతీ వాచకాలలో రు (లు) బహువచన ప్రత్యయంగా ఉంది (బా. వ్యా. ఆచ్చిక. 6-7, 10-11), ఉదా : పగతురు, అల్లురు, విలుకాండ్రు/విలుకాలు, కోడండ్రు, మీరు, వారు, అందఱు, కొందఱు ఎవ్వరు. ఇది ఇప్పటి వ్యావహారికభాషలో సర్వనామాల్లోనూ, ఇద్దరు, ముగ్గురు మొదలైన సంఖ్యావాచకాల్లోనూ మాత్రమే మిగిలి ఉంది. ఇది మూ. ద్రా. లో మనుష్య వాచక శబ్దాలలో బహువచన ప్రత్యయమైన *-(అ)ర్ నించి వచ్చినది. మిగిలిన అన్ని నామవాచకాలలోనూ బహువచన ప్రత్యయం 'లు' (ప్రాచీనశాసనాలలో 'సంవత్సరంబుళ్' మొదలైన పదాలవల్ల ఇది మొదట్లో మూర్ధన్య ళ కారమని తెలుస్తుంది.) తుళులోనూ, కోలామీ, నాయకీ, పర్జీ, గదబలలోనూ *కళ్, *ళ్ అనే రెండు ప్రత్యయాల నించి వచ్చిన ప్రత్యయాలు ఉండడంవల్ల మూ. ద్రా. లో కొన్నింటిలో *కళ్, మరికొన్నింటిలో *ళ్ ఉండేవని మనం చెప్పవచ్చు. తెలుగులో కూడా ఏనుఁగు-లు (త. యానై-కళ్), మ్రాఁకులు (త. మరం-కళ్). చిలుక-లు (త. కిళి-కళ్), ఎలుక-లు (త. ఎలి-కళ్) మొదలైన పదాల్లో బహువచన ప్రత్యయం 'లు' గానే కనిపిస్తున్నప్పటికీ వీటిని తమిళంలో సమానరూపాలతో పోల్చి చూస్తే వీటితో మొదట్లో బహువచనప్రత్యయం 'కళ్' ఏనని తెలుస్తుంది. లు బహువచన ప్రత్యయంగా భాషలో ప్రచురం కావడంవల్ల వీటిలో కూడా 'లు' ఏ బహువచన ప్రత్యయమని భ్రమించి దీని ముందున్న క, గ లు ప్రాతిపదికతో చేర్చఁబడడమనే అనుచిత విభాగం జరిగి ఉంటుందని కాల్డ్‌వెల్ (1956 : 245) చెప్పేరు.

తెలుగులోనూ మిగిలిన మధ్యద్రావిడభాషలలోనూ బహువచనప్రత్యయం నిత్యమైనది. అంటే బహుత్వాన్ని ఉద్దేశించినప్పుడు బహువచనప్రత్యయాన్ని తప్పకుండా వాడాలి. కాని దక్షిణద్రావిడ భాషల్లోనూ, ఉత్తర ద్రావిడభాషల్లోనూ అలా కాదు. "రెండు చెట్లు" అనడానికి తమిళంలో "ఇరంటు మరం", కన్నడంలో "ఎరడు మర" అని బహువచన ప్రత్యయం (త. కళ్, క. గళు) లేకుండానే అనవచ్చు. కూడుఖ్, మాల్తోలలో అసలు బహువచనప్రత్యయమనేదే లేదు. బ్రాహుయీలో - క్ (- అక్) అనే బహువచనప్రత్యయం ఉన్నా దీనిని సందేహం కలిగేచోట్లతప్ప మిగతాచోట్ల వాడరు. కాబట్టి దక్షిణ ద్రావిడభాషల్లోనూ, ఉత్తరద్రావిడభాషల్లోనూ బహువచనప్రత్యయం వైకల్పికం. అందుచేత మూ. ద్రా. లో వైకల్పికమైన బహువచనప్రత్యయం తెలుగులోనూ మిగిలిన

మధ్య ద్రావిడభాషలలోనూ నిత్యమైనదిగా మారిందని చెప్పవచ్చు. ఈ మార్పు తెలుగు మధ్యద్రావిడోపకుటుంబానికి చెందినదని నిర్ణయించడానికి ఒక ప్రబల హేతువు (చూ. సుబ్రహ్మణ్యం 1969 b).

**2.36. ఔపవిభక్తికాలు.** తెలుగులో -ఇ-, -టి-, -తి- ఈ మూడూ ఔప విభక్తిక ప్రత్యయాలు (బా. వ్యా. ఆచ్ఛిక., 28-38). -ఇ మూ. ద్రా * ఇన్ నించి వచ్చినది : ఊరికి (త. ఊరి-ఉక్కు < ఊర్ - ఇన్ - కు), కాలికి (త. కాలిఉక్కు < కాల్-ఇన్-కు). -టి లో టకారం కొన్ని మాటల్లో మూ. ద్రా. *ట్టినించీ : ఏఱు. ఏటికి (త. యాఱు, యాట్టిఉక్కు), నూఱు, నూటికి (త. నూఱు, నూట్టిఉక్కు), మరికొన్ని మాటల్లో * ట్ట నించీ : కాడు, కాటికి (త. కాటు. కాట్టిఉక్కు), నాడు, నాటన్ (త. నాటు, నాట్టిల్) వచ్చినది (చూ. § 2 16).-తి దక్షిణద్రావిడభాషల్లో మకారాంత పదాలల్లో ఉండే -త్త్- ప్రత్యయానికీ (త. మరం 'చెట్టు' : మర-త్త్-), గోండీలో - త్, -ద్-లకీ, తె. చే-తి(-లో) : గోం. కయ్-దే (సుబ్రహ్మణ్యం 1968, § § 3, 7, 7.3.7) సంబంధించినది.

**2.37. ద్వితీయాదివిభక్తి ప్రత్యయాలు** తెలుగులో ద్వితీయా విభక్తి ప్రత్యయం-ను(-ని) మూ ద్రా. * న్ నించి వచ్చింది. దీని సమానరూపాలు తమిళ" మలయాళాలు తప్ప మిగిలిన అన్ని భాషల్లోనూ ఉన్నాయి. అల్లాగే తెలుగులో షష్ఠీ (చతుర్థీ) విభక్తి ప్రత్యయం -కు (-కి) మూ. ద్రా. *క్కు నించి వచ్చింది. దీని సమాన రూపాలు అన్ని భాషల్లోనూ ఉన్నాయి. తృతీయా విభక్తి ప్రత్యయమైన తోడన్,తోన్, తమిళం తృతీయావిభక్తి ప్రత్యయమైన–ఓటు/-ఒటు, -ఉటన్‌తో సంబంధించినది కావచ్చు. ఇంతకన్నా ఇది తోడు 'సహాయం' (మూ. ద్రా. * తోట్- (2939) అనే శబ్దానికి సంబంధించినది అని చెప్పడం సమంజసమని తోస్తుంది. గోరన్, ఊరన్ మొదలైన పదాల్లో-అన్ బా. వ్యా. ఆచ్ఛిక. 38) తమిళంలో తృతీయావిభక్తి ప్రత్యయమైన-అన్ (ప్రాచీనం)/-ఆల్ (ఆర్వాచీనం)కి సంబంధించినది. ఇవి తప్ప మిగిలిన ప్రత్యయాలుగా పరిగణించ బడేవి అన్నీ ప్రత్యేకశబ్దాలు అనడానికి ఆధారాలు ఉన్నాయి, 'చేతన్' చేయి అనే పదం తృతీయా సప్తమ్యేకవచన రూపం. 'కొఱకు' 'కొఱ' 'ప్రయోజనం' అనే దానికి 'కు' ప్రత్యయం చేర్చడంవల్ల ఏర్పడింది. 'కయి' 'కు' ప్రత్యయానికి అయి (అగుధాతువు క్త్వార్థకం) చేరిస్తే ఏర్పడినది. 'కంటె', 'కన్న'-ఇవి 'కు' ప్రత్యయానికి అనుధాతువు నించి వచ్చిన అంటె, అన్న- చేర్చడంవల్ల ఏర్పడినవి

కావచ్చు. 'వలన' 'వలను' 'ప్రయోజనం, దిక్కు' సప్తమ్యేకవచన రూపం. పొంటె తమిళం 'పొరుట్టు' (పొరుళ్ 'వస్తువు, ప్రయోజనం, నిమిత్తం' + తు) తో సంబంధించినది. పట్టి (త. తట్టి), కూర్చి, గుఱించి (త. కుఱిత్తు) - ఈ మూడూ పట్టు (త. పఱ్ఱు), కూర్చు, గుఱించు (త. కుఱి) - ఈ క్రియల క్త్వార్థకరూపాలు. అందు, లో (త. ఉళ్, క. ఒళ్), లోపల ప్రత్యేక శబ్దాలుగా కూడా వ్యాప్తిలో ఉన్నాయి.

**2.38. అస్మదర్థక సర్వనామాలు.** ఏను, నేను మూ. ద్రా. * యాన్ నించి వచ్చినవి. ఏము, మేము మూ. ద్రా * యామ్‌నించి వచ్చినవి. (మూ. దా. * యా-< తె. ఏ : చూ. § 2.8.), వీటి ఔపవిభక్తిక రూపాలు నన్-/నా-, మమ్-/మా- (వీటిలో మొదటిది ద్వితీయా విభక్తి అయిన = ఉన్ ముందు, రెండోది మిగిలిన విభక్తుల ముందు వస్తాయి). వీటి మూ. ద్రా. రూపాలు వరసగా * యన్-, * యమ్-; ఇవి ఈ సర్వనామాల తరవాత అజాది విభక్తిప్రత్యయం చేరడం వల్ల ధాత్వచ్చు హ్రస్వమవడం వల్ల ఏర్పడినవి (చూ. 2.11 . మూల ద్రావిడంలో పదాది యకారం తరవాత దీర్ఘ ఆకారమేగాని మరి ఏ అచ్చూ ఉండదు. కాబట్టి *యన్-, *యమ్-లలో యకారం లోపించి ఇవి మూలమధ్య ద్రావిడ భాషలో *అన్-, *అమ్-లుగా మారేయి. కోలామీ-పర్జీభాషలలో ఈ రూపాలు నేటికీ ఇలాగే నిలిచి ఉన్నాయి. వీటికి చతుర్థీ ప్రత్యయం -అక్కు. షష్ఠీప్రత్యయం -అ(దు) చేరగా వచ్చిన *అనక్కు, *అనదు, *అమక్కు, *అమదు-అనే రూపాలు వర్ణవ్యత్యయం పొంది నాకు; నాదు, మాకు, మాదు గా మారేయి. ఈ రెండు విభక్తులలోనూ వర్ణవ్యత్యయం వల్ల సిద్ధించిన నా-, మా-అనే రూపాలే ద్వితీయ తప్ప అన్ని విభక్తులలోనూ ప్రాతిపదికలుగా స్థిరపడ్డాయి. ద్వితీయలో అన్-, అమ్-ల మొదట నకార మకారాలు చేరి అవి నన్-, మమ్-లుగా మారడం నా-, మా-ల ప్రభావం వల్లనే కావచ్చు. ఇక ఏను, ఏము ప్రాచీన రూపాలనీ, నేను, మేము అర్వాచీన రూపాలనీ తులనాత్మకవ్యాకరణ దృష్ట్యానే కాకుండా నన్నయ భారతం వల్ల కూడా స్పష్టమవుతుంది. నన్నయభారతంలో ఏను, ఏము అతి ప్రచురంగా ఉండగా నేను నాలుగుచోట్ల, 'మేము' ఆరుచోట్ల మాత్రమే కనబడుతుంది (చూ. *నన్నయపద ప్రయోగకోశము*). అలాగే నన్నెచోడుని కుమార సంభవంలో కూడా (చూ. *నన్నెచోడ ప్రయోగసూచిక*) 'ఏను' చాలాచోట్ల ఉండగా 'నేను' నాలుగుచోట్ల మాత్రమే ఉంది; ఇందులో 'ఏము' అనే రూపమే

తప్ప మేము అనేరూపం అసలేలేదు. కాబట్టి ఏను, ఏము-వీటి-ఔపవిభక్తిక రూపాలైన నా-, మా-ల ప్రభావంవల్ల నకార మకారాలు వీటి ముందు చేరడంవల్ల ఇవి నేను, మేముగా తరవాత కాలంలో మారేయని ఊహించవచ్చు.

**2.39. యుష్మదర్థక సర్వనామాలు.** నీవు, ఈవు మూ. ద్రా. *నీన్ నించి వచ్చినవి. ఈరు, మీరు, ఈరలు, మీరలు. మూ. ద్రా. * నీమ్./*నీర్ నించి వచ్చినవి. వీటి ఔపవిభక్తిక రూపాలు నిన్-/నీ-, మిమ్-/మీ- (వీటిలో మొదటిది ద్వితీయా విభక్తి అయిన -ఉన్, ముందు, రెండోది మిగిలిన విభక్తుల ముందు వస్తాయి). వీటి మూ. ద్రా. రూపాలు *నిన్-, *నిమ్-. వీటిలో పదాది నకారం మూలమధ్య ద్రావిడంలోనే లోపించి ఇవి *ఇన్-, *ఇమ్-గా మారేయి. ఈరూపాలు కోలామీ-పర్జీ భాషలలో నేటికీ ఇలాగే నిలిచి ఉన్నాయి. అస్మదర్థక రూపాలకి మల్లేనే ఇవి కూడా చతుర్థీ, షష్ఠీ విభక్తులలో వర్ణవ్యత్యయం పొందడంవల్ల నీకు, నీదు, మీకు, మీదు-అనే రూపాలు ఏర్పడ్డాయి. వీటిలో ఉన్న నీ-, మీ-ల ప్రభావం వల్ల ద్వితీయావిభక్తి ముందు ఉన్న ఇన్-, ఇమ్-లు నిన్-, మిమ్-లుగా మారేయి.

*నీన్‌లో పదాది నకారం అన్ని మధ్యద్రావిడభాషల్లోనూ, అంత్య నకారం తమిళం, మళయాళం, కోత, తొద, తెలుగు, బ్రాహుయిల్లలోనూ లోపించాయి. ఈ రెండు నకారాలూ పోగా మిగిలిన 'ఈ' చివర హల్లులేని ఏకాచ్కపదం కాబట్టి దీని చివర వు చేరి ఈవుగా మారింది. అవు (< *ఆ), పూవు (*పూ) మొదలైన పదాల్లో కూడా ఇటువంటి మార్పే జరిగింది. ఔపవిభక్తికమైన నీ- ప్రభావం వల్ల పదాదిని నకారంచేరి ఈవు నీవుగా మారింది.

మూలద్రావిడంలో యుష్మదర్థక బహువచనరూపం *నీమ్. దానిలో బహువచన ప్రత్యయమైన మకారం స్థానాన్ని దానికన్న విశేషవ్యాప్తిలో ఉన్న మనుష్యవాచక బహువచన ప్రత్యయమైన రేఫ ఆక్రమించుకోడంవల్ల ఏర్పడిన *నీర్ అనే మరొక రూపం మూలద్రావిడభాష కాలంలోనే సృష్టించబడింది. తమిళం నీర్, నీయిర్, తుళు ఈరు, తెలుగు ఈరు, కూయి ఈరు *నీర్ అనే రూపంనించి వచ్చినవే. తుళు, తెలుగు, కూయి ఈరు *నీర్‌లో పదాది నకారం లోపించడంవల్ల ఏర్పడింది. తెలుగులో దీనికి ఔపవిభక్తికమైన మీ- ప్రభావంవల్ల పదాదిని మకారం చేరి మీరు ఏర్పడింది. ఈరలు, మీరలు, ఈరు, మీరులకు మళ్ళీ బహువచన ప్రత్యయమై 'లు' చేరగా ఏర్పడినవి.

వర్ణవ్యత్యయం వల్ల ఏర్పడిన నా-, మా-, నీ-, మీ- అనే యుష్మదస్మదర్థ కాల ఔపవిభక్తిక రూపాలు తెలుగు, గోండీ, కొండ, పెంగొ, మండ, కూయి, కువి అనే భాషలు అన్నింటిలోనూ సమానంగా ఉన్నాయి. కాబట్టి వీటిలో ఈ వర్ణ వ్యత్యయం ఈ భాషలన్నీ ఒకే భాషగా ఉన్న కాలంలో, జరిగి ఉంటుందని ఊహించవచ్చు. గోండీ. కూయిలలో కొన్ని మాండలికాల్లోనూ కొండ, కువిల లోనూ కూడా తెలుగులో లాగా ఔపవిభక్తికరూపాల ప్రభావంవల్ల నామవాచక రూపాల మొదట నకార మకారాలు చేరడమనే మార్పు కనపడుతోంది. (యుష్మ దస్మదర్థకాల పరిణామం సమగ్రచర్చకి చూ.(*కృష్ణమూర్తి* 1968 a,*సుబ్రహ్మణ్యం* 1969 a). కృష్ణమూర్తి (1961 : 263) *అవన్ట్ ఏ మూల ద్రావిడ రూపమని చెప్పేరు. బరోకూడా *అవన్ట్ ఏ మూల ద్రావిడరూపమనీ *అవన్- దాని ఔపవిభక్తిక రూపమనీ, ఈ ఔపవిభక్తిక రూపమే దక్షిణ భాషలలో ప్రథమా విభక్తిలో కూడా సామ్యంవల్ల ప్రవేశించిందనీ వివరించారు. ఈ రెండో అభిప్రాయమే ఎక్కువ యుక్తి యుక్తగా ఉంది.)

**2.40. ఉభయార్థకం.** మూల ద్రావిడంలో ఉభయార్థకసర్వనామం *నామ్. దీని ఔపవిభక్తిక రూపం *నమ్-, తెలుగులో మా-, మీ-, అనే మకారాదులైన యుష్మదస్మదర్థకాల ఔపవిభక్తిక రూపాల ప్రభావంవల్ల దీనిలో కూడా వర్ణవ్యత్య యం సంభవించి *నమ, మనగా మారి ఉండవచ్చు. తెలుగు 'మనకు'ని తమిళం 'నమక్కు'తో పోలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. దీని చివర బహుత్వ సూచక మైన మ చేరి 'మనము' అనే ప్రథమా రూపం సిద్ధించి ఉండవచ్చు.

**2.41. మహదేకవచన సర్వనామం.** తెలుగు వాఁడు, కో. అవ్ద్/అవన్ద్, ప. ఓద్/ఓడ్, కొండ వాన్రు, కూయి అఆంజు. కువి అఆసి-వీటికి మూలమధ్యద్రావి డంలో మూలరూపం *అవన్ట్, దక్షిణద్రావిడభాషల్లో దానికి సమానపదం *అవన్. ఇదేమూలద్రావిడరూపం కూడా అయి ఉండవచ్చు: మూలమధ్య ద్రావిడభాష కాలంలో మూ. ద్రా. *అవన్ చివర ఒక తకారంచేరి అది *అవన్ట్‌గా మారింది. (దంత్య తకారం దంతమూలీయనకారం తరవాత దంతమూలీయ అకారంగా మారుతుంది.) అమహదేకవచన సర్వనామమైన *అత్ (తె. అది) చివర తకార ముండడంవల్ల మధ్య ద్రావిడంలో *అవన్‌కి కూడ చివర తకారంచేరి అది *అవన్ట్‌గా మారి ఉండవచ్చునని ఎమెనో (1955, § 10.15) ఊహించేరు. ఈ పరిణామం

తెలుగులోనూ ఇతర మధ్యద్రావిడ భాషల్లోనూ కూడా జరిగింది. కాబట్టి ఇది తెలుగు మధ్య ద్రావిడభాష అని నిర్ణయించడానికి ఒక ముఖ్యాధారం.

**2.42. సంఖ్యాపదాలు.** ద్రావిడ భాషలలో ఒకటి నించి పదివరకూ, 100 కీ. 1000 కీ (తెలుగులో మాత్రం) ప్రత్యేక సంఖ్యలు ఉన్నాయి. 20,30 మొదలైన దశగుణ సంఖ్యలకి పదాలు 10 రూపానికి 2,3,4 మొదలైనవాటి విశేషణ రూపాలు ముందు చేర్చడంవల్ల ఏర్పడతాయి. పదిపైన ఉండే అంకెలు (సున్న ఉన్నవికాక మిగిలినవి) సున్న ఉన్న అంకె తరవాత 1,2,3 మొదలైన వాటి పదాలు చేర్చడంవల్ల ఏర్పడతాయి. త. మ. ఆయిరం, క. సావిర. సాసిర, తొ. సోఫెర్ సంస్కృతం సహస్ర '1000' నించి వచ్చినవి కాని తెలుగు 'వేయి, వెయ్యి' మాత్రం ద్రావిడపదమే. లక్ష, కోటి అనే సంస్కృత పదాలే నాలుగు సాహిత్యవంతమైన భాషలలోనూ ఆ సంఖ్యలని సూచించడానికి ఉపయోగిస్తారు.

తెలుగులో ప్రాథమిక సంఖ్యాపదాలూ, వాటి మూలరూపాలూ 1. ఒండు < * ఒన్ఱ్, ఒక్కండు, ఒకండు, ఒకటి < * ఒర్–, 2. రెండు < * ఇరంట్, 3. మూఁడు < * మూన్ఱ్, 4. నాలుగు < * నాల్, 5. ఏను, ఐదు (<క.) < * చయ్- (న్త్), 6. ఆఱు < * చాఱ్, 7. ఏడు < * ఏఴ్, 8. ఎనిమిది (శా. ఎణుంబొది) < * ఎణ్, 9. తొమ్మిది < * తొణ్ (8, 9లలో మిది < పది), 10. పది < * పత్ (* పతిన్-దీని ఔపవిభక్తిక రూపం-ఇదే తెలుగులో ప్రథమా రూపంగా మారింది). 100. నూఱు < * నూఱ్ (వంద సం. బృందశబ్దభవమని అంటారు) 1000. వేయి, వెయ్యి < * వయ్- (దీనిపై వివరాలకి చూ. సుబ్రహ్మణ్యం 1977; 220-231).

తెలుగులోనూ ఇతర భాషలలోనూ మనుష్య వాచక సంఖ్యా పదాలు ప్రాథమిక సంఖ్యా పదధాతువుకి ప్రత్యయం చేర్చడంవల్ల ఏర్పడతాయి. తెలుగులో ఈ ప్రత్యయ రూపాలు- రు (ఒకరు, ఒక్కరు, ఎనమండ్రు తొమ్మండ్రు, పదుండ్రు- దఱు (ఇద్దఱులో మాత్రం), -వురు/గురు (మూవురు, మువ్వురు, ముగ్గురు, నలువురు, నల్వురు, నలుగురు, మొ) -వురు/-గురు త. మ. క. – వర్‌కు సంబంధించినది - త. మ. మూవర్, క. మూవరు, ముగ్గురు, మొ. ఆధునిక భాషలో 'ఎనిమిది' కీ ఆపై సంఖ్యలకీ మనుష్యార్థంలో 'మంది' (క. మంది) చేరుతుంది; ఎనిమిదిమంది/ ఎనమండుగురు, తొమ్మిది మంది/

తొమ్మండుగురు దీనిబదులు - గురు కూడా ఉంటుంది. కాని దశగుణ సంఖ్యల లోనూ, పధ్నాలుగు తరవాతా - గురు ఇప్పటి భాషలో ఉండదు (ప్రాచీన భాష లో 'పదుగురు' ఉంది). రాయలసీమ మాండలికంలో ఐదు, ఆరు, ఏడులకి కూడా 'మంది' చేర్చి వ్యవహరిస్తారు.

పూరణ సంఖ్యలు ప్రాథమిక సంఖ్యా పదాలకి - అగున్/-అవున్/- అవ (వ్యా -ఓ) చేర్చడంవల్ల ఏర్పడతాయి: రెండగున్/రెండో. ఇది నిజానికి 'అగు' ధాతువు తద్ధర్మార్థక ధాతుజవిశేషణ రూపమే. ఇది త. మ. - ఆవతు/- అం (ఇరంటాం), క. తు - అనెయ (క. ఎరడనెయ) 'రెండో' ప్రత్యయాలకి సంబంధించినదే

## క్రియలు

**2.43. ప్రేరణ ప్రత్యయాలు.** తెలుగులో 'చు', 'పు', 'ఇందు'-ఈ మూడూ ప్రేరణ ప్రత్యయాలు, '-చు' కన్నడం - చు (-ఇసు)-, గోండీ ఈన్-, కూయి -న్ మొదలైన వాటికి సంబంధించినది. ఈ ప్రత్యయం తమిళమలయాళాలు తప్ప మిగిలిన అన్ని భాషల్లోనూ ఉంది. -పు ప్రత్యయం కూడా చాలా ద్రావిడ భాషల్లో ఉంది (తె. త్రిప్పు : త. తిరుప్పు). - ఇంచు ప్రత్యయం ఇ. చు అనే రెండు ప్రేరణార్థకాల సముదాయం కావచ్చు. ఇకారం ప్రేరణార్థకంగా తమిళం 'వి' (చెయ్‌వి 'చేయించు'), 'ప్పి' (నటప్పి 'నడపు') లలో వకార పకారాలతో కలిసి ఉంది.

మూలద్రావిడంలో అద్విరుక్తస్పర్శంతో (దాని ముందు అనునాసికం ఉన్నా లేకపోయినా) అంతమయ్యే కొన్నిక్రియలలో దాని స్థానంలో ద్విరుక్తస్పర్శాన్ని (దీనిముందు అనునాసికం నశిస్తుంది), ఆదేశం చెయ్యడంవల్ల కూడా ప్రేరణ క్రియలు ఏర్పడేవి (త. ఆటు 'ఆడు'-ఆట్టు 'ఆడించు' : కలంకు 'కలఁగు' : కలక్కు- 'కలఁచు'). ఈ ప్రక్రియ నేటికీ తమిళం, మళయాళం, కోత, తొద, కొడగు, కొండ, కూయి, కువి, పెంగొ, మండ భాషల్లో నిలిచి ఉంది. తెలుగు లోనూ ఇతర భాషల్లోనూ ఇది నశించింది (దీనిపై వివరాలకి చూ. సుబ్రహ్మణ్యం 1965, 1977, 300-331).

**2.44. భూతకాలిక ప్రత్యయాలు.** మూలద్రావిడంలో '-త్-,-న్త్-,-త్త్-, -ఇ-/-ఇన్-' అనే నాలుగు భూతకాలిక ప్రత్యయాలు ఉన్నట్లు తమిళం- కొడగు

భాషాసముదాయంవల్ల తెలుస్తుంది. వీటిలో-ఇ-/-ఇన్- హ్రస్వాచ్చు గల ఏకాచ్క క్రియలు కాకుండా ఉండి స్పర్శంతో అంతమయే క్రియల తరవాత, మిగిలిన మూడు ప్రత్యయాలూ మిగిలిన క్రియల తరవాతా వచ్చేవి. తెలుగులో ఈ నాలుగు ప్రత్యయాలూ ఐక్యం పొంది -ఇతి- ఏర్పడింది. దీని సపదాంశమైన -టి- నకారాంత ధాతువుల తరవాత వస్తుంది. తెలుగులో తిం-టి-ని, కొం-టి-ని తమిళంలో తిన్-ఱ్-ఏన్, కొణ్-ట్-ఏన్‌తో పోలిస్తే వీటిలో -ంట్- *-న్ఱ్-, *-ణ్ట్-అనే- రెండింటినించి వచ్చిందని తెలుస్తుంది. మూలద్రావిడంలో




అనే సంధిసూత్రం ఉండడంవల్ల వీటిలో ఱ్, ట్‌లు -త్- రూపాంతరాలే. *-న్ఱ్-, *-ణ్ట్-తెలుగులో -ండ్- అవ్వాలి (2.22). కాబట్టి పై వాటిలో ఉండవలసిన డ కారం ట కారంగా -ఇతి-లో శ్వాసమైన తకారం ప్రభావం వల్ల మారిందని ఎమెనో (1967 : 388) అభిప్రాయం.

తెలుగులో -ఇతి-, -టి-ఉత్తమ మధ్యమ పురుషప్రత్యయాల ముందే వస్తాయి. ప్రథమ పురుషలో మహత్ ప్రత్యయమైన రి ముందు ఇ, మిగిలిన చోట్ల ఎను ఉంటాయి. ఎనుకి కొన్ని క్రియల్లో ఇయెను అనే రూపాంతరం కూడా ఉంది (బా. వ్యా. క్రియా. 50). కాబట్టి ఇది ఇ, అన్ అనే రెండు భూతకాలిక ప్రత్యయాల సముదాయమని ఊహించవచ్చు. అనియెను, అనెను మొదలైన వాటిలో 'ఇయెను' ఏ ప్రాచీనమైన మల్లియ < మల్లె, కన్నియ < కన్నెలోలాగా అది 'ఎను' గా తరవాత కాలంలో మారి ఉండవచ్చు. మూలద్రావిడంలో నాలుగు ప్రత్యయాలకి బదులు ఒకే ప్రత్యయం ప్రచురంగా ఉండడం తెలుగులోనూ, గోండీ కోలామీ మొదలైన కొన్ని మధ్య ద్రావిడభాషల్లోనూ తుల్యంగా ఉంది.

**2.45. భావికాలిక ప్రత్యయాలు.** తెలుగులో -దు-/-ఎద- ఉత్తమ మధ్యమ పురుషప్రత్యయాల ముందూ, ప్రథమపురుషలో మహత్‌బహువచన ప్రత్యయం ముందూ వస్తుంది. ప్రాచీన తమిళంలో -త్-అనే భావికాలిక

ప్రత్యయం ఉత్తమపురుషబహువచనం ముందూ, మధ్యమ పురుష ఏకవచన, బహువచనాల ముందూ మాత్రమే వస్తుంది. ఉదా, అఱితుమ్ (తె. ఎఱుఁగుదుము). పోకుతి (తె. పోవుదు (వు), కాంటిర్ (తె. (మీరు) కందురు). ప్రాచీనతమిళంలో ఉన్న ఇటువంటి రూపాలు తప్పితే దక్షిణ ద్రావిడ భాషల్లో పకారవకారాలే భావి కాలిక ప్రత్యయాలుగా ప్రచురంగా ఉన్నాయి. కాని అన్ని మధ్యద్రావిడభాషల లోనూ తకార దకారాలు వర్తమాన భావికాలిక ప్రత్యయాలుగా చాలా వ్యాప్తిలో ఉన్నాయి. కాబట్టి తెలుగు మధ్యద్రావిడభాష అనడానికి దీనిని కూడా ఒక ముఖ్యాధారంగా గ్రహించవచ్చు.

ప్రథమపురుషలో మహద్బహువచనం తప్ప మిగిలినచోట్ల భావికాలిక ప్రత్యయం -ఉను. దీని తరవాత పురుషప్రత్యయాలు లోపించి ఈ రూపం మహదమహదేకవచన, అమహద్బహువచనాల్లో తుల్యంగా ఉంటుంది. తమిళంలో దీనికి సమమైన ప్రత్యయం -ఉమ్. అది కూడా ప్రాచీన తమిళంలో మహద్బహు వచనం తప్ప మిగిలిన అన్ని లింగవచనాల్లోనూ ఉండేది. ఉదా. త. పాటుమ్ (తె. పాడును), నకుమ్ (తె. నగును, నవ్వును). త. ఉమ్. తె. ఉను మూ. ద్రా. *-ఉమ్ నించి వచ్చినవి. మ్రాను (త. మరమ్), కొలను (త. కుళమ్) వంటి పదాల్లో అంత్యమకారం తెలుగులో నకారంగా మారినట్లు ఈ *-ఉమ్ లో మకారం కూడా నకారంగా మారింది.

**2.46. వ్యతిరేక ప్రత్యయాలు.** తెలుగులో -అ-వ్యతిరేక ప్రత్యయంగా అన్ని పురుష ప్రత్యయాలముందూ ఉంటుంది. కాని తమిళం, కన్నడం మొదలైన దక్షిణ ద్రావిడభాషల్లో మాత్రం వ్యతిరేక ప్రత్యయమైన -ఆ- అమహదేకవచన బహువచనాల ముందే ఉండి, మిగిలిన పురుషప్రత్యయాల ముందు దీని లోపరూపం ఉంటుంది. మధ్యద్రావిడభాషల్లోనూ బ్రాహుయీలోనూ తెలుగులోలాగా వ్యతిరేక ప్రత్యయం అన్ని పురుషప్రత్యయాల ముందూ ఉంటుంది. కాబట్టి ఈ విషయంలో కూడా తెలుగు మధ్య ద్రావిడభాషలతోనే సన్నిహితంగా ఉన్నట్లు తెలుస్తుంది. ఈ వ్యతిరేక ప్రత్యయం మూ. ద్రా. రూపం * -ఆ-. ఇది తమిళంలో దీర్ఘ ఆకారంగానే ఉండగా తెలుగులో అపదాద్యక్షరంలో దీర్ఘాచ్చు హ్రస్వమవు తుంది (అరయ : త. ఆరాయ్ : ఏమఱు, త. ఏమాఱు). కాబట్టి ఇది హ్రస్వ అకారంగా మారింది. ఉదా. చేయదు/చెయ్యదు (త. చెయ్యాతు). (అవి) చేయవు-చెయ్యవు (త. చెయ్యా).

**2. 47. క్త్వార్థకం.** తెలుగులో క్త్వార్థక ప్రత్యయం -ఇ. దీని ముందు ధాతువులో యకారం సకారంగా మారుతుంది. కాని తెలుగులో కొన్ని క్త్వార్థక రూపాల్ని మిగిలిన మధ్యద్రావిడభాషల్లో క్త్వార్థకరూపాలతో పోల్చి చూస్తే ఇకారం ముందున్న సకార, చకారాలు కూడా మొదట్లో క్త్వార్థకప్రత్యయానికి చెందినవే అని తెలుస్తుంది. (చూ. కృష్ణమూర్తి 1961, § 4.47), ఉదా.

| | తెలుగు | గోండీ | కొండ | కూయి | కువి | పర్జీ | గదబ |
|---|---|---|---|---|---|---|---|
| 1. | వచ్చి | వాసీ | వాజ్జి | వాజ | వాహ | వెరి | వరి |
| 2. | తెచ్చి | తచ్చీ | తసి | తస | | | |
| 3. | ఇచ్చి | సీసీ | | సీఅ | హీహ | | |
| 4. | చూచి | సూడ్సీ | సుడ్జి | సూడ | | చూడి | సూడి |
| 5. | చేసి | కీసీ | కిజి | గిఅ | | | |
| 6. | నిల్చి | నిల్సీ | | నీల్జ | | నిల్చి | |

పై ఉదాహరణల్లో గోండీ మొదలైన భాషల్లో సకార చకారాలు స్పష్టంగా క్త్వార్థకప్రత్యయానికి సంబంధించినవే. తెలుగులో కూడా మొదట్లో ఇటువంటి క్రియల్లో క్త్వార్థకప్రత్యయం -చి/-సి. కాని ఆడి, పాడి, చెప్పి మొదలైన అనేక క్రియలలో ఇకారం మాత్రమే క్త్వార్థక ప్రత్యయం కాబట్టి వీటిలో కూడా అనుచితవిభాగంవల్ల ఇకారం మాత్రమే క్త్వార్థకప్రత్యయంగా గ్రహించబడి చకారం క్రియలో భాగంగా కలిపివేయబడింది.

కోలామీ తప్ప మిగిలిన మధ్యద్రావిడ భాషలన్నిటిలోనూ ఇకారంతోపాటు సి/చి కూడా క్త్వార్థక ప్రత్యయాలుగా ఉన్నాయి. కోయ తప్ప మిగిలిన గోండీ మాండలికాల్లోనూ, కొండలోనూ ఇ నశించి సి/చి ఏ అన్ని కియలకీ క్త్వార్థక ప్రత్యయంగా వ్యాపించింది. ఇకారం స్పర్శంతో అంతమయ్యే క్రియల్లో క్త్వార్థకంగా మూలద్రావిడంలోనే ఉంది. సి/చి మాత్రం మూలమధ్య ద్రావిడభాషకాలంలో మిగిలిన క్రియల్లో క్త్వార్థకంగా సృష్టించబడింది. ఈ నూతనపరిణామం తెలుగులోనూ, కోలామీ తప్ప మిగిలిన మధ్యద్రావిడభాషలు అన్నిటిలోనూ కనబడుతోంది కాబట్టి తెలుగు మధ్యద్రావిడోప కుటుంబానికి చెందినది అనడానికి ఇది ఒక ప్రబలాధారంగా మనం పరిగణించవచ్చు (చూ. సుబ్రహ్మణ్యం 1969, § 6).

**2.48. భూతధాతుజ విశేషణం.** తెలుగులో క్రియకి – ఇన చేర్చటంవల్ల ఇది ఏర్పడుతుంది. ఇందులో -ఇన్- భూతప్రత్యయం, -అకారం విశేషణ ప్రత్యయం. తమిళ, మలయాళాల్లో స్పర్శంతో అంతమయ్యే క్రియల్లో భూతధాతుజ విశేషణం -ఇన (ప్రాచీన తమిళం -ఇయ) చేర్చడంవల్ల ఏర్పడుతుంది. త. మ. పాటిన : తె. పాసిన, త. కలంకిన : తె. కలఁగిన. ఆభాషల్లో మిగిలిన క్రియల్లో -త్-, -న్త్- -త్త్- ప్రత్యయాల తరవాత అకారం చేరడంవల్ల ఈ రూపం ఏర్పడుతుంది : త. మ చెయ్త: తె. చేసిన, త. మ. వంత : తె. వచ్చిన. కాబట్టి తెలుగులో ఈ రూపంలో -ఇన్- అనే భూత ప్రత్యయం అన్ని క్రియల్లోకి వ్యాపించిందని తెలుస్తుంది.

పడిన, చెడిన – తగిన అనే వాటికి పర్యాయాలైన పడ్డ (త. మ. క. పట్ట) చెడ్డ (త. మ. క. కెట్ట), తగ్గ (త. మ. క. తక్క) అనేరూపాల్లో (బా. వ్యా. క్రియా. 61) -త్- అనే భూతప్రత్యయం ధాతువు చివరి హల్లుతో సమీకృతమై నేటికీ నిలిచి ఉంది. వీటిలో -ఇన్- లేదు కాబట్టి ఇవే ప్రాచీన రూపాలనీ, పడిన, చెడిన, తగిన అనేవి -ఇన్- సర్వత్రా వ్యాపించడం వల్ల ఏర్పడిన అర్వాచీన రూపాలనీ చెప్పవచ్చు. అన్న, కొన్న, తిన్న, మొదలైన నకారాంతధాతువుల భూతధాతుజ విశేషణ రూపాలు అనిన, కొనిన, తినిన మొదలైన వాటిలో రెండు నకారాలమధ్య ఇకారం లోపించడవల్ల ఏర్పడినవి.

**2.49. తద్ధర్మధాతుజవిశేషణం.** ఇది ధాతువుకి ఎడి, ఎడు చేర్చడం వల్లగాని ఏమీ చేర్చక పోవడం వల్లగాని ఏర్పడుతుంది : వండు, వండెడి, వండెడు. ఎడి, ఎడులకి మిగిలిన భాషల్లో సమానరూపాలు ఇంతవరకూ దొరకలేదు. ఇక చేయు (వాఁడు) మొదలైన వాటిలో ఉకారం భావికాలికప్రత్యయమైన *-ఉమ్ నించి వచ్చినది. వీటి తరవాత అచ్చుతో మొదలయ్యే పదం వస్తే ఈ ఉకారం తరవాత న కారం వస్తుంది : చేయునతఁడు. ఈ నకారం ప్రాచీనమైన మకారం నించి వచ్చినది (చూ. 2.45). ఇది తెలుగులో హల్లుపరమైనప్పుడు నశిస్తుంది. తమిళ, మలయాళాల్లో – ఉమ్‌తద్ధర్మధాతుజవిశేషణంగా ఉంది; తె. చేయు (న్) ; త. మ చెయ్యుమ్, తె. పాడు (న్) ; త. మ. పాటుమ్.

**2.50. వ్యతిరేకక్త్వార్థకం.** తెలుగులో ఇది ధాతువుకి – అక చేర్చడం-వల్ల ఏర్పడుతుంది. పర్జిలో కూడా దీనికి ప్రత్యయం -అక. గోండీలో దీనికి ప్రత్యయం – వాక్ (సుబ్రహ్మణ్యం 1968 § 4. 16).

| తెలుగు | పర్జీ | గోండీ |
|---|---|---|
| చూడక | చూఢక | సూఢ్‌వాక్ |
| రాక | వెరక | వాయ్‌వాక్ |
| ఈ(య)క | చియక | సియ్‌వాక్ |
| తినక | తినక | తిన్‌వాక్ |

మూలద్రావిడంలో వ్యతిరేక క్త్వార్థకం క్రియకి వ్యతిరేక ప్రత్యయమైన *-అ చేర్చడంవల్లనే ఏర్పడేది. ఈ పద్ధతి ప్రాచీన తమిళంలోనూ, కోతలోనూ నిలిచి ఉంది: ఉదా. త. చెయ్యా 'చెయ్యక', చొల్లా 'చెప్పక'. ఈ వ్యతిరేక క్త్వార్థకం సాధారణంగా భూతకాలంలో వ్యతిరేకతని సూచిస్తుంది. కాబట్టి అన్ని దక్షిణ ద్రావిడభాషల్లోనూ దీని చివర భూతప్రత్యయమైన తకారం చేరింది. ఉదా. త. చెయ్యాతు 'చెయ్యక'. చొల్లాతు 'చెప్పక', క. ఎన్నదె 'అనక', ఈయదె 'ఇయ్యక'. తెలుగు, పర్జీ, గోండీ ప్రత్యయాలలో అకారం మూ. ద్రా. వ్యతిరేక ప్రత్యయమైన* - అ నించి వచ్చినదే; దాని తరవాత ఉన్న కకారం దక్షిణద్రావిడభాషల్లో తకారంలాగా భూతప్రత్యయమై ఉండవచ్చు. కకారం భూత ప్రత్యయంగా మూడు ఉత్తర ద్రావిడభాషల్లోనూ ప్రచురంగా ఉంది. తెలుగు వ్యతిరేక క్త్వార్థకం పర్జీ, గోండీ వ్యతిరేక క్త్వార్థక రూపాలతో సన్నిహితంగా ఉంది కాబట్టి తెలుగు మధ్యద్రావిడభాష అని చెప్పడానికి ఇది ఒక ప్రబలాధారం (చూ. *కృష్ణమూర్తి* 1961, § 4.49., *సుబ్రహ్మణ్యం* 1969, § 8.)

**2.51. వ్యతిరేకధాతుజవిశేషణం.** తెలుగులో ఇది క్రియకి-అని చేర్చడంవల్ల ఏర్పడుతుంది. మూలద్రావిడంలో వ్యతిరేకధాతుజవిశేషణం కూడా వ్యతిరేక క్త్వార్థకానికిలాగా వ్యతిరేక ప్రత్యయమైన* - అ చేర్చడంవల్లనే ఏర్పడేది. ఈ పద్ధతి ప్రాచీన తమిళంలోనూ, గోండీ, కువి, కోలామీ, పర్జీ, గదబల్లో నేటికీ నిలిచి ఉంది. కాని దక్షిణ ద్రావిడభాషల్లో తరవాత కాలంలో వ్యతిరేక ప్రత్యయం తరవాత భూతకాలిక ప్రత్యయమైన తకారమూ దాని తరవాత విశేషణ ప్రత్యయమైన అకారమూ చేరేయి. ఉదా: త. చెయ్యా, చెయ్యాత, మ. చెయ్యాత్త, క. గెయ్యద 'చేయని'. ఈ దక్షిణద్రావిడ రూపాలతో తెలుగు రూపాల్ని పోలిస్తే వీటిలో అకారం వ్యతిరేక ప్రత్యయమనీ దాని తరవాత నకారం భూతప్రత్యయమని తెలుస్తుంది.

కూయిలో భూతవ్యతిరేకధాతుజవిశేషణం, భవిష్యత్‌వ్యతిరేకధాతుజ విశేషణం అని రెండు వ్యతిరేకధాతుజవిశేషణాలు ఉన్నాయి. వీటిలో మొదటిది క్రియకి-?అతి- చేర్చడం వల్లా, రెండవది -? అని చేర్చడం వల్లా ఏర్పడ తాయి తెలుగు - అని ప్రత్యయానికి కూయి -? అని ప్రత్యయానికి కూయిలో కంఠమూల స్పర్శం తప్ప వేరే భేదం లేదు. ఉదా :— కూయి తిన్? అని? తె. తినని, కూయి సూడ్? అని: తె. చూడని. ఈ ధాతుజ విశేషణంలో విశేషణ ప్రత్యయంగా మిగిలిన భాషల్లో అకారం ఉండగా తెలుగు, కూయిలలో ఇకారం ఉండడం కూడా ఈ రెండు భాషలమధ్య సన్నిహితత్వాన్ని నిరూపిస్తుంది.

**2,52.** **చేదర్థకం.** తెలుగులో క్రియకి - ఇనన్ చేర్చడంవల్ల చేదర్థకం ఏర్పడుతుంది. ఇందులో -ఇన్- భూతప్రత్యయం, -అన్ చేదర్థక ప్రత్యయం. -ఇన్- తమిళంలో స్పర్శంతో అంతమయ్యే క్రియలలో భూతప్రత్యయమైన —ఇన్- (చూ. 2.48) కి సంబంధించినది. తెలుగులో ఇది *-త్-*-న్ద్-, *-త్త్- అనే మూడు ప్రత్యయాల్ని తొలగించి వాటిస్థానాలకి కూడా వ్యాపించినట్లు ఇంతకు ముందే చూశాం. చేదర్థక ప్రత్యయమైన -అన్ మూ. ద్రా. *-అవ్ (త. మ. *-ఆల్) నించి వచ్చింది. ఉదా. త. పాటినాల్ : తె. పాడినన్, త. నంపినాల్ : నమ్మినన్. వ్యావహారికభాషల్లో ఈ రూపాల్లో అంత్యనకారం లోపించి, దాని ముందు అచ్చు దీర్ఘమై ఏర్పడిన పాడినా, నమ్మినా మొదలైన రూపాలు (concessive meaning) నేటికి నిలిచిఉన్నాయి. వ్యావహారిక భాషలో -ఇతే/-తే/-దే అనే ప్రత్యయంలో ఏర్పడే చేదర్థక రూపాలు ప్రాచీనాంధ్రంలో మధ్యమ పురుషైకవచన భూతకాలరూపంలో ఏని (త. ఏల్ <*ఆకిల్ 'ఐయితే') అనే శబ్దం చేరగా ఏర్పడిన రూపాలనించి వచ్చినవి. ఉదా. వ్యా. అంటే < ప్రా. అంటి(వి) + ఏని.

**2.53.** విధ్యర్థకాలు (మధ్యమపురుషైకవచన, బహువచనాలు). తెలుగులో విధ్యర్థకమధ్యమపురుషైకవచన ప్రత్యయం - ము. అనేకాచ్క ధాతువులలో అచ్చు పరమైనప్పుడు తప్ప మిగిలినచోట్ల ఇది వైభాషికంగా లోపించవచ్చు. విధ్యర్థక బహువచన ప్రత్యయం -ఉండు. విధ్యర్థక రూపనిర్మాణంలో తెలుగుకీ గోండీ, కొండ, కూయి, కువిలకీ ఎంత సన్నిహిత సంబంధ ముందో ఈ కింది పట్టిక నిరూపిస్తుంది.

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| తెలుగు | -(ము) | -ఉండు |
| గోండీ | -ఆ (~-మ్-) | -ఆ(-~-మ్-) + ట్ |
| కోయ | -అ (~-ము) | -అ(~మూ-) + టి(~-టు) |
| కొండ | -? అ | -దు (~-డు~-ఉ) |
| కూయి | -ము(∞-అము-∞ఉము) | -అటు ∞ దు(~-డు~-డు) |
| కువి | -ము(∞-అము) | అదు ∞ దు (~-జు) |

పై భాషలన్నిటిలోనూ మకారం (కొండలో తప్ప) ఏకవచన ప్రత్యయం గానూ, టకార దకారాలు బహువచన ప్రత్యయంగానూ ఉన్నాయి. కాని మిగిలిన ద్రావిడ భాషల్ని పరిశీలిస్తే విధ్యర్థకైకవచనరూపంలో ప్రత్యయమేమీ లేకుండా క్రియమాత్రమే ఉంది, బహువచన రూపంలో మకారం ప్రత్యయంగా ఉంటుంది. ఉదా. త. చెయ్ 'చెయ్యి' చెయ్యుమ్ (కళ్) 'చెయ్యండి' కోత తిన్ 'తిను'. తిన్మ్ 'తినండి'. ప్రాచీన కన్నడం గెయ్ 'చెయ్యి', గెయ్యిమ్ 'చెయ్యండి', తిన్ 'తిను', తిన్నిమ్ 'తినండి'. బ్రాహుయీలో విధ్యర్థక బహువచన ప్రత్యయ మైన-బొలో బకారంకూడా ఈ మకారం నించి వచ్చినదే కావచ్చు. దీనివల్ల మొదట్లో మకారం బహువచన ప్రత్యయమే అని తేలుతుంది. ద్రావిడ భాషల్లో ఆత్మార్థక యుష్మదస్మదర్థక సర్వనామాల్లో (చూ. 2.38-40)బహువచనప్రత్యయం మకారమే కావడం కూడా ఈ ఊహని బలపరుస్తుంది. తెలుగు, గోండీ, కూయి మొదలైన భాషల్లో మొదట్లో బహువచనప్రత్యయమైన మకారం ఈ భాషల్లో ట/ద అనే ఒక కొత్త బహువచన ప్రత్యయం వచ్చి చేరడంవల్ల ఏకవచనప్రత్య యంగా మారిపోయింది. ప్రాచీనాంధ్రంలోనూ కువిలో కొన్ని మాండలికాల్లోనూ మకారం వైకల్పికం కావడం కూడా ఇది మొదట్లో ఏకవచన ప్రత్యయంకాదు అనే విషయాన్ని ధ్రువపరుస్తుంది.

| | | ఏ.వ. | బ.వ. |
|---|---|---|---|
| (i) | గోండీ | సీమ్ | సీమ్ట్ |
| | కోయ | ఈము | ఈమూటు |
| | తెలుగు | ఇమ్ము | ఇందు |

| | | |
|---|---|---|
| (ii) గోండీ | కిమ్ | కిమ్‌ట్ |
| తెలుగు | చేయుము | చేయుండు |

పై ఉదాహరణలని పరిశీలిస్తే తెలుగులో బహువచనప్రత్యయమైన -(ఉ)ండు *-(ఉ) మ్-ట్ నించి మకారం పరంగా ఉన్న టకారం వల్ల మూర్ధన్యణకారంగా మారి అనునాసికం తరవాత ఉన్న టకారం నాదమైన డకారంగా మారడంవల్ల ఏర్పడిందని స్పష్టమవుతుంది. గోండీలో-మ్‌ట్ అచ్చుతో అంతమయ్యే ఏకాచ్క ధాతువుల తరవాత మాత్రమే ఉంటుంది; కాని కోయలో-మూటు అచ్చుతోనూ, అద్విరుక్త హల్లుతోనూ అంతమయ్యే అన్ని ధాతువుల తరవాతా ఉంటుంది. (సుబ్రహ్మణ్యం 1968, §§ 4, 9, 7. 4, 8.). దీనివల్ల తెలుగు తమిళం, కోత, కన్నడంలో లాగా మొదట్లో మకారమే బహువచన ప్రత్యయంగా ఉండేదనీ తరవాత కాలంలో దానికి టకారం చేరిందనీ మనం ఊహించవచ్చు. మొదట్లో బహువచన ప్రత్యయమైన మకారం ఏకవచనప్రత్యయంగా మారడం, బహువచన రూపంలో ట కారం కొత్తగా చేరడం-ఈరెండు మార్పులూ తెలుగు, గోండీ, కొండ కూయి, కువిలలో తుల్యంగా ఉండడంవల్ల ఈభాషలన్నీ పూర్వకాలంలో ఒకే భాషగా ఉండేవని మనం నిర్ణయించవచ్చు.

## ఉ ప సం హా రం

**2.54.** మూలద్రావిడ భాషకాలం నించి తెలుగు ప్రత్యేకభాషగా రూపొందే వరకూఎటువంటి మార్పులు పొందుతూ వచ్చిందో మనం ఇంతవరకూ చూశాం. తెలుగు పొందిన ఈ పరిణామాలు చాలా వరకు మధ్యద్రావిడభాషలలో కూడా ఏర్పడి ఉండడంవల్ల తెలుగు మధ్యద్రావిడో పకుటుంబానికి చెందినదని తెలుస్తుంది. ఇక మధ్య ద్రావిడోపకుటుంబంలో కోలామీ, నాయకీ, పర్జీ, గదబ- ఈ నాలుగు భాషలూ పరస్పర సన్నిహితత్వంలో ఒక చిన్న ఉపకుటుంబం (కోలామీ-పర్జీ) గానూ (చూ. ఎమెనో 1955, అధ్యాయం 10), తెలుగు, గోండీ, కొండ, పెంగో, మండ- కూయి, కువిభాషలు ఇంకొక చిన్న ఉపకుటుంబం (తెలుగు-కూయి)గానూ ఉన్నాయి. తెలుగుకీ *గోండీ, కూయి మొదలైన భాషలకి 1. వర్ణవ్యత్యయం (2.13). 2. యుష్మదస్మదర్థక సర్వనామాల ఔపవిభక్తిక రూపాల పరిణామం (2.38-39.), 3. విధ్యర్థక రూపాల పరిణామం (2.53) అనే మూడు

ముఖ్యపరిణామాలు తుల్యంగా ఉండడంవల్ల ఇవి ఏర్పడిన కాలంలో ఈ భాషలన్నీ ఒకేభాషగా ఉండేవని మనం నిర్ణయించాలి. గోండీ, కొండ, పెంగొ, మండ, కూయి. కువిలలో తెలుగులో లేని కొన్ని పరిణామాలు తుల్యంగా ఉండడంవల్ల పై మూడుపరిణామాలూ ఏర్పడిన తరవాత వీటి మూలభాషనించి మొట్టమొదట తెలుగు విడిపోయిందనీ, ఆ తరవాత కొంతకాలం పైనపేర్కొన్నభాషలు ఒకేభాషగా ఉండి మరికొన్ని పరిణామాలు పొందిన తరవాత వేరువేరు భాషలుగా విడిపోయాయనీ మనం ఊహించాలి.

ఇక తెలుగు దక్షిణద్రావిడభాషలలో తుల్యంగా పొందిన పరిణామాలు రెండే రెండు ఉన్నాయి. అవి 1. ఇ, ఉలు అకారం ముందు ఎ, ఒలుగా మారడం (2.12), 2. పదాదిచకారలోపం (2.15). తెలుగులో ఏర్పడిన మిగిలిన పరిణామాలన్నీ తెలుగు మధ్యద్రావిడోపకుటుంబానికి చెందినదని నిరూపిస్తూ ఉండడంవల్ల తెలుగు ప్రత్యేకభాషగా రూపొందిన తరవాత దాని ఇరుగు పొరుగు భాషలైన తమిళం, కన్నడం మొదలైన దక్షిణద్రావిడభాషల సాహచర్యంవల్ల అవి పొందిన ఈ రెండుపరిణామాలూ తెలుగుకూడా పొందిందని మనం ఊహించవచ్చు. ఇటువంటి ధ్వనిపరిణామాలు ఒక భాషలో ఇరుగుపొరుగు భాషల ప్రభావం వల్ల (అవి దానికి సోదరభాషలయినా కాకపోయినా కూడా) ఏర్పడుతూ ఉండడం ప్రపంచభాషలలో సర్వసామాన్యమే. కాబట్టి ఈ ధ్వనిపరిణామాలు తెలుగుకీ దక్షిణద్రావిడభాషలకీ అతి సన్నిహిత సంబంధాన్ని స్థాపించడానికి ఆధారాలు కాలేవు.

పై చర్చవల్ల తేలిన సారాంశం : మూలద్రావిడభాష మొట్టమొదట మూలదక్షిణ ద్రావిడభాష, మూల మధ్యద్రావిడభాష, మూలోత్తరద్రావిడభాష అనే మూడు భాగాలుగా విడిపోయింది. ఆ కాలంలో తెలుగు మూలమధ్యద్రావిడభాషలో అంతర్లీనమై ఉండేది. మూలమధ్యద్రావిడభాష తరవాత మూలతెలుగు – కూయి, మూల కోలామీ-పర్జి అనే రెండు భాగాలుగా విడిపోయింది. మూలతెలుగు-కూయి నించి మొట్టమొదట తెలుగు ప్రత్యేకభాషగా విడిపోయింది. తరవాత కొంతకాలం వరకూ గోండీ, కూయి మొదలైన మిగిలినభాషలు ఒకే భాషగా ఉండి తరవాత అవి ప్రత్యేకభాషలుగా విడిపోయాయి. (ద్రావిడభాషలలో ఉపకుటుంబ విభజన మీద సమగ్రచర్చకి, చూ. *సుబ్రహ్మణ్యం* 1977, పేజీలు 454-472).

# ప్రాచీనాంధ్రం: శాసనభాషా-పరిణామం

## (క్రీ. పూ. 200-క్రీ. శ. 1100)

—బూదరాజు రాధాకృష్ణ

**3.0. ఆధారాలు** : ప్రాచీనాంధ్రభాషాస్వరూపాన్ని గుర్తించటానికి శాసనాలు తప్ప వేరే ఆధారాలు లేవు. ఈ అధ్యాయంలో క్రీ. పూ.200 నుంచి క్రీ. శ. 1100 వరకూ ఉన్న 269 శిలాతామ్రశాసనాలను పరిశీలించి భాషా చరిత్రను నిరూపించటం జరిగింది. వీటిలో 217 శిలా శాసనాలు; 52 తామ్ర శాసనాలు. వీటిలో 255 మాత్రమే ప్రచురితమైనాయి. ప్రచురితాల్లో 187 కొద్ది భాగాలు మినహా మొత్తంమీద తెలుగులోనే ఉన్నాయి; మిగిలిన 68, స్థలనామ వ్యక్తినామాదులు మాత్రమే తెలుగులో ఉన్న ఆంధ్రేతరభాషాశాసనాలు. పూర్తిగా తెలుగు వాక్యాల్లో ఉన్న మొట్టమొదటి శాసనం క్రీ. శ. 575 నాటిది. లిపినిబట్టీ, శాసనకర్తలను గురించి చరిత్ర కందిన ఇతరాధారాలనుబట్టి, ఇవన్నీ ఏ కాలానివో నిర్ణయించదగ్గవి. అలాటి నిర్ణయానికి అందని శాసనాలు మరికొన్ని ఉన్నా వాటి నిక్కడ పరిశీలించటంలేదు. అముద్రితప్రాచీనశాసనాలు రెండు మూడు వందల దాకా ఉన్నప్పటికీ వాటిలో ఉపయుక్త మనిపించిన పద్నాలుగింటిని మాత్రమే పరిశీలించాం.*

**3.1. లిపి** : క్రీ. పూ. 200 నాటి శాసనం 'భట్టిప్రోలు / ద్రావిడీ' శాఖకు చెందిన 'బ్రాహ్మీలిపి'లో ఉంది. పరిశీలితశాసనాల్లో కొంతభాగం దేవ నాగరిలోను మిగిలింది తెలుగు — కన్నడ లిపిలోనూ ఉన్నదొకటి, వేంగీచాళుక్య లిపిలో ఉన్నవి నాలుగు, ఉన్నాయి. ద, డ—లకు, శ, డ—లకు, బఱ—లకు, థ <[illegible]>, ష్ఠ <[illegible]> -లకు లిపిలో సాన్నిహిత్యం ఉండేది. ఈ, ఊ, లకు తప్ప ఇతరాచ్చులకు సాధారణంగా దీర్ఘత గుర్తించబడేదికాదు. ఎ ఏ, ఒ ఓ, లకు

* ఈ అధ్యాయం బూదరాజురాధాకృష్ణ అముద్రిత పరిశోధనవ్యాసానికి సంగ్రహరూపం.

హ్రస్వదీర్ఘభేదం లిపిలోనే లేదు. ద్విత్వాక్షరాలకు బదులుగా ఒకే హల్లును ఉపయోగించటం, మహాప్రాణాలకు ముందున్న అల్పప్రాణాలను వదిలివేయటం, అనుస్వారచిహ్నంగా ఉన్న చుక్కను కాలక్రమంలో భిన్నస్థానాలకు మార్చటం వంటి అనేక ప్రత్యేకతలు ఆనాటి లిపిలో కనిపించేవి. అందువల్ల అనేకభిన్నపాఠాలూ అపపాఠాలూ బయలుదేరి పాఠపరిష్కరణ కష్టసాధ్యమయింది.

**3.2. లేఖనపద్ధతులు:** రేఫ తర్వాత, బిందువు తర్వాత, ద్విరుక్త హల్లులు రాయటం ఆనాటి లేఖనసంప్రదాయంగా ఉండేది. రేఫమీది హల్లును ద్విరుక్తం చేయటమనే పద్ధతి ఆర్యభాషాసంప్రదాయంనుంచి ఎరువుగా వచ్చింది. ఉదా. తూప్పర్ణన (*SII* 6.584.8,641), కార్త్తిజయ *EI* 27. 231–34. 8, 625–50). ఈ అలవాటు క్రీ. శ. 11 శతాబ్దినుంచి క్రమంగా తగ్గుతూ వచ్చింది. అనుస్వారంమీది పరుషాలను ద్విత్వంచేసే ఆచారం క్రీ. శ. 9–10 శతాబ్దులనుంచి మాత్రమే కనిపిస్తుంది. ఉదా. అంక్క (తె. శా. 1.163–165.59,892–922), గుంట్ట (13*AI*– 50 58, 918–25). ఇది చారిత్రకకాలంలోనే ఆరంభమైన దేశీయాచారం. క్రీ. శ, 11 శతాబ్దివరకూ ఈ పద్ధతి విరళప్రచారంలోనే ఉండేది.

**3.3. లేఖనదోషాలు** : శాసనభాషలో అనేకవిధాల లేఖనదోషాలు కనిపిస్తాయి. శిల్పుల అజ్ఞానంవల్ల, అశ్రద్ధవల్ల వచ్చేవికొన్ని, శాసనకర్తభాషకూ శిల్పిభాషకూ గల భేదాలను నిరూపించేవి కొన్ని, లిఖిత వాగ్వ్యవహారాలమధ్య ఉన్న సంబంధం సూచించేవి కొన్ని, శాసన పాఠకుల అశ్రద్ధవల్ల కలిగిన దోషాలు కొన్ని-ముఖ్యంగా నాలుగురకాల దోషాలు కనిపిస్తున్నాయి. ఉదా. (అ) **శిల్పికృత దోషాలు** : అగ్ని ( = అగ్ని, *SII* 10.637.3, **9/10**); తజ్కి (= తాజ్కి, పై. 623.8, **9/10**); దేగులలంబును ( = దేగులంబును. *NI.* 3.1152–55. 25–26,7); నాంఙ్డు ( = నాండు/నాఙ్డు, ఆం. చా. సాం. వ., 3.16.21.11, 678): బైద్యుమ్బు ( = బైదుమ్బు/బద్యుమ్బు, *EI*, 24 183–193.2.825); వాఙ్డైన (వాఙ్డైన, *SII*, 5.21. 8,1078). (ఆ) **భాషామూలకదోషాలు** : ఎడ్లుకు (= ఎడ్లకు, *SII* 5. 77. 7,1073); ఒకాడు బోళచేత ( = ఒక–, ఆం. వ. 1941–42, 14–15. 2,600–25); వకొట్టి మల్లుర ( కొందఱు–, *SII* 10.614.6,9 ); వేవుగ్గఱవిలాళు (= వేయి గవిళాలు, పై. 595.17, 925–50). (ఇ) **ఉచ్చారణ సూచకాలు** : గోత్త

(—గోత్ర, పై. 644. 47,1060); తళ్చి (=తల్చి, పై. 598.58,925-50); ఖట్గ (=ఖడ్గ, తె.శా. 1.163-65. 11.892-922). (ఈ) **పాఠక కృత దోషాలు**: ఒగోండు (=ఒంగోదు, *EI* 15.249-252. 17,554); పిదెన (=పిడెన, పై. 9.236-41.29,673; చెఱిచిన (=చెఱిచిన, *SII* 10.598.58,925-50), తెల్కొన్థ (=తెల్కొన్ణ, *IA* 7.185-191.13, 668-69); ఉత్తరయాన (=ఉత్తరాయన, రా. ప. సం. 187-88. 21-22, 1018).

**3.4. వర్ణమాల** : అల్పసంఖ్యాకమైన పైదోషాలను విస్మరించి మిగిలిన భాషను పరిశీలించినప్పుడు, ప్రాచీనాంధ్రంలో 23హల్లులూ 10 అచ్చులూ గల దేశ్యవర్ణమాల ఉన్నట్లు తెలుస్తుంది. క,గ ఙ,చ,జ,ట,డ,ణ,త,ద,న,ప,బ,మ,య, ర, (ఱ),ల,ళ,వ,స,హ, (ఴ), అనేవి హల్లులు. వీటిలో ఱ, ఴ లు చారిత్రక కాలంలోనే వర్ణత్వాన్ని కోల్పోయినాయి. అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఎ,ఏ,ఒ,ఓ అనేవి అచ్చులు. 'అయ్, అవ్' లతో భేదకత్వంలేని 'ఐ,ఔ' లు ప్రత్యేకవర్ణాలు కావు. అరసున్న సంధిగతవర్ణం. పఞ్చిన (రా. ప. సం. 71-72.25,847), పన్చిన (భారతి, 5.618.7, 850) శబ్దాలను పోల్చినప్పుడు ఞకారం నకారానికి సవర్ణ మని తెలుస్తుంది. మొదత్స (రా. ప. సం. 187-89, 1018) శబ్దంలోని 'త్స' చేకారానికి బదులుగా రాసింది కాబట్టి ఆనాటికి ఉచ్చారణలో చేకారం ఉందని చెప్ప వచ్చు. చేజేలు చ జ లకు సవర్ణాలనికూడా ఊహించవచ్చు. నిండుసున్న వర్గాను నాసికాలకు పర్యాయసంకేతమేగాని ప్రత్యేకవర్ణం కాదు. సంస్కృత ప్రాకృతాల ప్రభావంవల్ల తెలుగులోకి వచ్చిన సహవర్ణాలు మరికొన్ని ఉన్నాయి. ఖ,ఘ,ఠ,థ, ధ, ఫ, భ, శ, ష, లు కలిపించినా, ఠకారం ప్రత్యేకవర్ణమనదగ్గ శాసనస్థ నిదర్శనం లభించలేదు. ఋ, ౠ, ఌ, లకు ప్రయోగమే లేదు. ఋకారానికి 'రి'కి భేదం లేనందువల్ల అది ప్రత్యేకవర్ణంకాదు.

**3.5. వర్ణవ్యాప్తి** : శాసనభాషలోని వర్ణవ్యవస్థలో కనిపించే కొన్ని ముఖ్యవిశేషా లివి. దీర్ఘాచ్చుమీద ద్విరుక్త హల్లుగాని, 'ఓ' తర్వాత సంయుక్త హల్లుగాని కనిపించవు. ఙ, ఞ, ట, ణ, హ-కారాలు పదాదిన లేవు. పదాది శకారం ఎ, ఒ-కారాలకు ముందు, పదాది ఴకారం అకారానికి ముందు, మాత్రమే కనిపిస్తాయి. రేఫతో సంయుక్తమైన క, త, ద, ప, బ, మ వ లు మాత్రమే పదాదిన కనిపిస్తాయి. ఉదా. క్రొచ్చె (*SII*10.597.21-22, 925-50),

త్రాగిన (పై. 644.106-7, 1060) ద్రోవది (*భారతి*, 1948, 270-90; 869-75. 66, 892-922), ప్రాలును *SII* 4.1015.12, 1084 ), బ్రమన (పై 1300.7,1095), మ్రాను (*IA* 7.185-91 13, 668-69), వ్రచ్చిన (*SII* 10,599.26, 625-50). అకారంతో సంయుక్తమైన క. ప, లు మాత్రమే పదాదిన కనిపిస్తాయి-ఉదా. క్లొచ్చె (పై. 601.27,700-25), ప్లోలనాణ్డు (*EI* 18.58-60.14,732). క,గ,చ,జ,ట, డ,ణ,త,ద,న,ప,బ, మ,య,ఱ,ల,ళ,వ,స లు అజ్మధ్యంలో ద్విరుక్తంగానూ అద్విరుక్తంగానూ కనిపిస్తాయి. ఇదిగాక ర, హ, ఴ, లు అద్విరుక్తంగానే ఉండేవి. రెండేసి హల్లులు కలిసిన సంయుక్తవర్ణాలు అజ్మధ్యంలో ఎక్కువగా ఉండేవి. మూడుహల్లులు కలిసినవి ఎరువు మాటల్లోకూడా చాలా తక్కువగా ఉండేవి.

**3.6. తాలవ్యీకరణం :** పదాదివర్ణాల చరిత్రలో కొన్ని ముఖ్య పరిణామాలను మాత్రమే ప్రస్తావిస్తాం. తాలవ్యాచ్చులకు ముందున్న ప్రాచీన ద్రావిడ కకారం తెలుగులో చకారంగా మారటం సాధారణ లక్షణం. ఈ తాలవ్యీకరణం క్రీ. పూ. 300 లకూ క్రీ. శ. మొదటి కొద్ది శతాబ్దులకూ మధ్యకాలలో జరిగి ఉంటుందని *బరో* (*BSOAS*, 11.122-39, ముఖ్యంగా 126), మూలద్రావిడంలోనే జరిగి ఉంటుందని *కోరాడ రామకృష్ణయ్యా* (*JVOI*, 15.76 ff.), దక్షిణద్రావిడంనుంచి తెలుగు విడిపొయ్యేకాలంలోనో క్రీ. శ. 5వ శతాబ్దికి ముందుకాలంలోనో ఆరంభమై తెలుగులో సాహిత్యం ఏర్పడటానికి ముందున్న ప్రాచీనాంధ్ర కాలానికి పూర్తయి ఉంటుందని *భద్రిరాజు కృష్ణమూర్తి* (1961, § § 1.11-18) భావించారు. క్రీ.శ. 395-410 నాటి పెదవేగిశాసనం లోని 'కమ్బురాఞ్చెరువు' (*భారతి* 1.110-22.15).'చెఞ్చెఱువు' (పై 31-14), అనే మాటల్లోని 'చెఱువు' మూల ద్రావిడ శబ్దం *కెఱియ్ నుంచి ఏర్పడ్డది కాబట్టి, ఆనాటికే తాలవ్యీకరణం భాషలో స్థిరపడ్డదని చెప్పవచ్చు. 'కిరాత' శబ్ద భవమైన 'చిలాత' శబ్దం (*మెహందాళే* 1948, పీఠిక - 23, పే. 120,23, మొ.) క్రీ. శ. 3వ శతాబ్దినాటి ఒక ప్రాకృతశాసనంలో (నాగార్జునకొండశాసనం *FI*, *EI*. 20. 1-7,20.61-71) లభిస్తున్నది. పై శాసనాధారాలనుబట్టి ఈ ధ్వనిపరిణామం క్రీ. శ. నాలుగోశతాబ్దంలో మధ్యాంధ్ర దేశంలో మొదలైందని చెప్పాలి. అయితే క్రీ. శ- ఎనిమిదో శతాబ్దంవరకూ 'చేయు' ధాతువు పూర్వరూప మైన '*కేయు' రూపాలు లేఖనంలో కనిపిస్తున్నాయి. భీమునిపట్నం తాలూకా

ముంజేరులోని క్రీ. శ. 709 నాటి శాసనంలో 'కేచిన' (CP 10 of 1908-9. *I*). అనే రూపం, ఉదయగిరి తాలూకాలోని భైరవకొండ శాసనాల్లో 'కేసిన' (*SII* 10.54. 1-2, 7), 'కేసిరి' (పై. 47,7) అనే రూపాలు, తాడిపత్రి తాలూకా కొత్తూరులోని ఒక శాసనంలో 'కేసి' (*EI* 30.69-71.5, 699-700) అనే రూపం, కనిపిస్తాయి. ఆదే కాలపు నెల్లూరుజిల్లా శాసనాల్లో 'చేయు' రూపాలు కూడా ఉన్నాయి. అంటే 'కేయి' రూపాలు ప్రాచీనలేఖనసంప్రదాయంగా మాత్రమే నిలిచాయిగాని ధ్వనిపరిణామం అప్పటి కెప్పుడో పూర్తయిందని అర్థం.

**3.7. పదాది సరళాలు :** ప్రాచీనాంధ్రంలో జరిగిన ప్రధానధ్వని పరిణామాల్లో పదాది సరళాల విషయం ఒకటి. అసలు ప్రాచీన ద్రావిడంలోనే పదాదిన సరళాలు లేవని ఆర్. కాల్డ్వెల్ (191.338-39), కె. వి. సుబ్బయ్య (*IA* 38.193-221). *టి. బరో* (*BSOAS* 9.711-22), *భద్రిరాజు కృష్ణమూర్తి* (1961. §§ 1.55,1.70-78), వాదిస్తుండగా, ఉన్నవని జూల్ బ్లాక్ (*IA* 48. 194-95), *గోదవర్మ* (*BSGAS* 8.562), *కోయిపర్* (పై. 9.987), *ఎ. మాస్టర్* (పై 1008), *ఎస్. కె. ఛటర్జీ* (*IL* 14. 9-15)లు విశ్వసించారు. శాసనభాషనుబట్టి చూస్తే మొదటివారి వాదాన్ని సవరించనక్కరలేదనిపిస్తుంది. అందుకివి ప్రధాన కారణాలు : (i) క్రీ. శ. 7వ శతాబ్దికి ముందున్న వ్యుత్పత్తి స్పష్టంగా తెలిసిన దేశ్య పదాల్లో సరళాదులు కనిపించవు. (ii) క్రీ. శ. 6వ శతాబ్దినుంచి అల్పాల్పంగా సరళాది తద్భవాలున్నాయి. (iii) పరుషాది సరళాది రూపాలు రెండూఉన్న పదాలు ఇంచుమించు ఏకకాలంలో శాసనభాషలోనే కనిపిస్తున్నాయి. ఉదా. ఖడ్గుగ (*EI* 10. 100-6. 28,674); గడ్డుగ *SII* 10.217.7, 745-801). (iv) పదాది సరళాలున్న కొన్నిమాటలకు స్థిరాది పర్యాయపదాలు కలిపిస్తున్నాయి. ఉదా. బాణ (పై. 28.3, 719-20): వాణ (*EI* 30.69-72.2, 699-700). (v) ఎరువు మాటల్లోని పదాదిసరళాలనే పరుషీకరించిన నిదర్శనాలున్నాయి. (vi) వ్యుత్పత్తి నిర్ణయం సరిగా సాధ్యపడని 'గుఱంబు, గెల్చి' వంటి నాలుగైదు మాటలనుబట్టి మూలద్రావిడంలో పదాది సరళా లున్నాయనటం సిద్ధాంతంకాదు. (vi) పదాది సరళాలున్నా వ్యక్తినామ స్థలనామాల వ్యుత్పత్తి సందిగ్ధ మయింది.

సరళాదిపదాలు రెండు రకాలు. పదాదిపరుషాలను సరళీకరించినందున ఏర్పడ్డవి ఒకరకం; వర్ణవ్యత్యయ కారణంగా సరళాదిపదాలైనవి రెండోరకం. వర్ణవ్యత్యయంవల్ల ఏర్పడ్డవి మళ్ళీ రెండురకాలు : అద్విరుక్త సరళాదులు, సంయుక్తాక్షరాదులు. ప్రస్తుతం వర్ణవ్యత్యయంవల్ల ఏర్పడ్డ అద్విరుక్తసరాళాది పదాల విషయం చూద్దాం.

**3.8. వర్ణవ్యత్యయం :** ప్రథమాక్షరం మీదనుంచి ద్వితీయాక్షరం మీదికి ఊనిక మారినందువల్ల వర్ణవ్యత్యయం పురాణాంధ్రంలోనే ఏర్పడిందని *కె. వి. సుబ్బయ్య* (*IA* 209) వాదం. *ఎల్. వి. రామస్వామి అయ్యర్* (*QJMS* 22 448-80), *ఎం. బి. ఎమెనో* (Lg. 21. 191-192)లు కూడా ఈ వాదాన్ని పరిశీలించారు. *ఎ. మాస్టర్* ఈ ధ్వని పరిణామానికి 'ప్రోఎన్థెసిస్ (Proenthesis) అనే పేరు (*BSOAS* 12. 340-64) పెట్టారు. వర్ణ వ్యత్యయంతోబాటు అచ్సంకోచంకూడా జరిగిందని *భద్రిరాజు కృష్ణమూర్తి* (1961 § § 1.121-88) వివరించారు. ఈమార్పు(అ' హఅ$^2$>హఅ$^2$అ$^3$>హఅ) కారణంగానే తెలుగులో పదాదిన గ,డ,ద,వ,ర,ఱ,ల,ళఱ, కారాలుగల శబ్దాలు ఏర్పడ్డాయి. ఉదా. గారి (*భారతి* 5.618.7,850), దగ్గుంబత్తి (*IA* 12.91-95.55,945-70), దాని (*శా. ప. మం.* 1.2-3.41, 898-934), వాన్ఠు (*SII* 10.606.18-19,600-25), రెణ్డు (*EI* 27.234-36.11, 625-50), ఱేని (*భారతి* 5.618.7,897), లేచి (పై. 473-84,848), ళోన (*SII* 10.623.8,9/10), ఱచ్చు (పై. 24. 12, 682). వీటిలో 'గారి' అనేది 'వారి' (*NI* 3.1151.4,650) నుంచి ఏర్పడ్డది. 'ళోన'కు పూర్వరూపమైన 'ఒళన' (*ఆం. ప.* 1941-42. 5-15.1, 600-25) శాసనభాషలోనే లభిస్తున్నది. 'ఱచ్చు' కు పూర్వరూపమైన *అఱియు ధాతురూపాలు 'అఱిసిన' (*SII* 10. 599.25,625-50) మొ. శాసనాల్లోనే ఉన్నాయి. ఈ మార్పు శాసనభాషాకాలానికి చాలా ముందుగానే పూర్తయిందని చెప్పవచ్చు.

**3.9. పదాదిసంయుక్తాక్షరాలు :** వర్ణవ్యత్యయ, అచ్సంకోచాలవల్ల పదాదిన ఏర్పడ్డ సంయుక్తాక్షరాలు క్రీ. శ. 4/5 శతాబ్దినుంచీ శాసనభాషలో క్రమంగా కనిపిస్తాయి. పదాది క్ట,ప్ట వ్ట లు క్రమంగా క్ర,ప్ర,వ్ర లుగా క్రీ. శ. 7వ శతాబ్దికే మారినట్లు చెప్పవచ్చు. ఉదా. క్ట్వొచ్చె (*EI* 27.238-40, 27,700-25): క్రొచ్చె (*SII* 10.597.20-21, 925-50); ప్టాన్ద్రాఱంబు (*JAHRS*

5.51-56.21,768)> ప్రా.-*వ్ట> వచ్చిన (*SII* 10.599.26, 625-50). క్రీ శ. 4/5 శతాబ్దినాటి-తొఱె శబ్దం (*భారతి* 1.110-22.11, 395-410) క్రీ. శ. పదో శతాబ్దినాటి త్రోవ (*EI* 5.139-42.27, 945-70) కు పూర్వరూపం. మాధ్యమికరూపం *త్ఱోవ అని ఉండవచ్చు. అంటే క్రీ. శ. పదో శతాబ్దికే సంయుక్తాక్షరగతమైన శకటరేఫ సాధురేఫగా మారిందని భావించవచ్చు. పదాది సంయుక్తాక్షరగతమైన సాధురేఫ క్రీ. శ. పన్నెండో శతాబ్ది మధ్యకాలంలో రాలిపోయి ఉంటుందని పూర్వులు విశ్వసించారు (కృష్ణమూర్తి 1961 § 1.145). అయితే ఈ మార్పు క్రీ. శ. ఏడో శతాబ్దంలోనే మొదలయిందనటానికి కొన్ని నిదర్శనలు లభిస్తున్నాయి. ఉదా. అయ్యవోళు (*భారతి* 16.618-19.13,691-92), గొచ్చి (*SII* 10.621.3, 9/10), పోలమ (పై. 620.5,914), పప్పు (పై. 4.1015.9, 1084), మాని (పై. 10.646.29,1062). కాని ఈ మార్పు బహు విరళంగా ఉండేదని, చారిత్రకకాలంలో పూర్తికా లేదని చెప్పాలి.

**3.10. పదాది య, వ లు :** పదాది యికార వకారాలు క్రమంగా క్రీ. శ. 6, 9 శతాబ్దులనుంచే లేఖనంలో కనిపిస్తున్నాయి. ఉదా. (1) యుళ్లలూరు (*EI* 9.233 –3 6.20, 426), యలమ్మ (*SII* 10.29.16,971). (ii) వకొట్టి (పై. 614 6,9), వుద్దిని (*EI* 30.280-84. 12,972). ఇవి వర్ణాత్మకలేఖనంలో తొలిగిపోతాయి.

**3.11. పదమధ్య గ, వ లు:** పదమధ్యంలో ప్రత్యయాత్మక గ, వ కారాలు మారుపాటు పొందటం శాసనభాషలో కనిపిస్తుంది. ఈ మార్పుల్లో ఏది ఏ ప్రాంతంలో ఆరంభమయిందో చెప్పలేముగాని, క్రీ.శ. పదకొండో శతాబ్దంలో ఇవి పరస్పరం మారిన వనటానికి సాక్ష్యముంది. ఉదా. (i) -గ-> -వ-: నాలువ (*NI* 3.1151.6-7, 650), నాలుగు (*SII* 4.1029.10. 1100). (ii)-వ->-గ-. దణ్ణువు (*భారతి* 5.618.7,897), దణ్ణుగు (*CIT* 26.13, 1079).

**3.12. పదమధ్య న, ణ లు :** మూలద్రావిడ *ణకారం తెలుగులో నకారంగా మారింది. ఈ మార్పు క్రీ శ. ఏడో శతాబ్దిలో మొదలై తొమ్మిదో శతాబ్దికి పూర్తయినట్లు తెలుస్తుంది. ప్రొద్దుటూరు తాలూకాలో దొరికిన క్రీ. శ. 626-50 నాటి ఒక శాసనంలో ణకార యుక్తమైన 'ఆణతి' (*EI* 26.284-86.15), నకారయుక్తమైన 'పని' (.32) అనే రెండు రూపాలూ దొరుకు-

తున్నాయి. క్రీ. శ. తొమ్మిదో శతాబ్దినాటి ఒక శాసనంలో 'తన' శబ్దానికి బదులుగా 'తణ' (*SII* 10.639.11,825) అనే విలోమ లేఖనం కనిపిస్తుంది. ప్రాచీన ణకారం లేఖనంలో క్రీ. శ. పదకొండో శతాబ్దిదాకా అక్కడక్కడ కనిపించినా (కౌణం, పై. 647.30,1097) ధ్వనిపరిణామం తొమ్మిదో శతాబ్దికే పూర్తయిందనాలి.

**3.13. పదమధ్య డ, ణ, లు :** అజ్మధ్యడకారం కొన్ని రూపాల్లో ణకారంగా మారటం క్రీ. శ. ఏడో శతాబ్దిలో పల్నాటిసీమలో ఆరంభమయిందని నిరూపించవచ్చు. ఉదా, కొడికిం (*EI* 15.249-52.17, 554) : కొణికి (పై 31.74-80 21,669). ఇది ధ్వనిసూత్రంకాదు. అందువల్ల ఈ మార్పు భాషలో పర్యాప్తంగా లేదు.

**3.14. సాధుశకటరేఫలు :** పెదవేగిశాసనంలో 'అఱుతొఱె, (భారతి 1.110-22. 10-11, 395-410), 'చెఱ్చెఱువ' (పై 13-14), 'కమ్బురాఱ్చెరువ' (పై.15) అనే మాట లున్నాయి. రెండో మాటలో ఉన్న శకటరేఫ అదే పదంలో మూడో మాటలో లేదు. అందువల్ల అప్పటికి చాలాముందు కాలంలోనే ఆ రెండు ధ్వనులూ ఒకే వర్ణంగా మారాయని చెప్పవచ్చు. క్రీ. శ. ఏడో శతాబ్దినాటి 'ఇరుకుటూరు' (*EI* 31. 74-80. 39 - 40, 669), ఎనిమిదో శతాబ్దినాటి 'చిట్టేరు' (*JAHRS* 5.51-56.19,763). 'నూర' (*SII* 10.37.2,8) వంటి మాటల్లో శకటరేఫ లేదు. అదే కాలంలోని 'పడమఱలూఱి' (పై. 605. 1-2 8) అనే పదంలో 'ఊరు' శబ్దంలో ఉండరాని శకటరేఫ వచ్చి చేరింది. పైవాటిలోని ఏడో శతాబ్దిపదం పల్నాటిది. ఎనిమిదో శతాబ్ది రూపాలు విశాఖనుంచి అనంతపురం వరకున్న భూభాగాలవి. అందువల్ల రేఫ ఱకారాల భిన్న వర్ణత్వం అజ్మధ్యంలో క్రీ. శ. ఏడో శతాబ్దికిముందే మధ్యాంధ్ర దేశంలో లోపించటం మొదలుపెట్టి ఎనిమిదో శతాబ్దికి దేశమంతా అల్లుకుపోయిందని చెప్పవచ్చు.

**3.15. పదమధ్య ల, ళ లు :** మూలద్రావిడ *ళకారం క్రీ. శ. ఏడో శతాబ్దికే లకారంగా మారటం మొదలుపెట్టి తొమ్మిదో శతాబ్దికి పూర్తిగా మార్పు చెందింది. నరసరావుపేట తాలూకాలోని ఒక శాసనంలో 'కొలచి' (పై. 6.250.7,842-98) అనేరూపం కనిస్తుంది. అయితే ఏడో శతాబ్దికే ప్రాచీన ద్రావిడ *లకారం ఉండవలసినచోట్ల ళకారం రాయటమనే విలోమలేఖన పద్ధతి

వచ్చినందువల్ల *ళకారం లకారంగా అప్పటికే మారిందనాలి. ఉదా. అయ్యవోళు (భారతి 16.613-19.13, 691-92), కళర్ (పై. 5.935-48. 13,675), తళవర (*EI* 31.74-80. 22,669).

**3.16. పదమధ్య ట, డ లు**: అజ్మధ్య టకారం క్రీ. శ. ఏడో శతాబ్దికే డకారంగా మారింది. చోడ (పై. 27. 229-30. 1,600-25), కుడుచు (*SII* 6.584.10,641) వంటివి ఇందుకు నిదర్శనాలు.

**3.17. వర్ణసమీకరణం I** : ప్రాచీనాంధ్రంలో వర్ణసమీకరణం కారణంగా అజ్మధ్యంలో ద్విరుక్తమైన క,గ,చ,ట,డ,ణ,త,ద,న,ప,మ,య,ఱ,ల,ళ, వ,స లు ఏర్పడ్డాయి. ఈమార్పు సాహిత్యం ఏర్పడటానికి ముందు కాలంలో జరిగిందని *బరో*(*BSOAS* 11.129),కృష్ణమూర్తుల(1961, §§ 1.179-80)అభిప్రాయం. శాసనాధారాలనుబట్టి క్రీ. శ. నాలుగో శతాబ్దినాటికే ఈ మార్పు వచ్చినట్లు చెప్పవచ్చు. ఈ సమీకరణం రెండు విధాలు: (i) (హ) అహ–హ>(హ)అ–హహ ఉదా. ఇచ్–చిన(*EI* 27.225-28.4 575-600). (ii) (హ) అహ- అ>(హ) అహహ- ఉదా. కొట్ట్–ఊరు (*నర్మ్కార్*, 1942, 1.256-57.19, 330-75). ఈ మార్పుచెందని 'పెర్దల్, (*రా. వ. సం.* 71-72.27,847) వంటి రూపాలు క్రీ. శ. పదకొండో శతాబ్దిదాకా క్వాచిత్కంగా లేఖనంలో నిలిచినా, ధ్వనిపరిణామం మటుకు అప్పటికి ఏడెనిమిది శతాబ్దుల కిందనే ఆరంభమయింది.

**3.18. అజ్మధ్య ద్విరుక్త హల్లులు** : ద్విరుక్తణకార ళకారాలు కూడా చారిత్రక కాలంలోనే ద్విరుక్త నకార లకారాలుగా మారిపోయాయి. క్రీ. శ. ఎనిమిదో శతాబ్దిలోని 'కొణ్ణ' (*SII* 10.611.2) అనే శబ్దం 9/10 శతాబ్దికి 'కొన్న' (*తె.శా.* 1.163-65. 70-71, 881-922)గా మారింది. క్రీ. శ. పదో శతాబ్దిలోకూడా 'ఉణ్ణ' (*EI* 30.280-84.7,972) వంటి రూపాలు లేఖనంలో నిలిచినా, ఆనాటికే ధ్వని పరిణామం పూర్తయినట్లే. అజ్మధ్య ద్విరుక్తళకారం క్రీ. శ ఎనిమిదో శతాబ్దికే ద్విరుక్త లకారంగా మారింది. ఉదా. పళ్ళి (పై. 31.74-80. 21.669), -పల్లి (CP 2, 1914-15. 26, 764-99).

**3.19. వర్ణసమీకరణం *II*** : అజ్మధ్యంలోని భిన్న హల్లులు సమీకరణం పొందినందువల్ల చారిత్రకాలంలో అజ్మధ్యసంయుక్త హల్లులు

(అహ[1]హ[2]అ) మరికొన్ని ఏర్పడ్డాయి. అలాంటి మార్పుల్లో 'ఞ్చ' కారం 'న్చ'గా మారటమొకటి. అది క్రీ. శ. తొమ్మిదో శతాబ్దికే పూర్తయింది. ఉదా. పఞ్చిన (భారతి 5.478-84.5,848), పన్చిన (పై. 618.7,850). 'శ' క్రీ. శ. ఏడో శతాబ్దికే 'ల్క'గా మారింది. ఉదా. పల్కిన (EI 230-31.7, 625-50). సంయుక్తాక్షరగతమైన శకటరేఫ ఆకాలంలోనే సాధురేఫగా పరిణమించింది. ఉదా. తూఱ్పు (భారతి 5.935-48. 11,875), తూర్పునన (SII 6.584.8,641). 'ణ్ట'కారం 'ణ్డ, ణ్ఠ, ణ్డ్రి', లుగా మారటంకూడా అప్పుడే జరిగింది. ఉదా. తాన్టికొన్ట (IA 9.102-3.7,5), కొణ్డ (EI 27.231-34.8,625-50), పణ్ణెణ్డు (SII 10.599.31, 625-50), వాణ్డ్రి (పై. 4.1015.12,1084); ఇన్టు. (పై. 10.46.2,7), ఇన్దుల (పై. 10.599.32,625-50). 'శ్ప'కారం క్రీ. శ. తొమ్మిదో శతాబ్దిలో 'ల్ప'గా మారింది. ఉదా. వెశ్పు (పై. 6.585.2,633-63), వెల్పూరు) (EI 5. 122-26.29,844-88). సంయుక్తాక్షర గతమైన సాధురేఫ వర్ణసమీకరణంవల్ల మీది హల్లుతో కలిసి క్రీ శ. తొమ్మిదో శతాబ్దినుంచి అజ్మధ్యద్విరుక్తహల్లుగా మారింది. ఉదా. ఉపుఱ్ఱటూరు (SII 1.31-36.25, 794-842), ఉప్పుటూరు (భారతి 1.90-110 65,844-88).

**3.20.** ఇయ>-య : పదమధ్యాచ్చు లోపించినందువల్ల అజ్మధ్యంలో సంయుక్తాక్షరం ఏర్పడటం క్రీ. శ. పదకొండో శతాబ్దిలోనే జరిగింది. దీపశబ్ద భవమైన*దివియనుంచి ఏర్పడ్డ దివ్య (SII 4.1317.6,1081), దివ్వ (AR 1933 Ap. B. 56.7,1072) లు ఆనాటి శాసనాల్లో ఉన్నాయి. తిక్కన కవితలో ఈనాటి శబ్దాలున్నందువల్ల క్రీ. శ. పదమూడో శతాబ్దికి ఈ పరిణామం పూర్తయిందని భావించవచ్చు.

**3.21.** అచ్చుల హ్రస్వదీర్ఘతలు : ప్రథమాక్షరంలో హ్రస్వదీర్ఘాచ్చులుండి అర్థభేదంలేని జంటమాటలు కొన్ని శాసనభాషలో కనిపిస్తాయి. ఇవి రెండు రకాలు. (i) అక్షరసంఘటనలో ఇందువల్ల మార్పురానిని. ఉదా. ఎమ్బది (EI 30.69-71.4,699-700), ఏమ్బది (పై. 27.231-34.11,625-50). (ii) హ్రస్వాచ్చుమీద ద్విత్వహల్లుగాని దీర్ఘాచ్చుమీద అద్విరుక్తహల్లుగాని ఉన్నవి. ఉదా. జూవి (SII 10.217.7,745-801), జువ్వి (EI 5.127-31-31, 892-922). ద్వితీయాక్షరంలో హ్రస్వదీర్ఘభేదముండి అర్థభేదం లేని

పదాలు కొన్ని కనిపిస్తున్నాయి. ఉదా. కళర్ (భారతి 5.935-48.13,675), కళార్ (*EI* 30.12.26-27,8). 'కలవారు' నుంచి అర్వాచీనకాలంలో 'కలార్' ఏర్పడ్డదనే మన వ్యాకర్తల భావం ప్రామాదికమని ఈ నిదర్శన నిరూపిస్తుంది.

**3.22. అనుస్వారం :** పరుష సరళాలకుముందు అనుస్వారం వాడట మనేది ఆర్యభాషా ప్రభావంవల్ల చాలా ప్రాచీనకాలంలోనే తెలుగులోకి వచ్చిన సంప్రదాయం. పదాంశాల్లో, వాటి అవధుల దగ్గిరా, పదాంతంలోనూ పరసవర్ణా దేశం చేయటమో అనుస్వారాన్ని దానికి బదులుగా వాడటమో క్రీ. శ. నాలుగో శతాబ్దినుంచీ కనిపిస్తుంది. ఉదా. (i) పదాంశంలో : పణ్బూర (పై. 6.315-19. 24,234), కంగూర (పై. 17.327-29.3,4). (ii) పదాంశావధివద్ద ; చెఞ్చె ఱువ (భారతి 1,110-22. 13-14, 395-410). విలెంబలి (పై. 334-37.9, 610), (iii) పదాంతంలో : ఏళన్ (*EI* 27.221-25.5, 575-600), ప్రవర్తమానం (పై. 29.160-64.5,680). వ్యాకరణాలు స్పష్టంగా నిషేధించక పోయినా సంప్రదాయపండితులు తప్పుగా భావించే పంక్త్యాది అనుస్వార లేఖనం కూడా క్రీ. శ. ఏడో శతాబ్దినుంచి శాసనాల్లో కనిపిస్తుంది. ఉదా. వులొ - ంబున ( *SII* 6.584.6 - 7,641 ). అనుస్వార పరసవర్ణాల్లో ఏది రాయాలో తేల్చుకోలేక (i) ఒకే పదంలో రెండూ రాసినవీ (ii) ఏదో ఒకటి రాయబోయి తప్పుగా రాసినవీ కనిపిస్తాయి. ఉదా. (i) నాంణ్బు (*JAHC* 3.16-21.11,) 678), (ii) సఙ్వత్సరంబు (*EI* 30.12-8,8). క్రీ. శ. నాలుగో శతాబ్ది నుంచి అనుస్వారం వాడుకలోకి వచ్చినా ఏడెనిమిది శతాబ్దులనాటికిగాని ఈ వాడుక నిలదొక్కుకోలేదని ఈ స్థితికి అర్థం. మొత్తంమీద అనుస్వారంకన్న పర సవర్ణాదేశమే అధిక ప్రాచుర్యంతో ఉండేది. క్రీ. శ. పదకొండో శతాబ్దినుంచి అనుస్వారలేఖనం ప్రచురతరమయిందికాని పూర్వమర్యాద పూర్తిగా తొలగి పోలేదు. ఙ, మ లకు బదులుగా బహుళంగాను, ఞకారానికి బదులుగా సమాన వ్యాప్తితోను, ణ, న లకు బదులుగా విరళంగానూ, అనుస్వారం వాడుకలో ఉండేది. దేశ్యశబ్దాల్లో పరుష సరళాలకు ముందు, తద్భవాల్లో బ, వ, లకు ముందు కూడాను, తత్సమాల్లో మహాప్రాణాలకూ య, స, శ, హ లకు ముందుకూడాను అనుస్వారం కనిపిస్తుంది.

**3.23. అర్ధానుస్వారం :** అర్ధానుస్వారానికి లిపి సంకేతంలేదు.

మొదట బిందువుగా ఉండి తరవాత సున్నగా మారిన సంకేతాంశం పూర్ణార్ధ బిందువులను రెంటినీ సూచించేది. ఛందస్సునుబట్టి అర్ధానుస్వారమూలరూప నిరూపణం సాధ్య మవుతుంది. కొన్నిసమయాల్లో అనుస్వారానికి బదులు పరసవర్ణాదేశమే లేఖనంలో ఉన్నా, ఛందస్సునుబట్టి అరసున్న (అనునాసిక్యం) ఉన్నట్లు నిరూపించవచ్చు. ఉదా...ప్రభుం బణ్డరంగుం బణ్చిన...పణ్డెణ్డుంగొని...వేంగినాణ్టిం... (*భారతి* 5.473-84.4-6,848) అనేభాగాన్ని '*ప్రభుఁ బండరంగుఁ బణ్చిన... వేఁగినాఁటిఁ' అనే చదవాలి. 'గవఱ్వంబ్... కొట్టంబుల్... పై. 3, 6) అనేచోట్ల '* గర్వమ్...కొట్టముల్' అనే పఠించాలి. లేదా ఛందోభంగం. బిందుపూర్వక బకారాన్ని మకారానికి బదులుగా రాయటం క్రీ. శ. ఏడో శతాబ్దంనుంచీ ఆచారంగా ఉండేదని గ్రహించాలి. సంప్రదాయ పండితులు దీర్ఘం మీద అర్ధానుస్వారం లేదంటారు. కాని 'కూంతు సరియ పోల్పం గాంత లెన్దు' (*రా. ప. సం.* 25-29.11, 1065)వంటివి అందుకు విరుద్ధంగా ఉన్నాయి. నన్నెచోడుకి కవిత్వంలోని *పింఛె* ఖలుండు దక్షుఁడను వీఁటఁడి పాఱుఁడు...బ్రహ్మండము ..'మొదలైన ప్రయోగాలను ఇక్కడ అనుసంధించినప్పుడు ప్రాచీనాంధ్రంలో మాండలికంగా నయినా అర్ధానుస్వారం ఉండేదని తెలుస్తుంది. బిందువు మీది పరుష సరళాలను ద్విత్వంచేసి పూర్ణబిందువును చేయక ఖండబిందువును పూర్వులు నిర్దేశించేవారన్న విశ్వాస మొకటి ఉంది. అయితే ఈ ఆచారం అన్ని సందర్భాల్లోనూ చారిత్రక కాలంలో *నియతంగా* కనిపించదు. ఉదా. (i) పూర్ణబిందువే ఉండవలసినా ద్విత్వహల్లు లేని శబ్దాలు : పణ్డురంగు (*భారతి* 5.792.10, 848-49). బింకమ్ (పై. 618.7,897); (ii) ఖండబిందువు లేకపోయినా ద్విత్వహల్లులున్న శబ్దాలు : సామన్త (పై. 473-84.5, 848). ఎత్తించ్చె *EI* 4.314-18.20, 1075-76). అర్ధానుస్వారం పూర్వాచ్చును అనునాసికంగా ఉచ్చరించటాన్ని సూచిస్తుందని కేతన (ఆం. భా. భూ. 30,56,57) మాటలనుబట్టి ఊహించాలి. అంతకు మించిగాని, అందుకు విరుద్ధంగాగాని నిదర్శనాలు లేవు. పర్యాయోపయోగం కారణంగా అనుస్వారం అనునాసిక వర్ణాలకు ప్రత్యామ్నాయి సంకేతమేగాని ప్రత్యేకవర్ణం కాదని చెప్పవచ్చు.

**3.24. అచ్సంధులు :** పదాంతంలోని అత్తు సంధిలో లోపించటం క్రీ. శ. 9/10 శతాబ్దినుంచి కనిపిస్తుంది. యడాగమంగల రూపాలు క్రీ. శ. ఏడోశతాబ్దినుంచి కనిపిస్తుంటే ఆరో శతాబ్దిలో పదాంతాత్తు నిలిచి ఉన్నట్లు నిదర్శనా లున్నాయి.

ఉదా. సంధికి-ఇడ్డట్లు (శా. వ. మం. 1.2-3.41, 898-934); విసంధికి-పన్నస ఇరవది (*EI* 27.225-28. 12-13, 575-600). యడాగమానికి-కలయన్త (*SII* 6.585.11, 633-63); విరళమైన వడాగమానికి- ఎఱ్ఱి వుమ్మయును (పై. 10.29.18, 971).

ఇత్సంధి ప్రాచీనమై క్రీ. శ. 9/10 శతాబ్దివరకు యడాగమం వికల్పంగా ఉండి తరవాత బహుళమయింది. ఉదా. సంధికి-శ్రీ కెల్లన్ (తె. శా. 1.163-65. 41-42, 892-922); విసంధికి-ఇరుపఱయది ఏను (*AR* 392/1904. 11-13, 575-600); యడాగమానికి-ఇరవది యాదినాల్కు (*EI* 27.225-28. 13-14, 575-600).

ఉత్సంధి మొదటినుంచీ బహుళంగానే ఉండేది క్రీ. శ. ఏడో శతాబ్దినుంచి యడాగమం కనిపిస్తూ పదకొండో శతాబ్దికి బహుళవ్యాప్తికి వచ్చింది. అంటే ఉత్సంధి నిత్యం కాకపోగా వైకల్పికంగానే ఉండేదని అర్థం. ఉదా. సంధికి-ఈడ్లందు (*SII* 6-585.9,633-63); విసంధికి- రేనాణ్డు ఏళన్ (*EI* 27.231-25.4-5, 575-600); యడాగమానికి - వారు యిఱ్ఱికాను (*SII* 6.584.10, 641).

పదాంతాచ్చులు హల్లుకు ముందుకూడా లోపించటం విరళంగా ఉండేది. ఉద్దా. అన్వారు (అం. వ. 1941-42. 5, 625-50), నల్తుముడ్లు (*AR* 282/1949-50.9,8). శాస్త్రీయంగా చెప్పాలంటే హలంత శబ్దాలమీద అజాగమం రాలేదనాలి. ఏకాక్షరధాతువుల తుదిహల్లుకు అచ్చులముందు క్రీ. శ. ఏడో శతాబ్ది నుంచి ద్విరుక్తత కనిపించేది. ఉదా. అన్నేణ్టన్ (భారతి 23.182-86.5, 641). నన్నయగారి 'అన్నిష్టసఖి' ఈలాటిదే.

**3.25. గసడదవాదేశం** : గసడదవాదేశం క్రీ. శ. 8-11 శతాబ్దుల మధ్య నిత్యంగాను, అంతకుముందు వైకల్పికంగానూ ఉండేది. డాదేశానికి శాసనస్థ నిదర్శనాలు దొరకలేదు. ఉదా. సంధికి : అణతి-గాను (*EI* 27.234-36.15 625-50). పణి—సేసిన (*SII* 6.584.5,641), స్థితి-దప్పి (శా. వ. మం. 1.2-3.39, 898-934), ఏను-వుట్లు (*SII* 6.585.10, 633-63). విసంధికి : రెండు-తోటకు (*EI* 27.234-36.11, 625-50), అడ్లు - పట్టు (భారతి 5.935-968.8-9, 675). ఈ ఆదేశం సంప్రదాయ వ్యాకరణాల్లో చెప్పిన దానికన్నా ఎక్కువ వ్యాప్తిలో ఉండేది.

తత్సమాల్లో, ద్రుతాంతాలమీద, విశేషణాలమీద, క్త్వార్థకాలమీద, సమాసగత సంవృతాక్షరాల్లో గసడదవాదేశం జరిగేది. ఉదా. తత్సమాల్లో : కలయంత-గాలంబు (*SII* 6.585.21, 633-63), విత్తుపట్టు - ప్రసాదక్షేసిరి ( *EI* 7.177-192.74, 945-70): ద్రుతాంతాలమీద : నాలును - వుట్టు *NI* 1.291-92.2-3, 7). కట్టె-సూరె (*SII* 6.250.7, 742-98), ఇన్దు-, ప్రత్యక్షబ యన్నన్ (శా. ప. మం. 1.2-3. 26-27, 898-934); విశేషణాలమీద: ఇరు-వుట్టి ( *SII* 6.585.9, 633-63 ); స్థితి - సెత్ప్రి (*SII* 10.645.57.1060 ); క్త్వార్థకాలమీద : పొంది-గాని (తె. శా. 1.163-65.6, 892-922; సంవృతాక్షరాల్లో : నిడు-గట్ట (*EI* 18.313-16.15, 696-709), దమ్మ-వురంబున (*భారతి* 5.473-84. 10-11, 848). అయితే మొత్తంమీద శాసనభాషలో ఈ ఆదేశం చాలా విరళంగా ఉండేది.

**3.26.** **ద్రుతం**, **ద్రుతసంధి** : ద్రుతమన్నది ప్రత్యయాంతంలోని అనునాసిక వర్ణమేగాని మరొకటికాదు. క్రీ. శ. 6-9 శతాబ్దుల మధ్య కాలంలో ద్రుతసంధి వైకల్పికంగానే ఉండేది. కాలక్రమాన అది బహుళంగా పర్యవసించినా, క్రీ. శ. పదకొండో శతాబ్దిలో కూడా ఇది నిత్యసంధి కాలేదు. అయితే క్రీ. శ. తొమ్మిది పది శతాబ్దుల్లోని పద్యశాసనాల్లో మాత్రం ద్రుతసంధి నిత్యంగా ఉండేది. ద్రుతాంతాలమీది పరుషాలు సరళాలు కావడం పదిరకాలుగా ఉండేది. ఉదా. ద్వితీయాంతాలమీద : దీని-గాచినవారు ( *NI* 3.1151.10, 650) ; తృతీయాంతాలమీద : వైదుంబులచేతం-బట్టం కట్టబడి ( *SII* 10.640.4, 9/10 ); చతుర్థ్యంతాలమీద: నాకు- బడిసేసిన ( పై. 6.584.5, 641); సప్తమ్యంతాలమీద : నుద్దపక్షబున-బఖ్ఖమియు (*JAHC* 3.16-21. 9-10, (678); సముచ్చయం మీద : పణ్డెణ్డుం-గొణి (*భారతి* 5.473-84,40-41, 848); అన్నంత క్రియలమీద : కట్టు-బడిన (*SII* 10.629.5, 825) : భూతకాలిక సమాపక క్రియలమీద : కట్టించెం-గ్రమబున (శా. ప. మం. 1.2-3. 40-41, 898-934) : విధ్యర్థక క్రియలమీద : చేయవలయుం-గాన (తె. శా. 1.163-65,29-30, 892-922); అవ్యయాలమీద : నేల యెల్లం-గావంబూని (పై. 12) ; విశేషణాల మీద : నిణ్డు-జెఱువున (*SII* 10.652.6, 1095). ద్రుతసంధి జరగని సందర్భాలు లేకపోలేదు. ఉదా. పాఱకు-కుణ్డికాళ్ళుళ ( *EI* 27.225-28. 11-12, 575-600 ), పులొంబున - చెఱువు...

(*SII* 6.584.6-7, 641), చేరమజ్జిలమ్మున-తొఱ్ఱుకొణ్టన్ (పై. 10.631. 6-8, 9/10), ఏణ్టన్-పశ్లినాణ్టి (*భారతి* 23.182-86.5, 641).

**3.27. ద్రుతంమీద యవలు :** ద్రుతంమీద యకారాగమ వడాగమాలు చేయటంకూడా క్రీ. శ. ఏడో శతాబ్దంనుంచి కనిపిస్తుంది. అంటే పదాది యవలు ఆనాటినుంచి వాడుకలో ఉన్నాయని అర్థం. ఉదా. యడాగమం : పఞ్చమియు-యాదిత్యవారంబు (*JAHC* 3.16-21. 9-11, 641), విషయంబు-యేళు (*SII* 10.23.4, 719-20), పడుమట-యేడు (పై. 6.250.4, 742-98) : వడాగమం : ఇఙ్లకా-వెలుగు వారు (అం. వ. 1941-42, 14-15.2-3, 600-25), పోటున-వకొట్టి (*SII* 10.614.5-6, 8), రట్టగుడియు-వృద్ధిని (*EI* 30.280-84.12,972). ప్రథమాంత శబ్దాలమీద కూడా పదాదియకారాన్ని నిలపటం ప్రాచీనకాలంలో ఉండేది. ఉదా. సంవత్సరమ్బుళ్ + యేనగు (పై. 27.234-36.6-7, 625-50).

**3.28. విరూపసంధులు :** తత్సమ శబ్దాలకు తెలుగు పద్ధతిలోను, తెలుగు మాటలకు సంస్కృత పద్ధతిలోను సంధిచేయటం అక్కడక్కడ కనిపిస్తుంది. ఉదా. నీలీస్వర (*SII* 10.652.6, 1095), మన్న్యేణ్ణ (*EI* 17.334-337. 11, 610). రెండో శబ్దం విషయంలో ఇదొక్కటే ప్రయోగం నన్నయనాటి వరకున్నశాసనాల్లో కనిపిస్తుంది. కాని తరవాతికాలపు ప్రయోగాల్లోని 'గొఱ్ఱె, గొఱ్ఱె; పళ్యాలు, పళ్యెము, పళ్లెం' మొదలైన శబ్దాల్లో గోచరించే ఏధ్వని ఇందులోనూ ఉందని గుర్తించవచ్చు. 'కళ్యాలు' వంటి శ్రీనాథ ప్రయోగాలను ఇక్కడ అనుసంధించుకోవాలి (చూ. ఈ గ్రంథంలోనే *కందప్పచెట్టి*, 5.7).

**పదమధ్య సంధులు :** ప్రత్యయం పరమైనప్పుడు ప్రాతిపదికల్లో వచ్చే మార్పులన్నీ పదమధ్య సంధులే అయినప్పటికీ, అలాటి మార్పులను ఆయా ప్రాతిపదికలను వర్ణించేటప్పుడే ప్రస్తావించటం జరిగింది. సంవృతాక్షరాల్లో (closed syllables) రేఫ అకారంగా మారటం ఒకధ్వని పరిణామం. దీనిని వర్ణభేదకత్వం లేదు. ఉదా. పణ్డెణ్డు (*SII* 10.599.32, 625-50), విట్టజుల (*భారతి* 5.935-48 2, 675), కొణ్డు, (*SII* 10.638.4, 8), వాణ్డు (పై. 4.1015.12, 1084). వాణ్డ్రి మొ. చోట్ల రేఫకు ముందు దకారా

గమం జరగటం విట్టుజులవంటి చోట్ల రేఫను అకారంగా పల్కటం, ఈ సంధి లోని విశేషాలు. వీటినిబట్టి క్రీ. శ. తొమ్మిదో శతాబ్దిలో అకారానికి స్పర్శ ధ్వని లక్షణం ఉండేదని, 'ద-అ'లకు (లేదా *న-ద-లకు) స్పృష్టోష్మ లక్షణాలుండేవని ఊహించవచ్చు.

**పదాంతాక్షరసంధి :** పదాంత సంవృతాక్షరాల్లోని న, మ లకు క్రీ. శ. 4/5 శతాబ్దిలో ప్రత్యేకవర్ణత్వం పోయిందని చెప్పవచ్చు. కమ్బురా ఞ్చెరువ (*భారతి* 1.110-22.15, 395-410), చెఞ్చెఱువ (పై. 13-14) వంటి మాటలనుబట్టి పదాంతంలో నమలు ప్రత్యేకవర్ణత్వం కోల్పోయి నవర్ణంలో మేళ వించాయి. క్రీ. శ. ఏడో శతాబ్దిలోని ఉదక పూర్వ్వఙ్జేసి' (*EI* 30 69-71.5, 699-700) అనే పదబంధం సంవృతాక్షరంలో పదాంతమకారం కంఠ్యస్పర్శంగా మారిందని నిరూపిస్తున్నది.

**3.29. మహదేకవచనం :** క్రీ. శ. పదకొండో శతాబ్ది వరకుగల శాసన భాషలో 1882 విభిన్న విశేష్యపదాలు లభిస్తున్నాయి. వాటిలో 573 దేశ్యాలు ; 211 తద్భవాలు; 424 తత్సమాలు. మహద్వాచక విశేష్యాలలో చాలా వరకు లింగబోధక ప్రత్యయాలు లేనివే. ఉదా...తలవరి (పై. 20.1-7 B 1.5. 3), మన్చ్యణ్ణ (పై. 17.334-37. 11, 610), రాజు - (పై. 27.221-25, 2-8, 575-600), కమ్మరి (పై. 234-36.21, 625-50.), కొడుకు (*JVOI* 15.41-42.6, 740). కొన్ని మాటలు ప్రథమైకవచన ప్రత్యయం ఉండీ, లేకుండా కూడా కనిపిస్తున్నాయి. ఉదా. (i) దేశ్యాల్లో : గణ్డ (*SII* 10.635 5, 825) : గణ్డణ్డు (*EI* 4,314-18.18, 1075-76); (ii) తద్భవాల్లో : ఓజు (*భారతి* 3.83-94.56-57, 106): ఓజన్టు (*EI* 27.240-42.19-20, 725); (iii) తత్సమాల్లో డుమంతానికి సంప్రదాయ వ్యాకరణాలు చెప్పేచోట్ల ప్రత్యయరహిత శబ్దాలు కొన్ని కనిపిస్తున్నాయి. ఉదా. పాతకు (పై. 228-29.8, 600-25), పణరంగు (*భారతి* 5.473-84.5, 848). ప్రత్యయయుక్తంగా ఉన్న మహద్విశేష్యాలు విభిన్న ప్రత్యయాలతో కనిపిస్తున్నాయి. ఉదా. ధనంజయు-ఱు (*EI* 27.221-25.3-4,575-600), ఉత్తమోత్తము-న్ఱు (పై. 231-34.4, 625-50), వా-ఙ్డు (*SII* 10.599.33, 625-50), సంయుక్తు-ణ్ణ్ (*EI* 30.12-31, 8), కుళ్ళమ్మ-న్ (*SII* 10.631.6, 9/10). ఈ ప్రత్యయాల్లో -ఱు లేఖక ప్రమాదంవల్ల వచ్చింది కావచ్చు. '-న్' అనేది

అత్యంత ప్రాచీనమూ, బహుశా తమిళంనుంచి సంక్రమించిందీ కావచ్చు. -న్ఱు ప్రత్యయం క్రి. శ. ఏడో శతాబ్దికి -ణ్డుగా మారింది. కాని లేఖన సంప్రదాయంలో పదో శతాబ్ది దాకా నిలిచింది. ధ్వని పరిణామం తొమ్మిదో శతాబ్దికే పూర్తయింది. ఇది పద్యశాసనాల్లో వైకల్పికంగా -ఁడుగా మారింది, '~'కు పూర్వాచ్చుకు వచ్చిన అనునాసిక్యమని అర్థం.-న్ఱు చేరిన దేశ్య పదాలసంఖ్య అత్యల్పం. తత్సమాదుల్లో ఇది చేరినప్పుడు పదాంతంలోని అత్తు వైకల్పికంగా ఉత్తుగా మారేది. ఉదా. ఓజ-న్ఱు (*EI* 27.240-42.20, 725), ఉత్తమోత్తము-న్ఱు (పై. 231-34.4, 625-50), సోమనాథ-ఁడు (*SII* 10.4.7, 1008)- హల్పూర్వానునాసికలోపం సంప్రదాయంగా ఉన్న కన్నడప్రభావంవల్ల ధనంజయు-ఱు ఏర్పడి ఉండవచ్చు. మూలద్రావిడంలో మహదేకవచన ప్రత్యయం *-న్ఱ్‌గా ఉండి, దక్షిణద్రావిడంలో *అకారలోపం పొందిందని బరోగారి అభిప్రాయం (కృష్ణమూర్తి గారికి రాసిన లేఖద్వారా తెలిసింది). ప్రాచీన ద్రావిడంలోని *-న్ ఱ్ / *-న్త్ అనే ఈ ప్రత్యయం దంతమూలీయోచ్చారణలో *న్-త్ గా ఉండేదని, దీంట్లోని *త్-వర్ణం అమహదేకవచన శబ్దమైన *అతు-కు సంబంధించిందని ఎమెనోగారి ఆశయం (1955, 10.5). బహువచన ప్రత్యయం చేరినప్పుడు ఏకవచన ప్రత్యయం సాధారణంగా లోపిస్తుంది. ఈ లక్షణం ప్రకారం 'కున్తుఱ్', కున్తుల్' శబ్దాలను పోల్చిచూసినప్పుడు - ఱు ప్రత్యయం ఏకవచన బోధకమని - భావించవచ్చు. ద్రావిడభాషల లింగబోధక ప్రణాళిక నిర్దుష్టం కానందువల్ల ఈ విధంగా వ్యాకరించటం సమర్థనీయమే.

**3.30. అమహదేకవచనం :** అమహత్తుల్లో కూడా ప్రథమైకవచన ప్రత్యయం చేరనివి, చేరినరూపాలూ చేరనిరూపాలూ రెండూ ఉన్నవి, కనిపిస్తాయి. ఉదా. (i) ప్రత్యయాలు చేరినవి : వేపుర (*EI* 14.153-55.3, 145-46), పణ్డూర (పై. 6.315-19.24,244), కొట్టూరు (సర్కార్ 1942, 1.256-57.19, 330 75), తాన్తికొన్డ (*IA* 9.102-3.7,5), అణతి (*EI* 27.234-36.15, 625-50), మొ. అనేకం. (ii) ప్రత్యయరహితంగా, సహితంగా కనిపించేవి : (అ) దేశ్యాల్లో : ఇల్లు (*SII* 10.645,48, 1060) : కోయిల-ము: (*IA* (13.50.57, 918-25), రామడు (భారతి 7.297-318.44, 715-20): మడు-వు (CP 13/1908-9.19, 709) : (ఆ) తద్భవాల్లో : దణ్డ- (రా. ప. నం. 71-72. 19,847) : దణ్డు-వ్ (భారతి 5.618.7, 897); (ఇ) తత్సమాల్లో :

ద్రమ్మ (తె. శా. 1.163-65.67,892-922) : ద్రమ్మ-ము (JAHRS 1.81-85.8, 10), (iii) ప్రత్యయాలతో కనిపించేమాటలివి కొన్ని : ఉదా. నాగ-బు శారతి 5.934.1, 200), కొట్ట-ంబు-న (EI 27.225-28.10,575-600), చే-ను (SII 6.585.10, 633-86-), దేశ-ము ( NI 3.1151.6, 650 ), పురస్సరం. ( EI 29.160-64.4, 680 ), ప్రసాద-$\phi$-చేసిరి ( SII 10.609.14, 675-99), సాసన-వు (CP 10/1908-9.1, 709), కిరన-మ్ము-న (భారతి 5.618.5,850), కొల-న్-ఇ (EI 27.46,29, 915-25). పై నిదర్శనలనుబట్టి -వు ప్రత్యయం ఎరువు మాటలమీదనే వచ్చేదని, అది క్రీ. శ. ఎనిమిదో శతాబ్దం నుంచి మాత్రమే కనిపిస్తుందని చెప్పవచ్చు. కొన్ని మాటలు -ము,-వు లు రెంటితోనూ దొరుకుతున్నాయి. ఉదా. పరిహార-ము (పై. 236-38. 10-11,700-25): పరియారు-వు(రా.వ.సం. 71-72.19-20,847),ప్రాకార-ంబు (భారతి 5.618.11, 850): ప్రాకారు-వు (SII10.651.11,1090-91 ). వీటినిబట్టి -వు చేరినప్పుడు ప్రాతిపదిక చివరి అత్తు ఉత్తుగా మారేదని చెప్పవచ్చు. -బు ప్రత్యయం లేఖకదోషమో పాఠక దోషమో కావచ్చు. -ంబు ప్రత్యయమే అమహదేకవచనంగా ఉండి ఏడో శతాబ్దికి ఎరువు మాటల్లోను, ఎనిమదో శతాబ్దికి దేశ్యపదాల్లోను-మ్/-ముగా మారింది. అవ్రజహితంగా ము ప్రత్యయాన్ని వాడటం ఏడో శతాబ్దికే స్థిరపడిపోయినా, పండితు లీనాటికీ దాన్ని దోషంగా పరిగణిస్తు న్నారు. -ంబు వర్ణసమీకరణం వల్ల తొమ్మిదో శతాబ్దికే - మ్ముగా పరిణమించింది. చేను, కొలను వంటి శబ్దాల్లోని -ను ప్రాతిపదికలో భాగంకాదు. అది—ము ప్రత్య యానికి రూపాంతరమనవచ్చు. ము ప్రత్యయాంతాలకు లాగానే వీటికి 'ను' తో కలిసీ, కలియకా, బహువచనరూపాలుండటం ఒక కారణం. కెయమ్/కెయన్, కుళమ్/కుళన్ వంటి పర్యాయరూపాలు తమిళంలో కూడా ఉండటం రెండో కారణం.

**3.31. మహన్మహతీ బహువచనం** : ప్రాతిపదికమీద-రు ప్రత్యయంచేరి మహన్మహతీ బహువచన రూపం ఏర్పడుతుంది. అప్పుడు తత్సమ ప్రాతిపదికల చివరి అత్తుగా సాధారణంగా ఉత్తుగా మారుతుంది. ఉదా. ఎవ్వ-ర్ (భారతి 28.182-86.14, 641), వేపు-రు ( EI 27.234-36.19, 625-50 ), దేవర (భారతి 9.461-67.1.8), మల్లు-ర (SII 10.614.6,8), మలిను-ర్ (శా. వ. మం. 1.2-3.15, 898-934), సంయుక్తు-ర్ (ఆం.సా.వ.వ. 24.158-

62.4, 10). పైవాటిలోని చివరి మూడు మాటలూ గమనార్హాలు. కొన్ని సందర్భాల్లో మహదేకవచనంమీద -రు ప్రత్యయం చేరి (అమహత్తుల్లోలాగా) బహువచన రూపం ఏర్పడటం కద్దు. ఉదా. వాణ్-ర్ ( *SII* 4,1015.12, 1084), ఇరువణ్డ్-రకు (పై. 7). వీటిని కన్నడంలోని, 'అవ–న్' అవ-న్ద్-ఇర్, మగ–న్ద్-ఇర్, అళియ-న్ద్-ఇర్, తాయ్వ్-ఇర్' వంటి మాటల్తో పోల్చినప్పుడు, ఈ విధానం విరళంగా నయినా ఇతర ద్రావిడ భాషల్లో ఉందని గమనించగలం. ఇదే లక్షణం 'చేనులు/చేలు' వంటి చోట్ల కూడా కనిపిస్తుంది.

**3.32. మహదమహద్బహువచనం :** మహదమహత్తులకు సాధారణమైన బహువచనప్రత్యయం –లు. (ఇదిగాక అప్రాణివాచకాల్లో మాత్రమే కనిపించేది -కు/-గు. ఇది-లు ప్రత్యయానికీ ప్రాతిపదికకూ మధ్యలో వస్తుంది). ఇందుకు కొన్ని నిదర్శనాలుః ఉదా. (i) ప్రాణివాచకాల్లో : అణపోతు–లు (వ్యా. సం. 301.10.2, 600–25), కన్న్య-ళ్-అను ( *NI*3.1152–55.49, 7 ) బో-ఖు ( *SII*10.23 9,719–20 ), రాజు-ల్ల్-అ (*EI* 27.225–28.2, 575–600); (ii) అప్రాణివాచకాల్లో : ఆడ్-లు (భారతి 5.935–48.8,675), గుళ్-ఖు-వు ( *NI* 3–1152–55.44, 7 ), మ్రాం-కు-ల్-అ ( *SII* 4.1016,1087), రేం-గు-ల్-అ (రా. వ. సం. 187–89.16, 1018). చివరి రెండు మాటల్లోని-కు, -గు.లు పునరుక్తంగా వాడినవే. ఖు పూర్వరూపం-;-లు తరవాతి రూపం. ఏడో శతాబ్దికే ళకారం లకారంగా మారిందని ఇంతకు ముందే (2.11) గ్రహించాం.

**3.33. బహువచనంలో పదమధ్య సంధి :** బహువచన ప్రత్యయం చేరినప్పుడు ప్రాతిపదికాంతంలో కొన్ని ముఖ్యమైన మార్పులు జరిగాయి. అవి అయిదు విధాలు : (i) ప్రాతిపదిక చివరి-అ–ఇ-ఉ, లు లోపించగా సంయుక్తాక్షరాలేర్పటంః ఉదా. (i) –అ లోపించినవి : మఱునుఱ్ల (*EI* 27.225–28,14. 575–600), కళ్చగార్లు (పై.30.69–71.8, 699–700), పెగ్గడ్లు (*AR*. 1933, *II AP*. *B*, 56.7, 1072,); (ii) –ఇ లోపించినవి: గుడ్లు ( *SII* 6.585.2, 633–63), కోమట్లు (పై. 4.1014.7,1038); (iii)-ఉ లోపించినవి : ఏణ్లు ( *EI* 4.314–18 17, 1075–76 ). నంజుడ్లు ( *SII* 4.1015.9, 1084). (2) ప్రాతిపదిక చివరి అచ్చుతోబాటు దానికి ముందున్న

ణ, ఱ, య, వ, లు కూడా లోపించటం. ఉదా. (i) -ణ లోపానికి : బ్రాహ్మ-ల (పై. 10.645.59, 1060); (ii)-ఱ లోపానికి; కూన్తు-లున్ (పై. 647.41. 1097); (iii) -య లోపానికి: బో-క్ (EI 18.1-4.29, 668). వ్రా-లు (SII 6-250.7, 742-98) ; (iv)-వ లోపానికి : మోదొ-లు (పై. 593.6,709-46), గురు-లు (పై. 10.645.52, 1060). (3) ప్రాతిపదిక చివరి అ, ఇ, కారాలు ఉకారంగా మారటం: ఉదా (i) -అ>-ఉ; సోము-క (NI. 3.1152-55.23, 7): (ii) -ఇ>-ఉ : దేవు -లు (SII 10.596.5, 929-50). ఈమార్పు కేవలం ఎరువుమాటల్లోనే నిత్యంగాజరగటం గమనించ దగ్గది (4) ప్రాతిపదిక చివరి ము ప్రత్యయలోపంతోబాటు తత్పూర్వ స్వరానికి దీర్ఘత రావటం: ఉదా. (i) ఏకవచనంలో : నరకా-నం (పై. 4.14, 1008), రాజ్యా-నయు (భారతి 5.796.17, 1023), భోగా-నకు (SII 10.644.78-79. 1060), లింగా-నకుం (NI 3.1072.16,1088), నిమిత్యా-న (SII 4.1300.5, 1095); (ii) బహువచనంలో : కుంచా-లు (పై. 1014.5, 1038), వర్షా-లు (పై. 10.60.1, 1091). (5) ప్రాతిపదిక చివరి అచ్చు లోపించి తత్పూర్వ హల్లులు బహువచన ప్రత్యయంతో కలిసినప్పుడు వాటిగుణంలో (Quality) కొన్నిమార్పులు వచ్చాయి. అందులో నాలుగురకాల మార్పులు ఏడో శతాబ్దికి, మరో రెండు ఎనిమిది, పదకొండు శతాబ్దులకు చెందినవని గ్రహించవచ్చు. (i) రేఫ డకారంగానో శకటరేఫగానో మారటం. ఉదా. (అ) ఊడ్లందు (పై. 6.585.10, 633-63), వడ్లు (AR 233/1949-504, 8); (ఆ) ఆచాఌ్లు (SII 10 47.2, 7), పుఱ్ఱునూఌ్లు (పై. 600.6-8, 8); (ii) శకటరేఫ డకారంగా మారటం. ఉదా. ఆడ్లు (భారతి 5.935-48.8, 675), మఱుతుడ్లు (SII 10.594.9-10, 925-50); (iii) డకారం 'ల/ళ'గా మారటం. ఉదా. గుళ్ళువు (NI 3.1152-55.44, 7), రట్టగుళ్ళు (EI 27.234-36-14, 625-56): (iv) ద్విరుక్త టకారం అద్విరుక్తం కావటం. ఉదా. పుట్లు (SII 6.585. 10, 633-63), భట్లు (పై. 10.6.12, 1043). ఇది సార్వత్రికమైనా సంప్రదాయ వ్యాకరణాలు ఈలోపాన్ని గమనించక పోవటం ఆశ్చర్యకరం. (v) లకారం డకారంగా మారటం. ఉదా. మంగడ్లు (పై . 6.250.7- 742-98); (vi)నకారం ణకారంగా మారటం. ఉదా. గ్రమాంకుల (పై. 4.1016.3, 1087). రేంగుల (రా. వ. సం. 187-89.16,1018).

**3.34. ద్వితీయావిభక్త్యంగ నిర్మాణం :** మహద్వాచక శబ్దాల ద్వితీయాది విభక్త్యంగం మూడువిధాలుగా ఉందేది. (1) ధాతువు (బంధుత్వబోధకాలైన -అయ్యవంటి పదాంశాలు), బహువచన లకారం, విభక్తిప్రత్యయం క్రమంగా చేరి ఏర్పడ్డవి. ఉదా. పాటి-కు (*EI* 27,225-28. 10-11, 575-600). కత్తి-శమ్మఁ-కు (పై 231-234.7, 625-50), సోము-$\phi$-కు (*NI* 3.1151 7-8, 650). (2) ధాతువు, ఏకవచన సూచకమైన '-(న్) ఇ/-న/$\phi$, బహువచన లకారం, విభక్తి ప్రత్యయం క్రమంగా చేరి ఏర్పడ్డవి. ఉదా. భీము-న-కు తె. శా. 1.163-65.3, 892-922). (3) పైవిధంగానే ఉండి బహువచనంలో రేఫకలవి. ఉదా. వా-ని-కి ( *EI*11.337-47.20, 725 ), ఇరువణ్డ్-ర-కు (*SII* 4.1015.7, 1084 ). అమహత్తుల ద్వితీయాది విభక్త్యంగం మూడు విధాలు. (1) ధాతువు, (మీద - పఱువంటి స్థలవాచకపదాంశమూ), దానిమీద ఏకత్వ సూచక '-న/$\phi$', ఆ మీద బహువచన లకారం, ఆ తర్వాత విభక్తి ప్రత్యయం కలవి. ఉదా. చిఱుంబూర్-ఇ. (*EI* 221-25.6,575-600), చెఱువు-$\phi$-కు (*SII* 10.37. 38 ), లింగా-న-కుం (*NI* 3.1072.16, 1088). (2) ధాతువు. 'ము/-వు', 'న/$\Phi$-ను', బహువచన లకారం, విభక్తి ప్రత్యయం వరసలో ఉండేవి. ఉదా. కొట్ట-ంబు-న (*EI* 27.225-28.10, 575-600). ధమ్మఁ-వు-ల (తె.శా. 1163-65.56, 892-922). (3) ధాతువు, ఆదేశాగమాత్మకాలైన 'త, ట, ణ్డ/ఇ$\Phi$', బహువచన లకారం, విభక్తి ప్రత్యయం వరుసగా ఉండేవి. ఉదా. ఏణ్-టన్ (భారతి 23.182-86.5, 641), నూ-ట-$\Phi$ ( *SII* 10.6-7, 1043 ), నూఱి-ంటి-కి ( పై. 5.23.10,1094 ) విత్పత్-తి (పై. 6.585.10, 633-63). ఈ ఔపవిభక్తికాలు చేరని నూయి-ని (పై. 10.595.14, 925-50) వంటి రూపాలు కూడా విరళంగా కనిపిస్తాయి. ఈ ఆరు విధాలయిన నిర్మాణక్రమం గల ప్రాతిపదికలే షష్ఠీవిభక్తిసూచకాలుగా, విశేషణాలుగా, ఉపయోగపడతాయి. పైవాటిలో నప్రత్యయ రహితమైన సోముకు, చెఱువుకు గమనాలు.

**3.35. ప్రథమేతర విభక్తులు :** ద్వితీయావిభక్తికి '$\Phi$, న్, ని, ను, మ్, నిం,ము'అనే సపదాంశాలు ప్రత్యయాలు. ఉదా. దేని-$\Phi$ (భారతి 23.182-86.13, 641, (దీని-న్ (శా. ప. మం. 1.2-3.34, 898-934), కన్న్యఁశ-ను (*NI* 3.1152-55.49,7), రఢ్డి-ని ( *SII* 6,250.5,742-98 ), నాఢ్డి-ం

(భారతి 5.473-84. 6,848), చోఱ-నిం (పై. 618.8, 893), తమ్-ము (*EI* 30.278-30.4, 825). చివరిది వర్ణసమీకరణంవల్ల నకారం మకారమైన రూపం.

'-న, ం', లు తృతీయావిభక్తిని సూచించే సపదాంశాలు. సప్తమీ ప్రత్యయంతో వీటికి ధ్వనిసంబంధంగా అర్థసంబంధంగా పోలికఉంది. నకారం తృతీయా ప్రత్యయంగా క్రీ. శ. 9/10 శతాబ్దినుంచి మాత్రమే వాడుకలోకి వచ్చింది. కాని పదకొండో శతాబ్దివరకు దీనికి అంత ప్రాచుర్యం కాని, నియతోపయోగంకాని కనిపించదు. ఉదా. పరాక్రమంబు-నన్ (తె.శా. 1.163-65.9-10,892-922) అంగంబున-ం (*EI* 30.280-84.13,972). 'చేత, చేతం, తో, తోన్, తోడ, తోడం, తోటన్' అనే అనుబంధాల నుపయోగించి తృతీయావిభక్త్యర్థాన్ని బోధించేవారు. ఉదా. బోళ-చేత (ఆం. వ. 1941-42. 14-15.2, 600-25); చోడుళ-తోడ (*SII* 10.626.4, 848-92), నలరామనిభు - తోటన్ (భారతి 5.618.5, 897), పదువ-తో (పై. 473 84.5, 848), వైదుంబుళ-చేతం (*SII* 10.640 4, 9/10), మణ్ణ-తోన్ (రా. వ. నం. 25-29, 8-9, 1065), మెచ్చు-తోడం (*EI* 4.314-18 28, 1075-76). పర్యాయరూపాలైన 'తో' 'తోడ' మొ. సహార్థ బోధకాలు; చే(త) మొ. కర్తృబోధకాలు.

చతుర్థీ విభక్తిని 'కి(న్), కు(న్), కూ,క్' అనే పదాంశంతోను, 'పొంటె' అనే అనుబంధంతోను సూచించేవారు. సంప్రదాయవ్యాకరణాలు దీన్ని షష్ఠీ ప్రత్యయంగా పరిగణించినా ఆ అర్థంలో దీనికి ప్రయోగమే లేదు. ఉదా. చేనుకు (*NI* 3.1151.9, 650), సోము-కు (పై. 7-8), దీని-కి (*SII* 6.585.12,633-63), తేని-కిన్ (*VS* 301-310.8, 600-25), రాజులా-కున్ (*SII* 6.584.2,641), వసన్తి స్వరంబు-న-క్ (*EI* 27.234-36. 15-16, 625-50), పరోపకారంబు-పొంటె (తె. శా. 1-163-65.35, 892-922). ఉదంత ప్రాతిపదిక మీద-కున్, ఇదంత ప్రాతిపదిక మీద-కిన్, పరిపూరక ప్రకృతిలో వచ్చేవి. కావ్యభాషలోలాగా 'చేనికి' అనే రూపం లేకపోవటం ఉదంత మహత్తుమీద ప్రత్యయానికి ముందు నగాగమం రాకపోవటం గమనించదగ్గవి. మూలద్రావిడంలో ద్వితీయా-చతుర్థీవిభక్తులు ఒక్కటిగానే ఉండేవని, 'కిన్/కున్' లోని నకారం ద్వితీయా ప్రత్యయానికి ప్రతిరూపమని బూల్బ్లాక్ (1954,20-21)

వాడిస్తారు. 'పౌఙ్' నన్నయకు తరవాతి కావ్యభాషలో కూడా చాలా విరళంగా ఉండేది.

'మిన్ద, మీన్ద, మీద; కడ; పై;' అనే అనుబంధాలు మాత్రమే పంచమ్యర్థ సూచకాలుగా శాసనభాషలో కనిపిస్తాయి. ఉదా. మహి-మిన్ద (*SII* 6 585.1,633-63),గుడి-మీన్ది(పై.4.1014.6,1038),మీద(పై.10.605.8,8); భూపాదిత్యుల-కడాన్ (పై. 604.22,10). భూసతి-పై (*EI* 4.314-1817, 1075-76). ఈ శాసనాల్లోనే 'పై' స్వతంత్రశబ్దంగా కూడా ప్రయుక్త మయింది. ఉదా. పై-లేచిసేన (*భారతి* 5.473-84.4, 848), పయ్-వారల (*శా. వ. మం.* 1.2-3 18, 899-934)

షష్ఠీసూచకమైన ప్రత్యేక విభక్తిప్రత్యయం కనిపించదు. ద్వితీయాది విభక్త్యంగమే షష్ఠీవిభక్తిసూచకంగా ఉండేది.

సప్తమ్యర్థంలో 'ఌ, అ (ం), అన్, న' అనే పదాంశాలు, 'అందు, ఒళన, లో (ం), లోన, లోపలి, ళోన' అనే అనుబంధాలు శాసనభాషలో ఉన్నాయి. ప్రత్యయాలకు ఉదాహరణలు : వారనాశి-ఌ (*SII* 10.611.2-3, 8), తిర్పలూర్-అ (*EI* 27.231-34.7-8, 625-50), బెజవాడ్-అం (*శా. వ. మం.* 1.2-3.27, 898-934), అన్వయంబు-న (*భారతి* 23.182-186.13-14, 641). హలంత ప్రాతిపదికమీద అజాది ప్రత్యయాలూ, అజంత ప్రాతిపదికమీద హలాది ప్రత్యయాలూ పర్యాయ ప్రవృత్తిలో ఉన్నాయి. అనుబంధాలకివి ఉదాహరణలు : ఊర్ల్-అందు (*SII* 6.585 9, 633-63), రాజుల్ల్-ఒళన-అం. వ. 1941-42.1,600-25), ఆజి-లోం (*భారతి* 5.618.7, 897), భూమిలోన (పై. 15.850), కయ్యంబు-ళోన (*SII* 10 623.7-8,9/10), డొంక-లోపలి (*త్రిలింగ రజతోత్సవ సంపుటి* 352-64.17,991). పైవాటిలో 'ఒళన>ళోన>లోన' ఉత్తరోత్తరం అర్వాచీనమైనవి. మూలద్రావిడం లోని *ఉళ్/ఒళ్ ధాతురూపం క్రీ. శ. ఏడో శతాబ్దిదాకా తెలుగులో నిలిచి ఉండటం విశేషమే. ఈ శాసనాల్లోనే 'లోపు' స్వతంత్ర శబ్దంగా క్రీ. శ. పదకొండో శతాబ్ది శాసనాల్లో కనిపిస్తుంది ఉదా. 'పల్లికి లోపైన ఇల్లకు ... (*SII* 10 651. 14, 1090-91), వెలకుంగొని విడిచిన యిల్లు లోపుగా ... (పై 13), పెదరు-లోపుగా యిల్లుపట్టు పై. 4.1161.11, 1082), ... బోయుఙును లోపైన-

యావ్వఁరుబోల .. ( పై. 1008.12,1047 ). 'లోపల' శబ్దాన్ని 'దాపల, వలపల, వెలుపల 'శబ్దాలతో పోల్చినప్పుడు* -పల అన్నభాగం ప్రత్యయమేమో ననిపిస్తుంది. విడిగా 'లో' శబ్దం వాడుకలో ఉండటం ఈ అనుమానానికి బలమిస్తున్నది.

**3.36** నిర్మాణ క్రమాన్నిబట్టి సర్వనామాలను విశేష్యాలను ఒక్కటిగనే భావించాలి. ఇవి ముఖ్యంగా మూడురకాలు. లింగవచనసూచకాలుగల నిర్దేశ సర్వనామాలు ఒకరకం. అట్లు మొదలైన అవ్యయాలూ, అది, ఆమె, వాడు మొదలైన 'విశేషణాలూ' ఈ రకానికి చెందినవి. లింగబోధలేని ఆత్మార్థక, పురుష వాచక, సర్వనామాలూ రెండుమూడు రకాలవి. ప్రశ్నవాచక సర్వనామాలుమొదటి రకానికి చెందినవే. అ, ఇ, అనే ప్రాతిపదికలనుంచి ఏర్పడ్డ నిర్దేశ సర్వనామాలు కొన్ని మాత్రమే శాసనభాషలో కనిపిస్తాయి. ఉదా. మహన్మహతీవాచకాలు : ఏక వాణ్టు (పై. 10.606.18-19,600-25); వాణ్డు (పై. 599.33,625-50); వాని ( *EI* 11.337-29. 725 );- ఆతణ్డ్ ( *భారతి* 5 618.11.897 ); ఆతని (తె. శా. 1.163-65.53. 892-922) ; వీని (*SII* 10.59 10.1089); వీణ్టి (పై. 628.8 825).

బహు. వారు (పై. 607.10,575-600); వారల (శా.ప.మం. 1.2-3.18. 898-934); వీరి (*SII* 10 3-4,8 ; వీరల (పై. 605.8,8).

(ii) అమహద్వాచకాలు : ఏక. (ఇచ్చిన్) అది ( *EI* 27.234-36-16. 625-50); దానిక (శా. ప. మం. 1.2-3. 41, 898-934) ; ఇది ( *SII* 10.598.82, 925-56); దీని (పై. 606.17,600.25); దేని (*భారతి* 23.182-86.13,641).

(iii) ఇన్టు ( *SII* 10.45.2.7 ); ఇన్దు ( తె. శా. 1.163-65.74, 892-922); ఇన్దుల ( *NI* 1,245.3,10 ); ఇన్దోఱు (ఆం. ప. 1941.42-14-15.4, 600-25); ఇన్దాఱు (*SII* 10.600.7-8, 8).

**సర్వనామాల నిర్మాణక్రమం :** పై వాటిలోని'వీణ్టి'నేటి'వీడి' ( < *వీణ్డి)కి పూర్వరూపం. *ఇదని అనే పూర్వరూపంనుంచి ఏర్పడ్డ 'దీని,దేని' అనే వాటిలో 'దేని' అనేదే సాధారణ రూపమైనా, *ఎదని నుంచి ఏర్పడ్డ 'దేని'తో సమానరూప

కత్వాన్ని పరిహరించేటందుకు వాడుకనుంచి తొలగిపోయింది. వాడుకలో ఉన్నంత కాలం దక్షిణాంధ్రంలోనే మాండలికంగా ఉండేది. నేటి 'ఇందరు' శబ్దానికి పూర్వరూపమైన 'ఇన్దోఱు/ఇన్దూఱు'లోని - దోఱు, వ్యక్తులనే అర్థంగలప్రత్యేకశబ్ద మేమోనని కొండభాషలోని డోఱు శబ్దాన్నిబట్టి ఊహించవచ్చు. 'వాణ్డు' కన్నా 'ఆతణ్డు' అనేది గౌరవాధిక్యసూచికంగా కనిపిస్తుంది. -న్డు > - ణ్డు అనే ధ్వని పరిణామంగల 'వాన్డు' ఏకవచన బోధకమేగాని వేరుకాదు. అందులోని శకటరేఫ బహువచన ప్రత్యయమన్న పూర్వాభిప్రాయం (సోమయాజి 1948) ప్రామాది కమే. క్రియాన్వయాన్ని పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. ఉదా. తేని ఱచ్చినవాన్డు పఞ్చమహాపాతకు న్డకున్ (వ్యా. సం. 801-310.3-4, 600-25), వచ్చినవాన్డు పఞ్చమహాపాతకు *అగు* ( *EI* 27.228-29.7-8, 600-25 ) మొదలైన వాక్యాల్లో వాన్డు బహువచనంలోనే ఉంటే క్రియాపదం 'అగుదురు' అని ఉండాలి. 'వారు' బహువచన రూపంగా అదేకాలంలో ఉండేదనడానికి ఱచువారు కళరేని (*భారతి* 5.935-48.12-13, 675) వాక్యాలు నిదర్శనాలు.

ప్రశ్నవాచక సర్వనామాల్లో రెంటికి మాత్రమే ప్రయోగాలు దొరికేయి. ఉదా. (i) మహద్వాచకంలో—ఏక. ఎవ్వణ్డ్ ( *JAHRS* 1 81-85.7, 10 ); ఎవ్వాండ్ ( *SII* 10-4 12, 1008 ); ఎవ్వర్ (*భారతి* 23.182-86.14, 641) (ii) అమహద్బహువచనంలో - ఎవ్వి (తె. శా. 1.163-65 54-55, 892-922).

పురుషబోధక సర్వనామాల్లో ఉత్తమ, మధ్యమ, పురుషైక వచనాలకు మాత్రమే ప్రయోగాలు దొరుకుతున్నాయి. (i) ఉత్తమపురుష : ఏ ( పై. 48 ); నా (పై. 26); నే (పై. 48); నాకు (*SII* 6.584 5, 641); (ii) మధ్యమ పురుష : నీవు (తె. శా. 1.163-65. 26,892-922); నీ (పై 27).

ఆత్మార్థకనామాలు దొరికినవి ఇవి : ఏక. తాన్. (శా.ప.మం. 1.2-3.40) 898-934); తన ( *NII* 287.2. 650 ); తనక ( తె. శా. 1.163-65.44 ), 892-922), తన్ను ( *NI* 1 287.4, 650 ); బహు. తారు. (శా.ప.మం 1.2-3.40, 898-934); తమకు (పై 21); తమ (తె.శా.1.163-65 41, 892-922), తమ్ము ( *EI* 30.278-80.4. 825). ) *తమ-ను వర్ణసమీకరణం వల్ల "తమ్ము'గా తొమ్మిదో శతాబ్దికే మారటం గమనార్హం.

**3.37. సార్వనామిక విశేష్యాలు** : నామధాతువుకు పురుషబోధక ప్రత్యయాలు చేరి విశేష్యాలు ఏర్పడటం తెలుగువంటి ద్రవిడభాషల్లో ఒక విశిష్టత. ఈ శబ్దాలకు కొన్ని సమయాల్లో (నామ) విభక్తి ప్రత్యయాలు చేరుతాయి. పురుషబోధక ప్రత్యయాలు చేరిన క్రియలు కాలబోధకాలుగా ఉంటాయిగాని ఈ శబ్దాల్లో అలాంటి స్ఫురణలేదు. శాసనభాషలో రెండురకాల సార్వనామిక విశేష్యాలు లభించాయి. (i) నామవాచకంమీద మధ్యమ పురుషైకవచన ప్రత్యయం చేరినవి. ఉదా. ప్రాణసమానుణ్డ్-అవ్ -(తె.శా. 1.163-65. 26-27, 892-922), చెలి-వి (పై. 27) (ii) సర్వనామం మీద నిర్దేశ సర్వనామ ప్రత్యయం చేరినది. ఉదా. వాన్ -ఇద్-అ (*JAHRS* 1.31-35 7, 10).

**3.38.** **సంఖ్యావాచకాలు** : నిర్మాణక్రమానిబట్టి సంఖ్యావాచకాలు విశేష్యాలవంటివే. ఇవి ప్రాథమిక సంఖ్యావాచకాలని, సార్వనామిక విశేషణాలని, రెండువిధాలు. ప్రాథమిక సంఖ్యావాచకాలకు 'అగు' ధాతురూపాలను చేర్చినప్పుడు ఏర్పడే సార్వనామిక విశేణాలు ఒకరకం. అస్వతంత్రమైన సంఖ్యావాచక విశేషణ ప్రాతిపదిక లింగవచనబోధక ప్రత్యయాలను చేరిస్తే ఎర్పడేవి మరోరకం. విశేషణ రూపాలేర్పడేటప్పుడు కొన్ని సమయాల్లో సంఖ్యావాచక సర్వనామధాతువులోని దీర్ఘస్వరం హ్రస్వమవుతుంది. ప్రాథమిక సంఖ్యావాచకాలనూ, సార్వనామిక విశేషణాలనూ, పురుషబోధక సంఖ్యావాచకాలనూ క్రమంగా నిర్దేశిస్తాం.

ఉదా. 1.ఒకొొటి (*త్రిలింగ రజతోత్సవ సంచిక* 352-64.9-10, 991), వకొట్టి ( *SII* 10.614.6,8 ); ఒక (తె.శా. 1.163-65.24, 892-922), ఒణ్డు (*శా.ప.మం.* 1.2-3.24, 898-934); ఒరుల్ (పై. 10-11), వీటిలో మొదటిది *ఒకణ్డు అనే అర్థంలో ప్రయుక్తమయింది. అంటే ఔపవిభక్తికరూపం ప్రథమారూపంగా వాడుకలోనికి వచ్చిందని.

2. రెణ్డు ( *EI* 27.234-36.11, 625-50 ), రెంటి-కి ( *SII* 5.23.8, 1094), ఇన్-మడి (రా.వ.సం.187-89.6, 1018), ఇర-వది *EI* 27.225-28.13,575-600), ఇరు-పఱియది ఏను (*AR* 392/1904.11-13-575-600), ఇద్-దఱు ( *SII* 5. 1033.7, 1098 ), ఇరు-వురు (పై. 6.593.3.4, 709-46) ఇరు-వణ్ణ్రికు (పై. 4.1015.7, 1084). 'రెండు' కు విశేషణార్థంలో 'ఇను, ఇర, ఇరు' అనే రూపాంతరాలున్నాయి. మీది హల్లుతో

కలిసి వర్ణసమీకరణం పొందినప్పుడు దీనికి 'ఇద్' అనే రూపాంతరం కలిగింది. 'ఇన్మడి' తరవాతి కాలంలో 'ఇమ్మడి' అయింది.

3. మూన్ఱ్ (పై. 10. 217.4, 745-801), మూను (*EI* 203-206.10, 850), మూణ్ణు ( *SII* 10-6. 8-0, 1043 ), మూడ్ (పై. 5.12.3, 1074)' మూటి- (పై. 6.584.6. 641, మూణ్టి-కి (పై. 10.6.6, 1043); ము-న్నూఱు ( *EI* 27.234-36.13, 625-50 ), మూ-నూర (*SII* 10.37.1, 8); ము-మ్మడి (పై. 6.9,1043); ము-వ్వుర (అం. ప. 1941-42. 14-15.2,700-25). విశేషణరూపాల్లో మీదిహల్లు ద్విరుక్తమైతే ధాతుగతదీర్ఘం హ్రస్వం కావటం, అద్విరుక్తమైతే మారకపోవటం గమనించాలి.

4. నాల్కు ( *EI* 27 225-28.13-14, 575-600 ), నాలుగు ( *NI* 3.1151 6-7, 650 ), నాల్-ఉను ( *AR* 182/1933-34. 2.41. 2-3, 7); నల్-తుమ్ముణ్డు (*AR* 233/1949-50.9, 8); నల్-వురు (రా.వ.నం. 187-89.25, 1018).

5. ఏను ( *SII* 6,585.10.633-63 ) అన్న రూపమొక్కటే దొరికింది.

6. ఆఱు (*భారతి* 23.182-6.11, 641), అర-వాద్యది (తె. శా. 1. 163-65.59-60. 892-922), ఆఱు-వది (రా.వ.నం. 187-89.22. 1018), *అర్ -వ్వురు* (*SII* 4-1014.2,1038).

7. ఏఱు ( *EI* 11,337-47.9, 725 ), ఏడు ( *SII* 6.250.4, 742-98). విశేషణరూపాలు దొరకలేదు.

8. ఎణ్బొది (*భారతి* 23.182-86.5, 641), ఎఱుంబొది (*SII* 6,584.3, 641), ఎనుబొది ( *భారతి* 5.473-84.10, 848 ), ఎణ్మ (*SII* 10.29.26,971), ఎన్మిది (పై.6.102.19,1006), ఎనమ్-అణ్డుకును (పై. 10.29.8, 971). ఎనిమిది తొమ్మిది శబ్దాల వ్యుత్పత్తి స్పష్టంకాదు. ఎనిమిది పూర్వరూపాల్లో ణకారయుక్తమైనవి ప్రాచీనరూపాలు;నకారయుక్తాలు అర్వాచీనాలు. మూలదక్షిణ ద్రావిడంలో*ఎణ్/ఎట్(=8) అనే రూపాలున్నాయని ఊహించవచ్చు. కాని' -మ, -మిది' వంటి ప్రత్యయాల పూర్వరూపాలను పునర్నిర్మించటం సాధ్యపడదు. 'మిది' ఉన్న రూపాను తెలుగు కొలామీ గోండీలలోను, -'మ, ఉన్న రూపాలు తుళు తెలుగులోనూ కనిపిస్తాయి (*DED* 670). 'ఎణ్-బొది,

ఎణ్-ఉం-బొది' వంటి ఏడో శతాబ్ది రూపాలనుచూసి 'ఎణ్' అనే ప్రాతిపదికనూ 'బొట' అనే ప్రత్యయాన్నీ సముచ్చయమైన 'ఉం' కలుపుతున్నదని భావించవచ్చు. 'మిది' కాలక్రమాన'-బొది'నుంచి ఏర్పడ్డదని కూడా ఊహించవచ్చు. 'తొమ్మిది' శబ్దంలోని -'మిది' తోటి సామ్యంవల్ల 'ఎనిమిది'లో 'మిది' చేరిఉండవచ్చు. ఎనిమిది, తొమ్మిది శబ్దాలురెండూ 'రెండు తక్కువపది, ఒకటి తక్కువపది' అనే పద్ధతిలో నిర్మితాలని, '-బొది, మిది' అనేవి 'పది' రూపాంతరాలని కొందరు భావించారు (*సోమయాజి* 1948,453-54). తొమ్మిది శబ్దం విషయంలో ఇటు వంటి నిర్మాణక్రమం కొన్ని ద్రవిడ భాషల్లో కనిపిస్తుంది. ఉదా. కన్న. ఒంభత్తు, ఒంబయ్; కొలామీ ఒంబయ్; తుళు ఒరుంబ; గోండీ ఉన్మా(క్), ఎడ్మ -(DED 862, 2910) మొదలైనవి. అయితే ఎనిమిది విషయంలో ఈ విధమైన నిర్మాణ క్రమం ఇతర భాషల్లో కనిపించటంలేదు.

9. తొమ్బ (పై. 6.102.17. 1006). తోంభ (రా.ప.సం. 187-89.8, 1018) అనే రూపాలే దొరికాయి. నేటి వ్యవహారంలో 'తొంబ' అంటే 'చాలా (మంది)' అనే అర్థం.

10 పది ( *CIT* 2.6.11, 1079 ); పదు-నుణ్జు ( *SII* 10.627.12, 9/10). సమస్తశబ్దాల్లో దీనికి అనేక రూపాంతరాలుండేవి. ఉదా. ఇరవది ( *EI* 27.225-28.18, 575-600 ), ఏ-బది ( పై. 228-29.4, 600-25 ), పణ్డ్-ఎణ్డు ( *SII* 10 599.21, 625-50 ), ఎణ్-బొది (*భారతి* 23. 182-86,5,641 ), పద్-ఏన్ ( పై. 5.735-48.8,675 ), ఇరు-భది ( *SII* 10.24 5, 682); పన్-దుంబు (AR 182/1923-24. Pt *II* 41.3-4,7), ము-ప్పది ( *SII* 10.217.4, 745-801 ), ఎణ్-మ ( పై. 29.26, 971 ), నళ్-పాద్-యది (*త్రిలింగ రజతోత్సవ సంచిక* 352-64.9.991), ఎన్-మిది ( *SII* 6.102.19, 1006 ), నల్-వొది ( రా.ప సం. 187-89.4, 1018 ), ఏం-భయ్ ( *SII* 5.79-7, 1094 ). ఆయా రూపాంతరాలకు కారణమైన పరిసర లక్షణాలు స్పష్టంగా తెలియటంలేదు. పై ప్రయోగాల్లోని 'పదుణ్జు' అనేది *పదుణ్డు అనే రూపానికి తప్పుగా రాసిన లేఖనప్రమాదం. చివరి రూపం నేటి 'యాభై' అనే వ్యావహారిక రూపానికి పూర్వరూపం,

100. నూర ( పై. 10.37.2,8 ), నూఱు ( *EI* 27.234-36.13, 625-50 ), నూట ( *SII* 10.6.7, 1043 ), నూఱింటికి (పై. 5.23.10,

1094), నూర్-వ్వురు (పై. 6.109.16, 1076).

1000. వెయి ( *NI* 3.1152-55.46, 7 ); వేయు ( *SII* 6.585 13, 633-63), వే-ల్ (పై. 10.4.13, 1008); వే-గ విలాళు (*భారతి* 5.935-48.14, 675 ), వే-వురు ( పై. 16 ), వే-ౘ్రు ( *SII* 6 584. 12, 641), వే-గురు (పై. 10.644.105, 1060).

ఇవిగాక సంఖ్యావాచకాలయిన ఎరువు మాటలు కొన్ని దొరుకుతున్నాయి. వాటిలో ప్రాకృతం నుంచి వచ్చిన దువ (= రెండు, *EI* 9.47.59, 945-46), తిణ్ణి ( = మూడు, *IA* 185-91.28,668-69 ), చౌ ( = నాలుగు, *భారతి* 5.618,3,850), బారస ( = పన్నెండు. *SII* 10.645.10, 1060), సత్తిగ (= ఇరవై ఒకటి, పై. 6.102.5-6, 1006), పాతిక (= ఇరవై అయిదు, *AR* 75/1956-57.18, 1080 ), వంద ( = నూరు, *SII* 5.21.5-6, 1078) మొదలైనవీ, సంస్కృతంనుంచి వచ్చినత్రి( = మూడు. *CP* 13/1908-9,19, 709 ), నవ ( = తొమ్మిది, *SII* 5 1347.4 1093 ), షష్టి ( = అరవై, *భారతి*. 5.618 3, 850), నవతి ( = తొంభై. *SII* 5.1347.4, 1093), సహస్ర (పై. కోటి ( *NI* 2.607-7.8, 1074 ) మొదలైనవీ కని, పిస్తాయి. అర (*SII* 5.21.11, 1078 ) వంటి దేశ్యపదంతోను, అద్ధ (పై. 4.1014,4, 1036), ఆద (పై. 10.29.11, 971) వంటి ప్రాకృతపదాలతోను, అర్ధ (*తె.శా.* 1.163-65, 15,892-922) వంటి సంస్కృత పదంతోను సగ భాగాన్ని నిర్దేశించేవారు.

**3.39. విశేషణాలు :** విశేషణాలు అనేక విధాలు (1) విశేష్యాలకు ముందు మాత్రమే వచ్చే అస్వతంత్ర ప్రాథమిక విశేషణాలు ఒకరకం. ఆ. ఈ, ఏ- అనే త్రికం ఈరకానిది. క్రీ. శ : ఏడో శతాబ్దినుంచి పదకొండో శతాబ్దిదాకా త్రిక సంధి వైకల్పికంగానే ఉండేది. త్రికంమీది హల్లు ద్విత్వమైనప్పుడు త్రికదీర్ఘ స్వరం వైకల్పికంగా హ్రస్వమయ్యేది. ఉదా. ఆ-బసిణ్ణి (*JAHC* 3.16-21. 16-17, 678). ఆ-బ్బారణాసి (*శా.వ.మం* 1.2-3.12-13, 898-934), ఈ-ఊడ్లందు ( *SII* 6.585. 9, 633-63 ), ఇ-య్యోట్టు (*శా. వ. మం.* 1 2-3,14, 898-934 ), ఇ-ప్ప్రతిమ ( *SII* 10.633.3,8 ), ఎ-వ్వర్ (*భారతి* 23.182-86, 14, 641). ఇక్కడి ఆగమ యకారమూ సంయుక్తహల్లులోని

మొదటిహల్లూ ద్విరుక్తం కావటం గమనించాలి. (2) విశేషణంగావాడే ద్వితీయాది విభక్త్యంగం రెండో రకం: (3) సంఖ్యావాచక విశేషణాలు మూడోరకం. (4) -ఎణ్డు/-ఎడు అనే మానార్థక ప్రత్యయాలు చేరిన విశేషణాలు నాలుగోరకం. ఉదా. మాన్-ఎణ్డు (*SII* 10.29.9-10, 971), మాన్-ఎడు (పై. 5.12.11, 1074). (5) విశేష్యంమీది ము ప్రత్యయ స్థానంలో వినిమాయక పదాంశమైన 'పు' వర్ణకం చేరిన విశేషణాలు అయిదోరకం. ఉదా. వేప్-ఊర్ (*EI* 14.153-55.3, 145-46), వేం-బళ్కి (పై. 30.280-34.6, 972). ఈ విశేషణాలు బహు విరళంగా ఉండేవి. (6) అజంత విశేష్యంమీద అజాది విశేష్యానికి ముందు టుగాగమం కాగా ఏర్పడ్డ విశేషణం ఆరోరకం. ఉదా. ఇరుకు-ట్-ఊరి (పై. 31.74-80.39-40;669). (7) విశేష్య విశేషణ లక్షణాలు రెండూ కలవి ఏడోరకం. ఉదా. ఉరువు-పల్లి (పై 3.277.17, 466). (8) కేవలం విశేషణంగా మాత్రమే ప్రయోగింపబడేవి ఎనిమిదోరకం. ఉదా. చెఙ్ + చెరువ్ (*భారతి* 1.110-22.13-14, 815-410), చిట్-ఏరు (*JAHRS* 5.51-56.19,763). (9) క్రియాపదాలుగా కూడా ఉండే ధాతుజ విశేషణాలు తొమ్మిదోరకం. ఉదా: (i) భూతకాలిక విశేషణాలు-ఇచ్చిన (*EI* 27.225-28.4, 575-600), ఉపేక్షించిన (*శా. ప. మం.* 1.2-3.20, 898-934), (ii) తద్ధర్మార్థకవిశేషణాలు : మను-వాణ్డు (*SII* 10.599.33,625-50). వక్రంబు రాదెంచు-వేర (పై. 35.5-6, 10). ఇక్కడి 'రాదెంచు' అనే రూపం గమనార్హం (iii) వ్యతిరేకార్థక విశేషణాలు : పెటని-వారు (పై. 633.2-3, 8), కొలది లేని-కొట్టంబుల్ *భారతి*. 5.792.11,848-49).

ఇవిగాక నామవాచకం మీద అగుధాతు భూతకాలిక విశేషణరూపం 'అయిన' చేర్చి నిర్మించిన విశేషణాత్మక పదబంధాలు చాలా విరళంగా కనిపిస్తాయి. ఉదా. ఉత్తమోత్తమున్డ్-అయిన (*EI* 27.231-34.4, 625-50). శాసనస్థ నిదర్శనాలను బట్టి ఈ పదబంధనిర్మాణం క్రీ. శ. ఏడో శతాబ్దిలో కడప మండలంలో ఆరంభమై, 8-10 శతాబ్దులమధ్యకాలంలో దక్షిణకోస్తాకు వ్యాపించి, పదకొండో శతాబ్దికి యావదాంధ్రదేశంలో వాడుకలోకి వచ్చినట్లు తెలుస్తుంది.

**3.40.** అవ్యయాలు : మూడురకాల అవ్యయాలు శాసనభాషలో కనిపిస్తాయి. (1) విశేష్య ప్రాతిపదికకు 'కా' అనే అసంపూర్ణ క్రియారూపాలు చేరి ఏర్పడ్డవి. ఇవి అసంఖ్యాకం. (2) సర్వనామాలుగా భావించబడేవి. ఉదా. ఇట్టి

(=ఇట్లు, (అ. వ. 1941-42.14-15.2, 600-25), ఏమి (తె. శా. 1.163-65.30, 892-922), అట్లు (శా. వ. మం. 1.2-3.41-42, 898-934), (3) అవ్యయ ప్రయోగంకల స్వతంత్ర శబ్దాలు ఉదా. మఱి (*SII* 6.585.1, 633-43), పిదప (పై. 4 922 2, 8), అర్థిన్ (శా. వ. మం. 1.2-3.7, 898-934), నెగి (పై, 10), మిణ్ణక (*EI* 30.280-84.14 972), పోలె (*భారతి*. 5.618.3, 850), తొల్లి (రా. వ. సం. 25-29.5,1065), పరువడి (పై.7). వీటిలో 'మిణ్ణక' అనేది ఒకనాటి *మిణ్ణు అనే క్రియకు వ్యతిరేకార్థక విశేషణరూపం.

**3.41. క్రియలు :** క్రియలు మూడువిధాలు : సామాన్య, సంకీర్ణ, సమస్త క్రియలని. ఏకధాతుకమైన 'అగు' వంటివి సామాన్యక్రియలు. ఇవన్నీ దేశ్యాలే. నామప్రాతిపదికమీద క్రియాకారకప్రత్యయంచేరి ఏర్పడ్డ క్రియలు సంకీర్ణక్రియలు. ఇవి దేశ్యాల్లోనూ, ఎరువుమాటల్లోను ఉన్నాయి. ఉదా. (i) దేశ్యాల్లో : కట్ట్-ఇఞ్చ్-(*భారతి* 5.473-84.4, 848), ముట్ౘ్-ఇల్-(తె. శా. 1.163-65.59, 892-922); (ii) ఎరువుమాటల్లో : అనుభవ్-ఇంచు (పై. 22), ప్రవర్త్-ఇల్ల్-(*SII* 10-28.2-3, 719-20). సమస్తక్రియలు కేవలం దేశ్యాలే. ఇవి విరళంగా క్రీ. శ. ఎనిమిదో శతాబ్దినుంచీ కనిపిస్తుండేవి. వీటిలో క్రియాప్రాతిపదిక మీద మరో క్రియాపదాంశంచేరి ప్రత్యేకార్థాలనిచ్చేవి, అస్వతంత్ర నామధాతువుమీద అనుబంధక్రియచేరి ఏర్పడ్డవి, అని రెండురకాలున్నాయి. మొదటిరకం సమస్త క్రియలకు ఆయా అర్థాల్లో కొన్ని ఉదాహరణ లివి : (1) వర్తమానార్థకం : ఏలుచ్-ఉన్ని (*EI* 11 337-47.9, 725); (ii) భవిష్యదర్థకం: నడపం-గల (*SII* 4.1015.13, 1084); (iii) ఆత్మార్థకం : అటిసి-కొన్న (తె. శా. 1.163-65,71-72, 892-922); (iv) అనుజ్ఞార్థకం: మణం-జనదు (పై- 70-71); (v) ఆధిక్యార్థకం: రా-దెంచు (*SII* 10-35.5,10); (vi) కర్మణ్యర్థకం: కట్ట-బడిన (పై. 629.5-6, 825), (vii) నిశ్చయార్థకం : రక్షిమ్పను-వలయున్ (తె. శా. 1.163-65.49, 892-922). ఇక రెండోరకం సమస్త క్రియలు చే-కొని (*భారతి* 5.618.8, 897) వంటివి.

**3.42. అకర్మక సకర్మకాలు :** అకర్మకక్రియధాతువుమీద '-చు'ప్రత్యయంచేరిగాని, '-ఇంచు' ప్రత్యయంచేరిగాని సకర్మకక్రియలు ఏర్పడతాయి. అకర్మకధాత్వంతంలోని '-చు' 'పు'గా మారినప్పుడుకూడా సకర్మకక్రియ లేర్పడ

తాయి. ఉదా. (i) అ. క్రి.ధా. + -చు: చెఱి-చిన (తె. శా.1.163-65.75-58), 892-922). ఈ మార్పు జరిగేటప్పుడు ధాతుగత డకారం అకారంగా మారేది. ఇది క్రీ. శ. ఎనిమిదో శతాబ్దినుంచీ కనిపిస్తున్నది. (ii) అ. క్రి. ధా. -చు>-పు: చమ్-పిన (*EI* 27.234-36.20, 625-50), ఈ మార్పు జరిగేటప్పుడు ధాతుగతచకారానికి నకారం ఆదేశమవుతుంది. (iii) అ.క్రి.ధా. + ఇంచు: రా-ప్-ఇంచి (తె.శా. 1.163-65. 26 892-922).

**3.43. ప్రేరణార్థకాలు** ; ప్రేరణార్థకక్రియలు రెండు విధాల ఏర్పడేవి : (i) సకర్మకధాతువుకు -ఇంచు ప్రత్యయంచేరిగాని [ఉదా. కట్ట్-ఇఞ్చి (భారతి 5.473-84.4,848), కావ్-ఇఞ్చి (*EI* 30.69-71.4, 699-700) ], సకర్మక ధాతుగతమైన చకారానికి పకారాదేశంవచ్చిగాని [ఉదా. కుడి-పిన (పై. 27 230 .31.6 625-50). పం-పు (పై. 211-25.7-8, 575-600)] ఈమార్పులు జరిగేటప్పుడు పకారానికిముందు నకారం ఆదేశం కావటమో (ఉదా. చొచ్-చు> చొన్-పు), ధాతుగతచకారానికి ముందున్న నకారం మకారంగా మారటమో (ఉదా. పన్-చు>పమ్-పు) జరిగేవి.

**3.44. ప్రాతిపదికల పర్యాయరూపత : పదమధ్యసంధి** : కాలార్థక ప్రత్యయాలు చేరేటప్పుడు క్రియాప్రాతిపదికల స్వరూపాల్లో కొన్ని రకాలమార్పులు వచ్చేవి. అవి పదమధ్యసంధులే అయినా ప్రాతిపదికల పర్యాయరూపత ఒకేచోట నిరూపించటంలో లాఘవ ముంది. కాబట్టి సంధి ప్రకరణంలోకాక వీటిని ఇక్కడే వివరిస్తున్నాం. ఈలాంటి మార్పులు ముఖ్యంగా ఎనిమిదిరకాలు. (1) భూతకాలిక ప్రత్యయాలైన ఇ,ఎలు గాని చేదర్థక ప్రత్యయగతమైన ఇకారంగాని చేరినప్పుడు ధాతుగతయకారం సకారంగా మారేది. ఉదా. కేస్-ఇ (పై. 30.69-71.5, 699-700), అటిస్-ఇన (*SII* 10.599.25, 625-50), కేస్-ఇరి (పై. 47.2,7), వ్రాస్-ఎ (పై. 599.22,625-50), విడిస్-ఇన (భా. ప. మం. 1 2-3.15, 898-934). (2) ధాతుగతమైన ఉకారం ఇకారంగాను, ఇకారం అకారంగాను ప్రత్యయాదినున్న ఇ,ఎ,ల ముందు ఐచ్ఛికంగా మారేవి. ఉదా. (i)-ఉ>ఇ : కుడిప్-ఇన (*EI* 27.230-31.6, 625-50), పొడిచ్-ఇ (*SII* 10,28.5, 719-20 ), ఉడిచ్-ఎ ( భారతి 5.618.7, 897 ), చెఱిచ్ - ఇనను (తె. శా. 1.163.65.57-58, 892-922). ఈ మార్పుజరగని రూపాలు లేకపోలేదు. ఉదా. పొడుచ్-ఇ (*SII* 10.632.3, 725-75). (ii)

ఇ>అ: కొలచ్-ఇ (పై. 6,250.7, 742-98), నడవ్-ఇన (పై. 10.605. 15,8), కదవ్-ఇనను (*EI* 30.280.84.14, 972). (3) ద్వితీయాక్షరగత మైన ఊనికలేని అచ్చులు లోపించటమో చ్యుతం కావటమో జరిగేది. ఉదా. నిల్ప్-ఇ (*SII* 6.585.1, 633-63), నిల్ప్-ఎ (*NI* 1.287 4: 650), పల్క్-ఇన (*EI* 27.230 31.7, 625-50), నిల్ప్-ఇరి (*SII* 10.600.3-4, 8), నిల్ప్-ఇనం (*EI* 11.337-47.23, 725). (4) ప్రత్యయాది ఇ, ఎ,ల ముందున్న ధాతుగతవకారం యకారంగా మారేది. ఉదా. పో-యె/పోయ్-ఎ (పై. 24.183-931.11, 825), పోయ్-ఇన (*SII* 6.102 23-24, 1006). (5) తుమర్థక ప్రార్థనాద్యర్థక ప్రత్యయాలు చేరినపుడు ధాతుగతమైన అద్విరుక్త హల్లుకు ముందున్న అచ్చుదీర్ఘంగాను, ద్విరుక్తహల్లుకు ముందున్న అచ్చుహ్రస్వంగాను, పర్యాయరూపత పొందేవి. ఉదా కొ-ం-మ్మ (తె. శా. 1.163-65.32, 892,922), పో-ం-మ్ (*NI* 1,245.5. 10), పొయ్య్-అ (*SII* 5.71.8-9. 1099). వీటిలోని 'పోము' అవ్యాకృత రూపమై 'పొమ్ము' సాధురూపంగా నిలిచింది; 'పోయ' సాధురూపమై 'పొయ్య' అసాధువై పోయింది. (6) తుమర్థక ప్రత్యయం ముందున్న ధాతుగతచకారం వకారంగా మారేది. ఉదా. కావ్-అన్ (తె. శా. 1.163-65 73-74, 892-922). (7) 'ఈ'ధాతు తుమర్థకరూపం 'ఈయ్ అన్' (పై. 44) అని కనిపిస్తుంది. ప్రత్యయాచ్చుముందు యడాగమం జరిగిందన్నమాట. (8) ప్రత్యయాద్యచ్చు లోపించటంవల్ల ప్రాతిపదిక స్వరూపంలో వర్ణసమీకరణం జరిగి మార్పు వచ్చేది. ఇది రెండురకాలు (i) మన్-న (పై. 74)వంటి రూపాల్లో పురోగామిసమీకరణమూ. ఇడ్డ్-అ (శా.వ.మం. 1.2-3.41, 898-934), ఉన్న్-అ (భారతి 5.618. 12, 897), కొణ్ణ్-అ (*SII* 10.611.2.8) వంటి రూపాల్లో తిరోగామిసమీకరణమూ కనిపిస్తాయి.

**3.45. భూతకాలిక సమాపక్రియ :** భూతకాలిక సమాపకక్రియలకు ముఖ్యంగా రెండువర్గాల ప్రత్యయాలు చేరేవి. వాటిలో మొదటివర్గానికి చెందినవి 'ఇ, ఇతి, ఇన్, ం' అనే సపదాంశాలు. అందులో మొదటి రెండూ హలాది పురుష ప్రత్యయాలకు ముందురాగా, మూడోది అజాది పురుష ప్రత్యయాలకు ముందు వచ్చేది. నాలుగోది ధాత్వంత యకారానికి పురుష ప్రత్యయానికీ మధ్య మాత్రమే వచ్చేది. ఉదా. ఇచ్చ్-ఇ-రి (పై. 599.30.31, 625-50), ఇచ్చ్-ఇతి-రి

AR 238/1949-50.8, 8), ఇచ్చ్-ఇతి-మి (*SII* 10-10-12, 1078), ఇచ్చ్-ఇన్-అణ్ణు (AR77/1956-57 14-15,1096), ఐ-Φ-రి (*SII* 6.102 35, 1006). పై వాటిలో 'ఇ' మధ్యమపురుష మహన్మహతీ బహు వచనాలకు ముందువచ్చేది. -ఇతి- ఉత్తమ మధ్యమ పురుషల ఏకబహువచనాలకు ముందు వచ్చేది రెండోవర్గానికి చెందిన ప్రత్యయాలు 'ఇయె (న్) ఎ(న్-ఉ)' అనేవి ప్రథమ పురుషైకవచనంలోను, ప్రథమ పురుషలోని అమహద్బహువచనానికి ముందూ వచ్చేవి. ఉదా :- ఇయె(న్) : పడ్-ఇయె (పై. 641.6, 8), పడ్-ఇయెన్ (పై. 632 3,725-75) : -ఎ-: నిల్వ్-ఎ (*NI* 1.287.4,650); -ఎన్-:నిల్వ్-ఎన్ (భారతి 5.618 12,897), కట్ట్-ఎను (పై. 478-84. 7,848). -ఎన్- ప్రత్యయం బహుశా -(అ)న్ అనే పురుషవాచక ప్రత్యయంతో కలిసి ఏర్పడ్డ సంసక్త సపదాంశం కావచ్చు.

**3.46 క్త్వవదర్థకం** : -ఇన, -న, ప్రత్యయాలు క్తవదర్థంలో వచ్చే సపదాంశాలు. హలంతధాతువులమీద సాధారణంగా నిలిచే ప్రత్యయగత ఇకారం ధాతుగతయకారం తర్వాత నిత్యంగా లోపించేది. ప్రత్యయాచ్చు లోపించిన సందర్భాల్లో వర్ణసమీకరణంవల్ల వచ్చేకొన్ని మార్పులను ఇంతకుముందే సూచించాం (§ 3 43). ఉదా :- ఇచ్చ్-ఇన (*EI* 27.225-28.4, 575-600), అయ్-న(పై. 24 183-93.5, 825),ఇడ్-అ(శా.వ.మం.1 2-3 41,898-934).

**3.47· క్త్వార్థకం** : క్త్వార్థకంలో -ఇ ప్రత్యయంవచ్చేది. ధాతుగతయకారం తర్వాతమాత్రం దానికి పాక్షికలోపం కలిగేది. ఉదా. అయ్-ఇ (*EI* 29 160-64.8, 680), అయ్-Φ (శా. వ. మం, 1.2-3-27, 898-934). అయితే క్రి. శ. ఎనిమిది తొమ్మిది శతాబ్దుల్లో కనిపించే పొడిచ్చి (*SII* 10,614. 7,8), పొడుచి (పై. 632.3,725.75), పొడుచ్చి (పై. 626.4, 848-92) అనే రూపాలు ఆధారంగా మూలద్రావిడ భూతకాలిక ప్రత్యయం *-చి అప్పటికింకా నిలిచిఉందేమోనన్న సందేహం కలుగుతుంది. *పడిమె.* పడె అనే భావితరూపాలకు బదులుగా శాసనాల్లో పడి-చె (పై. 629.9,835) వంటి రూపాలు కనిపించటం ఈ సందేహాన్ని దృఢపరుస్తున్నది. ఈ రూపాలన్నీ రాయవలసీమ దక్షిణప్రాంతల్లోనే ఉండటం మరో విశేషం.

**3.48 తద్ధర్మార్థకసమాపకక్రియ** : తద్ధర్మార్థక సమాపకక్రియలు రెండు రకాల నిర్మాణంతో కనిపిస్తాయి : పురుషబోధక ప్రత్యయాలున్నవీ, లేనివీ.

(1) పురుష ప్రత్యయాలున్న వాటిలో '-తు. -దు, -డు, -Φ-' అనేసపదాంశాలు తద్ధర్మార్థక ప్రత్యయాలు. ధాత్వంతణకారం తర్వాత డాదిసపదాంశమూ, నకారం తర్వాత తాదిసపదాంశమూ వచ్చేవి. ధాత్వంతాచ్చు తర్వాత దాది సపదాంశం కని పిస్తుంది. 'కల' అనే అసంపూర్ణ క్రియమీద శూన్యసపదాంశం వస్తుంది. ఉదా. కొణ్-డు-మ్ (నేటి 'కొందుము'కు పర్యాయరూపం) (తె. శా. 1 163-65.34, 892-922), కొణ్-డ్-ఱు (*SII* 10.633.4 8), కాన్-తు-రు (రా. ప. సం. 187-89.20, 1018). ఉణ్ణు-దు-రు (పై. 23), కల-Φ-ర్ తె. శా. 1.163-65.72, 892-922), కళా-Φ-ఈ (*EI* 30.12.26.8). *కల వారునుంచి *కలారు అర్వాచీన కాలంలో ఏర్పడ్డదన్న సంప్రదాయవ్యాకర్తల ఊహ సరికాదని, కలరు కలారులు అన్యోన్యం పరిమాణాత్మక రూపాంతరాలని గ్రహిం చాలి (2) పురుష ప్రత్యయాలులేని తద్ధర్మార్థకసమాపకక్రియలలో -ఉ(న్) అనే అర్థకప్రత్యయం కనిపిస్తుంది. ఉదా:-అగ్-ఉ (పై. 27.228-229.8. 600-25), వలయ్-ఉం (తె. శా. 1.163-65 30-31. 892-922).

**3.49. తద్ధర్మార్థక విశేషణం** : తద్ధర్మార్థక విశేషణ ప్రత్యయాలు రెండు రకాలు: '-ఉ(న్)-,-Φ-'లు ఒకరకం; 'ఎడి,-ఎడు,-ఏ, -ఏట్టి'లు రెండోరకం. ఉదా. (i) పంప్-ఉ (*EI* 27-221-25.7-8, 575-600), తెచ్చ్-ఉన్ (*SII* 4.1015.11. 1084), అన్-Φ (ఆం. ప. 1941-42.5,600-25), కల-Φ (*SII* 6.585.11. 632-63), వణ్డ్-ఎడి (పై. 4.1015.11, 1084), ఏళ్-ఎడు (శా. ప. మం. 12-3.30, 898-934). అ-ఏ (*అయ్యే అనటానికి బదులు తప్పుగా, *SII* 4.1029.10), 1100 అప్-ఏట్టి (*అనేటి అనటానికిబదులు తప్పుగా, పై. 6 586.8, 1074). చివరి రెండు రూపాలనూ గమనించేది.

**3.50 విధ్యర్థకం** : నడుపునది (పై. 5.1144.7. 1069) అనే విధ్యర్థకరూపం ఒక్కటే లభించింది. ఇది ధాతుజవిశేషణంగా, విశేష్యాలకు ముందు వచ్చినప్పుడు విశేషణంగా. క్రియాపదంగా, కూడా భావించదగ్గది. నిర్మాణ క్రమాన్నిబట్టి దీన్ని పురుషత్రయం చేంన తద్ధర్మార్థక సమాపకక్రియగా పరిగణించ వచ్చు. కాని ఆ క్రియారూపానికి దీనికిలాగా విధ్యర్థంలేదు. -అది అనేదాన్ని నిర్దేశ సర్వనామ ప్రత్యయమని భావించవచ్చుగాని దీనికి పురుషబోధకత్వంలేదు. ప్రథమ. మధ్యమ పురుషల్లో రెండు వచనాల్లోనూ ఇది ఒకే రూపంలో ఉంటుంది. కానీ

ఉత్తమ పురుష రెండువచనాల్లోనూ దీనికి ప్రయోగంలేదు. 'ఉన్-అది' అనే ప్రత్యయాలద్వారా విధ్యర్థమిచ్చే క్రియాపదంగా వర్ణించవచ్చు. అందువల్ల దీని నిర్మాణ సంక్లిష్టతను ఏదో ఒకవిధంగానే వర్ణించటం సరికాదు. దీనికి ఆధునిక రూపం 'నడిపేది'.

**3.51. చేదాద్యర్థకం** '-ఇనన్,-నను' అనేవి చేదాద్యర్థక ప్రత్యయాలు. -నను లోని చివరి ఉకారం అపదాంశ మనవచ్చు. ధాత్వంతయకారం మీది ప్రత్యయాది ఇకారం లోపిస్తుంది. కొన్ని సమయాల్లో ఈ ప్రత్యయాద్యచ్చు లోపించి వర్ణసమీకరణం జరిగినందువల్ల పదమధ్యసంధి కలుగుతుంది. ఉదా: కట్ట్-ఇనన్ (పై. 10.599 30, 625-50), కొణ్-ణన్ (పై. 631.8, 9/10), అయ్-ననుం (తె. శా. 1.163-65. 34-35,892-922).

**3.52. ప్రార్థనాద్యర్థకం** : ప్రాతిపదిక పురుషప్రత్యయాలమధ్య ఏప్రత్యయమూ చేరకుండనే ప్రార్థనార్థక క్రియరూపమేర్పడుతుంది. అలాంటి సమయాల్లో ధాతుగతదీర్ఘాచ్చుమీద అద్విరుక్తహల్లుగాని, హ్రస్వాచ్చుమీద ద్విరుక్తహల్లుగాని నిత్యంగా రావటం కద్దు. ఉదా కో-Φ-మ్మ (పై.32), మను-Φ-ము (పై. 67), పో-Φ-మ్ (*NI* 1.245.5, 10).

**3.53. తుమర్థకం** : -అ(న్), -అంగ మొదలైన సపదాంశాలు తుమర్థంలో ధాతువులమీద చేరుతాయి. (ం)గ అన్నది 'కా' అనే అసంపూర్ణక్రియా రూపమే. ఇది ఉన్నా లేకపోయినా అర్థలోపంగాని భేదంకాని, లేదుకాబట్టి దీన్ని అంశాభాసంగానే పరిగణించాలి. ఉదా. ఏళ్-అన్ (*EI* 27.221-25 5, 575-600), ప్రవర్తి౦ల్ల్-అ (*SII* 10 28.2-3, 719-20), ఒప్ప్-అంగ (*భారతి* 5.473-94.3-4 848), నా-Φ (రా. వ. నం. 25-29.7, 1095). చివరిపదం *అనం అనే క్రియారూపంలో వర్ణవ్యత్యయంవచ్చినందువల్ల ఏర్పడ్డది. ప్రాతిపదికాంత దీర్ఘాచ్చుమీది ప్రత్యయాది అకారం లోపించింది.

**3.54. శత్రర్థకం** : శత్రర్థంలో ధాతువుమీద చుప్రత్యయం వచ్చేది. ఉదా. ఏళు-చు (*EI* 27.231-34. 5-6, 625-650). శత్రర్థక క్రియారూపానికి ఉండు ధాతురూపాలను అనుబంధించి వర్తమానకాలిక క్రియలను నిర్మించేవారు. వృత్తవర్తిష్యమాణ క్రియరూపాలు తెలుగులో డొంకతిరుగుండు నిర్మాణంవల్లనే ఏర్పడుతాయి.

**3.55. వ్యతిరేకార్థక క్రియారూపాలు :** తద్ధర్మార్థక సమాపక క్రియకు వ్యతిరేకరూపం ధాతువుమీద -(అ)దు అనే ప్రత్యయాన్ని చేర్చటంవల్ల ఏర్పడేది. ప్రత్యయాది అకారం హలంతధాతువులమీద నిలిచి అజంతధాతువులమీద నిత్యంగా లోపించేది. ఉదా. చన్-ఆదు (తె. శా. 1.163-65,71, 892-922), లే-దు (*EI* 30.280-84.13, 972). ధాతువుకు -(అ)ని ప్రత్యయంచేరగా వ్యతిరేకార్థక విశేషణాలు ఏర్పడేవి. ఉదా. పెట్-అని (*పెట్టని-కి బదులు తప్పుగా, *SII* 10.633 2-3,8), లే-ని (*భారతి* 5.792,10,848-49). వ్యతిరేకక్త్వార్థకక్రియలు ధాతువుకు -(అ)క ప్రత్యయంచేరి ఏర్పడేవి. ఉదా. ఓప్-అక (తె. శా. 1.163-65.74, 892-922). లే-క్ (పై. 3-4). పై మూడురకాల వ్యతిరేకక్రియల్లోనూ ప్రత్యయాది అకారం హలంతధాతువుల తరవాత నిలిచి అజంతాల మీద నిత్యంగా లోపించేది. ఈ లక్షణం సపదాంశాల పరిపూరకప్రవృత్తికి చిహ్నమేగాని ప్రత్యయాద్యకారం వ్యతిరేకార్థకంకాదని సూచించదు. అయితే సంప్రదాయ వ్యాకర్తలు (*బా.వ్యా.* 8.32,37;39:47; ముఖ్యంగా 20) ఈ అకారాన్ని ఎందుచేతనో అలా భావించలేదు.

**3.56. వర్తమానక్రియ :** శత్రర్థక క్రియలకు ఉండు ధాతురూపాలను చేర్చి వర్తమానక్రియలను డొంకతిరుగుడుగా నిర్మించేవారు. ఉదా. ఏళుచ్-ఉన్ణి(*EI* 11.337-47.9,725), చేయుచ్ - ఉన్న (తె. శా. 1.163-65.15-16,892-922), వార్ధిఁలుచున్-ఉణ్ణు (*వర్ధిలుచుండు-కు బదులు తప్పుగా, *త్రిలింగ రజతోత్సవ సంచిక* 352-64.23, 991).

**3.57. భవిష్యత్క్రియ :** ధాతువు తుమర్థక రూపాన్ని ప్రాతిపదికగా తీసుకొని దానిమీద అసంపూర్ణక్రియ అయిన 'కల'ను చేర్చి భవిష్యత్కాల క్రియలను డొంకతిరుగుడుగా నిర్మించేవారు. ధాతుగత ద్రుతం తరవాత 'కల'నిత్యంగా 'గల'గా మారేది. ఈరకం క్రియలు క్రీ.శ. పదకొండో శతాబ్ది శాసనాల్లోమాత్రమే లభించాయి. ఉదా. ఓయం-గల (*SII* 4.1009.8-9,1092), పొయ్య-గల (పై. 5.71 8-9, 1099), ప్రతిపాలింపం-గల ( పై. 6.109.17, 1076). 'కల' స్వతంత్ర క్రియగాకూడా శాసనాల్లో కనిపిస్తుంది. ఉదా. కల-యంతకును (*EI* 4.314-18,22, 1075-76).

**3.58. ఉత్తమ పురుష :** ఉత్తమపురుష ఏకవచన క్రియలు శాసనాల్లో లభ్యపడలేదు. '-మి/-ము' అనే సపదాంశాలతోటి బహువచనరూపాలు దొరికాయి.

ఉదా కోఁణ్-మ్ (తె. శా. 1.163-65.34, 892-922), ఇచ్చితి-మి (*SII* 10.10.12, 1078), పరిహరించ్చితి-మి (పై. 651.15-16, 1091-92). '-మి/-ము'ల రూపం ప్రత్యయాంతాచ్చుతో వ్యవస్థితమై ఉంటుంది; -ఇతి- తరవాత -మి గాను, -డు-/-*దు-ల తరవాత -ము- గాను కనిపిస్తుంది.

**3.59.** **మధ్యమపురుష** : ప్రార్థనార్థక క్రియరూపాల్లో మాత్రమే మధ్యమ పురుష ఏకవచన ప్రత్యయం లభించింది. **ఉదా.** కొమ్-మ్ (తె.శా. 1.163-65.32, 892.922), పో-మ్ (*NI* 1,245.5, 10), బహువచనరూపం ఒక్కటే దొరికింది, **ఉదా.** ఇచ్చితి-రి (*AR* 233/1949-50.8,8).

**3.60.** **ప్రథమపురుష** : లింగభేదంమీద ఆధారపడి ప్రథమపురుషలో భిన్న ప్రత్యయాలు కనిపిస్తాయి. ఏకవచనంలో మహదమహద్భేదంతోనూ బహువచనంలో ప్రాణివాచక అప్రాణివాచక భేదంతోనూ పురుషభేదక ప్రత్యయాలు దొరుకుతున్నాయి. విశేష్యాల్లో కనిపించే ఈఅన్వయం క్రియల్లోకూడా కనిపిస్తుంది. మహాదేకవచనంలో -(అ)ణ్ఱు అనే పదాంశం కనిపిస్తుంది. ఉదా. కల-ణ్ఱు (*త్రిలింగ రజతోత్సవ సంచిక* 352-64.31, 991), ఇచ్చిన్-అణ్ఱు (*AR* 77/1956-57. 14-15, 1096). వీటిలోని రెండోరూపం కావ్యభాషలో క్రీ.శ. పదమూడో శతాబ్ది నుంచి మాత్రమే కనిపిస్తుంది. *ఇచ్చినవాణ్ఱు నుంచి ఈరూపం ఏర్పడటం క్రీ. శ. పదకొండో శతాబ్దిలో గోదావరీమండలంలో ఆరంభమైనట్లు తోస్తుంది. అమహదేకవచనంలో '-అది, -అదు -దు' అనే సపదాంశాలు కనిపిస్తున్నాయి. **ఉదా.** ఇచ్చిన్-అది (*SII* 10.599.16 625-50), చన్-అదు (తె. శా. 1.163-65.71, 892-922), లే-దు (*EI* 30.280-84.13, 972), కల-యది (*SII* 10.647.38, 1097). ఇకారయుత సపదాంశం వ్యతిరేకక్రియల్లోను, ఉకారయుతం తద్ధర్మవిశేషణాల్లోను పరిపూరక ప్రవృత్తిలో ఉన్నాయి. అజంత ప్రాతిపదికమీది ప్రత్యయాద్యచ్చు నిత్యంగా లోపిస్తుంది. ప్రాతిపదికాంతంలోని అచ్చుతరవాత యడాగమం (కావ్యభాషలో లాగా) రావడంకూడా కద్దు.

మహన్మహతీబహువచనంలోని '-రి/-రు' అనే సపదాంశాలు పరిపూరక ప్రవృత్తిలో ఉన్నాయి. ప్రాతిపదిక చివరి ఇకారం తరవాత -రి ఇతరత్రా -రు పురుషప్రత్యయాలుగా కనిపిస్తాయి. **ఉదా.** కేసి-రి(పై. 47.2,7) కొణ్డ్-ఋ పై. 633.4,8), తాగి-రి (*EI* 337-47.19, 725), కల-ర్ (తె. శా. 1.163-

65.71-72, 892 922). పోదు-రు (*AR* 390/1932-33.39, 1081), పోవుదు-రు పై. 18-19). 'కొజ్జు'లోని శకటరేఫ సంధికారణంగా ఏర్పడ్డది. అప్రాణివాచక బహువచన రూపం ఒకటి మాత్రమే దొరికింది. ఉదా. ఇచ్చిన-వి (*SII* 10.12.9, 1087).

**3.61. ఏవార్థకం :** ఏవార్థకంగా -అప్రత్యయం మాత్రమే కనిపిస్తుంది. ఉదా. పాఱక్-అ (*AR* 392/1904.9.-10, 575-600), చిర్వలి-య (*EI* 27.231-34.5, 625-50). అజంత ప్రాతిపదికమీద యడాగమం రావటం గమనార్హం. ఈ ప్రత్యయాన్ని పునరుక్తంగా ప్రయోగించటం కూడా అత్యంత విరళంగా ఉండేది. ఉదా. తాన్-అ-య (తె. శా. 1.163-65.42,892-922). ఈ లక్షణం కావ్యభాషలోనే నిలిచింది.

**3.62. సందేహార్థకం :** అనిశ్చయ, సందేహార్థాలను సూచించే ప్రత్యయం -'(య్)ఏని(యు/న్)'. ఉదా. కలర్-ఏనియు (పై.72-73), ఎవ్వి-యేనిన్ (పై. 54-55), ఎవ్వాండి-ఏని (*SII* 10.4.12,1008). -ఏని ద్రుతమా కళా అనే విషయంమీద సంప్రదాయపండితులు తీవ్రచర్చలు జరిపారు (బా. వ్యా. 2,9;3.41,119; *సోమయాజి* 1948, పే. 307, 491, 552-54). క్రీ. శ. 9/10 శతాబ్దినాటి ఒకేశాసనంలో రెండురకాల రూపాలూ కనిపిస్తున్నాయి(చూ.పై.). ద్రుతరహితరూపమే ప్రాచీనమైనది. అనుచితవిభాగంవల్ల దీనికే 'నేని' అనే రూపాంతరం కలిగిందని (*సోమయాజి*, 1948, 307), వాస్తవానికి 'నేని' అనేదే మొదటి రూపమని పండితులు నిర్ణయించుకొని కొన్ని సమయాల్లో పురాతన కావ్యప్రయోగాలను కూడా దిద్దివేశారు. కాని 'నేని' అని వ్యాకరించదగ్గ సందర్భమేదీ శాసన భాషలో తటస్థ పడలేదు.

**3.63. సముచ్చయం :** సముచ్చయార్థక పదాంశం శాసనభాషలో విశేష్యాలమీద, క్రియలమీద, సందేహార్థక ప్రత్యయంమీద, సముచ్చయార్థాన్నే ఇచ్చే అవ్యయంమీద కూడా బహురూపాలతో వస్తుంది. ఉదా. (i) విశేష్యాలమీద : అన్నియు- (పై .6.585.4, 633-63),కళాకఞ్చుగ్-ఉమ్(పై.584.9-10.641), గుఞ్చ-వు (*NI* 3.1152-55), నాలు-ను (*AR* 182/1933-34, *pt* II *p*. 41.2-3,7)కోటి-యి (*భారతి* 1948, 270-90 369-75.65-66, 892-922). గుడి- యిని (*EI* 30.260-84.6,972), గుడి-యింని (*SII*

6.586.7,1074); గావుండా-ను (AR 489/1915.5, 972)-దేవానొజ్జలక్-ఊ JAHRS 1.81-85.4 10), ఎప్పడ్ - ఊను (SII 10.4.8, 1008), నవి యునుం (పై. 4.1016 5, 1087); (ii) క్రియలమీద : ఐ-యుము (భారతి 23.182-86.14, 641); (iii) సందేహార్థకం మీద : కలరేని-యు (తె. శా. 1.163-65.72-73, 892-922); (iv) అవ్యయాలమీద : మఱి-యు (పై. 54), మఱి-యును (EI 30.280-84.10,972). వీటిలో-'ఉము' అనే సపదాంశం ప్రాచీనతమం. ఇది -'ఉను'గా మారటం క్రీ. శ. ఏడోశతాబ్దిలో ఆరంభమయింది. ఏడు, ఎనిమిది, తొమ్మిది శతాబ్దుల్లో మాత్రమే దీనికి -'ఉవు' అనే రూపాంతరం మాండలికంగా ఉండేది. హలంతపదాలమీద ప్రత్యయగతమైన '-ము,-ను' అనే భాగాలు 7-11 శతాబ్దుల మధ్య వైకల్పికంగా లోపించేవి. అదేకాలంలో అజంత పదాలమీద ఈప్రత్యయానికి ముందు యడాగమం వస్తుండేది. దీర్ఘాచ్చుగల '-ఊ, -ఊను' లాంటి సపదాంశాలు నేటి రూపాలకు పూర్వరూపాలు. -'యి' అనే సపదాంశం తీరాంధ్రంలో 9/10-11 శతాబ్దాలమధ్య మాండలికంగా వాడుకలో ఉండేది. -'యిని' అనేది క్రీ. శ. పందొమ్మిదో శతాబ్ది వ్యవహారంలోని '-ఇన్ని' అనే రూపానికి పూర్వరూపం.

**3,64. తద్ధిత ప్రత్యయాలు** : నిష్పాదకప్రత్యయాలు రెండు రకాలు : కృత్ప్రత్యయాలు, తద్ధితప్రత్యయాలు అని. చెరిఏడుప్రత్యయాలనుశాసనభాషనుంచి వ్యాకరించవచ్చు. '-(అ)రి,-ఇక, -ఇక(ము),-కాఱు, -గార్,-పల. -ఋ' అనే తద్ధితప్రత్యయాలను విస్పష్టంగా పేర్కో వచ్చు. (i) 'చేసేవాడు' అనే అర్థంలో -(అ)రి ప్రత్యయం కనిపిస్తుంది. ఉదా. తలవ్-అరి (EI 20.1-7,21.61-71 B. 2.4,3.), కమ్మ-అరి (పై.7 27.234-36.21, 625-50), పూజా-రి (AR 233/1949-50.3,8), పురవ్-అరి (SII 5.1058.4, 1084). ప్రాతిపదిక చివరి హ్రస్వాచ్చుమీద అగమాత్మకవకారం రావటం, దీర్ఘాచ్చుమీద ప్రత్యయాద్యచ్చు లోపించటం గమనించాలి. (ii) 'స్వార్థం'లో -'ఇక' ప్రత్యయంవచ్చేది. ఉదా. మాన (పై. 4.1014.2, 1038): మాన్-ఇక (AR 400/1932-33 pt. II App. B. P. 56,9,1072), (iii) 'సమూహార్థం'లో '-ఇకము' వచ్చేది. ఉదా. రట్టడి (భారతి 5.796 19.1023); రట్టడ్-ఇకము (SII 4.1029.10, 1100), (iv) 'కలవాడు' అనే అర్థంలో -'కాఱు-కాఱు' వచ్చేది. ఉదా. అంక-కాఱు (పై 6.102 5-6, 1006), నిబంధ-కాఱు (పై. 10.12.16, 1087), ప్రవిత్తి-కాఱ్

(*AR* 76/1956-57.10, 1086). ఇప్పటి '-కాడు/-గాడు' లకు ఇది పూర్వ రూపం. దీని ప్రాచీనరూపం*కాన్ట్ అయి వుంటుంది హల్పూర్వానునాసిక లోపాన్ని బట్టి ఇది కన్నడం నుంచి వచ్చిన ఎరువుమాట కావాలి. (v) 'చేసేవాడు' అనే అర్థంలోనే '-గార్' ప్రత్యయం వచ్చేది. కఞ్చ-గార్-లు (*EI*. 30.69-71 8, 699-700). 'కాంస్యకార' శబ్దభవమైన ఈశబ్దంలోని ప్రత్యయం కూడా ఆర్యభాషా భవమనే చెప్పాలి. 'కాఱు, కారుల' లోని రేఫభేదం ఇందుకు మంచి ఉపపత్తి. (vi) బహుశా దిగర్థంలో '-పల' ప్రత్యయం వచ్చి వుండవచ్చు. లోపు ఉదా. (*SII* 10. 651.13, 1090-91). లో-పల్-ఇ (*త్రిలింగ రజతోత్సవ సంచిక* 352-64. 17.991). డా-పల, వెల-పలవంటి మాటల్తో పోల్చి ఈ ప్రత్యయాన్ని వ్యాకరించటం జరిగింది (viii) 'స్వార్థం'లోనే '-ఉ' అనే అపదాంశం ఒకటి కనిపిస్తుంది. ఉదా. పొద-ఉ (*EI* 6.347-61.90, 1011) పొదశబ్దంతో ఈ ప్రత్యయంవల్ల వచ్చిన అర్థవిశేషమేమీ లేదు. బహుశా 'కూతు, కూతుఱు' శబ్దాలు కూడా ఇలాంటివేనేమో.

**3.65.** కృత్ప్రత్యయాలు : శాసనాల్లోదొరికే క్రియాపదాలతో మాత్రమే పోల్చి చూస్తే క్రియాధాతువునుంచి విశేష్యాలను తయారుచేసే కృత్ప్రత్యయాలు ఏడు లభిస్తున్నాయి. ఉదా. కూట్-అము-న (*AR* 75/1956-57.16, 1080), వాడ్-ఇక-లు (పై. 16-17). డిగ్గ్-ఇలి (*SII* 5.1058.6, 1084), తో-ట-ఱు (పై. 10.599.11, 625 50) నంజు-డ్-లు (పై. 4,1015.9,1084). తూఱ్-పు (*భారతి* 5.935-48.11, 675). కొల్-వు-నన్ (పై, 618-6, 897). ఈ పత్యయం వర్ణనాత్మకంగా వినిమాయక సపదాంశం. కావుఱ(*NI* 2.606-7.7,8) వంటి చోట్ల ధాత్వంత చకారస్థానంలో వచ్చే పకారం కూడా వర్ణనాత్మకంగా వినిమాయక సపదాంశమే అయినా తులనాత్మకంగా కేవలం ఆదేశమే ఈ ప్రత్యయానికి ముందు మకారం ఆదేశం కావటం బహువిరళమైనా ఒక విశిష్టలక్షణమే.

**3.66.** స్థలనామ ప్రత్యయాలు : శాసనాల్లో దొరికిన భిన్న స్థల నామాలను మాత్రమే పోల్చి చూసినప్పుడు ప్రముఖంగా 44 రకాల స్థలనామప్రత్యయాలు లభిస్తున్నాయి. ఆయా ప్రత్యయాలకున్న సపదాంశాలను వివరించకుండా (గ్రంథ విస్తరభీతి తప్పదు కాబట్టి) ప్రకృతి ప్రత్యయ నిర్దేశంచేస్తూ ఒక్కొక్క ఉదాహరణ మాత్రమే ఇస్తున్నాము: ఉదా. వుద్-అలి (*EI* 27,244-51 2,725-75), ఢ్లావ్-ఇండి (*SII* 6 584.4, 641), అత్త్-ఇలి (*భారతి* 12.86-96.18,709

-46, పణ్ట్-ఊర్ (*EI*6 315-19.24,284), కొడ్-ఇంకి (పై. 15.249-52-7, 554), కన్ద-ఏఱు (పై. 31.74-80.29, 669), నిడుం-గట్ట (*భారతి* 1. 189-46.15, 696-709), పులి-కల్లు (*IA* 12.213 61, 934-45), నిడు-గాడు (CP 2.1914-15.28, 764-99), గారల-గుణ్ట (*భారతి* 15.97--115 29, 945), కడా-కుదుర (*EI* 15.249-52.17,554), కొల్లి-కుఱ్ఱు (పై. 6 347-61.98, 1011). అతు-కూరు (పై. 31.74-80.29, 669), తాన్తి-కొన్ద (*IA* 9.102-3.7,5), తామర-కొలన్-ఇ (*EI* 29.57-71.108. 1022-66), ఒం-గోడు (పై. 15.249-52.17,554), నన్ది-గామ (*IA* 7.15-19.54. 945-70). పరు-వి (*EI* 3.277.14, 466), చెఙ్-చెరువ్ (*భారతి* 1.110-22.13-14, 395-410), కారమి-చేడు (*భారతి* 1.90-110.45,844-88), నలూ-చేరి (*SII* 1.31-36.19, 794-842), పరివ-తుర్ల (*భారతి* 7.297-313.45, 715-20), అఱు-తొఱ (పై.1.110-22.10-11, 395-410), కసుం దల (*SII*6.250.5, 742-98), పళ్లి-నాణ్ట్-ఇ (*భారతి* 28 182-86.5 641), కొణ్డ-నూర్-ఇ (*SII* 6.250.5, 742-98), విరి-పర (*EI* 6.84-49.10,234), పెఱుక-పఱ్ఱు (పై. 15.249-52.17, 554) ఉరువు-పల్లి (పై. 3.277.17,466), గొల్లి-పల్లు (*SII* 4 1016 2, 1087), దూఁద్రు. పాక (*EI*27.46.26,915-25), ఇలు-పాడ్-ఉనుం (*SII* 10.35.3,10), మల్కా-పోరము (*EI* 5.131-34 33, 918-25), అమ్మల-పూణ్డి (*భారతి*. 15.97-115.47, 945) చెఱు - వూరు (*IA* 20.15-16.18;632), ఇన్-పుఱోల్-ఇ (వ్యా. సం. 301-10.1, 600-25), చేర-మఙ్గలమ్బు-న (*SII*10.631.6-7, 9/10).సోర-మది(పై.8629 825), గో - మదువు (*IA* 12.91-95.54, 945-70), పెను - మణ్డ (*JA RS* 20.195-201-7, 957), రావి-రేవ్వు(*EI* 4.193-98.20.506). ఏఱు-వ (పై. 29. 160-64.8, 680), కూడా-వాడ (పై 17.384-37.8,610), గణ-శాల (పై. 5.139-42.28, 945-70).

**3.67. వ్యక్తినామ ప్రత్యయాలు:** వ్యక్తినామ ప్రత్యయాలు ప్రధానంగా అయిదు రకాలు : పురుష, స్త్రీ, ఉభయవాచకాలని, పునరుక్త, పూజ్యార్థకాలని. పురుషవాచక ప్రత్యయాలు మళ్ళీ అయిదు రకాలు : (i) మన్చ్యి-అణ్ణ (పై. 17.384-37.11,610), వినియ్-అణ్ణ (పై. 27.234-36.21-22,625-500), కొమ్మ-అన (*SII* 6.250.7, 742-98), అయ్త్-అన్న-యు(*EI* 30.280-84.7,

972), (ii) విట్ట్-అప ( *SII* 6.250.7, 742-98 ), (iii) మార్-అయ్య (*NI* 3.1152-55,32,7), కొచ్చ్-ఇయ ( *EI* 327.229-30,4,600-23 ), కొణ్డ్-అయ-కు (*SII* 6 150.4, 742-98), ఎట్-ఎయ (*EI* 18.58-60.12, 7432). వీటిలో ఇకారాది సపదాంశం గల రూపాలు పదకొండో శతాబ్దికిముందు బహు విరళంగాను పదకొండో శతాబ్దిలో-ముఖ్యంగా గోదావరీ మండలంలో - చాలాబహు ళంగాను కనిపిస్తాయి ఎకారాదివి కన్నడసీమకు దగ్గరలో ఉన్న తెలుగుప్రాంతాల్లో అధికాధికంగా ఉండేవి ; ప్రత్యయగత ఎకార ప్రభావంవల్ల ప్రతయాద్యచ్చుతాలవీ్క కరణంచెందిఉంటుంది. (iv) మఱున్ట-పిడుకు (పై. 27.231-34.3, 625-50), మాఱ్-పిడుగు ( పై. 234-36.13-14, 625-50 ). (v) అణ-పోతు-లు (వ్యా. సం. 301-10.2, 600-25.)

సంస్కృత సమమైన 'అంబా' ప్రత్యయంగల పదం ఒక్కటి మాత్రమే స్త్రీవాచక ప్రత్యయంతో దొరికింది. ఉదా. మేట్ = అంబా (*EI* 5.134-39.17.934-45).

స్త్రీపురుషోభయవాచకాలయిన ప్రత్యయాలు అయిదు మాత్రం లభించాయి. ఉదా. (i) పు. తాత్-అమ్మ (పై. 10-100-6.29,674): స్త్రీ. కుట్ట్-అమ్మ ( *SII* 10.600.12-13,8 ); వు. వేణ్ - అవ్ - ఒజన్టు ( *EI* 27.240-42.18-20,725) : స్త్రీ. బిజ్జెక్-అవ్వ (*JAHRS* 20.195-201.3, 957); (iii) పు. దేవ్-అణ్టి (*NI* 1.245.4, 10) : స్త్రీ. భూమ్-అణ్డి-యును (*SII* 5.1033.6, 1098); (iv) పు.పడ్-ఆలు (పై. 4.1235.4 1099 : స్త్రీ.మన్మఙ్-ఆళు (పై. 10.56.1,7); (v) పు. కూచ-పోటి-కి ( *EI*27-242-44.12,750 ): స్త్రీ. వసన్తి-పోటి ( పై. 234-36.7,625-50 ). పైవాటిలోని '-అణ్టు-ఆళు' ప్రత్యయాలు రెండూ మూలదక్షిణ ద్రావిడశబ్దం*ఆళ్/*అణ్ (=*వ్యక్తి) నుంచి ఏర్పడ్డవి. స్త్రీపురుషనామాలు రెంటిలోనూ పునరుక్త ప్రత్యయాలు కొన్ని సమయాల్లో కనిపిస్తాయి. ఉదా. పు. విద్ద్-అమ్-అయ్య ( *NI* 1.287.4, 650 ), తిక్క-అవ్-అయ్య ( *SII* 10.6 6.1043 ); స్త్రీ. మీన్-వ్అ-అమ్మ (పై. 5.12.6, 1074), పాంప్-అక్-అమ్మ-కు (పై. 1115.9, 1084). అయితే ఈ పద్ధతి బహు విరళంగా ఉండేది.

పూజ్యతను సూచించటానికి బహువచన లు ప్రత్యయాన్ని అధికంగా వాడేవారు. అదిగాక మరి నాలుగు ప్రత్యయాలు శాసనాల్లో కనిపిస్తాయి. వాటిలో

చివరిది (-గారు/-వారు) ఇప్పటికీ నిలిచింది. ఉదా. (i) జేయమ్-అయ్యరు (పై. 10.593.6, 925-50). ఇది తమిళంనుంచి ఎరువుగా వచ్చింది. (ii) కణమ--య్-ఆరు (*EI* 30 69-71.3, 699-700), ఇది *అవర్ శబ్దభవం కావచ్చు. (iii) రేవణ-కాలు (పై. 27.221-25.7,575-600), కుణ్డి-కాళ్లు (పై. 225-28.3, 575-600). 'కుణ్డిపాదాః' అనే సంస్కృతశబ్దానికి ఇది ఎరువు అనువాద మనటం సంభావ్యం. (iv) పోతయ్యం-గార్-ఇ (పై. 5.127-31.29. 892-922), విట్టపరడ్డి-వార్-ఇకి (*SII* 6.250-8.742-98). వీటిలో రెండోది అధిక పూజ్యతను సూచిస్తుంది.

**3.68.** **పదజాలం :** సంప్రదాయవ్యాకరణాలు భాషలోని పదజాలాన్ని తత్సమ, తద్భవ,దేశ్యాలనే మూడు ప్రధానభాగాల కింద విభజించాయి. అవి ఇచ్చిన నిర్వచనాలతోగాని వాటి విభజన ప్రణాళికతోగాని నిమిత్తం లేకుండా, తెలుగులోకి వచ్చిన ఎరువుమాటల్లో వాటి పదాంశాలు తెలుగు వర్ణమాలలో మార్పు లేకుండా ఇమిడిపోతే తద్భవమనీ, లేకపోతే తత్సమమనీ, ఆరెండు రకాల పదాంశాలూ కలిసి ఏర్పడ్డపదం మిశ్రమపదమనీ ఇక్కడ పరిగణిస్తున్నాం. పూర్వ వ్యాకరణాలు ప్రాతిపదికనేగాని ప్రత్యయాలను ఈ సందర్భంలో గణించలేదు. ఇక్కడ పదాంశాలనుబట్టి విభజన జరుగుతుంది. ఆలెక్కన దేశ్యదేశ్యేతర పద జాలాన్ని పోల్చి చూస్తే తెలుగులో ఇమిడిపోయిన ఎరువు మాటలు క్రీ. శ. 6-10 శతాబ్దులమధ్య మొత్తం పదజాలంలో నూటికి 20-25 పాళ్ళు ఉండగా 10, 11 శతాబ్దుల్లో నూటికి 50 పాళ్ళు అయినాయి. కావ్యభాషా ప్రభావమే ఇందుకు ముఖ్య కారణం. ఎరువు మాటల్లో అత్యధికభాగం సంస్కృత ప్రాకృతాలనుండి వచ్చినవే.

సంస్కృతం నుంచి ఎరువుగా వచ్చిన మాటల్లో ముఖ్యంగా రెండు మార్పులు కనిపిస్తాయి : ఒకటిఅర్థవిపరిణామం, రెండు సంస్కృత వ్యాకరణ విరుద్ధత. ఉదా. (i) అర్థవిపరిణామానికి : వక్రమ్బు ( = అడ్డు, *NI* 1.287.2,650), కరణమ్ ( = గ్రామాధికారి. *SII* 10.645.49-50,1060), జీవితంబు ( = జీతం, తె.శా. 1.163-65.62-68, 892-922), నియోగముల్( = జిల్లాలు, *SII* 10.645. 56,1060) మొదలైనవి. (ii) వ్యాకరణ విరుద్ధతకు : ప్రధాని (పై. 4.1010.5, 1055), మనోవల్లభి, వనజనేత్రి (*EI* 4.5314-18. 21,1075-76), ఉరమాల (*SII* 6.109.29,1076) మొదలైనవి.

**3.69. మిశ్రపదాలు :** క్రీ. శ. ఏడో శతాబ్దినుంచి 'మిశ్ర సమాసా'లని, 'వైరిపదా' లని, చెప్పబడే మిశ్రపదాలు లభిస్తూనే ఉన్నాయి. వ్యాకరణాలు నిషేధించినా ఈ పరిస్థితిలో మార్పులేదు. తత్సమదేశ్యాలతో ఏర్పడ్డ మిశ్రపదాలు సంఖ్యాధికంగా ఉండేవి. తద్భవదేశ్యాలు కలిసిన పైవాటికన్నా సగానికి సగం తక్కువగా ఉండేవి. అయితే ఈ పదమిశ్రణం కావ్యభాషలోనూ పద్యశాసనల్లోనూ అత్యల్పం; గద్యశాసనాల్లో అత్యధికం ఇది నాలుగు రకాలు. ఉదా. (i) దేశ్యతద్భవ మిశ్రణం; కణ్డసామి (*EI* 31.74-80.36,669), గొల్లపల్లు (*SII* 4.1016.2, 1087), మావ్వఁలగరుడణ్ణు (రా. ప. నం. 187-89.7-8,1018), మొగమాడుప్ (శా వ మం. 1.2-3.42, 898-934). (ii) దేశ్యతత్సమమిశ్రణం : అమృతపడి (*NI* 3.1072.17,1088), గణ్డభైరవ (*SII* 10.647. 23-24,1097), జయమాడ (పై. 6.109.29,1076), పోర్ముఖరామ (పై. 10.599, 1-2, 625-50), మానవత్రిఁక (భారతి 3.88-94.45,1060. (iii) తత్సమ తద్భవ మిశ్రణం : ఉదారబుద్ధి (*SII* 10.688.3, 9/10), మనరాచమణి (*NI* 3.1152-55.29-30,7) చౌషష్టి (భారతి 5. 618.3,850), లోహ దణ్డు (*SII* 4.1161.5, 1072), సవ్వఁబాద పరియారువు (రా. ప. నం. 71-72 19-20,847), (iv) దేశ్య తత్సమ తద్భవ మిశ్రణం : వేణవోజన్ను (*EI* 240-42.18-20, 725), దేవానొజ్జలకూ (*JAHRS* 1.81-85.4,10).

**3.70. పదవిన్యాసక్రమం :** ఉచ్చారణపద్ధతి, విరామం, స్వరం మొదలైనవి శాసనకాలంలో ఏవిధంగా ఉండేవో సరిగా తెలీదు కాబట్టి ఆనాటివాక్య నిర్మాణాన్ని గురించి విపులంగా చెప్పటం సాధ్యం కాదు. అయితే లేఖనంలోని పునరావృతరేఖలను బట్టి వాక్యాల ఆద్యంతాలను గుర్తించి వాటి నిర్మాణంలో కనిపించే కొన్ని ప్రత్యేకలక్షణాలను వివరించవచ్చు. ఉద్దేశ్య విధేయపూర్వక వాక్య రచన సాధారణంగా ఉండేవి. కానీ అక్కడక్కడ ఆక్రమం మారేది. కర్త సాధారణంగా ప్రథమావిభక్తిలో ఉండేది. కర్మ ప్రాణివాచకమయితే ద్వితీయా చతుర్థుల్లో ఏదో ఒక దాంట్లోను, జడవాచక మయితే ప్రథమలోను ఉండేది. విధేయం ఉద్దేశానికి ముందు, అవ్యయం క్రియకు మునుపు, విశేషణం విశేష్యానికి పూర్వాన, పరోక్షకర్మ ప్రత్యక్షకర్మకు వెనకా సాధారణంగా ఉండేవి. నామాఖ్యాన క్రియాఖ్యాన పద్ధతులు రెండూ ఉండేవి. కొన్ని సమయాల్లో ధాతుజవిశేషణాలను కూడా వాడని నామాఖ్యాన పద్ధతి కనిపిస్తుంది, సంస్కృత సాహితీ ప్రభావంవల్ల

తెలుగులోకి వచ్చిన యత్తదర్థక కర్మణ్యర్థక ప్రయోగాలు చాలా విరళంగా ఉండేవి. ఈ సాధారణ పదవిన్యాస క్రమానికి విరుద్ధమైన ప్రయోగాలు కూడా అక్కడక్కడ కనిపిస్తాయి.

**3.71**. **క్రియాఖ్యానం** : ప్రాచీనాంధ్రంలో మొట్టమొదట నామాఖ్యానమే గాని క్రియాఖ్యానం లేనేలేదని ఒక నమ్మకముంది (*సోమయాజి* 1948;143,144, 150). అలాంటి క్రియాశూన్యత లేదని నిరూపించటానికే ఎక్కువ నిదర్శనలు లభిస్తాయి. నిజానికి ఇందుకు కావలసిన ఉదాహరణ లన్నిటినీ ఇవ్వాలంటే శాసనా లన్నిటినీ ఎత్తి రాయాల్సి వుంటుంది. మచ్చుకు క్రీ. శ.ఏడోశతాబ్ది శాసనాలనుంచి కొన్ని మాత్రం రాస్తాం: బోళచేత శవణ *గొణిరి* (అం. వ. 1941–42.2, 600–25), విషయబోళ *కొణిరి* (పై. 5), కమ్మరి వినియణ *వ్రాసె* (*SII* 10. 599 21-22, 625-50), కుమారశమ్మాఌరికి ఉదకపూర్వ్వఌజ్జేసి *ఇచ్చిరి* ( *EI* 30.69–71.5, 699–700 ), కఞ్చుగార్లు *కొట్టిరి* (పై. 8), గొరవళ్ మెచ్చిచే *నిచ్చిరి* (*NI* 3.1152-55.35–36,7). ప్రథమపురుష బహువచనం, మధ్యమ పురుష బహువచనం, ప్రథమపురుషైక వచనం, ఉత్తమ పురుష బహు వచనం, మధ్యమపురుషైక వచనంఅనే దిగుదు వరసలో సమాపక క్రియలున్న పూర్ణ వాక్యాలు శాసనాల్లో కనిపిస్తాయి.

**3.72**. **నామాఖ్యానం** : క్రియాఖ్యానంకన్న విరళంగా నామాఖ్యానం కని పిస్తుంది. ఇది మూడు విధాలు. (i) క్రియాపదరహితం : ఉదా. ఇన్దోఱు దీనికి సక్షి (అం. వ. 1941–42.4-5,600–25), పెగ్గడ మేడ వ్రాలు (*SII* 6.250.7, 742–98), దీని అరి నల్తుముద్దు ( *AR* 233/1949–50.9, 8 ). (ii) ధాతుజ విశేషణయుక్తం : ఉదా. కుణ్డికాఌళ *ఇచ్చిన* పన్నస ఇరవదియది నాల్కు మఱున్తుల్లు నేల (*EI* 27.225-28.11-14,575-600), లోకమ *నిల్పిన* స్తానంబు ( *SII* 10.56.2–3, 7 ). (iii) సార్వనామిక విశేష్యయుక్తం : ఉదా. నీవు నా *ప్రాణసమానుణ్డవైన చెలివి* ( తె. శా. 1.163–65.26–27, 792-922).

**3.73**. **విలక్షణవాక్యరచన** : ఇంతకు ముందు చెప్పిన సాధారణలక్ష ణాలు పూర్తిగా సరిపడని పదవిన్యాసక్రమం 9 రకాలుగా కనిపిస్తుంది. (i) కర్త లేనివి: ఉదా. వానపోతుల ముచ్చియకు ... ఇచ్చిరి ... నేల ( *SII* 10.599.

29-31, 625.50), శవన బోశకు...మఱుపొలము పన్నస అడి యిచ్చితిరి (AR 233/1949-50.4-8 8). (ii) కర్మలేనివి : కఞ్చుగార్లు కొట్టిరి (*EI* 30.69-71.8, 699-700), ప్రభురాముణ్ణుక్షోచె ( *NI* 2.606-7.13-14, 8 ), మంగడ్ల కొమ్మన కొంచి పెట్టె కట్టె ( *SII* 6.250.7. 742-99 ). (iii) వాక్యాంతంలో కర్త : ఉదా. ప్రసాదచేసిరి తొల్పకామి రట్టగుళ్ళు ( *EI* 27 236-38 12-15, 700-25), దీవియ వెట్టం బద్మావతియును (పై. 4.314-18.21,1075-76). రెండోవాక్యం పద్యశాసనంలోది. (iv) వాక్యాంతంలో కర్మ ఉదా. గణ్డర ముత్రాజు ... పొడిచిపడియె తోఞ్కు శాకు ( *SII* 10.640. 3-6, 9/10), మల్లణ్డె త్తించె గుడియు మఠంబునుం గాత్రికకేయునకు (శా.వ.మం. 1.2-3-27-29, 898-934). రెండోది పద్యశాసనంలోని వాక్యం. (v) కర్మ-కర్త-క్రియ : ఉదా. శ్రీసతికి దత్తి హంగుణువుళ దేవణయిచె (AR 162/1933-34, pt. II, lc, 41 1-8,7). (vi) కర్తృ పద పునరుక్తి : ఉదా. పెటనివారు ... అటిసినవారు పాపంబు గొణ్డు వెటనివారు ( *SII* 10.638.2-5, 9) (vii) విశేష్యం-విశేషణం : ఉదా. నిల్పె విద్ధమయ్య విప్రకవచమ్ము (*NI* 1.287.4, 650), శ్రీయుద్ధమల్లు డ్డెత్తించె నమితతేజుండు (శా. వ. మం. 1.2-3.43-44, 898-934). వీటిలో రెండో వాక్యం పద్యశాసనంలోనిది. (viii) పరోక్షకర్మ, ప్రత్యక్షకర్మ ; ఉదా. గణ్డదేవరకు నముదునకు దారవోచి యిచ్చినాణ్డు (AR 77/ 1956-57. 13-15, 1096). (ix) క్రియ-అవ్యయం : ఉదా. సితమణి బన్ధమిచ్చె సన్మణియుతముగన్ (*RPS* 25-29.6,1065). ఇది పద్యశాసనంలోది.

**3.74. యత్తదర్థకప్రయోగం** : సంస్కృత మర్యాదానుసారి అయిన యత్తదర్థక ప్రయోగంగల వాక్యాలు నాలుగే లభిస్తున్నాయి. ఈరకం వాక్యాలు క్రీ. శ. 9/10 శతాబ్దినుంచి మాత్రమే-అందులోనూ విరళాతి విరళంగా-కనిపిస్తు న్నాయి. ఉదా. నీకేమి వలయు *దాని* వేణ్డికొమ్మ (తె. శా. 1.163-65.30-32, 892-922), *ఎవ్వణ్డేని* రక్షిఞ్చు *వానిద* ధమ్ముణ్వు (*JAHRS* 1.81-85.7, 10); ఈవృత్తి *ఎవ్వాండేని* అపహరించిన *వాని* పితృపితాంమహులు 60 వేలేండ్లు నయకనరకానం పడుదురు ( *SII* 10.4.12-14, 1008 ); వేగినాణ్టి *కెవ్వారు* రాజులైరి *వారుం* భూవణస్థితిం దప్పక పాలించువారు ( పై. 6.102.34 38, 1006).

**3.75.** **కర్మణి ప్రయోగము :** సంస్కృత భాషాప్రభావంవల్ల తెలుగులోకి వచ్చిన కర్మణి ప్రయోగంగల వాక్యాలు మూడుమాత్రమే క్రీ.శ. తొమ్మిది శతాబ్ది నుంచి దొరుకుతున్నాయి. ఉదా. పట్టం *కట్టబడిన* వాన్డు (పై. 10.629.5-6, 825); అతని *చేయంబడిన* ధమ్మ్రణావుల (తె. శా. 1.163-65,55-56, 892-922); వైమంబుళచేతం బట్టం *కట్టబడి* యేలి (*SII* 10.640 4-5,9/10).

**3.76.** **పదబంధాలు :** కావ్యభాషలో కనిపించేరకం పదబంధాలు శాసనాల్లో కొన్ని కనిపిస్తాయి. ఉదా. *విడిచిన బనిజ్జి* నూఱు గద్యాణంబులు (*JAHC* 3,16-21.14-16, 678); *ప్రసాదచేసిరి* (*EI* 27-236-38.12-13, 700-25); *సురలోకంబెగ్గె* (*SII* 10.639.10, 825); *సుఖంబుజ్జి* (తె. శా. 1.163-65.23-24, 892-922); *సుఖంబుమనువారు* (పై. 68), *అతని కొట్టించిన* చెఱువులు (పై. 53-54); *అతనిచేయంబడిన* ధమ్మ్రణావులు (పై. 55.56), *నీ చేసిన* యుపకారంబునకుం (పై. 27-29; *చలివందిరిచేసె* (*SII* 6.586.8-9, 1074); చెఱువునం *గుడియించి సేయించె* (పై.7); *తమ ప్రతిష్ఠసేసిన* -- ఈశ్వరాలయంబునకు (పై. 10.644.66-70, 1060); *తమ వేయించిన*...తటాకంబున (పై. 61-65); విజయదిత్య *దేవరయెత్తించిన*... మణ్డపము (పై. 11.8-11, 1089); వెలకుం *గొనివిడిచిన* యిల్లు (పై. 651,13, 1090-91).

**పోలిక :** 'పోలు' ధాతురూపాలతో పోలికను చెప్పేవారు. ఉదా. ఈశ్వరునకుం గాత్తికకేయుణ్డుం *బోలె* (*భారతి* 5.618.3, 850); బెజయితదేవని కూంతు సరియ *పోల్పం* గాంతలెందు (*RPS* 28-29 11,1065), భూమిదేవిం *బోల్* రేవలదేవికనిన సోమలదేవి (పై. 4-4). దొరికిన ఈ మూడు ప్రయోగాలూ పద్యశాసనాల్లోవే.

**సంవాదం :** ఆంగ్లంలోలాగా తెలుగులో ప్రత్యక్షపరోక్ష సంవాద పద్ధతిలేదు. సంవాదపద్ధతి ఉందిగాని ఇందువల్ల క్రియారూపాదుల్లో ఏవిధమైన మార్పురాదు. ఒక్కకొరవి శాసనంలో మాత్రమే (తె.శా.1.163-65....892-922) సంవాదవాక్యలు లభించాయి. ఉదా. నీవు నా ప్రాణసమానుణ్డవైన చెలివి (26-27), నీచేసిన యుపకారంబునకుం బ్రత్యుపకారంబు చేయవలయుం (27-30), నీకేమి వలయుం దాని వేణ్డికొమ్మ (30-32): నీ శ్రీ నాకెల్లం గలద్ (32-33), ఏమి

లేకున్న వేణ్డికొణ్డుమ్ (33-34), పరోపకారంబుపొఙ్ణె నా నీ కొరవి యన్నది...
(35-36).

**3.77. మణిప్రవాళశైలి :** సంస్కృతాంధ్ర పదబంధాల్ని మేళవించి వాక్యరచన చేయటానికి 'మణిప్రవాళశైలి' అని పేరు. పాల్కురికి సోమనాథుడి కాలం నుంచి తెలుగు సాహిత్యంలో ఈపద్ధతి విరళంగానే కనిపిస్తుండేది. శాసనల్లో క్రీ. శ. ఏడోశతాబ్దినుంచి ఈరకం వాక్యాలు అక్కడక్కడ కనిపిస్తాయి. ఉదా. క్షేత్రం ఖణ్డుగవడ్ల సహితమ్ ( *EI* 10.100-6.23, 674 ), ... ఏఱువ విషయం బేళన్ తస్య మాతాదత్తం ... శతపంచాశత్ క్షేత్రమ్ (పై. 29.160-64. 8-9,680); రేవశమ్మఁణస్య గుడి (*SII* 10.608.2-8); ... కొడుకు పల్లవాచార్యస్య లికితం ( EI 27.203-6.24-26, 850 ); కొఙ్ణబోయు తటాకః (పై. 9.47.59,945-46).

**3.78. పృథక్కరణం :** జాతి ద్రవ్యాదుల్ని పృథక్కరించి చెప్పటానికి సప్తమీవిభక్తి ప్రత్యయాన్నో, అనుబంధాన్నో వాడటం చాలా ప్రాచీన కాలంనుంచి వాడుకలో ఉంది. ఉదా. శ్రీ సోఱమహారాజు ల్లొళన ఇన్నుటోలి అణపోతులు (వ్యా. సం. 301-10.1-2, 600-25); బాదిరాజుల అన్దు పశ్శియరి కొడుకు (*EI* 27.203-6.6-8, 850).

**3.79. కాలస్థల నిర్దేశం :** 'ఉండు' ధాతువు క్త్వార్థకరూపంతో ఆరంభదశను, చతుర్థీ ప్రత్యయంతో అంతిమదశనూ నిరూపిస్తూ కాలస్థలనిర్దేశంచేయటం అనాదిసిద్ధంగా ఉంది. ఉదా. ఒంగోడునుండి టిగదేఋపళ (?)కు పోవు పన్థా (*భారతి* 1.139-36.16-17,696-709); చేబ్రోల నుండి బెజవాద జాత్రకు వచ్చి (శా. ప. మం. 1.2-3.22-23, 899-934). ఈక్త్వార్థకరూపం కాలక్రమాన 'నుంచి'గా మారి నేటి వాడుకలోకి వచ్చింది.

**3.80 ఉపసంహారం :** శాసనైకాధారమయిన ప్రాచీనాంధ్రభాషను శాస్త్రీయపద్ధతుల్లో పరిశీలించినప్పుడు ఇంతకాలంగా లోకంలో ప్రామాణికవాక్యాలుగా చెలామణి అవుతున్న కొన్ని దుర్భ్రమలు తొలిగిపోతాయి. నన్నయ్యకు ముందు తెలుగుభాష 'ద్రవస్థితి'లో ఉండేదనీ (సోమయాజి 1948; 96,143.233, 234), దాన్ని అతడు సంస్కరించి 'ప్రమాణీకరించా'డనీ ( పై. 98,148-55, 209-29,235), చాళుక్యులకాలంలో తెలుగు 'రాజభాష'గా 'అధికారభాష'గా

ఉండేదని, తెలుగుమీద మొదట ప్రాకృతప్రభావమూ తరవాత సంస్కృత ప్రభావమూ అధికంగా ఉండేవనీ అనుకొనేవారు. అత్యంత ప్రాచీన శాసనకాలంనాటికే తెలుగు ప్రత్యేకభాషగా విలక్షణ నిర్మాణంతో ఉండేదని తెలుస్తుంది. భాష ఎప్పుడూ తనకు స్వతస్సిద్ధమయిన వ్యవస్థతోనే ఉంటుంది. ఆ వ్యవస్థను గుర్తించి వర్ణించటమే వ్యాకరణాలపని. వ్యవస్థే లేనప్పుడు వర్ణన సాధ్యం కానేకాదు; వర్ణన సాధ్యమైనప్పుడు అవ్యవస్థ, ద్రవస్థితి అనే మాటలకు అర్థమేలేదు. రాజాదుల ఆజ్ఞలు కొన్ని తెలుగులో ఉన్నంతమాత్రాన తెలుగు రాజభాషగా ఉండేదని చెప్పలేము. పరిపాలన సౌలభ్యంకోసంగాని, తమ దానధర్మాదులను తమను ప్రస్తుతించుకోటానికిగాని తెలుగులో శాసనాలువేసి ఉంటారు. ఇప్పటి అధికారభాష ఆంగ్లమైనా సామాన్య ప్రజలకు తెలియవలసిన విషయాలను ప్రభుత్వం తెలుగులో ప్రకటించటానికీ ఆనాటి పరిస్థితికీ భేదంలేదు. అలాగే ప్రాకృత ప్రభావం తొలిదశలో ఎక్కువగా ఉన్నదనటానికిగూడా ఆధారాలు దొరకలేదు.

**3.81.** **ప్రాగాంధ్రదశ** : దొరికిన శాసనాల్లో అత్యంత ప్రాచీనమైన దాని కాలంనాటికే తెలుగులో కొన్ని ప్రధాన పరిణామాలు జరిగేయి. ధాతువుకూ ప్రత్యయాలకూ మధ్య అచ్చులు చేరటం. వర్ణవ్యత్యయ అచ్సంకోచాలవల్ల పదాదిని సరళాలూ సంయుక్తాక్షరాలు ఏర్పడటం, వర్ణసమీకరణంవల్ల పరుషాలు ద్విరుక్తం కావటం, తాలవ్యీకరణంవల్ల కకారం చకారం కావటం వంటివి కొన్ని ప్రధాన పరిణామాలు.

**3.82.** **ప్రాక్సాహిత్యదశ** : చరిత్రకాలంలో జరిగిన మార్పులను బట్టి క్రీ. పూ. 200– క్రీ. శ. 1100 మధ్యనున్న తెలుగుభాషాచరిత్రను మూడుదశలుగా విభజించవచ్చు మొదటిది. క్రీ. పూ. 200– క్రీ. శ. 6 శతాబ్దులమధ్యదశ; దీని ప్రాక్సాహిత్యదశ అనవచ్చు. ఈకాలంలో టకారం ప్రత్యేకవర్ణంగా ఉండేది. రేఫఱకారాలు ఒకే వర్ణంగా మిళితం కావటం మధ్యాంధ్రదేశంలో ఆరంభమయింది. దేశీయమైన పరసవర్ణాదేశానికి బదులు అనుస్వారాన్ని ఉపయోగించి లేఖనపద్ధతిని సులభీకరించటం మొదలయింది. పదాంతసంధి ఉండేదికాదు. పదమధ్యసంధులు మొదలైనాయి. గసడదవాదేశం వైకల్పికంగా ఉండేది. మొత్తంమీద తరవాతి కాలంలోని భాషకు నిరూపకమైన విలక్షణనిర్మాణక్రమం, ప్రత్యేకభాషాక్రమం ఏర్పడ్డాయి. సంస్కృతసంపర్కం, ప్రభావం బాగా ఉండేవి.

**3.83.** **సాహిత్యదశ** : క్రీ. శ. 7–9 శతాబ్దుల మధ్యకాలంలో తెలుగు భాషలో సాహిత్యదశ ఆరంభమయింది. వ్యావహారిక సాహిత్య మాండలికాలు

ఏర్పడటం, పద్యశాసనాలు తలచూపటం, లేఖనం నుంచి నిర్మాణక్రమం వరకూ అన్నిటిలోనూ కొత్త పరిణామాలు వచ్చి స్థిరపడటం ఈ ద్వితీయదశలోని ప్రధాన లక్షణాలు. సంస్కృత ప్రభావంవల్ల రేఫమీది హల్లుల్ని ద్విరుక్తంచేసి రాయటమనే సంప్రదాయం వచ్చింది. అరసున్న కొత్త ధ్వనిగా స్వతంత్రంగా మొలకెత్తింది. పద్య శాసనాలవల్లనే దాన్ని పునర్నిర్మించటంసాధ్యమయ్యేది. ద్విరుక్తాద్విరుక్తహల్లులున్న జంటమాటలు పుట్టుకొచ్చాయి. పదాదిన యవకారాలను వాడటం మొదలైంది. ఱకారం వర్ణత్వం కోల్పోయి అచ్చులమధ్య డకారంగానూ, సంయుక్తాక్షరాల్లో రేఫగానూ పరిణమించింది. అజ్మధ్య డకారం ఱకారంగా మారటం ఆరంభమయింది. సంయుక్తాక్షరాల్లో రేఫ వకారపరంగా ఉంటే వకారం లోపించటం, ఇతర హల్లులతో ఉంటే తానే జారిపోవటం మొదలయింది. 'న్థ' అనే సంయుక్తధ్వని 'ణ్ణ' గా మారింది. వ్యుత్పత్తులు స్పష్టంగా తెలిసిన దేశ్యపదాల్లో పదాదిసరళాలు కనిపించటం ప్రారంభమయింది. శకటరేఫ ప్రత్యేకవర్ణత్వం పోగొట్టుకుని రేఫతో మేళనం పొందింది. ఆత్సంధి వైకల్పికంగా ఉండేది. గసడదవాదేశం బహుళంగా మారింది. ద్రుతసంధి పద్యరచనల్లో నిత్యంగాను, గద్యంలో వైకల్పికంగాను ఉండేది. అమహదేకవచన ప్రత్యయం 'బు' అనేది 'ము, వు, మ్ము'లుగా పరిణమించింది. మిశ్రసమాస కల్పనం జోరుగా సాగింది. కర్మణి ప్రయోగమూ, యత్తదర్థకప్రయోగమూ సంస్కృతంనుంచి ఎరువుగా వచ్చిపడ్డాయి. 'మణిప్రవాళశైలి' ఆచారంలోకి వచ్చింది. నాలుగోవంతు మాటలు ఎరువుగా వచ్చాయి.

**3.84. కావ్యభాషాదశ :** క్రీ. శ. 10, 11 శతాబ్దుల్లో కావ్యభాషా ప్రభావంవల్ల వాడుకభాషలో కూడా కొన్ని మార్పులు వచ్చాయి. ఇది భాషాచరిత్రలో కావ్యభాషాదశ. ఈ కాలంలో బయలుదేరిన మార్పులు క్రీ. శ. 1100 నాటికి భాషలో స్థిరపడలేదు. ఈ దశలో వచ్చిన పెద్దమార్పు పదజాలానికి సంబంధించింది. ఎరువుమాటల సంఖ్య మొత్తంలో సగానికి సగంగా ఉంది. తద్ధర్మార్థక విశేషణ ప్రత్యయం 'ఎడి/-ఎడు' అనేది 'ఏ/-ఏటి'గా మారటం మొదలయింది. మహద్వాచకాల ప్రథమపురుషైకవచనంలోని తచ్ఛబ్దవకారం లోపించటం ఆరంభమయింది. అమహత్ప్రత్యయం 'ము' లోపించటం, దానికి ముందున్న స్వరం దీర్ఘం కావటం మొదలయింది. నామాంతంలోని '-ఇయ'లో ఆద్యచ్చు లోపించటం మొదలయింది. వర్ణవ్యత్యయంవల్ల రెండు హ్రస్వాచ్చులు పక్కపక్కల చేరినప్పుడు అవి దీర్ఘాచ్చుగా మారటం ఆరంభమయింది.

ప్రకరణం 4

# శాసనభాషా పరిణామం

## (క్రీ. శ. 1100-1399)

—ఎం. కందప్పశెట్టి

**4. 0.** తెలుగు శాసనాలు క్రీ. శ. 6వ శతాబ్దినుండి కనబడ్డా 11వ శతాబ్ది దాక అవి చాల పరిమితంగానే ఉన్నాయి. కాని 1100-1399 కాలానికి చెందినవి దాదాపు 2000 తెలుగు శాసనాలు ప్రచురితమయి ఉన్నాయి. కాబట్టి ఈ యుగంలో తెలుగుభాషాపరిణామాన్ని తెలుసుకోడానికి ఈ శాసనాలు చాల ఉపయోగిస్తాయి. అందులోను ఈ శాసనాలు దేశంలో నలుమూలలా వ్యాపించి ఉండడంచేత ఆకాలపు మాండలికాల్ని తెలుసుకోడానికి కూడా ఇవి చాల ఉపయోగపడతాయి. ఈ వ్యాసంలో పూర్తి వివరాలు ఇవ్వడం కుదరదు. కాబట్టి కొన్ని ముఖ్యాంశాలు మాత్రం వివరించబడతాయి.

**4.1.** ఈ యుగంలోని వర్ణాలు (**Phonemes**) :

హల్లులు :

| | ఓష్ఠ్య | దంత్య | దంత్యమూలీయ | మూర్ధన్య | తాలవ్య | కంఠ్య | కంఠ్యమూలీయ |
|---|---|---|---|---|---|---|---|
| స్పర్శ | ప బ | త ద | | ట డ | | క గ | |
| | ఫ భ | థ ధ | | ఠ ఢ | | ఖ ఘ | |
| స్పర్శోష్మ | | | | | చ జ | | |
| ఊష్మ | | స | | ష | శ | | హ |
| అనునాసిక | మ | | న | ణ | | | |
| పార్శ్విక | | | ల | ళ | | | |
| రేఫ (ఈషత్ స్పృష్ట) | | | ర | | | | |
| శకటరేఫ (కంపితం) | | | ఱ | | | | |
| అంతస్థ | వ | | | | య | | |

అచ్చులు :

| | ముందు | | వెనక |
|---|---|---|---|
| సంవృత | ఇ | | ఉ |
| అర్ధసంవృత | ఎ | | ఒ |
| వివృత | | అ | |

అచ్చులలో దీర్ఘతకూడా ఒకవర్ణమే అవుతుంది. ఱ కారము సందిగ్ధవర్ణంగా కినబడుతుంది. ఙ, ఞ ధ్వనులు మవర్ణానికి సవర్ణాలుగా పరిగణించ వచ్చు.

4.2. అనుస్వారం : వర్గపంచమాక్షరాలకుబదులు అనుస్వారం వ్రాయడం దాదాపు ఈయుగంలో పూర్తయిందనవచ్చు. కాని ఒక్క టవర్గ ముందు మాత్రం వర్గానుసికం చాల తరచుగా కనిపిస్తుంది. వర్గపంచమాక్షరాలకు ముందున్న అనుస్వారానికి వర్గానునాసికాల ఉచ్చారణే ఉంటుంది గనక ఈస్థానాల్లో అనుస్వారం ఒక ప్రత్యేకమైన వర్ణం అని చెప్పలేము. ఉదా : పంచాదసి (*SII*4.996 2,1155) దీన్ని పఞ్చాదసి అనియే చదువుతాము కనక ఇందలి అనుస్వారానికి ఞకారోచ్చారణే ఉంటుంద. మణ్డలేశ్వర (*SII* 4.996.6,1155) మొదలగుచోట్ల అనుస్వారంగాక ణ కారమే తరచుగా వ్రాయబడి ఉంది. సంస్కృతంనుండి వచ్చిన ఎరువు మాటల్లో వకార, హకారాల ముందు ఈ అనుస్వారం ఉచ్చారణ ఎట్టిదో తెలిసికోడం చాలా కష్టంగా ఉంది. ఈ పరిసరాల్లో అనుస్వారం ఉన్న పదాలు వివిధరీతులుగా వ్రాయబడి ఉన్నవి. సంగ్వత్సరంబు (*SII* 10.707.6, 1158), సమంత్సరంబు (పై. 6. 137,8, 1147), సహ్వాస్యర (పై. 6.145.1, 1292), సంహ్వాత్సర (పై. 5.1212 2,1210), సంమ్వత్సరంబు (పై. 5.1214.11, 1309) - సంవత్సరం, సింహ్య (పై. 6.728.25, 1270), సింహ్వ (పై. 5. 1166.4, 1276), సింఘ (పై. 10.63.6, 1106), సిహ్య (పై. 6.775 4,1364) -సింహం, మొ. వి. బహుశా శిష్టభాషలో ఈ పరిసరాల్లో అనుస్వారానికి సంస్కృత అనుస్వారోచ్చారణ ఉండేదేమో! ఆ ఉచ్చరణ సామాన్యులకు కొత్తగా ఉండడంవల్ల పై శబ్దాలకు అనేక లేఖన పద్ధతులు ఏర్పడి ఉండవచ్చు. కాబట్టి పై పరిసరాల్లోని అనుస్వారోచ్చారణ శాసనకర్త వ్యవహారంలో ఎలాగుండేదో చెప్పలేము. కాని ఈ పరిసరాల్లో మకారోచ్చారణ ఉండేదేమో ! అని సందేహపడవచ్చు. నరసిహ్మ (*SII* 4.1090.7, 1142), బ్రాంహ్మణ (*NI* 1.25.17, 1274).

బ్రాహ్మణ, వహ్ని మొదలగు శబ్దాల్ని ప్రాకృతభాషలలో ప్రాచీనకాలం లోనే బ్రామ్హణ, వన్హి అని ఉచ్చరించే వారట. ఈయుగంలో కూడా అలాగే ఉచ్చరించినట్లు శాసనాధారాలు ఉన్నాయి. వన్హి ( *SII* 4.675.38, 1140) మొ. వి. నరసింహ శబ్దాన్ని నరసింహ్మ అని విలోమపద్ధతిలో వ్రాసి ఉండటంచేత దీనిని నరసిమ్హ అని ఉచ్చరించినట్లు ఊహించవచ్చు.

**4.3.** ఱకారం : ఈ యుగంలో ఱ కారం కొన్ని సంజ్ఞావాచకాల్లోనే కనబడుతుంది. అదీ సాధారణంగా విశాఖ-శ్రీకాకుళం ప్రాంతానికే పరిమితం. ఉదా : నిఱు జెఱ్ఱు ( *SII* 10.684 3,1138 ), తాలాంఱ ( పై. 10.674. 10, 1131 ), చోఱగంగ (పై. 10.665.7, 1124 ). పై ఉదాహరణ లన్నీ 12 వ శతాబ్దిలోనివే. 13 వ శతాబ్దిలో ఱుత్రిక ((పై. 10.262.9, 1218) తప్ప వేరే ప్రయోగాలు లేవు. 14వ శతాబ్దిలో అసలు బొత్తుగా కనబడదు. ఈ ఱకార ప్రయోగం 12వ శతాబ్దిలో విశాఖ-శ్రీకాకుళ ప్రాంతంలోనే కనిపించినా 13 వ శతాబ్దిలోని ఱుత్రిక శబ్దం పశ్చిమ గోదావరిలోని తణుకు తాలూకాలో కనిపిస్తుంది. పై శబ్దాలకు నిడుం జెఱువు. తాలాండ, దుత్రిక అనే రూపాలు తరచుగా కనిపిస్తాయి. పై శబ్దాలన్నీ సంజ్ఞావాచకాలే కాబట్టి ఇవన్నీ కేవలం వ్రాతలోనే నిల్చి ఉన్నాయనీ అవి ఉచ్చారణలో లేవనీ చెప్పవచ్చు. అదీగాక సఱపంగలవాండు (*SII* 5.1038.1, 1108), విహారవాఱ (పై. 10.690 8,1139)మొ రూపాల్లో డకారానికి బదులు ఱకారం వ్రాతలో ఉంది. కాబట్టి పై ప్రాంతంలో ప్రాచీన లేఖనా పద్ధతి నిల్చి ఉందని చెప్పవచ్చు. కాబట్టి ఱకారాన్ని వర్ణంగా తీసుకోనక్కరలేదు.

**4.4.** ఛకారం : ఛకారం శాసనాల్లో కనిపిస్తుంది. కాని దాన్ని వర్ణంగా తీసుకోనక్కరలేదు. ఎందుకంటే చకారం ద్విత్వమయ్యే టప్పుడూ, అనుస్వారం తర్వాత వచ్చేటప్పుడూ సాధారణంగా ఛకారంగా వ్రాయబడి ఉంది. ఉదా. ఇచ్చిరి/ఇఛ్ఛిరి, సమర్పించిరి/సమర్పింఛిరి. ఇట్టి ప్రయోగాలు సాధారణంగా విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలోనే కనిపిస్తున్నాయి. ఇట్లు ఈ ప్రాంతంలో రెండు రూపాలు పర్యాయంగా కనబడ్డంచేత ఛకారాన్ని చకారానికి రూపాంతరం అనవచ్చు. కాని దాన్ని వర్ణంగా చెప్పనక్కరలేదు.

**4.5.** [చ,చ̄]లు : చవర్ణం నేడు తాలవ్యాచ్చుల ముందు తాలవ్యంగాను

తక్కిన అచ్చులముందు దంతమూలీయంగాను ఉండటం మనం గమనించవచ్చు. ఇట్టి రెండు రకాలైన ఉచ్చారణలు ప్రస్తుత యుగంలో కూడా ఉండి ఉండాలి అని చెప్పడానికి ఒకే ఒక వ్రాత ఆధారం కనిపిస్తుంది. పుత్సుకొని ( *SII* 6. 745 10, 1393) < పుచ్చుకొని. దీన్ని ఈ క్రింది అచ్చులమార్పు స్పష్టంగా బలపరుస్తుంది.

ధ్వనుల మార్పు :

**4.6.** అ>ఎ;ఎ>అ : ఈ యుగంలోని శాసనభాషలో తాలవ్యహల్లు తర్వాత అకారం ఎకారంగాను, ఎకారం అకారంగాను మార్పుచెందడం తరచుగా కనిపిస్తుంది. ఇందు అ>ఎ మార్పు తత్సమాల్లోనూ, ఎ>అ మార్పు దేశిపదాల్లోను మాత్రమే కనిపించడం గమనార్హం.

(అ) అ>ఎ : విజెయవాడ (*SII*.4.754.6, 1135).
యెథోచిత (పై. 6.982.20, 1296),
శెంఖు (పై. 6.1052.11.1350) మొ వి.

(ఆ) ఎ>అ ; యత్యేన (పై. 4.945.29, 1152),
యవ్వరు (*NI*. 1.17.18, 1218),
యట్లు (ఎట్లు) (పై. 1.23.20,1347),
యనక<యెనక<వెనక (*NI*.2 100.16.1195)మొ.వి.

పై ఉదాహరణల్లో అ>ఎ మార్పు తాలవ్యహల్లు లన్నింటి తర్వాతనూ, ఎ>అ మార్పు కేవలం యకారం తర్వాత మాత్రమున్నూ కనిపిస్తాయి. అంటే దేశిపదాల్లో ఉన్నటువంటి 'చ' దంతమూలీయంగా పలకబడ్డంచేత పైమార్పు లేవీ దేశ్యచకారం తర్వాత జరగలేదనవచ్చు. తత్సమాల్లో తాలవ్యం తరవాత తాలవ్యేతర అచ్చు పరమైతే తాలవ్య హల్లు దంతమూలీయంగా పలకడమో లేక అచ్చులో మార్పు చెందడమో జరగవచ్చు. పై ఉదాహరణల్లో అచ్చుల మార్పును మనం గుర్తిస్తున్నాం. దేశిపదాల్లో ఎకారం అకారంగా మారడాన్ని బట్టి ఎ (అనగా యె) కొద్దిగా వివృతంగా ఉచ్చరింపబడేదని ఊహించవచ్చు.

(ఇ) పై అ>ఎ మార్పు దేశిపదాల్లో ఒకరిదానిలో మాత్రం ఈ యుగంలో ఒక ప్రాంతంలో జరుగుతున్నట్లు కనిపిస్తుంది. చల్లు>చెల్లు, ఈమార్పు ఈయుగా

నికి ముందే ఒక్క విశాఖ-శ్రీకాకుళం ప్రాంతం తప్ప తక్కిన ప్రదేశాల్లో పూర్తయి ఉండాలి. కనక తక్కిన అన్నిచోట్ల చెల్లు అనే రూపం కనిపిస్తుంది. కాని విశాఖ-శ్రీకాకుళంప్రాంతంలో చల్లు ( *SII* 6.719 31, 1278, 6.1129.12, 1376) మొ-వి; చెల్లు (పై. 6.845.12, 1278, 6.911.8, 1349)మొ. రూపాలూ కనిపిస్తున్నాయి.

**4.7.** ఋ > రి, ఋ >రు : ఋ సాధారణంగా శాసనభాషలో రి అవుతుంది. రిషభ (*SII*. 4.990.2, 1158) మొ.వి. కాని ఈ యుగంలో ఋ> రుగా మారడం కూడా క్వాచిత్కంగా చూడవచ్చు. విత్రుస్థానము (*SII* 4. 1248.9,1112), ప్రుదివి (తె. శా. 1.52.9, I259, 1258), రుతు (*SII* 4.950.8, 1346) మొ.వి.

**4.8.** దీర్ఘాచ్చులు : (అ) యకారం పరమవుతుండగా పదాది ఎఏలు రెండూ పర్యాయంగా ఈయుగంలో కనిపిస్తాయి. ఉదా. వేయి ( *SII* 10.671. 12, 1128), వెయి (పై. 5.1018.2, 1148). నేయి (పై. 10.206.11,1195), నెయి (పై. 5.1012.9, 1108) మొ.వి. శాసనాల్లో ప్రయోగాల సంఖ్యనుబట్టి చూస్తే వేయి రూపం వెయి రూపం కంటే అధికంగానూ, నెయిరూపం నేయి రూపం కంటే అధికంగానూ ఉన్నాయి. దీన్ని బట్టి వేయిరూపానికి దీర్ఘ పూర్వకమూ, నేయి రూపానికి హ్రస్వపూర్వకమూ ప్రాచీనమేమో అనిపిస్తుంది. మొత్తంపైన యకార పూర్వక హ్రస్వదీర్ఘ సమ్మేళనం (merger) ఈ యుగంలో సమగ్రంగా కనిపించటంచే ఈ సమ్మేళనం ఈ యుగానికి పూర్వమే ఎప్పుడో జరిగిందని చెప్పవచ్చు.

సమాసాల్లో హల్లు పరమైనప్పుడు యకారం కనిపించదు. పూర్వాచ్చు దీర్ఘ రూపంతోనే కనిపిస్తుంది. నేమాన (*SII* 4.1061.10, 1149), వేత్రైలు (పై. 10.715.18, 1251).

(ఆ) 'ఈ' అనే విశేషణం ఈ యుగంలో పరహల్లు ద్విత్వం కాకుండనే తరచుగా హ్రస్వరూపంతో ప్రయోగింపబడుతుంది. ఇదీపము (*SII* 5.160.15, 1136). ఇతోణపట్టు (పై. 4.1114.20, 1163) మొ.వి. విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలో హ్రస్వదీర్ఘాలు తరచుగా తారుమారౌతాయి. బహుశా ఇది ఒరియాభాష ప్రభావమై ఉంటుంది.

**4.9.** డ->ద-: పదాది డకారం దకారంగా మారడం శాసన భాషలో 10వ శతాబ్దిలోనే ప్రారంభమయినా, ఈ యుగంలో డకారాది రూపాలు చాలా వరకు నిల్చి ఉన్నాయి. డాయు (*SII* 5.134.7, 1132); డున్ను (*EI* 5.14.138, 1213), డిగ్గిలి (*SII* ౬.1214.26, 1309). దకారంగా మారిన రూపాలు చాల స్వల్పంగా కనిపిస్తున్నాయి. దుత్తిక (<డుత్తిక <ఋత్తిక) (*SII* 10.364.14, 1259), దున్ను (*NI* 2.7, 1314).

**4.10.** త- > ట-: -ఎంక్-అనే వర్ణాలు పరమవుతుండగా, తకారం టకారంగా మారటం ఈ యుగంలో క్వాచిత్కంగా కనిపిస్తుంది.

**తకార రూపాలు**: తెంకాయ (*SII* ౬ 1236.3, 1277), తెంకణ (పై. 6.628.118, 1224), నూతెక్కి (పై. 10.79.18, 1118). *టకారరూపం*; నూట్టెంకి (పై. 10 142 4, 1158) మొ వి.

**4.11.** -ంఋ(-ణ్ఋ)>-ండు(-ణ్డు): నకార, శకటరేఫల సంయుక్తం ణ్డగా మారడం ప్రాచీనశాసనాల్లో విరివిగా కనిపిస్తుంది. ఈ యుగంలో ఒక నెల్లూరుజిల్లాలో మాత్రం ణ్డగా మారనిరూపాలు రెండుసార్లు కనిపిస్తాయి. అందులో ప్రిత్తికాంఋ(*NI* 1.24.17, 1187) ప్రథమాంతం, వాఱ్రని పెద్దకొడుకు (*NI* 3.9.29, 1259) షష్ఠ్యంతం. ఈ రెండవదానిలో శకటరేఫకు బదులు రేఫే కనిపిస్తుంది.

పై రూపాలు వ్రాతలో మాత్రం నిల్చి ఉన్నాయా? లేక ఉచ్చారణలోనూ నిల్చిఉన్నాయా? మాండలికాల విషయంలో నెల్లూరుజిల్లా అనేక ప్రాచీనరూపాల్ని నిల్పుకొన్నట్లు చెప్పడానికి మనకు పెక్కు ఆధారాలున్నాయి. చేసిన, చేసిరి, అనడానికి బదులు 7 వ శతాబ్దికి చెందిన భైరవకొండ (ఉదయగిరితాలూకా, నెల్లూరుజిల్లా) శాసనాల్లో కేసిన, కేసిరి అనే రూపాలున్నాయి. అందే తెలుగుభాషలో తాలవ్యీకరణం అతి ప్రాచీనకాలంలోనే జరిగిపోయినా తాలవ్యీకరణం కాని రూపాలీ ప్రాంతంలో నిల్చి ఉన్నాయి. ఇవి కేవలం వ్రాతల్లోనే నిల్చి ఉన్నాయేమో అనడానికి వీల్లేదు. ఇటీవలి మాండలిక పరిశీలనలో నెల్లూరుప్రాంతాల్లో కింక, కీలిసె, కీడిసె వంటి తాలవ్యీకరణం కాని రూపాలు కనిపించాయి[2]. కాబట్టి ప్రిత్తికాణ్ఋ వంటి రూపాలు బహుశా నెల్లూరు జిల్లాలో పామరమాండలికాల్లో (Substandard dialects) నిల్చి ఉండవచ్చు. అట్టివి క్వాచిత్కంగా శాసనాల్లోకి వచ్చి ఉండవచ్చు.

**4.12.** -న్ఱ్-/-ంఱ్-/-్రంఱ్->-ంద్ర్-; తన్ఱి (*SII* 6.917.5,1340), ఈ ఒక్కటి తప్ప తక్కినవన్నీ అనుస్వారంతోనే కనిపిస్తాయి. తంఱి (పై. 4.1119.15,1261), పంఱెండు (పై. 6.937.7,1359), ఎనుమంఱు పై. 5. 1052.10,1350), ఒత్తుకాంఱు (పై. 6.955.9,1349), వాస్యకాంఱ్రు (పై. 6.1116.13.1376) మొ.వి. పై వాటిలో రెండు ప్రయోగాలు తప్ప తక్కినవన్నీ విశాఖజిల్లాలోనివే. ఆ రెంటిలో ఒకటి గుంటూరికి మరొక్కటి తూర్పుగోదావరికి సంబంధించినవి.

పై ప్రయోగాలకు మిగిలిన శాసనాల్లోను, సారస్వతభాషలోను తండ్రి, పంద్రెండు, ఎనుమంద్రు మొ. రూపాలే కనిపిస్తాయి. వీటిలో సాహిత్యప్రయోగాలు ప్రాచీనరూపాలా ? లేక పై శాసనరూపాలు ప్రాచీనమైనవా ? చారిత్రకంగా చూస్తే -న్ఱ్ ప్రాచీనస్వరూపమని, -న్ఱ్ రూపానికి అర్వాచీనరూపం -ంద్ర్- అనీ చెప్పవచ్చు. తండ్రి శబ్దానికి ప్రాచీనరూపం తన్ఱి అనడానికి ఈకింది ఆధారాలున్నవి. తెలుగు. తండ్రి, కుఇ.తంజి, కువి. తంజి. వీటిని పునర్నిర్మాణం (re-construction) చేస్తే *తన్ఱి రూపం వస్తుంది.

పంద్రెండు శబ్దానికి ప్రాచీనరూపం *పన్ + రెండు (> పన్ - ఱెండు> పంద్రెండు) అనవచ్చు. పదికి రూపాంతరం పన్ అనడానికి అనేక అధారాలున్నవి. పన్నిద్దఱు [పన్ + ఇద్దఱు] (*SII* 5.1299.8,1241) మొ.వి. అలాగే ఎనమంద్రు అనడానికి ప్రాచీనరూపం *ఎణ్-పన్-రు (> ఎణ్-మన్-ఱు> ఎనుమంఱు> ఎనమంద్రు) అనవచ్చు. ఒత్తుకాంఱు, వాస్యకాంఱ్రు శబ్దాలకూ ఒత్తుకాన్-రు, వాస్యకాన్-రు రూపాలు ప్రాచీనరూపాలని చెప్పవచ్చు.

న్ఱ>ణ్డ్రి మార్పు తెలుగులో ఎప్పుడు జరిగిందో చెప్పటానికి ఆధారాలు అంత స్పష్టంగా కనబడవు. అద్దంకిశాసనంలోనే పణ్డెండు శబ్దం కనబట్టంచేత ఈమార్పు 8వ శతాబ్దికి పూర్వమే జరిగిఉండాలి. ఈయుగంలో కనిపించే తన్ఱి మొదలగురూపాలు బహుశా పామరమాండలికంలో (Substandard dialect) వ్యవహారంలో ఉండవచ్చు. విశాఖ ప్రాంతంలోని కొండభాషలో నేటికీ -న్ఱ- ఉచ్చారణలో ఉండటం దీనికి ప్రబల తార్కాణ అవుతుంది.

**4.13.** -యి- >-హి- : ఇకారం పరమౌతుండగా అపదాది యకారం హకారంగా మారడం ఈయుగంలో చాల తరచుగా సంభవిస్తుంది. ఉదా: నాహిండు

<నాయిండు) [*SII* 10.321.9, 1248], ఆచంద్రార్కస్థాయిగా (పై. 10.510,8, 1315) మొ. వి. పయిండి అనడానికి ఈయుగంలో పహిండి/ పైండి రూపాలు ఉన్నాయి. పసిండి రూపం బొత్తుగా కనిపించదు. అందులోను పహిండి రూపమే చాలా తరచుగా కనిపిస్తుంది, (*SII* 4.1142.7,1142, 10.431. 27,1272) మొ. వి.

**4.14.** అపదాది రేఫకు పరమయ్యే హల్లులు సాధారణంగా ద్విత్వంగా వ్రాయడం శాసనభాషలో కనిపిస్తుంది. సవ్వ౯ (సర్వ), చక్రవత్తి౯ (చక్రవర్తి, రేచెల్ల౯ (రేచెర్ల) మొ.వి. ఇట్టి వానిలో రేఫలోపించడం ఈయుగంలో తరచుగా కనిపిస్తుంది. అఖండవత్తి (*SII* 6-995.14,1288), సమప్పించు (పై 5.15. 1.10,1305) మొ.వి. రేఫలోపించని రూపమైన ఇద్ద౯ఱు (పై. 6.941.12, 1299) శబ్దం పై వాటిలో చాలా ముఖ్యమైంది. ఇందలి రేఫలేని రూపం ఈయుగానికి పూర్వమే కనిపించినా ఈ ఒక్క ప్రయోగం మాత్రం ఈయుగంలో రేఫతో కనిపిస్తుంది. ఇది విశాఖ ప్రాంతంలోనిది. ఈ ప్రాంతమందలి అనేక ప్రాచీన రూపాల్లో ఇదీ ఒకటి అనుకోవచ్చు.

**4.15.** పై రేఫకు వర్ణవ్యత్యయం జరగడం కూడా ఈ యుగంలో సాధారణంగా కనిపిస్తుంది. ఉదా. ప్రెగ్గడ (*SII* 10.73.111, 1115), <పెగ్గ౯డ (పై.6.217.4, 1129), ద్రుగ్గాదేవి (పై. 5-1217.8,1290) (< దుర్గాదేవి) మొ వి.

**4.16.** ఆదిహల్లుపైన రేఫ సంశ్లిష్టమై ఉంటే అట్టి రేఫకు లోపం కావడం ఈయుగంలో క్వాచిత్కంగా కనిపిస్తుంది. మాను (*SII* 10.241.10, 1185), < మ్రాను, తావు (*NI* 1.25.69, 1284) < త్రావు, బిందావనం (*SII* 5.4. 12, 1394) < బ్రిందావనం.

ప్రెగ్గడ శబ్దంలోనూ ఈలోపం తరచుగా కనిపిస్తుంది. కాని ఇది వర్ణవ్యత్యయానికి ముందుగాను తర్వాతగాని జరిగి ఉండవచ్చు, పెగ్గ౯డ > పెగ్గడ;లేదా పెగ్గ౯డ>ప్రెగ్గడ>పెగ్గడ. వర్ణవ్యత్యయం రేఫలోపం రెండూ ఈ యుగంలో జరుగుతూ ఉండటంచేతనూ, అది సంశ్లిష్టంలో రేఫలోపం చాలా క్వాచిత్కంగా కనిపించుటంచేతనూ పై రేఫలోపం వర్ణవ్యత్యయానికి ముందే జరిగి ఉంటుందన వచ్చు (చూ. 4 14).

**4.17.** ఱ : శకటరేఫ, సాధురేఫ కొన్నిసార్లు తారుమారవడం శాసనాల్లో కనిపించినా, శకటరేఫ రూపాలు చాలా వరకు ఈ యుగపుశాసనాల్లో సక్రమంగానే పాటింపబడి ఉన్నాయి. కూఁతురు శబ్దంలోనూ, -రాలు ప్రత్యయంలోనూ సాధురేఫ ఉన్నట్లు బాలవ్యాకరణంలో చెప్పబడి ఉంది, కాని ఈరెండు రూపాలు ఈ యుగపు శాసనాల్లో చాలా తరచుగా శకటరేఫతోనే ఉన్నాయి. కూంతుఱు (*SII* 5.1025.10,1111), నాయకుఱాలు (పై. 5.1030.5, 1141) మొ వి. కాబట్టి నన్నె చోడుడు వీటిని శకటరేఫతో వ్రాసి ఉండాలి. బహుశా వ్రాతప్రతులలో వ్రాయసగాండ్రు వాటిని తమకాలంలోనే అలవాటు ప్రకారం సాధురేఫగా మార్చారు కాబోలు !

**4.18.** స > శ : తాలవ్యాచ్చు పరమౌతుండగా సకారం శవర్ణంగా మారడం ఈయుగంలోనే చాలా తరచుగా కనిపిస్తుంది. అందులోను పదమూడో శతాబ్దినుంచి ఇది బలీయంగా వ్యాపిస్తుంది. ఉదా: పడశిన (*SII* 6.845, 12, 1273), చేశిన (పై. 10 465. 109,1290), శీతాదేవి (పై. 5.1225 5,1349) మొ వి. ఈ మార్పుకూడా ఈయుగంలో తాలవ్యాచ్చు ముందు దంత్యం కాని దంతమూలీయంగాని నిలవవు అనే సిద్ధాంతాన్ని బలపరుస్తుంది. అంటే తాలవ్యాచ్చు ముందు చవర్ణం తాలవ్యంగాను, తక్కిన పరిసరాల్లో దంత్యం లేక దంతమూలీయంగా పలికేవారనడానికి ఈ మార్పుకూడా ఒక తార్కాణంగా తీసుకోవచ్చు. (చూ. 4,5-6).

**4.19.** **వర్ణసమీకరణం : డ్ల>ళ్ళ :** ఈ యుగంలో 12వ శతాబ్దిలో డ్ల రూపాలే చాలా తరచుగా ఉన్నాయి. ళ్ల రూపాలు చాలా క్వాచిత్కంగా కనిపిస్తాయి. ళ్ల రూపాలు రానురాను ఎక్కువౌతూ 14వ శతాబ్దిలో దాదాపు డ్లరూపాల స్థానాన్ని ఆక్రమించిందనవచ్చు. *డ్ల - రూపాలు* : మాడ్లు ( *SII* 10.476.8, 1298), (మాడలు); మూడ్లు (పై. 5.70,12,1177) (మూరలు); *ళ్లరూపాలు* : మూళ్ల (పై. 10.84. 17,1122), గుళ్ళ ( పై. 4.1379.9, 1381 ) మొ.వి.

**వర్ణాల స్థాన నియమాలు :**

**4.20.** పదాదిలోను. అజ్మధ్యంగానూ, హల్లులు సాధారణంగా ఏ నియమం లేకుండా వస్తాయి. కాని ఒక డకారం తప్ప తక్కిన మూర్ధన్య హల్లులు సాధారణంగా అఆల ముందే కనిపిస్తాయి. తక్కిన అచ్చులముందు ఈయుగపు శాసనాల్లో అట్టే కనిపించడంలేదు. టంకమాడలు ( *SII* 6.1183.9, 1221 ).

ఠక్కురు (పై. 6.897.6, 1298), ఠావు (పై. 10.111.8,1142), ఢాకిని (*భారతి* 15.1. 159.86, 1323) మొ. వి. పదమధ్యంలో అటిక (*SII* 6.1033. 13, 396) మొ.వి. ఇతర అచ్చుల ముందూ వస్తాయి.

డకారం పదాదినికూడా అన్ని అచ్చులముందూ కనిపిస్తుంది. డంగుంబ్రాలు (*SII* 4.1248.12. 1112), డాపల (పై. 10.1034.7, 1132), డిగ్గు (పై. 6.1201. 7, 1219), డున్నవారు (పై .6.1200.14, 1175), డెబ్బదేను (*NI* 2.28.7, 1258), డేరా (*SII* 5.1216.6,1314), డోలు (పై. 10.451 115, 1287).

**4.21.** సంయుక్త వర్ణాల మధ్యవచ్చే అచ్చు : సంయుక్త వర్ణాల్లో రెండోవర్ణం యకారంగా ఉంటే ఇకారమున్నూ, తక్కినచోట్ల ఉకారమున్నూ ఈ యుగపు శాసనాల్లో చాలా తరచుగా వస్తాయి. యకారంముందు : పరియంతము (*SII* 10 : 340.12, 1253) (< పర్యంతము), సంధియ (పై. 5.192.2, 1228) (< సంధ్య) మొ.వి. తక్కినచోట్ల : పరుషంబు (పై. 5.1008.1, 1127), కలుహార (పై. 5.672.9, 1139), మహాళబుద (తె. శా. 2: 123.4, 1298) మొ. వి.

**4.22.** పూర్వకాలంలో లకారం ఒకటే పదాదిన వస్తుంది. ళకారంరాదు. లక్షణి (*SII* 6.647.4, 1148), లావ (*NI*3 47.50, 1211), మొ.వి. అజ్మధ్యంగా 'బిళసరము, బెళగు' మొ. కొద్దిచోట్ల తప్ప తక్కినచోట్ల సర్వత్రా ళ కార రూపాలకు లకారరూపాలు పర్యాయంగా కనిపిస్తాయి. ఉదా : నీళేశ్వర (*SII* 10 703.4, 1150). నీలేశ్వర (పై. 10.704 8, 1151), చోడవళనాంటి పై. 6.156.15, 1154), చోడవళనాణ్టి (పై. 6.135.3, 1144), స్తళము (తె. శా. 1.18.158. 1162): స్తళకరణాలు (*SII*10.528.11, 1319)మొవి.

**4.23.** ఈ యుగంనాటి తెలుగుభాష పూర్తిగా అజంతం అయినట్టు తోస్తుంది. పదాంతంలో ఒక్క అనుస్వారం చాలా తరచుగా కనిపిస్తుంది. దత్తం (*SII* 5.7.6, 1388), మాసం (పై. 6.84.2, 1292), రక్తం (*NI* 1.24 14, 1187) మొ వి. నకారాంతపదాలు చాలా క్వాచిత్కంగా కనిపిస్తున్నాయి. చంద్రమౌళికిన్ (*SII* 10.114, 1144) మొ. పద్యాల్లో నకారపుపొల్లు రావల సినచోట్ల కూడా 'ను' కాని 'ని' గాని వ్రాసేవారు భువిని (పై. 10.151, 1161)

భువిన్ అని చదవాలి. కాముండును (పై. 10.151, 1161) కాముండున్ అని చదవాలి.

**4.24.** పదాదిస్థానంలో అచ్చులు, హ్రస్వదీర్ఘాలు వస్తాయి. కాని పదాంతంలో సాధారణంగా అ, ఇ. ఉ,లే తరచుగా వస్తాయి. ఎ, ఒలు క్వాచిత్కంగా వస్తాయి. విజయరాజె (*SII* 5.1070.3, 1138), ఒకకోటి (పై .10.177.22, 1171) మొ. వి.

**సంధి :**

**4.25.** రెండు పదాల చేరిక వలన రెండు అచ్చులు కలిసినప్పుడు మొదటి అచ్చు లోపించవచ్చు. లోపించక పోవచ్చు ; మధ్యలో యడాగమం రావచ్చు. మన వ్యాకరణ నియమాలేవీ ఈ శాసన ప్రయోగాలకు సరిపడవు.

(అ) *సంధివచ్చే రూపాలు* : తమన్న ( *SII* 10.416.128, 1280 ) (తమ + అన్న); మహిదేవైన (పై. 6.1097.9, 1378) (దేవి + ఐన) మొ వి.

(ఆ) *సంధిరాని రూపాలు* : కొట్టరువు ఎఱియమ (పై. 4.1114.19, 1168), దేవసెమ్మెళను ఎవ్వండైన (పై. 6.98 24,1181) మొ.వి.

(ఇ) *యడాగమం వచ్చే రూపాలు* : కుంభమాసము యమావాస్య (పై. 5.1343.5, 1146), సత్త్యెరాజు యిచ్చిన (పై. 4.1098.8, 1152) మొ.వి.

**4.26.** ఈశ్వరశబ్దం పరమయ్యేటప్పుడు గుణసంధికి బదులు తెలుగు సంధి జరగడం ఈ యుగపు శాసనాల్లో తరచుగా చూడవచ్చు

(అ) *తెలుగుసంధి రూపాలు* : భీమీశ్వర ( *SII* 10.177.42, 1171 ), నీలీశ్వర (పై. 10.712.3, 1183), మల్లీశ్వర (పై. 6.89.4, 1241) మొ. వి.

(ఆ) *గుణసంధి రూపాలు* : భీమేశ్వర (పై.10 510.3,1315), నీలేశ్వర (పై. 10.704.8, 1151), మల్లేశ్వర (పై. 6 89.2, 1241) మొ. వి.

**4.27.** అచ్చుకు క చ త ప లు పరమైతే గ స ద వ లు కావచ్చు. కాకపోవచ్చు. వీటిలో దేశి తత్సమాల నియమాలేవీ లేవు.

(అ) *అయిన రూపాలు* : రెండు గుంచములు (*SII* 4.1133.3, 1155), క్రిష్ణసతుర్దసి (పై. 5.1070.4, 1138), బోయుండుదన (పై.4.674.6, 1150), పంద్రెండువుట్లు (పై. 5.91.16, 1176) మొ వి.

(ఆ) కాని రూపాలు : కూంతుఱు కొమ్మసాని (పై. 5.67. 8,1188), పెట్టిన చేను (పై. 5.172.13,1194), దొమ్మనతన (పై. 5.1099.8,1131) అంచెంగి పొలము (పై. 5.1068.8, 1145) మొ.వి.

**4.28.** పదాంతంలో ఒక్క అనుస్వారం తప్ప తక్కిన హల్లులు సాధారణంగా రావు. ద్రుతసంబంధి నకారంకూడా పొల్లుగాగాక 'ను' రూపంలోనే ఉంటుంది (చూ. 4.24). కాబట్టి సారస్వతభాషలో ద్రుతప్రకృతికము లనబడే రూపాలు శాసనాల్లో సాధారణమైన అజంతాల లాగానే ప్రవర్తిస్తాయి. ఏకాదశిని ఆదివారమూను (*NI* 2.51.3, 1198), వీని సేకొని (*SII* 4.1000.6, 1166), భోజనార్థములకు వెట్టింపులకుంగా (పై. 4.1098.8, 1153), పుష్పాలకు యిచ్చిన పై. 10.526.44, 1319) మొ.వి. కొన్ని కొన్ని చోట్ల ద్రుతప్రకృతికాల తర్వాత చ ప లు జ బలుగా కూడా మారి ఉన్నాయి. క్రిందను బెట్టిన (*SII* 5.1046.12, 1187), పరలోకానికిం జని తేని (తె.శా. 1.78.2, 1276) మొ.వి.

### సంయుక్త వర్ణాలు

**4.29. పదాదిలో** : స్పర్శోష్మలతోను, మూర్ధన్యాక్షరాలతోను, పార్శ్వ రేఫాక్షరాలతోను, యకారంతోను, మహాప్రాణాలతోను ప్రారంభమయ్యే సంయుక్తాలు అరుదు. ధ్రుములు (*NI* 2.84.16) మొ. వి. మహాప్రాణాక్షరాలతో అరుదుగా కనిపిస్తున్నాయి. మిగిలిన హల్లులు రేఫతో సంయుక్తమై తరచుగా కనిపిస్తున్నాయి. క్రొత్త (*SII* 10.472.25, 1292), గ్రొచ్చు (పై. 10.655.5, 1105), త్రాను (పై. 10.443.6. 1278), ద్రావిడ (పై. 6.719.23, 1278), ప్రత్తి (పై. 4.935.27, 1268), బ్రతుకు (*NI* 2.727, 1314), నిపాలక (పై.10. 89.6. 1132), మ్రొక్కు (పై. 4.1302.12, 1106), వ్రయము (పై. 10.340. 11, 1253) మొ.వి రేఫగాక తక్కిన హల్లులతో సంయుక్తాలు క్వాచిత్కంగా కనిపిస్తాయి. క్షేత్రము (పై. 5.120.53,1275), ద్వార (పై. 6.1136.7,1374), వ్యాపారి (పై. 6.1173.5, 1104) మొ.వి.

**4.30. పదమధ్యంలో** : తత్సమ పదాలను మినహాయించి స్థూలంగా ఈ కింది విధంగా చెప్పవచ్చు. దేశివర్ణాలలో ఒక్క రేఫ, హకారం తప్ప అన్ని ద్విత్వంకాగలవు. సంయుక్తాలలో అనునాసికాలు, మూర్ధన్యాలు, దంతమూలీయ పార్శ్వం, రేఫ శకటరేఫలు ప్రథమవర్ణంగా సాధారణంగా కనిపిస్తాయి. అందు

అనునాసికాలు తమ వర్గాక్షరాలతో కలిసినప్పుడు వ్రాతలో అనుస్వారాలు అవుతాయి. అవిగాక కాన్కి (*SII* 6.639.2, 1147), మన్చి (తె. శా. 1.13. 33, 1170). తంజి (*SII* 6.631.4, 1286) మొ. వి. గమనార్హం. మిగిలిన హల్లులకు ఉదాహరణలు : వడ్లు (పై. 6.169.5, 1167), అట్లు (పై.4.671. 18, 1130), కొల్చు (పై.5.1188.54, 1250), పెడ్డు ( *NI* 2.59·24,1167), కఱ్ఱ (*SII* 5.167.15, 1200) మొ.వి.

## నా మ ప దా లు

**4.31. నామప్రాతిపదికలు (noun stems) రెండురకాలు :** 1. అవిభాజ్యం (Simple), 2.విభాజ్యం (Complex and compound). అవిభాజ్యం-దేశిపదాలు, ఎరువుమాటలు అని రెండురకాలు. ఊరు (*SII* 5.70.10, 1177), ఇలు ( పై. 10.134.8, 1154 ) మొ. వి. దేశిపదాలు. ఎరువు మాటల్లో సంస్కృతంనుంచి ప్రాకృతాల నుంచీ వచ్చినవి అని రెండు రకాలున్నాయి. భూమి (పై. 5.1046.10,1187) మొ. వి. సంస్కృతం నుంచి వచ్చినవి. వీటినే మన వైయాకరణులు తత్సమపదా లన్నారు. తక్కురు ( పై. 6.897.6, 1298,) దేరా (పై. 5.1216.6, 1314) మొ.వి. ప్రాకృతాల నుంచి వచ్చిన ఋణపదాలు. ఇవిగాక పిరాట్టి (తె. శా. 1.71.11, 1258), వశిక (*SII* 10.565.12, 1391), మొ. అన్యదేశ్యాలు కూడా ఈ యుగంలో క్వాచిత్కంగా కనిపిస్తాయి.

విభాజ్య ప్రాతిపదికల్ని ప్రధానంగా రెండురకాలుగా చెప్పవచ్చు. 1. ఏకధాతుకం (derivatives), 2. బహుధాతుకం (compounds), ఏకధాతుకం-కృత్తులనీ, తద్ధితాలనీ రెండు రకాలు.

**4.32. కృత్తులు :** మూలధాతువులపైచేరే ప్రత్యయాలు. ఇవి దేశిపదాలుగానే ఉంటాయి.

(క) -ఇకి/-ఇక ; ఏలికి ( *SII* 6.649.10, 1160 ), కానిక (పై. 10.465.99, 1290) మొ.వి. ఇకారం లేకకూడా రావచ్చు కాన్కి (పై. 6.639.2, 1147).

(ఖ) -అపు/-ఉపు/-పు : అడపు ( *SII* 4.1020.10, 1118 ), కొలువు (పై. 6.756 6,1113), కాంపు ( పై. 5.162.11,1169), -ఇంచు చేరే ధాతువుకు -ఇంపు చేరుతుంది. పెట్టించు - పెట్టింపు (పై. 4.1098, 1158) మొ.వి

(గ) -అవు/-ఉవు/-వు : తొడవు ( *SII* 5.162.4, 1169 ), తెరువు (పై. 6.1178.7,1198), పూవు (పై. 6.897.7,1298) మొ.వి.

(ఘ) -ఉవ/-వ: విలువ (పై. 6.912.8,1278), త్రోవ (పై. 10.481. 11,1297) మొ.వి.

(చ) -ఇమి/-మి: కూరిమి (పై.5.1075.7,1128), పేర్మి (పై. 6.132. 8,1151) మొ.వి.

(ఛ) -అలి/-ఇలి : కూడలి (పై. 10.565.6,1391), దిగ్గిలి (పై 5. 1214.30, 1309) మొ. వి.

(జ) -ట : తోఁట ( పై. 4.1208.9,1163). పూఁట (పై. 4.1020.9, 1118) మొ.వి.

(ఝ) -ఇఁడి/-ఁడి : పహిండి (పై. 4.1190.4,1143), వెఁడి (పై. 4.1190. 4,1143) మొ వి.

(ట) -ϕ (శూన్యం) : తప్పు ( పై. 5.1290.8, 1230 ), చెల్లు (NI. 5.25.4, 1244) మొ. వి.

**4.33.** **తద్ధితాలు** : పై కృత్ప్రత్యయాలలా గాక ఈ తద్ధిత ప్రత్యయాలు దేశి పదాలపైననూ తత్సమాలపైననూ రావచ్చు. ఇవి మూలధాతువులపైగాక ప్రాతిపదికలపై వస్తాయి.

(క) -కా- : ఈ ప్రత్యయంపై మహత్ప్రత్యయం-ఁడు, మహతీ ప్రత్యయం -త్త్య చేరుతాయి. మహతీ ప్రత్యయం ముందు దీర్ఘం హ్రస్వమౌతుంది. అవజకాండు ( *SII* 10.334.93, 1251 ) ప్రతికత్త్య (పై.10.110.13, 1141) మొ వి.

(ఖ) -అరి/-అరి/-ర/-అఱ/-ఆఱి/-ఱ. మొ: కొట్టరి (పై. 4.1114.12, 1163), కోనారి (పై.6.924.8, 1369), ఖదర (పై. 4,990.9,

1158), సుంకళి (పై. 6.617.7, 1145), తలాఱ (NI 2.8.6, 1188), తలాఱి (NI 2.10.7, 1188) మొ. వి.

తలాఱ మొదలగు శబ్దాల్లో సాధురేఫ శకటరేఫ గూడా కనిపిస్తున్నాయి. అంటే సాధురేఫకూ, శకటరేఫకు గల వ్యత్యాసం ఈ పదాల్లో తబ్బిబ్బైందన్నమాట. కొట్టరి, పురవరి మొదలైన మాటలలోని -ఆరి, -అరి ప్రత్యయాలు బహువచనానికి సంబంధించినవని చెప్పవచ్చు కాని ఏదో కారణంచేత ఇవి శకటరేఫలతో కూడా శాసనాలలో కనిపిస్తాయి.

(క) లోని-కాణ్డు రూపానికి కన్నడంలో-కాఱ్ఱ అనేరూపం ఉంది. బహుశా ఈ కన్నడంలోని-కాఱ శబ్దం ప్రభావం వల్ల పై రూపాల్లో శకట రేఫ వచ్చి ఉండవచ్చు.

(గ) -ఇ: ఉదారి (SII 4.666.8, 1139), భండారి (పై.6.154.7, 1152): ఈ-ఇ ప్రత్యయమే పై తలారి మొ. వానిలోని -ఇ అయి ఉంటుంది, (చూ. 4 33 (ఖ) ).

(ఘ)-క- : దీని తర్వాత క్లీబవాచక ప్రత్యయమైన -ము/-ం (బిందువు) చేరుతుంది. రడ్డికము ( SII 4.737.15, 1115 ), రడ్డికం (పై. 4.762.18, 1131) మొ. వి.

(చ) -తన-: దీని తర్వాత కూడా -ము/-ం వస్తుంది. స్థానాపతి తనము (పై. 10.709.9,1139), తలారి తనము (పై.6.207.31,1209) మొ. వి.

**లింగబోధక ప్రత్యయాలు (Gender Suffixes) :**

**4.34. మహత్తు (ఏకవచనం)** : -ంఱు, -ణ్డు, -డు. వీటిలో -ంఱు ప్రాచీనరూపమైన -న్ఱుకు రూపాంతరం అనవచ్చు.

ప్రెత్తికాంఱు ( NI 1.24.17, 1187 ), అల్లుణ్ఱు ( పై., 6.623.9. 1262), తమ్ముడు (పై. 6.120.39, 1275). -ంఱు ప్రత్యయం నెల్లూరుశాసనంలో ఒకచోట మాత్రం కనిపిస్తుంది. ఇది ఆ ప్రాంతంలో కనీసం మాండలికంగానైనా వ్యవహారంలో ఉండేది అనడానికి వాఱ్రని పెద్దకొడుకు ( NI 3.9.29 ) అనే ప్రయోగం ప్రబలమైన ఆధారం.

**4.35.** **మహతి (ఏకవచనము) :** -జాలు, -ఆలు, -త్య : నాయకుజాలు ( *SII* 5.1030.5, 1141 ), బాలవ్యాకరణంలో - రాలు అని ఉంది. కాని శాసనాలలో బహుసంఖ్యాకంగా - జాలు అనే ఉన్నది. - ఆలు ప్రత్యయం కొన్ని బంధుత్వపదాల్లోనే ఉంది. కోడలు (*SII* 6.634.2, 1153 ), మఱందలు ( పై. 6.634.2, 1153); ప్రిత్రికత్య (పై. 10.110.13, 1141), మొ.వి. -త్త్య, -కా ప్రత్యయం మీదనే వస్తుంది. దీనిముందు కాలోని దీర్ఘత పోతుంది.

**4.36.** **క్లీబం :** -ము, -మ్ము, -ంబు, -ం ( అనుస్వారం ): కూటము ( *SII* 4.1102.11, 1150 ), సుంకమ్ము ( *NI* 1.25.59, 1284 ), దేశంబు ( *SII* 6.402. 20, 1264 ), రక్తం ( *NI* 1.24. 14, 1187 ) మొ. వి.

**బహుధాతుకం (సమాసం)**

**4.37.** సమాసాలు నాలుగు రకాలు 1. దేశి. 2. తత్సమం. 3. మిశ్రం. 4. వర్ణలుప్తం.

(1) దేశి : దేశిరూపాలతో అయ్యేది దేశిసమాసం దేశిసమాసాలు ఏర్పడే విధాన్ని బట్టి ఈ కింది విభజన చేయవచ్చు.

(క) ఇతరత్ర స్వతంత్రప్రయోగం ఉన్నరూపం విశేషణంగా ఉన్నా కూడా దానిని విడదీస్తే అర్థము మారిపోయింది. కాబట్టి అట్టివి సమాసంగానే భావించాలి. చలివందిలి (తె. శా. 1.37.3, 1215), గుండకుడ్క ( *SII* 5.1172.15, 1293 ) మొ. వి.

(ఖ) మరోచోట స్వతంత్రప్రయోగం లేని బంధరూపం (boundform) విశేషణంగా ఉండటం. నల్లిల్లు (తె.శా. 1.17.27,1115). 'నల్'కు స్వతంత్రప్రయోగం లేదు : ఆంబోతు ( *SII* 10 334.102, 1251), 'ఆన్' కు స్వతంత్రప్రయోగం లేదు. మొ. వి.

(గ) బంధరూపంపై- అ చేరినవి. మేనమామ (*SII* 6.634.1,1153), ఆనపాలు (పై. 6.1118.13, 1281) (ఆవుపాలు ). ఊరతలారి (పై. 10.528.11, 1319).

(ఘ) పై-అ ముందు ము వర్ణకమందలి మకారానికి ప వర్ణమౌతుంది.

ఇనుప ఎడ్లు ( *SII* 4 1156.11, 1135 ) (ఇనుము = నల్లని, ఎడ్లు = గృహజంతువులు) ; మొ. వి.

(చ) **ద్వంద్వసమాసం :** తల్లిదండ్రులు ( *SII* 6.125.32, 1172 ) కూరకాయలు (పై. 10.33 4.96,1251), మొ.వి. మొదటిరూపంలో తకారం దకారం అయింది. రెండవదానిలో 'క', వర్ణం 'గ' కాక పోవడం గమనార్హం. ఏకవచనాంతమైన ద్వంద్వసమాసరూపాలు కూడా ఉన్నాయి. ఇట్టివి 13 వ శతాబ్దం నుంచి కనిపిస్తాయి. తల్లి తండ్రి ( *SII* 6.90.3, 1341 ), కాయకూర (పై. 7.904.23, 1291) మొ. వి.

(2)**తత్సమం :** సంస్కృతసమాసాలు అలాగే తీసుకొన్నవి. సహస్ర నామార్చన (*SII* 5.1212.11 1210), జలధార (పై. 6 943.16, 1192) మొ. వి.

(3) మిశ్రసమాసం : ఇవి తెలుగు పదాల స్థానాన్ని బట్టి రెండు రకాలు.

(క) తె + సం : తలరాసి. (*SII* 4,1058.6, 1149), వెంజామర (పై. 4,1190.4, 1143) మొ. వి.

(ఖ) సం + తె : చామరకోలుపు(పై.6.756.10, 1113), దీపమాన్య (పై. 6.1203.7 1226) మొ. వి.

(4) **వర్ణలుప్తసమాసం :** తిరువజాము (తిరువర్థజాము) (*SII* 6.742. 6, 1372), మంజుతెర ( మంజిష్ఠ తెర ) ( పై. 5.1216.4, 1314 ), హవిలి (హవిబలి) (పై. 10.131.14, 1153) మొ. వి.

**4.38. వచనం**

(క) -రు : మానవవాచకాల్లో (human nouns) కొన్నింటికి బహువచన ప్రత్యయంగా - రు వస్తుంది. అల్లురు ( *SII* 10.164.6,1168 ), దీనురు ( పై. 6.628.115, 1224) మొ. వి.

(ఖ) -ఉు, -ండ్రు, -ంఉు, -ంఉు :-కా- ప్రత్యయం మీద మహత్తులో పై ప్రత్యయాలు వస్తాయి, వాద్యకాఉు ( *SII* 10.707.14, 1153), మద్దెల కాండ్రు (పై. 5.1188.65- 1250), ఒత్తుకాంఉు (పై. 6.955.9, 1349), వాస్యకాండ్రు (పై .6.1116.13,1376).

పై వానిలో -ంఱు -ండ్రు విశాఖప్రాంతంలోనే కనిపిస్తాయి. పై నాలుగు రూపాల్నిబట్టి పునర్నిర్మాణం (reconstruct) చేస్తే* న్ఱు వీటికి ప్రాచీనరూప మని చెప్పవచ్చు (చూ. 6.12). -కా- ప్రత్యయంలో దీర్ఘం ఉంది. కాబట్టి ఈ దీర్ఘం పైన అనునాసికంపోయి -ఱు ఒక మాండలికంలో అయి ఉంటుంది. బహుశా ఇది కన్నడప్రాంత మాండలికంలో అయి ఉండవచ్చు. -న్ఱు > ండ్రుగా ఇంకో మాండలికంలో అయి ఉంటుంది. తర్వాత మాండలికమిశ్రం (dialect-mixing) వల్ల -ండ్రు, -ఱు రెండు రూపాలూ తెలుగుభాషలో నిల్చాయి. నన్నయ, నన్నెచోడుల భాషల్లోనూ, 12 వ శతాబ్దిదాకా శాసనాల్లోనూ ఒక్క కాఱు శబ్దమే కనిపిస్తుంది. -కాండ్రు శబ్దం 13 వ శతాబ్దినుండే కనిపిస్తుంది. ఈ-కాండ్రు ప్రత్యయం 13వ శతాబ్దినుండి ఎక్కువౌతూ 14వ శతాబ్దిలో దాదాపు-కాఱు రచనలో లోపిస్తుంది.

పెక్కండ్రు ( *SII* 4.974.2, 1132 ), ఎన్మండ్రు ( పై. 5.1305. 11,1107) తొమ్మండ్రు (పై. 6.87.11,1164), పదుండ్రు (పై. 10 130.15, 1153), ఇర్వ్వండ్రు ( 6.1183.64, 1250 ) మొ. శబ్దాల్లోను-ండ్రు ప్రత్యయం కనిపిస్తుంది. వీటిలో ఎన్మండ్రు అనడానికి రూపాంతరం ఎనమంఱు ( *SII* 6. 1052.10, 1350) కూడా విశాఖ ప్రాంతంలో కనిపిస్తుంది.

**4.39.** -లు : సర్వసాధారణంగా బహువచన ప్రత్యయంగా వచ్చేది -లు. ఇది కొన్ని ప్రాతిపదికలకు మార్పేమీ లేకే చేరుతుంది. తలియలు ( *SII* 6.1294.9, 1245) మొ. వి. కాని ఈ ప్రత్యయం ముందు కొన్ని రకాలైన ప్రాతిపదికలకు మార్పులు వస్తాయి. అవి ఈ కింది విధంగా జరుగుతాయి.

(క) -లు ప్రత్యయం ముందు మహత్ప్రత్యయం లోపిస్తుంది. తమ్ములు ( *SII*.6.192.7, 1167 ).

(ఖ) -ము వర్ణకాంతాలకు-లు అలాగే చేరవచ్చు. కుంచములు (పై. 6. 1328.9, 1115). లేదా ము వర్ణకం లోపించి పూర్వాచ్చు దీర్ఘంకా వ్వచు. కారణాలు (పై. 4.1115.15, 1165).

(గ) -లు ప్రత్యయం ముందు-ఇకారం ఉకారమౌతుంది (మాని)మానులు (పై. 4.992.6.1156). (వ్రిత్తి) వ్రిత్తులు పై. 4.667.3,1112)

(ఘ) ట, డ, ర, ల పై గల అచ్చులు పోవచ్చు. లేదా ఉండనూవచ్చు. అచ్చులుపోగా 'రల'లు డకారంగా మారుతాయి. పుట్లు (*SII* 6.845 11,1278), తాడ్లు (పై 5.126.12,1296), ఊడ్లు(పై.10 199. 103, 1170), కాహడ్లు (పై. 4.675.31,1140).

అచ్చులు పోని రూపాలు:

పుట్టులు (*SII* 6.845 11, 1278). మడులు (పై. 6.738. 7,1381), మూరలు (పై. 10.509.3, 1314). పైనియమాలు అకారాంతపూర్వక లకారానికి చెల్లవు. నెల–దీనికి ఒకచోట నెల్లు (తె.శా. 1.47.520, 1303)అని ప్రయోగం ఉంది.

(చ) లకారాంతమైన కొన్ని పదాల్లో -లు ప్రత్యయానికి ముందు డకారానికి బదులు -ండ్ అవుతుంది. (మడపలి) మడపండ్లు (*SII* 6 1172.9,1293), (ఇల్లు)ఇండ్లు(పై.10.540.11,1258) మొ.వి. ఇట్టి సంధికార్యం హ$_1$ఆహ$_2$(హ$_2$)ఆ రూపాల్లోనే అవుతుంది. ఇందు హ అనేది లకారం. ఇట్టి రూపాలు సమాసాల్లో కూడా ఉండవచ్చు. మడపలి అనేది మడ + పల్లి అని రెండు రూపాలు చేరిన సమాసం కాబట్టి దీనికి కూడా ఈ సంధికార్యం జరిగింది కాని చివరి అచ్చు అకారమైతే ఇది జరగదు. నెల–నెలలు మొ.వి. –పై (ఘ) (చ)ల లోని -డ్ల రూపాలకు వర్ణ సమీకరణమై ళ్ల రూపాలు కూడా కావచ్చు (చూ. 4.19).

(ఛ) (హ)$_1$ హ ఆహ$_2$ ఆ రూపాల్లో హ$_2$ యకారం గాని నకారం గాని అయితే -లు ప్రత్యయం ముందు అది దాని అచ్చుతోసహ లోపిస్తుంది. వేయి–వేలు (*SII* 10.177.74,1171), చేను–చేలు (పై. 10. 334. 75, 1251) మొ.వి.

(జ) చేయి శబ్దానికి -తులు బహువచన ప్రత్యయంగా వస్తుంది. దీని ముందు 'యి' లోపిస్తుంది. చేతులు (*SII* 10.438.20, 1276) మొ.వి.

(ఝ) ప్రమాను మొదలగువానికి -కులు బహువచన ప్రత్యయంగా వస్తుంది.

దీనిముందు ను అనుస్వార మవుతుంది. క్రమాంకులు (*SII* 4.1050.9,1165) మొ.వి.

(ఞ) రాత్రి శబ్దానికి -ళ్ళు కూడా బహువచన ప్రత్యయంగా వస్తుంది. రాత్రుళ్ళు (*NI* 1.23.28,1847) మొ. వి.

(ట) పూజ్యార్థంలో బహువచన ప్రత్యయం చేరడం ఈయుగంలో చాలా తరచుగా కనిపిస్తుంది. పై చెప్పిన వాటిలో -రు,-లు గౌరవార్థం చేరినవి. గురులు ( *SII* 4.778.6,1165 ), గుండమదేవులు (పై. 4.680.10,1171) మొ.వి. బ్రహ్మరాయరు (పై.5.1083. 6, 1108), దేవరు (పై.10.689.2, 1137) మొ.వి. పూజ్యార్థంలో -గారు ద్వితీయారూపానికి చేరుస్తారు.నంబిగారు (*NI*2.51.7, 1198), భాను ఏర్రాయనిగారు (*SII* 6.377.12, 1340) మొ.వి. పూజ్యార్థంలో -వారు: జియ్యరువారు ( *NI* 2.51.7. 1155), జక్కిరడ్డివారు (*SII* 6.93.1, 1241).

**విభక్తి ప్రత్యయాలు :**

**4.40.** ప్రథమా విభక్తికి ప్రత్యేకంగా ప్రత్యయాలు లేవు. పైన చెప్పిన రూపాలు అలాగే ప్రథమారూపాలుగా వాడవచ్చు. ద్వితీయాది విభక్తి ప్రత్యయాల్ని పైన చెప్పినకొన్ని నామపదాలకు అలాగే చేర్చవచ్చు. ఉదా: పొలములోన ( *SII* 5.1016.13, 1134 ). కాని కొన్నింటికి పదాంతంలో కొంతమార్పు పొంది ప్రత్యయాలు చేరుతాయి. అట్టి మార్పును తేచ్చే ప్రత్యయాల్ని ఔపవిభక్తిక ప్రత్యయాలంటారు. అవి ఈ కింది విధంగా వస్తాయి.

(1) మహత్ప్రత్యయంగల పదాల్లో -డుజ్జు లోపిస్తుంది. అలా లోపించిన దానిమీద -ని పాక్షికంగా రావచ్చు. పరమాత్మునిచేం (*SII* 4. 737.32, 1115), రఘునాధునిచేం ( పై. 10.89.13, 1132) మొ. వి. డుజ్జు లోపించక -ఇ చేరిన రూపాలుకూడా ఈయుగంలో కనిపిస్తాయి. దేవుడికి (*NI* 3.138.9, 1247), వాన్ని పెద్ద కొడుకు (*NI* 3.9.29, 1259) మొ.వి.

(2) బహువచన ప్రత్యయాలైన -లు, -రు, -ళు, -ండ్రు పైన అ చేరుతుంది. నివేద్యములకు (*SII* 5.90.11, 1177), మునూర్వురకు

(పై. 10.173.7, 1170), వాద్యకొలకు (పై.10.707.14,1158), పెక్కంద్రదను (పై. 6.98.2, 1131), వాస్యకాంటి్రకు (పై. 6. 1116.15, 1376), మొ. వి.

(3) -ను, -లు, -రు చివరగల కొన్ని నామపదాలకు -ఇ చేరుతుంది. చేనికి ( *SII* 10.488.34, 1199 ), పాలిలోన (పై. 10.425.11, 1270), పోరిలోన (పై. 6.117.47, 1118). నీరు శబ్దం మాత్రం -ఇ ప్రత్యయాన్ని పాక్షికంగా తీసుకొంటుంది. మున్నీరులోం (పై. 4.1075.3, 1166), నీరువేల (పై 4. 704.15, 1167). 14వ శతాబ్దిలో -ఇ ప్రత్యయం లేని రూపాలే ఉంటాయి. నీరు శబ్దానికి -టి ప్రత్యయం కూడా క్వాచిత్కంగా కనిపిస్తుంది. నీటినేల ( *NI* 1.39.5, 1141) మొ. వి. చేను శబ్దానికి కూడా ఒకచోట -ఇ ప్రత్యయం లేకుండా కనిపిస్తుంది (*SII* 7.735.11, 1291).

(4) య, ల, ఱ, డ-లు చివరగల కొన్ని పదాలకు -తి చేరుతుంది. ఇది చేరేటప్పుడు కింది విధంగా సంధిమార్పులు వస్తాయి.

(క) -తి చేరేటప్పుడు యకారం లోపిస్తుంది. నేయి-నేతికి (*SII* 5.1107. 11, 1139).

(ఖ) లకారాంత పదాలకు తి చేరినప్పుడు రెండు రకాలైన సంధికార్యాలౌతాయి. (1) ల్ + తి > ఙ్టి, (2) ల్ + తి > టి. ఇందు మొదటిది హ$_1$అ$_1$ (హ$_2$) హ$_2$ అ$_2$ రూపాలపైనను (హ$_2$ లకారం అ$_2$ అకారం తప్ప తక్కిన అచ్చు), రెండోది తక్కిన రూపాలపైననూ అవుతాయి. ఇల్లు - ఇంటను (*SII* 10.507.17,1314), కుఱుంగల్లు - కుఱుంగంటికి (పై. 10.112.8, 1243 ). ఇక్కడ కల్లు శబ్దం సమాసగతంగా ఉంది(చూ. 2.39 (చ)). తక్కినచోట్ల కేవలం-టి మాత్రం వాకిలి-వాకిటాన (*NI* 3.78 87, 1353) మొ. వి.

(గ) హ$_1$ అ హ$_2$అ (రూపాంతరం హ$_1$అహ$_2$హ$_2$ అ) రూపంలో ఉన్న శకటరేఫకు -తి ప్రత్యయం ముందు మార్పేమీ ఉండదు. ప్రోంపఱ్ఱు-ప్రోంపఱుతను ( *SII* 10.172.10, 1170 ), కఱు-కఱ్ఱ

(పై. 6.645.3, 1159) మొ. వి. తిప్రత్యయం ముందు ద్విత్వం ఉండదు. తక్కినచోట్ల ట్ + తి > టి : పడమర - పడుమటం (పై. 5.167.14, 1200) మొ వి

(4) దకారం -తితో కలిసి -టి అవుతుంది, వీడు-వీట (*SII* 10. 690.9, 1139 ) మొ. వి.

(5) పైప్రత్యయాలు చేరనిపదాలు క్వాచిత్కంగా కనిపిస్తాయి. పడుమఱ భాగము ( *SII* 5.1133.4, 1155 ), చేబ్రోలు నాండం (పై. 5. 1250.1122), వాకిలికి (పై. 4.952.2, 1313) మొ.వి.

(6) పై ప్రత్యయాలు చేరిన పదాలనుండి అనుచిత విభాగమై -ంటి, -టి ప్రత్యయాలు చేరడం ఈ యుగంలో చాలా తరచుగా కనిపిస్తుంది. రాత్రింటి ( *SII* 6 1118.35;1281 ), సగమింటిలోను (పై. 6.1008.12, 1389), రాత్రి అనే సంస్కృత పదంలోనూ ఇది రావడం గమనార్హం.

**4.41.** ద్వితీయావిభక్తి : -ను ద్వితీయా విభక్తి ప్రత్యయం. ఫలమును బొందుదురు (*NI*. 2.18.9, 1155). దీనికి అనుస్వారం కూడా అవుతుంది. కవిలం వధించి (పై. 1 24.14, 1187) మువర్ణకం గల వాటిపై. క్వాచిత్కంగా -ము లోపించి -న్ని చేరుతుంది. దీనిముందు హ్రస్వం దీర్ఘమవుతుంది. ధర్మాన్ని (*NI* 1.40.8, 1140).

ఈ ద్వితీయావిభక్తి ప్రత్యయం కర్మార్థంలో వస్తుంది. సాధారణంగా క్లీబ రూపాలకు ప్రథమరూపాల్నే ద్వితీయలోనూ వాడుతారు. ఈ ధర్మువు ప్రతి పాలింపనివారు (తె. శా. 1.5.29, 1221).

**4.42.** తృతీయావిభక్తి : (క)-న్, -అన్, -నన్ : (ఖ) -తోడన్ -తోన్. (గ) మెయిన్,

(క) -న్, -అన్, -నన్ : ఉకారంత పదాలపై -నన్, ఇకారంత ఔపవిభక్తికాలపై-అన్ మిగిలినచోట్ల -న్ వస్తాయి. ఇవి సాధారణంగా సహార్థంలోనూ వస్తాయి.

**సహార్థంలో** : సుఖంబున ( *SII* 4.737.4, 1115 ), వినోదంబులం ( పై. 19.334.56, 1251 ). ఇట్టి రూపాలు సారస్వతంలోనే నిల్చాయి. కాని వాడుకకు రాలేదు.

**కరణార్థంలో** : కాలందుడిచెను ( *SII* 6.628 49, 1224 ), నల్లజాతకట్టి ( పై. 6.1142.15, 1268 ). ఈ ప్రత్యయాల పైన-చేసి హేత్వర్థంలో చేరుతుంది. భక్తింజేసి (పై. 4.1078.4, 1149), గ్రొప్పించుటంజేసి (పై. 6.1177.8.1201), ధర్మవునం జేసి (పై. 4 661.73, 1297) మొ వి.

(ఖ) **-తోడన్ :-తోన్** : ఇవి సహార్థంలో వస్తాయి. భక్తితోడ (*SII* 5.163.6,1156), దయతోనిచ్చె (1089.89.19,1132).తోడన్ అనే రూపానికి **తోటన్** అనేది ప్రాచీనరూపం. ట > ద మార్పురాక పూర్వమే టకారం లోపించడం మూలంగా -తోన్ రూపం ఏర్పడి ఉండాలి.

(గ) **మెయిన్** : ఇదీ సహార్థంలోనే వస్తుంది. సచ్చరితమెయిని (*SII* 10.111.14, 1142) మొ. వి. ఈ ప్రత్యయం ఉన్న రూపాలన్నీ పద్యశాసనాల్లోనే ఉన్నాయి. ఇది 14 వ శతాబ్దిలో బొత్తుగా కనిపించదు.

**4.43 చతుర్థీ విభక్తి : -కిన్, -నకున్, -కున్** : ఇకరాంతాల తర్వాత -కిన్- ఉకారాంతాల తర్వాత -నకున్ వస్తాయి. ఈ ప్రత్యయాలు సాధారణంగా సంప్రదానార్థంలో, నిమిత్తార్థంలో వస్తాయి.

**సంప్రదానార్థంలో** : కోలకానికి ( *SII* 10.91.82, 1132 ), రిషిపెద్దికి (పై. 6.207.12, 1209) మొ. వి.

**నిమిత్తార్థంలో** : చమరునకు (పై. 10.427.21, 1270), అరదివియకు (పై. 6.67 9, 1183)మొ. వి. ఈ ప్రత్యయం ముందు మువర్ణకం పాక్షికంగా లోపిస్తుంది. లోపిస్తే పూర్వస్వరం దీర్ఘమవుంది. దీపానకుం ( *SII* 6.84,4, 1292) మొ. వి. అలా మువర్ణకం లోపించిన తర్వాత -నకు ప్రత్యయానికి బదులు -నికి ప్రత్యయం క్వాచిత్కంగా కనిపిస్తుంది. దీపానికి (*SII* 10.293.3,1241) మొ. వి.

ఉకారాంత పదాల్లో కూడా -కు ప్రత్యయం తరచుగా కనిపిస్తుంది. దీపముకు ( *SII* 5.1043,9, 1123 ) మొ.వి. ఈ చతుర్థీ విభక్తికి తరచుగా అగు క్త్వార్థక రూపమైన-ఐ అన్నంత రూపమైన -కాన్ చేరడం కనిపిస్తుంది. భోగాలకై ( *SII* 10.48019, 1296 ), పెట్టింపులకుంగా (పై. 4.1098 8, 1153 ), మొ. వి. నిమిత్తార్థంలో -కాన్ మాత్రం రావడం కూడా కనిపిస్తుంది. రాజ్య రాష్ట్రి గామ వర్ధనగా... పెట్టిన (పై. 10.710.8, 1178) మొ. వి.

-కొఱకు ప్రత్యయం 14 వ శతాబ్దిలో రెండుచోట్ల మాత్రం కనిపిస్తుంది. అభీష్ట సిద్ధికొఱకు (*SII*. 6.789.7, 1381), చేయించి కొఱకై (పై. 6.1096. 4, 1383).

**4.44. పంచమీ విభక్తి :** (క) *-చేతన్*, *-చేన్*, *-వలనన్*, రూపాంతరం : (*వల్నన్* , *వల్లన్*) (ఖ) *-నుండి*. (గ) *-కంటెన్*,

(క) -చేతన్, చేన్, -వలనన్ : ఇవి గ్రహ్యార్థంలోనే ప్రయోగంలో కనిపిస్తాయి. వీటిలో - చేతన్,- చేన్ మహన్మహతీ పదాల తర్వాతను, వలనన్ క్లీబ పదాల తర్వాతను వస్తాయి. స్తానపతుల చేతవిల్చి ( *SII* 6.600.8, 1165 ), దేవరచే కృపంగొని (పై.6.1142. 28, 1268), జీతాలవలనం... (*NI* 2.43.10, 1340), తనప్రవిత్తి వల్న నిచ్చిన ( *SII* 10.422.23, 1269 ), సుంఖంవల్లను (పై. 10.480.19, 1296). ఒక్కచోటమాత్రం చేత ప్రత్యయం క్లీబ సమంపైన కనిపిస్తుంది. మగతల సమస్తంబైన పరివారము చేతను (తె.శా. 2.123.28, 1297), -వలనన్ ప్రత్యయం క్వాచిత్కంగా మహన్మహతీ పదాల పైననూ వస్తుంది. వైష్ణవ నాయకుల వల్లను ( *SII* 6.904.25, 1291 ).

(ఖ) -నుండి : *గంగకఱుతనుండి* ( *SII* 4.1190.2, 1143 ), మొ. వి. దీన్ని ఆంగ్లంలో from అనే అర్థంలో వాడుతారు. ఈ అర్థంలో నేడుపయోగంలో ఉన్న -నుంచి రూపం ఈ యుగంలో కనిపించదు.

(గ) *-కంటెన్* : ఈ ప్రత్యయం చాలా క్వాచిత్కంగా కనిపిస్తుంది.

దీన్ని పోల్చే సందర్భంలో వాడుతారు. నాకాధీశపురంబు కంటె నిది మేలు ( *SII* 6.285.4, 1158 ) మొ.వి.

**4.45.** షష్ఠివిభక్తి : ఉకారాంత పదాలకు అచ్చుపరమైతే షష్ఠీప్రత్యయంగా నకారం వస్తుంది. మూలస్థానంబు నాదిమూర్తికి ( *SII* 4.672.17, 1139 ) మొ. వి. లేనిచో ప్రాతిపదికే షష్ఠీరూప మవుతుంది. ప్రోలెబోయు తమ్ముండు (పై. 4.667.13, 1132) మొ.వి.

**4.46.** సప్తమీవిభక్తి : (క) -న్, -అన్, -నన్, (ఖ) -లోన్, లోనన్, -లోపలన్ : (గ) -అందు, -నందు, -నయందు ఇవి అధికరణార్థంలో వస్తాయి.

(క) న్. -అన్, -నన్ : తృతీయావిభక్తిలో చెప్పిన పరిసరాల్లోనే ఇవీ వస్తాయి. కేటిఫల్లిని (*SII* 10.702.7,1153), పడుమటం ( పై. 5.167.14, 1200 ), శ్రీకూర్మమున ( పై. 5.1338. 22, 1188).

(ఖ) -లోన్, -లోనన్, -లోపలన్ : ఉత్తరసీమలో (*SII* 5.1114. 11,1164 ), చెల్లావలోన ( పై. 4.167.13, 1200 ), సోరకినాంటి లోపలం ( పై. 10. 690.17, 1189 ).

(గ) -అందు, -నందు, -నయందు : చెఱువందు (తె. శా. 1.16.7, 1170 ), భోగమునందు ( *SII* 5.1081.3, 1132 ), ఉత్తరాయణమునయందు (పై, 10.177.30, 1171). పై అందు శబ్దానికి -ఉల ప్రత్యయం చేరి విశేషణం అవుతుంది. అందుల గొల్లమంత ( *SII* 10.208.7, 1200 ) మొ. వి. అలాగే 'ఇందుల కాయకూర' (పై. 6.904.23. 1291) మొ.వి. ప్రయోగాలు ఉన్నాయి. ఉల ప్రత్యయానికి బదులు -అలి ప్రత్యయం క్వాచిత్కంగా కనిపిస్తుంది. అందలి మాడూరి సోమయ ( తె.శా. 10.36.33, 1215 ) -అల ప్రయోగం ఒక్క శాసనంలో రెండుసార్లు కనిపిస్తుంది. ఇందల శ్రీకంఠమ నాయకు ( *SII* 10.691.16, 1139 ). ఇందల సోమేశ్వరదేవర (పై. 10. 691.21, 1139).

**4.47.** ఇవిగాక -క్రిందన్,-మీందన్/-మిందన్,-పైన్,- ఒద్దన్/-వద్దన్, -కడన్ మొ. ప్రత్యయాలు గూడా సప్తమ్యర్థంలో కనిపిస్తాయి. చెఱువు క్రింద ( *SII* 6 1174 9, 1151 ), ధాత్రిమీంద (పై 6.625.65,1158 ), పల్లియల మింద (పై. 4737.11,1115 ), ఈ ధర్మువుపై (పై. 5.1343.12,1146), ఉయ్యూరి ఒద్ద (పై. 4.762.10,1131), తూమువద్ద (తె.శా. 1.1559,1125), తాదేకుంటకడ (*SII* 6.225.8,1288) మొ.వి. -పోలెన్, -వలెన్, -మాడ్కి, -వంటి మొదలైన పోలిక ప్రత్యయాలు కనిపిస్తాయి. గురుంపోలెన్ ( పై. 10.675.35,1140), మాఱయ వలెన్ (పై. 10.282.11,1230), ఆఱిగాంపుల మాడ్కి (పై. 4.737 21,1115 ), లెంకవంటి కోకన ( పై. 10.337-68,1251) మొ వి.

**4.48.** సంఖ్యావాచకాలు :

ఇవి నామపదాల కిందే రావలసి ఉన్నా, ఇందుకొన్ని విశేషాలుండటం చేత వీటిని గురించి ప్రత్యేకంగా వ్రాయవలసి వచ్చింది.

(1) **ఒకటి :** ఈ శబ్దాన్ని ఈ యుగంలో ఈ కిందివిధంగా వ్రాసేవారు. ఒకొండ్డు ( *SII* 4.1305,8, 1107 ), ఒకండ్డు (పై. 5.1091. 8.1129), ఒకణు (పై. 5 1343,12.1146 ), ఒక్కండు ( పై. 5.1284.20 1235), ఒక్కటి పై. 4.685.101173). ఒకటి (పై. 10.73.115,1115). ఈ యుగానికి పూర్వపు శాసనాలుచూస్తే ఒకొండువంటి రూపాలే ఎక్కువగా ఉండటంచేత ఈ ఒకొండు శబ్దం ఒక్ + ఒణ్డు కలయికచేత ఏర్పడిందని చెప్పవచ్చు. ఒక శబ్దం కొన్ని మధ్య ద్రావిడభాషలలో కనిపిస్తుంది. ఒణ్డుకు ప్రాచీన రూపమైన *ఒన్తు చాలా ద్రావిడ భాషలలో కనిపిస్తుంది. అది మొదట ఒకొండు అయి తర్వాత ఒక్కండు అయింది. ఇట్టి మార్పు ఈ యుగానికి ముందే ఎప్పుడో జరిగిపోయింది. కాని ఈ యుగంలో ఒక్కండు శబ్దానికి ఔపవిభక్తిక రూపమైన ఒక్కణ్టి లేక ఒక్కటి ప్రథమారూపంగా వాడడం జరిగింది. ఔపవిభక్తిక రూపాన్ని ప్రథమాంతంగా వాడడం 11 వ శతాబ్దిలోనే ఒక్కచోట కనిపిస్తుంది. 12వ శతాబ్ది నుండి క్రమేణ ఎక్కువగుతూ వస్తుంది.

ఇట్టి పరిణామాన్ని నన్నయ భాషలోని ప్రయోగాల్ని ఎఱ్ఱన ప్రయోగాల్ని బట్టి చూచినా స్పష్టమవుతుంది.[3]

(2) **రెండు, మూడు** రూపాలకు ఈ యుగంలో చెప్పుకోదగ్గ విశేషాలేమీ లేవు.

(3) **నాలుగు :** ఈ శబ్దానికి ముఖ్యంగా రెండు రూపాలున్నాయి. (అ) నాలుగు/నాలువు (ఆ) నాలు-నాలుగు (*SII* 6.598.10,1163), నాలువు (పై. 4.1142.5,1143), నాలు (పై.6.846.16,1273) మొ. వి. పైవాటిలో నాలు రూపం విశాఖ - శ్రీకాకుళం ప్రాంతంలోనే కనిపిస్తుంది.

(4) **ఐదు :** దీనికి రెండు రూపాలున్నాయి (అ) ఐదు, (ఆ) ఏను : ఐదు (*SII* 6.228.63.1197), ఏను (పై. 5,1011.7,1108). ఈ రెంటిలో ఏను శబ్దం 12వ శతాబ్దిలో విశేషంగా ఉండి రానురాను ఎక్కువవుతూ వస్తుంది. అందులోను ఐదు శబ్దం 12వ శతాబ్దిలో తెలంగాణా-గుంటూరు ప్రాంతంలో మాత్రం కనిపిస్తుంది. 13, 14 శతాబ్దులలో ఐదు శబ్దం పూర్తి ఆంధ్రదేశానికి వ్యాపిస్తుంది. బహుశా ఐదు శబ్దం కన్నడం నుండి తెనుగుకు వచ్చిన ఎరువుమాట అయి ఉంటుంది.

(5) **ఆఱు, ఏడు** శబ్దాల్లో విశేషాలేమీ లేవు.

(6) **ఎనిమిది :** ఎనిమిది (తె. శా. 1.19.42,1195), ఎన్మిది (*SII* 4.1248.12,1112), ఎనుమిది (పై. 6.1173.6,1104) మొ. వి. ఎనిమిది శబ్దానికి పూర్వరూపం ఎణ్-పది అని చెప్పవచ్చును. ఇది ప్రాచీనశాసనాల్లో అనేక రూపాలతో ఉంది. ఈ యుగానికి ఎనిమిది రూపం స్థిరపడినట్లు పై ఉదాహరణలవల్ల తెలుస్తుంది.

(7) **తొమ్మిది :** (*SII* 5.1166.10,1266). దీనిని తొణ్-పది నుండి వచ్చినట్లు చెప్పవచ్చు. ఈ రూపంకూడా ఈ యుగంలో మార్పేమీ లేకుండా స్థిరపడిందని చెప్పవచ్చు. పై వివరణలవల్ల ఒకటి, ఎనిమిది, తొమ్మిది రూపాలు చారిత్రకంగా రెండు ధాతువుల కలయికవల్ల ఏర్పాడ్డాయని తెలిసింది. అంటే ఇవి సమాసరూపా లన్నమాట.

(8) పది, నూఱు రూపాల్లో విశేషాలేమీ లేవు. నూఱు శబ్దానికి పర్యాయంగా నేడు ప్రయోగంలో ఉన్న వంద శబ్దం ఈ యుగంలో కనిపించదు.

(9) **వేయి :** ఈ శబ్దానికి కింది రూపాలున్నాయి. వేయి (*SII* 5 207.15. 1141), వెయి(పై. 5.1013.2, 1148). వేయు (పై. 4.930.14, 1165), వేయు ( పై. 6,1200.16, 1175 ), వెయ్యి (పై. 5.1202.2,1214). 'ఇ/ఉ' లు పదాంతంలో పర్యాయంగా రావడం నేయి శబ్దంలో కూడా చూడవచ్చు. అంటే ఇట్టిశబ్దాల్లో చివరి అచ్చు ఊతకై వచ్చి చేరినదని చెప్పవచ్చు. ఈ వేయి శబ్దానికిపూర్వం రూపం వేన్ అని నిరూపించవచ్చు.[4]

(10) **పదిపై కూడిక సంఖ్యలు :** పంద్రెండు, పందొమ్మిది తప్ప మిగిలినవంతా పది శబ్దానికి ఆయాసంఖ్యలను చేర్చడంద్వారా అవుతాయి. ఆ చేర్చేటప్పుడు అహఅ రూపంలో ఉన్న సంఖ్యావాచకాలు తప్ప తక్కినవి చేరేటప్పుడు పది శబ్దానికి -ఉన్ -గాని, -న్- గాని చేరుతుంది. ఇందలి నకారం హల్లుల ముందు కనిపించదు. పదునకొండు (తె. శా. 1.41.8,1281). ఇందు నకారంపైన 'అ' వ్రాతపొరబాటయి ఉంటుంది. పదినొకండు ( *SII* 6.768.8, 1391 ), పదుమూండు (పై. 6.235.32, 1158), పదినాలువు (పై.6.1173.8, 1104) మొ. వి. పైవాటిలో కేవలం -న్- చేరే రూపాలు విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలోను, -ఉన్ చేరే రూపాలు మిగిలిన ఆంధ్రదేశంలోను కనిపిస్తాయి. అహఅ రూపాలు చేరేటప్పుడు ఆ శబ్దాలు పది రూపానికి అలాగే చేరుతాయి. చేరేటప్పుడు సంధి కావచ్చు కాకపోవచ్చు. పదేను ( *SII* 5.125.12,1296 ), పదియేను ( పై. 4.1814,7, 1148), పదాఱు (పై. 4.945.29, 1152), పదిఆఱు (పై.6.1000 15,1307) మొ.వి. పంద్రెండు, పందొమ్మిది రూపాలుపన్-రూపానికి రెండు, తొమ్మిది శబ్దాలు చేర్చగా ఏర్పడుతాయి. *పన్-రెండు > పన్డెండు > పంతెండు ( *SII* 6.978.7, 1359 ) > పంద్రెండు ( పై. 5.70.12,1177 ), పన్ + తొమ్మిది > పందొమ్మిది ( పై. 6.865.20, 1286 ).

(11) పదిపై గుణింతపు సంఖ్యలు. ఇరువది మొ.వి. ఇట్టి సంఖ్యావాచకాలు ఈకింద ఇచ్చిన రూపాలపై పది చేర్చగా ఏర్పడుతాయి. ఇరు-(రెండు), మూ-(మూడు), నలు- (నాలుగు), ఏన్-/ఎన్- (ఐదు), అఱు-(ఆఱు), డె-(ఏడు), ఎన-(ఎనిమిది), తొన్-(తొమ్మిది). ఈ రూపాల్లో పది చేరేటప్పుడు ఈ కింది సంధిమార్పులు వస్తాయి.

1. మొదటిరూపంలోని చివరి ఉకారం పాక్షికంగా లోపిస్తుంది. ఇరు-పది > ఇరువది, ఇర్వది.

2. (హ) అ (హ$_1$)అ : లో హ$_1$ రేఫ అయితే తర్వాత పకారం వకారమవుతుంది. ఇర్వది. 'హ$_1$' లకారమయితే పకారం పాక్షికంగా వకారమవుతుంది. నలుపది, నలువది.

3. నకారం తర్వాతను, ఉకారం కాక తక్కిన అచ్చుల తర్వాతను పకారం బకార మవుతుంది. దీనిముందు నకారం అనుస్వారం అవుతుంది. ఏంబది, ఎనబడి, తొంబది.

4. హఅ లేక హఆ తర్వాత పకారం ద్విత్వమయి పూర్వ దీర్ఘం లోపిస్తుంది. ముప్పది. 3 వ సూత్రం ప్రకారం-డెబ్బది.

5. శాసనభాషలో పది శబ్దంలోని ప్రథమహల్లు పాక్షికంగా మహాప్రాణమవుతుంది. ముప్ఫది మొ. వి.

6. పదిశబ్దంలోని పకారం పాక్షికంగా యకారం అవుతుంది. ముప్ఫయి, ముప్పై మొ. వి. ఉదా. ఇరువది (*SII* 5.1084.6, 1118), ఇర్వయి ( పై. 5.1188.64, 1250 ), ముప్పది (పై. 10.654.8, 1152), ముప్పై (పై. 6.936.7, 1280), నలుపది (పై. 6.598.11,1168), నల్వది (పై. 6.597.8,1238) నల్ఫయి (పై. 5.1188.52, 1250), ఏంబది (పై 6.211.26, 1170), ఎంబై (పై. 6.928.8,1291), అఱువది (పై.10.177,78.1171), అఱువై (పై. 6.812.5,1390), డెబ్బది (పై. 5.1013.2,1148), ఎనభై (పై. 6.1035.15, 1394), తొంభయి (పై. 5.1188.16 1250) మొ. వి. పై శబ్దాల్లో ఇరువది మొ. దకారాంతపదాలు 12వ శతాబ్దిలో క్వాచిత్కంగా కనిపిస్తూ రానురాను ఎక్కువవుతాయి-

ఇట్టి సంఖ్యలకు ఏను చేరేటప్పుడు ఒక-వింతసంధి కార్యం 12, 13 వ శతాబ్దుల్లో కనిపిస్తుంది. ఇరువదేను ( *SII* 6.995.6, 1287 ), డెబ్బదేను (పై. 6.1148.18,1269) మొ. వి. ఇందు దకారం డకారం కావడం విశేషం- 14 వ శతాబ్దిలో దకారం యకారం కావడం దాదాపు పూర్తి అయిందనవచ్చు. కాబట్టి ఈ శతాబ్దిలో ఇరువదేను వంటి రూపాలు కనిపించటంలేదు. ఇరువైయేను వంటి రూపాలే కనిపిస్తాయి.

(12) నూరుపై గుణింతపు సంఖ్యలు ఇన్నూఱు మొ. వి. : ఇన్నూఱు (*SII* 10.547.4,1332) , మున్నూఱు (పై. 10.304.8, 1245), నన్నూఱు ( పై. 6.1167.8.1220) , ఏనూఱు ( పై. 5.1046. 13,1187) మొ. వి. తర్వాతి నూర్లసంఖ్యలు శాసనాల్లో కనిపించటం లేదు.

(13) పై ఇరువది మొ. సంఖ్యా రూపాల్లో లాగానే ఇరు- మొ. రూపాలు సమాసాల్లోనూ కనిపిస్తాయి. 1.ఇరువుట్టి (*SII* 5.1016.13,1134), ముయ్యేడ్ద (పై. 10.118.25,1146), నలుతుము (పై. 10.408. 115,1266 ), పందుము (పై. 10.710.19,1178 ), ఎనిమిది శబ్దానికి మాత్రం ఎనుబం లేక ఎనుమం రూపాలు కనిపిస్తాయి. ఎనుబందుము ( *SII* 10.422.9,1318 ), ఎనమందుము ( పై. 6.835.8, 1391 ) మొ. వి. ఇంకా ఈ కిందివి గమనార్హం. పందుము (పై 5.1364.18.1121), పనిద్దుము (పై. 10.557.32, 1373), పదేందుము(పై.5.159.6,1277)మొ వి.పై సమాసాల్లో బహువచన ప్రత్యయం లోపించి ఉండటం గమనించవచ్చు. బహువచనం తోడి రూపాలూ క్వాచిత్కంగా కనిపిస్తాయి. నలుమూడ్లు (నాల్గు మూరలు) (*SII* 6.1136.13,1374) మొ. వి.

(14) మహన్మహతీ సంఖ్యావాచకాలు :

(క) ఒకడు (*NI* 3.14.77,1245), ఒకరు (*SII* 6.839 23,1365), ఒకరుడు (పై. 5,1188.24,1250).

(ఖ) ఇద్దఱు(*SII* 6.941 941.12,1299), ఇద్దఱు(పై. 6.667.16,1132)..

(గ) మూవురు (పై. 6.625.15, 1158), ముగురు (పై.6.1084.14, 1321).

(ఘ) నల్వురు (పై. 4.1020 9, 1118), నల్గురు (పై. 4.1067.8, 1153).

(చ) ఏవురు (పై.4.1191.7,1128). ఐగురు (పై.6.1117.8,1378)

(ఛ) ఆఱు, ఏడు ప్రయోగాలు లేవు.

(జ) ఎన్నండ్రు (పై.4.1305.11,1107), ఎనుమంఋ (పై.6.1052.10 1350).

తొమ్మండ్రు (పె.6.87.11,1164), ఇర్వండ్రు (పె. 5.1188.64, 1250) మొ. వి.

**4.49.** **సర్వనామాలు** : సర్వనామాల్లో చెప్పుకోదగ్గ విశేషాలేమీ ఈ యుగపు శాసనాల్లో కనిపించవు. కనిపించినవాటిని ఈకింద ఇస్తున్నాను. ఏను (తె.శా. 1.150.20, 1170), ఏము (*SII* 4.1186.3, 1158), నేను, మేము మొ. ప్రయోగాలులేవు. మధ్యమపురుష సర్వనామాలు శాసనాల్లో కనిపించవు. తాను శబ్దానికి బహువచనరూపం తారు మాత్రం శాసనాల్లో కనిపిస్తుంది. తారు (*EI* 5.147.139, 1213) మొ. కాని తాము కనిపించదు. నన్నయ నన్నె చోడులు కూడా తారు రూపాన్నే ప్రయోగించి ఉన్నారు. కాన తాము > తారు మార్పు ఈయుగానికి పూర్వం ఎప్పుడో జరిగి ఉండాలి.

**4.50.** **క్రియాపదాలు** : క్రియాప్రాతిపదికలు రెండు రకాలు. 1. అవిభాజ్యం (Simple) 2. విభాజ్యం అని. అగు (*SII* 4.672.7, 1139), అమ్ము (పై.6.637.2.1147) మొ. అవిభాజ్యాలు. విభాజ్యాలు (అ) ఏకధాతుకం (ఆ) బహుధాతుకం అని రెండు రకాలు.

**4.51 ఏకధాతుక విభాజ్యాలు : (Complex)**

(అ) ధాతువుకు -ఇంచు చేర్చటంవల్ల ఏర్పడేవి. ఉదయించు (*SII* 4.1061.2,1149), వర్ధించు (*NI* 2.28 A. 18,1166), సరించు (*SII* 10.83.19, 1125) మొ. వి. సంస్కృత పదాలన్నీ కూడా సాధారణంగా ఇలాగే అవుతాయి. (హ)అహ-తర్వాత ఇంచు

నకు -ఇయించు కూడా వస్తుంది. సరియించు (*SII* 5.1138, 9,1140) మొ.వి. వీటి పోలికవలన ఉదయించు రూపానికి ఉదియించు (పై. 4.1061.2,1149) వంటిరూపాలు తరచుగా కనిపిస్తాయి. -ఇంచు ప్రత్యయం అకర్మక రూపాన్ని సకర్మకం చేయనూ, సకర్మకాన్ని ప్రేరణరూపంచేయనూ కూడా వస్తుంది. చెల్లించు (పై. 10.61.6,1104), చేయించు(పై 6·1096.4,1383). ఈ ప్రత్యయం ముందు చకారం పకారం అవుతుంది. గ్రొచ్చు-గ్రొప్పించు (పై. 10.991.14, 1139) మొ. వి. మెచ్చించు (పై. 10.151, 1161), వంటి రూపాలు అరుదుగా కనిపిస్తాయి.

(అ) బహుధాతుక విభాజ్యాలు (Compounds)

దేశి : చేకొను ( *SII* 4.1170.11, 1129 ), పనివడు (పై. 10.89 14, 1132) మొ. వి.

మిశ్రం : దయుసేయ (సం + తె) (పై. 4.737.30.1115), నుతికెక్కు (పై. 4.675.25, 1140) మొ. వి.

ప్రత్యయాలు చేరేటప్పుడు క్రియాప్రాతిపదికల్లో చాలామార్పులు వస్తాయి. ఇట్టివి చాలా ఉండటంచేత సారస్వతభాషలో గాక శాసనాల్లో మాత్రం వచ్చేవాటిని కొన్నింటిని ఇక్కడ పేర్కొంటాను.

(క) క్రియాప్రాతిపదిక అంతమందుగల యకారానికీ ద్విత్వయుక్త చకారానికి ఉత్తమ మధ్యమ భూతకాలిక ప్రత్యయం పరమయ్యేటప్పుడు సకారమవుతుంది. చేయు-చేస్తిని ( *SII* 10.334.66, 1251 ), ఇచ్చు—ఇస్తిమి ( పై. 6.121.37, 1119 ) మొ. వి. అనుస్వారం తర్వాత చకారం ద్విత్వమౌతుంది. కాబట్టి వాటికూడా సకారమౌతుంది. మన్నించు—మన్నింస్తిమి (పై. 10.499.15.1311). ఇలాంటి చోట్లలో అనుస్వారం లోపించవచ్చు. కటిస్తిమి ( *NI* 1.7.28, 1244) మొ. వి.

(ఖ) ద్విత్వం కాని చకారం క్త్వార్థక ప్రత్యయమైన-ఇ ముందును విశేషణ ప్రత్యయమైన -ఇన ముందును సకారం కావచ్చు. విలిసి (*SII* 4.1114.17,1163), విడిసిన ( పై. 4.1122.5,1139 ) మొ. వి.

(గ) -ఏ విశేషణ ప్రత్యయానికి ముందు యకారం సకారం అవుతుంది. చేసేవాండు ( *NI* 1.38.63, 1217 ). ఈ ప్రత్యయం రాకున్నా కొన్ని చోట్ల ఈ మార్పు వస్తుంది. చేసువాండు (*SII* 10.61.7, 1104) మొ.వి.

(ఘ) అచ్చు (<అర్చు) ధాతువు అన్నంత ప్రత్యయం ముందు అరు- అవుతుంది. అరువంగలవాండు (*SII* 4.1200.16, 1263) మొ వి.

**4.52. సమాపక క్రియలు :** సమాపకక్రియలు రెండు రకాలు. 1. సామాన్య సమాపక క్రియలు (Simple) -వచ్చెను వచ్చును మొ. వి. 2. సంశ్లిష్ట సమాపక క్రియలు (periphrastic) వచ్చుచున్నాడు, మొ. వి. కింద సామాన్య సమాపక క్రియలు మాత్రం వివరిస్తాను. ఈసామాన్య సమాపక క్రియలు రెండు రకాలు. (అ) కాలబోధకాలు, (ఆ) కాలబోధకాలు కానివి. కాలబోధక రూపాలకు క్రియా ప్రాతిపదిక + కాలప్రత్యయం + పురుష వచన ప్రత్యయము అనే మూడు విభాగాలున్నాయి. వీటిలో పురుషవచన ప్రత్యయాలు ఈ కింది విధంగా ఉంటాయి.

**పురుష వచన ప్రత్యయాలు :**

| | *ఏక* | *బహు* |
|---|---|---|
| ఉత్తమ | -ను | -ము/-మి |
| మధ్యమ | -- | -రి |
| ప్రథమ | -ను (క్లీబ బహుత్వం కూడా) | -రు/-రి(మహన్మహతిమాత్రం) |

మధ్యమ పురుష ఏకవచన రూపాలు శాసనాల్లో కనిపించవు.

**4.53. భూతకాలిక ప్రత్యయాలు :** -ఎ ప్రథమపురుష ఏకవచనం, క్లీబం బహువచనంలోను -ఇ ప్రథమ పురుష మహన్మహతీ బహువచనంలోను, -ఇతి/-తి ఉత్తమ మధ్యమ పురుషల్లోను వస్తాయి. జనించెను (*SII* 4.677.16, 1130), ఇచ్చిరి ( పై. 5 1016.17, 1134 ), ఇచ్చితిమి (పై. 5.70.15, 1177), ఇస్తిమి ( పై. 6.121.37, 1119 ): వీటిలో చివరి ఉదాహరణ తప్ప మిగిలినవన్నీ సారస్వతభాషలోవలెనే ఉన్నాయి.

**4.54. వర్తమాన భవిష్యత్ప్రత్యయాలు :** చిన్నయసూరి తద్ధర్మార్థక ప్రత్యయాలన్నవి వాస్తవానికి ఆ రోజుల్లోని వ్యవహారాన్ని బట్టి రెండురకాల ప్రత్యయాలని చెప్పవచ్చు. -ఎద-, -ఎడి,/ఎడు- వర్తమాన భవిష్యత్ప్రత్యయాలనీ, తక్కిన వాటిని తద్ధర్మ భవిష్యత్ప్రత్యయాలని చెప్పవచ్చు.[5] శాసనాల్లో వర్తమాన భవిష్యత్ప్రత్యయాలు చాలా అరుదు. చెరిచెదను ( *SII* 10.590.54, 1314 ), నడిచెదము ( పై. 10 504.22, 1313 ). ఈ రెండు ప్రయోగాలు మాత్రం లభించాయి.

**తద్ధర్మ భవిష్యత్ప్రత్యయాలు ;** ప్రథమైక పురుషంలో ప్రత్యయం Φ (అంటే ప్రత్యయం ఉండదు అని అర్థం), మిగతావాటి ముందు -దు/-తు-/-డు- వస్తాయి: అవును ( *SII* 10.465.115, 1290 ), పోదురు ( పై. 5.1316.12, 1118), వరియింతురు. ( పై. 4.945.3, 1152 ), విందుము (పై. 6.123.52 1132). వీటిలో చివరి ఉదాహరణ తప్ప మిగిలినవి ఆకాలపు సారస్వత భాషా ప్రయోగాలకంటె భిన్నమైనవి కావు.

**కాలసూచన లేనివి :**

**4.55** (అ) **వ్యతిరేకార్థకాలు :** వీటిలో క్రియాప్రాతిపదిక + వ్యతిరేక బోధక ప్రత్యయం + పురుష ప్రత్యయం అని మూడవయవాలుంటాయి. అందు -అ- వ్యతిరేక బోధక ప్రత్యయం. ఈ కిందివి పురుష వచనప్రత్యయాలు.

| | *ఏక* | | *బహు* | |
|---|---|---|---|---|
| ఉత్తమ | — | | ము | |
| మధ్యమ | — | | — | |
| ప్రథమ | మహత్ | అమహత్ | మహన్మహతి | క్లీబ |
| | — | -దు | -రు | -వు |

శాసనాల్లో ప్రయోగాలు లేనిచోట్ల చూపించలేదు. అడ్డపెట్టము ( *SII* 10.556. 56,1358 ), అడుగపడయదు ( పై. 5.1181.17,1341 ), పడయదు (పై. 4,974.5,1132), లే, కా మొ. ప్రాతిపదికలకు వ్యతిరేకబోధక ప్రత్యయం లోపిస్తుంది. లేదు (పై. 10.261.41, 1214) మొ.వి.

(ఆ) **విధ్యర్థకం :** పురుషవాచక ప్రత్యయాలు ఏకవచనంలో- ము,

బహుత్వంలో -ండు/-డి వస్తాయి. విధ్యర్థక ప్రత్యయం -ఉ-; జరిగించుము (*SII* 5,1202.6,1214), ఉండుండు (తె. శా. 1.78.8,1276), విచ్చేయుడి (పై. 1.69.15,1234).

(ఇ)ఆశీర్వాపాదులు : అయ్యుండును ( *SII* 6.781,14,1386 ) ఈవుతము ( హైద. ఆర్కి. సీరీస్. 3.2.3, 1236 ) మొ. వి. శాసనాల్లో కని పిస్తాయి.

**4.56. అనమాపక క్రియలు :** క్త్వార్థకంలో సారస్వత శాసనాల రూపా లకు వ్యత్యాసం లేదు. చేసి (*SII* 90.17,1177) మొ. వి- శత్రర్థకంలో కూడా వ్యత్యాసం లేదు. పరగుచును (పై 4.675 45,1140), కాని ఈ రూపానికి సముచ్చయ ప్రత్యయం చేరడం కద్దు. చేయుచున్న (పై. 6.237.5, 1273). చేస్తుంది అనే ఒక్క రూపం ( *NI* 1.7.15.1275 ) -తు- ప్రత్యయంతో కనిపిస్తుంది. కేతన గ్రామ్యాలు అన్న కొంటూ మొదలైన రూపాలు శాసనాల్లో కనిపించటంలేదు. వ్యతిరేకార్థకంలోను శాసన సారస్వత భాషల్లో వ్యత్యాసంలేదు. నడపక (*SII* 10 671.11,1128) మొ. వి. అన్నంత రూపాల్లోనూ శాసన సారస్వత భాషలకు వ్యత్యాసం లేదు. కొలువను (పై. 6.758.6, 1113) మొ. వి.

**చేదర్థకం :** ఇనన్/-ఇనాన్ చేదర్థక ప్రత్యయాలు. పేర్కొనినం (*SII* 6.151.60,1161 ) మొ. వి. అమ్మినాను (పై. 110.422.93,1269); కొన్నా దులకు -నన్/-నాన్, పద్యాదులకు -అన్ ప్రత్యయాలు వస్తాయి. పేర్కొన్నను (పై. 10.89.16,1182), ఉన్నాను ( పై. 10.556.49,1358 ), అడ్డపడ్డాను. (పై.4.935.39, 1269). 13వ శతాబ్దినుంచి చేదర్థకంలో -ఇతే/-తే ప్రత్యయాలు కనిపిస్తాయి. పోయితేను ( *SII* 10.332.30,1250 ), చేస్తే ( *NI* 3.48.56, 1252) మొ. వి.

**4.57. విశేషణాలు :**

(క) గుణవాచక విశేషణాలు విశేష్యాలకు ముందు వస్తాయి. నల్లరాయి (*SII* 6.1142.12,1268), పచ్చిపాలు ( పై. 6.1000 9,1307 ) మొ. వి. నామపదాలు కూడా ఇలా రావచ్చు. కలుగాడి (పై. 5.213.8,1236),

(ఖ) **హ౹అహ౹అహ౹అ** రూపంలో ఉన్న మువర్ణకాంతాలైన తెలుగుపదాలు విశేషణాలయ్యేటప్పుడు మువర్ణకానికి బదులు -వ వస్తుంది. ఇనుప కవదివియ (*SII* 5.1265.11,1207).

(గ) మిగిలిన మువర్ణకాంతాలు విశేషణా లయ్యేటప్పుడు -ము వర్ణానికి బదులు —పు వాడటం ఈయుగంలో తరచుగా కనిపిస్తుంది. దక్షిణపు వలను (తె. శా. 1.177.9,1190) మొ వి. ఇలా —ము, -పు కావడం 12వ శతాబ్దిలో క్వాచిత్కంగాను రానురాను అధికంగాను కనిపిస్తుంది. -ంపు రావడం చాలా అరుదుగా కనిపిస్తుంది. వజ్రంపు రాకోట ( *SII* 4.1379.6,1381).

(ఘ) ఉదంతం లేక అదంతమైన పదాలు విశేషణా లయ్యేటప్పుడు అనుస్వారం తరచుగా కనిపిస్తుంది. తూర్పుంబొలము ( *SII* 10.526.15,1819), చెఱకుం గుడ్మలు (బెల్లపు ఊటలు) (పై. 5.1275.7,1233), తెల్లంబ్రాలు (పై. 4.1323.9,1115) మొ. మువర్ణకం వువర్ణకంగా మారితే ను వస్తుంది. ఉత్తరపుం బొలము (పై. 5.126.6,1296).

(జ) **పరిమాణార్థక ప్రత్యయం** : పరిమాణార్థక పదాలకు -ఎఙ్డు లేక -అఙ్డు ప్రత్యయాలు చేరుతాయి. పుట్టెఙ్డు (*SII* 5.1114.15,1168), మానండు (పై. 6.1166.6,1198) మొ. వి. -అండు ప్రత్యయం విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలోను, ఎండు తక్కిన చోట్లలోను విరివిగా కనిపిస్తాయి.

(చ) వైభాజిక ప్రత్యయం (Distributive) చేసి లేక ఏసి ప్రత్యయాలతో వైభాజిక పదాలు విశేషణంగా వస్తాయి. మానెండు సేసినేయ (*SII* 4 667.15,1182), మూండేసి (పై. 4.677.52,1180), మొ. వి. 12వ శతాబ్దిలో -చేసి ప్రత్యయమే తరచుగా కనిపిస్తుంది. కాని 14వ శతాబ్దిలో ఇది కనిపించదు. -ఏసి ప్రత్యయం 18వ శతాబ్ది నుండి ఎక్కువౌతుంది.

(ఛ) **సంఖ్యావాచక విశేషణాలు** : ఒక్క ఒకటి సంఖ్య తప్ప తక్కిన అన్ని సంఖ్యావాచకాల్ని అలాగే విశేషణాలుగా ప్రయోగించవచ్చు.

రెండు దీపంబులు ( *SII* 4.667.15,1132 ), మూడు సంధ్యలు (పై. 5.90.10.1177) ) మొ. వి. ఒకటి సంఖ్యకు ఒక్క, ఒక అనే రూపాలు వస్తాయి. ఒక్కపాలు (పై. 4.748.25,1199), ఒక పళ్ళెము (పై. 5.4.5,1394) మొ. వి. ఇవిగాక వక, ఒకొ, ఒఖ, ఓ రూపాలు క్వాచిత్కంగా కనిపిస్తాయి. వకవెలి పొలము (తె. శా. 1.95 38,1118), ఒకకోటి (*SII* 10.177.22,1171), ఒఖకుండ (పై. 5.1191.14,1349). ఈ ఒఖ శబ్దం 14వ శతాబ్ది శాసనాల్లోనే కనిపిస్తుంది. ఓ విధము(తె.శా. 1.69.25,1234)(ఇరు. మొ. సంశ్లిష్ట రూపాలకు చూ. 4.48).

(ఙ) **పూరణార్థకం :** అగున్ లేక అవున్ చేరి పూరణార్థకాలై సంఖ్యా వాచక విశేషణాలు కనిపిస్తాయి. మూణ్డవునదపు (*SII* 4.1025. 12,1225), పదియేడగునేణ్డు (పై. 6.123.64,1132) మొ. వి. -అవన్ ప్రత్యయము క్వాచిత్కంగా కనిపిస్తుంది. రెండవనదపు (పై. 4.1194.8,1128), హల్లుల ముందు పై నకారం లోపిస్తుంది. మూడవ పాలివారు (పై. 10.73.107, 1115). ఓ ప్రత్యయం ఒక్కచోట కనిపిస్తుంది. మూండోనదపు (పై. 4.1155.4,1186). పై శబ్దాన్ని అదపు అనిగాని నదపు అనిగాని చెప్పవచ్చు. అదపు అని చెప్తే - ఓన్ ప్రత్యయం అని చెప్పాలి.

## 4.58 క్రియావిశేషణాలు :

(క) **భూతకాలం :** -ఇన, -న, -అ. పెట్టిన (*SII* 5.67.11.1183). కొన్న (పై. 5.1051. 10.1118), పడ్డ (తె.శా. 1.47.16,1303). ఈ క్రియావిశేషణాల విషయంలో శాసనభాషకు సాహిత్య భాషకు వ్యత్యాసం కనిపించదు.

(ఖ) **వర్తమానకాలం :** చున్న ప్రత్యయంచేరి వర్తమాన క్రియావిశేషణ రూపాలేర్పడతాయి. కాని ఈ -చున్న ప్రత్యయం శాసనభాషలో అగు ప్రాతిపదికకు మాత్రం చేరుతుంది. తక్కిన ప్రాతిపదికంపై కనిపించదు. ఏలికలగుచున్న (*SII* 4.704.11,1167) మొ. వి.

(గ) **తద్ధర్మం :** తద్ధర్మక్రియావిశేషణాలకు నాల్గురకాలైన ప్రత్యయాలు చేరతాయి.

(అ) -$\phi$/-న్ (ఆ) –ఎడు/-ఎడి (ఇ) -ఏ/-ఎ (ఈ) -ఇ.

(అ) -$\phi$/-న్ : వడ్డించుచట్టువము (*SII* 4.1248.20, 1122). విశేషణం తర్వాత అచ్చు పరమైతే నకారం రావచ్చు. చేయునవసరము (పై. 10.690.110,139). నకారంరాని రూపం ఆరగించు అప్పాలు పై.. 5.1188.3,1276).

(ఆ) -ఎడు/-ఎడి : ఉండెడు ( *SII* 4.1295.8, 1106 ), ఒత్తెడి (పై.4.1253.4,1132). ఎడురూపం 12 వ శతాబ్దిలో ఎడిరూపంతో దాదాపు సమానంగా ఉండి రానురాను తగ్గుతూ వస్తుంది. కేతన, పెద్దన వ్యాకరణాల్ని బట్టిచూస్తే ఇది స్పష్టంగా గుర్తించవచ్చు. ఎడి- అనడానికి- ఎటి అనే రూపం 13 వ శతాబ్దినుంచి తరచుగా కనిపిస్తుంది. అనెటి ఊరు (పై. 6.1213.18, 1265).

(ఇ) -ఏ/-ఎ : ఇది 12వ శతాబ్దిలో ఆడె అయకు ( *SII* 10.102.8, 1137) ఒక్క రూపమే కనిపిస్తుంది. తర్వాత తరచుగా కనిపిస్తుంది. చెల్లేమాడలు (పై. 5.1249.9, 1293) మొ. వి.

(ఈ) -ఇ : నడిపివాండు (*EI* 5.17.141, 1213), అనభవించి వారికి (*SII* 5.1188.32,1250) మొ. వి. ఇట్టి రూపాలు నేటికీ కొన్ని పామర మాండలికాల్లో ఉన్నాయట.

(ఘ) **భవిష్యత్కాలము :** అన్నంత క్రియరూపానికి -కల శబ్దాన్ని చేరిస్తే భవిష్యద్విశేషణ రూపం ఏర్పడుతుంది. ఆరంగింపంగల కుడుములు (*SII* 4.1099.6, 1166).

**4.59.** పై విశేషణాలలో భూతభవిష్యత్క్రియా విశేషణాలపై వాణ్ణు, వారు అనే సర్వనామాలు చేరేటప్పుడు వకారం లోపించడం తరచుగా కనిపిస్తుంది. ప్రవచ్చినారు (*SII* 10.702-16,1153); నడపంగలాణ్ణు (పై.5.1129.12,1178) మొ.వి. ఇలాంటి రూపాలు 12 వ శతాబ్దిలో క్వాచిత్కంగాను రానురాను బాలా విరివిగాను కనిపిస్తాయి. వీటికి -అది, -అవి అనే సర్వనామాలు చేరేటప్పుడు

'అ' లోపించడం కూడా చాలా తరచుగా కనిపిస్తుంది. కొన్నది (*SII* 5.131.7, 1296), చెల్లకలది (*NI* 2.51.21,1198) మొ. వి.

క్రియావిశేషణాలపై సర్వనామాలు చేరినరూపాల్ని కర్తస్థానాల్లోనూ ఉపయోగించవచ్చు. విఘ్నము సేసినారు...కపాలమునం గుడిచినారు (*SII* 5.140).

భవిష్యత్కాల క్రియావిశేషణాలపైన పురుషవచన ప్రత్యయాలు చేరితే అవి కేవలం సమాపకక్రియలే అవుతాయి. నడపంగలరు (*SII* 10.686.7,1183), ఇలాంటివి విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలోనే ఉంటాయి. వీటిని నడపంగలారు వంటి రూపాలతో పోల్చడం కుదరదు.

**మాండలికాలు :**

**4.60.** ఈ యుగంలో దాదాపు 2000 రాతిశాసనాలు ఆంధ్రదేశం నలుమూలలా వ్యాపించి ఉండటం చేత మాండలిక సంబంధమైన అనేక విషయాలు మనకు గోచరిస్తాయి. డా. కృష్ణమూర్తిగారు ఇటీవల కనుగొన్న విశాఖ-శ్రీకాకుళం మాండలీకం[7] ఈయుగానికి పూర్వమే ఏర్పడిందనడానికి అనేక మాండలిక విషయాలు పైన చెప్పబడి ఉన్నాయి. అందులో 1. అకారం వ్రాతలో నిల్చి ఉండటం, 2. న్త సంయుక్తం నిల్చి ఉండటం, 3. చెల్లుపదానికి చల్లు అని వాడటం. 4. నాల్గు అనడానికి నాలు రూపం వాడటం 5. సంఖ్యా వాచకాల్లో పదినొకండు మొ. వాటికి -ఉన్- ప్రత్యయంగాక అండు ప్రత్యయం రావటం మొ. వి. ఈ మాండలికంలోని కొన్ని విశేషాలు. ఇవిగాక అనేక మాండలిక విషయాలీ యుగంలో కనిపిస్తాయి. అందులో ఒకటి మాత్రం కింద వివరించబడ్డది.

నామపదాల్లో- ఇయాంత రూపాలకు 12 వ శతాబ్దిదాకా ఎలాంటి మార్పు లేక నిల్చి ఉన్నాయి. కాని 13 వ శతాబ్దిలో వీటికి రెండు రకాలైన మార్పులు కనిపిస్తాయి. విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలో -ఇయ లోని -ఇ- గాని -ఇయ్- గాని లోపిస్తుంది. మధ్య ఆంధ్రంలో -ఇయకు మారుగా -ఎ వస్తుంది.

విశాఖ - శ్రీకాకుళం—/-అ : నూన్య (*SII* 6.807.8,1385), చెల్యలు (పై. 6.841.6,1364), నూన (పై. 6.864.10,1376) మొ వి.

మధ్యాంధ్రం -ఎ : నూనె (*SII* 10.384.88,1251), చెల్లెలు పై. 4.983.9,1241) మొ. వి. ఈప్రాంతంలో పైన పేర్కొన్న రూపాలు కనిపించవు.

పైన చెప్పిన మార్పులు గొటియలు అనే పదంలో కూడా చూడవచ్చు ఈ శబ్దం శాసనాల్లో కొల్లలుగా కనిపిస్తుంది. ఈ గొటియలు శబ్దానికి శాసనాల్లో 13వ శతాబ్ది నుండి మూడు రకాలైన మార్పులు కనిపిస్తాయి. 1. విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలో గొబ్యలు అని -ఇ- లోపించడం. 2. మధ్యాంధ్రంలో గొఱ్ఱెలు అని -ఇయ> -ఎ కావడం. 3. నెల్లూరు-దక్షిణ గుంటూరులో -ఇయ > -ఉ కావడం లేదా -ఇయ పూర్తిగా లోపించడం గొఱ్ఱులు/గొర్లు జరుగుతుంది.

దీన్నిబట్టి ఆంధ్రదేశంలోఆనాటికే (1) విశాఖ-శ్రీకాకుళం (2) మధ్యాంధ్రం (3) దక్షిణాంధ్రం (నెల్లూరు-దక్షిణ గుంటూరు) అని మూడు మాండలికాలు ఉన్నట్లు చెప్పవచ్చు. ఈ యుగశాశనాల్ని బట్టి తూర్పు పశ్చిమాంధ్రాల్ని (తెలంగానా-సర్కారు) వేరువేరు మాండలికాలు అని చెప్పడానికి చాలినంత అధారం కనిపించటం లేదు.[8]

## జ్ఞా పి క లు

1. Mehandale M. A., *Historical Grammar of Inscriptional Prakrits* పేజీలు 86, 184, 196, 237.
2. *మాండలిక వృత్తిపదకోశం.* ప్రథమ సంపుటం. పేజీ. 38.
3. V. Ramachandra, *A critical study of Errapreggada's works,* thesis submitted to S. V. University, Tirupathi. 1964. పేజీలు 194.197.
4. ఎం. కందప్పశెట్టి. వేయి శబ్దవిచారము. భారతి. మార్చి, 1978 మద్రాసు.
5. నన్నెచోడుని కుమారసంభవంలో ప్రైప్రత్యయాల్ని పరిశీలిస్తే తేలిన సారాంశం ఇది. (చూ. ఎం. కందప్పశెట్టి. 11వ శతాబ్ది వర్తమానార్థక క్రియలు భారతి. సెప్టెంబరు, 1968 మద్రాసు).
6. Lisker, *Introducion to Spoken Telugu.* పేజీ 243. ఇట్టి ప్రయోగాలు విశాఖ-శ్రీకాకుళం మాండలికంలో నేటికి ఉన్నట్లు శ్రీ బి. రాధాకృష్ణగారు అన్నారు.
7. *మాండలిక వృత్తిపదకోశం,* ప్రథమ సంపుటం, పేజీలు 46-52.
8. ఈయుగపు శాసనభాషకు, మాండలికాలు విశేషాలకు చూ. M. Kondappa Chetty, *Historical Grammar of Inscriptional Telugu.* Thesis submitted to S. V. University, Tirupathi. 1966 పేజీలు 432-445.

# శాసనభాషా పరిణామం

## (క్రీ. శ. 1400 - 1599)

—ఎం. కందప్పశెట్టి

**5.0.** తెలుగుశాసనాలు గతయుగంలో దాదాపు రెండువేలుండగా, ఈ యుగంలో అవి ఇంచుమించు మూడు వందలే ఉన్నాయి. ఇలా శాసనాలసంఖ్య తగ్గిపోవడమే కాక అనేక శతాబ్దాలుగా తెలుగుభాషను రాజకీయ, మత, సాంఘిక విషయాల్లో చాలా విరివిగా వాడడంచేత తెలుగుభాషాలేఖనపద్ధతిలో కొన్ని కొన్ని సాంప్రదాయా లేర్పడ్డాయి. ఉదా : పెట్టినవి అనడానికి పెట్నవి (*SII* 5.24.7,1401) అనీ పెట్టిన అనడానికి పెట్న (పై.5.26.4, 1412) అనీ సర్వ వరం శాసనాల్లో చాలా తరచుగా కనిపిస్తాయి. ఇట్టివి పూర్వయుగంలోనూ క్వాచిత్కంగా కనిపిస్తాయి. ఇలా వ్రాసి ఉండటంచేత ఈవిధంగానే ఆ రోజుల్లో ఉచ్చరించే వారని చెప్పలేం. ఎందుకంటే నేడూ గ్రామాల్లోని కొందరు సాంప్రదాయక లేఖకులు 'తమ' అని ఉచ్చరిస్తూనే 'త్మ' అని వ్రాయడం చూస్తూన్నాం. కాబట్టి పెట్నవి మొదలైనవి సాంప్రదాయక రచనలే కాని అలా ఆనాడు ఉచ్చరించేవారని చెప్పలేం.

ఇలాంటి సాంప్రదాయాలవల్ల భాషలో ఉచ్చారణలు మారినా లేఖనాపద్ధతి మారక పోవచ్చు. అతిప్రాచీనశాసనాల్లోనే శకటరేఫకు సాధుకరేఫ వ్రాయడం ప్రారంభం అయినా సాధురేఫ శకటరేఫల చిహ్నాలు 20 వ శతాబ్దిదాకా వాడుకలో ఉండటం మనకు తెలిసిందేకదా ! ఇలా కొన్ని సాంప్రదాయక రచనలున్నా ఈయుగపు శాసనాలు కూడా గతయుగపు శాసనాల్లాగానే కొన్ని కొన్ని ముఖ్యమైన చారిత్రక అంశాల్ని తెలుసుకోడానికి ఉపయోగిస్తాయి.

**5.1. వర్ణాలు :** వర్ణాల విషయంగా ఇంతకు పూర్వయుగానికీ, ఈ యుగానికి అట్టే తేడా కనిపించదు. కాబట్టి దీనికి వేరే ప్రత్యేకమైన వర్ణాల పట్టిక

ఇవ్వనవసరంలేదు. ఱకారం ఇంతకు పూర్వయుగంలో కనీసం కొన్ని కొన్ని సంజ్ఞా వాచకాల్లోనైనా నిల్చిఉన్నట్లు చూశాం. కాని ఈ యుగంలో అవిధంగా కూడా కనిపించదు. గతయుగంలో కనిపించని ఝవర్ణం ఈయుగంలో వర్ణంగాకనిపిస్తుంది.

ఈ యుగంలోనూ పూర్వయుగంలోలాగానే చకారానికి [చ చే] అని రెండు సవర్ణాలు (ఉచ్చారణలు) ఉండినట్లు సూచన లున్నాయి (చూ. 5.2). ఇట్లు ఉచ్చారణ విషయంగా సూచనలున్నాయి. కాని వాటిని రెండు వర్ణాలుగా చెప్పడానికి ఆధారాలు లేవు.

ఎ ఏ లకు ఈ యుగంలో తాలవ్య హల్లుల తర్వాత <u>ఎ</u> <u>ఏ</u> (**æ ǣ**) అని సవర్ణాలుండినట్లు కొన్ని స్పష్టమైన సూచనలు కన్పిస్తాయి.

ఈ యుగంలో జరఝంపా ( *SII* 6.1085,8, 1428 ), ఔభ ళోఝ సింగాఓఝుంగారి (పై. 5.10.5,1404) మొ. చోట్ల ఝ వ్రాతలో కనిపిస్తుంది. ఓజు (ఒజ్జ) అనే దాని రూపాంతరం ఓఝు అని చెప్పవచ్చు. జరఝంపా అనడానికి అర్థం ఏమో స్పష్టంగా తెలియడంలేదు. ఇలా కొన్ని పదాల్లో ఝ కనిపించటంచేత దీన్ని ఈ యుగంలో వర్ణంగా చెప్పాలి.

**ధ్వనుల మార్పులు**

**5.2.** అ > ఎ : తత్సమపదాల్లో తాలవ్యహల్లుల తర్వాత అకారం 'ఎ'గా మారినట్లు గతయుగంలోనే చూశాం. ఈ యుగంలోనూ అట్టివి చాలా తరచుగా కనిపిస్తాయి. ఆ చెంద్రార్క్కస్థాయిగాను ( *SII* 5.1228.9, 1503 ), *హరిశ్చెంద్ర* (పై. 5.165.6,1596), సెనివారానను (శవర్ణానికి స) (పై.6 850. 2,1418) మొ.వి. ఇట్టివి తెలుగు పదాల్లోనూ యకారంమీద కనిపించడం ఈ యుగంలో విశేషం. ఊరుంగాయెంతోడను ( పై. 4.981.7,1518 ). అనగా తాలవ్యహల్లుల తర్వాత ఆకారానికి బదులు ఎకారం ఉచ్చరించటం వ్యవహారంలో ఉన్నదని దీన్నిబట్టి తెలుస్తుంది. దేశిపదాల్లో అకారానికి ముందున్న చజలు దంతమూలీయంగా ఉచ్చరింపబడడంచేత వాటి తర్వాత అకారానికి ఈ మార్పు ఇంత తరచుగా కనిపించటంలేదు.

**5.3.** ఎ ఏ > అ ఆ : దేశిపదాల్లో తాలవ్యహల్లుల తర్వాత ఉన్న ఎ ఏలు క్రమంగా అ ఆలుగా మారడం తరచుగా కనిపిస్తుంది. యవ్వరు ( *SII*

6.219 22,1494), యఱమనాయనిగారు (పై. 5.37.29,1494), సమర్పించను (పై. 5.1228.10,1503). ఇందు క్రియా ప్రాతిపదిక సాంస్కృతికమైనా కూడా దానిపై ఇంచుగాగమంలోని చకారంపై ఈ మార్పు కనిపిస్తుంది. సమర్పణ చేశను (పై. 6.1073.12,1402, ). ఎకారం ముందు స > శ కావడానికి చూ. (4.18). పండితుల చాత ఇప్పించిన (పై. 4.699.57,1546), వారి చాతను ఇప్పించిన (పై. 4.699. 23,1546) మొ వి. వీటినిబట్టి తాలవ్యహల్లుల తర్వాత ఎ ఏలు ఎ ఏలుగా (ఈషత్సంవృతంగా) ఉచ్చరించే వారని తెలుస్తుంది. ఇంకా తెలుగు పదాలు కొన్ని: కుచ్చళ్లు (*SII* 4.709.75,1558), కుచ్చెళ్లు (పై. 4.709. 136,1558) అని రెండు రూపాల్లోనూ ఉండడం గమనార్హం. 5.2 లో అ>ఎగా మారడమూ, ఈ 5.3 లో ఎ<అగా మారడము చూస్తే తాలవ్యహల్లుల తర్వాత అ/ఎల భేదం పోయినట్లూ ఆ అ/ఎలకు బదులు ఎ వ్యవహారంలో ఉండినట్లూ చెప్పవచ్చు.

**5.4.** **ఋ, ౠ >** రి,రీ/రు,రూ : ఋ, ౠ లు రి, రీలుగా మారి నట్లు ప్రాచీనశాసనకాలం నుంచీ కనిపిస్తుంది. ఇట్టి మార్పుతోడివి ఈయుగంలోనూ కనిపిస్తాయి. శ్రింగారభోగ అవసరం (*SII* 5.5.8, 1404), ప్రిత్తులు (పై. 5.26.4,1412) మొ. వి. ఋ, ౠలు రు, రూ లుగా కూడా మారినట్లు 12వ శతాబ్దినుంచి ఆధారాలు కనిపిస్తాయి. పిత్రుస్తానము (*SII* 4.1248.9, 1112) మొ వి. అలా రు, రూలుగా మారినందుకు ఈ యుగంలోనూ ఉదహరణలు చాలా తరచుగా కనిపిస్తాయి. బ్రుందావనం (*SII* 5.104 12,1428), సుక్రుతము (పై. 5.48.24, 1450) మొ. వి. దీనికి విలోమలేఖనం (inverse-spelling) లో వ్రాసినవి కూడా చాలా తరచుగా కనిపిస్తాయి. తల్లితండ్ృలకు (పై. 5.47.21,1424)- కాశ్యపగోత్ృలై (పై. 5.1158.5,1471), సపుత్ృం డైన (పై. 5.1167. 4,1414)మొ. వి.

**5.5.** ఇ ఈ/యి యీ, ఉ ఊ/వు వూ: ఎ ఏ/యె యే, ఒ ఓ/వొ వో: పై అచ్చులకూ యకార వకార పూర్వకఅచ్చులకూ భేదం లేనట్లు పూర్వపు యుంగలోనే చాలా స్పష్టంగా కనిపిస్తుంది. ఈ యుగంలోనూ శాసనాల్లో దీనికి చాలా ప్రయోగాలు కనిపిస్తాయి. నెఇ (నెయి) (*SII* 5.5.6,1404), పినబోఇని-(పినబోయిని) (పై. 5.26.5,1412), ధేనుఉన్ను (ధేనువు) (పై. 5.29.10,

(10)

1402), పోఉవాండు (పోవు) (పై.5.104.16,1423), పరచూరన వూరగరణము (పై. 10.586.7,1448), రెండు చేనువూరి దక్షిణ (పై.5.149.10,1402) మొ.వి. పదమధ్యంలో యెయే, వొవోలు ఎక్కువగా రావు కాబట్టి వీటకి ఏఏలు, ఒఓలు వ్రాయబడి ఉండడం శాసనాల్లో కనిపించదు. కాని పదాదిలో ఎఏలకు యెయేలు, ఒఓలకు వొవోలు వ్రాయడం పైభేదం లేదనటాన్ని స్పష్టపరుస్తుంది. ఉదా : కోరివల్న యెన్ని దశములకు వచ్చు (*SII*.10.747.12,1574), పాలు పెరుగులకుంగానై వొక మోదవును (పై. 5.47.20,1424) మొ.వి.

**5.6**. ఐ,ఔ/**అయ్, అవ్** : తెలుగులో ఐ/అయ్‌లకు,.ఔ/అవ్ లకు వ్యత్యాసం లేదనడం ప్రసిద్ధం కాని తత్సమపదాల్లోని ఐఔలను తెలుభాషలో పూర్వయుగపు శాసనాల్లో అనేకవిధంగా వ్రాసినట్లు కనిపిస్తుంది. పుత్రపౌత్ర అనడానికి పవుత్ర (*SII* 4.929 10,1068), పైవిత్ర (పై. 6.134,7,1149), పవిత్ర (పై. 6.141.10,1143), (పై. 6.154.8,1152) మొ. వి. కనిపిస్తాయి. ఈ యుగంలో అంత ద్వైవిధ్యం లేకపోయినా కొన్ని రూపాంతరాలు మాత్రం కనిపిస్తాయి. గౌడేశ్వర (*SII* 5.1165.2,1460), గవుడేశ్వర (పై.5.1153.2, 1470), గఉడేశ్వర (పై. 5.1165.2,1460), కఉసిక గోత్రుండు (పై. 5.1194.10,1455), వైశాఖ (పై. 5.1184.2,1408), వయిశాఖ ( పై. 5.1167. 1,1414) మొ. వి.

**5.7**. ఇయాంతనామపదాలు పూర్వయుగంలో మూడుమాండలికాల్లో మూడు రకాలైన మార్పులు పొందినట్లు చూచాం. (1) ఉత్తర-ఇయ>య/అ; (2) మధ్య ▷ఇయ>ఎ (3) దక్షిణం-ఇయ>Φ/ఉ. కాని ఈ యుగంలో దీని విషయంలో అంత స్పష్టమైన మాండలికాలు కనిపించటంలేదు. ఉత్తరంలో ఇయ>ఎ కనిపిస్తుంది. మధ్య ఆంధ్రలోనూ-ఇయ>య/అ వంటి రూపాలు కనిపిస్తాయి.

ఇయ/య. **ఇయరూపాలు** : గౌఱియలు (*SII* 6.667.22,1422) 6.743. 6,1428) విశాఖ.

**-య రూపాలు** : గొఱ్ఱ్యలు (పై. 5.1180 9,1402; 5.1239.11,1418) శ్రీకాకుళం.

పల్యంబులు (పై. 4.1344.7,1470). తూ. గోదావరి.

పళ్యాలు (పై. 4.981.6, 1518) గుంటూరు.

పళ్యపన్ను (పై. 6.219.20,1498) గుంటూరు.

-యె రూపాలు :

పళ్యెము (పై. 5.47.17,1424) తూ. గోదావరి.

-అ రూపాలు :

విడం పోంకలు (పై. 5.5.7,1404) తూ. గోదావరి.

పళాలు, పళ్ళం (పై. 4.981.6, 1518) గుంటూరు.

-ఎ రూపాలు

గొత్తెలు (గొత్తెయి) (పై. 5.1184.15.1404) శ్రీకాకుళం.

గొత్తెలు (పై. 6.656.17,1417) విశాఖ.

గొతెలు (పై. 6.667.10, 6.887,12,1425) విశాఖ.

తిరుసుట్టు మాలె (పై. 5.94.7, 1432) తూ. గోదావరి.

పళ్లెం (పై. 6.694.3,1516) విశాఖ.

పళెం (పై. 6.694.6, 1516) విశాఖ.

పళెము పై. 5.118,12,1438) తూ. గోదావరి.

పళ్లెం, పళ్లెలు (పై. 4.981 6,1518) గుంటూరు.

పై ప్రయోగాల్నిబట్టిచూస్తే నామపదాల్లోని ఇయాంతపదాలు లేక ఎకారాంత పదాలు ఎై ధ్వనితో ఉచ్చేరింపబడినట్లు మనమూహించవచ్చు. ఈ ధ్వనికి వ్రాత లేకపోవడంచేత కొన్ని సందర్భాల్లో య గాను, కొన్నిచోట్ల యె గాను, మరికొన్ని చోట్ల అ గాను వ్రాయ మొదలుపెట్టారు. -ఇయ/-ఎ మార్పు తత్సమపదంలో కూడా జరగడం ఈ యుగంలోని విశేషం. హత్య>హత్తె (*SII* 10.745.69, 1530), ఒడయలు శబ్దం ఒడెలు అని వ్రాసి ఉండటమూ గమనించ దగినదే. ఒడెలుంగారు (పై. 10.748.12,1577).

**5.8**. విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలో ఈయుగంలో కూడా అచ్చుల్లో హ్రస్వ దీర్ఘాలు తారుమారౌతాయి. ఆదివరనను (*SII* 6.709.3,1416) విశాఖ, అలావటం

( పై. 6.1101.12,1420 ) విశాఖ మొ వి. ఇది ఆప్రాంతపు ప్రాకృతభాషా ప్రభావం వల్ల అని చెప్పాలి. త్రికంలో ఉన్న 'ఈ' శాసనాల్లో తరచుగా 'ఇ' హ్రస్వరూపంలో కనిపిస్తుంది. ఇ నిజోగి ( పై, 6.1076.7, 1416 ), ఇ కొలువు (పై. 6,777.11,1461) మొ. వి.

**5.9.** క్ > గ్ : సుకృతం అనేమాట ఈ యుగంలో చాలా తరచుగా గకారంతో వ్రాయబడి ఉంది. సుగ్రుతంగాను (*SII* 5 94.5,1432), (పై. 5.104.12 1428), సుగ్రుతము గాను (పై. 4 694.7,1425) మొ. వి. అఖండము అనడానికి అగండం అని శాసనాల్లో క్వాచిత్కంగా కనిపిసుంది. అగండదీపానను(పై.6.667. 10, 1422) మొ.వి.

**5.10.** జ్ఞ > గ్న : జ్ఞ ను పూర్వకాలంలో గ్నగా ఉచ్చారించే వారని డా. చిలుకూరి నారాయణరావుగారు అన్నారు. శాసనాల్లో 'జ్ఞ' కు బదులు 'గ్న' వ్రాయబడలేదు. కాని 'గ్న' కు బదులు 'జ్ఞ' వ్రాయబడింది. ఆజ్ఞేయభాగం (*SII* 10.749.24,1583) మొ. ఇటువంటి రచన విలోమలేఖనాపద్ధతి (Inverse spelling) అని తీసుకొంటే జ్ఞను గ్నగా ఉచ్చరించే వారని చెప్పవచ్చు.

**5.11.** చ వర్ణానికి [చ్ఛ చే] అని రెండురకాలైన ఉచ్చారణ ఉన్నట్లు ముందే చూశాం. ద్విత్వంలో చ్చకు బదులు త్స వ్రాయడం కూడా దీనికి ప్రబలతార్కాణం అవుతుంది. పత్సలు (పచ్చలు) (*తి. తి. దే. శా.* 3.32,1512)మొ.వి. ఉత్సవ అనడానికి ఉచ్చవ అని విలోమలేఖనపద్ధతిలో వ్రాసి ఉండడం కూడా దీనికి ఉదాహరణగా తీసుకోవచ్చు. ఉచ్చవదేవళున్ను ( *SII* 4 1344.7,1470 ) మొ.వి.

**5.12.** ఈయుగంలో శకటరేఫవ్రాతలో ఉండినా, శకటరేఫకు సాధురేఫకు మధ్యభేదం పోయినట్లే చెప్పవచ్చు. శకటరేఫకుబదులు సాధురేఫ వాడటం ఈయుగంలో గతయుగం కన్నా చాలా తరుచుగా సంభవిస్తుంది. కరియముదు ( *SII* 5.5.7,1404), విరుగమొత్తి (పై. 5.26.4,1412), మనుమరాలు (పై.5.1248. 15,1471), తాటిపరు (పై.4 800.5,1518) మొ. వి. ఒక్క చెఱువు శబ్దమే తీసుకొన్నా కూడా చెర్వుకింద ( పై. 4.686.44, 1580,4.702.104,1518 ), చెరువుగట్టించి (పై. 4.702.108,1518), చెరువులు ( పై. 4.709.43,1558 ),

అని పలుసార్లు శకటరేఫకు బదులు సాధురేఫ కనిపిస్తుంది. అంటే చెఱువు (పై. 4 702.124,1518) మొ.వి. కేవలం వ్రాతలో మాత్రం నిల్చిఉందనీ ఉచ్చారణలో రఱల భేదం పోయిందనీ చెప్పవచ్చు.

**5.13**. పదాది హల్లుతో రేఫసంయుక్తమై ఉంటే అట్టి సందర్భంలో రేఫకు లోపంజరగడం కిందటియుగంలోనే చూశాం (4·14).కాని ఈ యుగంలో ఈ లోపం చాల తరచుగా సంభవిస్తుంది. ఉదా. కొత్తయింటికి (*SII* 4,711.31, 1593), పెగ్గడ (పై. 6.1027.3,1415) మొ.వి. ఒక్క క్రింద శబ్దమే తీసు కొన్నా అనేక ప్రయోగాలు కనిపిస్తాయి. చెఱువు కింద (పై 4.702.121,1518), కిందిమడి (పై. 4.702.128,1518), చెర్వుకింద వరిమడి (పై.4.702.248, 1518), చెర్వుకింద (పై. 4,686.14,1580), నగరి కింది (పై. 5.36.20, 1422), పినచెరువుకిందను (పై, 10.785.13,1524) మొ వి.

**5.14**. దీర్ఘం తర్వాత యకారానికి ద్విత్వమున్ను దీర్ఘానికి హ్రస్వమున్ను కావడం శాసనభాషలో తరుచుగా కనిపిస్తుంది. ఇట్టివి ఇంతకుపూర్వపుయుగంలో తరచుగా తత్సమపదాల్లోనే కనిపిస్తాయి. తృతియ్య, రమణియ్య మొ. వి. నేయి, వేయి మొదలగు దేశిపదాలు నెయి, వెయి అని హ్రస్వయుక్తరూపాలు తరచుగా కనిపిస్తాయి. కాని నెయ్యి, వెయ్యి వంటి రూపాలు క్వాచిత్కంగా కనిపిస్తాయి తక్కిన దేశిపదాల్లో ఇట్టి మార్పు అరుదుగా కనిపిస్తుంది. కాని ఈ యుగంలో దేశి పదాల్లోనూ పై మార్పు తరచుగా కనిపిస్తుంది. పొయ్యెం గలారు (*SII* 6.817.16, 1403), ఇయ్యంగలారు (పై. 6.817.19,1430), చెయ్యంగాను (తె.శా. 1,156. 8,1551), చెయ్యక (*SII* 4.659.10,1485) మొ.వి.

**5.15**. నాయుండు, బోయుండు శబ్దాల్లోని మధ్యఅక్షరానికి లోపం శాసన భాషలో సర్వసహజంగా కనిపిస్తుంది. బోయ శబ్దానికి బహువచన ప్రత్యయం పరమయేటప్పుడు యకారలోపం అతిప్రాచీన శాసనాల్లోనే కనిపిస్తుంది. ఉఱుటూరి బోళ రెండుట్టియు, బోళచేత శవణగొణిరి. మొ.వి. బహుత్వం పరమయ్యేటప్పుడు గుంటూరు, గోదావరి మధ్యశాసనాల్లో యకారం తప్పనిసరిగా లోపించి, నెల్లూరు శాసనంలో లోపించని రూపంకూడా కనిపించడంచే (బోయలన్-ధర్మవరశాసనం) ఈ లోపం గుంటూరు, గోదావరి మధ్యంలో ప్రారంభమైనట్లు చెప్పవచ్చును. 11వ శతాబ్దం నుంచి ఏకవచనరూపమైన బోయుడు శబ్దంలోను యకారం లోపించి

బోండు అని శాసనప్రయోగాలు కనిపిస్తాయి[1]. నాయుండు అనే శబ్దం ప్రాచీన శాసనభాషలో కనిపించకపోవడంచేత ప్రాచీనకాలంలో ఇందలి యకార లోప విషయం తెలియదు. కాని 12వ శతాబ్దిలోనే నాయుండు అనడానికి బదులు నేండు/నీండు అనే రూపాలు కనిపిస్తాయి. కాపినేనికి (*SII* 10.207.4,1198), కొమ్మనీండు (పై.5.1020 7,1134)మొ.వి. కాబట్టి 12వ శతాబ్దికి పూర్వమే ఇందులోనూ పదమధ్య యకారం లోపించిందని చెప్పవచ్చు. ఇందులో మరోవిశేషం ఏమంటే నాయుండు>నాండు కాక నాయుండు>నీండు/నేండు అయింది. అనగా యకారంలోని తాలవ్యప్రభావం వల్ల నా>నీ/నే అయిందని చెప్పాలి.

నాయుండు, బోయుండు శబ్దాల్లోని యకారలోపం 12వ శతాబ్దికి పూర్వమే జరిగినా యకారం తోడి రూపాలు కూడా 16వ శతాబ్దిదాకా విరివిగా కనిపిస్తాయి. యకారంపై ఉకారం ఇకారం కావడం 12వ శతాబ్దం నుంచి 16వ శతాబ్దిదాకా చాలా తరచుగా కనిపిస్తుంది. సింగనబోఇండు (*SII* 5.1165.13,1460), ఎటుబోఇండు (పై. 6,743.5,1428), ఘుమ్ములు నాఇండు (పై. 6.1094.6,1415), మొ. వి. ఇలా పదమధ్యంలోని యు>ఇ కావడం ప్రస్తుతయుగం మరీ ప్రచురంగా ఉండిందనడానికి ఈ కింది ఉదహరణ ప్రబలతార్కాణ అవుతుంది. (మామఃఖ) సేఇమని వారికి యిచ్చి (=చేయుమని) (పై. 4.711.16,1593).

**5.16**.యి>హి : పదమధ్యంలోని యి>హి కావడం పూర్వయుగంలోనే చూశాం. అలాంటివి ఈయుగంలో అంత తరచుగా కాకపోయినా క్వాచిత్కంగానైనా కనిపిస్తాయి. అచందార్కస్తాహిగా (*SII* 5.1194.14,1455) మొ. వి. పూర్వయుగంలో (4.18) బంగారు, బంగారు నాణేలు అర్థంలో పహిండి, పైండి, పయిండి అనే రూపాల్ని చూశాం గాని పసిండి అనే రూపం కనిపించలేదు. 11వ శతాబ్దికి తర్వాత శాసనాల్లో ఉన్న పసిండి అనే రూపం ఈ యుగంలోనే కనిపిస్తుంది. (పై.5-134.9,1415). ఈ యుగంలో కూడా పహిండి, పయిండి, అనే రూపాలే విరివిగా కనిపిస్తున్నాయి. పహిండి రసన (పై. 5.1167.7, 1414), పహిండి గుడి (పై. 10.577.47,1410), పహిడి (పై. 5.1248.30,1471,), పైండి పటికము (పై. 6.886.10,1421), పైడి (పై. 6.696.6,1213), పఇండి (పై. 6.709.9,1416), పయిండి కుండలు (పై. 4.702.104,1518).

అమృతమణి శబ్దానికి సింహాచలంశాసనాల్లో తరుచుగా హి చేరడం ఈ యుగపు శాసనాల్లో ఒక విశేషం. అమృతమణిహి ( *SII* 6.827.11,6.779.8, 1427, 1415, 6.966.3, 1421) మొ.వి. హి చేరని రూపం అమృతమణి (పై. 6.1054.8, 1461, 6.727.8, 1465) మొ. వి

హిందువులు అనే పదం ఒకచోట ఇందులు (తె శా. 1.:56.1,1551) అని ఉండటం మరొక్కవిశేషం.

**5.17.** పదమధ్యమందలి వకారం మకారం కావడం ఈయుగపు శాసనాల్లో క్వాచిత్కంగా కనిపిస్తుంది. తిరుమజాము (< తిరువజాము<తిరువర్థజాము) (*SII* 6.1085.7,1428), హేమలంబి (పై. 66.69.3,1580), దేమున్కి (< దేవునికి (**N*I*** 8 పొదిలి 14.28,1517)

తాలవ్యాచ్చులు పరమవుతుండగా వకారం యకారం కావడం తెలుగులో పూర్వ యుగంలోనే కనిపిస్తుంది. కయిలలు (<కవిలలు) (*SII* 5.1847.10,1098:5. 1348.11,1098). ఈ యుగంలో అట్టివి క్వాచిత్కంగా కనిపిస్తాయి. ఉదా: ఇదీపం బెలుంగును (<వెలుంగను) ( పై. 6.1024.8,4416 ), ఇండ్లపొది (< విండ్లపొది) (పై. 6.770.8,1403), గోఇందు నాఇని కొడుక్కు (<గోవిందు) పై. 6.1104.19,1420)

**5.18.** తాలవ్యాచ్చులు పరమైతే సకారం శకారంగా వ్రాయడం 13వ శతాబ్దినుంచి చాలా తరచుగా కనిపిస్తున్నట్లు ముందే తెలుసుకొన్నాం. ఈ యుగంలోనూ అట్టివి చాలా తరచుగా కనిపిస్తున్నాయి. వల్లభదాశి లేస్తేచేశి (*SII*5.24.9,1401) పుట్టెందేశి...పందుమేశి (పై. 5.26 7,1412) ; చేశెను (పై. 5.87 40,1494). ఈ యుగంలో మరోవిశేషం ఏమంటే ఈ స<శ మార్పు జరిగాక దానిపైన ఉండే ఎ ఏలు, అ ఆలుగా మారుతాయి. శలవు దయచేస్తేను (పై. 10.751.22, 1598), శలవు ఇచ్చి (పై. 10.751.21,1598), సమర్పణచేశను (పై. 6.1073. 12,1402), శావసేసిది (పై. 10.747.17, 1574), శావకు ( పై. 10.747.19, 1574), దశిమి శావలకు (పై. 10.747.9, 1574) మొ వి. దీన్నిబట్టిఈ యుగంలో తాలవ్యహల్లుపైనుండే ఎ ఏలు <u>ఎ</u> <u>ఏ</u>లుగా ఉచ్చరించబడేవని స్పష్టపడుతుంది. (చూ. § 5 3) ఇలాంటి ఉచ్చారణ పూర్వయుగంలోనే ప్రారంభమైనట్లు కూడా చూశాం.

**5.19.** ద్విత్వానునాసికాలముందు ఈయుగంలో చాలా తరుచుగా అనుస్వారం కనిపిస్తుంది. కాచంన్నందారు ( *SII* 5.29.8,1402 ). పుచకొంన్న గ్రామాలు (పై.6.695.2,1519), దుంన్ని (పై. 10747.10,1574), వొంమ్మెచ్చు (తి. తి. దే. శా. 3.38.4, 1512), తిరుమలంమ్మవారు (పై. 3.59.8,1512) మొ.వి. ద్విరుక్తాలు అద్విరుక్తాలు కావడం పూర్వశాసనాల్లోనూ ఈ యుగవుశాసనాల్లోనూ తరచుగా సంభవిస్తుంది. ఈ యుగంలో మూర్ధన్యాక్షరాల్లో ద్విరుక్తం అద్విరుక్తం కావడం చాలా తరచుగా కనిపిస్తుంది.

**ద్విరుక్త రూపాలు**

సోమారెడ్డి (*SII* 5.10.5.1404), పెరుమాళ్లకు (పై.5.14.3,1403), ఇంత పట్టు (పై 5.5 8,1404), పుట్టెండెశి (పై. 5 26.7,1412), నంభాళ్ల (పై. 5.1248.11,1471) ము.వి.

**అద్విరుక్తరూపాలు**

సోమారెడి (*SII* 5 5-10,1404), పెరుమాళకు (పై. 5.10.4,1404). ఇంతవటు (పై. 5.26.16,1412), పుటెండున్న (పై. 5.244,1401), సంబాళ (పై. 5,1248.12.1471); పళెమున్న (పై, 5.29.10,1402) మొ. వి.

ఇవిగాక చకారంలోనూ ఇట్టి పరిణామం కనిపిస్తుంది. ఇచి (ఇచ్చి) (*SII* 5.30.15,1403), పుచకొన్న (పై. 6.695.2,1519) మొ.వి. శ్రీకాకుళం-విశాఖ శాసనాల్లో ద్విరుక్తాలకు బదులు అద్విరుక్తాలు వాడడం మరీ తరుచుగా కనిపిస్తుంది.

**2.20.** జ్యేష్ఠమాస మనడానికి శ్రేష్ఠమాసమను సామ్యోత్పత్తి రూపం (folk etymology) పూర్వయుగంలోను ఈయుగంలోను క్వాచిత్కంగా కనిపిస్తుంది. శ్రేష్ఠ (*SII* 5.109.8,1423) మొ.వి.

**5.21.** అనుధాతువుకు అకారంతో ప్రారంభమయ్యే ప్రత్యయంచేరగా నా-అని వర్ణవ్యత్యయరూపం ఏర్పడ్డ (అను + అ- > నా-) సాహిత్యభాషలో తరుచుగా కనిపిస్తుంది, అనవుడు>నావుడు, అనన్>నాన్ ఈ యుగంలో అనుధాతువు విశేష రూపమైన అనే అనుశబ్దంలోనూ మొదటి అకారం లోపించడం కనిపిస్తుంది. తిరు

పతినే ఊరి (*SII* 5.102.8,1442). ఇక్కడ జరిగింది వర్ణవ్యత్యయం వల్ల అనిధ చెప్పటంకన్నా అనన్>నాన్, అనవుడు > నావుడు సామ్యంతో అనే>నే అని ఏర్పడిందని చెప్పవచ్చు.

**5.22.** ఢ్ల సంయుక్త రూపం ళ్లగా మారడం పూర్వయుగంలో చాలా తీవ్రంగా జరిగింది. ఈ యుగంలో ఢ్ల రూపం దాదాపు ళగా మారిపోయిందనవచ్చు. మామీళుంమ్ను, మారేళుంన్ను, నేరేళుంన్ను (*SII* 10.737.44,1526), దేవుళు (పై. 6.694.3,1516), సీళు (పై. 6.699.7,1535), (నంబ్యాళు) పై. 6.709.13, 1416), మాళు (మాడలు) (పై. 6.731.7,1406) మొ.వి. (ళ్ల>ళ కావడానికి 5. 19. చూడండి). ఇలా ఢ్ల>ళ్ల పూర్వయుగంలోనే దాదాపు పూర్తి కావడంచేత ఈ యుగంలో కొత్తగా సంధిగతమైన ఢ్ల రూపాలేర్పడటం లేదు. అంటే ల్ + ల > ఢ్ల ర్ + ల > ఢ్ల వంటి మార్పులు జరగటంలేదు. అని చెప్పాలి. తూర్పు పడమర్లు (*SII* 4.789. 227, 4518), దేవర్లకున్ను (పై.10 577.48,1410), హరాంభోర్లు (పై 10.751.19,1593) మొ.వి. ఢ్ల తోడి రూపాలు ఈయుగంలో చాలా క్వాచిత్కంగా కనిపిస్తున్నాయి. గుడ్లు కట్టించి (పై. 10,749.16,1583) మొ వి.

సంధి

**5.23.** సంధివిషయంలో పూర్వయుగంలో లాగానే ఈ యుగంలోనూ ఏ నియమం లేకుండా రెండచ్చుల మధ్య యడాగమం రావచ్చు, రాకపోవచ్చు. లేదా సంధి జరగవచ్చు. అముదులు నాలుగు యింతవట్టు (*SII* 5 5.8,1404),విచ్చేశి వుదయగిరి (పై. 6.248.12,1515); పటుచూరను వూరగరణము (పై. 10. 586 7,1448), కొలుపు ఒకటి (పై. 6.710.6,1409), కాంచనం గారజునుండు (గారిఅనుజుండు), (తె.శా. 1.178.5,1482) మొ.వి. గసడదవాదేశ సంధి పూర్వ యుగంలో లాగానే జరిగినా జరగవచ్చు, జరక్కపోయినా పోవచ్చు. వుడియూరము పెట్టి (*SII* 5.10.5,1404), పందు మేశిసేనున్ను (పై. 5 26.7,1412). ద్రుతము మీది కచటతపలు గజడదబలు కాసిచోట్లు చాలా ఉన్నాయి. ఉదా : అప్పములకు బియ్యంను తికుటోనములో పవుపెసలును పిండివంటకు (పై.5.5.4,1404) మొ.వి.

**నామపదాలు**

**5.24.** ఈ యుగపు కృత్తద్ధితాంతాల విషయంలో అట్టే విశేషాలు లేవు. కాని ఎరువుమాటల విషయంలో ఈ యుగంలో ఒక నూత్నదశ అవతరించింది. అంటే ముస్లింరాజ్యాలు ఈ యుగంనాటికి స్థిరపట్టంచేత దక్కనీ ఉర్దూనుంచి అనేక పదాలు ఈ యుగంలో తెలుగులోకి వచ్చాయి. వాటిలో కొన్ని ఉదాహరణలు : మహం (మాసం), (*SII* 10.753.5,1530),సులతాని (పై. 10.743.6,1530), దరివేసులు (సాధువులు) (పై. 10.743.15,1530), ఠాణేదార్ (పై.10.745.12, 1587), హవాలాదారు (సైన్యాధిపతి) (పై. 10.748.2,1577), సహాయబు (పై. 10.748.28,1577), హజరతి(గౌరవనీయులు) (పై. 10.751.9,1598), నామజాదు (పై. 10.751.10,1598), ఖబురు (పై. 10.751.23,1598), మక్తా (పై. 4.711.29,1593), నఫరు (పై. 4.711.28,1593) మొ.వి. ఇవిగాక ప్రాకృత భాషనుండి వచ్చిన దఖబడలు (దధివడలు) (పై. 6.1040.6,1417) మొ.వి. ఈ యుగంలోని వింత ప్రయోగాలు.

**5.25.** సమాసం: సమాసాల విషయంలోనూ ఈ యుగంలో చెప్పుకోదగ్గ విశేషాలు లేవు. చాలావరకు పూర్వయుగంలో లాగానే ఉంటాయి. పూర్వయుగంలో కనిపించిన తిరువజాము మొదలయిన రూపాలు ఈయుగంలో క్వాచిత్కంగా కనిపిస్తాయి. తిరువజాన (*SII* 6,1107.5,1414), తిరుమజామ (పై. 6.1085.7, 1428) మొ వి. ఇలుపట్టు మొదలైన రూపాలుకనిపిస్తాయి. (పై. 5.14.9,1410), గతయుగంలో నీరినేల, నీరునేల అని రెండు రూపాలు కనిపిస్తాయి. కాని ఈ యుగంలో నీరునేల రూపం మాత్రం కనిపిస్తుంది. అన్నందమ్ములు (పై. 5.1184. 14,1408). ఇది బహుళా ఊరుంగాయెలు (పై. 5.981.7, 1518) మొదలయిన సమాసరూపాల సామ్యంవల్ల ఏర్పడి ఉండవచ్చు. మాతాపితాళ్ల (పై. 6.219.25, 1494), తల్లిదండ్రాదులకు (పై. 5.37.35,1494) వంటి ద్వంద్వసమాసరూపాలు ఈ యుగంలో క్వాచిత్కంగా కనిపిస్తాయి. ఇందు మాతా పితాళ్ల రూపం ఎక్కువసార్లు కనిపిస్తుంది.

**5.26.** లింగ ప్రత్యయాలు : మహత్తులో-న్టు ఈయుగంలో బొత్తుగా కనిపించదు. -ండ్రు. -డు అన్ని మాండలికాల్లోనూ స్థిరపడినట్లే. ఈ-ంతు ప్రత్యయం దఖనీ ఎరువు మాటల్లోనూ చేరుతుంది. ఉద్దండఖానుండు (*SII* 6.248.22,

1515, ద్రోహి అనే మాటలో ఒక్కచోట -ండు కనిపిస్తుంది. ద్రోహిండు (పై. 6. 1054.18,1461). ఇది బహుశా బోహిండు, నాహిండు శబ్దాల సామ్యంవల్ల వచ్చి ఉండవచ్చు. నాయుండు, బోయుండు శబ్దాలకు నాహిండు,బోహిండు అని వ్రాయడం శాసనాల్లో చాలా కనిపిస్తుంది[2] మహతీవాచక శబ్దాలకు -రాలు ప్రత్యయం కనిపిస్తుంది.

**5.27.** వచనం ; పూర్వయుగంలో 'డలర'లతో బహువచన లకారం కలిస్తే. డ్ల సంయుక్తమయి, ఆ 'డ్ల' సంయుక్తం 'ళ్ల'గా మారుతూ వచ్చింది. కాబట్టి ఆ యుగంలో బహుత్వంలో డ్లు, ళ్లు రెండు రూపాలూ చూచాం. గత యుగంలోనే అంతిమదశలో డ్లు>ళ్లు మార్పు దాదాపు పూర్తికావడంచేత ఈయుగంలో-ళ్లు రూపమే కనిపిస్తుంది. దేవళ్లు (*SII* 10.749.6,1583) ఆడువాళ్లు (పై. 5.102.4,1442), కవుళ్లు (పై. 4 711.14, 593), మామిళుంన్ను మారేళుంన్ను నేరేళుంన్ను (పై. 10.637.44,1526), నంబ్యాళు(పై.6.308.13,1416), దేవుళు (పై. 6.694.3, 1516), నీళు (పై. 6.699.6, 1535) మాళు (పై.6.731.7,1406) మొ.వి. డ్లు రూపం చాలాక్వాచిత్కంగా కనిపిస్తుంది. గుడ్లు గట్టించి (పై. 10.749.16,1588), అమృతపడ్లకు NI 3. పొదిలి 14.7,16 th century).

ఇంకొక్కవిశేషం ఏమంటే దీర్ఘాచ్చు తర్వాత -ండుతో అంతమయ్యేపదం ఉంటే ఆ-ండుతో -లు సంయుక్తమవుంది. ఏండు-ఏండ్లు (సంవత్సరాలు) (*SII* 5.37.46,1494), అయినవాండ్లు (పై. 10.751,23,1782), యక్కడివాండ్లు (పై. 10.751.24.1592) మొ వి

రాత్రి అనే తత్సమపదానికి రాత్రిళ్లు అనే బహువచన రూపం పూర్వయుగం లోనే కనిపించింది. ఈ యుగంలో రాత్రిల్లు అనే ఒక రూపం కనిపిస్తుంది (*SII* 5.1165.15,1460), ఱాయి శబ్దానికి పూర్వయుగంలో ఱాలు అనేది బహువచన రూపం. కాని ఈ యుగంలో రాళ్లు అనే రూపం కూడా కనిపిస్తుంది (పై. 4.789. 219,1518). కూతురు శబ్దానికి కూతులు, కూతుళ్లు అని రెండు రకాలయిన బహువచనరూపాలు కనిపిస్తున్నాయి.కూంతులు (పై. 6.668.17,1487), కూతుళ్లు (పై. 6.954.7,1441).

**గౌరవార్థ ప్రత్యయాలు :** సాధారణ బహువచన ప్రత్యయాలు గౌరవార్థంలో

చేరుతాయి. చక్రవర్తులు (*SII* 6.667,17 422), దేవులు (పై. 5.34.11,1434), నంబ్యాళు (పై. 6.709.13,1426) మొ.వి.

గతయుగంలో లాగానే -గారు, -వారు ప్రత్యయాలు కూడా విరివిగా కనిపిస్తాయి. పాత్ర్ళంగారు (*SII* 6.219.15,1494), పంచాననవారు (పై. 6.219. 19,1494), పోతినేనింగారు (పై.6.242 10,1427). అమ్మవారు (పై. 6.248. 36,1515) మొ వి. -రు అంతమందున్న బహువచనరూపాలకు తరచుగా మరో బహువచన ప్రత్యయమైన -లు చేరుతుంది. అమంగారులు (పై.10 587. 45,1410), అమ్మంగారులు (పై. 10 577.10,1410) మొ.వి.

**5.28. ఔపవిభక్తికరూపాలు** : మహద్వాచక రూపాల్లో -డు లోపించి -ని చేరిగాని, చేరకగాని విభక్తిప్రత్యయాలు చేరడం కావ్యభాషలో సహజం. కాని -డు లోపించకుండానే -ఉ చేరిన రూపాలకు విభక్తి ప్రత్యయాలు చేరిన రూపాల్ని పూర్వయుగంలోనే కొన్నింటిని చూశాం. అట్టివి ఈ యుగంలో మరికొంత ప్రచురంగా కనిపిస్తున్నాయి. శ్రీకూర్మనాథుడి సంముఖమందు (*SII* 5.1172.9,1427), ఓభళబోయడి గోచరానను (పై. 5 1162.11,1427), దేవుడికి (*NI* 3 పొదిలి 19.10.1583), బ్రాంహ్మణి బంపిన దోషానం (>బ్రాహ్మడిని) (*SII* 10. 745.61,1530), బ్రంహ్మేశ్వరుంణ్ని (పై. 10.749.10, 1583), పాపవినాశరేశ్వరుంణ్ని (పై. 10.749.10,1583), గోపీ నాథుండ్ని (పై. 10.749. 39,1583), చన్నకేశ్వరరాయస్ని ప్రతిష్ఠసేయించి (రాయణ్ణి>రాయన్ని (*NI* 3. రాపూరు 41.13,1585)

బహువచనప్రత్యయం తర్వాత -అ అనే ఔపవిభక్తికప్రత్యయం చేరేట్లు పూర్వయుగంలోనే చూశాం. ఈ యుగంలో తరచుగా కనిపించే -ళు రూపం పైన కూడా దీన్ని చూడవచ్చు. తమ్మి నంబ్యాళచేత (*SII* 6.710.8,1409) మొ. వి. మిగిలినవాటి విషయంలో గతయుగానికి ఈ యుగానికీ తేడా అట్టే కనిపించదు. -టితో అంతమయ్యే ఔపవిభక్తిక రూపాలకు బదులు -ఇంటి చేరడం పూర్వయుగంలోనే కనిపించింది. ఈ యుగంలోనూ అట్టివి తరచుగా కనిపిస్తాయి. పగలు- పగలింటి (పై. 6.737.7,1465) మొ. వి.

**5.29. ద్వితీయావిభక్తి** : నామపదాలు అలాగే మార్పులేకుండా ప్రథమా రూపాలుగా వస్తాయి. ద్వితీయారూపాల విషయంలో అట్టే విశేషాలు లేవు. కాని

డు మంతరూపాల్లో డు జూపై -ఇ చేరగా వానిపై -ని చేరి ద్వితీయారూపం కావడం ఈ యుగంలో తరచుగా కనిపిస్తుంది. బ్రహ్మేశ్వరుంణ్ని (*SII* 10.749 24, 1583), (-డి -ని చేరి ణ్ని అవుతుంది). బ్రాంహ్మణి (పై. 10.745.61, 1530) మొ. వి.

**5.30. తృతీయావిభక్తి** : పూర్వయుగంలో పద్యశాసనాల్లో మాత్రం కనిపించిన-మెయిన్ ప్రత్యయం ఈయుగంలో కనిపించదు. ఈయుగంలో కనిపించేవి ఈ కిందివి.

(అ) చేతన్, చేన్, తోడన్, తోన్.

చేతన్, చేన్ : పూర్వయుగంలో ఈ ప్రత్యయాలు సాధారణంగా గ్రహ్యర్థంలోనే కనిపించేవి. కాని ఈ యుగంలో ద్వారా అనే అర్థంలోకూడా కనిపిస్తాయి. దేవరలకు నిత్యకృత్యముగాను వొడాదదేవనచేతను యెత్తించి (*SII* 5.14.4, 14:0), చిన్నాదేవమ్మ చేతను రత్నుమహాదానమున్ను తిరుమలదేవి అమ్మవారి చేతను సప్తసాగర మహాదానమున్ను సేయించ నవధరించి (పై. 6.248.33, 1515) చే > చా మార్పుచేత ప్రత్యయానికి చాత అనే రూపం కూడా తరుచుగా కనిపిస్తుంది. తమ దేవులు చింనాదేవంమంగారి చాతను సమర్పించిన పదకం (పై. 6.694.3,1516), ప్రతాపరుద్రగజపతి మహారాయల చాతను పుచుకొంనగ్రామాలు (పై. 6.695.2, 1519) మొ. వి.

తల్లి సూరాంబచే సమత్స[ం]న్న మగుచుం బరగు(పై.10.583.6,1415), జలక్షేత్రము వీరిచే వ్యతింగాబెదెను (పై 6.1061.5,1374) మొ.వి.

(ఆ) **తోడన్, తోన్** : ఈ ప్రత్యయాలకు ఈ యుగంలో ప్రయోగంచాలా తక్కువ. ఇవి సహార్థంలో ప్రయోగింపబడతాయి. ఊరుంగాయలతోడను ఆరగించి (*SII* 4.981.7,1518), అన్నతోయుజ 14 గంగుతోయ జ 16 నున్న కాముతో ...(పై. 5.26.5,1412) ఇక్కడతో కళగా కనిపిస్తుంది. అందులోను ఇది సంప్రదానంలో ప్రయోగింపబడి ఉంది. ఈ తోడ శబ్దం సమాస గతమైనప్పుడు తోడి అనడం సహజం. కల్యాణవేదితోడి శిలామండపం (పై. 5.118.53,1416). కాని ఈ యుగంలో తోటి అని ఆధునికరూపం మొదటి సారిగా కనిపిస్తుంది.

ఖండికలతోటి మరియాదా (*SII* 3.1168.32,1434), మణికలా తోటి సమస్య (పై. 6.1098.17,1402) మొ. వి.

**5.31. చతుర్థీ విభక్తి :** కొఱకు ప్రత్యయం పూర్వయుగంలో చాలా క్వాచిత్కంగా కనిపించింది. కాని ఈ యుగంలో చాలా తరచుగా కనిపిస్తుంది. ఇది ఎప్పుడూ గుణవాచకాలపైనా, క్రియావాచకాలపైనా కనిపిస్తుంది. ఆయుష్యాభివృద్ధి కొఱకున్ను (*SII* 5.1153.8 1471), అక్షయఫలంకొఱకు (పై. 5,1228.10. 1508), గుగ్గిలము వెట్టికొఱకై (పై. 5.129.4,1422), వెలింగిడి కొఱకై (పై. 5.1184.41,1430) మొ.వి.

**5.32. పంచమీవిభక్తి :** చేతన్, వలనన్‌లు పూర్వయుగంలో లాగానే గ్రహ్యర్థంలో వస్తాయి. చేత ప్రత్యయం సాధారణంగా మానవాచకాల మీదను, వలన ప్రత్యయం క్లీబవాచకాలమీదనూ వస్తాయి, సూరాజోస్యులచేతను సదాశివుని చేతను క్రయలబ్ధమైన (*SII* 5.48.12,1450), స్థానమువారి చేతంగొన్న (పై. 5.149.8,1402) మొ. వి. కోరివల్ను యెన్ని దశములకు వచ్చును (పై. 10.747. 12,1574) మొ.వి. –నుండి, –దనుక గమనార్థంలో వస్తాయి. వుంపున నుండి వ్యాయవ్యానకు (*NI* 3 ఒంగోలు 71.48.1517) కొండవీటి దనకాను విరుగం బొడిచి (*తి. తి. దే. శా.* 3.68.1514), మొ.వి. నుండి శబ్దం వల్లకు పరమై కూడా వస్తుంది. ఏలానది వల్లనుండి (*SII* 5.3781, 1491) –లోను నుండి అని కూడా కనిపిస్తుంది. భూమిలోననుండి (పై. 4.889.228,1518).

షష్ఠీ, సప్తమీ విభక్తుల విషయంలో విశేషాలేమీ లేవు.

**సంఖ్యావాచకాలు**

**5.33. ఒకటి :** గతయుగంలో ఒకండు, ఒకటి రెండు రూపాలూ పర్యాయంగా కనిపిస్తూ 14వ శతాబ్దిలో ఒకటి శబ్దమే బహుళంగా ఉన్నట్లు చూశాం. ఈ యుగంలో ఒకటి శబ్దం స్థిరమైపోయినట్లు చెప్పవచ్చు. ఒకండు శబ్దం తూ. గో-విశాఖప్రాంతంలో మాత్రం క్వాచిత్కంగా కనిపిస్తుంది. ఒకడు (*SII* 6.825.9, 1416, 6.1045.5, 1405) సింహాచలం, విశాఖ; ఇరువయ్యొకండు మోదాలు (పై. 4.1378.10, 1416) దాక్షారామం, తూ. గోదావరి.

**5.34.** నాలుగు : నాలుగు శబ్దానికి నాలు అనే రూపం కూడా విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలో ఉన్నట్లు గతయుగంలో చూశాం. ఈ యుగంలోను అట్టి రూపం ఆ ప్రాంతంలో కనిపిస్తుంది. నాలుకుంచాలు (*SII* 6.1057.9, 1514) సింహాచలం : నాలుపుట్లు (పై.6.1040.9, 1417) సింహాచలం : విశ్యలు నలు (పై.5.1239.12, 1418) శ్రీకూర్మం.

**5.35.** ఐదు : ఐదు శబ్దానికి పూర్వయుగంలో ఐదు, ఏను అనే రెండు రూపాలూ వ్యాప్తిలో ఉండి రానురాను ఐదు శబ్దం ప్రచారానికి వచ్చి ఏను శబ్దం తగ్గుతూ వస్తున్నట్లు చూశాం. ఈ యుగంలో ఐదు శబ్దం అన్ని ప్రాంతాల్లో స్థిరంగా నిల్చినట్లు స్పష్టంగా కనిపిస్తుంది. ఏను శబ్దం విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలో మాత్రం క్వాచిత్కంగా కనిపిస్తుంది. ఇరువఇ ఏనుపుట్లు (*SII* 5.1199.5, 1451) శ్రీకూర్మం ; ఇరవై యేనుట (పై, 6.844.16, 1472) సింహాచలం.

**5.36.** పదికి ఒకటి,మూడు,నాలుగు, ఎనిమిది చేరేటప్పుడు గతయుగంలో -ఉన్- ప్రత్యయంగాని లేదా కేవలం -న్- గాని చేరినట్లు చూశాం. -న్- ప్రత్యయం ద్రుతంవలె ఉంటే ఉంటుంది. లేకపోతే కనిపించదు. ఉదా: -ఉన్- తోడివి పదునెనిమిది, మొ.వి. -న్- తోడివి -పదినెనిమిది, పదియెనిమిది మొ.వి. ఈ యుగంలో -ఉన్న-ప్రత్యయం స్థిరపడినట్లు చెప్పవచ్చు. అనగా -న్-మాత్రం చేరడం ఈ యుగంలో లేదు. పదునాలుగు (*SII* 6.219.12, 1494) మొ.వి. పదునొకండు శబ్దానికి పదునకొండు అని 13వ శతాబ్దిలో ఒక ప్రయోగం కనిపిస్తుంది. పదునకొండు (తె.శా. 1.41.8, 1231). ఈ యుగంలో ఒక్కచోట ఇలాంటిది కనిపిస్తుంది. పదున[కొ]ండు (*SII* 4.1375.18, 1444) ఇందులో ఉకారం అకారం కావడం విశేషం.

**5.37.** ఇరువది, ముప్పది మొదలగు సంఖ్యావాచకాల్లో చివర ది>యి మార్పు గతయుగంలోనే వేగంగా జరుగుతూ ఉండింది. ఈ యుగంలో ఈ మార్పు పూర్తిఅయి స్థిరపడినట్లు తెలుస్తుంది. అయినా -ది అంతంతో కొన్ని రూపాలు ఈ యుగంలోనూ కనిపిస్తున్నాయి. ఏంబది (*SII* 6.865.7, 1403), మూన్నూంట ముప్పది యేడు (పై. 10.582.1, 1415) మొ.వి.

**5.38.** ఇరువది, ముప్పది శబ్దాలకు ఏను శబ్దం చేరగా ది>డి గా మారడం పూర్వయుగంలో చూశాం. పూర్వయుగంలోనే అంతిమదశలో ఈ మార్పు తగ్గి

పోవడం చూశాం. ఈ యుగంలో ఈ మార్పుతో ఉన్న రూపం ఒక్కచోట మాత్రం కనిపిస్తుంది. ఇరువదేను మోదాలు (*SII* 6.663.11,1132) సింహాచలం-విశాఖ.

**5.39.** నూఱు శబ్దానికి అంతకంటె చిన్న సంఖ్యను చేర్చునపుడు 'ఱు' కు బదులు 'లు' కావడం తెలుగుభాషలో సహజం. కాని ఈ యుగంలో 'లు'కు బదులు -ంట సర్వత్ర కనిపిస్తుంది. నూంట యెనుమంద్రకు (*SII* 6.248.42,1515), నూంటపది (పై. 6.743.6,1428), వేయి మున్నూంట ఇరవై యేడు (పై 10. 573.36,1405), నూంట యెనంభది (పై. 6.805.27,1472), మూన్నూంట ముప్పదియేడు (పై. 10 582.1,1415), నూంట ఇబ్బరకున్ను (పై. 10.737. 60,1526) మొ.వి. ఇట్టివి గతయుగంలోనూ క్వాచిత్కంగా కనిపిస్తాయి. కాని 12-14వ శతాబ్దులో -ట తోటి రూపాలే ఎక్కువగా ప్రచారంలో ఉన్నాయి.

**5.40.** ఇద్దుము (*SII* 5.1153.10,1471), ముత్తుము (*NI* 2కనిగిరి 4.36,1416), నలుతుము (పై. 3.68.13-14,1584), ఎందుము (పై. 2కనిగిరి 4.37,1416). లేక ఎందుము (*SII* 5.1162.14, 1427) వంటి రూపాల్లో గత యుగానికీ ఈ యుగానికి తేడా ఏమీలేదు. ఏడుతూములు అనుటకు ఏడుదుమం గుంచ్చుండు (పై. 6.1048. 15,1402), ఎద్దుము (పై. 6.1091.8.1421) వంటి రూపాలు కనిపిస్తాయి. ఎనిమిది అనడానికి ఎనమందుము (*NI* 2 కనిగిరి 4.33) కనిపిస్తుంది.

## సర్వనామాలు

**5.41.** ఉత్తమ మధ్యమ పురుష సర్వనామాల్లో స్వరంతో ప్రారంభమయ్యే సర్వనామ రూపాలీయుగంలో కనిపించటం లేదు. అంతా అనునాసికాలతోనే ప్రారంభమౌతాయి. ఉదా: మేము (*SII*. 6.1?2.17,1551), మీరు (పై.4.1375. 22, 1444) మొ.వి. తాము అనడానికి పూర్వయుగంలో తారు అనే రూపమే ఉన్నట్లు గుర్తించాం. ఈ యుగంలో తాము, తారు అను రెండు రూపాలూ కనిపిస్తాయి. ఉదా: తారు పాలింపి దేశాలంగల (పై. 6.1168.32,1434), తమ లోందాము (పై. 10.748.4, 1577) మొ.వి. వాండు, వీండు అను సర్వనామాలకు పూర్వయుగంలో వారు, వీరు అనురూపాలే బహుత్వంలో కనిపిస్తాయి. కాని ఈ

యుగంలో వాండు అనడానికి వాండ్లు బహుత్వంలో కనిపిస్తుంది. అయిన వాండ్లు (*SII* 10.751.28, 1592). యక్కడివాండ్లు (పై. 10.751.25,1592), పిల్లవాండ్లు (*NI* 3 రాపూరు 11-19,1570)మొ.వి.

క్రియలు

**5.42.** క్రియాప్రాతిపదికలవిషయంలో పూర్వయుగానికీ ఈ యుగానికీ అట్టే తేడా చెప్పలేము. కాని ఈ క్రియాప్రాతిపదికలతో ప్రత్యయాలు చేరేటప్పుడు సంధి మార్పుల విషయంలో ఈ యుగంలో స్పష్టమైన కొన్ని విశేషాలు కనిపిస్తాయి, పోవు ప్రాతిపదికకు అన్నంతమగునప్పుడు వు లోపించి బిందువు వచ్చుట ఈయుగంలో సర్వత్ర జరగుతుంది. పోంగలరు, (*SII* 6.709.18,1436), పోంగలవారు (పై. 6.248.60,1515), పోంగను (పై. 6.1040.4, 1417) మొ.వి.

**5.43.** ఇంచు ప్రత్యయం చేరిన ధాతువులకు అచ్చులతో ప్రారంభమయ్యే ప్రత్యయాలు చేరగా ఈ యుగంలో ఇంపుగా మారుతాయి. ఇట్టివి తూర్పు గోదావరి శ్రీకాకుళం మధ్యలో 15వ శతాబ్దిలో విపుల ప్రచారంలో ఉండినా మిగిలిన ప్రాంతాల్లో కనిపించవు.

| | | |
|---|---|---|
| సమర్పించిన మూల్యం (*SII* 5.5 10, 1410) కాకినాడ | తూ. గో. |
| ఎవ్వరు విరోధింపినాను (పై. 5.10.12,1404) | ,, |
| సమర్పింపెను (పై. 5.34.29,1424) | ,, |
| సమర్పింపిరి (పై. 5.47.28,1424) | ,, |
| ఆరాధింపి (పై. 5.52.6,1428) | ,, |
| సమర్పింపెను (పై. 5.102.12,1442) పెద్దాపురం | ,, |
| సమర్పింపి (పై. 5.103.11,1408) | ,, |
| సమర్పింపెను (పై. 5.118.21,1438) రాజమండ్రి | ,, |
| నడిపి[ం]పి (పై. 6.656.19,1417) సర్వసిద్ధి | విశాఖ |
| సమర్పింపెను (పై. 6.667.19,1422) | ,, |
| సమర్పింపెను (పై. 6.867.22,1452) | ,, |
| ఆవధరింపిరి (పై. 676.11,1430) | ,, |

తారు పాలింపిదేశాలం (పై. 6.1168.32,1434) సింహాచలం–విశాఖ
సమర్పింపి (పై. 6.1098.9,1402) ,,
సమర్పింపెను (పై 6.1071.4,1402) ,,
సమర్పించిన మోదాలు (పై. 5.1248.23,1471) శ్రీకూర్మం–శ్రీకాకుళం
మిగిలిన ప్రాంతాల్లో సమర్పించెను వంటి రూపాలే కనిపిస్తాయి.

తాలవ్యంకాని అచ్చుతో ప్రారంభమయ్యే ప్రత్యయాలు పరమైనప్పుడు చ>వు మార్పులేకపోవడం ఈ యుగంలో తరచుగా కనిపిస్తుంది. ప్రాతిపాలించక (*SII* 5.37.41,1494), అనుభవించుమని (పై. 4.800.22,1513), పాలించ నవ ధరించిన (పై. 4.709 25,1558), పాలించగా (పై. 4.936.18,1531) మొ.వి.

**5 44.** పరిమాణార్థకమైన కొలుచు ధాతువు అన్నంతమై-కల చేరేటప్పుడు చకరానికి యకారమవడం 15వ శతాబ్దిలో విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలో మాత్రం కనిపిస్తుంది. తెచ్చి కొలయంగలవాడు (*SII* 5.1184, 1403), శ్రీకూర్మం కొలాయంగలారు (పై. 6.817.17, 1403) సింహాచలం, తెచ్చి కొలయంగలారు (పై.6.711.17, 1409) సింహాచలం, నెఽ తు. 7 కొలాయ్యంగలాండు (పై. 6,850.10, 1418) సింహాచలం మొ.వి.

**5.45.** పూర్వయుగంలో కనిపించిన ఇస్తిమి సమర్పిస్తిమి, చేస్తిమి వంటి రూపాలు ఈ యుగంలో స్థిరపడ్డాయి. అయినా ఇచ్చితిమి, సమర్పించితిమి వంటి రూపాలు చాలా క్వాచిత్కంగా కనిపిస్తాయి. సమర్పించితిమి (*SII* 6.825.10, 1416) మొ.వి.

**5.46.** ఈ యుగంలో వెలయు ధాతువుక్కు వెలసును అనే తద్ధర్మార్థకక్రియ (*SII* 10.584.6, 1436; 6.655.6 1436) కనిపిస్తుంది. కొలుచు, చేయు ప్రాతిపదికలు విశేషణమైనప్పుడు కొలుసు, చేసు అవుతుంది. కొలుసువాండు (పై. 6.887.17,1425), చేసువాండు (పై. 5.1162.13,1427), చేసువారు (పై. 5.1250.10,1451) మొ.వి

**సమాపక క్రియలు**

**5.47.** సమాపకక్రియలు రెండు రకాలు (1) సామాన్య సమాపకక్రియలు (2) సంశ్లిష్టసమాపకక్రియలు. వచ్చినవాడు>వచ్చినాడు వంటివి సంశ్లిష్ట సమాపకక్రియలు. సామాన్యసమాపకక్రియలలో ప్రాతిపదిక + కాలబోధక ప్రత్యయం +

పురుషవచనప్రత్యయం అని మూడు విభాగాల్లున్నాయి. ఉదా: వచ్ + ఇ + రి > వచ్చిరి, వచ్ + ఎ + ను > వచ్చెను. మొ.వి.

**5.48.** సామాన్య సమాపకక్రియలు (అ) **భూతకాలం** : పురుషబోధక ప్రత్యయవిషయంలో పూర్వయుగానికీ ఈ యుగానికీ తేడా లేదు. కాలబోధక ప్రత్యయవిషయంలోనూ అట్లే తేడా కనిపించదు. కాని తాలవ్యహల్లుల తర్వాత ఎ > అ మార్పు ఈ యుగంలో స్పష్టంగా కనిపించటంచేత క్రియలలోను ఇది తరుచుగా కనిపిస్తుంది.

సమర్పించను (<సమర్పించెను) (*SII* 5.1228. 0 1503), సమర్పణ చేశను (చేసెను) (పై. 6 1078.12,1402), గుడి కట్టించను (కట్టించెను) (పై. 10.584 5,1486) మొ.వి. ఉత్తమ మధ్యపురుషల్లో -ఇతి కాలబోధక ప్రత్యయం. కాని ద్విత్వచకారం, యకారం, సకారంగామారి -ఇతిలోని -ఇ లోపిస్తుంది. ఉదా: ఇస్తిమి (*SII* 4.800 20,1518), సమర్పిస్తిమి (పై. 4.981.5,1518), ఇస్తిరి (పై. 10.784.12,1574). ఇస్తిని (పై. 10.747.11,1574). చేస్తిమి (పై. 5.48. 19, 1450) మొ.వి.

(ఆ) **వర్తమానభవిష్యత్తు** : వర్తమానభవిష్యత్ప్రత్యయం ప్రథమైకవచనంలో -ఎడి-/-ఎడు-, తక్కినచోట్ల -ఎద- అని పూర్వయుగంలో చర్చింపబడింది. ఈ -ఎద- ప్రత్యయం -ఏ-గా మారి నేడు తమిళనాడులో నివసిస్తున్న ప్రవాసాంధ్రుల వ్యవహారంలో ఉంది.[3] ఈ ప్రత్యయం ఈయుగంలో క్వాచిత్కంగా కనిపిస్తుంది. మీరు భీమేశ్వరుని ఊలిగము సేసేరుగాన (*SII* 4.1375.23, 1444), పాదాలు మా సిరస్సున ధరించేము (పై. 6.248.58,1515), ఇస్తేరు (ఇచ్చేరు) (పై. 10.748.26.1530) మొ.వి.

(ఇ) **భవిష్యత్తద్ధర్మం** : ఈ భవిష్యత్తద్ధర్మం విషయంలో పూర్వాయుగానికీ ఈయుగానికీ చెప్పుకోదగ్గ మార్పులు లేవు.

**5.49. సంశ్లిష్టరూపాలు** : ఈ సంశ్లిష్టరూపాలు క్రియాజన్యవిశేషణాలకు వాడు, వారు, అది, అవి అను సర్వనామాలు చేర్చగా ఏర్పడతాయి. ఈరూపాలకు ఉత్తమ మధ్యమపురుషల్లో పురుషవచన ప్రత్యయాలు చేరుతాయి. వచ్చువారము, వచ్చినవాడను మొ.వి. పై సామాన్య సమాపకక్రియలకు ఈసంశ్లిష్టసమాపక క్రియ

లకూ భేదమేమంటే పై వాటిలో ప్రథమైకవచనంలో మహదమహద్భేదా లుండవు. క్లీబవాచకంలో ఏకత్వబహుత్వభేదమూ ఉండదు. కాని ఇందులో వాడు, వారు,అది, అవి అనే సర్వనామాలు చేరటంచేత సర్వనామాల్లోకనిపించే లింగభేదం ఇందులోనూ కనిపిస్తుంది.

(అ) భూతకాలం : కట్టించినారు (*SII* 5 36.27,1422), సమర్పించినాడు (పై.5.1229.9,1495), పెట్టినారము (పై. 6.798.12,1425). ఇట్టివి భవిష్యత్కాలంలోనూ ప్రయోగింపబడుతాయి. యీ ధర్మము యిట్టపాలింపక ముందటికి యెవ్వరు దప్పినాను పంచమహాపాతకాలున్ను చేసిన పాపానం బోఇనారు (పై. 10.586.21,1448) మొ.వి. అయినది అనడానికి 'అఇంది' అనీ కనిపిస్తుంది. (పై. 5.1175.11.1419) మొ.వి.

(ఆ) వర్తమానం : శాసనాల్లో వర్తమాన క్రియారూపాలు చాలా అరుదు. కాబట్టి పూర్వయుగందాకా శాసనభాషలో వర్తమాన క్రియారూపాల్ని గురించి అట్టే తెలియటం లేదు, కాని ఈ యుగంలో సామాన్యసమాపకక్రియారూపాలు కొన్ని కనిపించాయి (చూ§. 5.48(అ), సంశ్లిష్ట వర్తమానార్థకరూపం ఒక్కచోట మాత్రం కనిపిస్తుంది. సేవచేస్తున్నాండు (*SII* 4.936.27,1453). ఈ యుగంలో శత్రర్థంలో -చున్ ప్రత్యయంతోడి రూపాలు తగ్గి -తున్ ప్రత్యయంతోడి రూపాలు ఎక్కువవటంచేత చేస్తున్నాడు వంటి రూపాలు వర్తమానార్థంలో ప్రచారంలో ఉండేవని చెప్పవచ్చు (చూ§. 5.58).

(ఇ) భవిష్యత్తు : అన్నంత క్రియారూపాలకు -కల చేరితే భవిష్యత్క్రియాజన్యవిశేషణ మేర్పడుతుంది. చేయు-చేయంగల మొ.వి. ఇట్టివాటికి రెండురకాలైన ప్రత్యయాలు చేరి సమాపకక్రియలు అవుతాయి. (1) పై భూత, వర్తమానక్రియల లాగానే వాండు>అండు, వారు>అరు, అది, అవి చేరి సమాపకక్రియలుకావచ్చు. (2) విశేషణరూపాలకు -ండు -రు, -వు, -ను, -ము చేరి సమాపక్రియలు కావచ్చు. ఉదా : జరపంగలవాండు (*SII* 5.129 7,1422), చేయంగలారు (పై. 5.1180.12, 1402), పెటంగలారు (పై. 6 1100 8, 1407), మొ.వి. (2) పెటంగలడు (పై. 6.1062.11,1102), కొలువం గలదు (పై. 6.1072.8, 1413) (స్త్రీ), కొలువంగలదు (పై.6.710.12,1409), వెలువం గలదు (పై. 5.1165.15,1460) (క్లీబం) మొ.వి. ఈ రెండు రకాల రూపాలూ విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలో మాత్రం కనిపిస్తాయి.

పై సంశ్లిష్టరూపాల్లో 5.47 ఇ (2) తప్ప మిగిలినవన్నీ క్రియావిశేషణాల పైన సర్వనామాలుచేరగా ఏర్పడినవే కాబట్టి అవి కర్తృస్థానంలోనూ క్రియాస్థానం లోనూ వస్తాయి. ఈ క్షేత్రం అపహరించినవారు పంచమహాపాతకాలున్ను చేసిన వారు (*SII* 6.242.24.1427) మొ.వి.

**5.50.** కాలబోధకాలు కానటువంటి సమాపకక్రియలైన వ్యతిరేకార్థక క్రియలు, విధ్యర్థకక్రియలు మున్నగువాటివిషయంలో విశేషాలేమీ లేవు. కాని సంశ్లిష్ట విధ్యర్థక క్రియారూపాల విషయంలో కొన్ని విశేషాలున్నాయి. ఈ సంశ్లిష్ట విధ్యర్థక క్రియలు తద్ధర్మక్రియావిశేషణాలకు-అదిచేరగా ఏర్పడుతాయి. తద్ధర్మార్థక క్రియా విశేషణాలు నాల్గురకాలు. కాబట్టి నాలుగురకాల క్రియావిశేషణాలపై -అది చేర్చగా విధ్యర్థక క్రియారూపా లేర్పడుతాయి; వాటిలో (1) పోయినది (*SII* 10.97.97,) నడుపునది (పై. 4.1104.6,). (2) కొనెడిది (పై. 10.421.94), ] పొందిడిది (పై. 5.194 14); పొందెడి>పొందిడి వంటిమార్పు గతయుగంలోనే క్వాచిత్కంగా కనిపిస్తుంది. (3) రక్షించేది (*NI* 2.28 A. 15), ఎత్తేది (*SII* 10.334.90,) వంటి రూపాలు పూర్వయుగంలో బహుళ ప్రచారంలో ఉండేవి. ఈ యుగంలో అవధరించిది (*SII* 4.981.5.1518), కావసేసిది (పై. 10.747.17,1574) వంటి రూపాలు తరచుగా కనిపిస్తున్నాయి. ఇట్టి రూపం పూర్వయుగంలో ఒక్క చోట మాత్రం కనిపిస్తుంది. పెట్టేది (*SII*. 10.334,92). ఇదిగాక ఈ యుగంలో అవధరించేది (తె.శా,1.156.14) రూపాలు కూడా క్వాచిత్కంగా కనిపిస్తాయి.

**అసమాపక క్రియలు**

**5.51. చేదర్థక క్రియలు :** చేదర్థకరూపాలు పూర్వయుగంలో ప్రాతిపదికకు -ఇనన్, -ఇనాన్ చేరగా అయ్యేవి. వచ్చు -వచ్చినన్, -వచ్చినాను. -ఇతేను లేక -తేను కూడా గతయుగంలో క్వాచిత్కంగా కనపించాయి. కాని ఈయుగంలో -ఇతేను, -తేను రూపాలే చాలా ప్రబలంగా కనిపిస్తాయి. వేస్తేను (*SII* 5.26.3, 1412), కొటితే (పై. 5.1312.9,1599), అంపితేను (పై. 10.751.10,1592), దయచేస్తేను (పై. 10.751.22, 1592), తిలమైపోతేను (పై.10.739.7,1583), విన్నపంచేస్తేను (పై. 10.745.25,1530), -ఇనాన్ చేరినవి కూడా కనిపిస్తాయి. తప్పినాను (*SII* 4.981.5.1518), విఘ్నము చేశినాను (పై. 10.785,17, 1521) మొ.వి.

**5.52.** క్రియాప్రాతిపదికకు ఆత్మార్థకబోధకంగా -కొను చేరడం సాహిత్య భాషలో చూస్తున్నాం. ఇట్టిచోట్ల -క చేరడం నేటి వ్యావహారికభాషలో సహజం. ఇట్టి -క చేరిన రూపాలు ఈ యుగపుభాషలో క్వాచిత్కంగా కనిపిస్తాయి. ఆ చంద్రార్కము చేసుక (*SII.* 5.30.16,1450). చేసుక (*NI* 3. పొదిలి 34. 18, 1588). చేయు, పోయు మొదలగు యకారాంత ప్రాతిపదికలకు చేసికొను, పోసికను మొదలగు రూపాలే సారస్వతభాషలో ఉంటాయి. కాని ఈ యుగపు శాసనాల్లో చేసుకొని (*SII* 4.709. 34, 1558). వంటి రూపాలు క్వాచిత్కంగా కనిపిస్తాయి.

**5.53.** **శత్రర్థక రూపాలు :** శత్రర్థకరూపాలకు -చున్ ప్రత్యయంచేరడం తెలుగుభాషలో పూర్వయుగం దాకా కనిపించింది. ఈ -చున్ ఈ యుగంలోనూ క్వాచిత్కంగా కనిపిస్తుంది. చేయుచుం (*SII* 10.737.41,1526). కాని -తు లేక -తున్న ఈ యుగంలో ప్రచురంగా కనిపిస్తుంది, పృథ్వీ రాజ్యం చేస్తుంది (*SII* 4.800.11,1518), మళివస్తున్న (పై. 5.1312.11,1599), రాజ్యంపాలిస్తున్న (పై. 10.751.17,1592), విచ్చేస్తున్న (*తి.తి దే.శా.*3.68.1, 1514), మొ.వి.

**విశేషణాలు**

**5.54.** త్రికంలో ఒకటియైన 'ఆ' రూపం 'దానియొక్క, దానికి సంబంధించిన, అతనియొక్క, అతనికి సంబంధించిన' మొదలైన అర్థాలలో కూడా వాడబడుతుంది. మిఱుత వెలుగరంవండసు ఖ 1న 10ను ఆ పెరటిపట్టు (*SII.*5.145.16,1413), కంచుం బళ్యెమున్ను ఆ కుడుకాను (పై. 5.47.17, 1424), ఆ మీంది విలువు మంటపమున్న (పై. 5.36.25,1422), అల్లాడరెడ్డిగార్కిని ఆ కుమారులు కుమారయ్యం గార్కిని... (పై. 5.104.5,1423), వీరభద్రయ్యంగారున్ను ఆదేవులు అనతల్లెంమంగారున్ను (పై. 5.109.7, 1523), చిత్రవు భీమన్నాను ఆ మల్లన్నాను (పై. 5.47.7,1424) మొ.వి. ఇట్టివి పూర్వయుగంలో కూడా క్వాచిత్కంగా కనిపిస్తాయి.

**5.55.** ము వర్ణానికి -పు-, -ప్పులు రావడం పూర్వయుగం చివరిదశలోనే విరివిగా జరిగింది. ఈ యుగంలోనూ దీని వాడుక విరివిగా కనిపిస్తుంది. ఉత్తరపు దిక్కు (*SII.* 4.789.226,1518), మధ్యాహ్నపు అవసరానను (పై. 5.118. 11, 1438), నారికేళపుం గాయలు (పై. 4.702.138, 1438) మొ.వి.

**5.56.** ఉదంతస్త్రీసమంపైన ద్రుతం రావడం పూర్వయుగంలోలాగానే జరుగుతుంది. కంచుం బళ్ళెము (*SII* 5.47.17,1424), కంచుంబ్రతిమ (పై. 5.1165.8, 1460), కంచుంబుత్తడి (పై. 5.1175.14,1419). వీటి సామ్యంచేత ఊరుంగాయెలు (పై. 4.981.7, 1518) వంటి రూపాల్లోనూ అనుస్వారం కనిపిస్తుంది.

**5.57.** వైభాజిక ప్రత్యయం : పూర్వయుగంలో -చేసి, -ఏసి రూపాలు రెండు కనిపించాయి. కాని చివరిదశలో -ఏసి మాత్రం కనిపించింది. ఈ యుగంలో -ఏశి మాత్రం కనిపిస్తుంది. పుట్టిందేశి (*SII* 5.26.7, 1412). మొ.వి. సి > శి మార్పు చాలా ప్రబలంగా ఉండటంచేత -ఏశి అని సాధారణంగా కనిపిస్తుంది.

**5.58.** పరిమాణార్థంలో 1. -ఎండు/-ఎడు. 2. -అండు/-అడు చేరినట్లు పూర్వయుగంలో చూశాం. అందు రెండోది విశాఖ-శ్రీకాకుళం ప్రాంతంలోనే ప్రచారంలో ఉండేది. మొదటిది మిగతా ఆంధ్రదేశంలో బహుళ ప్రచారంలో ఉండి రానురాను విశాఖ-శ్రీకాకుళం ప్రాంతానికి పాకుతూ ఉండేది. ఈ యుగంలో ఈ రెండురకాలైన ప్రత్యయాలూ విశా-శ్రీకాకుళం ప్రాంతంలో ప్రచారంలో ఉన్నాయి. పుట్టెడు ఈ క్షేత (*SII* 6.668.44,1437), అడ్డడు (పై. 6.1070.9.1420), రెండూ విశాఖ జిల్లాలోనివే. ఔపవిభక్తికరూపాలతోడి సామ్యం వల్ల -డుకు బదులు -టి కొన్నికొన్ని చోట్ల కనిపిస్తుంది. అద్యంటి లెక్కను (*SII* 5.1180 10, 1402), తూమింటి సమస్య (*NI* 2. కందుకూరు 88.15, 1526). మొ వి.

**5.59.** సంఖ్యకు పూరణార్థకంలో పూర్వయుగంలో -ఆగున్, -అవున్, -అవన్ మాత్రం ఎక్కువ ప్రచారంలో ఉన్నట్లు చూశాం. -ఓ ఒక్కటి మాత్రం కనిపించింది. కాని ఈ యుగంలో ఓ కూడా చాలా ప్రచారంలోకి వచ్చింది. నాల్గో భాగమున్ను (*SII* 4.669.36,1546), రెండోమేళం (పై. 5.702.149,1548) మొ.వి.

క్రియావిశేషణాలు :

**5.60.** భూతకాల క్రియావిశేషణాల్లోనూ, భవిష్యత్క్రియావిశేషణాల్లోనూ పూర్వయుగానికి ఈ యుగానికి తేడా ఏమీలేదు. వర్తమానక్రియావిశేషణాలు శాసనాల్లో అరుదుగా ఉంటాయి. కాని తద్ధర్మార్థకక్రియావిశేషణాల్లో పూర్వయుగంలో

నాల్గురకాలైన వాటిని చూశాం. వచ్చువాండు, వచ్చేడివాండు, వచ్చెవాండు, వచ్చి వాండు. ఆ నాల్గూ ఈ యుగంలో కనిపిస్తున్నాయిగాని ఈ యుగంలో -ఇ, -ఏ ల తోడి రూపాలే విరివిగా కనిపిస్తాయి. Φ-తోడివి చాలా అరుదు. -ఎడి తోడివి క్వాచిత్కంగా ఉంటాయి. ఈ -ఎడి తరుచుగా -ఇడి అయిపోయింది.

(అ) -ఎడి/-ఇడి : సిద్ధ (సాధ్యంబు) లనియెడి అష్టభోగస్వామ్యాలు (*SII* 4.800.22,1518), యేలెడికాలమందు (పై. 10.579.7, 1413), దేవరం గొలిచిడిసానులు (పై. 6.668 15, 1437) మొ.వి.

(అ) -ఏ/-ఎ : తోటజేశె తోంటబంటు (*SII* 5.34.19, 1334), బొమ్మ విహళ్లి అనే గ్రామము (పై. 4.789.150, 1518), వుండే అట్టుగానున్న (పై. 4.789.203, 1518); చెల్లె చతుశ్శీమలూను (పై. 4.800.20,1518, 6.695.2, 1519), నడచే భోగబిహాలం (పై. 6.665.3, 1519) మొ.వి. అనుధాతువుకు 'నే' అనే విశేషణరూపం కనివిస్తుంది. తిరుపతినే ఊరి ఉత్తరాన (పై. 5.102.4, 1442).

(ఇ) -ఇ ఇది గుంటూరు- తూ. గోదావరి మధ్యలో విరివిగా కనివిస్తుంది. విశాఖలో క్వాచిత్కంగా కనిపిస్తుంది.

| | |
|---|---|
| శ్రీబృందావనం సేసి భావనకు (*SII* 5.104.13, 1423) | తూ. గోదావరి |
| కల్యాణ మవధరించ్చి య్యేప్పటికి (పై. 5.118.50, 1416) | ,, |
| ఆ తోంట సేసి వల్లబసెటి గుండాయ (పై. 5.145.11,1413) | ప. గోదావరి |
| చెల్లివచ్చి క్షేత్రము (పై. 4.772.8,4487) | కృష్ణా. |
| దేవరకు కట్టించి బద్రం (పై. 4.776.6, 1433) | ,, |
| సింగవరము అని అగ్రహారమున్ను (పై. 4.789.152,1518) | ,, |
| ప్రతిష్టచేశి కాలమందు (పై. 4.686.17, 1580) | గుంటూరు |
| నగరికి పెట్టి కట్నములు కానికలు (పై. 4.699.24, 1546) | ,, |
| వెల్లిగండ్ల అని గ్రామము (పై. 4.702.107, 1518) | ,, |
| సేవచేసి అందుకై (పై. 6.1088.10, 1459) | విశాఖ |
| తారు పాలింపి దేశాలంగల (పై. 6.1168.12, 1422) | ,, |

ఈ యుగంలో విశాఖకు దక్షిణంలో కోస్తాజిల్లాలో -ఇ, -ఎ ప్రత్యయాలు తప్ప తక్కినవి అరుదు.

## వాక్యాలు

**5.61**. శాసనభాషలోని వాక్యాల్ని స్థూలంగా రెండు రకాలుగా చెప్పవచ్చు. 1. సామాన్యవాక్యం. 2. సంశ్లిష్టవాక్యం. సామాన్యవాక్యాల్ని రెండుగా చేయవచ్చు. 1. క్రియాసమాపకం. 2. విశేషణసమాకం.

**5.62. క్రియాసమాపక వాక్యం.** ఇందులో ఒక సమాపకక్రియ తప్పని సరిగా ఉంటుంది. దానికి కర్తృపదం ప్రథమావిభక్తిలో ఉంటుంది. ద్వితీయాది విభక్తులతోడి నామపదాలు కూడా అయా సందర్భానికి తగినట్టు రావచ్చు. భావయ ప్రసాదించిరి (*SII* 5.26.7,1412), మల్లసానమ్మ సమర్పింపెను (పై. 5 34. 27, 1434) మొ.వి. పై వాక్యాల్లో భావయ మల్లసానమ్మ కర్తలు. ప్రసాదించిరి, సమర్పింపెను క్రియలు. యీ మండపము నరహరి నేనింగారి పంపున కిరిలేంక శిరిగిరి నేండు గట్టించెను (పై. 5. 133.7,1416). ఈ వాక్యంలో కట్టించెను క్రియ ఈ మండపము కర్మ, కిరిలేంక శిరిగిరి నేండు కర్త, నరహరి నేనింగారి పంపున తృతీయావిభక్తితోడి పదబంధం. కర్తలోపించికూడా వాక్యం రావచ్చు. ఉగ్రని చింగబోఇని కొడుక పోలబోఇని గోచరవెటితిమి (*SII* 5.6,1445).

పై విషయాల్లో సాహిత్యభాషకూ, శాసనభాషకూ వ్యత్యాసం ఏమీ లేదు. కాని కర్తకు సమాపక క్రియకుగల సంబంధంవిషయంలోకొన్ని వ్యత్యాసాలు కనిపిస్తాయి. సాహిత్యభాషలో కర్త ఏ పురుషలో ఉంటుందో క్రియకూడా ఆ పురుషలోనే ఉంటుంది. శాసనాల్లో అలాంటి వాక్యాలు ఉంటాయి. కాని అక్కడక్కడ శాసనాల్లో కర్త ప్రథమపురుషలోనూ, క్రియి ఉత్తమపురుషలోనూ కనిపిస్తాయి. కొటికలపూండి గంగయ్యను కాని పాపకామినేండున్ను...సమర్పణ చేస్తిమి (*SII* 5.48.11.19, 1450). ఇందు గంగయ్య, కామినేండు కర్తృశబ్దాలు. సమర్పణచేస్తిమి సమాపక క్రియ. ఇలాంటి వాక్యాలు శాసనాల్లో ఉన్నాయి. కాని ఇట్టివి భాషలో వ్యవహారంలో ఉన్నట్లు చెప్పలేము. శాసనాలు వ్రాసేటప్పుడు పేరు చెప్పాలి కాబట్టి కర్త పేరుచెప్పి ఆ కర్తకు సంబంధించిన క్రియ ఉత్తమపురుషంలో వ్రాయబడ్డదేమో !

కర్త గౌరవార్థరూపంలో ఉన్నా సమాపకక్రియ ఏకవచనంలో ఉండవచ్చు. నరహరిం నేనింగారు...కల్యాణమండపం గట్టించెను (*SII* 5.133.12-16,1416), వీరనంగారు...ధారవోశి సమర్పించెను (పై. 5.49.10-17,1458)మొ.వి.

**5.63. విశేషణసమాపక వాక్యం:** ఇందులో సమాపకక్రియకు బదులు విధేయ విశేషణం ఉంటుంది. ఉదా: ఇయ్యవసరం ఆచంద్రార్కస్థాయి. (*SII*. 5.5.14, 1404). ఇందు ఇయ్యవసరం కర్త. దీనికి ఆచంద్రార్కస్థాయి విధేయవిశేషణ మవుతుంది. ఇలాంటి వాక్యాల్లోనూ ద్వితీయాదివిభక్తి ప్రత్యయాలతోడి నామ పదాలు సందర్భానుసారం రావచ్చు. కర్త లోపించవచ్చు. ధర్మం పాలించి వారికి దాసిదాసిని (*SII* 4.772.13,1437). ఈ వాక్యంలో దాసిధాసిని అనేది విధేయ విశేషణం, కర్తయైన నేను పదం ఇందు లోపించింది.

విధేయవిశేషణస్థానంలో సంశ్లిష్టసమాపకక్రియకూడ రావచ్చు. అబ్బిన ఆ చంద్రార్కమును గుగ్గిలము జరపంగలవాఁడు (*SII* 5.129.7, 1422). చారిత్రకంగా ఇట్టి సంశ్లిష్టసమాపకరూపాలు మొదట విధేయవిశేషణంగా ఉండినట్లు చెప్పవచ్చు. తర్వాత ఇది సామాన్యసమాపక క్రియలాగానే ప్రయోగంలోకి వచ్చినట్లు తెలుస్తుంది. ఈ రూపం ఎప్పటిదాకా విధేయవిశేషణంగా ఉండి ఎప్పటినుండి సమాపక క్రియగా మారింది అని చెప్పడం చాలా కష్టం. కాని శాసన ప్రయోగాల్ని బట్టి ఈ కిందివి గమనించవచ్చు.

సాధారణంగా శాసనభాషలో భూతకాలవిషయాల్ని చెప్పవలసి వచ్చినపుడు సామాన్యసమాపకక్రియనూ, భవిషద్విషయాన్ని చెప్పవలసి వచ్చినప్పుడు సంశ్లిష్ట సమాపక క్రియనూ వాడటం తరుచుగా కనిపిస్తుంది. వర్తమానవిషయం శాసనాల్లో అట్టే కనిపించదు. ఉదా: పొందూరి నాగలాజు...క్రయముగొని పెట్టెను. ఆక్షేత్రము అనుభవించి వారణాశి మారనంగారి కొడుకు అబ్బిన ఆ చంద్రార్కమును గుగ్గిలము *జరపంగలవాఁడు* (*SII* 5.129.7,1422). ఇట్టి పద్ధతి పూర్వయుగంలోనూ ప్రచారంలో ఉన్నట్లు గమనింపవచ్చు. ఇలా భవిష్యత్కాల సూచక సంశ్లిష్టసమాపకక్రియలు సామాన్యసమాపక కియలలాగానే వర్తిస్తాయి. కాని భూతకాల సంశ్లిష్టసమాపకక్రియారూపాలు శాసనాల్లో తరుచుగా విధేయవిశేషణాల్లాగా వర్తిస్తాయి. క్వాచిత్కంగా సమాపకక్రియల్లాగ వర్తిస్తాయి.

యీ ధర్మమ్ము యిట్ట పాలింపక ముందటికి యెవ్వరు దప్పినాను పంచమహాపాతకాల్భుంన్ను చేసిన పాపానం బోఇనారు. (*SII* 10 586.21, 1448). ఇందు పోఇనారు అను భూతకాల సంశ్లిష్టసమాపకరూపం విధేయవిశేషణంగా వాడినట్లు

గుర్తించవచ్చు. ఈ క్షేత్రం అపహరించినవారు పంచమహాపాతకాలున్ను చేసిన వారు (*SII* 6.242.24,1447). ఇందు అపహరించినవారు కర్తృస్థానంలోను, చేసిన వారు విధేయవిశేషణస్థానంలోనూ ఉన్నాయి.

మాకిసటి...కోహలి సమర్పించినాడు (*SII* 5.1229.7-8,1495), ఇందు సమర్పించినాడు రూపం కేవలం సమాపకక్రియగానే ప్రయోగింపబడ్డది. కర్త ఏకవచనంలో ఉన్నా గౌరవార్థం క్రియ బహుత్వంలో ప్రయోగించడం ఈయుగపు శాసనాల్లో క్వాచిత్కంగా కనిపిస్తుంది. ఇక్కైంకర్యం 'శృంగారరాయండు ఆచంద్రార్కముగాను అవదరించువారు (*SII* 5.102.12,1442). యిక్కైంకర్యం శ్రింగారరాయండు ఆచంద్రార్కముగాను అవధరించువారు (పై. 5.108.16-19,1408). పై వాక్యాల్లో శృంగారరాయండు ఒక దేవతపేరు. కర్త ఏకవచనంలో ఉంది. అవధరించువారు అనే క్రియ గౌరవార్థంగా బహుత్వంలో వాడబడి ఉంది.

**సంశ్లిష్టవాక్యం**

**5.64.** సామాన్యవాక్యం ప్రధానంగా ఉండి అది ఆధారంగా ఒకటన్నా ఉపవాక్యం ఉండే అట్టిదాన్ని సంశ్లిష్టవాక్యం అనవచ్చు. 'యీ ధర్మానకు యెవ్వరు తప్పినాను, గంగలోను గోవు బ్రాహ్మణవధ చేసిన పాపానం బోఉవారు (*SII* 4.981.5.1518). ఇందు 'యీ ధర్మానకు యవ్వరు తప్పినాను' ఉపవాక్యం. మిగిలింది ప్రధానవాక్యం..

పై వాక్యాన్ని యత్తదర్థక వాక్యం అనవచ్చు .ఈ యత్తదర్థక వాక్యాల్లో సాధారణంగా ఎవరు...వారు... అని ఉంటుంది. కాని యీ యుగపు శాసనాల్లో ఎవరు అని ప్రశ్నార్థకశబ్దం కనిపిస్తుంది. కాని వారు అని తదర్థకశబ్దం లేకే వాక్యం ముగింపబడుతుంది. ఎవ్వరేనేమి ప్రతిపాలించక విరుద్ధంగా నాడితా గోహత్యా, బ్రహ్మహత్యాదిపాతకాలు చేసిన పాపాలం బొంది ఆరవయి వేశేండ్లుమహారౌరవాది నరకాలం గూలువారు (*SII* 5,37, 1494), ఘడియారం బ్రాహ్మల గోత్రాలకు ప్రవిత్తిపన్ను పరచుం ఎవ్వరు గొనం దలచిన బ్రాహ్మనిం జంపిన దోషానం బోవారు (పై.5.10,1404), ఎవ్వరు విరోధించినా మహాపాతకాల ఘడువారు (పై. 5.29, 1402). ఎవ్వరు శబ్దం బహువచనరూపంగాను, ప్రధానవాక్యంలోని క్రియ ఏకవచనంలోనూ ఉండే వాక్యం ఈ యుగపుశాసనాల్లో ఒక్కచోట కనిపిస్తుంది. ఎవ్వరు అపహరించినా దోషాన పోవువాఁడు (*SII* 5.204.15,1423).

సంకీర్ణం

**5.65.** కర్తృషష్ఠి క్రియావిశేషణాలకు కర్త నేటి వ్యావహారికభాషలో ప్రథమావిభక్తిలోనే ఉంటుంది. కాని ప్రాచీనకాలంలో షష్ఠీవిభక్తి విపుల ప్రచారంలో ఉండేది. ఉదా. రాముని చేసినపని మొ.వి. గతయుగం శాసనాల్లో ఇట్టి కర్తృషష్ఠి చాలా విరివిగా ప్రయోగంలో కనిపించింది. కాని ఈ యుగంలో ఇట్టివి చాలా అరుదు. [త]మ శే[ి]న సుకృతాలు (*SII* 5.10 13,1404) మొ.వి. చాలా స్వల్పంగా కనిపిస్తాయి. ఇలాంటిచోట్ల ప్రథమవాడడం ఈయుగంలో తరచుగా కనిపిస్తుంది. జన్యావుల కసవానాఇనింగారు చేయించిన వరువుంబని (పై.10.580. 8.1414), మొ.వి.

**5.66.** ఏవార్థంలో తెలుగుభాషలో-అ ప్రత్యయం మాత్రమే 12వ శతాబ్దిదాకా ప్రచారంలో ఉండేది. 12వ శతాబ్దినుండి 'ఎ' లేక 'ఏ' ప్రారంభమై 14వ శతాబ్దిలోగా ఇవిబాగా ప్రచారంలోకి వచ్చాయి. ఈ యుగంలో-అప్రత్యయం దాదాపు వ్యవహారంలో లేదనవచ్చు. ఎ ఏలు పూర్తి వ్యవహారంలోకి వచ్చినట్లు చెప్పవచ్చు. తమ మాతాపితాళ్ళనుతారె వధించిన దోషానపోవువారు (*SII* 6.219.25 1494), సూరనంగారే కట్టించినారు (పై. 5.36.25,1422) మొ.వి.

సముచ్చయార్థంలో ఈ యుగంలో అకారాంత శబ్దాలకు దీర్ఘం, దానితర్వాత -ను ప్రత్యయమూ, ఇకారాంతం తర్వాత న్ని ప్రత్యయమూ ఉకారాంతం తర్వాత -న్ను ప్రత్యయమూ బాగా ప్రచారంలోకి వచ్చాయి. కొమ్మనాను...పోలిన్ను .. నందిన్ని... (*SII* 5 38-67.10,1414) మొ. వి.

## జ్ఞాపికలు

1. M. Kandappa Chetty. A Study of 11 th century Inscriptional Telugu. *SVUOJ*. Tirupathi 1964, pp 33-40.
2. నాహిండు (*SII*110.321.9,1248),రాయబోహిడి (పై. 5.54.8,1293) మొ. వాటిలో యు > యి > హి కావడం గుర్తించవచ్చు. (చూ§5.16)
3. ఎం కందప్పశెట్టి, 11 వ శతాబ్ది వర్తమాన క్రియలు భారతి. సెప్టెంబరు 1968.

* శాసనాలు పూర్వయుగంలో ఉపయోగించినవన్నీ ఈ యుగంలోనూ ఉపయోగించబడ్డాయి. అవిగాక తిరుమల-తిరుపతి దేవస్థానం శాసనాలు (తి.తి.దే.శా) కూడా ఈ యుగానికి పనికి వచ్చినాయి.

ప్రకరణం 6

# శాసనభాషా పరిణామం

## (క్రీ. శ. 1600 - 1899)

— కె. కె. *రంగనాథాచార్యులు*

**6.0.** తెలుగు భాషా పరిణామాన్ని తెలుసుకోవడానికి లభించే ఆధారాలలో శాసనాలు ప్రధానమైనవి. అయితే శాసనాలు సమకాలీన భాషను సమగ్రంగా ప్రతి బింబిస్తాయని చెప్పటానికి వీలులేదు. గ్రాంథిక లేక ప్రాచీన, వ్యావహారిక భాషారూపాలు సమ్మిశ్రితమై శాసనాల్లో కనిపిస్తాయి. అంతేకాదు శాసనాల్లో ఉపయోగించిన భాష పరిమిత ప్రయోజనం, పరిమిత స్వరూపం కలిగిఉంటుంది. రాజవంశక్రమాలు, దేవాలయాలకు, బ్రాహ్మణులకు రాజులు చేసిన దానవివరాలు, రాజుల విజయయాత్రలు, రాజులు, రాజులప్రతినిధులు, వివిధ సమస్యల విషయంలో ఇచ్చిన తీర్పులు-ఇట్లా కొన్నిరకాలైన సమాచారాలను అందించటానికి శాసనాలను ఉపయోగించేవారు. మొత్తం మీద శాసనభాష రాజకీయ వ్యవహారాల్లో ఉపయోగించే ఒక ప్రత్యేక శైలికి చెందిందిగా పేర్కొనవచ్చు. ఇటీవల కాలం వరకు పెద్దలు రాసే ఉత్తరాల్లోను, రాతకోతల్లోను ఇలాంటి భాషను మనం చూడవచ్చు. కాకపోతే శాసనాల్లో వ్యావహారిక భాషారూపాలు ఎక్కువగా ప్రవేశించే అవకాశం ఉంది కాబట్టి తెలుగుభాషా పరిణామాన్ని తెలుసుకోవడానికి అవి ప్రధానాధారాలవుతున్నాయి.

ప్రస్తుత యుగంలో శాసనాలు చాలా తక్కువగా కనిపిస్తున్నాయి. ఈ ప్రకరణ రచనకు పరిశీలించగలిగినవి రెండు వందల ముద్రిత శాసనాలుమాత్రమే. ఈ యుగంలో ముఖ్యవిశేషం కుతుబ్‌షాహీల పరిపాలనలో ఆంధ్రదేశం ఉండటం. వారికీ, వారి ప్రతినిధులకూ సంబంధించిన శాసనాలు ఎక్కువగా ఉన్నాయి. మొఘల్ వంశీయుల ప్రతినిధుల శాసనాలు కూడా ఉన్నాయి. అందువల్ల ఈ కాలపు శాసనభాషలో దక్షినీ ఉర్దూ ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. అనేకమైన కొత్త ఆదాన పదాలు భాషలో కనిపిస్తాయి. 1802 నుంచి ఆంగ్ల భాషా పదాలు

కూడా శాసనాలలో కనిపిస్తున్నాయి. ఈ విధంగా ఈ కాలపు శాసన భాషకు చారిత్రక ప్రాధాన్యం ఉండటమే కాకుండా, తెలుగు భాష తన ఆధునిక స్వరూపాన్ని సంతరించుకోవటం ఈ యుగంలోనే ప్రారంభమవుతుంది.

### లేఖన పద్ధతులు — ఉచ్చారణ

**6.1.** ఈ కాలంలోని భాషా స్వరూపాన్ని గురించి చెప్పుకొనేముందు శాసనాల్లో గల లేఖన సంప్రదాయాలను గురించి, వాటికి, ఉచ్చారణకు గల సంబంధాన్ని గురించి కొన్ని విశేషాలు చెప్పుకోవలసి ఉంటుంది. ఉచ్చారణతో సంబంధంలేని లేఖ్యాక్షర సంకోచం (orthographic abbreviation) ఈ కాలపు శాసనాల్లో ఎక్కువగా కనిపిస్తుంది. ఉదా. గన్కు (గనుక) (*NI* 2 కందుకూరు 48.52,1650), అయ్ను (అయిన) (*NI* 3 ఒంగోలు 102.11,1762), యిచ్న (ఇచ్చిన) (*SII* 5.1221.9,1809)

**6.2.** రేఫమీద హల్లుని ద్విరుక్తంగా రాయటం రేఫకు బదులుగా వలపలగిలక రాయటం 16, 17 శతాబ్దుల్లో ఎక్కువగానే కనిపిస్తున్నా 18, 19 శతాబ్దులకి పూర్తిగా తగ్గిపోయిందనే చెప్పవచ్చు. ఉదా: రాజమార్తాండ (*SII* 7.845,2,1682), యెల్లగడ్డ (*SII* 6.79.3,1796)

**6.3.** మూర్ధన్య హల్లుమీద దంత మూలీయాలను రాసినా వాటి ఉచ్చారణ మాత్రం మూర్ధన్యమే అయివుంటుంది. ఉదా: షట్నంబు (*NI* 2 నెల్లూరు 33.63-64,1645),

**6.4.** ద్విలిపి ప్రయోగం (Use of digraph): తాలవ్యచకారోచ్చారణను, శకారోచ్చారణను సూచించటానికి చ, సలకు 'య' కారసంకేతాన్ని చేర్చటం క్వాచిత్కంగా కనిపిస్తుంది. ఉదా: అచ్యంద్రార్కస్థాయిగా (*SII* 10,771.14,1692), స్యూక్రములు (*SII* 10.771.15,1692).

**6.5.** 9/10 శతాబ్దులనుంచి కనిపించే పూర్ణానుస్వారాన్ని సూచించటానికి అనుస్వార చిహ్నంపైన హల్లులను ద్విరుక్తంగా రాసే అలవాటు (§ 3.23), కొన్ని అపవాదాలున్నా, 17, 18 శతాబ్దులలో ఎక్కువగానే కనిపిస్తుంది. అర్ధానుస్వారానికి ప్రత్యేక చిహ్నం శాసనాలలో కనిపించదు. పూర్ణానుస్వార చిహ్నాన్నే దానికి వాడేవారు. అయితే దానిపైన హల్లును ద్విరుక్తంగా రాయకపోతే దాన్ని

అర్ధానుస్వారంగా గుర్తించవలసి ఉంటుంది. ఉదా : అంగ్గడి (*SII* 5.874.14, 1620), వుండ్డె (*SII* 7.790 5.1714), వెంక్కటి (*SII* 7.558.13,1856). చారిత్రక దశలో అర్ధానుస్వారం పూర్వోచ్చ అనునాసిక్యతకు చిహ్నం అయి ఉంటుంది. అది ఈ యుగంలో తన విలువను పూర్తిగా కోల్పోయిందని చెప్పటానికి చారిత్రకంగా అనుస్వారంఉండి అనుస్వార చిహ్నంలేకుండా రాసిన కొన్ని రూపాలే నిదర్శనం. ఉదా : తోపు (< తోంపు) (*SII* 10.763.6,1670), నాడు (< నాండు) (*SII* 5.1221.3,1809).

**6.6.** ద్విరుక్త స్పర్శాలకు బదులుగా మహాప్రాణస్పర్శాన్ని రాయటం ఈ యుగంలో కనిపిస్తుంది. ఉదా : లెఖ (= లెక్క) (*SII* 10 757.28, 1650), మఖ (= మక్క) (*NI* 2 కందుకూరు 44.38,1650). ఇది 15, 16 శతాబ్దుల్లోకూడా కనిపిస్తుంది. ఉదా. ఇధరి (= ఇద్దరి) (*SII* 6 884.9, 1408, (*SII* 16.257.48,1563), బొభిలి (= బొబ్బిలి) (*SII* 6.798 8. 1425). ఇంతకుముందు సంస్కృతాదానాల్లోకూడా ఈ అలవాటు కనిపిస్తుంది. ఉదా : సుధ (= శుద్ధ) (*SII* 5.1194.3,1455), ప్రఛన్న (= ప్రచ్ఛన్న) (రా. వా. 1938.107.20.16 వ శ.) దీన్నిబట్టి సంస్కృతాదానాల్లోని ద్విరుక్త మహాప్రాణాలు ద్విరుక్త అల్పప్రాణాలుగా ఉచ్చరింపబడేవనీ, కాని అద్విరుక్త మహాప్రాణాలుగా రాయబడేవనీ, ఉచ్చారణలోమాత్రం అవి ద్విరుక్త అల్పప్రాణాలేననీ, తత్ఫలితంగా తెలుగులోని ద్విరుక్త అల్పప్రాణ స్పర్శాలను కూడా అద్విరుక్త మహాప్రాణాలుగా రాసేవారనీ ఊహించవచ్చు.

**6.7.** ద్విరుక్త, సంయుక్త అనునాసికాలకు, అనునాసికం + య సంయుక్తాలకూ ముందు అనుస్వార చిహ్నం కనిపిస్తుంది. బహుశా అది పూర్వోచ్చ అనునాసిక్యతకు చిహ్నం కావచ్చు. ఉదా. తింమ్మాశెట్టి (*SII* 10.775.7, 17 వ.శ.), జంన్మాలు (*NI* 2 కందుకూరు 48.88,1650), సౌంమ్య. (*SII* 10.761.1,1669).

**6.8. లేఖనభేదం :** లేఖన భేదానికి ఏడు రకాల కారణాలను పేర్కొనవచ్చు. (i) ఉచ్చారణ భేదం (Phonemic and sub-Phonemic veriation): (a) పదాదిలో తాలవ్యాచ్చులకు, ఓష్ఠ్యాచ్చులకు వరుసగా యకార పూర్వక తాలవ్యాచ్చులకు, వకార పూర్వక ఓష్ఠ్యాచ్చులకు భేదకత్వం లేదు. ఉదా : (ఇచ్చి/)

యిచ్చి (*SII* 10.758.10.1658), (ఎనుబోతు/) యెనుబోతు (*SII* 10.758.57,1600), ఉండేది/వుండేది (*SII* 40.781.6, 17 వ శ/*SII* 10.769.21, 1691), (ఊరు/) వూర్కి (*NI* 2 కందుకూరు 20.18,1640), (ఒడయలు/) వొడయలు (*SII* 10.755.2,1604). తాలవ్యాచ్చులకు ముందు, ఓష్ఠ్యాచ్చులకు ముందు క్రమంగా-య-;-వ-లను లోపింపజేయడం కూడా లేఖనంలో కనిపిస్తుంది. ఉదా : అఇదు (*NI* 3 రాపూర్ 49.14,1638, చెరుఉ (*SII* 7.557.8,1636). (b) వ, వొ/వొ,వో : వకారంపైన నిమ్నాచ్చుకు ఓష్ఠ్యోచ్చారణ ఉంది. వర్ణవిధేయంగాను, ఉచ్చారణ విధేయంగాను లేఖన భేదం శాసనాల్లో కనిపిస్తుంది. ఉదా : వందురు/వొందురు (NI 1 CP 9.30,1686/13.92, 1541), -వోరు (వారుకు బదులు) (*SII* 16.254.10,1562). పై లేఖన పర్యాయత ఉచ్చారణార్థం ఒ, ఓ లకు ముందు వకారం చేరిన చోట్లకూడా కనిపిస్తుంది. ఒడయలు/వొడయలు/వడయలు ( *SII* 10.748.9-10,1580/*SII* 10.745.4,1530/*NI* 3 ఒంగోలు 132.9,1448). వారుగంటి (ఓరుగంటికి బదులుగా) (*SII* 7.372.6.1459). (c) అ/ఒ : ఓష్ఠ్యాలకు ముందు నిమ్నాచ్చుకు ఓష్ఠ్యోచ్చారణ ఉండటంవల్ల ఈ భేదం కనిపిస్తుంది. ఉదా : తవ్వించి/తొవ్వించి (*SII* 7.564.6,1667/*NI* 1 గూడూరు 88.4,1791). (d) ఎ/ఒ : ణకు ముందు ఎ⟶ఒ మార్పుకారణంగా కావచ్చు ఈ లేఖనభేదం కనిపిస్తుంది. ఉదా : రెండు / రొండు (*SII* 4.280.29,1556 / *SII* 5.874,8,1620). (e) ఎ/ఏ (æ) : పూర్వం ఇయాంతాలుగా ఉండే శబ్దాలు 13/14 శతాబ్దుల కాలానికే ఎకారాంతాలుగా మారాయి. (కందప్ప చెట్టి §1.72-4). ఈ పదాలను శాసనాలలో భిన్న పద్ధతులలో రాయటం జరిగింది. అంటే-య,-ఎ,-అ లతో ఈ పదాలను రాయటం కనిపిస్తుంది. ఈ లేఖన భేదం 15. వ శతాబ్దినించే అన్ని ప్రాంతాలలోను (§ 5.7), ముఖ్యంగా ఒకేశాసనంలో కూడ కనిపిస్తుంది. దీనివల్ల ఇది ఒకే ఉచ్చారణను అంటే వివృత ఎ (æ) కారాన్ని సూచిస్తుందని చెప్పవచ్చు. ఉదా : పళ్యాలు/పళ్లెం/పళ్లం/పళాలు (*SII* 4.981.6,1518). ఎ,ఏల వివృతోచ్చారణను సూచించటానికి యకార చిహ్నాన్ని వాడటం ఈ కాలపు శాసనాల్లో కనిపిస్తుంది. ఉదా: మ్యేరకు (*NI* 3 రాపూరు 30.8, 1638). (f) మ/వ : ఇక్కడ వకారం అనునాసిక వకారానికి చిహ్నం కావచ్చు. ఉదా: (మామిడి/) మావిడి (*SII* 5.1228.7,1508/ *NI* 2 కందుకూరు 46.37, 1332). (g) స/శ : తాలవాచ్చులకు ముందు సకారానికి శకారోచ్చారణ

ఉందనటాన్ని ఇది సూచిస్తుంది. ఉదా : తీసి/త్రీశి (*NI* 2 కందుకూరు 48.30, 1650/*SII* 10.772.13,1696). (h) మ్ర/మ్బ్ర : మ, ర ల సంయుక్త వర్ణాలలో ఉచ్చారణలో బకారం చేరటం ప్రాచీనాంధ్రంలోను, ఆధునికాంధ్రలోను కనిపిస్తుంది. ఉదా : (తామ్ర/) తామ్బ్రం (*SII* 16.77.159,1525/) *NI* 2 కందుకూరు 48.47,1650). (I) ంవ/మ్వ; ంహ/మ్హ; ంస/మ్స : పూర్ణానుస్వార పూర్వకాలైన వ, హ, స లను రకరకాలుగా రాయటం ఇంతకు ముందు శాసనాల్లోను ఇప్పటి శాసనాల్లోను కనిపిస్తుంది. ఉదా : సంహత్సర (*NI* 2 కందుకూరు 20 4.1640), సంహ్వత్సర (*SII* 4.949.2,1761); సిహ్వాసన (*SII* 7.564.3,1667), సింహ్మాసన (*NI* 3 రాపూరు 35.7.8, 1634 ; మావసానకు (*SII* 10.771.16,1692). అనుస్వార పూర్వక ఊష్మాలపైన మకాని, వ (ఊష్మీకృత మకారం) గానీ కనిపించటం ఉచ్చారణకు సంబంధించిన రెండు విశేషాలను సూచిస్తుంది. (అ) అనుస్వారం, అంటే ఈ పరిసరంలో మకారం, ఓష్ఠ్య అనునాసిక ఊష్మంగా ఉచ్చరింపబడేది (ఆ) పై వర్ణక్రమం అంతా, అంటే ంవ, ంహ లు, ఓష్ఠ్యీకృతం అయ్యేది. ంహ వర్ణక్రమం హ్వ గా ఉచ్చరింపబడటం ఆధునిక కాలంలో కూడా చూడవచ్చు. ఆ కారణంవల్లే అప్పకవి ంహ, హ్వ లకు ప్రాస కలపటాన్ని నిషేధించాడు (2-261). అయినా ఉచ్చారణ ఆధారంగా కొందరు సమకాలీన కవులు వీటికి ప్రాస కలపటం జరిగింది. అందుకే హ్వ, ంహ లను ంహ్వ గా భావించ వద్దన్నాడు అప్పకవి (పై.). సంస్కృత పదాల్లోని హ్మ సంయుక్తాన్ని కూడా శాసన లేఖకులు రకరకాలుగా రాశారు. ఉదా: బ్రాంహణ (*SII* 7.790.9,1714). బ్రంహ్మాండ(*SII* 10.766.3.1678). ంహ(<హ్మ)వర్ణ వ్యత్యయఫలితంకావచ్చు. ంహ్మలేఖనం ంవ,ంహ సంయుక్తాలలాగే మొత్తంవర్ణక్రమం అంతా ఓష్ఠ్యీకృతం అయిఉంటుందనటానికి నిదర్శనం కావచ్చు. (ii) వర్ణభేదకత్వ తటస్థీకరణం (Neutralization of phonemic contrast) : ఒక పరిసరంలో రెండు వర్ణాలకు భేదకత్వం లేకపోతే ఆ పరిసరంలో రెండు వర్ణాల లిపి సంకేతాలను పర్యాయంగా రాయటం జరుగుతుంది. య కారం తర్వాత అ, ఆ లకు, ఎ, ఏ లకు భేదకత్వం లేకపోవటంవల్ల రెండు వర్ణాలను స్వేచ్ఛగా రాయటం శాసనాల్లో కనిపిస్తుంది. ఎ, ఏ లకు ముందు ఉచ్చారణకోసం యకారం చేరినచోట్ల కూడా ఈ లేఖన భేదం కనిపిస్తుంది. ఉదా ; (ఎవ్వరు/యెవ్వరు/) యవ్వరు (*SII* 5.120. 7,1640), (ఎల్ల/) యల్ల (*SII* 7.790.13,1714). అపదాది స్థానంలో కూడ ఈ భేదం కనిపిస్తుంది. ఉదా ; (ఆయెను/) ఆయను (*SII* 10,762.15-16,

1669), ధర్మ్ం యెందు (/యందు) (*NI* 2 కంమకూరు 48.56,1650). దేశ్య పదాల్లో చకారం తర్వాత కూడా అ, ఆ/ ఎ, ఏ లు పర్యాయతను పొందు తాయి. ఉదా : చెరువు/చరువు (*SII* 10.755.18,1604/*SII* 10.766.10, 1678). తెలుగులో తాలవ్య హల్లుల తరువాత ఎ,ఏ లు అ ఆ లుగా కనిపిస్తుం డగా సంస్కృతాదానాల్లో అ,ఆ లను ఎ,ఏ లుగా రాయటం మాత్రమే కనిపిస్తుంది. ఈ సందర్భంలో సంస్కృతంలో హ్రస్వ ఎకారంలేదన్న విషయాన్ని గుర్తించాలి. ఆ కారణంవల్ల తాలవ్య హల్లులపైన అకారం తాలవ్యతను పొందుతుందని చెప్ప వలసి ఉంటుంది. ఉదా : యెశము (*SII*10.772.21,1696), (iii) వర్ణాల పర్యాయ ప్రవృత్తి (**Phonemic free variation**) : లేఖన భేదం రెండు వర్ణాల పర్యాయ ప్రవృత్తిని కూడా సూచించవచ్చు. (a) ఉ/అ : ఉదా : కనుక/కనక (*SII* 10.773.11,1697/*SII* 5.874.10,1620). కనకస్వర సమీకరణంవల్ల ఏర్పడ్డ ఆధునిక రూపం. (b) ఐ/అయ్; ఔ/అవ్: ఐ/అయ్; ఔ/అవ్‌ల లేఖన భేదం ఈ రెండింటి వర్ణాశ్రిత పర్యాయ ప్రవృత్తిని సూచిస్తుంది. ఉదా : (ఐదు/) అయిదు (*SII* 7.558.10,1856). (c) ఎయ్యి/ఏయ్; ఉయ్యి/ఊయ్ : ఉదా : వెయ్యి (/వేయి) (*SII* 16.325.2-3,1638), (నుయ్యి/) నూయి (*SII* 10.760.9,1668). (iv) పదాంశ విధేయ/వర్ణవిధేయ లేఖనం : రెండు పదాంశాలమధ్య సంధి ఫలితంగా మార్పు వచ్చినా, పదాంశరూపాన్ని యథా తథంగా రాయటం పదాంశ విధేయ లేఖనం. ఉదా : పడ్లు/పళ్ల(కు) (*NI* 2 కందుకూరు 18.28,1408/*SII* 5.874.8,1620). (v) ప్రాంతీయ, వర్గమాండ లిక భేదాలు ; (a) ట/ష ; ఆధునిక కాలంలో కూడా కొన్ని బ్రాహ్మణ మాండలి కాలలో అటు, ఇటు మొదలైన పదాలలో ష కారం వినిపిస్తుంది. ఉదా ; యిషని (*SII* 16.312.31,1653), కలుషువంట్టి (*SII* 6.79.10,1796). (b) డ/ణ : కాండి/కాణి (*SII* 10.753.42,1500/*SII* 10.755.9,17వ శ.), (కట్టడము/) కట్టణము (*SII* 7.845.7,1732). (c) -అ/-ఎ : దేశ్య, తద్భవ, తత్సమ త్ర్యక్షర పదాల్లో మధ్యాచ్చు ఇకారం అయినప్పుడు చివరి అకారం ఎకారంగా కొన్ని మాండలికాలలో, ముఖ్యంగా దక్షిణ మాండలికంలో కనిపిస్తుంది. ఉదా : మాదిగ/మాదిగె (*NI* 2 కందుకూరి 48.65,1650/*NI* 2 నెల్లూరు 115.8-10, 1635), (d) ఏ/ఈ ; ఉదా : పోయీ (/పోయే) యందుకు (*SII* 10.753.51, 1600). (vi) శైలీ మిశ్రణం ; లేఖన భేదం శైలీ భేదాన్ని సూచించవచ్చు. ఇది మూడు రకాలుగా కనిపిస్తుంది. (1) ప్రాచీన/అర్వాచీన వర్ణక్రమం :

(a) గ/వ : (అగు/) అవు (*NI* 2 కందుకూరు 46.4,1682). (b) వ/గ ; (మువురకు/) ముగ్గురికి (*NI* 1 దర్శి 61.13,1718). ఇంతకుముందు శతాబ్దాల్లో కనిపించే హ/య ల లేఖన భేదంకూడా ఇలాంటిదే అని గ్రహించాలి. ఉదా : పహిండి / పయిండి / పైడి (*SII* 4.1344.6,1470 / *SII* 4.702.104,1518/ TTDES 3.32.2,1512). (2) సాహిత్య/వ్యావహారిక రూపాల మిశ్రణం ; బ్రతికేది (/బతికేది) (*SII* 10.771.15,1692), (మ్రాను/) మాను (*NI* 1 CP 8.24,1651). కొన్ని సందర్భాలలో ఇది ప్రాచీన వర్ణక్రమాన్ని పాటించటం వల్ల కూడా కావచ్చు. (3) ప్రామాణిక/అప్రామాణిక భేదాలు : ఇంతకు ముందరి శతాబ్దాలలో కనిపించే చ/స, చ/శ, శ/స, ష/స, తాలవ్యాచ్చుకు ముందు వకారం లోపించి, లోపించని రూప భేదాలు (రంగనాథాచార్యులు § 2.46.3) కాకుండా ఈ కింది భేదాలు ఈ కాలపు శాసనాల్లో కనిపిస్తున్నాయి. (a)/ణ న : (పుణ్యము/) వున్యము (*SII* 5.120.5,1640). (b) త్స్య/చ్చ : ఉదా. (మత్స్యదేశ/) మఛదేశ (*SII* 10.776.4,1786), (c) శ్ర/చ్చ : ఉదా : (అశ్రద్ధ/) అచ్చెద్ధ (*SII* 10.765.40,1678). (vii) ఆ దానపదాల్లోని వర్ణాలకు లేఖనచిహ్నం లేనప్పుడు వాటికి తుల్యమైన ఉచ్చారణగల వర్ణాల చిహ్నాలను ఉపయోగించటం కనిపిస్తుంది. ముఖ్యంగా పర్షో-అరబిక్ ఆ దానపదాల్లోని f కు ప గాని, ఫ గాని, x కు క గాని, ఖ గాని రాయటం కనిపిస్తుంది. ఉదా : ఫరుమానా/పరుమానా *SII* 10.775.14,1680/*NI* 2 కందుకూరు 48.15,1650).

**6.9. విలోమ లేఖనం** (Inverse spelling) : వ్యుత్పత్తి గత పరిణామానికి భిన్నంగా వర్ణక్రమాన్ని వికృతీకరించటం విలోమ లేఖనం. (a) రు కు బదులుగా ఋ. ఉదా : పెకంఢ్ర (*NI* 2 కందుకూరు 41.17,1688). ఇది సంస్కృతంలోని ఋ కారానికి తెలుగులో రుకారోచ్చారణ ఉందనటాన్ని సూచిస్తుంది. (b) ధ కు బదులుగా థ : ఈ భేదం ఇంతకుముందు శతాబ్దాలనుంచే కనిపిస్తుంది. సంస్కృతాదానాల్లోని థ కార, ధ కారాలకు భేదం పోయిందనటాన్ని ఇది సూచిస్తుంది. ఉదా : వథ (వధకు బదులుగా) (*SII* 16.282. 22,1572). (c) గ్నకు బదులుగా జ్ఞ రాయటం కూడా ఇంతకుముందు శతాబ్దాల్లోనే కనిపిస్తుంది. ఇది అవిద్యావంతుల భాషలో జ్ఞ >గ్న మార్పును సూచిస్తుంది. ఉదా : ఆజ్ఞేయ (అగ్నేయకు బదులుగా) (*SII* 16.290.18-19,1577). గ్న్య కు బదులుగా జ్ఞ రాయటం కూడా కనిపిస్తుంది. ఉదా : అజ్ఞంమకుంఢ (అగ్న్యమ్మకుండకు బదులుగా) (*NI* 2 ఒంగోలు 32.20-21,1662).

**6.10. కృతక ప్రామాణిక రూపాలు** (Hyper-correct forms): (a) అల్ప ప్రాణాలకు బదులుగా మహాప్రాణాలు. ఉదా : భావి (బావికి బదులుగా) (*NI* 2 కందుకూరు 48.37,1650). భండ (బండకు బదులుగా) (*SII* 10.772.15, 1696). (b) తాలవ్యాచ్చులకు ముందు వకారాన్ని చేర్చటం : ఇది తాలవ్యాచ్చులకు ముందు వకార లోపానికి ప్రత్యామ్నాయ ఉచ్చారణవల్ల వచ్చింది. ఉదా : విటకు (ఇటకు బదులుగా) (*NI* 1 ఆత్మకూరు 1.11,1616). (c) త్తకు బదులుగా త్య : నిమిత్యం (నిమిత్తంకు బదులుగా) (*SII* 10.771.8,1692). ఇది త్య > త్త మార్పుకు ప్రత్యామ్నాయం కావచ్చు. (d) శ కు బదులుగా చ. ఉదా : షోడచోపచారాలు (షోడశోపచారాలకు బదులుగా) (*SII* 5.166.10-11, 1624).

**6.11. తత్సమాలలో దేశ్యాలలోని లేఖన సంప్రదాయాలు :** (a) ఎ/యె/య : ఉదా. యెజుశ్శాఖ/ఎజుశ్శాఖ (/యజుశ్శాఖ) (*SII* 10.777.11, 1740/*NI* 3 వెంకటగిరి 23 7,1659). (b) ఐ/అయ్; ఔ/అవ్ : ఉదా. (పౌత్రులైన/) పవుత్రులయిన (*SII* 7.564.4,1667), (c) దీర్ఘాచ్చు + హ/హ్రస్వాచ్చు + హహ. ఉదా : ద్వితియ్య (/ద్వితీయ) (*SII* 10.753 7,1600).

పై లేఖన భేదాలే కాకుండా శాసన లేఖకులు తమిళం మొదలైన ఇతర భాషలకు చెందినవాళ్లు కావటంవల్లా ఎక్కువగా చదువుకున్నవాళ్లు కాకపోవటం వల్లా అనేక లేఖన భేదాలు, దోషాలు శాసనాల్లో కనిపిస్తాయి.

**ఈ యుగంలో వర్ణాలు.**

**6.12.** ఈ యుగపు శాసన భాషలోని దేశ్య విభాగంలో కింది విధంగా వర్ణవిభాగం చేయవచ్చు.

హల్లులు

| | ఓష్ఠ్య | దంత్య | దంతమూలీయ | మూర్ధన్య | తాలవ్య | కంఠ్య. |
|---|---|---|---|---|---|---|
| స్పర్శ | ప | త | | ట | | క |
| | బ | ద | | డ | | గ |
| స్పృష్టోష్మ | | | | | చ | |
| | | | | | జ | |

| | ఓష్ఠ్య | దంత్య | దంత మూలీయ | మూర్ధన్య | తాలవ్య | కంఠ్య |
|---|---|---|---|---|---|---|
| ఊష్మ | | | స | | | |
| అనునాసిక | మ | | న | ణ | | |
| పార్శ్విక‌ | | | ల | ళ | | |
| కంపిత | | | ర | | | |
| అంతస్థ | వ | | | | య | |

అచ్చులు

| | పురస్/తాలవ్య | కేంద్ర | పశ్చాత్/కంఠ్య |
|---|---|---|---|
| సంవృత | ఇ ఈ | | ఉ ఊ |
| ఈషత్సంవృత | ఎ ఏ | | ఒ ఓ |
| వివృత | | అ ఆ | |

సంఖ్యా వాచకాలలో మాత్రమే దేశ్యాలలో మహాప్రాణాలు కనిపిస్తాయి. ఉదా : నలుభయి (*SII* 10.755.8,1604). వెన్క (*SII* 5 3.28,1773) వంటి పద మధ్యాజ్లోపంవల్ల ఏర్పడ్డ రూపాలకు, పెంకు (*NI* 1 గూడూరు 83.13,1791) వంటి రూపాలకు ఉన్న పరిమిత భేదకత్వాన్ని 'ఙ' ను ప్రత్యేకంగా నిర్ణయించటానికి ఆధారంగా గ్రహించలేదు, ఱ ర తోను (§ 3.14), ఱ పరిపూరక పరిసరాల్లో డ,ర ల తోను (కృష్ణమూర్తి 1958:265-68) ప్రాచీనాంధ్రంలోనే మిశితం అయినాయి. 'ళ' ద్విరుక్తిలో మాత్రమే 'ల'తో భేదిస్తుంది. "హ' ఆదాన పదాల్లో మాత్రమే కనిపిస్తుంది. ఐ/అయ్, ఔ/అవ్ ల పర్యాయ లేఖనం ఐ, ఔ లు భిన్న వర్ణాలు కావనటానికి నిదర్శనం (§ 6.8 (iii) (b)). ఎ [æ] ఉచ్చారణ ఈ కాలంలో ఉందనటానికి లేఖనాధారాలున్నా (§ 6.8.(i) (c)) అది ప్రత్యేక వర్ణం అని చెప్పటానికి తగిన ఆధారాలులేవు. అనుస్వారం వర్గ హల్లులకు ముందు వర్గానునాసికానికి, పదాంతంలో మకారానికి చిహ్నం. అర్ధానుస్వారానికి ఈ యుగంలో ప్రత్యేకమైన విలువలేదు (§ 6.5).

**6.13. ఉచ్చారణ భేదాలు :** చ, జ లకు తాలవ్యాచ్చులకుముందు తాలవ్యోచ్చారణ, తాలవ్యేతరాలకు ముందు దంతమూలీయోచ్చారణ ఉండేదనటానికి

లేఖనాధారా లున్నాయి (§6.4.). స్పర్శాలకు ఆధునిక కాలంలో లాగా అచ్చుల మధ్య శిథిలోచ్చారణ (lenis articulation) ఉన్నదని చెప్పటానికి లేఖనాధారాలు లేవు. 'మ' కు అచ్చుల మధ్య అనునాసిక వకారోచ్చారణ ఉండేది. ( § 6.8.(i) (f) ). 'న' వర్ణానికి దంత్య, కంఠ్య స్పర్శాలకు, తాలవ్య, దంతమూలీయ స్పృష్టోష్మాలకు ముందు వరుసగా దంత్య, కంఠ్య, తాలవ్య, దంతమూలీయ ఉచ్చారణలు ఉండేదని చెప్పవచ్చు. 'ర' కు మూర్ధన్య హల్లులపైన మూర్ధన్యోచ్చారణ ఉండి ఉండాలి (§ 6.3.). 'స' కు తాలవ్యాచ్చులకు ముందు తాలవ్యోచ్చారణ ఉండేది ( § 6.8 (i) (g) ). తాలవ్యాచ్చులకు ముందు యకారం, ఓష్ఠ్యాచ్చులకు ముందు వకారం ఉచ్చారణలో మాత్రమే ఉండేది ( § 6.8. (i) (a) ). నిమ్నాచ్చులకు ముందు ఎ, ఏ లకు వివృతోచ్చారణ ఉండేది ( § 6.8. (i) (e) ).

**6.14.** **వర్ణ సంయోజన నియమావళి :** ఙ, ళ లు పదాదిన లేవు. ట కూడా పదాదిన చాలా తక్కువగా కనిపిస్తుంది. ఉదా. టెంకాయ (*SII* 10. 766.15,1678). 'డ' వర్ణం పదాదిలో డెబ్బై (*SII* 4.698.37,1564) లోనూ, కొన్ని తద్భవాల్లోను కనిపిస్తుంది. ఓష్ఠ్యేతరాచ్చులకు ముందే 'వ' కనిపిస్తుంది. పదాదిలో ద్విరుక్త హల్లులు లేవు. పదాదిలో ఒకేరకమైన సంయుక్త హల్లులు – మొదటి వర్ణం క, త, ప, గ, ద, బ, స, మ, వలలో ఒకటి, రెండవ వర్ణం 'ర' వర్ణం అయినవి మాత్రమే కనిపిస్తాయి. వీటిల్లో రెండవ వర్ణం ర లోపించటం క్రీ. శ. 7/8 శతాబ్దులలో ప్రారంభమై క్రీ. శ. 14/15 శతాబ్దుల నాటికే పూర్తి అయిందని చెప్పాలి (§ 3.9.). కాబట్టి ప్రస్తుత శాసనాల్లో కనిపించే పదాది సంయుక్తాక్షరాలతో కూడిన వాటిని ప్రాచీన రూపాలుగాను, 'ర' లోపించిన రూపాలను సమకాలీన రూపాలుగాను గ్రహించాలి ( § 6.8. (vi) (2) ).

అచ్చుల మధ్య హల్లులన్నీ అద్విరుక్తంగాను, ద్విరుక్తంగానూ కనిపిస్తాయి; 'ళ' మాత్రం ద్విరుక్తంగా మాత్రమే కనిపిస్తుంది. ద్విరుక్త ణకారం ద + న ⟶ ణ్ణ సంధి కారణంగా అంబరు ఖానుణ్ణి (*SII* 7.845.3,1632) మొదలైన మహద్వితీయైకవచన రూపాల్లో 16 వ శతాబ్దినుంచీ కనిపిస్తున్నాయి. ద్విత్వ హల్లులు సాధారణంగా హ్రస్వాచ్చులపైనే ఉంటాయి. పాళ్ళు (*SII* 10.753.37,1600) వంటి సంధి కారణంగా ఏర్పడ్డ రూపాల్లో మాత్రం దీర్ఘంపైన కూడా ద్విరుక్త హల్లులు కనిపిస్తాయి.

అచ్చుల మధ్య కనిపించే సంయుక్త హల్లులలో వర్గానునాసికం + స్పర్శం క్రమంలో ఉండేవే తెలుగులో మొదటినుంచీ కనిపిస్తాయి. ప్రస్తుత శాసనాల్లో కనిపించే తక్కిన సంయుక్త హల్లులన్నీ పదమధ్యాచ్లోపంవల్ల ఏర్పడ్డవో, సంధి కారణంగా ఏర్పడ్డవో అయి ఉంటాయి. ఉదా. వేడ్క (< వేడుక) (*SII* 5.1203.24,1773), కోమట్లు (*SII* 10.770.18,1691).

పదాంతంలో మ, య లు తప్ప ఇతర హల్లులు లేవు. 'య' యిరువై (*SII* 5.874.15,1620) వంటి సంఖ్యా వాచకాల్లో మాత్రమే కనిపిస్తుంది.

పదంలో మొదటి అక్షరంలో హ్రస్వం గానీ, దీర్ఘం గానీ ఏ అచ్చైనా ఉంటుంది. ఆద్యేతరాక్షరాలలో ఒక్క 'ఒ' తప్ప తక్కిన హ్రస్వాచ్చులు మాత్రమే ఉంటాయి. రెండవ అక్షరంలో దీర్ఘాచ్చు గ్రామనామాల్లోను, వృక్షనామాల్లోను కనిపిస్తాయి. ఉదా. కొంబాక (*SII* 16.50.6-12,1513), నేరేళు (*SII* 10. 737.44,1526). ద్వ్యక్షర పదాలైన గోనె (*SII* 10.753.52,1600), కోడె (*SII* 10.753.57,1600) వంటి పదాల్లో మాత్రమే పదాంతంలో 'ఎ' కనిపిస్తుంది. మాదిగె (*NI* 2 నెల్లూరు 115 8-10,1675) వంటి త్ర్యక్షర పదాల్లో కనిపించే పదాంత 'ఎ' కారం మాండలికం మాత్రమే ( § 6.8. (v) (c) ).

ఇతర భాషలనుంచి వచ్చిన వర్ణాలు.

**6.15. హిందార్య భాషా మూలాకాలు :** హిందార్య భాషా పదాల ద్వారా కింది హల్లులు తెలుగులో చేరాయి.

| | | | | |
|---|---|---|---|---|
| ఫ | థ | ఠ | ఛ | ఖ |
| భ | ధ | ఢ | ఝ | ఘ |
| | | ష | శ | హ |

సంస్కృతంలోని 'ఋ' ప్రాచీన శాసనాల్లో 'రి' గా కనిపిస్తుండగా క్రీ. శ. 12వ శతాబ్ది నుంచి 'రు' గా కనిపించటం ప్రారంభం అయింది (§ 4.7.). ప్రస్తుత శాసనాల్లో అది ఎక్కువగా 'రు' గానే కనిపిస్తుంది ( § 6.9. (a) ). సంస్కృతాదానాలలోని ఐ, ఔ లను తెలుగులో ప్రత్యేక వర్ణాలుగా గ్రహించటానికి గాని ( § 6.11. (b) ), సంస్కృతంలోని అనుస్వారాన్ని, అది సంస్కృతంలో ప్రత్యేక వర్ణమైనా (ఎమ్. బి. ఎమెనో 1946:86-93), ప్రత్యేక

వర్ణంగా గ్రహించటానికి గాని ఆధారాలు శాసనాల్లో లేవు. అనుస్వారం దేశ్య పదాలలోలాగే వర్గాను నాసికానికి చిహ్నం. సంయుక్త హల్లులలో మాత్రమే కనిపించే ఙ, ఞ ల ప్రత్యేక వర్ణతకూడా పరిమితం మాత్రమే. 'మ' వర్ణానికి స, హ లకు ముందు అనునాసిక వకారోచ్చారణ ఉంది ( § 6.8. (i) (1) ). పునః ప్రతిష్ఠ (*SII* 6.227.14,1636) లాంటి సమాసాల్లో మాత్రమే కనిపించే విసర్గ లను హకారానికి శ్వాస సవర్ణంగా గ్రహించవచ్చు.

థకారానికి బదులుగా ధకారం రాయటం, ధకారానికి థకారం రాసే విలోమ లేఖనం ( § 6.9. (b) ) - వీటినిబట్టి చదువుకున్న వారిలో కూడా థ, ధ ల భేదం పోయిందని చెప్పవచ్చు. చదువుకోని వారి భాషలో మహాప్రాణాలు అల్ప ప్రాణాలు కావటం తెలుగుభాషా చరిత్రలో మొదటినుంచీ ఉన్నదే (రాధాకృష్ణ § 1.35; కందప్పచెట్టి § 1.105). అల్ప ప్రాణాలకు బదులుగా మహాప్రాణాలు కనిపించే కృతక ప్రామాణిక రూపాలు ఈ యుగంలో విరివిగా కనిపిస్తాయి ( § 6.10 (a) ). హిందార్య భాషాపదాలవల్ల పదాదిలోను, పదమధ్యంలోను అనేక రకాల సంయుక్త వర్ణాలు తెలుగులో చేరాయి.

**6.16. పర్షో - అరబిక్ మూలకాలు :** మహమ్మదీయుల పరిపాలన కారణంగా తెలుగులో ప్రవేశించిన పర్షియన్, అరబిక్ పదాలలో *f*, *x*, *q*, γ, *z* వర్ణాలున్నా అవి ఈ నాటి తెలుగులో ప్రత్యేక వర్ణాలుగా గుర్తించటానికి స్పష్టమైన ఆధారాలు లేవు. f వర్ణమైనా ఆధునిక కాలంలో ఇంగ్లీషు పదాలు తెలుగులో ప్రవేశించిన తర్వాత మాత్రమే ప్రత్యేక వర్ణం అయింది (కృష్ణమూర్తి 1959:35). అయితే ఈ భాషలను బాగా చదువుకున్నవాళ్ళు పైవాటిల్లో కొన్ని ధ్వనులనైనా వేరుగా ఉచ్చరించే వారని లేఖన భేదాలవల్ల చెప్పవచ్చు. కొన్ని వర్ణాలు అంతకు ముందే హిందార్య పదాలద్వారా తెలుగులో ప్రవేశించిన వర్ణాలతో సమ్మిళితం అయి ఉంటాయి. పై వర్ణాలు వాటి ఉచ్చారణకు దగ్గరగా ఉండే వర్ణాల లిపి సంకేతాలతో గుర్తించటం జరిగింది. f వర్ణాన్ని ఫ తోను, ప తోను గుర్తించారు ( § 6.8 (vii) ). ఇక్కడ ఫ అసలైన ఉచ్చారణను సూచిస్తూ ఉండవచ్చు. *x*, q లను ఖ, క లతో గుర్తించారు. ఉదా. ఖరారు (*NI* 2 కందుకూరు 80.28,1642), మొకాసా (*SII* 10 759 14,1664) γ ను గ తోను, *z* ను జ తోను గుర్తించారు. ఉదా. గులాపు వానికి (*NI* 3 ఒంగోలు 5.17, 1686), జాగీరు (*SII* 7.790.1,1774). పర్షో - అరబిక్ పదాలవల్ల తెలుగు

వర్ణాల వ్యాప్తిలో కూడా మార్పు కనిపిస్తుంది. ముఖ్యంగా పదాంతంలో దీర్ఘం కనిపించటాన్ని చెప్పవచ్చు. ఉదా. తనఖా (*SII* 10.759,15,1664).

**6.17. ఆంగ్లభాషా మూలకాలు :** 1802 నుంచీ ఆగొష్టు (*NI* 2 కందుకూరు 42 1,1802), కలకటరు (*NI* 2 కందుకూరు 42 8,1802), లేటు (*SII* 5.1192.6,1866) మొదలైన ఇంగ్లీషు పదాలు శాసనభాషలో కనిపిస్తున్నా తెలుగు వర్ణమాలపైన ఇంగ్లీషు ప్రభావాన్ని గురించి చెప్పటానికి కావలసినంత పదజాలం శాసనాల్లో కనిపించటంలేదు.

**6.18. నంధి :** సంధి విషయంలో పూర్వ యుగాలకు, ప్రస్తుత యుగానికి భేదం లేని వాటిని వదిలేస్తే కింది విశేషాలను పేర్కొనవచ్చు.

తద్ధర్మ విశేషణ ప్రత్యయమైన - ఏ పైన అట్టు, అందుకు పదాలలోని మొదటి అచ్చు అకారం లోపించటం గాని, టకారం ఆగమంగా రావటంగానీ 16 వ శతాబ్ది నుంచీ విరివిగా కనిపిస్తుంది. అంతకు ముందు ఇట్లాంటిచోట్ల యడాగమం మాత్రమే కనిపించేది. ఉదా. పెట్టేట్టులుగా (*NI* 2 నెల్లూరు 1.23-24,1638), నడచే టట్టుగా (*SII* 10.768.12,1670), వేంచేసే టందుకు (*SII* 5.874. 10,1620). పై రెండు రకాల రూపాలు ఆధునిక కాలంలో పూర్తిగా ప్రచారంలో ఉన్నాయి. పై రూపాల్లోని ట చారిత్రకంగా - ఏటి ( <ఏ + అట్టి) కి సంబంధించిందై ఉంటుంది.

ఇది కాక ఆధునిక భాషలో కనిపించే అనేకమైన సంధులు ఈ యుగ ప్రారంభం నుంచే వ్యాప్తిలో కనిపిస్తాయి.

రెండు హల్లులకు మధ్య అజ్లోపం, అంటే మొదటి పదం చివరి అచ్చు రెండవ పదం మొదటి హల్లుకు ముందు లోపించటం 15 వ శతాబ్ది నుంచి కనిపిస్తుంది. ఉదా. కోమట్రెడ్డి (←కోమటి + రెడ్డి) (*SII* 10.576.4,1410), కొండ్రాజు (←కొండ + రాజు) (*SII* 4.709 182,1558), లోంతట్టు (←లోని + తట్టు) (*NI* 2 కందుకూరు 48.29,1650-51). అచ్చు లోపించిన తరువాత పరహల్లు శ్వాసం అయితే పూర్వ హల్లుకూడ శ్వాసం కావటం 17 వ శతాబ్ది నుంచీ కనిపిస్తుంది. ఉదా. అడుక్కొని (←అడుగు + కొని) (*NI* 2 కందుకూరు 41.36,1683-84).

అచ్చు లోపించిన తరువాత సమ హల్లుకు ముందు ద్విరుక్త హల్లు సరళీకృతం, అంటే అద్విరుక్తం అవుతుంది. ఉదా. కొన్నాండ్లు (←కొన్ని + నాండ్లు) (*SII* 10.755.7,1604).

గసడదవా దేశ సంధి క్రియాపదాది హల్లుకు మాత్రమే పరిమితం కావటం 15వ శతాబ్ది నుంచీ కనిపిస్తుంది. అదైనా వికల్పమే. ఉదా. నుయి + గట్టించి (*SII* 10 760.9,1660), నిర్ణయం + సేసి (*SII* 5.874.18,1620), బరువు + వెట్టించి (*SII* 10 753.32,1600).

ద్రుత ప్రకృతిక సంధి కావ్య భాషలో మాత్రమే కనిపిస్తుంది. సమకాలీన భాషలో ద్రుతాలు అస్తిత్వాన్ని కోల్పోవటంవల్ల ద్రుత ప్రకృతికాలు కళలలాగే వర్తిస్తాయి. ఉదా. సుఖాన + వుంటిమి (*SII* 10.772.19,1696), పందిని + కోసినట్టు (*SII* 10.765.42,1678).

**6.19. నామ ప్రాతిపదికలు** (Noun stems): నామ ప్రాతిపదికలు మూడు రకాలు. (1) సామాన్యం (Simple), (2) సంశ్లిష్టం (complex), (3) సమాసం (Compound). సామాన్య ప్రాతిపదికలలో దేశ్యాలు, ఎరువు ప్రాతిపదికలు ఉన్నాయి. ఉదా. పేరు (*NI* 3 ఉదయగిరి 27.8,1661), గోనె (*SII* 10.753 52,1600) మొదలైనవి దేశ్య పదాలు. ఎరువు ప్రాతిపదికలలో తెలుగు భాషా చరిత్ర మొదటిదశనుంచీ హిందార్య భాషలకు సంబంధించిన వనేకం కనిపిస్తున్నాయి. మహమ్మదీయుల పరిపాలన కారణంగా పర్సో-అరబిక్ పదా లెన్నో తెలుగులో చేరాయి. ఉదా. పరుమానా (*NI* 2 కందుకూరు 48.15, 1650), ఖరారు (*NI* 2 కందుకూరు 80.28,1642) మొదలైనవి. ఇవి కాకుండా సోదర ద్రావిడ భాషలైన తమిళ, కన్నడ భాషలనుంచి వచ్చిన అనేక ఆదానాలు తెలుగులో కనిపిస్తాయి.

**6.20. సంశ్లిష్ట ప్రాతిపదికలు** : సంశ్లిష్ట ప్రాతిపదికలు కృత్తులనీ, తద్ధితాలనీ రెండు రకాలు. (1) **కృత్తులు.** మూలధాతువుపైచేరే ప్రత్యయాలు కృత్తులు. (a) -పు/-ంపు : కాంపు (*SII* 10.753.36,1600), పంప్పు (*SII* 10.755. 3,1604, (b) -త : అగద్త (*SII* 7.84.57,1632), (c) -(ం) ట: తోంట(*SII* 10.755.11,1604). చారిత్రకంగా -(ం) ట -త్త నుంచే వచ్చింది. దాని పరిణామ క్రమం ఇది తోంట్ + త్త్ > తోణ్ట్ట > తోంట. (d) -అటం : తవ్వటం

(*SII* 7.845.7,1632). (e) -అ : కాయ (*SII* 7.557.9,1645). (g) -వ : కాలువ (*NI* 3 రాపూరు 34.15,1630). (h) -ము (< * -మ్ము) : నోము (*SII* 10.737.104,1526), (i) -బడి : యేలుబడి (*SII* 10.758.10,1658). (j) -అలి : కావలి (*NI* 3 ఒంగోలు 102.13,1762). (k) ధాతువు ఉపధాద కారం టకారమై పూర్వాచ్చు దీర్ఘం అవుతుంది ; పాటు (*NI* 2 కందుకూరు 20. 29,1640). (2) **తద్ధితాలు :** నామాలపైన నామ నిష్పత్తికోసం చేరే ప్రత్యయాలు తద్ధితాలు. (a) - కాండ్రు : గుత్త-గాండ్రు (*NI* 2 నెల్లూరు 1.31-32, 1638). (b) -వారు : అంచుల-వారు (*SII* 10.753.47,1600). (c) -(ఇ)మి: పేర్మి (*SII* 10,780.5,18 వశ.). (d) -పాటు : కయిలు-పాటు (*NI* 3 ఒంగోలు 102.16,1762). వీటితోపాటు పర్షో-అరబిక్ మూలకమైన-దారు అనేది కూడా తద్ధిత ప్రత్యయంగా ఈ కాలంలో కనిపిస్తుంది. ఉదా : తరపు-దారు (*SII* 10.777.9,1740). ఈ కాలపు శాసనాలలో కనిపించేవి మాత్రమే పైన ఇవ్వటం జరిగింది.

**6.21.** సమాసాలు : రెండు గానీ అంతకంటే ఎక్కువగానీ ప్రాతిపదికలు ఒకే ప్రాతిపదికగా ఏర్పడితే సమాసం అవుతుంది. సమాసాలను ఉత్పత్తిని బట్టీ, అవయవపదాలకు పరస్పరం ఉండే సంబంధాన్ని బట్టి రెండు రకాలుగా విభజన చేయవచ్చు. ఉత్పత్తిని బట్టి సమాసాలను (1) దేశి-కేవల దేశ్య ప్రాతిపదికలతో ఏర్పడేవి. (2) తత్సమం-సంస్కృతం నుంచి యథా తథంగా గ్రహించినవి, (3) మిశ్రం-తత్సమ, దేశ్యాల సమ్మేళనంవల్ల ఏర్పడేవి - అని మూడు రకాలుగా విభజించవచ్చు. వీటి విషయంలో గత యుగాలకు, ఈ యుగానికి పెద్ద భేదం ఏమీలేదు. వరుసగా పై మూడింటికి ఉదాహరణలు. (1) వెల్ల-నూలు (*SII* 10. 753.55,1600). (2) నిత్య-నైవేద్యాలు (*SII* 5.1260.8,1604). (3) పడమటి-భాగానను (*SII* 7.790.15.1714).

**6.22.** సమాసంలో అవయవ పదాలకుండే పరస్పర సంబంధాన్ని బట్టి సమాసాలను ప్రధానంగా మూడు విభాగాలు చేయవచ్చు. (1) *అంతః కేంద్రకాలు* (**Endocentric**) : కర్మధారయ, ద్విగు, తత్పురుష సమాసాలు ఈ విభాగంలో చేరుతాయి. ఉదా. వెల్లనూలు (*SII* 10.753.55,1600), మూడు తావులు (*SII* 10.769.10,1691), దేవుని ప్రతిష్ఠ (*SII* 7.558.18,1856). (2) *బహిః కేంద్రకాలు* (Exocentric) ; బహువ్రీహి సమాసం. ఉదా. విప్పర్ల

గోత్రులు (*SII* 5.1260.9-10,1604). (3) ద్వంద్వ సమాసం (Co-ordinative) ఉదా. మెరక పల్లాలు (*SII* 10.755.12,1604).

**6.23**. సమాసా లేర్పడే టప్పుడు మొదటి పదంలో వచ్చే మార్పుల విషయంలో కింది విశేషాలను ఈ యుగంలో గమనించవచ్చు. -ము వర్ణకం స్థానంలో -పు రావటం ఇంతకుముందు చూశాం (§ 4.57 (గ)). -పు ఆదేశం రాకుండానే సమాసం ఏర్పడటం ఈ యుగంలో చూడవచ్చు. ఉదా. గుఱ్ఱము బండ్లు (*SII* 10.753.56,1600). -ము, -పు అనే అమహద్వాచకాలైన రెండు సపదాంశాలలో -పు తొలగిపోయి -ము మాత్రమే మిగిలిందనటాన్ని ఇది సూచిస్తుంది. అయితే ఆధునిక భాషలో గుర్రంబండి, గురబ్బండి (<గుర్రపు-బండి) అని రెండు రకాల రూపాల ప్రతి రూపాలు కనిపిస్తున్నాయి. రెండవ పద్ధతిలో సమీకరణం పొందిన రూపాలు ఈ యుగంలో కూడా కనిపిస్తున్నాయి. ఉదా. అనుప్పలె (<అనుపు-పల్లె<అనుము-పల్లె) (*SII* 10.757.11-12,1650).

**6.24**. **లింగబోధక ప్రత్యయాలు**: దేశ్య పదాలకు చాలావరకు లింగ బోధక ప్రత్యయాలు లేవు. నామ వాచకాలకు -అన (్న), -అయ (్య), -అప్ప చేర్చటంవల్ల పురుష వాచకాలు, -అమ (్మ), -అవ (్వ) మొదలైనవి చేర్చటంవల్ల స్త్రీ వాచకాలు గుర్తింపబడేవి. వీటికి వరుసగా ఉదాహరణలు. చిన్నన్న (*SII* 10.777.17, 17 శ.), కోనయ (*SII* 6.227.14-15, 1636), నారాయణప్ప (*SII* 10.750.19,1658). -అమ (్మ), -అవ (్వ) చేర్చి స్త్రీ వాచకాలను గుర్తించే ఉదాహరణలు ఈ యుగంలో లేవుగాని గత యుగంలో ఉన్నాయి. ఉదా. లచ్చుమ (*SII* 10 749 38.1583), సోమవ్వ (*SII* 10 749.45,1583). -డు (<ణ్డు<*-న్డు) పురుష బోధక ప్రత్యయంగా ఎక్కువగా ఆకారాంత తత్సమాలపైన కనిపిస్తుంది. పర్సో- అరబిక్ ఆదానాలలో పురుష నామాలపైన కూడా కనిపిస్తుంది. ఉదా. ఆలమఖానుండు (*SII* 10.751.18,1592). స్త్రీ బోధక ప్రత్యయాల విషయంలో ఈ యుగానికి గత యుగానికి పెద్దగా భేదం ఏమీ లేదు. ంబు, -మ్ము, -ము లతో ప్రాచీన అమహద్వాచక రూపాలు కనిపిస్తున్నా -ం మాత్రమే అమహద్వాచకంగా ఈ కాలంలో స్థిరపడిందని చెప్పవచ్చు. ఉదా. శాసనం (*SII* 10.777.15,1740). -వు కూడా అమహదేక వచన ప్రత్యయంగా ఉకారాంత, ఓకారాంత తత్సమాలపైన కనిపిస్తుంది. ఉదా. పస్వు (*NI* 2 కందుకూరు 48.31,1650).

**6.25.** వచనం : ఏకవచన సూచక ప్రత్యయాలు ప్రత్యేకంగా ఏమీ లేవు. లింగబోధక ప్రత్యయాలతో కూడిన పదాలన్నీ ఏకవచనాలే. బహు వచనంలో మాత్రం కింది విశేషాలను గమనించవచ్చు. మానవ వాచక బహువచన ప్రత్యయంగా - రు చాలా కొద్దిగా మాత్రమే ఈ కాలంలో కనిపిస్తుంది. - లు(*-ళ్) మానవ, మానవేతర సాధారణ బహువచన ప్రత్యయంగా స్థిరపడటాన్ని ఇంతవరకే గమనించాం (§ 4.39.). కందులు (*SII* 10.753.52,1600) మొదలైనవి నిత్య బహువచనాంతాలు. నామవాచకాలపైన - లు చేరేటప్పుడు కింది మార్పులు వస్తాయి.

(1) దీర్ఘాంతాలైన అన్యదేశ్యాలకు, ఎకారాంతాలకు, అకారాంతాలకు, ట, డ, ర, ల పూర్వకంకాని ఉకారాంతాలకు బహువచన ప్రత్యయం చేరేటప్పుడు ఎలాంటి మార్పులు రావు. ఉదా. జాగాలు (*SII* 10.759.35-36,1665), వొడ్డెలు (*NI* 2 కందుకూరు 48.34, 1650), దొరలు (*SII* 10.753.39,1600), రోజులు (*SII* 10.772.3,1696).

(2) - లుకు ముందు పురుష బోధక ప్రత్యయం - డు లోపిస్తుంది. ఉదా. బ్రాహ్మణు-లు (*SII* 10.753.39,1600).

(3) - లు కు ముందు ప్రాతిపదిక చివరి -వు, -ను, -యి, -రు లు లోపిస్తాయి. -వు లోపానికి మాత్రమే ఈ కాలపు శాసనాల్లో ఉదాహరణ దొరికింది. ఉదా. పూల - (ఏ. వ. పూవు) (*KI* 53.11, 1812).

(4) -లు కు ముందు -ము వర్ణకం లోపించి పూర్వ అకారం దీర్ఘం అవుతుంది. ఉదా. కుంచాలు (ఏ. వ. కుంచము) (*NI* 2 కందుకూరు 44.28.1650).

(5) ప్రాతిపదిక చివరి - ఇకారం బహువచన పత్యయం -లు కు ముందు ఉ గా మారుతుంది. ఉదా. పందులు (ఏ. వ. పంది) (*NI* 2 నెల్లూరు 33.69,1645).

(6) ట, డ, ర, ల లు ముందుగల పదాంతంలోని ఇ, ఉ లు -లు కు ముందు లోపిస్తాయి. ఉదా. కోమట్లు (*SII* 10.753.44,1600),

కొన్నాండ్లు (*SII* 10.755.7,1604) మొదలైనవి. చారిత్రకంగా కొన్నాండ్లవంటి రూపాలు దీర్ఘంవైన పూర్ణబిందువు లోపించకముందు ఏర్పడ్డ రూపాలు అయిఉండాలి.

(7) -లు కు ముందు ద్విరుక్త హల్లులు అద్విరుక్తా లవుతాయి. ఉదా. గట్లు (ఏ. వ. గట్టు) (*SII* 10.758.30,1600), రెడ్లు (ఏ. వ. రెడ్డి) (*NI* 1 కందుకూరు 12.48,1643).

(8) రెండు హ్రస్వాచ్చులు గల పదాలకంటే భిన్నమైన పదాలలో చివరి అకారం -లు కు ముందు లోపిస్తుంది. ఉదా. కట్టడ్‌లు (>కట్టళ్ళు) (ఏ. వ. కట్టడ) (*NI* 2 కందుకూరు 48.69,1650).

(9) -లు కు ముందు డ, ర, లలు ళ గా మారుతాయి. ఉదా. అంగళ్ళు (ఏ. వ. అంగడి) (*NI* 2 కందుకూరు 48.69,1650), మళ్ళు (ఏ. వ. మడి) (*SII* 10.758.13,1658), నీళ్ళు (ఏ. వ. నీరు) (*NI* 1 CP 9.39,1687), వాకిళ్ళు (ఏ. వ. వాకిలి) (*SII* 7.564.6,1667), వడ్లు (ఏ. వ. వరి) (*NI* 2 కందుకూరు 44.21, 1650) లో వడ్లు (<* వట్) ని బహువచన ప్రాతిపదికగా గ్రహించ వచ్చు.

(10) -ళ్ళు అనేది బహువచనంలో కొన్ని పదాలకు చేరుతుంది. ఉదా. రాళ్ళు (ఏ. వ. రాయి) (*SII* 7.790.15,1714).

(11) -చివరి అచ్చు లోపించిం తర్వాత ర ళ గా మారని ఆధునిక రూపాలు గత యుగంనుంచే కనిపిస్తున్నాయి. (§ 5.27). అవి ఈ యుగంలో ఎక్కువ వ్యాప్తిలో ఉన్నాయి. ఉదా. పేర్లు (ఏ.వ. పేరు) (*NI* 2 కందుకూరు 48.6,1650).

గౌరవార్థకాలుగా -లు, -రు, -వారు, -అయ్యవారు, -గారు, -గారలు మొదలైనవి ఈ యుగంలో కనిపిస్తున్నాయి. ఉదా. గురువు -లు (*NI* 2 నెల్లూరు 13.12,1613), దాసరి నాయని -వారు (*SII* 7.557.4.5,1636), శ్రీరంగరాజ యదేవ మహారాజులయ్యవారి (*SII* 7.564.4,1667), సాహెబుల -గారు (*SII* 10.760.8,1668) మొదలైనవి.

**6.26. ఔపవిభక్తికాలు:** నామ ప్రాతిపదికలను ప్రధానంగా రెండు విభాగాలుగా చేయవచ్చు. (1) ప్రథమా విభక్తిలో, ద్వితీయాది విభక్తులకు ముందు ఒకే విధమైన రూపం కలిగి ఉండేవి. (2) ప్రథమా విభక్తిలోను, ద్వితీయాది విభక్తులలోను భిన్న రూపాలు కలిగి ఉండేవి. ప్రభువు -తో (*NI* 2 కందుకూరు 41.25-26,1683), వేడ్క -తో (*SII* 5.1208.24,1778) మొదలైనవి మొదటి రకానికి చెందినవి. రెండవ రకానికి చెందిన నామ ప్రాతిపదికలు ద్వితీయాది విభక్తులకు ముందు కొన్ని మార్పులను పొందుతుంది. (a) పురుషవాచక ఏకవచన ప్రత్యయం -డు స్థానంలో -ని వస్తుంది. ఉదా. హనుమంతుని (*SII* 7.564.6-7,1667). చారిత్రకంగా -ఇ అనేదే దీంట్లో ఔప విభక్తికం. మహదేకవచనం -డు మీద ఔప విభక్తిక ప్రత్యయం -ఇ చేరిన ఆధునిక రూపాలు 12 వ శతాబ్ది నుంచీ కనిపిస్తున్నాయి (§ 4.40 (1)). ఉదా వాడి (*NI* 2 కావలి 46.16,1638). (b) -డి + ని→ణ్ణి: ఔప విభక్తికం -డి పైన ఇ లోపించి డ,న లు పరస్పరం సమీకరణం చెందటం అంటే ద అనునాసికం, న మూర్ధన్యం కావటం 16 వ శతాబ్ది నుంచి కనిపిస్తుంది. ఉదా. అంబారుఖానుణ్ణి (*SII* 7.845.3,1632). (c) ఔప విభక్తికం -న కు ముందు -ము లోపించి పూర్వాచ్చు దీర్ఘం అవుతుంది. ఇలాటి రూపాలు 11 వ శతాబ్దినుంచే కనిపిస్తున్నాయి. (§ 3.33 (3) (1). ఉదా. సీరాటా -న -కు (*SII* 5.874.11, 1620). -న కు బదులుగా -ని 13 వ శతాబ్దినుంచీ కనిపిస్తుంది. (§ 4.43.). ఉదా. మొట్టడా -ని -కి (*SII* 10.753.53,1600). (d) -ము లోపించి -న్ని చేరుతుంది. అంతకుముందు హ్రస్వం దీర్ఘ అవుతుంది. ఉదా. పాపాన్ని (*NI* 2 కందుకూరు 48.19,1650). ఇలాంటి రూపాలు కూడా 12 వ శతాబ్దినుంచీ కనిపిస్తున్నాయి (§ 4.41). (e) ల, ర, న పూర్వకాలైన ఉకారాంత పదాలకు -ఇ చేరటం 12 వ శతాబ్ది నుంచీ కనిపిస్తున్నా (§ 4.40 (3)) ఈ యుగంలో అవి ప్రచురం. ఉదా మొదలి (మొదలు) (*SII* 10 753.35,1600), కందుకూరి లో (*NI* 2 కందుకూరు 44.19,1650). (f) -య్ (ఇ), -ల్ (ఉ), -ల్ (ఇ/ఉ), -ర్ (అ/ఉ) (<*ఱ్), -డ్ (ఇ/ఉ) చివరగల ప్రాతిపదికలు కొన్నిటికి -తి (<*త్ (ఇ)) ఔపవిభక్తిక ప్రత్యయంగా చేరుతుంది. -తి కి ముందు ప్రాతిపదికలో కొన్ని మార్పులు వస్తాయి. (1) -తి -యి స్థానంలో చేరుతుంది. ఉదా. రాతి- (*SII* 7.845.6,1632), (ii) -డ్ (ఇ/ఉ), -ర్ (<*-ఱ్) (అ/ఇ), -ల్ (ఇ/ఉ) చివరగల ప్రాతిపదికలలో ప్రాక్తెలుగులోనే -తి -టి గా

మార్పు చెంది ఉండాలి. ఉదా. ఏంటి -కి (<ఏంట్టి<*ఏంట్ - త్తి) (ప్ర. వి. ఏండు) (*SII* 10 753.35, 1600), వాకిట -ను (<వాకిట్టి<*వాకిల్ - త్తి) (ప్ర. వి. వాకిలి) (*SII* 7.564.7,1667). నీటి (ప్ర. వి. నీరు) *NI* 3 రాపూరు 74.11,1638 సాదృశ్యంవల్ల ఏర్పడ్డదై ఉండాలి. ఇల్లుకు ఇంటి ఔప విభక్తిక రూపంగా కనిపిస్తుంది. ఇక్కడ ఉండే ఔప విభక్తిక ప్రత్యయం కూడా -తి కి సంబంధించిందే అయి ఉండాలి. పుట్టింటి -కి (<-ఇంటి<ఇన్ట్టి<*ఇల్-న్-త్తి) (ప్ర. వి. పుట్టిల్లు) (*NI* 3 రాపూరు 7.8,1638). 15, 16 శతాబ్దుల నుంచే కనిపిస్తున్న పడమఱ -ను (*SII* 5.103.18,1408), తిరుపీడు -లో (*SII* 8.536.15,1585) వంటి ఔప విభక్తిక ప్రత్యయం చేరని రూపాలు ఆధునిక రూపాలు. రెండవ రకం నామ ప్రాతిపదికలు (ఔప విభక్తికాలు) మొదటి రకం నామ ప్రాతిపదికలతో కలిసి పోతున్నాయనటానికి ఇది నిదర్శనం. 11 వ శతాబ్ది నుంచీ సంఖ్యా వాచకాలపైన -ఇ (ం) టి చేరటం చూశాం (§ 3.33; రాధాకృష్ణ § 4.53). సంఖ్యా వాచకాలపైనే కాకుండా ఇతర ప్రాతిపదికలకు కూడా ఇది చేరటం 15 వ శతాబ్ది నుంచి చూడవచ్చు (§ 5.28). ఉదా. వేరిటి (ప్ర. వి. వేరు) (*SII* 5 874.11,1620). (g) బహువచన ప్రత్యయం -లు పైన -అ ఔప విభక్తికంగా చేరుతుంది. ఉదా. బ్రాహ్మల -కు (*SII* 5.1260.18,1604). (h) మానవ వాచక బహువచనం -రు పైన -ఇ చేరుతుంది. ఉదా. వారి -కి (*SII* 5.874.17,1620).

**6.27.** **విభక్తులు :** (1) *ప్రథమావిభక్తి :* ప్రథమావిభక్తికి ప్రత్యేకమైన ప్రత్యయాలు లేవు. సాధారణంగా కర్త ప్రథమావిభక్తిలో ఉంటుంది.

(2) *ద్వితీయావిభక్తి :* -ను/-ని ద్వితీయావిభక్తి ప్రత్యయం. -ని ఇకారాంతాలపైన -ను ఇతరత్ర చేరుతాయి. ద్వితీయావిభక్తి కర్మార్థాన్ని వ్యక్తం చేస్తుంది. ఉదా. పాపాన్ని చెందుదురు (*NI* 2 కందుకూరు 48.72,1650-51). అప్రాణి వాచకాలకు ఈ ప్రత్యయం నిత్యం కాదు. ఉదా. కవులు శిలాశాసనం వ్రాసిరి (*SII* 10.769.22-27,1691).

(3) *తృతీయావిభక్తి :* -చేత, -చే, -తో, -వల్ల తృతీయావిభక్తిలో 15, 16 శతాబ్దులలో కనిపిస్తున్నాయి (రంగనాథాచార్యులు § 5.63). ప్రస్తుతం -వల్లకు మాత్రమే శాసనాల్లో ఉదాహరణలు దొరుకుతున్నాయి. ఉదా...యీ

కాసులవల్ల అయిన పదార్థం (*SII* 10.753.61,1600). ప్రాచీన ప్రయోగంగా -న కనిపిస్తుంది. ఉదా. కుతుబు పాదుషహూ వొౌదయలుంగారి పంపున ..యశ్ర జర్దను సాధించి ( *SII* 10.755.8,1604 ). -తో సహార్థంలో కనిపిస్తుంది. ఉదా. పీండ్లతో పాటు (*NI* 2 కందుకూరు 48.32,1650), వగ్రై రాలతో కూడా (*NI* 2 కందుకూరు 48.65,1650). -తో కు పాటు, కూడా చేరటం 17 వ శతాబ్ది నుంచే శాసన భాషలో కనిపిస్తుంది.

(4) *చతుర్థీ విభక్తి* : -కు/-కి, -కై, -కొఱకు, - కొఱకై చతుర్థీ విభక్తిలో కనిపిస్తాయి. ఇవి సంప్రదానార్థాన్ని సూచిస్తాయి. ఉదా. ...అచ్చన కులకు...ఇచ్చిన ధర్మశాసనం... (*SII* 5.166.4,1624). -కు/-కి అనేకార్థాలలో కనిపిస్తుంది. వచ్యర్థంలో: ...హుజూరుకు...మాల్కు ఛేసిరి (*SII* 10.759. 52,1663). *గమ్యార్థంలో* : పేటకు తెచ్చే యందుకున్ను (*SII* 10.753.51, 1600). కాలార్థంలో : యెల్లప్పటిక్కాన్ని (*SII* 10.771.11,1692). దిగర్థంలో ; చేనికి దక్షిణానను (*NI* 2 కందుకూరు 20.21,1640). సంబంధార్థంలో : అరబ్బులకు మాతృ స్థానంబైన (*SII* 7.558.9,1856).

(5) *పంచమీ విభక్తి* : -చేత(ను),-వల్ల(ను) -నుండి, -నుంచి, -పట్టి పంచమీ విభక్తిలో కనిపిస్తున్నాయి. -చేత(ను), -వల్ల(ను) గ్రహ్యార్థంలో రావటం గత శతాబ్దులలోనే చూచాం (§ 4.44; 5.32.). -వల్ల, -లోనల పైన నుండి చేరటం 15వ శతాబ్ది నుంచే చూడవచ్చు (§ 5.30). -మీద పైన -నుండి చేరటం కూడా ఈ యుగంలో కనిపిస్తుంది. ఉదా. మోకు మీద నుండి (*NI* 2 కందుకూరు 41.28, 1683). -నుంచి, -పట్టి మొదటి సారిగా 17 వ శతాబ్ది నుంచి శాసన భాషలో కనిపిస్తాయి. ఈ రెండూ వరుసగా స్థల వాచకాలకు, కాల వాచకాలకు చేరుతున్నాయి. ఉదా. జుచ్చూర నుంచ్చి...(*SII* 6.227.6-7,1636), నలుభయి యేండ్లబట్టి....(*SII* 10.755.8-9,1604).

(6) షష్ఠీ విభక్తిలో, (7) సప్తమీ విభక్తిలో గత యుగానికి, ఈ యుగానికీ చెప్పుకోదగ్గ భేదాలేంలేవు (§ 4 46). ఇంతకు ముందునుంచి కనిపిస్తున్న -కింద, -మీద, -వద్ద(ను), -దనకా(ను) మొదలైన వాటితోపాటు -ముందట, -కిందట, -వరకు మొదలైనవి భిన్న విభక్త్యర్థాలను సూచించేవిగా ఈ యుగంలో కనిపిస్తున్నాయి. ఉదా. ముఖమంటపం ముంద్దట (*SII* 10.767.5,1680).

సంవత్సరాల కిందట (*SII* 7.558.17,1856), శుక్రవారం వర్కు (*SII* 10.762.3,1669).

**6.28.** సర్వనామాలు : నిర్దేశాత్మక సర్వనామాలలో వాండు (*NI* 3 రాపూరు 3.35,1638), అతడు (*SII* 7.558 15,1856), ఆయన (*SII* 7.845.4,1632), మహదేక వచనంలోను, వాండ్లు (*NI* 2 కందుకూరు 52.11, 1635), వీరు (*SII* 10.767.47,1680), వీండ్ల -(*NI* 2 కందుకూరు 48.31, 1650) మహన్మహతీ బహువచనంలోను, ఇది (*SII* 7.845.7,1362), యివి (*SII* 7.845.7,1632) వరుసగా అహమదేక వచన, బహు వచనాల్లో కనిపిస్తు న్నాయి. వాండుతో పోల్చినప్పుడు అతడు, ఆయన ఆధునిక భాషలోలాగా గౌర వార్థకాలై ఉంటాయి. వాండ్లు, వీండ్లు వంటి బహువచన రూపాలు ఎక్కువగా నెల్లూరు జిల్లాలోను, ప్రకాశం జిల్లాలో కొన్ని చోట్ల కనిపిస్తున్నాయి. వారు, వీరు వంటి ప్రాచీన బహువచన రూపాలు గౌరవార్థకాలుగా పరిణమించగా, పైవి బహువచన రూపాలుగా స్థిరపడి ఉంటాయి. ఆధునిక బహువచన రూపాలైన వాళ్లు, వీళ్ల లకు ఇవి పూర్వ రూపాలు. ఆమె, ఈమె వంటి స్త్రీ వాచ కాలు ఈ యుగంలో కనిపించక పోయినా 12వ శతాబ్ది నుంచీ ఇవి శాసన భాషలో ఉన్నాయి (కందప్పచెట్టి (§ 2.129). అవికి ఔప విభక్తికమైన ఆధునిక రూపం 'వాటిని' కూడా 13వ శతాబ్దినుంచే కనిపిస్తుంది (కందప్పచెట్టి § 2.131). యెవ్వండు (*NI* 2 నెల్లూరు 11.14,1638), యెవరు (*SII* 10.763.13, 1670) వరుసగా ఏక వచన, బహు వచనాలలో మహద్వాచక ప్రశ్నార్థక సర్వ నామాలుగా ప్రస్తుత శాసనాలలో కనిపిస్తున్నాయి.

మధ్యమ, ఉత్తమ పురుష సర్వ నామాలలో అచ్చుతో మొదలయ్యే ఈవు, ఈరు, ఏను, ఏము వంటి రూపాలు ఈ యుగంలో కూడా కనిపించవు. మధ్యమ పురుష సర్వనామాలుగా నీవు (ఏ.వ.) (*KI* 53.10,1812), మీరు (బ.వ.) (*SII* 10.769.12,1691); ఉత్తమ పురుష సర్వనామాలుగా నేను (ఏ.వ.) (*SII* 10.773.8,1697), మేము (బ.వ.) (*SII* 5.874.8,1620) కనిపిస్తున్నాయి. ఉత్తమ పురుష బహువచనంలో నేము (*SII* 16.42.8,1503; *SII* 10.774.8, 1697) అనే రూపం 16వ శతాబ్ది మొదటినుంచీ శాసనాల్లో కనిపిస్తుంది. మూల ద్రావిడంలో ఉభయార్థక బహువచనంగా *ఞామ్‌ను పునర్నిర్మించటానికి గల

ప్రధానాధారాలలో ఇది ఒకటి (కృష్ణమూర్తి 1968). కాని 'నేము' అనేది అస్మదర్థకంగానే శాసనాల్లో కనిపిస్తుంది.

ఆత్మార్థక బహువచనంగా తాము (*SII* 7.557 1.0,1637) 16 వ శతాబ్ది నుంచీ కనిపిస్తుంది (§ 5.41). అంతకు ముందు తారు అనేది మాత్రమే కనిపిస్తుంది (పై.). తులనాత్మకంగా పరిశీలిస్తే *తామ్ అనేదే మొదటి రూపం. ప్రాక్తెలుగు కాలంలోనే మానవ వాచక బహువచన ప్రత్యయమైన -ర్ అనేది -మ్ అనే దాని స్థానంలో మధ్యమ పురుష సర్వనామంలో (*నీమ్>నీర్>మీరు) లాగా వచ్చి ఉంటుంది (కృష్ణమూర్తి 1968).

**6.29 సంఖ్యా వాచకాలు :** ప్రథమా విభక్తిలో 'ఒకటి' అనే రూపం 'ఒకండు' అనే రూపాన్ని తొలగించి గత యుగంలోనే పూర్తిగా స్థిరపడింది. (§ 5.33). 'ఒక'కు బదులు 'ఓ' విశేషణంగా 13 వ శతాబ్ది నుంచే కనిపిస్తుంది (కందప్పచెట్టి § 2.119). 'ఏను' అనేది పూర్తిగా వ్యవహార భ్రష్టమై 'ఐదు' (*NI* 3 రాపూరు 49.14,1638) అనేది మాత్రమే కనిపిస్తుంది ( § 4 48(4) ). ఏను విశేషణంగా మాత్రమే కనిపిస్తుంది. ఉదా. ఏందుము (*SII* 10.769.16, 1691). సంధ్యక్షరం -హ -తో కూడిన పదహారు (*SII* 16.235.15,1558) వంటి ఆధునిక సంఖ్యా వాచక రూపాలు 16 వ శతాబ్ది నుంచీ కనిపిస్తున్నాయి- కూడిక సంఖ్యలలో పదిలో చివరి అచ్చు లోపించిన పద్మూడో (*SII* 16.330. 17,1647), పద్నాలుగు (*SII* 16.172.53,1620) వంటి రూపాలు, సమీకరణం వల్ల ఏర్పడ్డ పన్నెండు (◁ పంద్రెండు) (*Kl* 53.9,1812) వంటి రూపాలు ఈ యుగంలో మొదటి సారిగా కనిపిస్తున్నాయి. సమాసాలలో -పది లో -ద -> -య -మార్పు పొందిన రూపాలు ఇంతకుముందే భాషలో స్థిర పడ్డాయి (§ 4.48 (11) 6.). ఈ యుగంలో అలాంటి రూపాలు పూర్తిగా వ్యాప్తిలోకి వచ్చాయి. ఉదా. ఇరువై (*SII* 5.874.15,1620). తక్కిన సంఖ్యా వాచకాల విషయంలో గత యుగాలకు ఈ యుగానికి పెద్దగా భేదం ఏమీ లేదు.

పూరణార్థకంగా -ఓ (◁ అవ< అవు< అగు) అనేదే ఈ యుగంలో కనిపిస్తుంది. ఉదా: నాల్గో (*SII* 10.753.36,1600). -గురు అనేది మహద్వాచక సంఖ్యావాచక విశేషణ సూచకంగా - వురు స్థానాన్ని 12 వ శతాబ్ది నాటికే ఆక్రమించింది ( § 4.48 (15) ). -మంది అనేది 15 వ శతాబ్ది నుంచీ కనిపిస్తుంది.

ఉదా. నలుగురు (*SII* 10.758.16,1658), పదునెనిమిది మంది (*NI* 3 ఒంగోలు 182.11,1443).

**6.30. విశేషణాలు :** విశేషణాల విషయంలో ఈ యుగంలో కొత్తగా చెప్పుకోదగ్గ విశేషాలేమి లేవు. -లాగు చేర్చిన ఆధునిక సంకీర్ణ విశేషణాలు యిచ్చే (లాగు *NI* 2 కందుకూరు 48.42,1450), యిలాగు (*SII* 10.751.14,1592), చూచేలాగు (*NI* 2 కందుకూరు 48.36,1650) వంటివి 15 వ శతాబ్ది నుంచీ కనిపిస్తున్నాయి. బాగా (< బాగుగా) (*NI* 2 కందుకూరు 45.50,1650) 17వ శతాబ్దిలో మొదటి సారిగా కనిపిస్తుంది.

**6.31. క్రియలు :-** క్రియా ప్రాతిపదికలు (1) సామాన్య (2) సంకీర్ణ (3) సమస్త - అని మూడు రకాలు. (1) పడు (*NI* 2 కందుకూరు 41.24, 1688), చెప్పు (*SII* 5.1203,34,1772) వంటివి సామాన్యాలు. (2) సామాన్య క్రియా పాతిపదికలకు క్రియా కారకాలు చేరి ఏర్పడేవి సంకీర్ణాలు. (1) దేశ్యాలు : ఒనర్-చ్-(*SII* 6.227.16,1636), నడిప్-ఇంచ్ ( *SII* 5.166,11,1624 ) (2) ఆదానాలు: సృజించ్ (*SII* 5.1203.26,1773). దేశ్యాలలో -చ్, -ఇంచ్ సకర్మక, ప్రేరణార్థకాలయి ఉంటాయి. (3) సమస్త క్రియా ప్రాతిపదికల్ని రెండు రకాలుగా విభజించవచ్చు (i) ప్రధాన క్రియలోనే సమాసం ఏర్పడేవి. (ii) సామాన్య, సంకీర్ణ లేక సమస్త క్రియా ప్రాతిపదికకు సహాయక క్రియచేరి ఏర్పడేవి. (i) ప్రధాన క్రియా సమాసంలో రెండవ అవయవం ఎప్పుడూ క్రియ అయి ఉంటుంది. మొదటిది నామంగాని, క్రియగాని కావచ్చు. (a) క్రియ + క్రియ : పడ-వేన్ (*SII* 6.79.14,1796), చని-పోవు (*KI* 61.8, 19వ శ.), నడిపించక-పోవు (*NI* 3 రాపూరు 18.21,1622), తెలుపు-కొన్ (*SII* 10.777. 10,1740). కొన్ అనుబంధం ప్రాచీన భాషలో క్త్వార్థకాలమీద చేరేది (§ 3.40). కాని ఈ యుగంలో ఆధునిక యుగంలోలాగా క్రియా ప్రాతిపదికలమీద మాత్రమే చేరుతుంది. -కొన్ అనుబంధంగా చేరటంవల్ల ఆత్మార్థక క్రియ లేర్పడతాయి. -కొని సంకుచిత రూపంగా -క 15 వ శతాబ్ది నుంచి కనిపిస్తుంది (§ 5,52). ఉదా. అనుభవించ్చుక (*SII* 10.769,22,1691). ఈ యుగంలో -కుని అని ఆధునిక రూపం మొదటిసారిగా కనిపిస్తుంది. ఉదా. అనుభవించు -కుని (*SII* 10. 771,16,1692). (b) నామం + క్రియ : కావ్-అడు (*NI* 2 కందుకూరు 48.66,1650). (2) -ఉండు, -కల, -వలయు, -ఇచ్చు మొదలైన సహాయక

క్రియలు చేరగా ఏర్పడేవి రెండవరకం సమస్త క్రియలు. ఉదా. చేస్తు-వుండగా (*SII* 10.772 4,1696), కా-వలెను (*NI* 3 రాపూరు 18.42-13,1662).

**6.32. సకర్మక క్రియలు :** చూచ్ (*SII* 6.79.13,1796), తీన్ (*NI* 2 కందుకూరు 48.30,1650) మొదలైనవి సిద్ధ సకర్మకాలు. (2) అకర్మకాలకు -చు, -ఇంచు, -పులు చేరి ఏర్పడేవి సాధ్య సకర్మకాలు. ఉదా. ఉంచు (అ. క్రి. ఉండు) (*SII* 7.845.4 1632), ఈడేర్చు (అ. క్రి. ఈడేరు) (*NI* 2 కావలి 44.8,1715), జరుపు (అ. క్రి. జరుగు) (*SII* 6.663.13,1432), పండించ్ (అ. క్రి. పండు) (*NI* 2 కందుకూరు 48.18,1650).

**6.33. ప్రేరణార్థకాలు :** సకర్మకాలకు -ఇంచ్ చేరటంవల్ల ప్రేరణార్థకా లేర్పడతాయి. ప్రేరణ -ఇంచ్‌కు ముందు క్రియా ప్రాతిపదికలలో కింది మార్పులు వస్తాయి. (i) (చ్) చ్ (ప్)ప్ గా మారుతుంది. ఉదా. కొలుచ్ :- కొలిపించ్ (*SII* 10.758.17,1658) (ii) -న్ -య్ గా మారుతుంది. ఉదా. వ్రాన్ : వ్రాయించ్ (*SII* 7.790.8,1714), (iii) త్ర్యక్షర క్రియా ప్రాతిపదికలలోని రెండవ అక్షరంలోని ఉ ఇ గా మారుతుంది. నడుపు : నడిపించ్ (*SII* 10.759. 31,1663).

**6.34. క్రియా ప్రాతిపదికలలో మార్పులు :** కాలవాచి ప్రత్యయాలకు ముందు క్రియా ప్రాతిపదికలలో కింది మార్పులు కనిపిస్తున్నాయి. (1) అకారాది ప్రత్యయాలకు ముందు ప్రాతిపదిక చివరి -స -యగా మారుతుంది. ఉదా. చేయ-వలదు <( చేస్-అ-వలదు ) ( *SII* 5.1203.36,1773 ). ఇంతకు ముందు ఈ సూత్రం భిన్నంగా ఉండేది. తాలవ్యాచ్చులకు ముందు -య -స కావటమే ఆ సూత్రం (§ 3.43 (1); 4 51 (గ) ). ఉదా. చేయు ;- చేసి, చేసెను మొదలైనవి. తరువాత సకారాంత సపదాంశాలు ఇతర పరిసరాల్లోకి కూడా వ్యాపించాయి. ఉదా. త కు ముందు : చేస్తూ (ప్రా. చేయు -చు), ఆత్మార్థక సహాయక క్రియ -కొను ముందు : చేసు-కొను (ప్రా. చేసికొని), చేసు-కోండు (ప్రా. చేయు-వాండు) మొదలైనవి. ఇవి యకారాంత ధాతువులు సకారాంతాలుగా పునర్నిర్మితాలయ్యా యనటానికి నిదర్శనం. చేసు-వాండు వంటి రూపాలు 12 వ శతాబ్ది నాటికే కనిపిస్తున్నాయి. (కందప్పచెట్టి § 3.10, § 5.46). ఈ పునర్నిర్మాణం అప్పటికే ప్రారంభమై ఉంటుందని చెప్పవలసి ఉంటుంది. (2) -చ్, -చ్చ్, -ంచ్ లు తకారంతో మొదలయ్యే ప్రత్యయాలకు ముందు స గా మారుతాయి.

ఉదా, నడుస్తూ (<నడుచ్-తూ) (*NI* 3 ఒంగోలు 102.15,1762). (3) అ-తో మొదలయ్యే ప్రత్యయాలకు ముందూ, విధ్యర్థక ప్రత్యయం ఉ- ( ~ φ ) కు ముందు -ఇంచ్‌లోని -చ్ -ప్ కావటం ప్రాచీన భాషారూపాలలో కనిపిస్తున్నా, ఆధునిక భాషలోలాగా ఈ మార్పులేని రూపాలే ఎక్కువగా ఈ కాలంలో కనిపిస్తున్నాయి. అంటే -ఇంచ్, -ఇంప్ అనే సపదాంశాలలో -ఇంచ్ అనే సపదాంశమే అన్ని పరిసరాల్లోకి వ్యాపించటం 13 వ శతాబ్ది నుంచీ ప్రారంభమై (కందప్పచెట్టి § 3.12; § 5.43.) ఈ యుగంలో పూర్తిగా స్థిరపడింది. ఉదా. చేయించ్-అక (*SII* 10.765.39,1678), కట్టించు-ము (*KI* 48.6,1613). (4) త్ర్యక్షర ధాతువుల్లోని రెండవ అక్షరంలోని ఉ తాలవ్యాచ్చుకు ముందు ఇ గాను. అ కు ముందు అ గాను మారుతుంది. ఉదా. చదువు : చదివి (*SII* 5.1203.34,1772), కొలుచు : కొలవగాను (*SII* 10.748.7,1577). (5) కాలవాచి ప్రత్యయంలోని తకారం ప్రాతిపదికాంత న కారంపైన ట గా మారుతుంది. 13 వ శతాబ్ది నాటికే ఇలాంటి రూపాలున్న ఆధారాలున్నా ( కేతన : 26 ) శాసనాల్లో ఇలాంటి రూపాలు మొదటి సారిగా కనిపిస్తున్నాయి. ఉదా. వింటిమి (←విన్-తి-మి) (*SII* 6.80.15,18 వ శ.), వుంటిమి (←ఉన్ (/ఉండు)+తి+మి) (*SII* 10.772.19,1691).

**6.35. సమాపక క్రియలు :** సమాపక క్రియలు రెండు రకాలు. (1) సామాన్య (Simple), (2) అనేక పదనిర్మాణం కలవి (Periphrastic)- (1) సామాన్య సమాపక క్రియలు క్రియా ప్రాతిపదిక + కాలవాచి ప్రత్యయం + పురుష-వచన ప్రత్యయం నిర్మాణంలో ఉంటాయి. ప్రాచీన భాషలోని భూతకాల, తద్ధర్మార్థక, వ్యతిరేకార్థక క్రియలు, ఆధునిక భాషలోని భవిష్యదర్థక క్రియలు సామాన్య సమాపక క్రియలు. ఉదా. చేసిరి (*NI* 2 కందుకూరు 41.30,1693), పోదురు (*SII* 5.120.9,1640), చేస్తారు (*NI* 2 కందుకూరు 48.82,1650). (2) క్రియాజన్య విశేషణాలకు సార్వనామిక ప్రత్యయాన్ని గాని, పురుష ప్రత్యయాన్ని గాని చేర్చటంవల్ల అనేక పద నిర్మాణంకల సమాపక క్రియ లేర్పడతాయి. ప్రాచీన, ఆధునిక భాషలలోని వర్తమాన కాలక్రియలు, ప్రాచీన భాషలో భవిష్యత్క్రియలు, భూతకాల వ్యతిరేకార్థక క్రియలు ఈ కోవలోనికి వస్తాయి. ఉదా. చేస్తున్నారు (*SII* 10.759 22,1663), సేయలేదు (*SII* 10.753 48,1600).

**6.36.** **భూతకాలం : -ఎ-, -ఇ-, -ఇతి-, -తి-** ప్రాచీన భాషలో భూత కాల ప్రత్యయాలు. ఉదా. సాగించెను (*SII* 10.780.7,17 వ శ.), చేసిరి (*NI* 2 కందుకూరు 41.30,1683). వెలసితివి (*SII* 10.780.24,17 వ శ.), చేస్తిమి (*SII* 5.166.9,1624), చేస్తిమి వంటివి ఈ నాటికీ కొన్ని మాండలికా లలో, ముఖ్యంగా తెలంగాణాలో వ్యవహారంలో ఉన్నాయి.

-ఇనా-/-ఇన-/-ఇన్- ఈ యుగంలో భూతకాల ప్రత్యయాలు : ఉదా. వచ్చినావు (*SII* 6.79.14,1796), నడచినవో (*NI* 3 రాపూరు 3.11,1638), అయింది (*SII* 5.1175.11,1419). ప్రాతిపదిక చివరి -న్ పైన ఇనా/ఇన్ లోని ఇ లోపిస్తుంది. వున్నాము (చూ. వెంకటరావు 1960.549. విజయరంగ చొక్కనాధుని శాసనం. 1708:32). ఈ రూపం వర్తమాన కాలార్థంలో కూడా కనిపిస్తుంది. చారిత్రకంగా పై రూపాలు వేయించిన వాడను, వచ్చినవాడు మొద లైన క్రియాజన్య విశేషణాలనుంచి వకారం లోపంవల్ల ఏర్పడ్డాయి. ఆధునిక రూపా లైన వచ్చాడు, వచ్చిండు, వచ్చాము మొదలైనవి పై రూపాలనుంచి ఏర్పడ్డవే.

**6.37.** **వర్తమాన కాలం :** సమకాలీన భాషలో **-తు-** వర్తమాన కాల ప్రత్యయం. ఉదా. చేస్తున్నారు (*SII* 10.759.22,1669). -చున్- ప్రాచీన భాషకు సంబంధించిన వర్తమానకాల ప్రత్యయం.

**6.38.** **భవిష్యత్కాలం :** చేయగలవాడు మొదలైన క్రియాజన్య విశేష ణాల నుంచి వకార లోపంవల్ల ఏర్పడ్డ చేయగలడు వంటి రూపాలు ప్రాచీన భాషలోలాగా భవిష్య దర్థకాలుగా కాకుండా ఆధునిక భాషలో లాగా సామర్థ్యార్థ ద్యోతకాలుగా కనిపిస్తున్నాయి. **-తా-** ప్రత్యయంతో కూడిన తద్ధర్మ భవిష్య ద్రూపాలు చేస్తారు (*NI* 3 కందుకూరు 48.82,1650) వంటివి భవిష్యదర్థంలో వాడుకలో ఉన్నాయి.

**6.39.** **తద్ధర్మార్థకాలు :** ప్రాచీన భాషలో -ø-, -దు-, -తు-, సమ కాలీన భాషలో -తా- తద్ధర్మార్థక ప్రత్యయాలు. ఈ క్రియలన్నీ శాసనాల్లో భవి ష్యత్తునే సూచిస్తున్నాయి. ఉదా. దెంగు -ø- ను (*NI* 2 నెల్లూరు 4.10,1638), సేయు-దు-రు (*NI* 3 పొదిలి 13 24,1642), చేస్తారు (*NI* 2 కందుకూరు 48.82,1650).

**6.40. విధ్యాద్యర్థకాలు :** తద్ధర్మార్థక విశేషణాలకు అది చేరగా ప్రాచీన నిశ్చయార్థకా లేర్పడుతున్నాయి, ఉదా. వుండునది (*NI* 3 ఒంగోలు 102.23, 1762). -ఏ -ది (<ఎడి-ది) చేరటంవల్ల ఏర్పడే ఆధునిక రూపాలు ఈ కాలంలో విరళంగా కనిపిస్తాయి. ఉదా. వుండేది (*SII* 10.769.22,1691). గుంటూరు, కృష్ణా జిల్లాలలో -ఏ -కు బదులుగా -ఇ- కూడా కనిపిస్తుంది. ఉదా. అనుభ వించిది (*SII* 5.1221.12,1809). వుండువారు (*NI* 2 కందుకూరు 41.44, 1683) వంటి ప్రాచీన నిశ్చయార్థకాలు కూడా సమకాలీన శాసనాల్లో కనిపిస్తు న్నాయి. అన్నంతాలకు వలయు, వలెను చేరటంవల్ల ఏర్పడే నిశ్చయార్థకాలు కూడా విరివిగా ఈ కాలపు శాసనాల్లో కనిపిస్తాయి. ఉదా కావలెను (*NI* 3 రాపూరు 18.12,1622). విధ్యర్థకాలలో కట్టించ్చుము (*KI* 48.6,1613) వంటి ఏకవచన రూపాలే ఈ కాలపు శాసనాల్లో దొరికాయి. బహువచనంలో -అండి సేయండి (*NI* 1 ఆత్మకూరు 30.31,1462) వంటి రూపం 15వ శతాబ్దికి సంబంధించిన శాసనంలో కనిపిస్తుంది.

**6.41. ఆశీరర్థకం :** -గాత చేరిన ప్రాచీన ఆశీరర్థకరూపం ఈ కాలంలో కనిపిస్తుంది. ఉదా. ఈడేర్చుకో -గాత (*NI* 3 రాపూరు 60.33,1612).

**6.42: వ్యతిరేకార్థకాలు :** -అ- -$\phi$-, వ్యతిరేకార్థక ప్రత్యయాలు. దీర్ఘంపైన -$\phi$-, ఇతరత్ర -అ- చేరుతుంది. ఉదా. లే -$\phi$- దు (*SII* 10.759. 33,1663), కా -$\phi$- వు (*SII* 10.768.13,1658).

అన్నంతంపైన లేదు చేరటంవల్ల ఏర్పడే సేయ-లేదు (*SII* 10.753.48, 1600) వంటి భూతకాల వ్యతిరేకార్థక క్రియలు, మొదటిసారిగా ఈ యుగ ప్రారంభంలో కనిపిస్తాయి.

సేయ-వలదు ( *SII* 5.1203.36,1773 ) వంటి వ్యతిరేక నిశ్చ యార్థక రూపాలు ప్రాచీన రూపాలుగా ఈ కాలపు శాసనాల్లో కూడా కనిపిస్తున్నాయి.

**6.43. అసమాపక క్రియలు :** (1) క్త్వార్థకం ఇ. చూచి (*SII* 6.79. 13,1796) (2) శత్రర్థకం :— చు. ( ప్రా. రూ. ) -తు ఉదా : యేలుచు (*SII* 10.706,1678), చేస్తూ ( *KI* 53. 11,1812 ). తా/త కూడా ఈ కాలంలో విరళంగా కనిపిస్తుంది. ఉదా: యిస్తా (*SII* 10.770.15,1699). ఈ

రూపాలు 16వ శతాబ్ది మొదటి నుంచీ కనిపిస్తున్నాయి. ఉదా: నడస్తా (*SII* 16 49.7.1512) (3) చేదర్థకం:- ఇనా (ను) ప్రాచీన ప్రత్యయం.-ఇతే/తే సమకాలీన ప్రత్యయాలు. ఉదా: తీసివేసినాను (*NI* 3 రాపూర్ 3.34,1638), చేస్తేను ( *SII* 10.751 22,1592 ). (4) అప్యర్థకం:-ఇన్నీ అప్యర్థకంగా కనిపిస్తుంది. ఉదా: అయ్యీన్ని (*SII* 10.759 24.1663). (5) తుమర్థకం: -అ (ను) తుమర్థకం. ఉదా : సాయను (*SII* 10.759 24,1663). (6) ఆనంత ర్యార్థకం: -కా (ను) ఆనంతర్యార్థకం. ఉదా: తెలుపుకోగా (*SII* 10.758.14, 1658). (7)వ్యతిరేకక్త్వార్థకం:- అక. ఉదా: సాగక (*SII* 10.755 9,1604). -అకుండా చేరటంవల్ల ఏర్పడే ఆధునిక వ్యతిరేకక్త్వార్థకాలు 15వ శతాబ్ది నుంచీ కనిపిస్తున్నాయి. ఉదా: చెడకుండాను (*NI* 1 కందుకూరు 16.40,1430).

**6.44.** **క్రియాజన్య విశేషణాలు :** (1) భూతకాల విశేషణం :-ఇన చేరి ఏర్పడుతుంది. ఉదా: నిలిచిన (*SII* 5.874.17,1620). (2) వర్తమాన కాల విశేషణం:- చేయుచున్న (*NI* 2 కందుకూరు 77.14-15,1523) (3) తద్ధర్మా ర్థక విశేషణాలు: -ఎడి, -ఎడు. -$\phi$ ప్రాచీన తద్ధర్మార్థక విశేషణ ప్రత్యయాలు, -ఏ (< -ఎడు/-ఎడి), -ఏటి (< ఏట్టి < ఏ + అట్టి) ఆధునిక ప్రత్యయాలు. ఉదా: పట్టించు కానియెడు (*SII* 10.753.29 1600), సాగే (*SII* 10.771.11, 1692), చెల్లేటి (*SII* 4:802 20,1509). (4) వ్యతిరేకార్థక విశేషణం:- అని. కానరాని (*SII* 10:759.35,1663).

**6.45.** **సముచ్చయాద్యర్థకాలు :** (1) సముచ్చయార్థకం:- ను/-ని సముచ్చయార్థకంలోని నకారం ద్విరుక్తం కావటం కనిపిస్తుంది. ఉదా: చేనున్ను (*SII* 10.756.9,1619). సముచ్చయార్థకానికి ముందు పదాంతంలోని అచ్చు దీర్ఘం కావడం కూడా ఇంతకు ముందు కాలం నుంచీ కనిపిస్తుంది. ఉదా: కోటాను (*SII* 7.563.5577). ఆధునిక భాషలో లాగా పదంచివరి అచ్చు దీర్ఘంకావటం వల్ల సముచ్చయార్థం వ్యక్తం కావటం ఇంతకు ముందు శాసనాల్లోనే కనిపిస్తుంది. ఉదా. కొదవా *SII* 8.586.6,1585). ప్రాచీన ప్రయోగంగా-యు (న్) కూడా సముచ్చయార్థకంగా ఈ కాలంలో కనిపిస్తుంది. ఉదా: గురువులయును (*NI* 2 నెల్లూరు 46.47 1693). (2) ఏవార్థకం:-అ ప్రాచీన ప్రయోగాల్లోను,- ఏ సమకాలీన భాషలోను ఏవార్థకాలుగా కనిపిస్తున్నాయి. ఉదా. సముఖమంద్ద (*NI* 2 కందుకూరు 41.17.8,1688), పీండ్డే (*NI* 2 కందుకూరు 48.36,1650).

(3) ప్రశ్నార్థకం:- ఆ ప్రశ్నార్థకం: ఉదా. వచ్చినావా? (*SII* 6.79.14,1796).
(4) పోలిక: పోలిక చెప్పటానికి ఆధునిక భాషలోలాగా - లాగు(ను) ఉపయోగించటం కనిపిస్తుంది. ఉదా. యిచ్చేలాగునున్ను (*NI* 2 కందుకూరు 48.42,1650).

**6.46. వాక్యనిర్మాణం :** వాక్యనిర్మాణ పద్ధతుల్లో గతయుగాలకూ, ఈ యుగానికి, ఆధునిక యుగానికి చెప్పుకోదగ్గ భేదా లేమీ లేవు. పైగా శాసనాలు పరిమిత ప్రయోజనం, పరిమిత ప్రయోగాలు కలిగినవి కాబట్టి సమకాలీన భాషలోని వాక్యనిర్మాణాన్ని సమగ్రంగా విశ్లేషించటానికి అవకాశం లేదు. అయినా లభించిన ఆధారలపైననే కొన్ని ప్రత్యేకవిషయాలను పేర్కొనవచ్చు. క్రియాసమాపక వాక్యాలు, నామ సమాపక వాక్యాలు రెండూ ఈ కాలపు శాసన భాషలో కనిపిస్తున్నా క్రియాసమాపక వాక్యాల ప్రయోగమే ఎక్కువ. వాక్యంలో పదబంధాల విన్యాస క్రమంలోకూడా మార్పులు లేవు. ప్రాచీన శాసనాల్లో సంస్కృత ప్రభావంవల్ల కావ్యభాషలో ప్రవేశించిన యత్తదర్థక వాక్యప్రయోగాలు నాలుగు మాత్రమే కనిపిస్తుండగా (§ 3.73) ఈ కాలంలో సుమారుగా శాప (imprecatory) వాక్యాలన్నీ యత్తదర్థక వాక్యాలుగా కనిపిస్తాయి. కర్మణ్యర్థక వాక్యాలు ఈ యుగంలో అసలు కనిపించవు. వ్యావహారిక భాషకు దగ్గరగా ఉండే శాసన భాషలో కర్మణ్యర్థక వాక్యాలు కనిపించక పోవటంవల్ల ఈ వాక్యనిర్మాణం తెలుగుకు సహజం కాదనీ సంస్కృత భాషా ప్రభావంవల్ల మాత్రమే కావ్యభాషలో ప్రవేశించిందని చెప్పవచ్చు. ప్రాచీన శాసనాల్లో మూడు సార్లు మాత్రమే ఈ ప్రయోగాలు కనిపిస్తాయి (§ 3 74).

శాసన భాషలోని వాక్యాలను ప్రధానంగా సామాన్య వాక్యాలనీ, సంశ్లిష్ట వాక్యాలనీ, సంయుక్త వాక్యాలనీ మూడుగా విభజించవచ్చు.

**6.47. సామాన్య వాక్యాలు :** సామాన్య వాక్యాలు నామ సమాపకాలనీ, క్రియాసమాపకాలనీ రెండు రకాలు.

నామసమాపక వాక్యాలు : ఆఖ్యాతంలో నామం ఉండే నామ సమాపక వాక్యం అవుతుంది. నామ సమాపక వాక్యాలుగా సామాన్య వాక్యాలు ఈ యుగంలో తక్కువగా కనిపిస్తున్నా, శాసన భాషలో మొదటినుంచీ ఇలాంటి ప్రయోగాలు ఎక్కువగానే కనిపిస్తాయి. ఉదా. దామయ్య ముత్తతాత (*SII* 10.732.69-70, 1500). వారు దోషులు (*NI* 2 కందుకూరు 85.20,1516). ఆఖ్యాత నామం మధ్యమ, ఉత్తమపురుష ప్రత్యయాలనుకూడా స్వీకరిస్తుంది. ఉదా. నీవు దోషా-

కరుండవు (*SII* 6.79.13,1796). ఆఖ్యాతనామం సంబంధ బోధక నామంకూడా కావచ్చు. ఉదా. ... ఆ పొలము తాండికొండది... (*SII* 10.759.23,1663). అగు ధాతువు వ్యతిరేకార్థక రూపాన్ని చేర్చటంవల్ల పైన చెప్పిన వాక్యాల్లాంటి సమీకరణీయ వాక్యాలు వ్యతిరేకార్థక వాక్యాలవుతాయి. ఉదా. ... (అది)...పరిమి పొలము కాదు (*SII* 10.759.21,1663).

క్రియాసమాపక వాక్యాలు : ఆఖ్యాతంలో సమాపక క్రియ ఉంటే క్రియా సమాపక వాక్యం అవుతుంది. ఇవి అకర్మక వాక్యాలనీ, సకర్మక వాక్యాలనీ ప్రధానంగా రెండు రకాలు. అకర్మక వాక్యాలలో కర్మ ఉండదు. సకర్మక వాక్యాలలో ఉంటుంది. ఉదా. వర్తకులు ...... ఉండిరి ( *SII* 10.770.9,1691 ), కవులు శిలాశాసనం వ్రాసిరి (*SII* 10.769.22-27,1697).

క్రియా సమాపక వాక్యాలలోనే విధ్యాద్యర్థక వాక్యాలుంటాయి. విధి: విధి వాక్యాలలో ధాతువుకు ఏకవచన-లో-ము, బహువచనంలో-అండి చేరుతుంది. కర్త ఎప్పుడూ మధ్యమ పురుషలో ఉంటుంది. ఉదా. ... సంధ్యాదీపానకు ముట్టింపుము (*NI* 2 కావలి 20.4-6, 789-90). బహువచన రూపాలు ఇంతకు ముందు కాలంలోని శాసనాల్లో ఒకసారి మాత్రమే కనపించింది. ఉదా. ... అది పాలించి పుణ్యం లానను సేయండి (*NI* 1 ఆత్మకూరు 30-31, 1462). ప్రశ్న: ప్రశ్న వాక్యం ఒకటి మాత్రమే ఈ కాలంలో కనిపిపిస్తుంది. ఉదా. ... చంద్రుడితో ...... వివాదకు వచ్చినావా? (*SII* 6.79.13-14 1796). ప్రశ్నార్థక పదాలైన ఎవడు, ఎవరు మొదలైన వాటితో ప్రత్యేకంగా ప్రశ్నార్థక సామాన్య వాక్యాలు శాసనాల్లో కనిపించక పోయినా యత్తదర్థక వాక్యాలను ఇలాంటి వాక్యాలు ఉన్నాయనటానికి నిదర్శనంగా గ్రహించవచ్చు. వ్యతిరేక: ఉండు/ఉన్ ధాతువు వ్యతిరేక రూపమైన లేదు చేర్చటంవల్ల వ్యతిరేక వాక్యా లేర్పడుతున్నాయి. ఉదా. యిక్కడ సుంకం...లేదు (*SII* 10.753.59,1600). భూతకాల వ్యతిరేక క్రియతో అంతమయ్యే వ్యతిరేక వాక్యం. బలిమి సేయలేదు (*SII* 10:753.48,1600). నిషేధం: నిషేధార్థక క్రియలతో అంతమయ్యే వాక్యాలు నిషేధ వాక్యాలు. ఉదా. నను నింద్ద సేయవలదు (*SII* 5.1203.36.1773).

**6.48.** సంశ్లిష్టవాక్యాలు : అసమాపకక్రియతో అంతంఅయ్యే ఒకటి గాని, కొన్నిగాని ఉపవాక్యాలతో కూడిన సామాన్య వాక్యాలు సంశ్లిష్టవాక్యాలు. యత్తదర్థకవాక్యాల్లో, అను కృతివాక్యాల్లో మాత్రం ఉపవాక్యంలో కూడా సమాపక

క్రియ ఉండవచ్చు. అసమాపక క్రియతో అంతం అయ్యే ఉపవాక్యాలన్నీ సామాన్య వాక్యాల పరివర్తిత రూపాలే.

క్త్వార్థకం: ఉపవాక్యం చివర ఉండే క్త్వార్థకక్రియ, ప్రధాన వాక్యంలోని క్రియా వ్యాపారానికి ముందు జరిగే వ్యాపారాన్ని సూచిస్తుంది. ప్రధాన వాక్యం లోను, ఉపవాక్యంలోను సాధారణంగా కర్తఒకటేఅయి ఉంటుంది. ఉదా. ... సాహెబులగారు నుఝి గట్టించి ప్రతిష్టచేసె (*SII* 10.760.8-10,1668). క్త్వార్థక క్రియలు హేత్వర్థకాలుగా కూడా కనిపిస్తాయి, ఉదా. ...... అన్నారెడ్డి మోకు మీద నుండి సభామధ్యమందు పడి మృతిబొంద్దె (*NI* 2 కందుకూరు 41.23-25, 1683). క్త్వార్థకక్రియ రీత్యర్థకంగా కూడా కనిపిస్తుంది. ఉదా. ... యి ధర్మ మాచరించి ... దనరు (*SII* 10.772.22,1696). వ్యతిరేక క్త్వార్థకం కూడా హేత్వర్థకం అవుతుంది. ఉదా ... మరహంమతు చేయించక అచ్చెద్ద చేసినాడు (*SII* 10.765.38-40,1678).

శత్రర్థకం: ఉపవాక్యంలో శత్రర్థంలో ఉండే క్రియ ప్రధాన క్రియతో పాటు జరిగే వ్యాపారాన్ని సూచిస్తుంది. ఉదా. ...... భక్షిస్తాను యమపురికి యెంగును (*NI* 2 కావలి 50.16,1636).

చేదర్థకం: ప్రధాన వాక్యంలో క్రియ బోధించే వ్యాపారం ఉపవాక్యంలోని వ్యాపారంమీద ఆధారపడి ఉన్నప్పుడు ఇలాంటి వాక్య ర్మాణం జరుగుతుంది. ఉదా: ఇందుకు తురుకలు తప్పితే పంది మాంసానకు ఆసించ్చిన పాపాన బోదురు (*SII* 10.769 22-24,1691)... -ఇతే/తే తో పాటుగా-ఆ కూడా చేదర్థాన్ని ఇస్తుంది. ఉదా. ఆది తప్పి నడిపించ్చిరా వాండ్ల మానం మ లమాదిగెలకు ఇచ్చిన వాండ్లే (NI 2 నెల్లూరు 115 8-10,1635).

అప్యర్థకం: ఈ వా ్యలలో రెండు వ్యాపారాలకు వైరుధ్యం ఉంటుంది. ఉదా. ఆ పొలము తాండి కొండ్డది అయ్యిన్ని...అపరిమివారు తాండి కొండపొలము గరకసా చేసేదియేమి? (*SII* 10.759.23-25,1663).

**6.49. సంబంధబోధక వాక్యాలు:** ... యిందుకు యవ్వరు ఆక్షేపణ సేతురో వారు శ్రీవైష్ణవ ధర్మంలో వారుగారు (*NI* 3 పోదిలి 1.23-25,1642) వంటి సంస్కృత భాషా ప్రభావంవల్ల కావ్యభాషలో ప్రవేశించిన సంబంధ బోధక యత్తదార్థక వాక్యాలు ప్రధానంగా శాసనాల్లోని శాపయుక్త (imprecetory) వాక్యాల్లో మాత్రమే కనిపిస్తాయి. నామపదాలకు విశేషణాలుగా వర్తించే వాక్యా

ల్లోని క్రియ నామపదానికి విశేషణంగా మారటంవల్ల ఏర్పడ క్రియాజన్య విశేషణాలతో తెలుగులో సంబంధ బోధక వాక్యాలేర్పడతాయి. ఉదా: యీ ప్రతిష్ఠ చేసినవారు గౌతమ గోత్రులు (*NI* 3 ఒంగోలు 13.17-2‹ ,1778).

**6.50. నామ్నీకరణాలు :** ఒక వాక్యం కొన్ని మార్పులు చెందటంవల్ల మరొక వాక్యంలో కర్తృస్థానాన్ని వహించటాన్నే నామ్నీకరణం అంటారు.

సంబంధార్థక నామ్నీకరణం : వాక్యంలోని సమాపక క్రియ నామపదానికి విశేషణంగా మారటమే సంబంధార్థక నామ్నీకరణం. ఉదా. పాపయ చెక్కిన శాసనం (← పాపయ శాసనం చెక్కినాడు) (*SII* 5.1262 21,1873). సంబంధ బోధక వాక్యాలలో కర్తృస్థానం వహించే క్రియాజన్య విశేషణాలు ఇలాంటివే (§ 6.49).

అటం:- అటం చేరటంవల్ల కొన్ని వాక్యాలు వ్యాపార బోధక నామాలుగా మారుతున్నాయి. ఉదా. ఈ శిలాశాసనం చెక్కించడం ( *NI* 2 కందుకూరు 48.45,1650). అది: అది చేర్చడంవల్ల కూడా కొన్ని వాక్యాలు నామ్నీకృతాలవుతున్నాయి. ఉదా. ...... ఆ పరిమివారు తాండి కొండ పొలము గరకసా చేసేది యేమిపని (*SII* 10.759.25-27,1668).

**6.51. అనుకృతి :** ప్రత్యక్ష, పరోక్ష భేదాలతో అనుకృతి వాక్యాలు ఈ కాలపు శాసనాల్లో చాలా అరుదు ... నీవు ... కీర్తిచంద్రుడితో ... వివాదకు వచ్చినావా? అని కోపంచేసి ... (*SII* 6.13-14,1796) అని ప్రశ్నవాక్యాన్ని చేర్చుకున్న అనుకృతి వాక్యం ఒకటి కనిపిస్తుంది. ఈ కింది వాక్యంలో 'అని' విషయార్థ బోధకం. ఊళవారు ఆపరిమివారు లేని గరకసా చేస్తున్నారని మాల్కు చేసిరి (*SII* 10.759.19-22,1668).

**6.52. సంయుక్త వాక్యాలు :** సమప్రాధాన్యం గల రెండు గానీ, అంతకంటె ఎక్కువగానీ సామాన్య వాక్యాల కలయికవల్ల ఏర్పడే సంయుక్త వాక్యాలు ...... మల్లరుసున్ను ...... శ్రీపతిన్ని యీ శాసనం వ్రాసిరి (*SII* 8.495.5,1516) వంటివి ఇంతకు ముందు కాలంలోని శాసనాల్లో దొరుకుతున్నా ఈ కాలపు శాసనాల్లో వాటికి ఉదాహరణలు కనిపించడం లేదు. పై వాక్యంలో సముచ్చయార్థకం-న్ను/-న్ని రెండు వాక్యాలను సంయోజనం చేయటాన్ని, రెండు వాక్యాల్లోను సమాన వ్యాపారాన్ని సూచించే క్రియలలో ఒకటి లోపించటాన్ని చూడవచ్చు.

ప్రకరణం 7

# కావ్యభాషా పరిణామం

## (క్రీ. శ. 1000-1599)

—కోరాడ మహాదేవశాస్త్రి

### పూర్వరంగం

**7.0.** నన్నయ ఆంధ్రమహాభారత రచనకు ఉపక్రమించేసరికి తెలుగులో కావ్యశైలి అన్నది అప్పటికప్పుడే నేర్పడి ఉంది. ప్రాఙ్నన్నయ యుగంలోని కొన్ని తెలుగు శాసనాలు పరిశీలించి చూస్తే ఈ విషయం స్పష్టమౌతుంది.

వచనరూపంలో తెలుగుభాష మనకు శాసనాల్లో ఆరోశతాబ్దం చివరి ప్రాంతం నుంచి లభిస్తున్నది. ఆరు, ఎనిమిది శతాబ్దాల నాటి శాసనాలు, రేనాటిచోళులు, తూర్పు పశ్చిమ చాళుక్యులు, చాణరాజులు వేయించినవి-అన్నీ గద్యలోనే ఉన్నాయి. తొమ్మిదో శతాబ్దంనుంచి గద్యశాసనాలతోపాటు పద్యశాసనాలుకూడా లభిస్తున్నాయి. పద్యశాసనాల్లో ఎక్కువభాగం తూర్పు చాళుక్యరాజులకు చెందినవి. ఇంతవరకు కనబడిన వాటిలో మొట్టమొదటి పద్యశాసనం గుణగ విజయాదిత్యుని సేనాపతి పండరంగని అద్దంకి (గుంటూరుజిల్లా) శాసనం (*EI* 13,271-5). తెలుగు మహాభారతంలాగానే ఇదికూడ గద్యపద్యోభయమైన చంపువులోఉంది: తరువోజ ఛందస్సులో ఒక పద్యం, తరువాత నాలుగు పంక్తుల గద్య. పద్య భాగంలో పండరంగని పరాక్రమోపేతాలైన విజయాలూ, గద్యభాగంలో పరమ మాహేశ్వరుడైన అతడు ఆదిత్యభటారనికి చేసిన దానాలూ తెలుపుతుంది. ఇతర పద్యశాసనాలు అక్కర, సీసం మొ.న దేశీయ ఛ్ఛందస్సుల్లో రచించబడి ఉన్నాయి. పద్యశాసనాల్లోని భాష అంతా చక్కని కావ్యశైలిలో ఉంది. యుద్ధమల్లుని బెజవాడ శాసనం (*EI* 15,150-9).

"స్వస్తి నృపాంకుశాత్యంత వత్సల సత్యత్రినేత్ర! విస్తర శ్రీయుద్ధమల్లుజనపద్మ విఖ్యాత కీర్తి! పస్తుత రాజాశ్రయుఙు త్రిభువనాళరణుఙు సకల వస్తుసమేతుఙు రాజసల్కి భూవల్లభుఙత్రిన్..."

ఈ తత్సమ బహుళమైన భాష పద్యశాసనాల్లోనే కాదు, గద్యశాసనాల్లోనూ కనబడుతుంది. తొమ్మిదో శతాబ్దంనాటి విజయాదిత్యుని ధర్మవరం (నెల్లూరుజిల్లా) శాసన (భారతి 5, 613-20) భాష ఎంత సరళగంభీరమైన శైలిలో ఉన్నదో చదివి చూడండి. ఏవో కొన్ని ఆకాలానికి విహితమైన ధ్వనులు రూపాలు మాత్రం మనకిప్పుడు విలక్షణంగా తోచవచ్చు. కాని ఇది మొత్తంమీద భారత శైలికి సన్నిహితంగా ఉంది.

"విజయాదిత్య పాదపద్మ భ్రమరాయిమాన శ్రీమత్ కడెయ రాజు దనకెని ఈశ్వరునకుం గార్తిఁ జేయుండుంబోలె చౌషష్టికల విసార దుఙయ్న అయ్యపయ్యయు సకలశాస్త్రార్థ పారగులయ్న పెదపణ్ణరంగులు అయ్లమపెగ్గడలుంగరనమ్మన పణ్డరంగును ఈధర్మనిర్వహనోద్యోగమ్ముకు బృహస్పతి సమానులయ్న పెగ్గడ కడెయగారి కొడుకు బెజెయరాజు సమర్థుఙని ఆత్మానృతంబునం బన్చిన ప్రసాదంబని సమస్త రాజ్యభర నిరూపిత మహామంత్రాధిపతి మహేశ్వర పక్షపాతి దేవబ్రాహ్మణగురుభక్తపరుఙు సక్త్రిత్రయ సంపన్నుఙు మయ బెజయరాజు బెజయేశ్వరంబుగల పని విర్వహనంబు సేసి..."

ఇట్టిదే, ఇంకా రాటుదేరిన శైలి క్రీ. శ. 892-922 నాటి కొరవి (వరంగల్ జిల్లా) గద్యశాసనం (శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారి పాఠము) లో కనిపిస్తూంది.

"శ్రీ విక్రమాదిత్య నృపాగ్రతనయుఙయ్న చాళుక్య భీమునకు శౌచకందర్పునకు వేంగీశ్వరునకు రనమర్దనాన్వయ కులతిలకుఙయ్న గన్నర బల్లహానిక స్తంభస్తంబయ్న రణమర్దన కంఠియందన భుజవీర్య బలపరాక్రమంబునందెచ్చి కంఠియంగట్టి పట్టంబెత్తి ఖడ్గసహాయుండై నేల యెల్లంగావంబూని మంచికొకణనాణ్డాందిగ వెంగిదేసము విమ్మవర్ధనుతో నర్థ రాజ్యంబు సేయుచున్న కుసుమాయుధు పెద్దకొడుకు..."

పద్యశాసన కాలానికి పూర్వం తెలుగుభాషా లేఖనాలు లభించిన ప్రారంభ దశలోనే పై పద్యగద్యశాసనాల్లోని శైలిని పోలిన శైలిలో రచింపబడ్డ గద్యశాసనం లభించడం విశేషం. పశ్చిమ చాళుక్య చక్రవర్తి మొదటి విక్రమాదిత్యుని తురిమెళ్ల (కర్నూల్ జిల్లా) శాసనం (*AI* 29, 160-164) 657 సంవత్సరంలో వేయబడింది. ఈ శాసన పాఠం ఇది.

"ఓం॥ స్వస్తి శ్రీమత్ సత్యాశ్రయ శ్రీ ప్రిథివీ వల్లభ మహారాజాధిరాజ విక్రమాదిత్య: పరమేశ్వరభటారులాకున్ శ్రీమదున్నత ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుళ్ - ఆ చంద్రతారార్కపురస్సరం ద్వితీయవర్షం ప్రవర్తమానం కానగొగ్గి భటారళ దక్షిణ భుజాయమానుంబయిన ఆలకుమర ప్రియతనయింబయిన ఉజేనీ పిశాచ నామధేయింబు తుబుతటాక నామాభిధాన నగర ధిష్ఠానుంబయి ఏబువ విషయంబేళన్ తస్యమాతా దత్తం గోవృషాబు భట్టారహో శతపంచాశత్ క్షేత్రం."

ఈ గద్యకూడా కావ్యశైలిలో రచించబడిందని వేరే చెప్పనవసరం లేదు. పైన నిరూపించిన గద్యశాసనాల్లోని భాషకూ, ఇతర గద్యశాసనాల్లోని భాషకూ స్పష్టమైన భేదం కనబడుతుంది. కావ్యశైలిలో ఉన్నభాష సంధి సూత్రాలకు నియత ప్రవృత్తి, తత్సమ పదబాహుళ్యం, అన్వయ సౌష్ఠవంతో కూడిన వాక్యరచనా విధానం, ఈ లక్షణాలతో కనబడుతుంది. వ్యావహారిక భాషలో సంధి ఐచ్ఛికం. తత్సమ పదాలు విశేషంగా ఉండవు. వాక్యరచనకూడా కొంత అసాధారణంగాన్నూ, అసహజంగాను కనబడుతుంది. ఉదా : చోట మహారాజు ఇందుకూరు (కడపజిల్లా) శాసనం (7వ శతాబ్దం ప్రథమపాదం) (*AI* 27,229-230).

"స్వస్తిశ్రీ" చోబమహారాజు ల్దేశన్ ఎరిగల్ దుగరాజుల్ ఇచ్చిన పన్నస కొచ్చియ పాఱ రెవ సమ్మార్జరికిన్ । తేనిలచ్చిన స్టు పఞ్చ మహాపాతక సంయుక్తున్డుగ॥

మొదటివాక్యంలో కర్మపదం చివరకు రావడం, రెండవ దానిలో 'దీనిని' అనడానికి బదులు తేని (=దేని(ని)) అని - సంస్కృతంలో యత్-తత్ వాక్య నిర్మాణ ప్రభావంచేత కాబోలు - వాడడం విలక్షణం.

మరొక ఉదాహరణం: ఇదీ రేనాటిచోళుల శాసనమే. ఎఱ్ఱగుడిపాడు (కడప జిల్లా). 6 వ శతాబ్ది చతుర్థపాదం. (*AI*27,225-8). ఒక వ్యాసవాక్యంలో చెప్ప దగిన భావాన్ని మూడు చిన్నవాక్యాల్లో విరిచి చెప్పడం

"స్వస్తిశ్రీ" ఎరికల్ముత్తురాజుల్ల కుణ్డికాళ్ళ నివబుకాను ఇచ్చిన పన్నస దుజయరాజుల ముత్తురాజులు నవప్రియముత్తురాజులు పల్లవదుకరజులు శక్షికాము ఇచ్చిన పన్నస ఇరవది యాదినాల్కు మఋన్డుఋ వేల॥.

చిన్న చిన్న వాక్యాల్లో, పునరుక్తితో ఈ విధంగా చెప్పడం వ్యావహారిక భాషలోనే కాని కావ్యభాషలో ఒప్పదు. పై శాసనపంక్తులే కావ్యశైలిలో నడుస్తే వాక్యనిర్మాణం ఎలాఉండేదో మార్చిచూపవచ్చును. 'ఎఱికల్ముత్తు రాజల్లకుణ్డికాళ్ళ నివబుకాను దుజయరాజుల ముత్తురాజులు నవప్రియ ముత్తురాజులు పల్లవదుకరజులు

శక్షికాను కొట్టంబున పాఱకుఇచ్చిన పన్నస ఇరవది యాదినాల్కు మఱున్తుల్లునేల'. పండితుని రచనలో అలా ఉండేది వాక్యం.

పై చర్చకు సారాంశమేమంటే ప్రాఙ్నన్నయ యుగంలోనే కావ్యశైలి ఏర్పడింది. దానికాధారాలు ఏడో శతాబ్దంనుంచి కనబడు తున్నాయి.

## చారిత్రక వ్యాకరణం

**7.1.** కావ్యశైలి రూపొందిందంటే కవితా వ్యవసాయం చాలాకాలంగా జరుగుతూ ఉందన్నమాట. కాని నాటి వాఙ్మయ మెలాంటిదో, దాని స్వభావమేమిటో తెలుసుకోవటానికి మన కిప్పుడు ఆధారాలు లేవు. ప్రాఙ్నన్నయ యుగం పద్య శాసనాలు ఇంతవరకు దొరికినవన్నీ దేశీయ ఛ్ఛందస్సులోనే ఉన్నాయి. దేశి వాఙ్మయం ఆనాడు విశేష ప్రచారం పొందిఉండినది అనడానికి సందేహంలేదు. పాల్కురికి సోమనాథుని రచనలనుబట్టి, ఆ వాఙ్మయం విస్తృతి వైవిధ్యాలను కొంతవరకు ఊహించుకోవచ్చు. శిష్టులెవరూ ఆ దేశిని ఆచరించక పోవటం చేతను, అది శిష్టకవి ప్రయుక్తం కాకపోవటం చేతను, లాక్షణికులు దాని లక్షణ నిర్దేశంలో శ్రద్ధ వహించలేదు. నన్నయమార్గ కవితా ఫక్కి ఏర్పడిన తర్వాత దేశిమార్గం క్రమంగా మాసిపోయింది. దేశి కవులు లాక్షణిక కవులుగా పరిగణింపబడలేదు. లేకపోతే నన్నిచోడ, పాల్కురికి సోమనాథులు అంతకాలం అజ్ఞాతంగా ఉండి పోవటం ఎలా సంభవిస్తుంది ?

నన్నయ మూలాన వెనుకటినుంచి వస్తూన్న కావ్య భాషకు పుష్టి చేకూరింది. అతడు గ్రంథస్థం చేసిన భారతభాష గ్రాంథికమై తరువాతి వారికి అనుసరణీయమై రాచబాట అయింది. ఆ మాన్యుడు ఆ మూడు కృతులలో 'నుడువు తెఱుగు' లరసి కొనియే తరువాతి మార్గకవులందరూ తమ రచనలను సాగించారు.

**7.2.** కవిత్రయ యుగానికి సంబంధించిన భాషా చరిత్ర వ్రాయటానికి అవసరమైన సామగ్రి అంతా మన కిప్పటికీ సమకూడిం దనటానికి వీలులేదు. ఇటీవల బయలు వెడలిన నన్నయ, నన్నిచోడుల పదప్రయోగ సూచిక లాధారంగా వారి భాషాస్వరూపాన్ని గురించి పరిశోధన జరిగింది. పాల్కురికి సోమనాథాది శివకవుల భాషా విశేషాలను పండితులు కొందరు పరిశ్రమించి ఆ యా గ్రంథాలకు ఉపోద్ఘాతంలో తెలిపి ఉన్నారు. కాని ప్రధానుడు తిక్కన భాషకు పర్యాప్తమైన పరిశీలన జరగలేదు. తరువాతి కవుల భాషాస్వరూపాన్ని గురించి కూడా మనకు

(14)

సమగ్రంగా తెలియలేదు. నిజానికి ఆ యా కాలపు కవుల రచనలు సూక్ష్మంగా పరిశీలించి సమగ్రమైన వర్ణనాత్మక వ్యాకరణాలు వరసక్రమంలో వస్తేనేగాని శాస్త్రీయంగా భాషాచరిత్ర చెప్పలేము. ఉన్నంతలో మనకు లభించే భాషాసామగ్రిని ఆధారంగా చేసుకొని కవిత్రయయుగం భాషను చారిత్రక దృష్టితో అన్వయించ టానికి ప్రయత్నం చేద్దాం.

**7.3.** పదకొండు - పధ్నాలుగు శతాబ్దాల కాలం కవిత్రయ యుగం. శ్రీనాథుడు పదిహేనో శతాబ్దానికి చెందినవాడు. కావ్య భాషలో 14-15 శతాబ్దాల మధ్య ఎక్కువ భేదం కనబడదు. కాబట్టి తెలుగుభాషా చరిత్రలో 1000 నుండి 1500 వరకు కవిత్రయ (పురాణ) భాషా యుగం అని వ్యవహరించవచ్చు. దీనికి ముందు ప్రాఙ్నన్నయ యుగం, దీని తరువాత ప్రబంధ (ఆధునిక) యుగం ఉన్నాయి. ఇలా ఆంధ్రభాషా చరిత్రను ప్రధానంగా మూడు యుగాలుగా విభజించ వచ్చు. వీటిలో మళ్ళీ కొన్ని అవాంతర దశలు ఉన్నాయి ప్రాఙ్నన్నయ యుగంలో తొమ్మిదో శతాబ్దంలో కొన్ని ప్రధానాలైన మార్పులు జరిగాయి. కవిత్రయ యుగంలో పదమూడో శతాబ్ది తిరిగిన కాలం చాల ముఖ్యమైంది. ఎందుకంటే పద కొండు, పన్నెండు శతాబ్దాల్లో లేదా అంతకుముందు బయలుదేరిన భాషా సంప్ర దాయాలు ఈ కాలానికి స్థిరపడ్డాయి. ఉదాహరణకు : పదమధ్య/పదాంత వర్ణం లోపించి పూర్వస్వరానికి దీర్ఘం కలగడం ప్రాఙ్నన్నయ యుగంలో ప్రారంభ మైంది. ఆ పరిణామం క్రమంగా వ్యాపించి అనేక రూపాల్ని మార్చివేసింది. ఇది ఉచ్చస్థితిని అందుకొన్నది పదమూడో శతాబ్దంలో. మళ్ళీ పదహారో శతాబ్దం భాషా చరిత్రలో ప్రధాన ఘట్టం. ఆధునికాంధ్రభాషా రూపేర్పడుతున్న కాలమది.

ఈ కింది శీర్షికల్లో చెప్పబడే చారిత్రక వ్యాకరణాంశాలు 1000-1500 కాలానికి చెందినవని గ్రహించాలి.

## కవిత్రయ యుగంనాటి కావ్యభాషా స్వరూపం

**ధ్వనులు :**

**7.4.** 11-15 శతాబ్దాల మధ్యకాలంలో ఈ కింది భాషాధ్వనులు కనబడు తున్నాయి.

**అచ్చులు :** అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ఎ ఏ ఒ ఓ ం.

హల్లులు : క ఖ గ ఘ ఙ
చ ఛ జ ఝ ఞ
ట ఠ డ ఢ ణ
త థ ద ధ న
ప ఫ బ భ మ
య ర ఱ ల ళ వ శ ష స హ.

1. అచ్చుల్లో ఋ ౠ ౡ లు హల్లులలో మహా ప్రాణవర్ణాలు. ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ శ ష లు సంస్కృత సమాల ద్వారా తెలుగున ప్రవేశించాయి.

2. దేశ్యాల్లో 'అఇ' లు 'అఉ' లు సన్నిహితంగా ఏకవర్ణస్ఫూర్తి కలిగేట్టు ఉచ్చరించబడగా ఏ, ఔ లు ఏర్పడ్డాయి. ఉదా : అయిదు>ఐదు : అవును > ఔను. అంతేకాని ఇవి ఈ భాషకు సహజ ధ్వనులు కావు. సంస్కృతాని కివి సహజాలు : ఐరావతము; ఔషధము.

3. ఙ ఞ లు వాని వర్గాక్షరాలకు ముందే వస్తాయి. సంయుక్తంలోనే కాని వ్యస్తంగా వానికి ప్రయోగం లేదు.

4. వర్గాక్షరానికి ముందు వచ్చే వర్గానునాసికం అనుస్వారంగా వ్రాయటం సంస్కృత భాషా ప్రభావంవల్ల కలిగింది. కాబట్టే దేశ్యశబ్దాల్లో అనుస్వారానికి వర్గానునాసికం విలువయే ఉన్నది. తద్భిన్నోచ్చారణం సంస్కృత శబ్దాల్లో కాన వస్తుంది. ఉదా : సంయమి; సంహారము.

5. (ః) విసర్గ – అనగా శ్వాసహకారం. తెలుగున పదమధ్యంలోనే వస్తుంది. ఉదా : దుఃఖము, అంతఃకరణము, తపఃఫలము. దీనిని వర్ణాంతరంగా కాక హకారానికి సవర్ణంగా చెప్పుకుంటే సరిపోతుంది. హకారం అజ్మధ్యస్థంగాను, విసర్గ హల్పూర్వంగాను ఉంటాయి.

**వర్ణోచ్చారణ విశేషాలు :**

**7.5.** (1) ఋ, ౠ : వీనికి తెలుగున లేఖన చిహ్నా లేర్పడి ఉన్నవి గనుక ఈ ధ్వనులు తత్సమాల ద్వారా ఈ భాషలోనికి ప్రవేశించాయని తలంచ

వచ్చును. సామాన్య వ్యవహారంలో మాత్రం ఇవి ప్రాచీన కాలంలో రి, లి లు గాను, ఆధునిక కాలంలో రు, లు లుగాను ఉచ్చరించ బడుతున్నాయి. నన్నయ భారతంలో ఋ-రి యతి రికారోచ్చారణాన్ని సూచిస్తుంది. తరువాతి కవులు నన్నయ ననుసరించి ఋ-రి యతిని పాటించారు. కాని శాసనభాషనుబట్టి కవి ప్రయోగాల్లో అప్రయత్నంగా దొర్లిన ఋ-రు యతిని బట్టి 12 వ శతాబ్దంనుండి రుకారోచ్చారణము ఈ ధ్వనికి కలిగిందని ఊహించవచ్చు. ఉదా. పాల్కురికి సోమన: *రు*రు వర్ణదేహంబు *ఋ*గ్వేదమునకు (పండితారాధ్య చరిత్రము). తిక్కన: స ప్తఋషులై రి వారు మ *రు* ద్గణంబునకు (భార. శల్య. 2-160).

2. *ర-ఱ* : రేఫ శకట రేఫలు నన్నయ భాషలో భిన్న వర్ణాలుగానే ఉండినవి. అంటే వాటికి భిన్నోచ్చారణము ఉండినదని అర్థము. ర కంటే ఱ అధిక కంపనము కలది. నన్నయ నన్నిచోడుల గ్రంథాల్లో ఈ ధ్వనులకు సాంకర్యం లేదు. కాని కాలక్రమాన ఱ కారం తన విలక్షణోచ్చారణమును కోల్పోయి సాధు రేఫగానే పలుకబడుతూ వచ్చింది, ర-ఱ ల కలయిక క్రమంగా అధికంగా కనబడుతుంది. 15 వ శతాబ్దానికి ఱ కారం పూర్తిగా భాషలో లోపించి పోయిందని చెప్పవచ్చు. అప్పటినుంచి లాక్షణికులు రేఫ, ఱకార నిర్ణయ పట్టికలు వ్రాయటానికి పూనుకోవటమే దీనికి నిదర్శనం. నన్నయాది ప్రాచీన గ్రంథాలు పరిశీలించగా పదాల్లో ర-ఱ ల ద్వైరూప్యం కానవస్తుంది, ఒకేపదం ఒకప్పుడు సాధురేఫతోను, మరొకప్పుడు శకటరేఫతోను వ్రాయబడి ఉండటం. ఉదా : నన్నయ : అరుదు/అఱుదు; ఊరార్చు/ఊఱుర్చు; కురంగలి/కుఱంగలి; క్రుమ్మరియెదు/ క్రుమ్మఱియెదు; చీరు/చీఱు; చెదరు/చెదఱు; తూరు/తూఱు; దరికొను/దఱికొను; నెఱయు/నెరయు; పరగు/పఱగు; పెఱుగు/పెరుగు; ముందఱ/ముందర - ఇత్యాదులు. తరువాతి కాలపు వ్రాయసకాండ్రు తమ కాలంలోని వర్ణక్రమాన్ని ప్రాచీన గ్రంథాల్లో వ్రాయటం వల్ల ఈ పరిస్థితి ఏర్పడి ఉంటుంది. కూతురు శబ్దము సాధు రేఫతోనే నన్నయ నన్నిచోడుల ముద్రిత గ్రంథాల్లో కానవస్తూండగా, 11-12 శతాబ్దాల శాసనాల్లో ఈ పదం నియంతగా శకటరేఫతోనే వ్రాయబడి ఉంది.

3. *క్ష* : క్షకారాన్ని నన్నయ భారతంలో కఖగఘలతోనే మైత్రి కల్పించబడిందిగాని షకారము, దాని మిత్ర వర్ణాలతోకాదు. అంటే ఈ సంయుక్తాక్షరంలో కకారోచ్చారణానికే ప్రాముఖ్యం ఉందన్నమాట. నన్నెచోడుని గ్రంథంలో కష లు రెండింటికీ మైత్రి కలదు. ఇలాగే తక్కిన గ్రంథాల్లోనూ ఉంది. నన్నయకూ

తరవాత కవులకూ ఈ విషయంలో ఉన్న భేదం క్షకారోచ్చారణంలో గలిగిన మార్పుకు సూచకం కావచ్చు.

4. జ్ఞ : పై దానిలోలాగ జ్ఞ వర్ణోచ్చారణంలోనూ కాలక్రమాన భేద మేర్పడింది. నన్నయ దీన్ని చఛజఝలతో కలపగా తిక్కన కకారంతో యతి కలిపినాడు. ఆధునిక వ్యవహారంలోను ఈ రెండు భిన్నోచ్చారణలు మాండలికంగా ఉన్నాయి.

5. దేశ్యశబ్దాల్లో దీర్ఘంమీద అనుస్వారాన్ని తేల్చి పలుకుతూ ఉండేవారు. ఇలా తేల్చి పలకడం సంస్కృత శబ్దాల్లో లేదు. ఉదా : వాఁడు; ఖాండము. కనుకనే నన్నయ దేశ్యాలను సంస్కృతాలను ప్రాసలో కలపడు. కాని కొన్ని మండలాల్లో దీర్ఘంమీది అనుస్వారాన్ని పలుకుతూ ఉండేవారు. నన్నిచోడుడు ఈ మాండలికోచ్చారణని అనుసరించి దేశ్య సంస్కృత శబ్దాలకు దీర్ఘ పూర్వక బిందుప్రాస కలిపినాడు. (కు. సం. 1-4; 2-82). పూర్ణబిందువు ఉచ్చారణలో భ్రష్టమైన కారణంచేత తిక్కనాదులు సబిందు, నిర్బిందు ప్రాస నుపయోగించారు. (ప్రా. వ్యా. ఖా. పుట 233). దీర్ఘంమీది అనుస్వారాన్ని తేల్చి పలకడం, ఊది పలకడం అనే ఈ రెండు మాండలిక సంప్రదాయాలు ప్రాఙ్నన్నయయుగం నుండి ఆధునిక యుగం వరకు వస్తూనే ఉంది. ఉదా : ఆందది-ఆదది; తోంక-తోక; కోంతి-కోతి.

**ధ్వనుల మార్పులు :**

**7.6.** లోపదీర్ఘత : ఇది ప్రాఙ్నన్నయ యుగంలోనే ప్రారంభమై వ్యవహారంలో క్రమంగా వ్యాప్తి చెందినట్టు శాసనాలనుబట్టి తెలుస్తుంది. మొదట్లో ఈ రూపాలు కేవల వ్యావహారికాలై శిష్ట భాషలో ప్రవేశం లేకపోవడంచేత నన్నయ వీటిని వాడలేదు. వ్యవహార ప్రాచుర్యాన్ని బట్టి తిక్కనాదులు క్వాచిత్కంగా వాడారు. ఉదా : మరాకుము<మరువకుము (భార. ఉద్యో.); కళ్యాలన్<కళ్యములన్ (విరాట. 1-65); నమ్మీనమ్మక < నమ్మియు నమ్మక (శాంతి. 2-35). ధాతుజ విశేషణాలమీది తచ్ఛబ్ద వకార లోపంతో కారకక్రియ లేర్పడ్డంలో ఈ ధ్వని పరిణామమే కనబడుతుంది. నన్నయ కాలంలో 'వండినవాడు' వంటి రూపం తిక్కన కాలానికి 'వండినాఁడు' అయి కావ్యభాషలో అంగీకరించ బడింది. ద్రుతలోపం వల్ల కలిగిన దీర్ఘాంతాలు చాలా (<చాలన్), కూడా (<కూడన్),

బాగా (<బాగుగన్), దాకా (<తనుకన్) ఇత్యాదులు అప్పటికీ ఇప్పటికీ వ్యావహారికాలుగానే నిలిచిపోయాయి. లాక్షణికుల దృష్టిలో కేతన గ్రామ్యాలని నిషేధించిన రూపాల్లో ఈ విధంగా కలిగినవి ఉన్నాయి: వాటి. మమ్మూ, గొంటూ, మోసేటి, పంపేరు-ఇత్యాదులు. దేశినాదరించిన శివకవుల రచనల్లో ఇవి ఎక్కువగా కనబడ్డంలో ఆశ్చర్యంలేదు. ఉదా : నన్నిచోడుడు : సాము (<సగము; కు. సం. 4-58), గ్రాము<గ్రహము (పై. 10-17), మోము<మొగిము (పై. 6-13). ప్రత్యయ ము వర్ణలోపం : వైరాన<వైరమున (కు.సం. 4-61). పాల్కురికి సోమన : మాజనము<మహాజనము; మరాకు<మరువకు (బసవపురాణం). మార్గకవుల గ్రంథాల్లో ఈ రూపాలు ప్రబంధ యుగం నుంచీ విశేషంగా ప్రవేశించాయి. (చూ. *బాలకవి శరణ్యం*).

**7.7. ఇయ<ఎ :** నన్నయ నన్నిచోడుల గ్రంథాల్లో ఇయాంతాలు, ఎత్వరూపాలు వాడబడినయి. ఉదా : భార : గద్దియ>గద్దె, పల్లియ>పల్లె, కన్నియ, పక్కియ, లొట్టియ. నన్నిచోడుడు : ఎడకత్తియ, చెలికత్తెలు, తేనియ తేనె, ఉట్టియ, మల్లియ ఇత్యాదులు. కేతన ఆంధ్రభాషా భూషణంలో ఇయాంతాలను ప్రస్తావిస్తూ మల్లియ-మల్లె, గద్దియ-గద్దె, లంజియ-లంజె ఇత్యాదులలో ఇయాంతాలనే కావ్యాల్లో ప్రయోగించాలని చెప్పాడు. అంటే ఆతని కాలనికి ఇంకా ఎత్వరూపాలకు వ్యావహారిక వాసన వదలలేదని అర్థం. తరువాతి కాలంలో ఎత్వరూపాలు శిష్టవ్యవహారంలో బాహాటంగా వాడబడడంచేత పూర్వకవి గ్రంథాల్లో క్వాచిత్కంగా నైనా ప్రయోగించబడి ఉండటంచేత అర్వాచీన లాక్షణికులైన అహోబలుడు, కూచిమంచి తిమ్మకవి వీటిని అంగీకరించారు.

**7.8. డ->ద- :** దేశ్యశబ్దాల్లో పదాది డకారం చాల తక్కువ. నిజానికి ద్రావిడ భాషల్లో ఎక్కడా పదాదిని మూర్ధన్యాక్షరం ఉండదు. ఉట్టిది తెలుగున వర్ణవ్యత్యయంవల్ల ప్రాఙ్నన్నయ యుగంలోనే ఏర్పడింది.* అఱచు>*ఱఅచు>>ఱచ్చు>డచ్చు. ఇట్లే అడంగు>డాంగు>డాఁగు. ఈ పదాది డకారం నన్నయ కాలంనుండి దకారంగా మారడం సంభవించింది. కావ్యాల్లో డ/ద ద్వైరూప్యం కనబడుతుంది. నన్నయ : డప్పి-దప్పి, డాఁచు-దాచు; నన్నిచోడుడు : డాఁగి-దాఁపక, డాయన్-దాయన్ మొ.వి.

**7.9. పదమధ్యాజ్లోపము :** పదమధ్యాజ్లోపంతో కూడిన మార్పులు

నన్నయనాటినుండి కావ్యభాషలో కనబడుతూనే ఉన్నాయి. ఉదా: నన్నయ: తొడుగు-తొడ్గు, పొలతి-పొల్తి, ఉనికి-ఉన్కి. నన్నిచోడుడు: కుడిచి-కుడ్చి, మఱిగి-మర్గి. కాని ఇట్టి రూపాలకు దేశికవులల్లోను, శాసన భాషలోను వాడుక హెచ్చుగా కనబడుతుంది. పాల్కురికి సోమన; పెరుగు-పెర్గు, కసవు-కస్వు ఇత్యాదులు.

వ్యవహారంలో ఊతలేని అక్షరంలో అజ్లోపం సహజమే. వ్యావహారిక భాషా ప్రభావం చేతనే ఇలాంటి సంగ్రహ రూపాలు తరువాతి కవుల గ్రంథాల్లోనూ, అనేక విధాలైన శబ్దాల్లో ఏర్పడ్డాయి. తిక్కన: వాలింగిలియు (<వాలియును నిర్వ. రామా. 7-99); భావనామాలు: అంట (<అనుట), కొంట (<కొనుట). 'పాండు నృపాలు పాలు గైకొంటయె చాలు' నని తిక్కన ప్రయోగము (భార. ఉద్యో). పొలతి-పొల్తిలో జరిగినటువంటి మార్పే కొనుట-కొంట లోనూ జరిగింది. అయినా 'కొంట' వంటి భావనామాలు నన్నయలో లేవని కాబోలు పరిహరింప దగినవని అధర్వణ అహోబలులన్నారు. పొల్తి, కొంట అనే రూపాలేర్పడినట్లే పదాంత వర్ణంలో ఉత్వలోపం వలన అన్నం, సున్నం, సముద్రం వంటి రూపాలేర్పడ్డాయి అయినా ఇవి వ్యావహారికాలుగానే నిలిచి పోయాయి. మహాకవి ప్రయోగాలనుబట్టి, వాని బాహుళ్యాన్ని బట్టి లాక్షణికులు శబ్దాల సాధుత్వాసాధుత్వాలను నిర్ణయిస్తారు.

పదాంత ము వర్ణంలో ఉత్వలోపానికి ఉదాహరణాలు 11 వ శతాబ్దం నుండి లభిస్తున్నాయి. ఆదివారంనాణ్డు (*SII* 10-75), ఆచంద్రతారకం (పై. 4.1364, 1356, 1213), శకాబ్దం (పై. 10-660), బాణపురం (పై. 5-1312). 15 వ శతాబ్దానికి వ్యావహారికభాష సర్వత్రా వ్యాపించింది. కాని పైన చెప్పినట్టు దీనివల్ల కావ్యభాషలో కలిగినరూపాలు చాల తక్కువ.

**వ్యావహారిక భాషా రీతులు;**

**7.10.** కావ్యభాష వీటివల్ల ప్రభావితం కాకపోయినా సమకాలంలో జరుగుతూ ఉన్న వ్యావహారిక భాషాపరిణామాలు కొన్ని మనం ఇక్కడ గుర్తించవలసి ఉంది. పదాంత ఉత్వలోపం ఒకటి పైన చెప్పబడింది. ఇతరాలు.

1. యాదృచ్ఛిక మహాప్రాణత్వము: అల్పప్రాణ వర్ణాలు కొన్ని మహాప్రాణవర్ణాలుగా ఉచ్చరించ బడుతూ ఉండినట్లు లేఖనాన్నిబట్టి ఊహించుకోవచ్చు.

మహాప్రాణత్వం ఎక్కడ కలుగుతున్నదో చెప్పడానికి ఆస్కారం కనబడదు. కనుకనే యాదృచ్ఛిక మనడం. శాసనాల్లో ఇలాంటి ఉదాహరణలు విశేషంగా ఉన్నాయి. సుఖము, వంచన, సంక్రాంథి, పాధిక, అప్పము, ఖండి, ఖెల్లము-ఇత్యాదులు. బసవ పురాణంలో ఒకచోట 'భావి' అనే ప్రయోగం ముద్రిత ప్రతులలో ఉన్నది. ఇది తప్ప ఇటువంటి రూపాలు శివకవులలోనూ కానరావు. సంఖ్యావాచక సమస్త పదాల్లో మహాప్రాణత్వం స్థిరపడి ఆధునిక యుగంలో శిష్టరూపాలైనవి : ముప్ఫై, నలభై, ఏభై, డెబ్భై, ఏనభై, తొంభై, ఇరవై, అరవై, రూపాలకు ఇరభై, అరభై మాండలికాలు ఇప్పటికీ వ్యవహారంలో ఉన్నాయి. అనంతపురం జిల్లాలో ఈ రూపాలు వినబడతాయి.

2. అది సంధ్యక్షరంగా ఇఈ, ఎఏలు యకారాన్ని, ఉఊ, ఒఓ లు వకారాన్ని గ్రహిస్తాయి. ఉదా. యింద్రుండు, యెఱుగు, యేగు, వుదధి, వోపిక, కావ్యభాషలో ఈ రూపా లెవరూ వాడకపోయినా లాక్షణికులందరూ ఈ ప్రమాదం వుందని గుర్తించి కవుల్ని హెచ్చరించారు. అథర్వణు డంటాడు : ''ఆద్యవర్ణాస్తు మాత్ర్యేన నగృహ్యంతే కదాపిచ" అని, "యకారంబును వువూ వొవోలును తెలుగు మాటలకు మొదటలేవు'' అన్న సూత్రంలో సూరి ఈవిషయాన్నే జ్ఞాపకం చేస్తున్నాడు.

3. సంయుక్తమధ్య సంధ్యక్షరాలు : న, మలు రేఫ సంయుక్తాలైనప్పుడు ఆ సంయుక్తాక్షరంమధ్య వరసగా దకార బకారాలు సంధ్యక్షరాలుగా చేరడం శాసనోదాహరణాలనుబట్టి తెలుస్తూంది. బుద్దన్ద్రిపాలి సామ్రబాజ్య, ఏకామ్బ్రనాథ ఇత్యాదులు. HGT. P. 57). ఇలాంటి రూపాలు కావ్యభాషలో కెక్కలేదు.

4. శ-స లు : వ్యవహారంలో తాలవ్య, దంతోష్మ ధ్వనులు -శ -స లు తారుమారవడం అతి ప్రాచీన శాసనకాలం నుండి కానవస్తూంది. సాధారణంగా తాలవ్యాచ్చుతో కూడినప్పుడు సకారం శకారోచ్చారణం పొందుచున్నది. ఉదా : వేంచేసిన, శేయించిస, శేవలు. తద్భవాల్లో శకారం సకారంగా మారడం మరొక ధ్వనిపరిణామం. ఉదా ; సిరస్సు, సుఖము, సివరాత్రి-రూపాలు పామరజన వ్యవహారంలో ఉన్నవి. వీటి ఫలితంగా భాషలో శ-సల ఉచ్చారణలో విశేషమైన వ్యత్యయం కలిగింది. ఇటువంటిరూపాలు కావ్యభాషలో చేరకపోయినా అప్పకవ్యాదులు హెచ్చరిస్తారు. సకలము, సకృత్తు శబ్దాలను శకలము, శకృత్తు అని వ్రాయవద్దని.

5. వ్యవహారంలో తాలవ్యాచ్చుకు ముందున్న వకారానికి బదులు యకారం పలకడం తరచు కనబడుతుంది. గోయింద (<గోవింద) శబ్దము 7వ శతాబ్ది శాసనంలో ప్రయోగింపబడి ఉన్నది. ఈ రూపాలు వ్యావహారికాలని కేతన హెచ్చరించాడు. గ్రామ్యాలకు ఉదాహరణాలుగా ఇచ్చిన వాటిలో యేగ, యేదాలు, యీడు- రూపాలున్నాయి. తరిచిచూస్తే ఇటువంటివి కావ్యాల్లో కనబడతాయిగాని (కు. సం. కోయిలలు 8-153; కోవిల 4-107) తక్కువ.

6. **అయి>ఐ, అవు>ఔ**; మార్పులు వ్యవహారంలో పరిపాటి. కావ్యభాషలోను ఈరీతి అంగీకరించ బడింది. కయిత (<కవిత) >కైత, అవుర>ఔర. ఈమార్పు స్థిరపడగానే విపర్యాస రీతిని ఐ>అయ్, ఔ>అవ్ మార్పు సంభవించింది. యౌవన>యవ్వన. యవ్వన శబ్దం నన్నెచోడుడు వాడినాడు. (కుమా. 8-157). కవిత్రయం వారిలో ఈ రూపాలు లేవుగాని తదితరుల్లో కొంత ప్రవేశించినాయి. అప్పకవ్యాదులు ఈ రూపాలను గూర్చి హెచ్చరిస్తారు.

7. దేశ్య శబ్దాల్లో రేఫ సంయుక్తాక్షరాలు ప్రాఙ్నన్నయ కాలానికే వర్ణ వ్యత్యయం మూలంగా ఏర్పడ్డాయి. ప్రాచీన ద్రావిడ భాషలో వర్గానునాసికంతో కూడిన స్పర్శం తప్ప అన్యసంయుక్త వర్ణాలులేవు. రేఫ సంయుక్తాలలో రేఫ క్రమంగా లోపిస్తుంది. ప్రాఙ్నన్నయ యుగంలో కొన్ని ఉదాహరణా లున్నాయి. కాని ఈ ధ్వని సంప్రదాయం వ్యాప్తిజెంది రూఢమైంది కవిత్రయ యుగంలోనే. 15వ శతాబ్దికి రేఫ సంయుక్తాలలో రేఫలోపించి పోయిందని చెప్పవచ్చు. కేతన గ్రామ్యానికి చూపిన ఉదాహరణాలలో బొమ్మడు, తవ్వు, గద్ద, గుద్దు-ఇలాంటివే. కావ్యభాషలో ఈ రూపాలు ప్రవేశించలేదు.

8. థ-ధ ; మార్పు ప్రాఙ్నన్నయ యుగంలో ప్రారంభమైంది. శాసనభాషలో మన్మధ+రధ, సమర్ధ, పృధివి, మిధిల వంటి రూపాలు తరుచుగ కనబడుతాయి. ఇవి కావ్యభాష కెక్కలేదు. కాని తిక్కన కృష్ణదేవరాయలు మొదలైన కవులు వాడిన థ-ధ ప్రాసకు ఆధారం ప్రజావ్యవహారంలోని ఈ రూపాలై ఉంటాయి. అప్పకవ్యాదులు ఈ రూపాలను గూర్చి హెచ్చరిస్తారు.

9. **అటు-ఇటు-ఏటు:** శబ్దాల్లో టకారానికి షకారోచ్చారణ వైదిక-ఛాందసుల మాండలికంలో ఉండి ఉంటుంది. కేతన గ్రామ్యపదాల కిచ్చిన

ఉదాహరణల్లో అషువలె, ఇషువలె అనేవి ఉన్నాయి. దక్షిణాంధ్ర యుగంలో అహల్యా సంక్రందనం, మన్నారు దాసవిలాస నాటకంవటి కావ్యాల్లో ఈ రూపాలు వాడబడ్డాయి. కవిత్రయ యుగపు కావ్యాల్లో కానరావు.

**కొన్ని ధ్వని పరిణామ రీతులు :**

**7.11. 1. వర్ణసమీకరణం :** స్వరసామ్యం : సంస్కృత అకారాంత ప్రాతిపదికలకు -డుజ్ ప్రత్యయం చేరినపుడు సర్వసామ్యంవల్ల అత్వం ఉత్వం కావటం సర్వసాధారణం. దీనికి నన్నయ భారతభాగంలో 'గరుడఁడు' శబ్దము అపవాదము (1-2-76). తరువాతి కాలంలో 'గరుడుఁడు' అయింది.

2. **వర్ణవ్యత్యయం :** తెలుగు మూలభాషనుండి విడివడి ప్రత్యేక భాషగా ఏర్పడిన కాలంలో వర్ణవ్యత్యయం కొన్ని సన్నివేశాల్లో నియతంగా వర్తించినది. తత్ఫలితంగానే దేశ్యాలలో అంతకు ముందులేని లకార రకారాది శబ్దాలు, రేఫ సంయుక్తాక్షరాలతో కూడినవి బయలుదేరాయి. కొన్ని శబ్దాల విషయంలో రెండు రూపాలూ నిలిచి ఉన్నవి. ఎఱుక-ఱెక్క, ఆనన్-నాన్, అనవుడు-నావుడు, ఆనక-నాక, ఎల-లే ఇత్యాదులు.

తాత్కాలికంగా ఉచ్చారణంలో తడబాటువల్ల కలిగినవని చెప్పదగిన రూపాలు కావ్యభాషలోని కెక్కినవి గలవు ఉదా : అలరన్ (-అలరన్, కు. సం. 11-34), నవుటాల (-నవ్వులాట, భార. ఉద్యో. 3-116).

3. **వర్ణవినిమయం :** భాషలో ప్రత్యేక వర్ణాలుగా వ్యవహరించే వాటిలో కొన్నింటి వినిమయం (free variation) కానవస్తూంది. నన్నయ నన్నెచోడుల గ్రంథాలనుంచి పదప్రయోగ సూచిక లాధారంగా గ్రహించబడ్డవి.

| | |
|---|---|
| క/గ ; | కొనకొని-గొనకొని |
| గ/వ : | పగలు/పవలు |
| చ/స : | చుమ్మ/సుమ్మ |
| ద/ట : | ఆదదాన-ఆటదాన |
| డ/ణ : | అడఁగు-అణఁగు |
| త/ద : | తందడి/దందడి |

| | |
|---|---|
| త/ట ; | తెంకాయ-టెంకాయ |
| ద/డ : | అరువదేను-ఇరువడేను |
| ద/జ : | జాజి-జాదులు |
| వ/మ : | నివురు-నిమురు |
| ల/ర : | బత్తలించు-బత్తరించు |
| ల/న , | తెలుఁగు-తెనుఁగు |
| అ/ఇ : | అదరిపడు-అదిరిపడు |
| అ/ఉ : | మెలపొారు-మెలుపారు |
| అ/ఎ ; | తీఁగ-తీఁగె |
| అ/ఒ , | అందలు-అందొలు |
| ఇ/ఉ : | ఎఱింగించు-ఎఱుంగించు |
| ఇ/ఎ ; | కోరికి-కోరికె |
| ఉ/ఒ : | డుల్లెన్-డొల్లెన్ |

దీర్ఘాచ్చు/హ్రస్వాచ్చు : పలుమారు-పలుమరు.

(4) పదాది హల్లోపం : దీనివల్ల ఒకేరూపం హలాదిగాను, అజాదిగాను కానవస్తుంది. ఉదా , నెగయు (శా.సం. 5-110) -ఎగయు (2-42), నీల్గి(11-90) -ఈల్గె (7-112).

సంధి

**7 12.** కావ్యభాషకు వర్తించే సంధి విధానం వైయాకరణులచే సవివరంగా చెప్పబడింది. కావ్యభాష సంధి సూత్రాలకు నియతప్రవృత్తి, వ్యవహార భాషలో ఐచ్ఛికత. కావ్యభాషలో అచ్చులమధ్య ప్రకృతిభావం ఉండదు. శాసనాలలో తరచు ప్రకృతిభావం కనబడుతుంది. ఇదిగాక తత్సమ అకార సంధి సంస్కృత పద బంధాల్లో పరస్వరైకాదేశ రూపమైన అచ్సంధి. అచ్ సంధిలో వకారాగమం, ద్రుతద్విత్వసంధి ఇత్యాదులకు ఉదాహరణలు విరివిగా కనబడతాయి.

అచ్సంధి : కావ్యభాషలో రెండచ్చులు పక్కపక్కన వచ్చినప్పుడు.

1. పూర్వస్వరమైనా లోపించాలి (-పరస్వరైకాదేశం), లేదా-

1. పూర్వస్వరం శబ్దానికి అవయవికంగా గాని వ్యాకరణ ప్రక్రియను బోధించేదిగాగాని ఉన్నప్పుడు ఆ అచ్చుపై సంధ్యక్షరం ఒక్కటి చేరుతుంది. కావ్యభాషలో యకారం మాత్రమే సంధ్యక్షరంగా వస్తుంది.

**7.13.** పూర్వ పదాంతస్వరం ఉత్వమైతే దానికి నిత్యలోపం. అది ఇత్వమైనపుడు 1. మధ్యమ పురుష క్రియలలోని ఇత్వం నిత్యంగా లోపిస్తుంది. 'నిత్యమనుత్తమ పురుష క్రియాస్వితః' అని ఆంధ్రశబ్దచింతామణి సూత్రము, "అనుత్తమ" పురుష శబ్దానికి 'మధ్యమపురుష' యని కొందరు; ప్రథమ మధ్యమ పురుషలని కొందరు భిన్న రీతుల్లో అర్థం చెప్పారు. నన్నయలో మధ్యమపురుష ఇకారానికి నిత్యంగా, ప్రథమోత్తమ పురుషల్లోని ఇకారానికి వైకల్పికంగా లోపం కలుగుతున్నది. తరువాతి గ్రంథాల్లో మధ్యమపురుషలోను లోపించని ప్రయోగాలు కనబడుతున్నాయి. మొత్తంమీద ప్రాచీన గ్రంథాల్లో సర్వనామ ప్రత్యయ ఇకారం నిత్యంగానూ, వైకల్పికంగానూ లోపిస్తూన్నదనీ, లోపంకలిగిన రూపాలకే ప్రాచుర్యమనీ గ్రహించాలి. సర్వనామ ప్రత్యయాలలోని అచ్చు ఉచ్చారణవశాన ఏర్పడ్డది. కాబట్టే అది లోపించడం సహజం. ఇకారాంతాల్లో చాల సందర్భాల్లో ఈ అచ్చు అవయవికం గనుక ఆ సామ్యంచేత అచ్చు లోపించని రూపాలు క్రియాపదాల్లో ఉంటాయి.

ఏమ్యాది గణంలోని ఇకారానికి వైయాకరణులు వైకల్పిక లోపం చెప్పారు. కాని నన్నయలో అచ్చు లోపించడంలేదని ఆంధ్రభాషా చరిత్రకారులు సూచించారు (ఆం. భా చ. పుట. 1342). వైకల్పిక సంధి తదువాతి కాలంలో కలిగిందన్నమాట.

నామాల్లో ఇకారం లోపించిన రూపాలు విరళంగాఉన్నాయి. కవిత్రయంలో కన్నా శివకవుల్లో ఈ రూపాలు అధికం. ఉదా : రాతిరెల్ల (భార. 1-6-160), కంచేదు వాడల (బస. పురా), వావెఋంగని (పం. చ), చెయొక్క (భార. ఉద్యో 1-219), తెలివెందునున్ గలదె (భార. ఉద్యో. 2)

క్త్వార్థక ఇకారం, షష్ఠ్యర్థ ఇకారం వ్యాకరణార్థాన్ని బోధించేవి కాబట్టి ఇవి లోపించకుండడమే సహజం, సామాన్యవిధి. లోపం జరిగిన రూపాలు నన్నయలో లేవుగాని దేశి కవులలోను తిక్కనాదులలోను కనబడుతున్నాయి. పొంగెఱగెడు (కు. సం 11-72), వెఱచుండుము, ఏతెంచారగించె (బస. పురా.), అందిమ్ము

(భార. వి. 4-112) (ఇది శబ్దపల్లవమని కొందరు), వెఱచిట్లు (నిర్వ. 5-88), ఎటిఃగెటింగి (భాగ. 9-515). షష్ఠీ ఇకారం లోపించినదాని కుదాహరణలు : నరు నునికి (భార. 1-8-167), జమునిల్లు (భార. 2-209), కృష్ణునల్లుడు (ద్రో. 2-248), దీనంబ్రుములు (శృం.నై.) .

తత్సమ శబ్దగత ఇకారం కూడా సామాన్యంగా లోపించదుకాని లోపించిన ప్రయోగాలు లేకపోలేదు. వ్యవహార భాషలో ఇలాంటి సందర్భాల్లో అర్థభంగం నివారించడానికి ఊత మొదలైనవి ఉంటాయి. వ్యవహార బలాన్నిబట్టి కావ్యభాషలో ఈ ప్రయోగాలను గ్రహించారని చెప్పాలి.

**7.14.** **అత్వసంధి :** ఆర్యాంబాద్యర్థక శబ్దాల విషయంలో అత్వసంధి కలుగ టానికి కారణం ఇవి కేవలం లింగబోధకాలుగానో, ఆదరార్థకములుగానో శబ్దంపై చేరుతుండటం. ఆపుడు దీనిని అపదాది స్వరసంధికింద పరిగణించాల్సి ఉంటుంది.

అత్వలోపంతో కూడిన మరొకసన్నివేశం : చింతాకు, తనంత, చేయ కుండెను వంటి రూపాలు నన్నయాది ప్రాచీన గ్రంథాల్లో యడాగమంతో కూడిన రూపాలే ప్రచురంగా ఉండగా కాలక్రమాన సంధికలిగిన రూపాలు వ్యవహారబలంచే కావ్యభాషలో ప్రవేశించాయి. స్త్రీవాచక శబ్దాల్లోను, షష్ఠీరూపాలలోను అత్వం లోపించకుండటం సామాన్య విధి, లోపించిన ఉదాహరణలు కవిత్రయయుగం నుంచి ఉన్నవి. ముందరింద్రు పంచిన (భార. 1-8-238), అంతవమానము (భార. సభా. 3-203), ఉర్వీశులొద్ద (భార. 1-7-221), దేహేంద్రియంబు లిచ్చలు (కు. సం. 6-65), భక్తులిండ్లు (బ. పు.)

సంబోధన అకారం లోపించదు. బసవ పురాణంలో దీనికి అపవాదాలైన ప్రయోగాలు విలక్షణాలు : అమ్మలా రక్కలారని; జైనులారెన్నడు.

**7.15.** **అచ్చు + హల్లు :** ప్రథమమీది పరుషం-అనగా పూర్వపదాంత సర్వానికి పరపదాది శ్వాస స్పర్శం పరమైనప్పుడు అది అజ్మధ్యస్థమగుట సంభ వించగా అప్పుడది వర్ణ సమీకరణంవల్ల నాదస్పర్శం/శ్వాసోష్మంగా మారుతుంది. కచటతపలు వరసగా గసడదవలుగా మారుతుంటాయి. ఈ సంధికార్యం ప్రాచీన కాలంలో సర్వసాధారణంగా జరుగుతూ ఉండేది. భారత ప్రయోగాలు : ఏమి సేయుదు, ఏమిసెప్పుదు, పెద్దవోయె, ధారుణివాలింతె, ధర్మజుండు దపంబుసేసిన,

ఈ. సం. : అహోవుట్టింపదే. కాని క్రమంగా దీనికి వ్యాప్తితగ్గి సాంస్కృతిక శబ్దాలపైన ప్రవర్తించడం పోయింది.

తిక్కన కాలంనుంచి చతపలకు సదవలు ఆదేశంగారాని రూపాలు కొన్ని కావ్యభాషలో ప్రవేశించాయి. అప్పాచెల్లెంద్రు (నిర్వ. 3-96), రాకపోకలు (భాగ.) అవ్యయాలమీద, క్రియాపదాలమీద, ఇతర నామపదాలమీద వస్తూండే గసడదవాదేశం తరవాతి కాలంలో తగ్గిపోయింది.

**7.16. హల్లు + అచ్చు** : తెలుగుశబ్దాల్లో ద్రుత నకారం ఒక్కటే చివర ఉండే హల్వర్ణం. ఈ ద్రుతానికి గల విశేషమేమంటే ఇది లోపించినా శబ్దార్థానికి భంగం కలుగదు. ద్రుతాంతాలైన పదాలు ద్రుతప్రకృతికాలు. ఇతరాలు కళలు.

నన్నయ కళలుగా ప్రయోగించిన శబ్దాలు కొన్ని తరువాతి కాలంలో ద్రుత ప్రకృతికాలైనవి. ఏను, నేను, తాను, ఎల్ల. ఉదా : ఏను విదపడిగియెద - (భార. శల్య. 2-333), ఏనువోయెద (ఐస. పు.), ఎల్లయందు (భార. 1-2-157), ఇందు ప్రత్యక్షంబయన్నన్-అని యుద్ధమల్లుని బెజవాడ శాసనప్రయోగం. ఇలాగే ప్రాచీన కాలంలో ద్రుతప్రకృతికాలుగా ఉన్నవి కొన్ని అర్వాచీనభాషలో కళలుగా మారి పోయాయి. కొన్ని ఏక కాలంలోనే ద్రుతప్రకృతికంగానూ, కళగను వాడబడ్డవి కలవు. ఉదా : ఏనిప్రత్యయం : ఎందేనినుండి (భార. 1-3-181), ఎయ్యేనియు నొక్క (భార. 1-4-128).

పదాంత హల్లుకు అచ్చుపరమైతే హల్లు ద్విత్వంకావటానికి ఉదాహరణాలు ప్రాచీచ కావ్యాలలో చాలా ఉన్నాయి. ద్రుతద్విత్వసంధి దీని కిందికే వస్తుంది. ఉదా : పరిచర్య లొనర్చుచున్న పరిమిత నిష్ఠా, అన్నిష్టసఖి (భార. 1-8-140), నవ్వులన్నలరులకిచ్చె (కు. సం. 9-108). ఇలాంటి సంధి విధానంచేతనే మన్నాస/ పల్లఅవు, కన్నాకు మొదలైన సమాసాల్లోను, ఝుమ్మని, గ్రక్కని మొదలైన ధ్వన్యనుకరణశబ్దాల్లోను ద్విత్వహల్లేర్పడి ఉంటుంది.

పదాంతంలోని విసర్గరేఫగా మారడం పాల్కురికి సోమనాథుని రచనల్లో ఒక విశేషం. ఉదా : ధేనురనె, విష్ణురనఁగ, వాయురన (పం. చ).

**7.17. హల్లు + హల్లు** : ద్రుత నకారానికి పరుషం పరమైతే నకారం తన నాదత్వాన్ని ఆ పరుషానికి ఆపాదించి దానిని నాదస్పర్శంగా మార్చివేస్తుంది. కచటతప ఇలా గజడదబలుగా మారుతుంది. కావ్యభాషలో ఇది సర్వసాధారణం.

ద్రుతానికి మకారం పరమైనపుడు దానితో సమీకరించబడవచ్చును. ఉదా : కమ్మని లతాంతములకున్ + మొనసి > -కు మ్మొనసి. ఇలాగే రెన్నాళ్లు, మున్నాళ్లు ఇత్యాదుల్లో వర్ణసమీకరణం ( < రెండ్ + నాళ్లు, మూడ్ + నాళ్లు).

నామం (విశేష్యం)

**7.18.** ప్రాఙ్నన్నయయుగం నుంచి నన్నయయుగానికి ప్రవేశించేటప్పుడు నామపదాల్లో కలిగిన స్వరూపపరిణామాలను కొన్ని గుర్తించవచ్చు.

(1) కొన్ని శబ్దాల్లో వెనుకటి యుగంలోలేని లింగబోధకప్రత్యయం చేరింది : ప్రాఙ్నన్నయయుగం : పాఱ; నన్నయ : పాఱుఁడు (*భార.* 1-5-203).

(2) కొన్ని శబ్దాల్లో ఇ-ఉ ల ఉ-అ ల వినిమయం కన్పిస్తోంది. ఉదా : చేయు (*కు. సం.* 8-175) చేయి: నేయు (*SII.* IV-1263 గోదావరి జిల్లా క్రీ. శ. 1100) నేయి; ముందఱు (*కు. సం.* 2-12) ముందఱుమఱంది. (*SII* VI-667) ముందఱ; వలువు వలువ.

(3) శబ్దస్వరూపంలో కలిగిన మార్పు : పొదరు - (*భార. వి.* 3-82). అర్వాచీనరూపం పొద.

తెలుగులోని శబ్దజాలమంతా దేశ్యం, అన్యదేశ్యం అని రెండువిధాలు. అన్యదేశాల్లో తెలుగు భాషాసంప్రదాయానుసారంగా మారివచ్చిన పదాలు తద్భవాలు, అనాంధ్రవర్ణ సంప్రదాయాలతో యథాతథంగా గ్రహించబడ్డవి తత్సమాలు. ఇక దేశ్య శబ్దానుగుణంగా కొంతవరకే మారివచ్చిన శబ్దాలు కొన్ని వాడుకలో ఉండినవి. ఉదా. అద్దంకి శాసనంలో 'అస్వమేదంబు' అనేరూపం. *కు. సం.* లో అరుహున్ (2-80), కలుహారగంధి (9-71), హరుషాశ్రుధారలన్ (12-213), బరిహికేశ భరంబు (4-102), మొ. వి. వీనిని అర్థతత్సమాలని వ్యవహరించవచ్చు. 'కవిత్రయంలో ఇట్టిరూపాలు లేవు.

తత్సమాలవిషయంలో నన్నయవాడుకలో వాకు, జగము మిత్రుఁడు, పాత్రుఁడు అనురూపాలేకాని వాక్కు, జగత్తు, మిత్రము, పాత్రమువంటివి లేవు. నన్నిచోడుడు వాక్కు, మిత్రము, పాత్రము రూపాలు వాడినాడు. ఇక ఈతని బాషలో కనిపించే తత్సమ విశేషరూపాలు అనేకం. ఉదా: దాసి (7-134) ( = దాసుడు), వాల్మీకున్ (1-17) (ప్రథమ), వాల్మీకుఁడు ( = వాల్మీకి), ద్రోహుఁడు (2-97)

(=ద్రోహి), బాలకి (5-17) (=బాలిక), ఉత్పలల్ (5-167) (=ఉత్పలములు), కరవాలు (5-28) (=కరవాలము), మాధుర్యత (7-94), సౌభాగ్యత (1-162).

**7.19.** తత్సమరూపాల్లో సంధి సమాస విశేషాలు : నిజోషది (1-126) (=నిజౌషధి), చక్షుమదనేంద్రియములు (6-68) (=చక్షుర్మదనేంద్రియములు)

సంస్కృత శబ్దాల్లోను, సమాసాల్లోను తెలుగు వ్యాకరణకార్యాలు ప్రవేశపెట్టడం-వ్యావహారికభాషారీతి. నిజోషధి- (నిజౌషధి బదులు) అనేదానిలో పరస్పరైకాదేశం. శాసనోదాహరణాలు ఇలాంటివి చాలాఉన్నాయి. రమాస్వరదేవరకు (<రామేశ్వర-). *కుమారసంభవం* నుంచి మరికొన్ని ఉదాహరణలు గ్రహిద్దాం : హృద్దళితాంబుజాతున్ 11-56) (=దళితహృదయాంబుజాతున్), సుఖప్రాప్తుండు (10-98)(=ప్రాప్తసుఖుండు), మనఃక్షుభితుండై (2-8)(=క్షుభితమనస్కుండై కుసుమకోమలి (4-78) (=కుసుమకోమల). కవిత్రయం ఇట్టిరూపాలను వాడలేదు.

వ్యవహారభాషలో వైరిసమాసాలు అధికంగా ఉన్నాయనటానికి శాసనభాష సాక్ష్యమిస్తుంది. దేశిని పాటించిన నన్నెచోడునిలో ఇవి అధికంగా కనబడ్డం సహజమే. అమరలేమలు, నీలికుంచి, మంత్రకాటుక. రాగదీవియలు, పీరమద్దెలలు, సురగజ్జెలు, ఇతరవేల్పులు, భక్తకూటువలు, మజ్జనబావి, సర్వాంగకచ్ఛడము. శాసనోదాహరణాలు : దివసపడి, నిత్యపడి, దీపగంభం, ప్రసాదతల్యేఁ, చాతుర్మాస్య నెలలు, చందనముద్ద, ప్రసాదకూడు ఇత్యాదులు (*HGT. P.* 127). కవిత్రయం వారి రచనలో వైరిసమాసాలు ఎక్కడో ఒకటిరెండు కనబడుతున్నాయి- ప్రాణగొడ్డము వంటివి.

**7.20.** తత్సమశబ్దాలకి దేశ్యాలకి ప్రధానభేదం - తత్సమాలు చాలావరకు లింగబోధకప్రత్యయాలతో కూడి ఉంటాయి. -డుజ్ మహత్‌బోధకము, ంబు/మ్ము/ము అమహత్‌బోధకము. దేశ్యాల్లో బల్లిదాదులుకొద్దిశబ్దాలు తప్ప ఇతరాలకు డుజ్ ప్రత్యయంచేరదు. అమహత్ 'ము' అనేక శబ్దాలపై చేరుతుంది.

దేశ్యాల్లో 'కూఁతు' శబ్దం విలక్షణం. దీనికి ప్రథమైకవచనంలో కూఁతురు అని, తదితర విభక్తుల్లో కూతు-అనే రూపాలున్నాయి. ప్రథమా బహు. కూతు-లు ద్వి. ఏకవచ. కూతు-ను. ద్వి. బ వ. కూతులను. నన్నయనన్నెచోడులలో ఇదే

పరిస్థితి. తిక్కనకాలానికి రువర్ణంతో ఉన్న కూతురు రూపం మీదనే బహువచన ప్రత్యయం, ప్రథమేతర విభక్తిప్రత్యయం చేర్చటం సంభవించింది. ఇట్లు కూఁతుండ్రు, కూఁతురులు, కూతురి- రూపాలు వాడుకలోకి వచ్చాయి. తిక్కన ఇలాంటి రూపాలు వాడినాడు.

బహువచనరూపాల్లో మువర్ణలోపం, పూర్వస్వరదీర్ఘం కలిగినవి నన్నయలో లేవని, తిక్కన, శ్రీనాథులు వాడారని గమనించాలి. కళ్యాలన్ (భార.), ముత్యాలు (భార.), మీసలు (భాగ. 6-92), ఇక్కడ కావ్యభాషకు శాసనభాషకు ఉన్న భేదం ఒకటి గమనించాల్సి ఉంది. రు, లు అంతంలోగల శబ్దాలు బహువచనలు ప్రత్యయంతోకూడి డ్లు-బహు. వ. రూపాలు సిద్ధిస్తున్నాయి. నీరు + లు > నీడ్లు, కాలు + లు > కాండ్లు, ఎంగిలి + లు > ఎంగిడ్లు. కావ్యభాషలో 'ళ్ళు' బహువచనాలే ఉన్నాయి : నీళ్ళు, కాళ్ళు, ఎంగిళ్ళు.

తెలుగులో నామమే ప్రథమైకవచనం. డుఙ్, ములు మహదమహత్ ప్రత్యయాలేకాక, తరుచుగా దేశ్యాల్లో 'వు' కూడా అంతమందు కనబడుతూ ఉంటుంది. ఆ-వు, పూ-వు, చెఱు-వు ఇత్యాదులు. వీటిలో వువర్ణ విరహితరూపాలే ప్రాచీనాలు. కాలక్రమాన హలంత శబ్దాల సామ్యాన వీటిపైనకూడా ఒక ఉకారము చేరగా సంధ్యక్షరంగా వకారం బయలుదేరి వుకారాం తాలయ్యాయి. ప్రాచీన పూ శబ్దము సమాసంలో మనకు లభిస్తుంది. 'కాలకంఠుని శిరసు పూ గగనగంగ' అని శ్రీనాథుని ప్రయోగం. తరువు, గోవు వంటితత్సమ శబ్దాల్లోను 'వు' ఉచ్చారణవశాన చేరిందనవచ్చు.

**7.21.** అనౌపవిభక్తిక శబ్దాల్లో ప్రథమేతర విభక్త్యంగం ప్రథమారూపతుల్యం. ఔపవిభక్తికశబ్దాల్లో -ఇ, టి, తిప్రత్యయాలు చేరతాయి. ఈ ప్రత్యయాల వాడుకలో కాలక్రమాన కొన్ని మార్పులువచ్చాయి. ఔపవిభక్తికశబ్దాలు కొన్ని అనౌపవిభక్తికాలుగాను, అనౌపవిభక్తిక శబ్దాలుకొన్ని ఔపవిభక్తికాలుగాను వ్యవహరించడం జరిగింది. ఉదా : కన్నీరుధారలు (శు. నం. 5-85)/ కన్నీటిధారలు, పాతటికిన్ (*ఉ. హరి.*). అర్వాచీనరూపం : పాతరకున్. ఏకకాలంలో ఒకే శబ్దం రెండు భిన్నప్రత్యయాలతో వాడబడవచ్చు. నీరి (*భార.* 1-5-196)/ నీటి (*భార.* 1-3-201), మొదలి (*పై.* 2-2-144)/ మొదలింటి.

ఒక్కొక్కప్పుడు ఔపవిభక్తికాంతం ప్రథమాలోపంగా వాడుకలోనికి

రావచ్చును. 7వ శతాబ్దంలో చీకుశబ్దం వాడుకలో ఉంది. (తిప్పలూరు శాస. AI XXVI.231). దీని ఔపవిభక్తికలోపం చీకటి. ఇది నన్నయకాలానికి ప్రథమాంతంగా స్థిరపడపోయింది. నన్నయకాలంలో అమహత్సంఖ్యావచన విశేష్యం ఒకండు; దీని ఔపవిభక్తిక రూపం ఒకంటి అన్నది 13వ శతాబ్దానికి ప్రథమాంతంగా గ్రహింపబడి, ఒకండు కేవలం పుంలింగరూపమైంది. ఒకండు < ఒక + ఒన్డు. దీనిలో 'ండు' పుంలింగప్రత్యయమనే భ్రాంతిచేత ఈ వాడుక కలిగింది.

**7.22.** **విభక్తిప్రత్యయాలు** :*ద్వితీయ* : నన్నయ గుఱించి రూపాన్ని వాడేడు. గుఱించి, గూర్చి తరువాతకవుల్లో ఉన్నాయి. *తృతీయ* : మెయిన్, తృతీయాంతంపై 'చేసి' నన్నయలోగలవు. ఉపయోగార్థంలో 'తోడ' వర్జకం వాడేడు. *చతుర్థి* : కై(< కు + అయి). ప్రత్యయం విషయంలో అచ్చుతోనే యతిని పాటించటాన్నిబట్టి అతడు దీన్ని సమస్తపదంగానే భావించినట్లు స్పష్టం. 'కొఱకు' నన్నయ, నన్నిచోడుల్లో లేదు. పదమూడో శతాబ్దంనుంచి వాడబడింది. 'పొంటె' ప్రాఙ్నన్నయ-కొఱవిశాసనంలో వాడబడింది. నన్నయవాడినాడు. *పంచమి* : కన్నన్ అర్వాచీనరూపం. 'ఉండి' ప్రాచీనకావ్యాల్లో సప్తమ్యంత రూపాలపై వాడబడింది. అర్వాచీనగ్రంథాల్లో ప్రథమేతర ప్రాతిపదికపై - సామ్యాన - చేరింది. దాన-నుండి, దాని-నుండి. అనుచితవిభాగంవల్ల ఉండి > నుండి.

**విభక్తిప్రత్యయం - కొన్ని ఉదాహరణలు**

*ప్రథమ* : అజడంబు ద్వితీయకు : అనిలజవంబునన్ బఱచు నమ్మద *నాగమెదిర్చి* (*భార*. 1-4-207), జడంబు తృతీయకు : విగతరోషుఁడవై *సుఖముండు* మింక (*భార*. 1-7-129).

*చతుర్థికి* : కాలంబు వేచెదను.
జయంబునకున్ (*భార*. ఉ. 1-175).

*షష్ఠికి* : దుష్టోరగ *సంహారమిప్పు*డొడఁబడవలసెన్ (*భార*.1-2-137).

*సప్తమికి* : భూతి *సర్వాంగముల్* పూయుచో (*ఐ.పు*.)

*షష్ఠి* : ద్వితీయకు : చిరముగ *బ్రహ్మకున్* దపముసేసి
(*భార*. 1-2-138).
తృతీయకు : యుద్ధముసేసిరి భటులు *శౌర్యదర్పోన్నతికిన్*
(*కు. సం*. 11-124).

చతుర్థికి : *విప్రకవిగెడు* నీగలపెల్లువోలె (కు. సం. 1-130).

పంచమికి : విలువిద్యనొరులు నీ కగ్గలముగ లేకుండునట్లు (భార. 1-5-239).

సప్తమి : కోమలి నీ కనురక్త (పై. 3-2-216).

సప్తమి : తృతీయకు : సుస్వాగతాభిమత *వాక్యములందఖ్యాగ* తోచిత సపర్యలందన్పెన్ (కు. సం. 7-5)

పంచమికి : జంగమమల్లయ *వరమునందుఁ* గనిన వస్తుకవిత (కు. సం. 1-49), పూర్వాబ్ధిలో వెలువడి (పై. 10-111).

షష్ఠికి : అంతరంగగతి భేదము దెల్పె విదగ్ధముగ్ధలన్ (కు. సం. 5-151).

**7.23. కారక విశేషాలు** : కాలక్రమాన భాషలో కారక విధానంలో గూడా మార్పు కలుగుతుంది అనడానికి కొన్ని ఉదాహరణలు గ్రహిద్దాం. నన్నయ నన్నిచోడులు అలుగు, కరుణించు, అనుగ్రహించు, సైచు మొదలైన క్రియలతో షష్ఠీకారకం ఉపయోగించారు. ఉదా : యయాతికి నలిగి (భార. 1-3-39), అరవిందంబుల కలిగి (కు. సం. 1-19), గిరిపతికి నమ్మునిపతి గరుణించి (కు. సం.), పౌమ్యనకు ననుగ్రహించి (భార. 1-5-31). ఇతరోదాహరణాలు : ఆక్షేపించు : తద్గీర్వాణోరునదీ జితామముల కాక్షేపించి (పై. 8-107); పరివేష్ఠించు : దాక్షాయణికిం శివగణికా సహస్రంబు పరివేష్టించి (పై. 2-16). తరువాత కాలములో ఇట్టి సందర్భాల్లో ద్వితీయాకారకం వాడబడింది.

ఈ కింది క్రియలతో షష్ఠీ, ద్వితీయలు రెండూ నన్నెచోడుడు వాడినాడు. తర్వాతి కాలంలో ద్వితీయకే వాడుక. ఉదా : రుద్రున కుఱక (4-67). విశ్వసంహరు నుఱక (4-76). ఎయిదు : పరమేశ్వరున కెయిదనేరమికిన్ (6-145), ఉగ్రునెయిదఁ దడవెద్ది (5-88).

అట, ఇటి, ఎట అను ప్రత్యయాలపై 'క' ప్రత్యయం చేరకుండటం నన్నయభాషలో విలక్షణంగా కనబడుతుంది. ఉదా : ఇటయేల వచ్చితి (భార. 1-2-210), ఇచ్చను పయెటవోయెదు (పై. 3-2-107). ఇలాగే అక్కడ, ఇక్కడ, ఎక్కడ శబ్దములను కొన్నిచోట్ల ప్రయోగించబడ్డాయి : ఎక్కడం

గదలనేరకున్నవాఁడ (భార. 3-3-245). షష్ఠీ ప్రత్యయానికి పూర్వం నగాగమం రాని రూపాలు నన్నిచోడుని రచనలో ఉన్నాయి. ఉదా : నభముకు (11-169). నన్నయలో ఒకచోట తాకుకు అనురూపం కనబడుతున్నది (భార. 3-4-12).

**7.24. సర్వనామాలు :** ఉత్తమ, మధ్యమపురుష సర్వనామాల్లో ఏక బహువచనాలు రెండింటను రెండేసి రూపాలు ప్రాచీన కావ్యాల్లో వాడబడ్డాయి.

ఏను-నేను; ఏము—మేము; ఈవు-నీవు; ఈరు-మీరు. క్రమంగా అజాది రూపాలకి కావ్యభాషలోనూ వాడుక తగ్గిపోయింది. ఉత్తమపురుష బహువచన రూపం నేము-(తమిళమున నామ్-అనుదాని సమానపదం) భారతంలో ఒకచోటను (8-5-200), అర్వాచీన కావ్యాల్లో ఒకటి రెండుచోట్ల వాడబడింది. శాసనాల్లో దీనికి ప్రయోగాలు కలవు (*HGT*. P. 179).

ప్రాచీనకాలంలో ఆత్మార్థక రూపం మూడుపురుషల్లోనూ వాడబడుతూంది. ఉత్తమపురుషలో వాడుక కుదాహరణం : తన్ను బంపుదేవ (కు. సం. 4-45).

తచ్ఛబ్ద—వాఁడు, అది, ఇది రూపాలకు నన్నయ నన్నిచోడుల భాషలో నేటివలె నీచార్థస్ఫురణ మేమీలేదు. ఉదా : వీఁడు భీముఁడు, వాఁడు గవ్వఁడి (భార. 2-1-193). దమయంతిని గూర్చి చెబుతూ 'అది సంతసించి' (భార. 3-2-202), వీఁడు సామాన్య పురుషుండుగాఁడు (కు. సం. 7-16) వరదుండు దాని కోరిన వరంబు దయసేసి (వై. 7.72)

నన్నయ 'వారు' బహువచన రూపాన్ని వాడినాడు. సమకాలీన శాసనాల్లో వాండ్రు రూపముంది. వాఁడు శబ్దాన్నుంచి ఏర్పడ్డవాండ్రు నన్నయ అనంతర కవులు వాడినారు. వాండ్రు రూపంకన్నా అర్వాచీనం వాండ్లు > వాళ్ళు.

**7.25. సంఖ్యావాచకాలు :** నన్నయ, నన్నిచోడలు 'ఏను' రూపాన్నే వాడారు. అయిదు 12, 13 శతాబ్దాల నుండి శాసనాల్లో, కావ్యభాషలో కనబడు తూంది. ఉదా : తిక్కన : ఐదు శరంబులు (ద్రోణ 3-228).

మొదటి సంఖ్యావాచకానికి మహత్, మహతి, అమహత్ రూపాలు మూడూ ఉన్నాయి. అమహద్రూపమే సంఖ్యావాచక విశేష్యం. ఉదా : అమరత్వ మొక్కండు దక్క (భార. 1-8-88), ఉగ్రబాణసమూహ మొక్కండు దప్పక

(శ. సం. 11-106). దీని ఔపవిభక్తిక రూపం ఒక్కంటి, ఒకటి. ముద్రిత భారత ప్రతులలో ఒకటి, ఒక్కటి రూపాలు కనబడుతున్నా తాళపత్రప్రతుల్లో పాఠాంతరాలున్నాయనీ, వీటిని ప్రథమా రూపాలుగా వాడియుండడని ఆంధ్రభాషా చరిత్రకారు లూహించారు. కుమారసంభవంలో 'ఒకటి' అనే దానికి ప్రథమలో ఒక్క ప్రయోగం కనబడుతోంది. 'మానుగ గూర్తు నొక్కటిగ మార్గణకౌశల భావమేర్పడన్ (4-69). పదో శతాబ్దంనాటి దొంగలసాని శాసనంలో 'నళ్ళాద్యది యొకొటియగు నేణ్డు' అను ప్రయోగాన్ని బట్టి ఈవాడుక భాషలో ప్రాఙ్నన్నయ యుగంలోనే ఏర్పడిందని స్పష్టపడుతోంది.

మహద్వాచకం : నన్నయ-ఒకరుఁడు, ముద్రిత ప్రతుల్లో కనబడే ఒక్కఁడు. ఒకఁడు లోపానికి తాళపత్ర ప్రతుల్లో రేఫతోకూడిన వేరుపాఠాలు కన్పిస్తున్నాయని ఆంధ్రభాషాచరిత్రకారులు (*HTL, p.* 1415). నన్నెచోడుడు ఒకఁడు/ఒక్కండు రూపాన్ని మహదమహదర్థములు రెండింటిలోను వాడిఉన్నాడు. ఒకఁడు శబ్దం మొదట అమహద్రూపమైనా (<ఒక + ఒన్టు) దానిలోని-డుజ్ వర్ణం మహద్వాచకం అనే భ్రాంతి కల్పింపడంవల్ల ఈ అర్థంలో వాడుకలోకి వచ్చి ఉంటుంది. అప్పుడు అర్థసందిగ్ధతను నివారించడం కోసం దీని ఔపవిభక్తిక రూపమైన ఒకఁటి ప్రథమలో వాడుకలోకి వచ్చి స్థిరపడి ఉండవచ్చు. 12-13 శతాబ్దాలనుండి శాసనాల్లో తరుచు 'ఒకటి' ప్రథమలో వాడబడింది.

మహతీ వాచకంగా నన్నయ ఒక్కత, ఒక్కటి, ఒక్కతె, ఒక్కర్తు అనే రూపాలను వాడినాడు. సూరి మహతిలో 'ఒకతి' శబ్దానికి 52 రూపాంతరాలు పేర్కొన్నాడు. చాలావరకివి సామ్యంవల్ల కూర్చబడ్డాయని తోస్తుంది. ఇవి ఎంతవరకు కవిప్రయుక్తాలో పరిశీలించవలసి ఉంది.

పూరణార్థకసంఖ్యా వాచకంలో వచ్చే ప్రత్యయం అగు>అవు. అవు నన్నయలో ఉంది. 'అగు' ప్రాఙ్నన్నయ శాసనభాషలో వాడబడింది. 'అవు' రూపమేర్పడ్డ తర్వాత దీనిపై విశేషణత్వ 'అ' కారంచేరి 'అవ' ఐంది. కావ్య భాషలో తరచుగా కనబడే రూపమిదే. -అవ వ్యవహారంలో పన్నెండు శతాబ్దానికే 'ఓ' గా మారినట్టు శాసన ప్రయోగాలవల్ల తెలుస్తుంది. ప్రబంధ యుగంలోని కవులు 'ఓ' రూపం వాడిన వాళ్ళున్నారు.

**7.26. క్రియావిభక్తులు** : ప్రాచీన కావ్యాల్లో క్రియాధాతువులను గూర్చి ఈ కింది విశేషాలు గమనించ తగ్గవి.

1. ధాత్వనుబంధము చేరని ప్రాచీన ధాతువుల వాడుక. ఉదా : తొడు (భార. 1-8-174; కు. సం. 5-20), ఎదురు (కు. సం. 4-46), తెప్పిరు (10-10). తొడుగు, ఎదిరించు, తెప్పిరిల్లు అని తిక్కనాది అనంతర కవులు వాడారు.

2. చుకారాంత ధాతువులు కొన్ని తరువాతి కాలాన యకారాంతాలైనాయి. నన్నయ నన్నిచోడులు : వైచు, త్రోచు. అనంతర కవులు : వేయు, త్రోయు, ప్రాఙ్నన్నయ యుగంలో ఱచ్చు ధాతువు ఇలాంటి పరిణామానికి ఉదాహరణం. 7-8 శతాబ్దాల్లో ఱచ్చు-చుకారాంతము : ఱచ్చిన వాన్డు, ఱచ్చువాన్డు (రేనాటి చోళశాసనాలు), 9 వ శతాబ్దంనుంచి ఱయ్యు : ఱస్సి (ఇయ్యెట్టు ఱస్సి) బెజవాడ శాసనం (*HGT*. 311, శాసనపంక్తి 14). అఱసి : లింగంబఱసిన పాపంబు (పంక్తి 21). కొన్ని ధాతువుల్లో చుకారాంత, యకారాంతాలు రెండూ ఏకకాలంలో వాడుకలో కనబడుతున్నాయి. నన్నెచోడు : పాచు/పాయు, మెఱచు/మెఱయు రాచు/రాయు.

3. మూలధాతువులుగా వాడబడ్డవి కొన్ని తరువాతి కాలంలో సహాయక క్రియలతో శబ్దపల్లవాలుగానే వాడబడ్డాయి. ఉదా : వ్రేలు, (కు. సం. 11-127) ఉలుకు (2-14), వ్రేలాడు, ఉలికిపడు.

4. వలయు వంటి క్రియలు కవిత్రయం ప్రధానక్రియగా వాడారు. ప్రబంధయుగానికిది కేవలం సహాయ క్రియగా వాడబడింది. ఏమివలతు నీవడుగుమనిన (కు. సం. 1-70), పోయిరావలయు మాకు (= పోయిరాన్ మాకువలయు) (భార. ఉద్యో. 1-42).

ఇక శబ్దస్వరూపంలో ప్రాచీనతాలక్షణం ఆ యుగంలోని రూపాల్లో తత్రాపి నన్నయ నన్నిచోడుల గ్రంథాల్లో కనబడటం ఆశ్చర్యంకాదు. ఉదా : తూరు' (కు. సం. 8-94) > దూరు, నచ్చు (కు. సం. 10-189), (భార. ఉద్యో. 3) > నమ్ము, నఱకు (నఱుకు >) మొ. వి.

నన్నయాది ప్రాచీన గ్రంథాల్లో కొన్ని ధాతువులు ఎలాంటి రూపభేదమూ లేకయే అకర్మక, సకర్మకాలుగా కూడా వాడబడ్డాయి. ఉదా : కురియు : అంగార

వృష్టిగురియుచు (భార. 1-7-107) వాన...గురిసి, ఒలుకు : కమండలు జలంబు లొలికిన (1-7-126), రక్తధారలొలక (1-2-100), పూను : హయములు పూనిన రథమెక్కి (3-1-164). ఇద్దరును పూనిరి సర్వము నిర్వహింపఁగన్, మెఱయు : విభూతి మెఱసి (కు. సం. 2-8). తరువాత కాలమునకు ఈ ధాతువులలో సకర్మకాకర్మక భేదాన్ని తెలపడానికి ప్రత్యయాలు చేరాయి. కురియు - కురియించు/కురిపించు, పూను-పూన్చు, అగు-ఆపు, మెఱయు-మెఱయించు.

సంస్కృత ధాతువులు ఒకప్పుడు మూలార్థంలో నన్నయ వాడటంచేత మనకిప్పుడవి విలక్షణంగా తోస్తాయి. విహరించు, సకర్మక ప్రయోగము : అగ్నులు విహరింపుమని పంచి (భార, 1-1-29). విహరించు = విభాగించు. ఈ అర్థంలో తరువాతి కవులు వాడినట్లు లేదు.

కొన్ని సకర్మక క్రియలు కర్మలేకుండానే కావ్యభాషలో వాడటం కద్దు. నన్నయ : పొలువుగఁ బూసి కట్టితొడి, భూరి విభూతిప్రకాశితంబుగా (భార. 1-8-174).

చు, వు, ఇంచు ప్రేరణ ప్రత్యయాల్లో పకార రూపాలకు కాలక్రమాన వ్యాప్తి కలిగింది. నిండు-నించు, నింపు, చిసుగు-పించు/చింపు, ఉడుగు-ఉడిగించు/ఉడివించు, ఉడుపు, మాయు-మాయించు, మాపు. నన్నిచోడుడు : మెచ్చించు (కు. సం. 1-21). తరువాతి కాలంలో మెప్పించు.

**7.27.** క్రియలు సంపూర్ణాలు, అసంపూర్ణాలు అని రెండువిధాలు. సంపూర్ణ క్రియల్లో ధాతువు, దానిపై కాలభావద్యోతకప్రత్యయం, దానిపై సర్వనామ ప్రత్యయం చేరుతుంది. అసంపూర్ణ క్రియల్లో సర్వనామ ప్రత్యయం ఉండదు.

భూత తద్ధర్మార్థక సంపూర్ణక్రియల్లో ఉత్తమ పురుషైకవచనంలో సర్వనామ ప్రత్యయాలు చేరనిరూపాలే నన్నయ, నన్నిచోడులలో తరచుగా కనిపిస్తున్నాయి. భూతార్థక క్రియ 34 ప్రయోగాల్లోనూ కు. సం. లో 'వి' ప్రత్యయం కానరాదు. ఉదా : జడుఁడవై తెట్లు బ్రాహ్మణజాతిఁ బుట్టి (7-27); తద్ధర్మార్థంలో వైకల్పిక పరిస్థితి : భిక్షకుఁదగిలి తపంబుసేసెదచె (7-21).

వ్యవహారంలో భూతకాలిక క్రియల్లో కలిగిన మార్పులు : (1) చేయు - చేసితిమి వంటి వానిలో ఇత్వలోపం కలిగి చేస్తిమి వంటి రూపాలేర్పడ్డాయి.

శ్రీనాథుని చాటుపద్యాల్లో ఇట్టివి ప్రయుక్తాలు. యకారాంతాల్లో లాగానే చకారాంత ధాతువుల్లోను ఇలాంటి రూప పరిణామం జరిగింది. ఇచ్చి-ఇచ్చితిమి-ఇస్తిమి; మన్నించు-మన్నింస్తిమి. ఇలాంటి రూపాలు 11 వ శతాబ్దంనుంచి శాసనాల్లో ప్రయోగించబడ్డాయి. కాని ఇవి వ్యావహారిక రూపాలుగానే పరిగణించబడ్డాయి.

**7.28.** తద్ధర్మార్థకక్రియ వర్తమానం భవిష్యత్‌కాలాల్లోనేగాక ప్రాచీన కావ్యాల్లో భూతకాలానికి కూడా వాడబడటానికి ఉదాహరణాలు కలవు. ఉదా : ద్యూతక్రీడకు కొండొకనేతున్ (= నేర్చి యున్నాను); విజితేంద్రియుండనగ నిమ్మునిఁ బాయకవిందు (భార. 1-4-30) (= వింటిని).

అన్వాదులకు దు ప్రత్యయం చేరినపుడు నన్నయలో అండ్రు, కొండ్రు ఇత్యాదిమూర్ధన్యయుతరూపాలు కనబడుతున్నాయి. తిక్కనలో అందురు, కొందురు రూపాలున్నాయి.

చువర్ణాంత ధాతువుపైన వచ్చే తద్ధర్మార్థక దుప్రత్యయం తకారంగా మారుతుంది. ఉదా: చూచు + దు + రు > చూతురు. ఇలాంటి మార్పురాని రూపాలు వ్యావహారికాలు. పదోశతాబ్దంనాటి గంగాధర శాసనంలో 'ఇచ్చుదువ్' రూపంఉంది (*HGT. p.* 346). ఇలానే ఆడచుదురు, ఆకర్ణించుదురు వీనిలో ధాత్వంత చకారం పకారంగా మారటం వ్యావహారికంలో కనిపించే మరోమార్పు. కవిత్రయంలో ఇలాంటి రూపాలులేవు. తరవాతికాలపు కవుల గ్రంథాల్లో ప్రవేశించాయి. ఉదా : ఆకర్ణింపుదురు (భాగవతం). నన్నయ భారతంలో 'పూజింపుదుము' అని ముద్రితప్రతిలోని పాఠం (అర. 2-255). తాళపత్ర ప్రతుల్లో 'పూజింతుము' అనే ఉందని ఆంధ్రభాషా చరిత్రకారుల సూచన (ఆం. భా. చ. పు. 1494). చుకారాంత ధాతువుల్లోలాగి యుకారాంత ధాతువుల్లోనూ 'ద' కు 'త' ఆదేశమవడం మరొక వ్యావహారిక రీతి. చేయు-చేయుదురు/చేతురు. ఇట్టి రూపాలు కవిత్రయంలో లేవుగాని నన్నిచోడాది దేశికవుల్లోను, అర్వాచీనమార్గ కవుల్లోకు కన్పిస్తుంది ఉదా: చేతున్ (కు. సం 1-5). సూరి ఈ కారణంచేతే 'చేతురు, కోతురు' -ఇత్యాదులు అసాధువు లన్నాడు.

తద్ధర్మక్రియ 'పొందుదురు' ఇత్యాదుల్లో ప్రత్యయస్వరూపం మారి 'పొందుతారు' వంటి రూపాలు శాసనాల్లో 16వ శతాబ్దంలో లభించాయి. ( *NI* 1. కందుకూరు, 3 క్రీ. 1551).

తద్ధర్మ 'ద' ప్రత్యయలోపంతో పూర్వస్వరదీర్ఘం కలిగిన రూపాలు : పెట్టించెదను - పెట్టించేను (*SII* VI 16, కడపజిల్లా 1396), ధరించెదము - ధరించేము (*SII* V 52, కర్నూలుజిల్లా, క్రీ. శ 1515) ఇత్యాదులు. తాళ్ళపాక అన్నమాచార్యుల కీర్తనల్లో ఇలాంటివి ప్రధానంగా ప్రథమపురుషలో వందేని, చేసేని అనేరీతి ప్రయోగింపబడ్డాయి. ఈ రూపాలన్నీ కవిత్రయయుగపు కావ్య భాషలో ఎక్కలేదు.

**7.29.** వ్యతిరేకార్థక క్రియ : ధాత్వంతమందలి చకారము వ్యతిరేకార్థకం పరమైనప్పుడు పకారం అవుతుంది : ఒనర్చు-ఒనర్పదు కవిత్రయయుగం తర్వాత ఇలా పకారం కాని రూపాలు వాడుకలోకివచ్చాయి.

వ్యతిరేకక్రియ అర్థత్రయబోధకమవుతుంది. ఉదా : భూతం : నలుగాన మివ్వనమ్మన (భార. 3-2-107); వర్తమానము : పలుకదు సఖులతో లలితాంగి (భార. 3-2-26); భవిష్యత్తు : నలునకాని నలిదళనేత్రవరియింప దట్టి (భార. 3-3-52). వ్యతిరేకక్రియల్లో కాలం సూచించదలచినప్పుడు అగు-సహాయకక్రియ రూపాలను చేర్చిచెప్పడం ఉంది. ఉదా : నన్నయ : ఎఱుగనయితిని, నమ్మనేర నయ్యెదను, లేదవు ఇత్యాది. ఈ అగుధాతువు అనుప్రయుక్తమైన రూపాలు క్రమంగా తరవాత యుగంలో తగ్గిపోయాయి.

**7.30.** ఉభయ ప్రార్థనార్థంలో కావించు, కావింతము; పుచ్చు-పుత్తము అనురీతినిగాక ఈ యుగాంతానికి కావించుదము వంటి రూపాలు వాడుకలోకి వచ్చాయి. వెదకుదము, చెప్పుదము, చూతము అనుటకు పాల్కురికిసోమన ప్రయోగాలు వెదకుదంసు, చెప్పుదండు, చూతండు (బ. పు. ఉపో. పు 120) వంటివి మాండలికాలు కావచ్చును. విధ్యర్థంలో ఉండకుండునది అనటానికి ఉండకున్నది అనురూపం నన్నయలో ప్రయుక్తమైంది : దుర్జనయోధవరులకడ నుండకున్నది (భార. 1-3-206).

**7.31.** నిషేధార్థకం, ఏకవచనంలో వండకు-వండకుము అని రెండు రూపాలున్నాయి. అమ్మాదులు చేరినప్పుడు సంధికలుగు సందర్భాల్లో సర్వనామ ప్రత్యయంతో కూడిన రూపాలే ఉండాలని సర్వనామరహితాలు నిషేధాలనీ అథర్వణకారికావళి అనుశాసనం : తలంపకమ్మ-అలాక్షణికము; తలంపకుమమ్మ-అని ఉండాలి.

**7.32.** ఆగమచకరానికి 'ముత్తు' పరమైనప్పుడు పకారాదేశమవుతుందని బాలవ్యాకరణ సూత్రం. దీనికి వ్యత్యస్తమైన ప్రయోగాలు కవిత్రయేతర గ్రంథాల్లో కానవస్తున్నాయి. శాసనభాషలో వీనికుదాహరణాలు ఎక్కువగా ఉన్నాయి. పకారాదేశం రాదగిన సందర్భాల్లో రాకపోవటమేకాదు. పూర్వకవుల కావ్యాల్లో కనబడని చోట్ల అర్వాచీనకవుల కావ్యాల్లోరావడం వైయాకరణులు గుర్తించారు. ఉదా : శత్రర్థపరక 'చు' వర్ణానికి: మోవి మోవిఁజేరుపుచు (ప్రౌ.వ్యా.క్రియ). ఆశీరర్థకాలైన ఎడున్, తన్ ప్రత్యయాల్లోని ద్రుతం అచ్చుపరమైతే మకారం అవుతుంది : నీకు మేలు కలిగెడు మనియె, కావుతమనియె. సంధిలో కనబడు ఈ మకారం నిజానికి చారిత్రక చిహ్నమే. ఆంధ్రశబ్ద చింతామణిలో ఈ ప్రత్యయం 'డుమ' అని చెప్పబడింది. ఉదా : శుభము ఘటియింపుడు. భారత ప్రయోగాలిలాంటివి కన్పడుతున్నాయి. వివేకమెడలి యుండెడుమ కప్పలు (భార. అను. 3-143); విష్ణుడు ఇష్టదాయి ప్రసన్నుఁడయ్యేడుమనాకు (శాంతి. 1-41). -డుమ ఆశీరర్థకాలు తర్వాత కవుల్లోలేవు.

**7.33.** మూల ద్రావిడ భాషనుంచి తెలుగునకు వచ్చిన సంపూర్ణ క్రియలు రెండు : భూతం, తద్ధర్మం. ఇవి తత్తదర్థ బోధక ప్రత్యయాలతో కూడినవి. తెలుగున చారిత్రక యుగంలో ఏర్పడినవి. భూత, తద్ధర్మ, వర్తమాన భవిష్యత్కాలాలు, ఆయా క్రియాజన్య విశేషణాలకు తచ్ఛబ్దం చేరిన రూపాలు- విశేష్యరూపాలే క్రియార్థాన్ని పొందాయి. వానిలో కాలక్రమాన కలిగిన శాబ్దికమైన మార్పుతో ఈ అర్థ విపరిణామం రూఢమైంది. వండినవాఁడు-విశేష్యము- క్రియ; రెండోదశలో వండినాడు - క్రియ. ఇలాగే వండుచున్నవాఁడు-వండుచున్నాఁడు, వండఁగలవాఁడు-వండగలాఁడు, వండఁగలఁడు; వండెడు/వండెడివాఁడు > వండేవాఁడు (విశేషార్థంలో). తచ్ఛబ్దవకారం లోపించిన సంగ్రహరూపాలు తిక్కన కాలంనుంచి కావ్యభాషలో ప్రవేశించాయి. నన్నయలో ఇవిలేవు.

నన్నయకాలంలో 'కలుగు' ధాతువు సకర్మకంగాను, అకర్మకంగాను వాడబడింది. ఎఱుకగలవె అనేది సకర్మక ప్రయోగం. పధ్నాలుగో శతాబ్దం నుంచి ఈ వాడుక లోపించి సహాయకక్రియగానే ప్రయోగించబడింది. ఇతర సంయుక్తక్రియలకంటె భవిష్యద్రూపం అర్వాచీనం. నన్నయ నన్నిచోడులలో భవిష్యత్క్రియ అరుదు. నన్నిచోడునిలో ఒకే ఒక ప్రయోగము - కలజ్యను బంధంతో - కానవచ్చింది. మిమ్ము గొల్వఁగల వాఁడన్ (కు. సం. 7-134).

అన్నంత క్రియలమీద సహాయకక్రియలు చేరి భిన్నార్థాల్లో సంయుక్త క్రియ లేర్పడుతున్నాయి. ఆత్మార్థక, కర్మణ్యర్థక క్రియలు ఇలాంటివి. నన్నయ సంస్కృత భారతం అనువదించేటప్పుడు - పడు కర్మణ్యర్థకాలను విశేషంగా వాడాడు. నన్నిచోడునిలో రెండు ప్రయోగాలు మాత్రమే కలవు. (కు సం. 9-67, 10-47). ఇతర కవుల్లోను విరళంగానే వాడబడింది. పడు కర్మణ్యర్థకరూపం సంస్కృత భాషా ప్రభావంవల్ల తెలుగున కలిగిందని చెప్పవచ్చు.

ప్రాచీన గ్రంథాల్లో - కొను సహాయకక్రియ లేకుండానే కొన్ని క్రియలు ఆత్మార్థంలో వాడబడ్డాయి. బభ్రుభార్య దనకు భార్యచేసె (భార. 2.2.6); పరమేశ్వరుఁ బ్రత్యక్షంబుసేసి (కు సం. 1-7); పరిధానంబులు సవరించుచు (10-4).

**పదకల్పాలు**

**7.34.** (1) **ఏవార్థకం**: 11-12 శతాబ్దాల్లో ఏవార్థక ప్రత్యయం 'అ'. నన్నయలో ఇదే ఉన్నది. నన్నిచోడునిలో 'అ' తోపాటు కొన్ని ప్రయోగాల్లో ఏ ప్రత్యయంకూడ కనబడుతోంది. ఉదా: చేనఁబండిన విత్తు చేనికె వెదవెట్టునట్లు (కు.సం. 1-49). సమకాలపు శాసనాల్లోను అ/ఏ లు పక్క పక్కన వాడబడి ఉండటాన్ని బట్టి ఈ రెండూ ఆనాడు వ్యవహారంలో ఉన్నాయని తెలుస్తూంది. క్రమంగా ఏ కారానికి వ్యాప్తిహెచ్చి అకారం లోపించింది. ఏవార్థకం నామాల తోనేగాక క్రియాపదాలతోనూ వాడబడింది. ఉదా: సీదానగాన (భార. 1-6-2, 250). తర్వాతికాలంలో ఈ ప్రత్యయం ఇలా క్రియాపదాలతో వాడే అలవాటు పోయింది.

(2) **సముచ్చయార్థకం**: ఉన్ ప్రత్యయము. ను, ని రూపాంతరాలు. ఉదా. తనకిష్టుడున్ (భార. ఆది.) ఒకప్పుడీ ప్రత్యయంపై మరల ప్రత్యయం చేరవచ్చు. ఏమినిఁ జేయగలేక (భార. ఉద్యో. 2-108). సముచ్చయనకారం లోపించి పూర్వస్వరానికి దీర్ఘం రావడం శాసనాల్లో 11 వ శతాబ్దంనుంచి, కావ్య భాషలో 13 వ శతాబ్దంనుంచి కన్పిస్తోంది. తిక్కన ప్రయోగం: నమ్మీనమ్మని (భార. శాంతి. 2-351); శ్రీనాథుడు చాటువుల్లో: చల్లా యంబలి ద్రావితిన్.

వ్యవహారంలో (1) ద్విత్వయుక్తాలు న్ను/న్ని ప్రత్యయాలు. ఉదా. ప్రతి సంవత్సరమున్నూ (*SII* VI. 1198, విశాఖజిల్లా, క్రీ. శ. 1242);

తూములు వదిన్ని (*SII* V 1052, గుంటూరు జిల్లా, క్రీ. శ. 1133), (2) సముచ్చయ ప్రత్యయం లోపించి (లోపించక) ప్రాతిపదికలోని చివరి అచ్చు దీర్ఘం కావటం. ఉదా. ఆతని వుత్రాను పౌత్రికమూ ఎల్లప్పుడూను ఆరాధింపువారు. (*SII X*, 4, గుంటూరుజిల్లా, క్రీ. శ. 1003) – ఈ రెండు పరిణామాలు జరిగాయి. వీటికి కవిత్రయ యుగం కావ్యభాషలో ప్రవేశం కలగలేదు.

(3) **ప్రశ్నార్థకం:** ఎ/ఏ ప్రత్యయాలు. రాజు సామాన్యునిగా వగచితే (భార. 1-1-176), కాముశక్తి నోర్వఁగలరె జనులు (కు.సం.). ప్రశ్నార్థకాలైన ఉందునె, చనునె, కొనునె అనేవి సంయుక్త క్రియల్లో ఉన్నె, చన్నె, కొన్నెగా మారతాయి. 13 వ శతాబ్దం నుంచి 'ఎ' తో పాటు 'అ' ప్రత్యయం వాడుకలోకి వచ్చింది, క్రమంగా ఇది వ్యాప్తిచెంది 'ఎ' లోపించింది. నన్నయ నన్నిచోడులలో ఎ ప్రత్యయమూ, తిక్కనలో ఎ/ఏతోపాటు ఆ వాడబడింది.

**7.35. విశేషణాలు:** తెలుగులో ఇతర ద్రావిడభాషల్లోలాగానే, ఒకే రూపక విశేషణంగాను విశేష్యంగాను వాడే సంప్రదాయంకలదు. కనుకనే విశేషణ 'అ' ప్రత్యయంతో కూడిన 'నల్ల' రూపాన్ని నన్నయ 'నల్ల' విశేష్యంగా వాడాడు. నల్ల లేదయ్యేనేని (భార. ఆది). ఇట్లే చిఱ్/చిన్ ధాతువుమీద 'అ' చేరగా చిఱ్ ఱ్-అ > చిట్ట, 'చిట్ట వెదుళ్ళు' లని నన్నిచోడుని ప్రయోగం (కు సం. 12.121); చిన్న; ఇ ప్రత్యయంతో 'చిట్టి', చిన్ని రూపాలు. సామ్యంవల్ల టి ఇతర శబ్దాలపై చేరి పిన్నటి, తక్కటి రూపాలేర్పడ్డాయి. పిన్నటి నవ్వు (కు. సం. 8.10), తక్కటి పుత్రులు (భార.) వండెడు/వండెడి ఇత్యాది తద్ధర్మక ధాతుజ విశేషణం వ్యవహారంలో టి ప్రత్యయం చేర్చుకొని 'వండేటి' 'చేసేటి' రూపాలేర్పడ్డాయి. వండే, చేసే మొ వి. కవిత్రయయుగం తర్వాత కావ్యభాషలోకి ఎక్కినాయి.

పేర్వాదులకు అచ్చు పరమైనప్పుడు టుగాగమం విభాషగా అవుతుందని బాలవ్యాకరణ సూత్రం. పేరురము, పేరుటురము. ప్రాచీనకావ్యాల్లో టుగాగమం రాని రూపాలే అధికం. -టి- సామ్యంవల్ల వీటిలో చేరిందని చెప్పబడిందికదా.

ఉదంతస్త్రీసమాలకు పరుష సరళాలు పరమయినప్పుడు నకారాగమం రావటం కావ్యభాషలో కంటె శాసనభాషలో ప్రచురంగా కనబడుతున్నది,

(*HGT*, 132), ఉదా: పువ్వుంతోంట, పూందోంట, నల్లంజెఱ్ఱు, గొఱ్ఱెం గదుపులు.

మహద్వాచకాలపై కూడా ఈ ఆగమం చేరడం శాసనభాషలో కనబడుతూంది. ఉదా: గంగమారాణి కూతురుం చింగాసాని (*SII VI* 777, విశాఖజిల్లా, క్రీ. శ. 1461).

**7.36.** **క్రియావిశేషణాలు:** అ, ఈ, ఊ అనే సర్వనామ ప్రాతిపదికల నుంచి ఏర్పడ్డ క్రియా విశేషణ రూపాలు ఎన్నో, అక్కడ, ఇక్కడ, అప్పుడు, ఇప్పుడు ఇత్యాదులు వాడుకలో ఉన్నాయి. అ, ఈ, ఏ (త్రికం)తోపాటు ప్రాచీన ద్రావిడభాషలో మాధ్యస్థాన్ని బోధించే 'ఉ' ప్రాతిపదిక ఒకటి ఉండేది. దీని నుంచి ఏర్పడ్డ 'ఉల్ల' (అల్లదుగో,ఇల్లిదిగో -అనే వాటిలో స్థలవాచకాలైన అల్ల, ఇల్ల రూపాలవలె) రూపాలకు భారత ప్రయోగాలున్నాయి.

కావ్యభాషలో క్రియావిశేషణాలగు అవ్యయాలకు ఉదాహరణాలు: మొగి, ఒయ్య, నెమ్మి, ఓవి, క్రచ్చఱ, పరువడి. శాసనాల్లో ఇటువంటివి కనబడవు. వస్తుభేదం కారణం కాచ్చు.

ఔపమ్యాన్ని బోధించే అవ్యయాలు: కరణి, భంగి, మాడ్కి, వడువు, పోలె-ఇత్యాదులు. రెండేసి రూపాలు కూర్చి చెప్పడంకూడ కావ్యాల్లో కనిపిస్తూంది. కుమారసంభవంలో ఉదాహరణాలు: అట్లువోలె, కరణిలోలె, చాడ్పునవోలె, తెఱగవోలె, పగిదివోలె, పోలుపువోలె, భంగివోలె, మాడ్కివోలె, వడువువోలె.

సంస్కృత రూపాలు అనంతర యుగమందలి కావ్యాల్లో అధికంగా ప్రవేశించాయి; ఉదా: వృథా శపింతురే (మనుచ.) శాసన భాషలో - ఈ యుగాని చెందిన దానిలో - ఉదాహరణాలు కలవు. నివేద్యానకు త్రివాదా ...... ఇస్తిమి (*SII VI* 46, కర్నూలు జిల్లా).

ఈ క్రింది రూపాల్లో కనబడే క్త్వార్థకాల వాడుకవిధానం తెలుగు జాతీయమనే చెప్పాలి. నన్నయ: వందురి వగచుచున్న (భార. 1-5-30), వచ్చివధింతు గాక (పై. 1-6-201), వచ్చి వంతఱలాడు (పై. 1-2-101), పట్టిపాలార్పగనేల, వగచి వనరుచుండె (పై. 7-209).

నామాల నుంచి క్రియా విశేషణాలను నిష్పన్నం చేయటానికి అగుధాతువు అన్నంత రూపం 'కాన్' చేర్చబడుతోంది. - కాన్ > - గాన్, కన్, గన్. క్వాచిత్కంగా కావ్యభాషలో నామం ఈ సహాయక క్రియారూపం లేకుండానే క్రియా విశేషణంగా వాడటం కనబడుతోంది. నన్నయ: అమరభావంబున సుఖంబు జీవింతురచె (శార. 1-4-151), అరుంధతి సహితంబు నిరంబరలయి (ఉ. నం. 10-31).

నన్నయాది ప్రాచీన గ్రంథాల్లో ధ్వన్యనుకరణ శబ్దాల కొన్నిటి వాడుక జాతీయం అనాలి. మలమల మఱుంగుచు (శార. 1-3-111); వడవడంకుచు (1-2-55); వడవడవడకుంచు (1-2-55). ఇట్టి వాడుక సర్వత్ర ఉంది. కొన్ని కొన్ని వాడుకలు మాత్రం ఇప్పుడు మారాయి.

# కావ్యభాషాపరిణామం

## (క్రీ. శ. 1600 - 1899)

—బి. రామరాజు

**8.0.** ఆంధ్రభాషా సాహిత్యాల చరిత్రలో క్రీ. శ. 1600–1800 సంవత్సరాల నడిమికాలం ఒక విధంగా పరిణామాత్మకమైనది. రాజకీయంగా ఒక మహాసామ్రాజ్యం అంతరించి చిన్నచిన్న రాజ్యాలు సంస్థానాలు స్వతంత్రించి తలయెత్తినట్లే సాహిత్యంలో అనుస్యూతంగా వస్తున్న మార్గాన్నివదలి ఈ కాలంలో నూతన ప్రక్రియలు వాటికి తగిన భాషకూడా తలయెత్తినవి. కొందరు సాహిత్య చరిత్రకారులు ఈ యుగాన్ని క్షీణయుగం అన్నారు. కాని ఈ యుగాన్ని ఇంత చిన్నచూపు చూడనవసరం లేదు. తెలుగువాడు తెలుగు పొలిమేరలు దాటి చాలా దూరంపోయి ప్రకియావైవిధ్యంతోను సరికొత్త నడతలతోను నుడులతోను సంగీతమూ నృత్యమూ తోడుగా వివిధ హావభావాలు ప్రదర్శించినది ఈ యుగంలోనే. ఇరుగుపొరుగు సాహిత్యాలను బాగా ఆకళించుకొన్నది ఈ కాలంలోనే. పూర్వం సాహిత్యవ్యాసంగం ఎక్కువగా ఏదో ఒక వర్గానికి పరిచితమై ఉండేది. కాని స్త్రీపుంస వివక్షలేకుండా కులమత వివక్ష లేకుండా ప్రక్రియావైవిధ్యంతోపాటు భాషాచ్ఛందో వైవిధ్యమూ స్వాతంత్ర్యమూ ప్రకటించిన కవిపండితులు వర్ధిల్లినకాలం ఇదే. ఈ కాలపు భాషా విశేషాలు పరిశీలించటానికి తెలుగుదేశంలోని కవుల రచనలేకాక మధుర, తంజావూరు మొదలైనచోట్ల, తెలుగుదేశం బయట వర్ధిల్లిన తెలుగుకవుల రచనలుకూడ గ్రహించటం జరిగింది. యక్షగానాలు, నాటకాలు, పదకవితలు, వచనకృతులు వేరొక ప్రకరణంగా విభజించటంవల్ల ఇందులో కేవలం పద్యకృతులను ద్విపదలను మాత్రమే పరిశీలించటం జరిగింది. ఈ ఇన్నూరేండ్లలో నూర్లకొలది కవులున్నా ముఖ్యులైన కొందరిని మాత్రమే పరిశీలనకోసం ఎంపిక చేసుకొన్నాను. ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాలవారే కాక ఆంధ్రేతర ప్రాంతకవులు కూడ ఇందులో

ఉన్నారు. కాబట్టి వారి రచనలలో ఆయా ప్రాంతాల మాండలికాలు యాసలు చోటు చేసుకొన్నవి. ఈ కాలపు రచయితలు లాక్షణికులుగానీ, కేవలం కవులుగానీ తమ తమ రచనలలో గ్రామ్యమనీ పాత్రోచితభాష అనీ ఆనాటి శిష్టవ్యావహారికాన్ని శిష్టేతర వ్యావహారికాన్ని ప్రయోగించినారు. ఇందువల్ల మనకు ఆనాటి వాడుకభాష ఎట్లాఉండేదో కొంత మచ్చుకైనా తెలుస్తుంది. ఆయా కవులు వాడిన అన్యదేశ్య పదాలలో మన భాషలోలేని వర్ణాలు కొన్ని కనుపడుతవి. ఆయా అన్యదేశ్య వర్ణాలకు సన్నిహితంగా ఉండే మన వర్ణాలనే వాళ్ళు వాడినారు. మరి అనాటి ఉచ్చారణ ఏ విధంగా ఉండేదో మనం ఊహించలేము.

## వర్ణసమామ్నాయం

**8.1.** వర్ణాలలో అచ్చులకు సంబంధించినంత వరకు అ ఆలకు ఎఏ లకు నడిమి ఉచ్చారణం కలిగిన అ ఆ లు ఉన్నట్లు ప్రయోగాలవల్ల తెలుస్తున్నది. ఐతే వీటికి ప్రత్యేక వర్ణాలగుర్తులు మాత్రం మన వర్ణసమామ్నాయంలో కల్పించుకోవటం జరుగలేదు. ఇతునకు హ్రస్వ అకారంతో సంధిచేసినప్పుడు హ్రస్వ అకారము, దీర్ఘ ఆకారంతో సంధిచేసినప్పుడు దీర్ఘ ఆకారము వినబడుతవి. ఉదా : బంతి + అనున్ = బంతనున్ (చే. వెం. వి. *I*.102), అనవలసి + అంటి = అనవలసంటి (చే. వెం వి. *I*. 161), ఒసంగి + అవి = ఒసంగవి (చిం. ఛా రా. *IV*. 9), క్రుంకి + అడిగ = క్రుంకడిగె (పా. క. శు. *I*. 235), నాగవల్లి + ఆట = నాగవల్లాట (పా. క. శు. *II*. 168), ఇన్ని + అని – ఇన్నని (కా. మ. ష *II*.8), సవతి + అని = సవతని (ఆ. కా. *I*.203), సారథికుంటి + అని = సారథికుంటని (చి. సిం. వి.) కన్నతల్లి + అడిగిన = కన్నతల్లడిగిన (ప. రం. ఉ. *I*.40) మొదలైనవి. ఈ ప్రయోగాలన్నిటిలోను వినపడేది హ్రస్వ అకారం.

ఇక తాటాకువంటి పదాలలో వినబడే దీర్ఘ ఆకారానికి సంబంధించిన ప్రయోగాలుకూడ ఈ కావ్యాలలో చాలా లభిస్తున్నవి. ఉదా : మెంతి + ఆకు = మెంతాకు (అ.నా.హం. *IV*. 138), చెవులుపట్టి + ఆడించు = చెవులుపట్టాడించు (చే. వెం. వి. *II*.106), ఏటి + ఆవల = ఏటావల (చే. వెం. సా.), ఊడి + ఆడ = ఊడాడ (కూ. తి. స IV. 47), మోవి + ఆనవలదె = మోవానవలదె (ప. రం. ఉ. I 56), కిళ్ళి + ఆకు = కిళ్ళాకు (స. వెం. రా. *I*.67), చనుదెంచి + ఆనాదమాలించి = చనుదెంచానాదమాలించి (కా. అ. ఆ. పీఠిక. 5), కలికి +

ఆదిని = కలికాదిని (కా. అ. అ. పీఠిక. 90), నీతండ్రి + అన = నీతండ్రాన (అ.కా.) *II*. 71) మొదలైనవి. ముత్తేల హారములను (చెం. కా. రా. *II* 33), కడ్తేలు (కూ. జ. వం. *II*-88) వంటి శబ్దాలలోని ఏకారం ధ్వనికూడ ఇటువంటిదేకావచ్చు.

**8.2.** ఋకారం మనకు తత్సమశబ్దాలలో మాత్రంరావలె. ఇది, సంస్కృత వర్ణసమామ్నాయంనుండి తెలుగుకువచ్చిన అచ్చు. కాని అహోబలపతివంటి లాక్షణికుడే ఈ వర్ణాన్ని దేశ్యపదంలో వాడినాడు. బ్రుంగి అని రేఫతో చెప్పవలసిన మాటను యతికోసం కాబోలు "బృంగి తపించి తత్తనువువీడిన" (అ. కా. *I*-291) అని ప్రయోగించినాడు. దీనిని విశేష ప్రయోగంగానే గ్రహించాలె. లేదా 'ఋ' కారానికి ఉండే విశిష్టమైన ఉచ్చారణ జారిపోయి 'రు' ఉచ్చారణతో సమానమై పోయిందనుకోవాలె.

అన్యదేశ్యాలలో వచ్చే వర్ణాలుతప్ప హల్లులగురించి ఈ యుగంలో చెప్పుకోవలసిందేమీలేదు. సాధురేఫానికి శకటరేఫానికి ఉన్న భేదం ఉచ్చారణలో ఎన్నడో నశించిపోయింది కనుక ఈ యుగానికంటె ప్రాచీనుల రచనలలోనే ఒక రేఫానికి మరొక రేఫం కనుపడుతవి. ఈ కాలపు కృతులలోకూడ ఇటువంటి తబ్బిబ్బులు చాలా ఉన్నవి.

**8.3.** తెలుగుపై ఫార్సీ, అరబీభాషల ప్రభావం కాకతీయ సామ్రాజ్య పతనానంతరం ప్రారంభమై బహ్మనీ రాజ్యస్థాపనతో బలపడి, ఖుతుబ్షాహీ పాలనతో స్థిరపడింది. శ్రీనాథుని కాలంనుండి మన కావ్యాలలో ఈ భాషలపదాలు దినదినం పెరుగుతున్నవి. ఈ అన్యదేశ్యాలలో వచ్చే *f*. *x*, *γ*, *z* వర్ణాలకు సామ్యంకలిగిన పఫ, కఖ, గ, జ వర్ణాలనే తెలుగుకవులు వాడినారుకాని మన వర్ణమాలలో ప్రత్యేకంగా వేరేగుర్తులు చేర్చలేదు. ఈ ధ్వనుల ఉచ్చారణలో వాటి మౌలికతను మనవాళ్ళు కాపాడినారో లేదో తెలియదు. ఫార్సీ, అరబీ వర్ణమాలాధారం గల ఉర్దూ, రాజభాషగా 1948 నాటి వరకూ తెలంగాణంమీద ప్రభుత్వం నెరపిందికనుక పైన పేర్కొన్న అన్యదేశ్య వర్ణాలను ఉచ్చరించేటప్పుడు తెలంగాణంవారు ఇప్పటికీ వాటి మౌలికధ్వనులను కాపాడుతున్నారు కాని తెలంగాణం బయటమాత్రం ఆ వర్ణాలతో సామ్యంకలిగిన తెలుగువర్ణాలనే వాడుతున్నారు. చాళుక్యసీమ రాయలసీమలలో నూరు నూటయాభై యేండ్లుగా ఫార్సీ, అరబీ ప్రభావం తగ్గినదేకాని అంతకుపూర్వం ఆంధ్రదేశం అంతా ఆ ప్రభావానికి లోనైనదే. ఆ ప్రభావానికి లోనైన తరాలుగడచి

పోగా తరువాతి తరాలవారు మాత్రమే వాటితో సామ్యంకల మన వర్ణాలను ఉచ్చ రించినట్లు పలుకుతున్నారేకాని ఆయా విదేశీ భాషలను ఎరిగినవాళ్ళు ఉన్న దినాలలో వాటి మౌలికత ఉచ్చారణలో చెడిపోకుండా ఉండేదని మనం భావింపవచ్చు.

*f* (ف) వర్ణాన్ని ఈ యుగపు కవులు 'ఫ'తో గుర్తించినారు. ఇది దంత్యో ష్ఠ్యమూ నాదవిరహితమూ ఐన ఊష్మం. తెలుగుకవులు మాత్రం దీనికి మారుగా ఓష్ఠ్యమూ నాదవిరహితమూ మహాప్రాణమూ ఐన స్పర్శం వాడినారు. ఉదా: జాఫ రాజినుఁగు లేపునజెందు (అ. నా. హం. *I*. 240), కొలఁకు జక్కఁన ఫౌఁజు లెలసిరే య (కూ. తి. ర. *III*. 94), ఫిరంగీలు (స. వెం. అ. *II*. 95) మొదలైనవి.

*x* (خ) వర్ణాన్ని మనకవులు క, ఖలతో సూచించినారు. ఇది కంఠ్యమూ నాదవిరహితమూ ఐన ఊష్మం. మనవాళ్ళు మాత్రం దీనికి మారుగా నాదవి రహితమైన మహాప్రాణ కంఠ్య స్పర్శాన్ని అల్పప్రాణ స్పర్శాన్ని ఉపయోగించి నారు. అన్యదేశ్యాలలో ఈ ధ్వనిగలవి వ్రాతలో (خ) (ق) రెండు వర్ణాలున్నవి. అరబీ, ఫార్సీ మాతృభాషగా కలవాళ్ళు ఈ రెంటినీ వేరువేరుగా ఉచ్చరిస్తారేమో కాని మన దేశంలో ఉర్దూ మాతృభాషగా కలిగిన ముస్లింలు మాత్రం వ్రాతలో వేరువేరుగా గుర్తించినా ఉచ్చారణలో మాత్రం ఒకే విధంగా ఉచ్చరిస్తారు. మన పండితులు శకటరేఫను సాధురేఫను వేరువేరుగా వ్రాసి ఉచ్చారణలో భేదం పాటించనట్లే పై వర్ణాలగురించి ముస్లింలు ఉర్దూభాషాపండితులు వ్రాతలో భేదం పాటించి ఉచ్చారణలో భేదం పాటించటంలేదు. ఈ ధ్వనులుగల అన్యదేశ్య పదాలను ఈ కాలపు కవులు చాలా వాడినారు. ఉదా. జాపత్రియును *గురాసాని* యోమంబు (వి. నా. ర. పుట. 57). ఇందులో ద్రుతం మూలంగా కు, గుగా మారింది. జమా ఖరుచుల్ *గణించి* (అ. నా. హం. *I* 142), కలయఁగ ఖుశాలు వచ్చు (అ. నా. హం. *V*. 182). ఖుశాలు పదంలోని శవర్ణానికి మారుగా షవర్ణం వాడవలసి ఉండె. మౌలికంగా అది మూర్ధన్యమైన ఊష్మం. ఖరుచు సేయుచు (లిం. శ్రీ. న. *I*. 104), బందిఖానా (లిం.శ్రీ.న. *IV*. 118), ఖబురు (లిం.శ్రీ.న. *IV*. 14) ఇదే మాటను ఈ కవే మరొకచోట ప్రాసకోసం కపురు (*IV*. 180)గా వాడినాడు. నకసీపని (లిం. శ్రీ. న. *I*. 80), నకాసిగుడారు (లిం. శ్రీ. న. *III* 4) అన్నప్పుడు కూడా క వర్ణమే వాడినాడు.

ɣ (غ) వర్ణాన్ని మన కవులు గ తో సూచించినారు. ఇది నాదాత్మకమైన కంఠ్యోష్మము. కాని మనవాళ్ళు నాదాత్మకమైన కంఠ్య స్పర్శంగా ఉచ్చరిస్తున్నారు.

ఉదా. మొగలీ వ(జ్రీడు (లిం. శ్రీ. న. *III* 54). నిత్యవ్యవహారంలో వచ్చే అన్య దేశ్యాలు గరీబు, గలీజు, గలీబు మున్నగు పదాలలో వచ్చే వర్ణం ఇదే.

ఉ (ر) వర్ణాన్ని తెలుగు జ తో ముడిపెట్టినారు. ఇది నాదాత్మకమైన దంతమూలీయోష్మం. కాని మనవాళ్ళు నాదాత్మకమైన తాలవ్య స్పర్శంతోనే సరిపెట్టుకొన్నారు. ఫార్సీ, అరబీ భాషలలో ఈ ధ్వని సామ్యం కలవి (ر), (ژ) (ض), (ظ) నాలుగు వర్ణాలున్నవి. ఇందులో (ژ), (ظ), (ض) ఈ మూడు వర్ణాల ఉచ్చారణ మరీ సన్నిహితంగా ఉంటది. వాటిలోని సూక్ష్మభేదాన్ని ఆ యా భాషలు మాతృభాషగా కలవాళ్ళు గుర్తిస్తారేకాని ఉర్దూ మాట్లాడేవారు కూడ వ్రాతలో భేదం పాటించినట్లు ఉచ్చారణలో భేదం పాటించరు. (ژ) వర్ణాన్ని మాత్రం కొంచెం భేదంగా ఉచ్చరిస్తారు. తెలుగువాళ్ళు మాత్రం ఈ నాల్గింటిని 'జ' లోనే కలిపినారు. ఈ యుగం కవులు ఈ వర్ణాలు వచ్చే అన్యదేశ్యాలను అధికసంఖ్యలోనే వాడినారు. ఉదా. పంచదారను దిను బాజా వజీరు (వి. నా. ర. పుట. 45), కమ్మగేదగి నేజ గైకొని మరుడు (వి. నా. ర. పుట. 68), వాలుగల సజాలు (సు. మా. చం. *III* 58), పంచాంగములు చెప్పి బాజారు లోపల (అ. నా. హం. *II* 158), జరుబాబు (చిం. ఛా. రా. *IV* 181), జాలుముల సందడుల్ (స. వెం. రా. *I* 110), హుజూరు పాటకు (లిం. శ్రీ. న. *IV* 60), రాచ వజీరు (లిం. శ్రీ. న. *II* 8).

## నామ ప్రత్యయాలు

**8.4.** ప్రథమైకవచన ప్రత్యయం చేరటంలో ఈ యుగపు సాహిత్య భాషలో కొంత వైవిధ్యం కనుపిస్తున్నది. అవ్యాకృత రూపాలైన వీటికి నాటి మాండలిక వ్యవహారమే ఆధారమై ఉండవచ్చు. వ్యాకరణం ప్రకారంగా మహదేక వచన ప్రత్యయం డుఙ్ రావలసిన చోట్లకూడ అది రాని సందర్భాలు కొన్ని ఈ కాలపు కావ్యాలలో ఉన్నవి. ఉదా. చందు మున్నగు గ్రహోచ్చయములు (కం. నా. వి. *III* 50). దీనికి విరుద్ధంగా డుజ్వర్ణకం రాగూడని స్థలాలలో వచ్చిన నిదర్శనాలు ఉన్నవి. అందులోను ఇవి అన్యదేశ్యాలలో రావటం మరొక విశేషం. ఉదా. వజీరుండు (స.వెం.అ. *I* 52), మొగలీ వజ్రీడు (లిం. శ్రీ. న. *III* 54). నిజంగా ఇక్కడ ఉత్వమేచాలు. డుజ్వర్ణకం కాప్రత్యయంతో కలిసి అనుద్దిష్ట శబ్దాలలో కనుపించటం ఇంకొక ప్రత్యేకత. ఉదా. క్రైవల్యంబునకుం గాణాచి కాండ్లగు (పా. కా. ష. *IV* 162), తలారి కాండ్లు (కా. అ. అ.*II* 196). ఈ

కాలపు కావ్యాలలో అమహదేకవచన ప్రత్యయం 'ము' వైకల్పికంగా వచ్చే అసాధారణ పదాలు కొన్ని కనుపిస్తవి. ఉదా. క్రొత్తసూరెపుటంపుగుఱుచ గద్దిగము (వి. నా. ర. పుట. 30). చిన్నయసూరిగారిని (ఆచ్ఛిక. 2) అనుసరించి దీనిని క్లీబసమంగా ఎంచుకొని 'ము' వచ్చిందని సమర్థింపదలచుకొంటే ఈకవే మరొకచోట కటికవారలు పల్కు గద్దిగ డిగ్గి (వి. నా. ర. పుట. 307) అని ప్రయోగించినాడు. ఒకే పదాన్ని ఒకచోట స్త్రీసమంగాను మరొకచోట క్లీబసమంగాను చెప్పుకోవటం బాగుండదు. ఛందోనిర్బంధం మూలంగానో, నాటి వ్యవహార బలం చేతనో కవి ఆవిధంగా ప్రయోగించినాడనుకోవాలె. ఇదే విధంగా ప్రాచీన కావ్యాలలో 'సయ్యాట'గా ఉన్న మాటకు ప్రబంధకాలం నుండి 'సయ్యాటము' అనే రూపాంతరం కనుపిస్తున్నది. ప్రకృత పరిశీలనలో ఉన్న యుగంలోకూడ లాక్షణికులైన కవులే ఈ మాటను 'ము' ప్రత్యయంతో వాడినారు. ఉదా. సయ్యాటములను (అ. శా. *II* 89). 'ము' ప్రత్యయం లోపించిన పదాలు కూడ కనిపిస్తవి. ఉదా. బలిమిమై నను దీనిబట్టి భోగింప వలయుఁగా కిఁక డాఁప వశగాదు మమత (కం.నా.వి. *IV* పుట. 91). చండాల సంసర్గ సలిపినావు (కా.మ. ష *IV* 98). వశము, సంసర్గము అనవలసినచోట్ల వశ, సంసర్గ అనటం జరిగింది. చిన్నయసూరిగారి "చరిత్రాదుల ముపర్ణకంబునకు లోపంబు బహుళంబుగానగు" (తత్సమ-69) అనే సూత్రంతో వీటిని సవరించుక పోవచ్చునుగాని వీటికి అంత గొప్ప 'చరిత్ర' లేదేమో. పులకలు అనివలసినచోట పులకములు అని ముపర్ణం చేరిన ప్రయోగాలుకూడ ఉన్నవి. ఉదా: మురువున రూపుమై పులకముల్ మెఱసెన్... ద్విరేఫముల్ (ప. రం. ఉ. *III* 30). శబ్ద రత్నాకరకారుడు 'పులకము' అనే మాటకు వేరే అర్థాలిచ్చినాడు కాని గగుర్పాటు అనే అర్థం ఇయ్యలేదు. గగుర్పాటు అనే అర్థం 'పులకలు'కు ఇచ్చినాడు. మీదుమిక్కిలి "తెనుఁగున నిది స్త్రీసమముగాను బహువచనాంతముగాను బ్రయోగములం జూపట్టెడు" అన్నాడు. నాటి సాహిత్యభాషలో ఉదంత అమహచ్ఛబ్దానికి వు గాగమం వచ్చిన విశేషరూపమొకటి దొరుకుతున్నది. ఉదా: కల్గెను బోతువచ్చటన్ (అ.నా. హం. *V* 88). 'ము' ప్రత్యయం స్థానంలో వైకల్పికంగా వు గాగమం వచ్చిన రూపాంతరం మరొకటి లభిస్తున్నది. ఉదా. పుట్టువును కాలమును కర్మవును (క. వ. రా. *vol. II* పుట. 288). ధర్మవు వలె కర్మవుకూడా వ్యాకరణం ప్రకారంగా సాధువేకాని ప్రయోగబాహుళ్యంలేదు. తత్సమశబ్దాలలో నిత్యమైన వుగాగమం లోపించిన నిదర్శనాలుకూడ ఉన్నవి. ఉదా. అంబు ద్రమింగిన తప్త

లోహంబు కరణి (చి. సిం. *వి. I* 149), శ్రమాంబు చెక్కులన్ (ఆ.కా. *II* 48). 'అంబువు' అనవలసినచోట పై ఉదాహరణలలో చిత్రకవి సింగరార్యుడు, అహోబలపతి 'అంబు' అన్నారు. తత్సమ పదాంత వుగాగమం బహువచనానికి ముందు లోపించిన ఒక విశేష ప్రయోగం నాటి కావ్యభాషలో లభిస్తున్నది. ఉదా. వస్తువెవ్వని ఇంట విస్తరిల్లు (బి. తి. అ. *I* 78, 117). ఐతే "వువర్ణకేతర విభక్తిపరమగుచోనుకారాంతంబులకు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమంబగు' (తత్సమ-49) సూత్రంతో దీన్ని కూడ సరిపెట్టుకోవచ్చునేమో.

**8.5.** సమాసగతమై ఇకారాంతమైన 'తోడ' ప్రత్యయానికి రూపాంతరమైన 'తోడి'కి వ్యావహారిక రూపం 'తోటి' నాటి కావ్యభాషలో స్థానం సంపాదించుకొన్నది. ఉదా: హరియింమను తోటిహాలహలముంబోలెన్ (చిం.ఛా.రా. *IV*. 157).

**8.6.** పంచమ్యర్థంలో వాడే 'ఉండి'కి వ్యవహారంలో వినిపించే 'నుంచి' నాటి కావ్యభాషలో కనుపిస్తున్నది. 'పూని వదాన్యులంచు దమ భూముల నుంచి' (చిం. ఛా. రా. *III*. 64). చిన్నయ సూరిగారు దీనిని 'సాధుకవి ప్రయోగారూఢంబు గాదని యెఱుంగునది' (కారిక-11. కారిక) అన్నారు. పంచమీ విభక్తి ప్రత్యయం 'వలన'కు వ్యావహారిక రూపాంతరం 'వల్ల' ఈ యగంలో చాలామంది కవులు వాడినారు. ఉదా. 'కల్ల నావల్ల గోరంత గలిగెనేని' (చే. వెం. సా. *II*).

**8.7.** షష్ఠీ ప్రత్యయమైన 'కు' కు ముందు నగాగమం సంప్రదాయ వ్యాకరణ విధేయం. 'కువర్ణకంబు పరంబగునపుడు కార ఋకారంబులకు నగాగమంబగు' (తత్సమ-28) అని చిన్నయసూరిగారు. కాని నాటి కావ్యభాషాలో నగాగమం రాని రూపాలు అనేకం. ఉదా : 'నీ మనసుకె తోఁచివచ్చు ననుమానము లేదిక' (చిం. చా. రా. *III*. 168), 'ఆర్తరక్షణ బిరుదుకు హాని వచ్చు' (గో.కూ.నిం. పద్యం. 16), 'శేషుకైన' (రె. మ. *గం*. *II*. 115). షష్ఠీప్రత్యయం 'లోపల' అనుదానికి 'లో' రూపాంతరం. దీని దీర్ఘానికి తెలంగాణం వ్యావహారికంలో హ్రస్వం రావటం హెచ్చు. ఈ హ్రస్వరూపం కూడి నాటి కావ్యభాషలో కనుపిస్తున్నది. ఉదా. 'వార్ధిలొ' (రె. మ. *గం*. *II*. 166).

**8.8.** 'ఒద్ద' అనే అర్థంలోని 'కడ' అనుబంధానికి వ్యావహారిక రూపమైన -కాడ అప్పకవీయంలోనే దొరుకుతున్నది. ఉదా. నా కాడ (పుట 126). ఐతే

దీనిని అప్పకవి గ్రామ్యానికి ఉదాహరణంగా చెప్పినాడు. 'ఒద్ద'కు ఔపవిభక్తిక రూపం 'ఒద్ది' అనే మాటకూడ కావ్యాల కెక్కింది. ఉదా : 'నీరజనాభుఁడొద్ది తరుణీతతి' (ప. రం. ఉ. *III*. 118).

**8.9.** మహద్బహువచనంలో అదంత దీర్ఘ పూర్వలోపధం కాని శబ్దాల మీద కూడ 'రు' ప్రత్యయం నాటి కావ్యాలలో కనుపిస్తున్నది. ఉదా : 'సూతుర నదలింపుచు (చిం. ఛా. రా. *VI*. 103). ఇది ప్రాస స్థానంలో ఉన్నది. 'కూతు శబ్దము ప్రథమైక వచనంబునకు రు వర్ణంబగు' (అచ్చిక-9) అని చిన్నయ సూరి గారి అనుశాసనం. సూరిగారు కుతురులు, కూతుళ్ళు కూతురి అనేవి గ్రామ్యా లన్నారు. ఐనా వ్యవహారబలం మూలంగా మహాకవుల కృతులలోనే వాటికి ప్రయోగాలున్నవని కీ. శే. గిడుగు రామమూర్తి పంతులుగారు తమ బాలకవి శరణ్యంలో నిరూపించినారు. ఈ యుగంలో వర్ధిల్లిన లాక్షణికకవి అహోబలపతి కూడా 'సొంపుల కూఁతురి' (అ. కా. *II*. 104) అన్నాడు.

అమహద్బహువచన రూపాలలో నాటి కావ్యభాషలో ఈ కింది సంధిగత రూపాలు కనిపిస్తవి. ఇవి వ్యవహారభాషకు సన్నిహితంగా ఉంటవి.

-డ్ (అచ్చు) + లు > - ళ్ళు

'మూడు లక్షల మాళ్ళకు, నలభై యొకవేల మాళ్ళు' (వి. నా. ర. పుట.27). 'ఒళ్ళలోఁ గడితంబు లొప్పుగా నునిచి' (వి. నా. ర. పుట. 51), వంకలను డొంకలను బీళ్ళ, బాళ్ళ, గుప్పలను, దిప్పలను. మళ్ళ, గుళ్ళ, నూళ్ళ (అ. నా. హం. I. 189), గుళ్ళ పంచల పసుల గాళ్ళను (రె. మ. గం. *II*. 177).

-ర్ (అచ్చు) + లు > - ళ్ళు దాసళ్ళు (మ. రె ష. V. 14),
పైళ్ళు (కా. మ. వ. *II*. 42).

-(దీర్ఘాచ్చు) + లు > -ళ్ళు జాళ్ళ (అ. నా. హం. I. 189).

దీర్ఘాంతమైన అన్యదేశ్యాల తుది ఇకారానికి బహువచంలో ఉకారాదేశం రాకపోవటం వ్యవహారభాషాపద్ధతి. దీనికి నాటి కావ్యభాషలో నిదర్శనం దొరుకు తున్నది. ఉదా. ఫిరంగీలు (స. వె. అ. *II*. 95). సూరిగారు 'ఇత్తునకు బహు వచనంబు పరంబగు నపుడుత్వంబగు' (తత్స. 45) అని తపరకరణం చేయటంతో శ్రీలు, స్త్రీలు, లకోరీలు మున్నగు వాటివలె ఫిరంగీలు కూడ సాధువే.

**8.10.** సంప్రదాయ వ్యాకరణం ప్రకారంగా ఔపవిభక్తికాలైన వాటిని అనౌపవిభక్తికాలుగాను, అనౌపవిభక్తికాలను ఔపవిభక్తికాలుగాను నాటి కవులు ప్రయోగించినారు. దీనికి కవుల భ్రమప్రమాదాలే కాక నాటి వ్యవహారబలం కూడ కారణమై ఉండవచ్చును.

ఔపవిభక్తికాలు అనౌపవిభక్తికాలుగా :-

ఉదా : చేరంజని మఱునెనాడు ( = మఱుసటినాడు) (ఆ.నా.హం.V.202)

నౌనల మేల్నొగసులీల ( = నౌసట) (కూ. తి. ర. I. 84)

పదములెగయంగ వర్ణముల్మొదలికేగ (మొదటి)(కా.మ ష.*III*.45).

అనౌప విభక్తికాలు ఔప విభక్తికాలుగా :-

ఆవని చెంగట నామటిమేర (ఆమడ) (క. వ. రా. *Vol. II*. పుట. 85)

పోలుగ వాతాపి పొట్టేటిఁజేసి (పొట్టేలు) (క. వ. రా. *Vol. II* పుట.37)

అడుగిటి లోనబట్టు (అడుగులోన) (కా. మ. ష. *II* 66)

నేతిడి నెఱ్ఱిగా వేఁచిన వేఁపుడు (నేయిడి) (కా. మూ. పాం. *IV*. 4)

వనసపంటికి మంచి పసయొడఁ గూర్పక (పంటుకు) (కూ.తి.స. *III* 40)

సంధి

**8.11.** త్వరిత సంభాషణలో వినిపించే అచ్సంధులూ హల్సంధులూ నాటి కావ్యభాషలో చాలా ఉన్నవి. వీటిలో లాక్షణికులు అంగీకరించని తత్సమాచ్సంధులూ, శత్రర్థకసంధులూ, ద్రుతప్రకృతిక సంధులూ, క్త్వార్థక సంధులూ ఉన్నవి. ఒక్కొకచోట తత్సమ శబ్దాలకు తెలుగుపద్ధతిలో సంధిచేసిన ఉదాహరణలు కూడా ఉన్నవి. లాక్షణికులు అంగీకరించని ఈ సంధులు చేసినవాళ్ళంతా సాధారణ కవులుకారు. కొందరు లాక్షణికులనిపించుకొన్నవారు మరికొందరు మహాకవులు అనిపించుకొన్నవారు కూడ ఇందులో ఉన్నారు.

**8.12.** అచ్సంధులు

(1) -అ + అ-అ > - :-

ఒక + అక్షర = ఒకక్షర. ఒకక్షరమైనను రాదు (పా. క. ఖ. *II* 438)

కాక + అపూర్వ = కాకపూర్వ. తబ్బిబోకాకపూర్వతనుబిబ్బోకా (చే. వెం. వి. *II* 191)

తమ + అమ్మ = తమమ్మ. తమమ్మ తామరమోమందలి (చే.వెం.సా. *I*)
కాన + అందు = కానందు. (కానయంధు) (చే. వెం. సా. *I*)
వెన్నెల + అతివ = వెన్నెలతివ. వెన్నెలతివ కిచ్చినయట్లు (ప.రం.ఉ.*II* 45)
కథ + అనుసరణ = *కథనుసరణ*. కలితమన్మథ కథాకథనుసరణ (వెం. కా. రా. *I* 106).

(2) -అ + ఆ- > ఆ- :—

ఇంక + ఆదేవిని = ఇంకాదేవిని (చే. వె. సా. *II*)
పిదప + ఆమ్ల = పిదపామ్ల ద్రవ్యముల్ (చిం. ఛా. రా. *II* 249)

(3) -అ + ఇ- > ఇ- :—

తన + ఇచ్చ = తనిచ్చ (అ. నా. హం. *IV*. 146)
కాక + ఇచ్చ = కాకిచ్చ. ఆనెగాకిచ్చవచ్చినది (చే. వెం. వి. *I* 25)
ఇక + ఇవి = ఇకిలి *వలియాసలికివి* (గో. కూ. నిం. ప. 41)

(4) -అ + ఈ- > ఈ- :—

కాక + ఈ = కాకీ. ఇదిగాకీచేయు (కం. పా. ఉ. *III* 74)
తప్పక + ఈక్షించి = తప్పకీక్షించి (చే. వెం. సా. *I*)

(5) -అ + ఎ- > ఎ- :—

సరసత + ఎదలక = సరసతెదలక (అ. కా. *I* 73)
ఆపద + ఎడిసి = ఆపదెడసి (అ. కా. *II* 212)
తెల్ల + ఎఱ్ఱ = తెల్లెఱ్ఱజొన్నలు (అ. నా. హం. *IV* 126)
నరుల + ఎల్ల = నరులెల్ల. చూచిన నరులెల్లవేడి (కూ. జ.చం. *I* 60)

(6) -అ + ఐ- > ఐ- :—

చిత్రరేఖ + ఐన = చిత్రరేఖైనసీవేళ (ప. రం. ఉ. *III* 46)

(7) -అ + ఒ-> ఒ- :-

చిత్రరేఖ + ఒక = చిత్రరేఖొకవన్నె (లిం. శ్రీ. స. *II* 15)

(8) -అ + ఔ-> ఔ :-

వ్యాకర + ఔ = వ్యాకరౌముని (అ. కా. *III* 132)

(9) -ఇ + అ-> అ- (అ-) :-

వడఁకి + అటు = వడఁకటునిటు (క. వ. రా. *vol. II* పుట. 208)
ఈవి + అహిమరుక్ = ఎవని యీవహిమరుగ్భవ (అ. నా. హం. *I* 15)
దీవించి + అక్షత = దీవించక్షతపుష్ప (అ. నా. హం. *I* 48)
తెచ్చి + అట = చూచితెచ్చటఁ గుమార్తె (అ. నా. హం. *II* 114)
జీవి + అటకు = జీయుధోపజీవటకు (అ. నా. హం IV 148)
చూపి + అటు = అటుచూపిటు నిటుచూపటు (చే. వెం. వి. *II* 202)
ఒసంగి + అవి — ఒసంగవి (చిం. భా. రా. IV 9)
క్రుంకి + అడిగె = క్రుంకడిగె (పా. క. ఖ. I 285)
నిల్పితి + ఇంతవడి = నిల్పితింతవడి (అ. కా. *II* 230)
అందితి + అనంత = ఉదయమంది తనంత పదంబుగంటి (అ. కా. *I* 323)
పోయితి + అప్పుడు = పోయితప్పుడు (అ. కా. *III* 169)
లేచి + అటు = లేచటు (ఆ. వెం. *గో. I* 20)
తరుణి + అగు = తరుణగు (ఆ. వెం. *గో. I* 42)
అరుచి + అయ్యె = అన్నమరుచయ్యె (రె. మ. *గం. II* 257)
వచ్చి + అరత్రావాలి = వెన్కకువచ్చరత్రావాలి (లిం. శ్రీ. స. *III* 102)
నేర్చి + అన్వయము = అన్నియునేర్చన్వయమునకు (లిం. శ్రీ. స. *IV* (16)

(10) -ఇ + ఆ-> ఆ- (ఆ-) :—

మెంతి + ఆకు = మెంతాకు (అ. నా. హం. IV 133)
పట్టి + ఆడించు = చెవులుపట్టాడించు (చే. వెం. వి. *II* 106)

ఏటి + ఆవల = ఏటావం (చే. వెం. సా. II)
ఊపి + ఆడుచు = ఊపాడుచు (చిం. భా. రా. V 135)
ఊడి + అడ = ఊడాడ (కూ. చి. న. IV 47)
తండ్రి + ఆన = తండ్రాన (అ. కా. II 71)
చనుదెంచి + ఆనాదము = చనుదెంచా నాదమాలించి (కా. అ. అ. పీఠిక. 5)
కలికి + ఆదిని = ఈ కలికాదిని (కా. అ. అ. పీఠిక. 90)
మనవి + ఆలకించి = మనవాలకించి (కూ. జ. చం. II 132)
మోవి + ఆనవలదె = మోవానవలదె (ప. రం. ఉ. I 56)
మాయింటి + ఆతడు = మాయింటాతడు (సం. వెం. అ III 58)
కిళ్ళి + ఆకు = కిళ్ళాకు (స. వెం. రా. I 67)

(11) -ఇ + ఇ- > ఇ- :-

తెచ్చితి + ఇంటికి = తోడి తెచ్చితింటికి (అ. నా. హం. V 195)
పట్టి + ఇచ్చి = పట్టిచ్చి (అ. నా. హం. V 249)
అడిగి + ఇచ్చునొ = అడిగిచ్చునొ (చే. వెం. వి. I 59)
ఒనర్చి + ఇటు = ఒనర్చిటు (చే. వెం. వి. I 189)
బుద్ధి + ఇది = బుద్ధిది (పా. క. ఖ. III 112)
నీలవేణి + ఇదె = నీలవేణిదె (అ. కా. II 133)
నిల్పితి + ఇంతవడి = నిల్పితింతవడి (అ. కా. II 230)
చెప్పి + ఇడుము = చెప్పిడుము (కూ. జ. చం. I 23)
మోసపోతి + ఇక = మోసపోతిక (స. వెం. రా. I 73)

'ఒకరి నననేల మోసపోతిఁక నదేల' ఇందులో ఉత్తమ పురుషైక వచన క్రియ ఇకార సంధి విలక్షణతతో పాటు నిర్బిందుక సబిందుక ప్రాస యతి గూడ గమనింప దగినదే.

తెచ్చి + ఇమ్ము = తెచ్చిమ్ము (లిం. శ్రీ న. I 71)
చింతిల్లి + ఇంత = చింతిల్లింత (లిం. శ్రీ. న. III 10)
చెయ్యి + ఇయ్యదాయోగా = చెయ్యియ్యదాయెగా (లిం. శ్రీ. న. IV 151)

(12) -ఇ + ఉ- > ఉ- :-

విడిబడి + ఉన్న = విడిబడున్న (అ. నా. హం. II 149)

వెండి + ఉంగరము = వెండుంగరము (అ. నా. హం. IV 26)

పెట్టి + ఉసిరికాయలు = పెట్టుసిరికాయలు (చిం. భా. రా. VI 224)

నివసించి + ఉండెడు = నివసించుండెడు (ఆ. వెం. గో. I 24)

జాతి + ఉండంగ = జాతుండంగ (చి. సిం. బి. III 188)

విక్రయించి + ఉదయ రాగంబు = విక్రయించుదయరాగంబు (చి. సిం. బి. III 198)

(13) - ఇ + ఎ- > ఎ- :-

కోర్కికి + ఎచ్చు = కోర్కికెచ్చిచ్చెనే (చే. వెం. ని. I 25)

పాడి + ఎంత = పాడెంత (కా. మ. ష. I 19)

పొంగి + ఎక్కు = పొంగెక్కు (అ. కా. II 44)

రాత్రి + ఎల్ల = రాత్రెల్ల (ప. రం ఉ. III 56)

పెకలించి + ఎలగాడ్పు = పెకలించెలగాడ్పు (చి. సిం. బి. II 7)

(14) -ఇ + ఏ- > ఏ - :-

అది + ఏంది (ఏమిటి) = అదేంది. (ర. భూ. రా. II 145)

గ్రహించి + ఏ + ఉన్నారు = గ్రహించేయున్నారు (చిం.భా.రా. IV 141)

అంతరీపమునుండి + ఏతెంచి = అంతరీపమునుండేతెంచి (చి.సిం.బి. II 20)

(15) -ఇ + ఐ- > ఐ- :-

కేళికి + ఐతేను = కేళికైతేను (అ నా. హం. II 166)

ఎన్ని + ఐన = ఎన్నైన (పా. క. బ. I 499)

ఇది + ఐనది = ఇదైనది (బి. తి. అ. I 218)

సమ్మతి + ఐన = సమ్మతైన (స. వెం. అ. III 105)

(16) -ఇ + ఒ- > ఒ - :—

తాల్చి + ఒగిన్ = తాల్చొగిన్ (అ. నా. హం. V 88)

ప్రణుతి + ఒనర్చి = ప్రణుతొనర్చి (ఆ. వెం. గో. I 12)

గణుతి + ఒనర్ప = గణుతొనర్ప (ఆ. వెం. గో. I 38)

(17) -ఉ + అ- > అ- :—

మిన్నుముట్టుచు + అహంకరించు — మిన్ను ముట్టు చహంకరించు (చే. వెం. వి. III 64)

అగుచు + అర్ధశ్రేణి = అగుచర్ధశ్రేణి (ఎ. బా. మ. పద్యం. 36)

పిల్చుచు + అహల్యా = పిల్చుచహల్యా (స. వెం. అ. III 134)

అతిశయిల్లుచు + అవని = అతిశయిల్లచవని (చి. సిం. వి. I 46)

ఇందులో యడాగమం చేసిన ఉదాహరణం కూడ ఒకటి లభించినది.

'మదిరాక్షి బదులుకు బదులు యనుచు' (స. వెం. రా. I 13)

(18) -ఉ + ఆ- > ఆ- :—

మించు + ఆగు = మించాగు (ఛే. వెం. వి. II 73)

(19) -ఉ + ఇ- > ఇ- :—

దువ్వుచు + ఇట్లను = దువ్వుచిట్లను (అ. కా. I 236)

పగలు + ఇనుండు = పగలినుండు (కా. మ. ష. II 62)

(20) -ఉ + ఈ- > ఈ- :—

పల్కుమంచు + ఈ సమాచారంబు = పల్కుమంచీ సమాచారంబు (స వెం. అ. I 50)

(21) -ఉ + ఎ- > ఎ- :—

పైయెత్తు + ఎన్నకే = పైయెత్తెన్నకే (చే. వెం వి. III 163)

కల్గు + ఎనుబోతువు = కల్గెనుబోతువు (అ. నా. హం. V 33)

(22) -ఉ + ఓ- > ఓ- :–

పాడుచు + ఓడ = పాడుచోడగడపే (స. వెం. అ. *I* 95)

(23) -ఎ + అ- > అ- :–

నూనె + అంటె = నూనంటె (ప రం. మ V 13)

**8.13.** హల్సంధులు : అచ్సంధులకంటె హల్సంధులు వ్యవహారానికి మరీ దగ్గరగా ఉండేవి ఈ కాలపు కవులు చేసినారు. ఉదా :–

(1) -గ్ + క్- > క్క- :–

అడుగు + కొని = అడుక్కొని (అ. నా. హం. *III* 142)

అడుగు + కోలు = అడుక్కోలు సుంకము (అ. నా. హం. *IV* 84)

(2) -ట్ + ల్- > ట్ల్- :–

ఇంటి + లోకి = రెడ్డినింట్లోకి బిలిచి (అ. నా. హం. *III* 91)

(3) -డ్ + ర్- > డ్ర్- :–

రెండు + రాగములు = ముప్పదిరెండ్రాగములు (కా. మ. ష. *II* 131)

(4) -డ్ + న్- > న్న- :–

రెండు + నెల్లు (నెలలు) = రెన్నెల్లు, మూన్నెల్లు, రెన్నాళ్ళు (క. వ. రా. *vol. II* పుట. 33 & 34)

(5) -డ్ + న్- > ణ్ణ్- :–

రెండు + నెల్లకు (నెలలకు) = నెలరెణ్ణెల్లకు (ఋ. వెం. చం. *I* 14)

మెడ + నూలు = మెణ్ణూలు (అ. నా. హం. *III* 91)

(6) -డ్ + న్- > ళ్న- :–

ఏడు + నూరు = ఏళ్నూరును (చెం. కా. రా. *I* 26)

(7) -ల్ + న్- > ల్ల్- :–

నెల + నాళ్ళలో = నెల్లాళ్ళలో (కూ. జ. చం. *I* 56)

**8.14.** యడాగమాలు : లాక్షణికులు అంగీకరించనివీ, వ్యవహారంలో ఎక్కువగా వాడే వీ ఐన యడాగమాలు కూడ నాటి కావ్యభాషలో కనువిస్తున్నవి. ఉదా. మదిరాక్షి బదులుకు బదులు యనుచు (స. వెం. రా. *I* 13), అనతియియ్యగ (కం. పా. ఉ. *II* 189).

'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగు' (సంధి. 32) అని చిన్నయసూరిగారి అనుశాసనం. దీనికి విరుద్ధంగా కర్మధారయంలో మువర్ణకానికి పుంప్వాదేశం జరుగని ప్రయోగాలు నాటి కావ్యభాషలో లభిస్తున్నవి. ఉదా. 'బొక్కసమిండ్లు' (క. వ. రా. *Vol. II* పుట. 151), 'బాదం పలుకులు' (అ. నా. హం. *I* 105).

'కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబగు' (సంధి. 28) అని సూరిగారి మతం. దీనికి భిన్నంగా టుగాగమం జరుగవలసిన చోట జరుగని రూపాలు కూడ నాటి కవులు వాడినారు. ఉదా: 'పసపాకుపందిరి' (అ. నా. హం. *I* 151), 'కాపురపింటి లోపలికి' (కూ. జ. చం. *II* 127), 'పసరంపెమ్మ' (ఎ. బా. మ. పద్యం 22).

**సమాసాలు :**

**8.15.** వ్యహారంలో బహుళంగా ఉండి కావ్యభాషలో నిషిద్ధమైన వైరి సమాసాలు కూడ ఈ యుగపు కావ్యాలలో కొన్ని కనువిస్తున్నవి. ఉదా: 'శూద్ర బిడ్డ' (అ. నా. హం. *V.* 124), 'బీగముద్రలు' (ప. రం. ఉ. *II* 97), 'మూల బొక్కసంబు' (స. వెం. అ. *II* 52), 'పీటీ సంబళులు' (చిం. భా. రా. *II* 249), 'చిక్కణ బాగముల్' (చిం. భా. రా. *VI* 295).

**క్రియాపదాలు :**

**8.16.** వ్యవహారబలం వలన కావ్యభాషలో చేరిన క్రియారూపాలు రెండు విధాలు. (1) శిష్టవ్యవహార సాధారణరూపాలు (2) మాండలిక వ్యవహారసిద్ధాలు. ఇందులోనే లాక్షణికులు గ్రామ్యాలనీ కవులు పామరభాష అనీ పాత్రోచిత భాష అనీ ప్రయోగించినవి చేరుతవి.

**8.17.** వర్తమాన క్రియలు : 'మిసమిస మెఱచుచు లోపల' (ర. భూ. రా. *I* 101). ఇందులోని 'మెఱయు' ధాతుపర్యాయ రూపం 'మెఱచు' దక్షి

ణాంధ్ర వ్యవహారంలోను రాయలసీమ పలుకుబడిలోను ఉన్నటువంటిదే కాని సాధారణ వ్యవహారంలోనిది కాదు. అప్పకవి 'మెఱుపులు మెఱుసుట' (కా. అ. అ. *II* 196) అన్నాడు. 'వెళ్ళగొట్టుచు' (కూ. జ. చం. *I* 64) అనేప్రయోగం లోని ధాతువు అంతస్సంధి వలన 'వెడలు' అనే ప్రాచీన ధాతురూపంనుంచి వర్ణ సమీకరణం ద్వారా ఏర్పడిన రూపమే. ఇది శిష్టవ్యవహార సాధారణమేకాని కావ్య భాషా సాధువుకాదు. 'వెళ్ళ గొట్టింప దలచి' (అ. నా. హం. *II* 100), 'రెండు దుక్కులు వెళ్ళదున్ని' (అ. నా. హం. V 35), 'వెళ్ళగనె' (కా. మ. ష. *VI* 84), 'వెళ్ళదోలిన' (రె. మ. *గం. II* 164), 'తలగడ నంచులవలె వెళ్ళి (పా. క. ఖ. *II* 30), 'వెళ్ళె' (కా. మూ. పాం. V 47) మొదలైన వివిధ రూపాలన్నీ ఈ కాలపు కవులు వాడినవే.

**సమాపక క్రియలు :** తెలియు, విడఁచు, చంపు అనే కావ్యభాషా రూపాలకు తెలుసు, విరుసు, సంపు అనేవి వ్యవహార రూపాలు. వీటిలో మొదటిది శిష్టవ్యవ హారంలోను తక్కినవి పామరవ్యవహారంలోను ఉన్నవి. ఈ రెండు తీరుల రూపాలను ఈ యుగంలోని కవులు వాడినారు. ఉదా. తెలుసు (చిం. ఛా. రా. V 22). విరుసు, సంపు (కా. మ. ష. *II* 60) అనే మాటలు సూసివచ్చినారు, కఱసి, విడఁసు మొదలైన మాటలు ఇందులోనే కవి బోయలనోట ఎరుకలనోట పలికించినాడు.

ద్విరుక్త అద్విరుక్త చకారాంత ధాతువులకు సవర్ణాంతరూపాలు వ్యావ హారిక భాషలో బహుళ ప్రచారంలో ఉన్నవి. కావ్యభాషలో ఇవి నిషిద్ధాలు. కాని ఈ యుగపు కవులు వీటినికూడా ప్రయోగించినారు. వస్తాడా, తెస్తాడా, చూస్తుడా, ఇస్తాడా అనేవి అప్పకవి (*I* 125) గ్రామ్యోక్తులన్నాడు. కాని కూచి మంచి జగ్గకవి (కూ. జ. *చం. II* 83) నీలాద్రి రాజంతవాడు వస్తాడనీ, ధనం తెస్తాడనీ, చంద్రరేఖకు ఇస్తాడనీ లేకపోతే విరహంతో చస్తాడా అనీ అన్నాము.

**8.18.** **భవిష్యత్క్రియలు :** 'లాట్టురుణ్ణు పరంబగునపుడెదగాగ మంబును, ప్రథమ సువర్ణకంబు పరంబగునపుడెడుగెడిగాగమంబులును బహుళం బుగా నగు' (క్రియా-23) అని సూరిగారి సూత్రము. ఈ ఆగమాలకు మారుగా వ్యవహారంలో -ఏను/ -ఈని ; -ఏరు ; -ఏవు ; -ఏము అనే రూపాలున్నవి. వీటిలో ఈకారఘటిత రూపాలు దక్షిణాంధ్ర వ్యవవహారంలోనే బహుళంగా

ఉన్నవి. -ఎదను > - ఏఆన్ పరిణామం కూడా ఆ ప్రాంత వ్యవహారంలోనే వచ్చింది. ఆయా రూపాలన్నీ వ్యవహారబలంవలన నాటి కావ్యభాషలో ప్రవేశించినవి. ఉదా. వినిపించేరు, ప్రశంసించీని (వి. నా. ర. పుట. 4), పెట్టేము తెచ్చేము, ఇచ్చేము, చేసేము (కా. మ. ష. *II* 98), చచ్చేవే, చెడేవు (కూ. జ. చం. *II* 70, 141), ఇచ్చేను, ఎంగిలయ్యీని (స. వెం. అ. *I* 68, *III* 104), వెలకుఁ గొనేరా, మొక్కేను, (ప. రం. మ. *III* 16, *IV* 12), గుండె యదరీని (లిం. శ్రీ. స. *III* 42), విషమాస్త్రుడేచీని వెట్టిపడుచ, ఇంద్రుడే మిచ్చీని (స. వెం. అ. *I* 69).

**8 19. తద్ధర్మార్థక విశేషణాలు :** -ఎడి/-ఎడు అనే తద్ధర్మార్థక ప్రత్యయాలకు వ్యవహారంలో -ఏ (టి) అనే రూపాలున్నవి. ఇవికూడ ఆనాటి కావ్యభాషలో కనుపిస్తున్నవి. ఉదా : ఎటిగేటట్టయితే (అ. నా. హం. *II* 128), వచ్చుచుఁబొయ్యేటి (అ. నా. హం. *II* 162), విటకోటి నెనసేటి (అ. నా. హం. *III* 74), వారిజాదల మెలగే (చెం. కా రా. *I* 9), కృశియించేదెంచ (కా. మ. ష. *III* 140), అచ్చటనడచే వింతలు (స. వెం. రా. *I* 8), వేళలుగాచే (లిం.శ్రీ. స. *IV* 180), తిరిపెంబెత్తేవానికి (స. వెం. రా. *I* 65), మెలతలుచేసే (లిం.శ్రీ. న. *IV* 98).

**8.20. ఉభయ ప్రార్థనం :** కావ్యభాషలో ఉభయప్రార్థనంలో వచ్చే దుగాగమానికి (క్రియా-30) మారుగా -(ఉ) దము, -(ఉ)దాము, -తము, -తాము మొదలైన ప్రత్యయరూపాలు గల ప్రార్థనాద్యర్థక క్రియలు భిన్నమండలాలలో భిన్నరూపాంతరాలలో ప్రచారంలో ఉన్నవి. వీటిలో కొన్ని నాటి కావ్యభాషలో స్థానం సంపాదించుకొన్నవి ఉదా : 'చూతాముగా' (కా. మ. ష. V 107), చూతామా, కందమా, చందమా (చనుదమా) (కా. మ. ష. V 115), వెదకుదాము (ప. రం. ఉ. *III* 107).

**8.21. చేదాద్యర్థకాలు :** -ఇన(న్) అనే కావ్యభాషా చేదర్థక ప్రత్యయానికి -(ఇ)తే (ను) అనేది వ్యావహారిక రూపాంతరం. ఈ యుగవు కావ్యాలలో (ఇటువంటి వ్యావహారిక రూపాలు కొల్లలుగా కనుపిస్తవి. ఉదా : 'గట్టిగ నీమగడెటిగేటట్టయితే (అ నా. హం. *II* 128), కేళికైతేను (అ. నా. హం. *II* 166), అంపించితే' (గో. కూ. నిం. పద్యం. 10), చూచితే. నొక్కితే, మీటితే, కూడితే, (ప.రం.

ఉ. *III* 15). ఇందులో చూచితే అనేది నేటిచూస్తే అనే రూపానికి మధ్యరూపం. మగవాడైతే (స. వెం. అ. *I* 104), ఆకర్ణింపగలిగితే (స. వెం. అ. *II* 84), బాళినిజేరితే ( చి.సిం. వి. *II* 128), వదరితే (లిం. శ్రీ.స. *III* 97), క్రోలగల్గితే, కదియింపగల్గితే, నఱుమంగగల్గితే (స. వెం. అ. *II* 84), అల్లితేనేసరా, పాడితేనే సరా, మీటితేనేసరా, ఆడితేనేసరా (స. వెం. రా. *I* 50), కన్నులైతేసరే, వదనమైతే సరే, రూపమైతేసరే (స. వెం. అ. *II* 8), మిమ్మంపితే (వి. నా. ర. పుట. 43).

**8.22** **విధ్యర్థకాలు :** విధ్యర్థక క్రియారూపాలలో వ్యవహార స్వరూపం నిరూపించే కొన్ని ప్రయోగాలు నాటి కావ్యాలలో కనుపిస్తవి. ఇవి సంప్రదాయ వ్యాకరణ నియమాలకు విరుద్ధమైనవి. ఉదా : వాకిలిదీయని పిల్చెవల్లభన్ (అ.నా. హం. *II* 56) గడియదీయ్యని (అ. నా. హం. *III* 93). ఇందులోని తీయి + అని సంధిగమనార్హము. నా కియ్యమనిన - నాకు + ఈయుము + అనిన (అ. నా. హం. *V* 73), ఇటువంటి ప్రయోగాలు ఈనాడు సాగరసీమలో బహుళం. కాని తెలంగాణంలో ఇది అభిప్రేతార్థానికి విరుద్ధం. తెలంగాణంవారు దీన్ని నాకు + ఈయము + అనిన అని అర్థం చేసుకొంటారు. ఇటువంటిదే చూడమటన్న = చూడుము + అటన్న రూపం (కం. నా. వి. పుట. 21).

**8.23.** **అక ప్రత్యయాంతాలు :** ఆత్మనే పదార్థంలో భూతకాలిక అసమాపక క్రియారూపాలలో ఎచ్చే '-కొని'కి -క/-కు/కొ అనే పరిణతరూపాలు చాలా కాలంగా ప్రచారంలో ఉన్నవి. ఇందులో '-కు' మరీ అధునిక రూపం. ఈ మూడు రూపాలకూ ఈ యుగపుకావ్యాలలో ప్రయోగాలు లభిస్తవి. ఉదా : (1) ఎత్తుకపోయి, చేతఁబుచ్చుక, సంతరించుక, నిలుపుక, పట్టుక, చూచుక, అలముక, అందుక (క. వ. రా. *vol. II* పుటలు. 6,19,26,27,28,208,72), తొడుక (ర. భూ. రా. *II* 174), తప్పించుక, తప్పుక (సు. మా. చం. *I* 159, *IV* 86), పూనుక, పఱచుక, కఱచుక, కట్టుక (అ. నా. హం. *I* 45,182, 193,260), కాపెట్టుక (అ. నా. హం. *II* 111), తెచ్చుక, ఎత్తుక (కం. పా. ఉ. *III* 102, *IV* 200), ఊదుకపోవు, చూచుక, తప్పించుక, పట్టుక (చే. వెం. వి. *I* 34, *II* 81, 195, 198), ఉంచుక, కాచుక (పా. క. వి. *I* 50, 128), తన పాదము బట్టుక (కా. అ. అ. పీఠిక. 21), వంచుక, ఎక్కుక, తాల్చుక (కా. అ. అ. *I* 107, *IV* 318), అందుక (బి. తి. అ. *IV* 11), కప్పుక, ఉంచుక

(17)

(లిం. శ్రీ. స. III 67, 68), తోడుక (చి. సిం. బి. III 169), అనుక (ప.రం. ఉ. III 92), 2) చూరుబట్టుకు, బుద్ధితెచ్చుకు (గో. కూ. సిం. పద్యాలు 41, 45). -కుతో వచ్చే ఈ రెండోతీరు రూపాలు ఒక్క గోగులపాటి కూర్మనాథుడే ప్రయోగించినాడు. తక్కినవాళ్ళెవరూ ప్రయోగించలేదు, (3) కాముడు కోపించి యిటకు గదుముకొ రాగా (కా. మ. ష. IV III )'. -కొ'తో వచ్చే ఈ మూడోతీరు ప్రయోగంకూడ ఒక్క కామినేని మల్లారెడ్డి మాత్రమే వాడినాడు.

**8.24.** సందేహార్థక, నిశ్చయార్థక, సంభావనార్థక ప్రత్యయాలు చేరినప్పుడు అజంతశబ్దాలమీద నిత్యసంధి చేయటంకూడా ఈ యుగపు కావ్యాలలో కనుపిస్తుంది. ఉదా : పొంగలో పొంగలి (చే. వెం. వి. III 41), అటో యిటో యెటో (చే.వెం.వి. III 64). ఎన్నగ పండోకాయో (ప. రం. మ. III 77).

"బంతే చన్గవ నిగ్గుమేను రుచి పోల్పన్ జాళువా మేలుడాల్
దొంతే కన్నుల ధాళధళ్యరుచులెంతో కల్వకున్ జూడమేల్
బంతే కంతుని దంతినేలు నడలున్ బాగైన యీ భామకున్
ఎంతేలేదు సమానమెంచుటకుగా నీ రేడు లోకంబులన్"

(స. వెం. అ. II 29)

గ్రహించేయున్నారు (చి. ఛా. రా. IV 141), ఎంతోకరముప్పతిల్ల (చి. సిం. బి. II 77), కరికిన్ దొడ్డా (ఎ. బా. మ. పద్యం. 13), విజయరాఘవమేదినీవిభుని చెయ్యే మీదటంచును (ప. రం. మ. V 69), శశిరేఖ యందాన సకలకళా ప్రౌఢొ (స. వెం. అ. III 35), అతనిమీదిదె బాళియగుచు నుండు (చెం. కా. రా. III 69), ప్రాకృతమునె అయినట్లాయెనా (కా. అ. అ. పుట. 30), నిదురామరి కంటికి రాదు. (కా. మ. ష. IV 103).

**8.25.** సముచ్చయార్థకప్రత్యయస్థానంలో నేటివ్యవహారంలోవలె దీర్ఘాచ్చు రావటంకూడ నాటి కావ్యాలలో ఉన్నది. ఉదా: మఱీమించె (చిం. ఛా. రా. I 67), తోచియుండినా లేదనేటి (చిం. ఛా. రా. III 65), ఎగాదిగ నరసిచూచి (అ. నా. హం. V 73), లక్షాయాభై వేలు (వి. నా. ర. పుట. 27), నోరునోరే తెలుచున్ (పా. క. ఖ. II 162), పదివేలయినా (స. వెం. అ. I 114), తగిలి నానుతగులు తప్పిన తప్పును (స. వెం. రా. I 60), బాపనికేమయినాను తెల్పునా (లిం. శ్రీ. స. III 90), పనియెడగల్గినా (లిం. శ్రీ. స. III 135), వనితలనిట్లా తలచుకొని (లిం. శ్రీ. స. III 62).

**8.26.** అతిశయమూ ఆధిక్యమూ చెప్పే సందర్భంలోకూడా ఇటువంటి దీర్ఘమే వస్తుంది. ఉదా: మిగులా నుపొ్పంగెడిన్ (లిం. శ్రీ. స. *III* 55), చాలా నచ్చరల్ మెచ్చగన్ (లిం. శ్రీ. స. *I* 126), చాలా వంచకుడు (లిం. శ్రీ. స. *IV* 174), పొగరుచూపులతోఁబడాపగలఁజూచె. కప్పగొప్ప బడాపగలజూడనిఘనుండు (అ. నా. హం. *II* 31, 146).

పూరణార్థకమైన-'అవ'కు మారుగా 'ఓ'అనే వ్యవహార సిద్ధరూపం కూడ నాటి గ్రంథాలలో ప్రవేశించినది. ఉదా. పందొమ్మిదో ఛందమునను (కా. అ అ పుట. 287).

**8.27.** స్త్రీజనవ్యవహారంలో వినిపించే వినే( = వినవే) అనే క్రియారూపం కూడ (స. వెం రా. *I* 69) కావ్యభాషలో చేరిపోయినది. అదేవిధంగా సంభాషణలో జరిగే పురుష, వచన, కాలవ్యత్యయాలు కూడ అనాటి కావ్యాలలో ఉన్నవి. పురుషవ్యత్యయం. 'మీరెవ్వరు మేమెవ్వరు' (ర. భూ. వా. *II* 122). మేమెవ్వరము అనవలసినచోట మేమెవ్వరు అన్నాడు. వచనవ్యత్యయం. 'ఈరసమే దోషల్' (ఎ. బా. మ. పద్యం. 17). ఇందులో ఈరసము ఏకవచనం. దాని విశేషణమైన దోషల్ బహువచనంలో ఉన్నది. కాలవ్యత్యయం. "చూచెదనని వచ్చినాను సుదతీ నిన్నున్" (పా. క. ప. *I* 83). ఇందులో భూతానికి వర్తమాన రూపం వాడినాడు.

**8.28.** "యకారంబును వువూ వొవోలును దెలుఁగుమాటలకు మొదట లేవు" (సంజ్ఞా-17) అని చిన్నయసూరిగారన్నా ప్రాచీన తాళపత్రగ్రంథాలలో ఇవి కొల్లలుగా కనుపిస్తున్నవి. వ్యవహారంలోను వినుపిస్తున్నవి. ఈయుగపు కావ్యాలలో కూడ ఇవి ఉన్నవి. ఉదా. తొట్లవూచి (పా. క. ప. *IV* 285) 'ఉపరతి సేయనా వోరి జాణ' (ప. రం. ఉ. *II* 44).

**8.29.** ఎకార విశిష్టంగా ఉండవలసినమాటలు అకార విశిష్టంగా ఉండటం వ్యావహారికభాషాలక్షణం. ఇవి లాక్షణిక సమ్మతాలు కావు. కాని ఈ యుగపు కవులు వీటిని బాహాటంగా ప్రయోగించినారు. ఇందులో నామవాచకాలు క్రియలు ఉన్నవి. ఉదా: 'చటకగు వింటి బల్మి' (అ. కా. *III* 86), చిన్నయాచార్యుడాచార్య చక్రవర్తి (ఆ. వెం. గో. *I* 27), చాటంతమబ్బుదోఁచె (పా. క. ప. *IV* 124), చాయన్వలె (చిం. చా. రా. *V* 260), తటవాయ (ప. రం. ఉ. *II* 87),

మరచినకార్యమియ్యడను (ప. రం. ఉ. *I* 45), ఎక్కడబోయనో, ఎంతసేపాయె (కం. నా. వి. పుటలు 44,46), చాతకంబుల దయచాతరంగంబులొసంగి (చి. సిం.బి. *III* 67). దీనికి విపరీతంగా అకార విశిష్టంగా ఉండవలసిన మాటలు ఎకార విశిష్టంగా ఉండటం కూడ వ్యవహారభాషాలక్షణమే. ఇటువంటి మాటలు కూడ నాటి కావ్యాలలో ఉన్నవి. ఉదా. చెరించేవిధము (అ. నా. హం *V* 195).

రెండుపదాలకు సంధి జరిగేటప్పుడు ఉత్తరపదం వకారాది ఐతే వ లోపించి సంధి జరుగటం కూడా వ్యవహార భాషాలక్షణమే. ఇటువంటి ప్రయోగాలు లక్షణ విరుద్ధమైనా నాటి కవులు వాడినారు. ఉదా. ముసుగు + వేసికొని = ముసుగేసుకొని (కం. పా. ఉ. *I* 99), చేతి + వెంట = చేతెంట (బి. తి. అ. *IV* 17).

**8.30.** లక్షణం అంగీకరించకపోయినా మహాకవులు ప్రాచీనకాలం నుండి కొన్ని ప్రయోగాలు చేస్తున్నారు. వీటికి వ్యవహారబలమో లేక ఛందో నిర్బంధమో కారణం కావచ్చు. ఆటువంటి వాటిని సాహిత్యప్రియులు నిరంకుశ ప్రయోగాలంటారు. ఈయుగకవులు కూడ కొన్ని ప్రయోగాలు ఇటువంటివి చేసినారు. ఉదా. ఉశిరమ్ములు = ఉశీరమ్ములు (చిం. ఛా. రా. *VI* 30), ఉడింగి = ఉడిగి (చిం. ఛా. రా. *VI* 296), పూటమ్ము = పూవుటమ్ము (కూ. తి. ర. *V* 5), కడానీబెత్తెము = కడానిబెత్తెము (ఋ. వేం. చం *III* 97), మొగఱాతఱ్ఱ = మగఱాతఱ్ఱ (ఋ. వేం. చం. *III* 71), మద్దెలవాచియు = మద్దెల వాయించియు (ఋ. వెం. చం. *I* 98), ఆకంటం జెందకయుండ = ఆఁకటం జెందక యుండ (చెం. కా. రా. *IV* 77), తన పత్ని సావిత్రి తానంబుసేసి = స్నానంబుసేసి (కం. నా. వి. *III* పుట. 61), యవ్వనాఢ్య = యౌవనాఢ్య (అ. కా. *II* 115). తమ్మిచే = తమిచే (చిం. ఛా. రా. *VI* 330), మఱుసనాడు = మఱుసటినాడు (అ. నా. హం. *V* 202), ప్రాణనాయకి (లిం. శ్రీ. స. *IV* 152), వలిపెపు దుప్పటి చెఱగ (చెం కా. రా. *III* 4), దుప్పటిచెఱగున (లిం. శ్రీ. స *III* 35),

**8.31. మాండలిక శబ్ద ప్రయోగాలు :** ఆంధ్రదేశం సువిశాలమైనది. ఈనాడు తెలంగాణం, రాయలసీమ, చాళుక్యసీమ అనే మూడు ప్రధాన మండలాలున్నవి. ఈ ప్రధాన మండలాలను భాషాదృష్టిలో మరికొన్ని ఉపమండలాలుగా విభజించవచ్చును. ఇదిగాక ఆయా మండలాలు పరభాషామండలాలతో కలిసే పొలిమేరలలో పరభాషల యాసల ప్రభావంకూడ మన భాషపైన గోచరిస్తున్నది.

తెలుగుదేశం బయట అంటే తంజావూరు మధుర మొదలైనచోట్ల తెలుగుల వలసలు ఏర్పడినప్పుడు అక్కడి మాండలికాలు ఆ ప్రాంతపుకవుల రచనలలో చోటు చేసుకోవటం సహజమే. ఈ మండలికాలను ప్రాంతీయ మాండలికాలనీ (Regional dialect words), వర్గమాండలికాలనీ (Class dialect words) విభజించుకో వచ్చు. ఇవి ఆనాటి భాషా స్వరూపంతోపాటు వ్యవహారబలాన్ని కూడ నిరూపిస్తవి. ఈ యుగపు కవుల కావ్యాలలో కనబడే తీరుతీరుల మాండలికాలను ఈ దిగువన ఉదాహరిస్తున్నాను.

**8.32 విశేష్యాలు ; సర్వనామాలు : విశేషణాలు :** గడె (పా. క. శు *I* 247), పిసుక కుంపటులు (పై. *I* 254), ఎల్లుండి (పై. *II* 183), ఆతగానికి (పై. *II* 190), పదిమాళ్ళకు (పై. *III* 137), చేయప్పు = Hand loan (పై. *III* 241), గరికెవ్రేళ్ళు (క. వ. రా. *Vol. II* పుట. 18), రేతిరి (కా. మ. ష. *II* 56), తొట్ల (పై. *VI* 37), అసలు = బురద (కా. మూ. పాం. *I* 73), కొమాళ్ళు (పై. *III* 28), కుమార్తె (అ. నా. హం. *II* 114), పోరి = (నింద్యార్థమున) బాలిక (రె. మ. *గం. II* 220), మంగళార్తులు (పై. *II* 255), వెఱపు = వెడల్పు (కూ. జ. *చం. I* 90), కడేలు (పైది. *II* 88), ఊసుపోవక (పై. *III* 9), ఆఘూత్యము (బు. వెం. *చం. I* 85), ఫలహారము (కం. పా. *ఉ. IV* 198), చెల్లెలికట్ట (పై. *III* 24), బైట (పై. *I* 20), తునెలు (ప. రం. మ. *I* 64), చౌలు = చెవులు (లిం. శ్రీ. స. *IV* 5), గద్దిగ (వి. నా. *ర.* పుట. 30) బంట్రోతు (అ. నా. హం. IV 84, 168), ఆడకు = అక్కడికి, (వి. నా. *ర.* పుట. 42), ఏడకు = ఎక్కడికి (అ. నా. హం. *V* 248), ఈడ= ఇక్కడ. ఆడాడ = అక్కడక్కడ (కం పా. *ఉ. IV* 115, 116), దూర మేడది = దూరమెక్కడిది (ర. భూ. రా. *II* 174), ఆఁటది = స్త్రీ (పా. క. శు. *II* 279), కుండలు వెళ్ళవేయించే ననగ = వెల్లి (అ. నా. హం. *II* 100), ఓనమాలు = ఓనమాలు (పై. *III* 141), ముత్తేలు = ముత్యాలు (చెం. కా. రా. *II* 33, విడిద = విడిది (పా. క. శు. *I* 425), నాకాడ = నాకడ (కా. అ. అ. *I* 124), సోద్యపడి (ప. రం. *ఉ I.* 36), బంగారు పావాలు (పై. *II* 3), అచ్చుతునకు (పైది. *III* 102), కళావతెమ్మ (ప. రం. మ. I 46), అచ్చుతునితోడి తెమ్మని (స. వెం. *రా. I* 8), మేదించినట్టి-ఈబూదియేంది = ఏమిటి (ర. భూ-రా. *II* 145), లక్షాయాభై వేలు, ఎనబై వేలు, నలభై యొకవేలమాళ్ళు (వి. నా. ర. పుట. 27), ఈనచే

= ఈతనిచే (చిం. భా. రా. *V* 94), ఆతగానికి (పా.క.శ. *II* 160), ముసలాపె (పై. *III* 48), వాటి వాని (చెం.కా.రా. *IV* 64), మతి నెంచి నీబిడ మహిమ లెట్టివియొ (కం. నా. వి. *II* 42), పనిలేంది (అ. నా. హం. *V* 73), ఈ వేల్పు వెలదిమంది (కం. పా. త. *IV* 50), పెళ్ళికొడుకు (గో. కూ. సిం. పద్యం. 90), విళ్ళు = విందు (కా. మ. ష. *II* 102), ఒళ్ళు = ఒడలు (క. వ. రా. *Vol. II* పుట. 146), ఇంట్లోకి (అ.నా. హం. *III* 91), పనిలేంది = పనిలేనిది (పై.ది. *V* 73), అదేమే = అది + ఏమే (చిం. భా. రా. *IV* 88), ఏఁదెలె = ఏమి.టే + లే (పై. *IV* 98), మళ్ళిరాదొ (వి. నా. ర. పుట. 42), వరస (అ. నా. హం. *II* 162).

**8.33.** అవ్యయాలు : వెనక (క. వ. రా. *Vol. II* పుట. 15), తరవాత (పై. పుట. 34), కనక (ప. రం. త. *I* 21). పై మూడుమాటలు ఉత్వ మధ్యాలుకాని ఉచ్చారణ విధేయంగా అత్వమధ్యాలైనవి. ఒకసారి, ఈ పాలి (కం. పా. త. *III* 54; *VI* 39), ఇంగితం బెరుగక యీలాగుబల్కు (వి. నా. ర. పుట. 43), ఈలాగు మంత్రమారుత (అ నా. హం. *III* 65), చిలుకలు నీలాగు పలుకనేర్చె (కం. పా, త. *IV* 198), చాలా వేలాగుల బతిమాలిన (కూ. తి. ర. *III* 91), అలాగె (పా. క. శ. *II* 457), ప్రౌద్దుగూఁకుదాఁక (కా. మ. ష. *III* 125), అతల = ఆవల (పై. *VII* 45), కొండ యెక్కేడు ప్రతిమాలు కొద్ది నీవు (గో. కూ. సిం. పద్యం. 17), వేళ్ళగనన్నైన బుద్ధి దిగసన వచ్చు (పై. పద్యం. 19), ఆనిక - అవెనక (బు. వేం. చం. *III* 86), కలిగె నూరికె నాకు కామాతురునకు = ఊరక (క. వ. రా. *Vol. II* పుట. 5), అష ఇమ బోవకే = అటుఇటు (స.వెం. అ. *I* 69), వాజపేయ ఫలంబు వలద షే = వలదటే (పైది. *I* 69), నగరికి బోవకే నడుమ నెషలో = ఎటులో (పై. *I* 69), అవునషే (పా. క. శ. *II* 459), కాదషే (పై. *II* 477). పైన పేర్కొన్న ఐదు ప్రయోగాలు ఛాందసులైన వైదికుల మాటలు. ఇవి వర్గమాండలికాలకు (class dialects) ఉదాహరణాలు.

**8.34.** క్రియలు, భావార్థకాలు : చేసుట (క. వ. రా. *Vol. II* పుట. 80), మెఱుపులు మెఱుసుట (కా. అ. అ. *II* 196), దున్నకము = దున్నుట (బి. తి. అ. *I* 90). పైవానిలో చివరిప్రయోగం పాఁమూరు మండలం మాండలికం.

ఆ మండలంలో వచ్చుకము, ఇచ్చుకము, పెట్టుకము, తినుకము వంటి మాటలు శిష్టజనవ్యవహారంలో ఉన్నవి. ఉంౘ్రా = ఉండుమురా (స. నా. అ. *I* 100).

**8.35.** కావ్యభాషలో సరళాదిగా సరళమధ్యంగా ఉండవలసిన కొన్ని మాటలు పరుషాదిగాను పరుషమధ్యంగాను ఈయుగపు కావ్యాలలో కనుపడుతున్నవి. ఇవికూడ నాటి ఆయా మండలాల ప్రత్యేకతలు కావచ్చును.

**పరుషాది :** పొడ చింక తోలు కచ్చడమదేంది = జింక (ర. భూ. రా. *II* 145). మన నిఘంటువులలో జింకశబ్దమే కనుపడుతది. ద్రావిడభాషాపరమైన దీని మూలర్ూపం పరుషాదిగానే ఉండేదేమో. ఇంత ప్రాచీనరూపం కావ్యాలలో ప్రవేశించిందంటే మాండలికంగా ఉన్న ప్రాచీనరూపానికి అప్పటికీ చాలినంత వ్యవహార బలం ఉండాలె.

**పరుషమధ్యమం :** ముసుకు = ముసుగు (పా. క. శు. *IV* 188). తెలంగాణంలోకూడ ఈనాడు దీనిని పరుషంతోనే వ్యవహరిస్తారు. తెకటార్చెను శౌరి యనుచు = తెగటార్చెను (లిం. శ్రీ. న. *IV* 126), వెకటున్ గరగరిక పుట్టు = వెగటున్ (పై. *IV* 170). పై రెండుదాహరణాలు ప్రాసఘటితంగాకూడ ఉన్నవి. ఆ, క్రాంతశరీరుడై యెదురుకట్లకు వచ్చినరెడ్డి (అ. నా. హం. *IV* 172), అటుకులు దిన్నట్టేనా (స. నా. రా. *I* 39).

**8.36.** ఇతర వ్యవహార భాషాలక్షణాలుగల ప్రయోగాలు కొన్ని ఈ యుగపు కావ్యాలలో ఉన్నవి.

(క) **స్వరభక్తి (Anaptyxis) :** సంయుక్తాక్షరాలనడుమ ఒక అచ్చును చేర్చి ఉచ్చారణం సులభంచేసుకోవటం. ఉదా : సమరత = సమర్త (పా. క. శు. *I* 452), గాఢముగా వరుషించె = వర్షించె. (ప. రం. ఉ. *III* 20).

(చ) **దీర్ఘాచ్చుకు హ్రస్వాచ్చు :** పీనులు ముయవచ్చి = మూయవచ్చి (అ.కా. *II* 104), కొప్పున నున్నగా నియదు = ఈయదు (అ. కా. *II* 220).

(ట) **వర్ణనాశము (Syncope) :** రెండు హల్లుల నడిమిఅచ్చు ఉచ్చారణ త్వరలో నశించి రెండు హల్లులుకలిసి వర్ణసమీకరణం ఏర్పడటం. ఉదా : ఉర్ల = ఉరల (కం. పా. ఉ. *III* 8), తెప్పిర్లి = తెప్పరిల్లి (పై. *III* 352), ఎర్కు =

ఎరుకు, సర్కు = సరుకు, గురు = గురుకు, ఉర్కు = ఉరుకు (కా. మ.ష. *II* 108), పొర్లు = పొరలు (పై. *V* 102), పర్వుతేరి = పరువు (సు. మా. చం. *IV* 86), ఉండ్రి = ఉండిరి. ముచ్చటలాడుచుండ్రో (గో. కూ. సిం. పద్యం. 22), కొల్ను = కొలను. తామరకొల్నురీతి (రె. మ. *గం*. *II* 146).

(త) **లోపదీర్ఘత :** (Compensatory lengthening) : ఉచ్చారణంలో ఒక అక్షరం లోపించి ఆ విధంగా లోపించినందున కలిగే హ్రస్వత పోవటానికి పక్కఅచ్చు దీర్ఘంకావటం. ఉదా : బైట = బయట (కం. పా. ఉ. *I* 20).

(ప) **ద్విరుక్తహల్లుకు మారుగా అద్విరుక్తహల్లు :** ఎట్లయిన గానిము = కానిమ్ము (అ. కా. *I* 238), బంగరుగినెలై = గిన్నెలై (రె. మ. *గం*. *IV* 28).

(గ) **అద్విరుక్తహల్లుకుమారుగాద్విరుక్తహల్లు :** ఆనతియియ్యగ నూర కుండరాదే (కం. పా. ఉ. *II* 189), చెయ్యియ్యదాయెగా (లిం. శ్రీ. స. *IV* 151), ఇయ్యగవలసెన్ (కా. మ. ష. *III* 79), చెంతకుఁ దియ్యంగఁజే విదుల్చు (ప.రం.మ. *V* 105), వచ్చుచుఁబొయ్యేటి వరసవారికి (అ. నా. హం. *II* 162), పెనుతలఁపు గడియదీయ్యని (పైది. *III* 93), నా కియ్యమనిన (పైది. *V* 73), చూపియ్యదు (కూ. జ. *చం*. *II* 69).

**8.37.** **అన్యదేశ్యాలు :** ప్రాణవంతమైన ప్రతిభాషా అవసరం కొలది అన్యదేశ్యాలను ఎరవు తెచ్చుకొంటద్ది. వాణిజ్య వ్యాపారాల మూలంగా, సాంఘిక మైన అవసరాల మూలంగా, సంస్కృతీ ప్రభావం మూలంగా, పరిపాలనమూలంగా భాషలలో ఇటువంటి ఆదాన ప్రదానాలు జరుగుతవి. ఒకప్పుడు ఈ యెరువు మాటలు, తెచ్చుకొన్నావాళ్ల భాషకు అలంకారాలై తుష్టినీ పుష్టినీ కూర్చుతవి. మరొకప్పుడు ఈ ఎరువు సొమ్ములు బరువుచేటులై పోతవి. సంస్కృత ప్రాకృత శబ్దాలెన్నో తెలుగుభాషలో చేరిపోయి తెలుగులై పోయినవి. ముస్లింల ప్రభావంతో తెలుగులో అరబీ, ఫార్సీ పదాలు చాలా చేరిపోయినవి. ఈ విదేశీ భాషాపదాలు శ్రీనాథుని కాలంనుండే ఎక్కువసంఖ్యలో తెలుగులోనికి రావటం మొదలుపెట్టినవి. ఈ యుగంలో వర్ధిల్లిన కవులు కూడా ఇటువంటి అన్యదేశ్యాలను చాలా వాడినారు.

ఉదా.

పంచదారనుదిను *బాబావజీరు* (వి. నా. *ర*. పుట. 45)

*ఖిల్లాయి*పైఁ *బాగ* కుదురుగాజుట్టి (పై. పుట. 51)

జాపత్రియును *గురాసాని* యోమంబు (పై. పుట. 51)

కమ్మగేదఁగి నే*జఁ* గైకొని మరుఁడు (పై. పుట. 63)

వాలుగల *సజాలు* వాలుఁగనులు (సు. మా. చం. *III* 58)

*జమా* ఖరుచుల్గణించి (అ. నా. హం. *I* 142)

*జాఫరా జినుఁగు* లేపునజెందు *పలంగుపోషు*
*తక్యిగల* (పై. *I* 240)

పంచాంగములుచెప్పి *బాజారు* లోపల (పై. *II* 153)

జగతీజ్యోతులు కాగడాలు బలు *బంజాయీలుమోంబత్తు*లున్ (పై. *III* 27)

కలయుఁగ *ఖుశాలు* వచ్చు నాత్మజమె (పై. V 182)

*సెబాసు ఖూబు* మేలను (పై. *V* 201)

తేజమా గేదంగి నే*జఁ* బూని (చిం. ఛా. రా. *IV* 15)

తులుకు సోయగపు రాచిలుక *తేజీ* నెక్కి (పై. *IV* 15)

కేరి విరహాల మీఁద *శికారు* వెడలె (పై. *IV* 15)

మెలిచి దువాళిదోలు చలిమేళము *బాజ* యొనర్ప (పై. *IV* 16)

చిలుక *పతాణితేజీ* రవళింపుచు (పై. *IV* 16)

చిలుక *పతాణీ* గుఱ్ఱపు *పజీరుడు* (పై. *IV* 18)

*మద్దత్తీఁక* నెవ్వరనుచు మాధవుఁడపుడే (పై. *IV* 28)

కప్పిన జిగ్ను మేలిమి జగాసొగసౌ *జరుబాబు* దుప్పటిన్ (పై. *IV* 181)

కౌలకు జక్కువ *పొఁజు* లెలసిరేయ (కూ. తి. *ర. III* 94)

బురుసా హిజారు మీఁదను (ప. రం. మ. V 17)

బలిమి జులుముల సందడుల్ (స. నా. రా. *I* 110)

నును సరిగె *నకసీపని* (లిం. శ్రీ. స. I 30)

ఖరుచు సేయుచు (పై. *I* 104)

*నకాసిగుడారు* (పై. *III* 4)

*మొగలీ వ్రజీడు* (పై. *III* 54)

*హుజూరు* పాటకు (పై. *IV* 60)

*బందిఖానా* (పై. IV 118)

*ఖబురు* (పై. IV 147)

*తవురంత నీవెఱుంగవా* (పై. IV 180)

**8. 38.** స్థూలంగా ఇది నాటి కావ్యభాషా స్వరూపం. సజీవమైన భాష ప్రవహించే నదివంటిది. నదీప్రవాహం ఒకచోట వెడల్పుగా, మరొకచోట సన్నగా, ఒకచోట లోతుగా, మరొకచోట లోతు తక్కువగా, ఒకచోట సమానంగా, మరొక చోట ఎగుడుదిగుడుగా, ఒకచోట స్వచ్ఛంగా, మరోకచోట మకిలెగా ఉన్నట్లే, భాషకూడ నానావిధాలుగా ఉంటది. ప్రాతనీటిలో క్రొత్తనీరు చేరినట్లే ప్రాతతరాల భాషలో క్రొత్తతరాల భాష కలిసి పోతది ముక్కూ మొగమూ సరిగాలేనిరాళ్ళు ప్రవాహవేగంతో అరిగి కరిగి సాలగ్రామాల స్వరూపం సంతరించుకొన్నట్లే ఒకప్పుడు అసాధువులు గ్రామ్యాలు ఐన పదాలు కాలక్రమాన జనవ్యవహారంతో నలిగి శిష్టజన పరిగ్రాహ్యము లౌతవి. అందుకొరకే 'ప్రవాహినీ దేశ్యా' అన్నారు పెద్దలు.

## ఉదాహృతకృతులు

1. కట్టా వరదరాజు, *రామాయణం Vol. II* (క. వ. రా.)
2. రఘునాథ భూపాలుడు, *వాల్మీకి చరిత్రము* (ర. భూ. వా.)
3. రఘునాథ భూపాలుడు, *రామాయణము* (ర. భూ. రా.)
4. విజయరాఘవ నాయుడు, *రఘునాథనాయకాభ్యుదయము* (వి. నా. ర.)
5. సురభి మాధవరాయలు, *చంద్రికా పరిణయము* (సు. మా. చం.)
6. అయ్యలరాజు నారాయణామాత్యుడు, *హంస వింశతి* (అ. నా. హం.)
7. కంకంటి పాపరాజు, *ఉత్తర రామాయణము* (కం. పా. ఉ)
8. చేమకూర వేంకటరాజు, *విజయవిలాసము* (చే. వెం. వి.)
9. చేమకూర వేంకటరాజు, *సారంగధర చరిత్రము* (చే. వెం. సా.)
10. చింతలపల్లి ఛాయపతి, *రాఘవాభ్యుదయము* (చిం. ఛా. రా.)
11. కూచిమంచి తిమ్మకవి, *రసికజన మనోభిరామము* (కూ. తి. ర.)
12. చెంగల్వ కాళకవి, *రాజగోపాల విలాసము* (చెం. కా. రా.)

13. కంకంటి నారసింహకవి, *విష్ణుమాయావిలాసము* (కం. నా. వి.)
14. పాలవేకరి కదిరీపతిరాజు, *శుకసప్తతి* (పా. క. శు.)
15. కామినేని మల్లారెడ్డి, *షట్చక్రవర్తి చరిత్రము* కా. మ. ష.)
16. గోగులపాటి కూర్మనాథుడు, *సింహాద్రినారసింహశతకము* (గో. కూ. సిం)
17. కాకమాని మూర్తి, *పాంచాలీ పరిణయము* (కా. మూ. పాం.)
18. రెడ్డెడ్డి మల్లారెడ్డి, *గంగాపుర మాహాత్మ్యము* (రె. మ. గం.)
19. అహోబలపతి, *కాళిందీ కన్యా పరిణయము* (అ. కా.)
20. ఆసూరి మరింగంటి వేంకటనృసింహాచార్యులు, *గోదావధూటీ పరిణయము* (ఆ. వెం. గో.)
21, కాకునూరి అప్పకవి, *అప్పకవీయము* (కా. అ. అ.)
22. కూచిమంచి జగ్గకవి, *చంద్రరేఖ విలాపము* (కూ. జ. చం )
23. ఎలకూచి బాలసరస్వతి, *మల్లభూపాలీయము* (ఎ. బా. మ.)
24. బిజ్జుల తిమ్మారెడ్డి, *అనర్ఘరాఘవము* (బి. తి. అ.)
25. ఋగ్వేది వెంకటాచలపతి, *చంపూ రామాయణము* (ఋ. వెం.చం.)
26. పసుపులేటి రంగాజమ్మ, *ఉషాపరిణయము* (ప. రం. ఉ.)
27. పసుపులేటి రంగాజమ్మ, *మన్నారుదాసవిలాసము* (ప. రం. మ.)
28. సముఖం వెంకటకృష్ణప్పనాయకుడు, *అహల్యా సంక్రందనము* (స. వెం. అ.)
29. సముఖం వెంకటకృష్ణప్పనాయకుడు, రాధికాసాంత్వనము (స. వెం. రా.)
30. లింగనమఖి శ్రీకామేశ్వరకవి, *సత్యాభామా సాంత్వనము* (లిం. శ్రీ. స.)
31. చిత్రకవి సింగరార్యుడు, *బిల్హణీయము* (చి. సిం. బి.)

ప్రకరణం 9

# ఆధునికయుగం :
# గ్రాంథిక వ్యావహారిక వాదాలు
## (క్రీ శ. 1900 నుంచి నేటివరకు)

— *బూదరాజు రాధాకృష్ణ*

**9. 0.** నన్నయకు పూర్వంనుంచీ దేనికదిగా మారుతూ వచ్చిన కావ్య వ్యవహార భాషాభేదాలు రెండూ ఇరవయ్యో శతాబ్దం అరంభంలో తీవ్ర వాదోప వాదాలకు దారితీశాయి. పూర్వ కావ్యభాష మారదనీ దాన్ని మార్చగూడదనీ ఒక వర్గమూ, శిష్టవ్యవహారంలో ఉన్న భాషారూపాన్నే గ్రంథరచనలో ఉపయోగించా లని మరో వర్గమూ వాదించటంతో కవిపండితలోకం రెండుగా చీలిపోయింది. ఈ వాదోపవాదాలకు ప్రధానకారణం ఇరవయ్యో శతాబ్దంనాటి ప్రత్యేకపరిస్థితే.

**9. 1.** నన్నయ కాలానికీ నాయకరాజుల కాలానికీ మధ్య కావ్యరచన వినా మరో సాహితీ ప్రక్రియకు పండిత లోకంలో గౌరవం ఉండేదికాదు. అవి పురాణాలయినా ప్రబంధాలయినా శతకాలయినా వాటి ప్రయోజనం కావ్యానందం కలిగించటమే. తర్క-వ్యాకరణాది శాస్త్రాలను రచించేటప్పుడు కూడా పద్యరచనకే మన కవులు ప్రాముఖ్య మిచ్చారు. సంస్కృత నాటకాలనుకూడా పద్యకావ్యాలు గానే అనువదించారు. కవులమీద లాక్షణికుల ప్రభావం విపరీతంగా ఉండేది. వచనరచనలు, యక్షగానాదులు నాయకరాజుల కాలంలో పెద్దయెత్తున రావటంతో లాక్షణికప్రభావం తగ్గుతూ వచ్చింది. ఫలితంగా నన్నయనాటి భాషలోనే రాయాలన్న పట్టుదల సడలిపోయింది. ఆ కాలంలోనే ఆంగ్లేయ పరిపాలన దేశంలో మొదలై క్రమక్రమంగా వేరుదన్ని నిలదొక్కు-కోవటంతో, ఆంగ్లభాషద్వారా విశ్వసాహితీ స్వరూపం తెలుగు వారికి తెలియరావటంతో, విద్యాధికుల దృక్ప థాల్లో రాజకీయ సామాజిక జీవితవిధానాల్లో మార్పు వచ్చింది. ఇరవయ్యో

శతాబ్దానికి ముందుగానే ముద్రణ సౌలభ్యం, సామాన్యులకు కూడా విద్యాసౌకర్యాలు అధునాతన విద్యాబోధనపద్ధతులు తెలుగువారికి సమకూర్డేయి. ఇన్ని కారణాల వల్ల కొందరు విద్వాంసుల్లో వచ్చిన భావపరిణామమో విప్లవమో ఈ వాదోప వాదాలకు ప్రధానహేతువై ఆంధ్రసాహితీస్వరూపంలో భాషాచరిత్రలో పరమా ద్భుతమైన విజయాలు సాధించింది. వాటికి బీజాలు భాషాసాహిత్యచరిత్రలో శతాబ్దాలకు ముందే పడి ఉన్నందువల్ల జరిగిన మార్పులన్నీ క్రమపరిణామంలో వచ్చినవేనని చెప్పవచ్చు. అయితే ఈ పరిణామాలు త్వరత్వరగా రావటానికి మాత్రం ఆంగ్ల భాషా సాహిత్యాదుల పరిచయం చాలా తోడ్పడింది. స్థూలంగా చరిత్రగతమైన ఆ మార్పులను ఇక్కడ పరిశీలిద్దాం.

**9. 2.** సనాతనలాక్షణికు లెన్ని కఠోరనియమాలు పెట్టినా, కవిపండితు లెంతగట్టిగా ప్రయత్నించి ఆ నియమాల ననుసరించినా, కావ్యభాషలో అన్యదేశ్య పదాలూ, మాండలికాలూ వ్యాకరణవిరుద్ధప్రయోగాలు చాలా ప్రాచీనకాలంనుంచే అక్కడక్కడ ప్రవేశించటం మొదలుపెట్టేయి. మొదట అన్యదేశ్యాలను పరిశీలిద్దాం. క్రీ. శ. పధ్నాలుగో శతాబ్దంనుంచి అన్యదేశ్యశబ్దాలు కావ్యభాషలో ప్రవేశిస్తూ వచ్చాయి ( గోపాలకృష్ణారావు, 1968, పే. 12 ). మచ్చుకు, తిక్కన ప్రయోగించిన 'త్రాసు' శబ్దం 'తరాజు' నుంచి ఏర్పడ్డది (అదే పే. 18). ఖుసీ, సురధాణ (హర. 1-22), మురాయించు (హర. 3-89), దివాణము (హర. 4.9), సామాను (హర. 1-27) మొదలైన పదాలను శ్రీనాథుడు ప్రయోగించాడు. అప్పకవిలాంటి సనాతన లాక్షణికుడు 'వ్యవహారహాని' కలుగుతుందన్న కారణంతో అన్యదేశ్య ప్రయోగాన్ని ఆమోదించి ఉదాహరించాడేగాని (అప్ప. 1-64 నుంచి 70) సంస్కృతప్రాకృతసమాలకులాగా వీటినికూడా రూపనిష్పాదనక్రియను ఏర్పరచనూ లేదు;అర్వాచీనులు ఆదేవిధంగా ప్రయోగించవచ్చునని అనుమోదించనూ లేదు. తరువాతి లాక్షణికులు సరేసరి. ఈ విధానం కాలక్రమాన పండితమండలికి అధికామోదకరమై క్రీ. శ. పందొమ్మిదో శతాబ్దినాటి శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి చాటువులవంటి వాటిలో వెర్రితలలు వేసింది. ఉదాహరణకు, 'వీరు తెలుంగు సాము లరబీ తరబీయతు నొప్పు గొప్ప సర్కారు వలె జమీలు దరఖాస్తుగ నేలిన రాజమాన్య హంవీరుల' ...వగైరా (పిచ్చయ్యశాస్త్రి, 1961, పే. 65). అలాగే ఆ శతాబ్ది తుది రోజుల్లో అచ్చైన 'కన్యాశుల్కం' లో (1896) గురజాడ అప్పారావుగారు ఆంగ్లభాషాపదాలను విశృంఖలంగా వాడేరు.

**9. 3.** ఇక మాండలికపదాల సంగతి. కావ్యవ్యవహారంలో మాండలికపద రూపాలుండవని ఈనాటికీ కొందరు పండితులు విశ్వసిస్తున్నా, నన్నయనాటినుంచీ అవి కనిపిస్తూనే ఉన్నాయి. నన్నయభాషలో 'దారుణం', 'నీతదర్థం' లాంటి గోదావరిమాండలికాలు కనిపిస్తున్నాయి. 'చల్లా యంబలిఁ ద్రావితిన్...' అనే శ్రీనాథ చాటువులోని (వీధి: పీఠిక, వేటూరి, పుట 57) 'చల్ల' మాండలికం ; ఇతర ప్రాంతాల్లో వాడుకలో ఉన్న మాట 'మజ్జిగ'. అలాగే ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యంలోని 'బిజమాడు దేవర నిజకృపామహిమఁ జెన్నారు నాయిల్లు బిడారు నీకు' (అప్ప. 1-70) మొ వీరశైవ గృహభాషాపదాలు. వీటిని వర్గమాండలికాలు (Class dialects) అనవచ్చు. ఇలాంటివి వేనవేలు.

**9. 4.** వ్యాకరణవిరుద్ధప్రయోగా అన్నిటినీ మన లాక్షణికులూ సనాతన పండితులూ 'గ్రామ్య'మని కావ్యప్రయోగానికి అనర్హమని నిరాదరించినా, వాటికి ప్రాచీనకావ్యాలలో సైతం ప్రయోగాలు లభిస్తున్నాయి. 'వస్తూచూస్తిమి రోస్తిమిన్', చేస్తిమి లేస్తిమామె కుడిచేతికి దండము' లాంటి వ్యావహారికరూపాలు శ్రీనాథుడి చాటువుల్లో ఉన్నాయి. 'ఇరవై' (కాశీ. 1-52), 'వినీవినని భంగి' (నైష.6-33), 'ముట్టడము' (కాశీ. 5-301), 'చీకిలించుక' (కాశీ. 3-195), 'చావడము' (భార. ఉద్యో. 3-61), 'అయినా' (ఉ. హరి. 5-198), 'ఏమీ' (ఉ. హరి. 5-195) 'ముళ్ళు' (భాగ. 6-81), 'నాటుక' (భాగ. 5-2. 145), 'చేతురు' (నైష. 5-68) 'ఎగాదిగ' (ఆము. 2-50), 'పట్టుక' (ఆము. 6-85), 'చూచినారు, డాసినారు' (మను. 1-68), 'చలపకారము' (మను. 5-58), 'వేఁటకరుల్' (మను. 4-50) 'అల్పదనము' (పాండు. 3-62), 'దాఁచేవానికిన్ (పాండు. 4. 275), 'రోసింది, పూసింది, మూసింది, చేసింది' (కాళ. 71), 'అంటే' (కాళ. 52), 'పోతే' (కాళ 69) మొదలైన 'గ్రామ్య'శబ్దాలు ప్రామాణికగ్రంథాల్లోనే లభిస్తున్నాయి. సామాన్య రచనల సంగతి చెప్పనక్కరలేదు. గేయసాహిత్యం (పదకవిత) లో 'గ్రామ్య' పదాలు బాగా చోటుచేసుకొన్నాయి. తాళ్లపాక కృష్ణమాచార్యుల 'సంకీర్తన లక్షణం'లో నాటకాదుల్లో పదకవితలో 'గ్రామ్య'పదాలు పనికి వస్తాయన్నారు (ప్రభాకరశాస్త్రి, 1948, పే. 44).

**9. 5.** క్రీ. శ. పదహారో శతాబ్దంనుంచి కేవలం వచనరచనలు కొద్దికొద్దిగా బయలుదేరేయి. విశ్వనాథ సానాపతి 'రాయవాచకం' (1520 ప్రాంతం) ఆలాంటి

వాటిలో మొదటిది. నాయకరాజుల కాలంలోనూ ఆ తరవాతా ఈ రకం గ్రంథాల సంఖ్య క్రమంగా పెరుగుతూ వచ్చింది. వీటిలో లక్షణవిరుద్ధభాషకు స్థానం దొరికింది. మహాకావ్యాలకు, లక్షణగ్రంథాలకు, పండితులు రాసిన టీకావ్యాఖ్యానాల్లో శాస్త్రరచనల్లో క్రమంగా వ్యావహారికానికి తావు లభిస్తూ వచ్చింది. శాసనాల్లోను, తాటేకు పుస్తకాల్లోను మొదటినుంచీ వ్యావహారికరూపాలు పూర్తిగాను, కొంతకు కొంతగాను ఉంటుండేవి. కావ్యరచన చాలావరకు గతానుగతికమైన ప్రబంధ ధోరణిలోను, కొరవకు ద్వ్యర్థిత్ర్యర్థి కావ్యాలవంటి చిత్రవిస్తరాది కవితాఫక్కికల్లోను సాగుతుండేది. తెలుగుభాషా సాహిత్యాలు ఈ స్థితిలో ఉండగా ఆంగ్ల ప్రభుత్వం ఏర్పడిన తరవాత కొంత భావపరివర్తనం వచ్చింది.

**9.6.** ఆంగ్ల ప్రభుత్వం ధర్మమా అని తెలుగువారికి లభించిన ముఖ్య సహాయం ముద్రణ సౌకర్యం. క్రీ. శ. 1720 నుంచి వ్యావహారికంలోఉన్న క్రైస్తవ వాఙ్మయం తెలుగులో రావటం మొదలయింది (ని. వెంకటరావు, 1954, పే. 68). 1746 నుంచి అలాటి గ్రంథాలు సంఖ్యాధికంగా వస్తూండేవి (అదే. పే. 69). 1806 లో మద్రాసులో తెలుగు ముద్రణాలయం నెలకొన్నప్పటినుంచీ దేశభాషా గ్రంథప్రచురణ మూడుపూలు ఆరుకాయలుగా వర్ధిల్లింది (రమణారెడ్డి, 1969, పే. 23). 1802 నుంచి ప్రభుత్వ ప్రకటనలు తెలుగులో వస్తుండేవి (రామమూర్తి, 1958, పే. 18). 1813 లో బ్రిటిష్ పార్లమెంటు 'చర్చి మిషనరీ సొసైటీ'ని స్థాపించాలని, దేశభాషల్లో విద్యాబోధన జరపాలని, సంకల్పించి 'ఛార్టర్ ఆక్ట్' పాస్‌చేసింది (రమణారెడ్డి 1969, పే. 21). తత్ఫలితంగా మద్రాసులోని సెయింట్ జార్జ్‌కోటలో ఆయేడే ఒక కళాశాల స్థాపించారు. అందులో పట్టాభిరామశాస్త్రిగారు సంస్కృతాంధ్రశాఖలకు ప్రధానులుగానూ, రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు, ఉదయగిరి వెంకట నారాయణయ్యగారు అధ్యాపకులుగానూ ఉండేవారు. దీంతో కులమత విచక్షణ లేకుండా కోరిన వారందరికీ విద్యాసౌకర్యాలు ఏర్పట్టమే కాకుండా ఆంగ్లభాషా, తద్ద్వారా విశ్వసాహితీ విశేషాలూ తెలుగు విద్యార్థులకు అందుబాటులోకి వచ్చాయి. 1839 లో మద్రాసు మచిలీపట్టణాల్లో ఇంగ్లీషు (బోధన మాధ్యంగా) పాఠశాలలు ఏర్పడ్డాయి. 1841 లో మద్రాసులో ఉన్నత పాఠశాల నెలకొన్నది. మద్రాసులోనే 1855 లో రాజధాని కళాశాల, 1857 లో విశ్వవిద్యాలయమూ ఏర్పడ్డాయి. ఆధునికవిద్యార్థుల ఉపయోగార్థం ప్రాచీనగ్రంథాలను ముద్రించవలసివచ్చింది. దాంతో 'పరిష్కర్త' లేర్పడి పూర్వకవిప్రయోగాలను దిద్దటం మొదలుపెట్టేరు. ముద్రణ సౌకర్యాలవల్ల వచ్చిపడ్డ దౌర్భాగ్యం ఇదొకటి.

**9.7.** పాశ్చాత్యవిద్వాంసుల్లో పరిపాలకుల్లో కొందరు సంస్కృతాంధ్రాలను, ద్రవిడభాషలనూ నేర్చి గ్రంథరచన సాగించటంతో నూతనసాహితీ ప్రక్రియలతో బాటు నూతనరచనాధోరణులు గూడా తెలుగువారికి పట్టుపడ్డాయి. కర్నల్ కాలిన్ మెకంజీ (1753-1821) అనే ప్రభుత్వోద్యోగి కావలి వెంకటబొర్రయ్య (1776-1803) గారనే విద్వాంసుడి సహాయంతో బహువ్యయప్రయాసలు పడి సేకరించిన 'కైఫీయతులు' మనవాళ్ళకు తొలిసారిగా చారిత్రకదృక్పథం ప్రసాదించాయి. వీటన్నిటినీ పునారచింపజేసి ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ 62 సంపుటాల స్థానికచరిత్రలను సిద్ధపరిచాడు. 1816లో కాంబెల్, 1817లో బ్రౌన్ తెలుగుభాషకు నవీనపద్ధతిలో వ్యాకరణాలు రాశాడు. 1820 లో 'ఉపయుక్త గ్రంథకరణ దేశభాషాసభ 'ఏర్పడి తెలుగులో అప్పటికి పెద్దలోటుగాఉన్న వచనరచనకు పాఠ్యగ్రంథనిర్మాణానికి నడుంకట్టింది. 1840 లో బ్రౌన్ తెలుగువచనంలో రాసిన తెలుగువ్యాకరణం వెలువడింది. అతని తెలుగు-ఇంగ్లీషు, ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులు 1852లోను, బ్రౌణ్య మిశ్రభాషానిఘంటువు 1854 లోను వెలుగుచూశాయి. 1855-56 లో రాబర్ట్ కాల్డ్‌వెల్ రాసిన ద్రవిడభాషా తులనాత్మక వ్యాకరణం శతాబ్దాలుగా భాషావిషయంలో తెలుగు విద్వాంసులకున్న దురభిప్రాయాలను కొంతవరకయినా పోగొట్టింది. భాషలు మారతాయని, మార్పు చెడిపోవటం కాదని, 'సకల భాషలకును' సంస్కృతం 'జనని' కాదని ఈ వ్యాకరణం ప్రతిపాదించింది.

**9.8.** పాఠ్యప్రణాళికలో వచ్చిన మార్పులవల్ల విద్యావిధానంలో కూడా మార్పు వచ్చింది. అంతవరకూ పంచకావ్యాలకూ తర్క-వ్యాకరణాదులకూ పరిమితమైన విజ్ఞానబోధలో చరిత్ర, భూగోళం, ప్రకృతి భౌతిక శాస్త్రాలు, విభిన్న సారస్వత ప్రక్రియలూ చోటుచేసుకున్నాయి. గురుమూర్తిశాస్త్రిగారి 'విక్రమార్కుని కథలు' (1819), 'పంచతంత్ర కథలు' (1934), ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్రాచరిత్ర' (1838), మామిడి వెంకయ్యగారి 'ఆంధ్ర దీపిక' (రచన 1816, ప్రచురణ 1848), బ్రౌన్ బైబిల్ అనువాదము (1827), ఆర్డెన్ తెలుగు వ్యాకరణము (1873), జార్జి బీర్ 'ప్రపంచభూగోళము' (1852), గురుమూర్తిశాస్త్రిగారి తెలుగువ్యాకరణము (1836) మొదలైనవి పాఠ్యగ్రంథాలుగా ఉండేవి. 1848 లో పరవస్తు చిన్నయసూరిగారు 'ఉపయుక్త గ్రంథకరణ దేశభాషాసభ'కు అధ్యక్షులయ్యేటంతవరకు పాఠ్యగ్రంథాల్లో వ్యాకరణ రచనల్లో ఆనాటి శిష్టవ్యావహారికమే వాడుకలో ఉండేది. ఆయన 1853 లో 'నీతిచంద్రికను'ను, 1855 లో

'బాలవ్యాకరణము' రచించి రాజధానికళాశాలలో ప్రధానాంధ్రాధ్యాపకులయిన తరవాత పరిస్థితులు తల క్రిందుగా మారేయి. ఆంగ్లభాషాసంప్రదాయాలతో పరిచయ మేర్పడ్డ కారణంగా తెలిగువారికి కలిగిన మరోలాభం పత్రికాప్రచురణ. మొదట తెలుగు పత్రిక 'వర్తమాన తరంగిణి లోనూ, రెండోది 'సుజన రంజని' (సూరి సంపాదకుడుగా 1845 లో వెలిసింది) లోనూ, తరవాతతరవాత గ్రాంథిక భాషకే స్థానం కలిగినా తొలిరోజుల్లో వ్యావహారికమే ఉండేది. సామినేని ముద్దు నరసింహంనాయుడుగారు 1840 లో రాయగా ఆయన మరణానంతరం 1862 ప్రచురితమైన 'హితసూచని' పీఠికలో ఆనాటి అభ్యుదయగామిపండితుల దృక్పథం తెలియవస్తుంది. సిద్ధాంతచర్చ చేసి అర్ధానుస్వార శకటరేఫలను వర్జించాలని చెప్పిన వారిలో ఆయనే ప్రథముడు. 1897 లో వెలుగుచూసిన గురజాడ అప్పారావుగారి 'కన్యాశుల్కము' ఆ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టిన మొట్ట మొదటి మహాగ్రంథం.

**9.9**. అటు సాహిత్యంలోనూ పెద్దమార్పువచ్చింది. సంఘ సంస్కరణతో బాటు భాషా సాహిత్య సంస్కారాన్ని తలపెట్టిన కందుకూరి వీరేశలింగంగారు (1848-1919) విభిన్న సాహితీశాస్త్ర ప్రక్రియలను 'సరళగ్రాంథిక' భాషలో (1880) వెలువరించటం ఆరంభించారు. క్షీణయుగ సాహితీప్రక్రియల్లో భాషలోనూ రచనలోనూ కనిపించే సాము గరిడీలకు ఆయన స్వస్తి చెప్పేరు. ఇటు కన్యా శుల్క' మార్గం అతినూతనమైన భాషాభావవిప్లవం రేకెత్తించింది. కావ్యభాష వ్యవహారభాష కెప్పుడూ దూరంగా ఉంటుండేదని, సంప్రదాయ పండితులు తమనాటి వ్యవహారభాషను మరచిపోతుండేవారని, పాశ్చాత్యవిద్వాంసులు చేసినవాదం కొందరినైనా ఆకర్షించటం మొదలయింది- ఇరవయ్యో శతాబ్దానికి ముందుగానే[1]. ఇందుకు ప్రత్యక్ష నిదర్శనం గిడుగు వెంకటరామమూర్తిగారు సవర భాషకు 1892 లో రచించిన నిఘంటు వ్యాకరణాలు. అయేడే టి. ఎమ్. శేషగిరి శాస్త్రిగారి 'అర్ధానుస్వారతత్త్వము' కొంతకు కొంత భాషాశాస్త్రధోరణిలో వెలువడింది[2] ఆనాటికి ఆంగ్లదేశంలోనే అధునాతన మనిపించిన 'ప్రత్యక్షపద్ధతి' (Direct Method) లో విద్యాబోధన చేయటాన్ని తెలుగుదేశంలో ప్రవేశపెట్టిన గిడుగు రామమూర్తిగారు విజ్ఞాన సముపార్జనకు పురాతనకావ్యభాషకాక అధునాతన శిష్టవ్యావహారికమే చాలా మంచిదని గ్రహించి ప్రచార మారంభించారు.

**9. 10.** పై పరిస్థితులకు తోడు సాహితీరంగంలో అన్యోన్యస్పర్ధలవల్ల పండితకవులు రెండు వివాదాలు తెచ్చిపెట్టుకొన్నారు. వాటిలో మొదటిది పాత్రోచిత భాషావివాదం ; రెండోది ఎవరు గ్రాంథికభాషావేత్తలనేది. ఈ రెండూ ఇంచుమించు ఒకే కాలంలో వచ్చాయి. సంస్కృతనాటకాలను అనుసరిస్తున్న కొందరిని వాటిలో ఉత్తమపాత్రలకు సంస్కృతాన్ని, నీచపాత్రలకు ప్రాకృత భేదాలనూ వాడటం ఆకర్షించింది. వేదం వేంకటరాయశాస్త్రిగారి 'నాగానంద' మనే తెలుగు నాటకంలో (1895) తొలిసారిగా నీచపాత్రలకు వ్యావహారికభాష ఉపయుక్తమైంది. దాంతో సనాతనవాదులకూ సంస్కరణవాదులకూ జగడం మొదలయింది. ఈ విషయాన్ని పరిష్కరించటానికి 1898 డిసెంబరులో మద్రాసులో పండితపరిషత్తు చర్చలు చేసింది. నాటకరచనలో 'గ్రామ్య' పదాలను వాడరాదని వడ్డాది సుబ్బారాయుడు (రాజమండ్రి), ధర్మవరం కృష్ణమాచార్యులు (బళ్ళారి), నాగపూడి కుప్పుసామయ్య (చిత్తూరు) గారలు వాదించారు. పూండ్ల రామకృష్ణయ్యగారు నెల్లూరునుంచి నడుపుతున్న "అముద్రిత గ్రంథ చింతామణి" పత్రికలో ఎరగుడిపాటి వేంకటచలముగారు రసపోషణ ప్రధానమైన నాటకాల్లో 'పాత్రోచిత భాష' అవశ్యం ప్రయోగించదగిందని వాదించారు ( 'నాటకాదుల) యందు గ్రామ్యభాష యుపయోగింపఁదగునా' ? తగదా ? -అ. గ్రం. చిం. 1899 ఏప్రిల్, సం. 12, సం. 4). అనాటికే కందుకూరి వీరేశలింగం, కోలాచలం శ్రీనివాసరావు, వేదం వేంకటరాయశాస్త్రిగారలు రాసిన నాటకాలు పదకొండింటిలో ఈ విధానం ఆచరణకు వచ్చింది. ఈ వాదాన్ని పూండ్లవారు సమర్థించారు. కొద్ది కాలంలోనే వ్యతిరేకభావం సన్నగిల్లింది. గ్రాంథికవాదనికి గండి పడ్డది. ఇక రెండో రంగం. కందుకూరివారు అపండితులని నిందించిన కొక్కొండ వేంకటరత్నంపంతులుగారి 'ప్రసన్నరాఘవ'నాటకం గ్రామ్యతాభూయిష్ఠమని 1898 లో వేదంవారు తమ 'ప్రసన్నరాఘవవిమర్శనము' లో దూషించారు. వేదంవారికి కూడా గ్రాంథికభాష సరిగారాదని గిడుగువారు 1897 లో తొలిసారిగా ప్రకటించిన 'ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము' అనే ఖండన గ్రంథంలో సప్రమాణంగా నిరూపించారు. సరిగా ఆ కారణంవల్లనే శిష్టవ్యావహారికాన్ని సర్వాంధ్రోపయోగార్థం వాడాలని గిడుగువారనటంతో సంకుచితవిద్యాస్పర్ధ ఒక మహోద్యమానికి దారితీసింది. అంతవరకూ చర్చారూపంలో ఉన్న వాదోపవాదాలు గిడుగువారి రాకతో ఉద్యమరూపం ధరించాయి. సామినేనివారి కాలంలో ( 1840 )

బీజప్రాయంగా ఉన్న అభిప్రాయం ఇరవయ్యో శతాబ్దంతొలిరోజులనాటికి ఉద్యమ రూపం ధరించగానే సనాతనవాదులూ సంస్కరణవాదులూ, తమలోఉన్న స్పర్ధలను విస్మరించి గిడుగువారిమీద ఒక్కటై మోహరించారు.

* * * *

**9.11.** ఇరవయ్యోశతాబ్దపు భాషాచరిత్రకూ **వ్యావహారికోద్యమచరిత్రకూ** అవినాభావసంబంధముంది. ఉద్యమారంభం 1910లో అయిందనవచ్చు. నూతన బోధనపద్ధతిని వివరించటానికి ఆయేడు మే నెలలో విశాఖలో సమావేశపరిచిన ఉపాధ్యాయులను పనిలోపనిగా గిడుగువారు వ్యావహారిక రచనలను ప్రోత్సహించ మని, వాటిని పాఠ్యగ్రంథాలుగా అనుమతించమని అభ్యర్థించారు. భావంలో భాషలో ఛందస్సులో నూతనమార్గాలు తొక్కిన గురజాడ అప్పారావుగారి 'నీలగిరి పాటలు, ముత్యాల సరాలు' ఆయేడే ప్రచురితమయినాయి. గురజాడవారు గిడుగు వారి వాదాన్ని సమర్థిస్తూ నవంబరు 24 న 'గ్రామ్యశబ్దవిచారణ' మనే వ్యాసం, సంవత్సరాంతంలోగా 'వాడుకభాష-గ్రామ్యము' అనే వ్యాసం రాశారు. వీటితో గ్రాంథికవ్యావహారాల్లో ఏది ఉపాధేయమన్న వాదన శాస్త్రచర్చగా పరిణమించింది.

**9.12.** గిడుగువారివాదంలో ప్రధానమైన సిద్ధాంతాలు నాలుగు : (1) సామూహిక విద్యాసౌకర్యాలకు కావ్యభాష చాలదు. (2) శాస్త్రగ్రంథాలను, వచన రచనలను శిష్టవ్యవహారభాషలో రాయటమనే సంప్రదాయం మనకుంది. దాన్ని పరిహరించరాదు. (3) ఆధునిక విద్యాబోధన పద్ధతికి శిష్టవ్యవహారభాషే తగింది. (4) గ్రాంథికభాష పండితులకే రాదు; దాన్ని అభ్యసించటం కష్టసాధ్యం. అందరు విద్యార్థులకూ ఆ భాషాజ్ఞానం అక్కరలేదు. సూరిగారి వ్యాకరణం కావ్యభాషను కూడా పూర్తిగా వర్ణించలేదు. కాబట్టి దాన్ని ఆధారం చేసుకొని మన పూర్వకవి ప్రయోగాలను దిద్ది ప్రచురించటం నేరమని గిడుగువారు వాదించారు. మద్రాసు విశ్వవిద్యాలయం సెనేట్‌లో తమకున్న పలుకుబడిని ఉపయోగించి గిడుగు గురజాడలు వ్యావహారికరచనలు పాఠ్యగ్రంథాలుగా ఉండవచ్చునన్న ప్రభుత్వ నిర్ణయం సంపాదించారు (20-9-1912 నాటి G. O. Ms. No. 3098). వారి వాదాన్ని అంగీకరించిన మొదటితరం అనుయాయుల్లో ఒకరైన సెట్టి లక్ష్మినర సింహంగారు రాసిన 'గ్రీకుపురాణకథ' లనే పుస్తకాన్ని స్కూల్ ఫైనల్ విద్యార్థు లకు ఉపవాచకంగా నియమించటంతో పెద్ద సంచలనం బయలుదేరింది. ఈ గ్రంథం అర్ధగ్రాంథికంలో కృత్రిమ వ్యావహారికంలో ఉండి నిశితవిమర్శల పాలై

ఆశక్తసహాయం చేసింది. విశాఖ కళాశాలాధ్యక్షులు పి. టి. శ్రీనివాసయ్యంగారి 'Indian Practical Arithmetic' (1911), వీరి పీఠికతో ఆయేడే వెలువడ్డ వేదం వేంకటాచలమయ్యగారి 'విధి లేక వైద్యుడు' అనే పుస్తకమూ అలాంటి రచనలే. శ్రీనివాసయ్యంగారి 'Life or Death-A Plea for Vernaculars' అనే కరపత్రం గ్రాంథికాన్ని తీవ్రంగా నిరసించి సనాతన పండితులను బాగా రెచ్చ కొట్టింది. పై సిద్ధాంతాలను ప్రచారం చేయటానికి విజయనగరంలో 'ఆంధ్ర సారస్వత సంఘాన్ని' నెలకొల్పేరు. విజయనగర కళాశాలాధ్యక్షులు కిళాంబి రామానుజాచార్యులుగారు దీనికి అధ్యక్షులు, బుర్రా శేషగిరిరావుగారు కార్యదర్శులు. కొన్ని సంవత్సరాలుగా వాడుకలో ఉన్న భాషలోనే గ్రంథరచన చేయాలని, శిష్టవ్యవహారభాషే నేటి ప్రామాణికభాష కాబట్టి పఠన పాఠనాలు అందులోనే జరగాలని పై సంఘంవారు తీర్మానించారు.

పై సిద్ధాంతాలవల్ల భాషాసాహిత్యాలు అవ్యవస్థలో పడిపోతాయని, వ్యావహారికమనేది గ్రామ్యమేనని, నమ్మినవారు జయంతి రామయ్యగారి ఆధ్వర్యాన కాకినాడలో 'ఆంధ్రసాహిత్యపరిషత్తు' (Telugu Academy) స్థాపించారు. ఆనాటి పెద్దపండితులు వేదం వేంకటరాయశాస్త్రి, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) గారలూ తదితరులూ ఈ సంఘంలో సభ్యులు. ఆశయప్రచారానికి 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక' ను ప్రచురించారు. (వాసుదాసుగారు 'ఆధునిక వచనరచనావిమర్శన' మనే పుస్తకంలో వ్యాకరణరీత్యా వ్యావహారికం గ్రామ్యమేనని తీర్మానించారు). ఈ సంఘంలో గిడుగు, గురజాడలు కూడా సభ్యులైనారు. మద్రాసు పచ్చయప్ప కళాశాలలో వీరు జరిపిన ప్రథమ సాంవత్సరికసభలో శతఘంటము వేంకటరంగశాస్త్రిగారు గ్రామ్యాన్ని సమర్థిస్తూ ప్రసంగిస్తే, గిడుగువారు 'ఆంధ్రభాషాచరిత్ర' అనే వ్యాసం చదివి శిష్టవ్యావహారికాన్ని సమర్థించారు. ఈ వివాదంమీద అనేకులను ఆహ్వానించి గోష్ఠి ఏర్పాటు చెయ్యాలనే నిర్ణయం జరిగింది. ఆ తరవాత పరిషత్తువారు నవంబర్ 24న కందుకూరి వీరేశలింగంగారి అధ్యక్షతన 'గ్రామ్యాదేశనిరసనసభ' జరిపేరు. అధ్యక్షులవారు భాష 'నాగరభాష, గ్రామ్య' మని రెండువిధాలని, మొదటిది సంస్కృతంలాగా పరిష్కృతం కాబట్టి కావ్యరచనకు పూర్ణంగా పనికివస్తుందని, రెండోది పామరవినోదార్థం పాత్రోచితభాషగా అక్కడక్కడ వాడదగిందని సెలవిచ్చారు. పూర్వకాలపు తెలుగువ్యాకరణాలు ముఖ్యంగా కావ్యాలకోసం ఉద్దేశింపబడ్డాయని, గద్యానికి

బాలవ్యాకరణమే శరణ్యమని వారి భావం. వ్యావహారికరచనల్లో మాండలిక పదజాలంచేరి భాష 'పరిశుభ్రత' చెడిపోతుందని వారి విశ్వాసం. జయంతి రామయ్యగారు వ్యావహారిక రచనల్లో 'సులభత' లేదని నన్నయనాటికే 'స్థిర'పడ్డ తెలుగుకూ, షేక్స్పియర్ కాలంవరకూ మారుతూవచ్చి అప్పుడే స్థిరపడ్డ ఇంగ్లీషుకూ పరిణామక్రమంలో భేదంలేదని, మాండలికమయమైన నిస్సారకవితతో నిండిన గ్రామ్యగ్రంథాలు పాఠ్యగ్రంథాలుగా పనికిరావని వాదించారు. అన్యభాషాపదాలతో నిండిన వ్యావహారికం సుబోధకంకాదని, ఉన్నపదజాలం గ్రంథరచనకు చాలదని, వ్యాకరణ విరుద్ధమైన వ్యావహారికపదాలు నిషిద్ధాలని వేమూరి విశ్వనాథశర్మగారు అభిప్రాయపడ్డారు. విసంధి పాటించటం, అర్ధానుస్వార, శకటరేఫలు వదిలి వేయటం, అన్యదేశ్యాలు వాడటం తప్పని వారి మతం. వ్యావహారికరచనలు పాఠ్యగ్రంథాలు కారాదని శాసించగోరుతూ పరిషత్తువారు ప్రభుత్వానికి ఒక వినతి పత్రం సమర్పించ నిర్ణయించినారు. అందులోని ముఖ్యాంశాలివి : (1) "పన్నెండో శతాబ్దినాటి" (?) నన్నయనుంచి నేటి కందుకూరివారివరకూ గ్రాంథికభాషమారనే లేదు. (2) పూర్వకవులందరూ ఏనాటి భేదమూలేని ఒకేభాషారీతిలో రాశారు కాబట్టి గ్రాంథికంలో ఏకరూపత (Uniformity), దానికి ప్రామాణికత ఉన్నాయి. (3) ఆధునికాంధ్రభాషకు ప్రత్యేకస్థానం లేదు. (4) భవిష్యత్తులో దుర్గ్రాహ్యమూ దుర్బోధమూ అయ్యే ఈ వ్యావహారికానికి వ్యాకరణసూత్రాలు లేవుకాబట్టి అది పాఠ్యగ్రంథరచనకు పనికిరాదు.

**9.13**. పై సిద్ధాంతాలతో ఆంధ్రదేశంలోని కవిపండిత మేధావులందరినీ ఈ రెండు సంఘాలవారూ ముగ్గులోకి దింపేశారు. కాలక్రమాన చర్చలవేడి పెరిగింది. 1912 మే 15, 16 తేదీలలో పరిషత్తు ఆధ్వర్యంలో మద్రాసులో ఒక పండితసభ జరిగింది. దానికి కొమర్రాజు లక్ష్మణరావుగారు అధ్యక్షులు. పేరి కాశీనాథశాస్త్రిగారు లౌకికవైదికసంస్కృతాల మధ్య ఉన్నట్లే గ్రాంథికవ్యావహారికాల మధ్య 'వ్యాకరణసిద్ధ' మైన భేదముందని వాదించారు. వాదప్రతివాదాల తర్వాత, పిల్లల పుస్తకాల్లోమాత్రం విసంధి పాటించాలని, అన్యత్రా గ్రాంథికమే శరణ్యమని తీర్మానించారు.[3] ఆ తరవాతి నెలలో వేదంవారి 'గ్రామ్యాదేశ నిరసన' మనే పుస్తకం ఈవాదానికి మంచి సమర్థనగ్రంథంగా వెలువడింది. గ్రామ్యగ్రాంథిక వివాదంలో తమ విశ్వాసాలను వివరిస్తూ పరిషత్తువారు తయారుచేసిన వినతిపత్రాన్ని ఆగస్టు 7 న సర్ బయ్యా నరసింహేశ్వరశర్మగారు గవర్నరుకు సమర్పించారు.

స్కూల్ ఫైనల్ విద్యార్థి ప్రాచీన నవీన పాఠ్యగ్రంథాల్లో వేటినయినా చదివే అవకాశ మిమ్మని అభ్యర్థించగా ప్రభుత్వానుమతి సెప్టెంబర్ 20న (జి. ఒ. 3098) లభించింది. ఇది గ్రాంథికవాదానికి తొలివిజయం. ఆ తరవాత మరింత ఒత్తిడి చేసి, ఒక్కొక్క విద్యార్థికాక ఒక్కొక్క పాఠశాల ఈ రెండు రకాల్లో ఏరకం గ్రంథాలను నిర్ణయిస్తే ఆదే ఆ బడి మొత్తానికి అన్వయించాలనే ఉత్తరువును సెప్టెంబర్ 29 న (జి. ఒ. 3479) సంపాదించారు. ఇది మలి విజయం. దీంతో మరింత పుంజుకొని వ్యావహారికవాదాన్ని అవహేళనచేస్తూ పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారు 'గ్రామ్యవాదుల భాషాపవాద' మనే పుస్తకం ప్రచురించారు.

ఇది ఇలాఉండగా తమకు ఆంగ్ల భాషాజ్ఞానమేకాని ఆంధ్రభాషాపరిచయం లేదన్న అపప్రథను పోగొట్టుకోడానికి గిడుగువారు 'ప్రాఁదెనుఁగుఁగమ్మ' ప్రకటించారు. అనాటి వైయాకరణుల్లో సర్వోత్తము లనిపించుకున్న తాతా సుబ్బరాయశాస్త్రిగారు 'ఆంధ్రభాషాసంస్కరణ' మనే వ్యాసంలో (ఆం. సా. ప. ప. సం. 2 (1912), సం. 3) ఏ భాషనైనా పూర్ణంగా సంస్కరించటం మానవా సాధ్యమని, సంస్కృతానికి పాణిన్యాదుల వ్యాకరణాలే చాలవని, మన పూర్వులు కూడా శిష్టప్రయోగానుగుణంగా ఆయాకాలాల్లో వ్యాకరణసంస్కరణం చేసేవారని, ఇప్పటి శిష్టాచారం ప్రకారం తెలుగు వ్యాకరణాన్ని సంస్కరించాలని, అన్యదేశ్యాలు స్వీకరించకపోతే వ్యవహారహాని సంభవిస్తుందని, అక్షరసమామ్నాయంనుంచి అర్ధానుస్వార శకటరేఫలను తొలగించాలని శాస్త్రనిదర్శనాలను ఉదాహరిస్తూ వ్యావహారికవాదాన్ని సమర్థించారు. వజ్ఝల చిన సీతారామశాస్త్రిగారు 'ఆంధ్రభాష' అనే వ్యాసంలో (ఆం. సా. ప. ప.సం. 2 (1912), సం. 4) మనపూర్వవ్యాకరణ సూత్రాలనే పాటించదలిస్తే కావ్యప్రపంచమంతా గ్రామ్యతాభూయిష్ఠ మవుతుందని, ఒకనాటి గ్రామ్య మిప్పుడు కాదని వాదించారు. మద్రాసు రాజధాని కళాశాలలో వాసుదాసుగారి అధ్యక్షతక్రింద 1912 డిసెంబరు 11, 12 తేదీలలో ఆంధ్రభాషాభి వర్ధనీ సమాజమువారు బుర్రా శేషగిరిరావుగారిచేత 'ఆంధ్రాంగ్ల భాషల్లో వ్యావహారికభాషా ప్రయోజనాల మీద ఉపన్యాసా లిప్పించారు. ఆ సమయంలో సభాధ్యక్షులు ఖండనోపన్యాసం చేస్తూ, అక్షరసంఖ్యనుబట్టి చూసినా తెలుగే ఇంగ్లీషుకన్న అభివృద్ధిచెందిన భాషఅని, గ్రాంథికభాషలో అన్యదేశాలు కొద్దిగా ఉండగా మాండలికాలు మొదలేలేవని, వ్యావహారికమనే భాషకు ఒక వ్యాకరణంగాని నిఘంటువుగాని లేనందున అప్రామాణికమైన ఆ భాషలో రచించరాదని ఆక్షేపించారు.

'గ్రామ్యవాదులు' వాడే "internal sandhi, liaision" అనే మాటలకు వారు చెప్పిన అర్థం, చేసిన వివరణాత్మకవిమర్శన చదివి ఆనందించదగ్గవి.

**9.14** గ్రాంథికవాదుల్లో చాలామంది జయంతి రామయ్యగారి లాగానే చాలావరకు ఉన్నతోద్యోగాల్లో ఉన్నవాళ్ళే. వాళ్ళ ఒత్తిడి ఎక్కువై మద్రాసు ప్రభుత్వం వ్యావహారికోపయోగాన్ని మరింత సంకుచితపరుస్తూ 1913 జనవరి 10 న (జి. ఒ. 20) మరో ఉత్తరువు జారీచేసింది. ఒక పాఠశాలలోని విద్యార్థులు గ్రాంథికవ్యావహారికాల్లో దేని వైపు మొగ్గుచూపితే ఆ శైలినే మొత్తం పాఠశాల అంగీకరించినట్లు భావించి సమాధానపత్రాల మీద గుర్తు పెట్టాలని ఆ ఉత్తరువు నిర్ణయించింది. అంటే ప్రధానోపాధ్యాయుల అభిప్రాయాలు చెల్లుబడికి వస్తాయన్న మాట. చివరకు సంస్కరణ నేతిబీరకాయగా పరిణమించింది. గ్రాంథికవాదులకు ఇది ఘనవిజయం. ఇందుకు ప్రత్యుత్తరంగా గిడుగు వేంకట రామమూర్తిగారు ఇంగ్లీషులో 'A Memorandum on Modern Telugu' అనే కరపత్రాన్ని ప్రచురించారు. దానికి ప్రతిగా జయంతి రామయ్యగారు 'A Defence of Literary Telugu' అనే కరపత్రాన్ని ప్రకటించారు. గిడుగు వేంకటసీతాపతిగారి 'సొద్దు', గురజాడ అప్పారావుగారు మద్రాసు విశ్వవిద్యాలయానికి ఇచ్చిన 'ఆధునికాంధ్ర వచన రచన' అనే నివేదిక వ్యావహారికవాదానికి సహాయకారులు కాగా, పానుగంటివారి 'గ్రామ్యవాద విమర్శనము', పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి 'ఆంధ్ర భాషా సంస్కరణ విమర్శనము', మల్లాది సూర్యనారాణశాస్త్రిగారి 'గ్రామ్యమా ? గ్రాంథకమా ?' అనే వ్యాసము, పి. సూరిశాస్త్రిగారు సంకలనం చేసిన 'The Grāhmya Controversy' అనేవి గ్రాంథికవాదానికి తోడ్పడేవి. ఆంధ్రసాహిత్య పరిషత్తు తృతీయ వార్షికోత్సవ సందర్భంలో గ్రాంథికవ్యావహారికవివాదంలో పరిషదభిప్రాయాన్ని నిరూపించవలసివచ్చింది. అంతకుముందు నియమించిన ఉపసంఘ నివేదిక అప్పటికి అందలేదు. కాబట్టి నిర్ణయం వాయిదా వేయమని గిడుగు గురజాడలు వాదించినా సంఖ్యాబలప్రాతిపదికమీద 1912 మే నాటి పండితగోష్ఠి అభిప్రాయమే పరిషదభిప్రాయమనే నిర్ణయం జరిగింది. దీంతో ఈ వివాదాన్ని సభాముఖంగా పత్రికాముఖంగా పరిష్కరించుకోవాలన్న అభిలాష ఉభయపక్షాలకూ కలిగింది. కాని అప్పటికే కొందరు గ్రాంథిక వాదంలో శిథిలత ప్రవేశించింది. నండూరి మూర్తిరాజుగారు 'గ్రామ్యవాద విమర్శన' మనే వ్యాసంలో వ్యావహారికవాదుల 'ధ్వనిశాస్త్రమూ' గ్రాంథికవాదుల 'వ్యాకరణమూ'

భిన్నమైన వంటూనే; ఉభయపక్షాలవారూ రాజీవడి నవీనవ్యాకరణం రాయటం మంచిదని ఉద్బోధించారు. 'ఆంధ్రభాషాసంస్కార' మనే వ్యాసంలో పప్పు మల్లికార్జునుడుగారు 'కొందరు' పద్యానికి గ్రాంథికమూ గద్యానికి వ్యావహారికమూ మంచిదంటున్నారని, తమ వాదాన్ని సమర్థించుకోడానికి గిడుగువారు చూపిన కావ్య ప్రయోగాలన్నిటికీ పాఠాంతరాలున్నాయని అటూఇటూ కాకుండా వాదించారు. అయితే వాదశిథిలత వచ్చినా తీవ్రత తగ్గలేదనటానికి 1914 లో జరిగిన చర్యలే తార్కాణం.

**9. 15.** మద్రాస్ యూనివర్సిటీ 1914 లో 'కాంపోజిషన్ కమిటి' అనే సంఘాన్ని నియమించింది. అందులో గ్రాంథిక వ్యావహారిక వాదులకు మొట్టమొదట సమప్రాధాన్యం ఉండేది ; తటస్థులు కొందరుండేవాళ్లు. ఇంటర్మీడియట్ పాఠ్య గ్రంథాలు కాదగిన పుస్తకాల పట్టిక నొకదాన్ని జి. వెంకటరావుగారు సమర్పించారు, వాటిలోని పదజాల న్ని ప్రాచీనార్వాచీనాలుగా విభజించి అర్వాచీనా లనే ఆమోదించాలని మొదట నిర్ణయించారు. అయితే ఆ శబ్దాల నిర్ణయం దగ్గర పేచీవచ్చింది. ఇంతలో ప్రాంతీయ ప్రాతినిధ్యం సరిగాలేదని ఆందోళనచేసి గ్రాంథికవాదులు మరియిద్దరు తమ వారిని చేర్చగలగటంతో సంఖ్యాబలం వారివైపు మొగ్గింది. కొమర్రాజు లక్ష్మణరావుగారు A Memorandum on Telugu Prose అనే వ్యాసంలో గ్రాంథికవాదం చేశారు. గురజాడవారు తమ వ్యతిరేకతను సోపపత్తికంగా సుదీర్ఘ వ్యాసరూపంలో ('The Minute of Dissent to the Report of the Telugu Composition Sub-Committee : MD) ఆంగ్ల భాషలో చర్చించగా మరి ముగ్గురుసభ్యులు సంతకాలు చేశారు. వ్యావహారిక రచనా సంప్రదాయం మనకు శతాబ్దాలుగా ఉన్నదని రుజువుచేస్తూ గిడుగువారు 'నిజమైన సంప్రదాయం' మనే చిన్నపుస్తకం రాశారు. వ్యావహారికవాదులు ఎలమంచిలిలో జరిపిన విద్వత్సభలో శిష్టవ్యావహారికం గ్రామ్యం కాదనే వర్ఘుల చినసీతారామ స్వామిగారి తీర్మానం నెగ్గింది. పర్లాకిమిడి కళాశాలలో అగస్టు 3 న బి. మల్లయ్య శాస్త్రిగారి అధ్యక్షతన జరిగిన ఆంధ్రసారస్వతపరిషత్తు వార్షికోత్సవసమావేశం లోనూ వ్యావహారికవాదాన్ని సమర్థించటం జరిగింది. చారిత్రకదృక్పథంతో భాషాపరిశీలన జరగాలని, పఠనపాఠనాలు ఆధునికభాషలోనే జరగాలని నారాయణ మూర్తిగారు ఉపన్యసించారు.

**9. 16.** కాకినాడలో జూలై 1 న 'ఆంధ్రభాషా సంరక్షక' సమాజాన్ని పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు మొదలైనవారు స్థాపించారు. గ్రాంథిక వాదాన్ని బలపరుస్తూ 'కొత్త తెలుగు-మంచి తెలుగు; పులుల దండులు-పూలదండలు' మొదలైన కరపత్రాలు ప్రచురించారు 28-6-1914 నాటి కాకినాడ సమావేశంనుంచి 23-8-1914 నాటి అన్నవరం సమావేశంవరకూ 24 బహిరంగసభల్లో న్యాయవాదులు, ప్రభుత్వోద్యోగులు, కొందరు రచయితలు గ్రాంథికవాదాన్ని సమర్థిస్తూ ప్రసంగాలు చేశారు. ఇందులో గమనించవలసిన విశేషాలు రెండు : గంజాం పర్లాకిమిడి జిల్లాలల్లో వ్యావహారికవాదానికి బలం చేకూరగా, కృష్ణాగోదావరి జిల్లాలల్లో గ్రాంథికానికి మద్దతు లభించింది. (2) గ్రాంథికవాదానికి అండగా నిలిచిన వారిలో ఎక్కువ మంది పలుకుబడి 'కలవారే' గాని 'తెలిసిన'వారు కారు. ఈ వివాదవ్యవహారం పత్రికలకు కూడా ఎక్కింది. జూలై, ఆగష్టు నెలల ఆంధ్రపత్రిక, హిందూలలో అనేకులు మారుపేర్లతో వాదోపవాదాలు చేశారు. (చూ. 'Arguments for and against Modern Telugu-Scape and Co., Cocoanada). వీటిలో ఎక్కువభాగం గ్రాంథికవాదాన్ని సమర్థించేవి. ఆ వాదవిధానం తీవ్రంగా విచిత్రంగా ఉండేది. అందులోని ముఖ్యాంశాలివి : (1) వ్యావహారిక మనేది నింద్య గ్రామ్యం అందులో కులవృత్తి ప్రాంత భేదాలవల్ల ఏకరూపతలేదు. ఈ మాండలి కాలవల్ల అది సులభంగా అర్థంకాదు. (2) జరిగిన వెయ్యేళ్ళుగా గ్రాంథికం మారలేదు. (3) వ్యావహారికం వ్యాకరణవిరుద్ధం కాబట్టి ప్రామాణికం కాదు. (4) వ్యావహారికంవల్ల ప్రాంతీయభేదాలేర్పడి ఆంధ్రోద్యమం దెబ్బతింటుంది కాబట్టి అది పనికిరాదు. (5) ఆధునికభాషకు ప్రత్యేకంగా వ్యాకరణంగాని సాహిత్యంగాని నిఘంటువుగాని లేవు కాబట్టి అది పఠనపాఠనాలకు తగదు. (6) ఆంగ్లభాషాపరిణామంతో ఆంధ్రభాషాపరిణామాన్ని పోల్చరాదు. లిఖిత వాగ్రూపాలలో తెలుగులో ఉన్న భేదాలు ఇంగ్లీషుకో ఉన్నవాటికన్నా తక్కువ. (7) వెయ్యేళ్ళ క్రితమే స్థిరపడ్డ తెలుగును 'కోయ, సవర, చచ్చుట' భాషలున్న కేవల వ్యవహారదశకు 'ఆటవిక స్థితి'కి దించరాదు. (8) గ్రాంథికాన్ని నీచస్థితికి దించేకన్నా వ్యావహారికాన్ని ఉచ్చస్థితికి తేవటం మంచిది. (9) వ్యావహారికాన్ని అంగీకరిస్తే ప్రాచీనసాహిత్యం అర్థం కాకుండా పోయి కాలక్రమాన నశించి పోతుంది. (10) ఆధునికభాషలో ఉన్న ఒకటి రెండు పుస్తకాలకన్నా నన్నయ భాషే సులభంగా అర్థమవుతుంది. కాబట్టి గ్రాంథికమే మంచిది. ఇంత దూకుడుగా

ఉద్ధృతంగా వచ్చిపడ్డ గ్రాంథికవాదప్రవాహం ఒక్కసారిగా ఎండిపోయింది — గ్రాంథికపాఠ్యగ్రంథాలు రాగానే.

**9.17.** కందుకూరి వీరేశలింగంగారు, దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు, చిలుకూరి వీరభద్రరావుగారు మొదలైన విద్వాంసులు పాల్గొన్న కొవ్వూరు సారస్వత మహాసభలో (1916 నవంబరు 19) నూరేళ్ళుగా పెద్దల వాడుకలో ఉన్న పదాలన్నీ నిర్దుష్టాలన్నీ, దేశవ్యాప్తంగా ఉన్న రూపాలు పూర్వప్రయోగం లేకపోయినా సాధువులేనని తీర్మానించారు. 1919 లో గిడుగువారు 'తెలుగు' పత్రికను (ఆంగ్ల భాషలో) స్థాపించి ఉద్యమం సాగిస్తూనే వచ్చారు. అంతవరకూ గ్రాంథిక వాదానికి మూలవిరాట్టుగా ఉన్న కందుకూరివారు వ్యావహారికవాదాన్ని అంగీకరించి 'వర్తమానవ్యావహారికాంధ్రభాషాప్రవర్తకసమాజము' (1919 ఫిబ్రవరి 28) స్థాపించి దానికి అధ్యక్షులయినారు. గ్రాంథికవాదుల కిది గొడ్డలిపెట్టు. ఇది భరించలేని గ్రాంథికవాదులు చివరకు వ్యక్తిదూషణకు దిగేరు (ఆంధ్రసాహిత్యపరిష దష్టమ సమావేశం-జూన్ 7 : వేదంవారి ప్రసంగం). కాని పరిషత్తువారు కూడా కొండదిగి 1924 అక్టోబర్ 13 న వ్యావహారిక భాషాబహిష్కారం రద్దుచేయక తప్పలేదు. వ్యావహారికవాదం క్రమంగా బలపడుతూ వచ్చింది. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు సూత్రధారులుగా 1933 మార్చి 10-12 తేదీల్లో జరిగిన 'అభినవాంధ్ర కవి పండితసభ' బోధనభాషగా వ్యావహారికాన్ని స్వీకరించాలని తీర్మానించింది. ఆయేడు గిడుగువారు ప్రచురించిన 'గద్యచింతామణి' (ప్రథమభాగం) వచనరచనా సంప్రదాయాన్ని ససాక్షికంగా నిరూపించి సనాతన పండితవర్గాలకు గండికొట్టింది. 1936 లో 'నవ్యసాహిత్యపరిషత్తు' వెలిసింది. అభినవాంధ్రరచయితల్లో వ్యావహారికానికి అనుకూలంగా ఉన్నవాళ్లందరూ ఇందులో చేరేరు. పరిషత్తువారు 'ప్రతిభ' అనే పత్రికను నడిపేరు. శరపరంపరంగా సమర్థకవ్యాసాలూ వ్యావహారిక రచనలూ రావటం మొదలయింది. 1937లో 'జనవాణి' అనే దినపత్రికకు సంపాదకత్వంవహించి తాపీ ధర్మారావుగారు మొట్టమొదటిసారిగా వ్యావహారికాన్ని పత్రికా భాష చేశారు. గ్రాంథికభాష చివరకు విశ్వవిద్యాలయాల్లో పాఠ్యగ్రంథాల్లో తల దాచుకోవలసి వచ్చింది. విభిన్నసాహిత్యప్రక్రియల్లో-పద్యకావ్యాల్లో తప్ప-వ్యావహారికమే నిలిచింది. గ్రాంథికంకూడా "సులభగ్రాంథిక" "సరళగ్రాంథికాది" బహురూపాలతో మునపటి సలక్షణతను పోగొట్టుకొని గతానుగతికమైన అప్రతిభ రచనల్లో జీవచ్ఛవంగా ఉండవలసిన కాలం వచ్చింది.

**9. 18** గ్రాంథికవాదులు చాలాకాలం నిశ్శబ్దంగా ఉండి 1958-60 లలో ఒకసారి, తిరుగా 1965-70 లలో ఒక తూరి, అప్పుడప్పుడు అక్కడక్కడ అనుకూలవాతావరణాల్లో తలఎత్తుతూ దించుతూ దోబూచులాడటం మొదలుపెట్టేరు. వాళ్లు శాస్త్రవిచారణవల్ల సాధించలేని విజయాలను రాజకీయ సాంఘికసమస్యలేవైనా అనుకూలంగా సమకూడినప్పుడు నెరవేర్చుకోదలచినట్లు నిదర్శనాలున్నాయి. 'జయంతి' పత్రికను స్థాపించిన తొలిరోజుల్లో ఈలాంటి ప్రయత్నమొకటి జరిగింది. సంపాదకులు ఒకవంక శిష్టవ్యావహారికానికి 'ప్రజామోదం' లభించిందని చెప్తానే రెండోవైపు దుష్టప్రయోగాలతో నిండిన సారస్వతానికి ఒక 'వ్యవస్థ' కల్పించటమే తమ లక్ష్యమని ప్రకటించారు. కేవలం ఆధునికసమస్యలను చర్చించటంవల్ల ఈ శైలికి ఈ గౌరవం వచ్చిందన్నారు. (జయంతి, 1958 నవంబరు, సంపాదకీయం). 1959-60 సంవత్సరాల 'జయంతి' సంచికల్లో జువ్వాడి గౌతమరావుగారు ('వ్యవహారభాష-వ్యాకారణము' 59:మే; 'పత్రికారచన-సాహిత్యము' 60:ఫిబ్రవరి) కులప్రాతిపదికను తెచ్చిపెట్టేరు. వ్యావహారిక మనేది 'కృష్ణాజిల్లా బ్రాహ్మణభాష' అనీ,తాముకూడా తమ ప్రాంతీయభాష ఉండగా దానికి 'దాస్యం' చేయవలసి వచ్చిందనీ వాపోయారు ; వారి ఇతరవాదాలు సరికొత్త పాతవి మరికొన్ని లేకపో లేదు. కావ్యభాషకు వ్యాకరణం రాయటమే అసాధ్యమైనప్పుడు ప్రాంతీయపద బంధురమైన వ్యావహారికం విషయం చెప్పనక్కరలేదని ఇప్పటి వ్యావహారిక రచనలన్నీ విజాతీయాలనీ, వీటికి ప్రచారగౌరవా లిస్తున్న పత్రికలు బాధ్యతా రహితాలన్నీ, వ్యావహారికవాదం ప్రాచీనకావ్యాలమీద నిరాదరణ కలిగిస్తూంది కాబట్టి ఆమోదయోగ్యం కాదనీ వారు సెలవిచ్చారు. వీరికి కొండముది శ్రీరామచంద్ర మూర్తిగారూ, జలాంతశ్చంద్రచపలగారూ సవివరంగా సమాధానాలిచ్చారు. 'ఆంధ్ర భాష-అవ్యవస్థ' అనే వ్యాసంలో (జయంతి, 1960 ఏప్రిల్) 'గాండీవి' గారు అకు కందని పోకకు పొందని భావాలు వెలిబుచ్చారు. శిష్టవ్యావహారికం ప్రాచీనకవి సమ్మతంకాదని, దానికి వ్యాకరణరచన చేయనక్కరలేదని, గ్రాంథికానికే ఒక వ్యవస్థలేదని, అందువల్ల ఏవో కొన్ని సామాన్యసూత్రాలు రాసి అందరూ ఒకేరీతి వ్యావహారికం రాయటమే మేలని వారి అభిప్రాయం. 'ఏవోకొన్ని సూత్రాల' కోసమే ఈ ఆరాటమైతే ఆనాటికే పారనంది రామస్వామిశాస్త్రిగారు, మల్లాది సూర్యనారా యణశాస్త్రిగారు, వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు రాసిన వ్యాకరణసూత్రాలున్న వన్నసంగతి వారు స్మరించవలసింది. ఇంకా పూర్వకాలంలో రావిపాటి గురుమూర్తి

శాస్త్రిగారిలాంటి కొందరు ఇదేపని చేశారని గుర్తుకు తెచ్చుకోవలసింది. అయితే ఈ చర్చలు ఏకొద్దిమందినో ఆకర్షించినందువల్ల కోలాహల మేమి జరగలేదు.

**9.19**. 1965నుంచి వచ్చిన వాదోపవాదాలు పాఠ్యపుస్తకాల శైలి విషయంలో వచ్చాయి. అంతవరకూ పాఠ్యగ్రంథాలన్నీ అర్థగ్రాంథికమో సరళగ్రాంథికమో అలాంటి ఏదోఒక రీతిలో ఉంటుండేవి. ఆంధ్రప్రదేశావతరణవల్ల తెలుగు నేర్చుకోవాల్సిన వారు రెండురకాలవారైనారు. తెలుగు మాతృభాషగా కలవారు ఒకరకం, ఆంధ్రేతరులు మరోరకం. ఆంధ్రేతరులు తెలుగు నేర్చుకోవటం నిత్యవ్యవహారంలో ఇబ్బంది లేకుండా జరుపుకోవటానికి కాబట్టి వాళ్ళకోసం రాసిన పాఠ్యగ్రంథాల్లో వ్యావహారికమే ఉండాలని భద్రిరాజు కృష్ణమూర్తిగారు వాదించి గ్రాంథికంలో ఉన్న పుస్తకం తమ చేతిమీదుగా అచ్చుకారాదని అభ్యంతరం లేవదీశారు. ప్రభుత్వం ఈ విషయంలో ఏకాభిప్రాయాన్ని సాధించాలన్న భావంతో అన్ని రంగాల్లోను విద్వాంసులను ప్రతినిధులను తిరుపతిలో సమావేశపరిచింది. అనేక తర్జనభర్జనలయిన తర్వాత పింగళి లక్ష్మీకాంతంగారి అధ్యక్షతన ఆ సమావేశంవారు ఒకరాజీకి వచ్చారు. మొదటి భాషగా తెలుగు నేర్చుకొనేవాళ్ల పాఠ్యగ్రంథాల్లోని తెలుగువాచకాలు మాత్రం సరళగ్రాంథికంలో ఉండాలని, రెండో భాషగా తెలుగు నేర్చే వాళ్ళుగాని, శాస్త్రవిషయాలను తెలుగులో నేర్చుకొనే ఆంధ్ర విద్యార్థులుగాని చదివే పాఠ్యగ్రంథాల్లో వ్యావహారికమే ఉండాలని సూత్రప్రాయంగా నిర్ణయించారు. ప్రభుత్వంవారు ఈ నిర్ణయాన్ని ఆమోదించి వివరణాత్మకంగా ఆయా శైలీభేదాలను (గ్రాంథికవ్యావహారికాలను శైలీ భేదాలుగా గుర్తించి వీటిని వివరించే సంఘాన్ని శైలీ సంఘం – Style Committee – అని ప్రభుత్వం వ్యవహరించింది) నిరూపించటానికి పింగళి లక్ష్మీకాంతంగారినే అధ్యక్షులుచేసి ఒక సంఘం నియమించారు. ఆ సంఘంవారు 1966 నాటికి తమ పని నెరవేర్చారు. తెలుగును రాజభాష చేయదలచిన ప్రభుత్వానికి ఈ నిర్ణయాలు చాలా అవసరం. తెలుగును అధికారభాషగా గుర్తిస్తూ 1966లో ఆంధ్రప్రదేశ్ అధికారభాషా చట్టం (9వ చట్టం) శాసించింది. తెలుగును అధికారభాష చేయటంలోని కష్టసుఖాలు పరిశీలించి సలహా ఇమ్మని ప్రభుత్వంవారు అప్పటి విద్యాశాఖాకార్యదర్శి జె.పి.ఎల్ గ్విన్ ఆధ్యక్షతన మరో సంఘం నియమించారు. (జి. ఓ. 3051, 1966 డిసెం. 28). గ్విన్ సంఘంవారు ముఖ్యంగా ఆంధ్రేతరులకు తెలుగు నేర్పటానికి, భాషను ఆధునికీకరించటానికి, విశ్వవిద్యాలయాల్లో తెలుగును బోధనభాష చేయ

టానికి, పరిపాలన వ్యవహారాలకు కావలసిన సాంకేతిక సహాయం అందివ్వటానికి ఒక స్వతంత్రసంస్థను నెలకొల్పవలసిందని సూచించారు. వారే భద్రిరాజు కృష్ణమూర్తిగారి సూచనల మేరకు ఆసంస్థ ప్రచురణ లన్నిటిలోను (పాఠ్యగ్రంథాలతో సహా) లక్ష్మీకాంతం కమిటీ నిర్దేశించిన ఆధునికప్రమాణభాషనే (వ్యావహారికాన్నే ఉపయోగించాలని నిర్దేశించారు (5,27, పే. 19). రాష్ట్ర ప్రభుత్వంవారు ఈ సూచనలను ఆమోదించి వాటిని అమలుపరచటానికి 'తెలుగు అకాడమి' అనే సంస్థను 1968 ఆగష్టు 6 న స్థాపించారు. ఆ సంస్థవారు ఇంటర్మీడియట్ పాఠ్యగ్రంథాలను తెలుగులో రాయిస్తున్నప్పుడు తిరుగా భాషావివాదం తలయెత్తింది. సంఘాలూ ఉపసంఘాలూ చర్చోపచర్చలు చేసిన తరవాత శిష్టవ్యావహారికాన్నే కొన్ని మార్పులతో వాడుకచేయాలని అంగీకరించి అమలుజరిపేరు. ఆ తరవాత మళ్ళీ గ్రాంథికాన్ని పునఃప్రతిష్ఠించాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అవి నెరవేరవనే ఆశాభావం ఉన్నా, భాషా శాస్త్రసంబంధి చర్చలవల్ల కాక కులవిద్వేష రాజకీయవైమనస్యాలను ఆధారంచేసుకొని జయం సంపాదించవలసిన దుస్థితికి గ్రాంథికవాదులు దిగజారినందుకు మాత్రం విచారపడక తప్పదు. ఈనాటి రేడియోల్లో, పత్రికల్లో, సాహితీరచనల్లో, సినిమాల్లో అనుక్షణం వాడుకలో ఉండి ప్రజాసామాన్యానికి అందుబాటులో ఉన్న వ్యావహారికాన్ని ఏ శక్తీ ఎక్కువకాలం బహిష్కరించలేదు. పరంపరగా సనాతనత్వానికి కంచుకోటలుగా ఉన్న విశ్వవిద్యాలయాల్లో (ముఖ్యంగా అందులోని తెలుగుశాఖల్లో) కూడా వ్యావహారిక రచనలే చేస్తున్నవారున్నారు. శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయం తెలుగుశాఖ పిహెచ్.డి. పట్టానికి రాసే పరిశోధనవ్యాసాల్లోకూడా శిష్టవ్యావహారికాన్ని 1969లో అంగీకరించింది. 27-4-1973లో రాష్ట్రప్రభుత్వంవారు తెలుగును ద్వితీయభాషగా బోధించేటప్పుడు పాఠ్యగ్రంథాల్లో వ్యావహారికమే ఉండాలని నిర్దేశించినా (GO MS No. 384) వాటిని తిరగరాసే అవకాశం ఈ నాటికి కలగలేదు. 1971 లో ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు తాము నియమించిన ఉప సంఘంవారు 1973 లో అన్ని స్థాయిల్లోను వ్యావహారికమే ఉండాలని చేసిన సిఫారసు అంగీకరించి, తమ నిర్ణయాలను ఆచరణలో పెట్టడానికి 2-11-74న మరో ఉపసంఘాన్ని నియమించారు. అది 2-4-75న తొలి సమావేశం జరిపిన తరవాత మళ్ళీ కలుసుకో లేదు. ఒకటో తరగతి నుంచి పదోతరగతి వరకున్న తెలుగు పాఠ్య గ్రంథాలు ఇప్పటికీ గ్రాంథికంలోనే ఉన్నాయి. మరో మహోద్యమం ప్రళయంలాగా వచ్చి

ముంచెత్తితే తప్ప ఈ స్వార్థసంకుచిత ప్రతీప శక్తులను మొదలంటా పెకలించటం సాధ్యపడకపోవచ్చు. ఆ సమయం ఎంతో దూరానలేదు (చూ. 9.21, జ్ఞాపిక 9a).

**9.20.** ఇక గ్రాంథిక వ్యావహారిక వివాదాలను సంక్షిప్తంగా విమర్శించి ఆధునిక ప్రామాణికభాషాస్వరూపాన్ని స్థూలంగా నిర్దేశించవలసివుంది. భ్రమ ప్రమాదాత్మకమైన కొన్ని భావాలే ఈ వివాదానికి ప్రథమకారణ మనవచ్చు. కొన్ని సాంకేతికపదాలనూ, వాటి అర్థాలనూ సరిగా అర్థం చేసుకోనందున వచ్చిన భ్రమప్రమ లవి. మచ్చుకు 'వ్యాకరణం, గ్రామ్యం, అన్యదేశ్యాలు, ప్రామాణికత, భాషా స్థిరత్వం, ధ్వనిశాస్త్రం' మొదలైనవి. సాధ్యాసాధ్యాలను గుర్తించకపోవటం, ప్రాచీనత మీద అపారగౌరవం, నవీనతమీద అగౌరవానుమానాలు, భాషాస్వభావ జ్ఞానం లోపించటం, ప్రపంచపరిస్థితులను గమనించక పోవటం ఇందుకు ఉద్దీప కాలు. ఈ విషయాలను క్లుప్తంగా పరిశీలించినా గ్రాంథికవాదంలోని అసహజత్వాన్నీ అనుపాదేయతనూ గుర్తించవచ్చు.

**9.21.** మొదట 'వ్యాకరణ' శబ్దం పరిశీలిద్దాం. భాషలో అంతర్గతంగా ఉన్న లక్షణాలను సూత్రీకరించి రాసిన గ్రంథాన్ని 'వ్యాకరణగ్రంథ' మంటారు. ఆ లక్షణాలే ఆభాషకు వ్యాకరణంగాని, రాసిన పుస్తకమొక్కటే వ్యాకరణంకాదు. అందువల్ల కేవలం వాగ్వ్యవహారంలోఉన్న భాషకుకూడా వ్యాకరణం ఉంటుంది. దేశకాలపాత్రాలనుబట్టి వ్యవహారంలో వచ్చిన మార్పులు ఒక్కొక్క భాషలోని వ్యాకరణంలో కూడా మార్పులు తెస్తాయి. వాటిని గుర్తించి వ్యాకరణ 'సూత్రా'లను మార్చుకోవాలేగాని నిరాధారంగా సూత్రాలను మార్చినంత మాత్రాన వ్యాకరణం మారదు—సూత్రాలను మార్చనందువల్ల భాషలో వచ్చిన మార్పులు ఆగిపోవు. గ్రాంథికవాదులు ఈ చిన్న రహస్యాన్ని గుర్తించక వ్యావహారికానికి 'వ్యాకరణం' లేదు కాబట్టి ఉపాదేయం కాదన్నారు. మచ్చుకు కొమర్రాజు లక్ష్మణరావుగారు వ్యాకరణమంటే సంప్రదాయ వ్యాకరణగ్రంథమని, లేదా అది అంగీకరించిన భాషా రూపాలని, వాటికి విరుద్ధమైనరూపాలు అనంగీకార్యాలని, వ్యావహారికానికి ప్రత్యేక వ్యాకరణంలేనందున అది 'గ్రామ్య'మని వాదించగా గురజాడవారు అధిక్షేపించారు.[4] వ్యాకరణంవల్ల భాష స్థిరపడుతుందనీ స్థిరీకరించడంకోసమైనా ముందు వ్యాకరణం రాసి ఆ తర్వాత వ్యావహారికాన్ని ఉపయోగించమనీ గ్రాంథికవాదులంటే, మొదటి భావం దుర్భ్రమ అని, రెండోపని అర్థరహితమని, వ్యావహారికవాదు లాక్షేపించి ప్రామాణికపాశ్చాత్యవిద్వాంసుల వాక్యాలను ఉద్ధరించి చూపేరు.[5] భాషను

శాశ్వతంగా స్థిరీకరించే ప్రయత్నం మన పూర్వులుకూడా చెయ్యలేదనీ, ఆయా కాలాల్లోని శిష్టవ్యవహారాన్ని ఆధారంచేసుకొని వ్యాకరణ సూత్రాలను సరిదిద్దటం ఏ భాషా సాహిత్యంలోనైనా అనూచానంగా వస్తున్న సంప్రదాయమనీ, అమంగళాశ్లీలాదులే గ్రామ్యంకాని శిష్టవ్యవహారం ఎప్పుడూ గ్రామ్యంకాదనీ అనేకోపపత్తులలో గిడుగువారు, తాతా సుబ్బారాయుడుశాస్త్రిగారు మొదలైన విద్వాంసులు నిరూపిస్తూ వచ్చారు. అయితే సంప్రదాయవాదులు వ్యావహారికరూపాలను అన్యదేశ్యాలను నిఘంటుబద్ధం చేయటానికి మాత్రం అంగీకరించి ఆ పదాలను రచనల్లో వాడటం నిషేధించదలిచారు.[6] వ్యాకరణ ప్రయోజనంమాట అటుంచి భాషలో మార్పేరాదని, లిఖితభాషకు ఉచ్చరితభాషకూ భేదమేలేదని కొందరు వాదించారు.[7] మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు 'భారతభాషకును నేటి గ్రాంథికభాషకును భేదము' (సారస్వతవ్యాసములు, రెండవ సంపుటము, పే. 64-75) అనే వ్యాసంలో 'ఎవ్వనియేని ముఖామృతాంశుబింబమ్మున నుద్భవంబయిన భారతవాగమృతంబు', 'పరాశరసుతుం బ్రణమిల్లి', 'ఈఁగాంచితి', 'పంచత్వము 'సనియెదుమని', 'ఇది వడిగలదు', 'నాకుం గరుణింపుండని', 'తనకు నురగభోజనంబు సురపతిచేతం బడసి', 'బ్రహ్మకుం దపము సేసి','అక్కన్యను మ్రొక్కించి' మొదలైన నన్నయ ప్రయోగాలను తరవాతి కాలంలోని గ్రాంథికరూపాలతో పోల్చిచూచి మరి మాట్లాడమన్నారు. దృష్టిభేదం ఉండవచ్చుగాని దృష్టిలోపం ఉంటే చేయగలిగింది లేదు. 1912 మే లో మద్రాసులో జరిగిన పండితసభలో పాల్గొన్న పెద్దలు మాటలో రాతలో తెలుగులో భేదమేలేదు కాబట్టి ఏలాటి సంస్కరణమూ అక్కరలేదని వాదించారట ! అదేనిజమయితే, శిష్టులు మాట్లాడేవిధంగా రాయటానికి అభ్యంతరం ఎందుకో అర్థంకాదు.[8] ప్రాచీనవ్యాకరణసూత్రాలు వేదప్రమాణాలని భావించి మార్పును వ్యతిరేకించినా కాలప్రవాహమూ భాషాప్రవాహమూ ఆగేవికావు; వాటిని ఆపటం ఎవరితరమూ కాదు.[9] 'శిష్టానా ముక్తౌ సూత్రాణా మభావే అనుశాసనకారిణ ఏవ దండనీయాః' అన్న దండిసూక్తిని స్మరించటం మంచిది. ఏవో తాతలనాటి సూత్రాలనే వల్లించటంకన్నా 'కేవలం శాస్త్రమాశ్రిత్యనకర్తవ్యో వినిర్ణయః, యుక్తి హీన విచారే తు ధర్మహానిః ప్రజాయతే' అన్న అభియుక్తోక్తిని అర్థంచేసుకోవటం మంచిది. తొలి రోజుల్లో గ్రాంథికవాదు లాక్షేపించినట్లు ఇప్పుడు వ్యావహారిక సాహిత్యలోపం లేదు.[10] ఆధునిక పరిస్థితుల్లో వ్యావహారికంవినా మరో మార్గాంతరమూ లేదు.[11] పూర్వకవులు మాత్రమే భాషాస్వరూపనిర్ణేతలనే దురభిప్రాయం ఎంత త్వరలో పోతే అంత మంచిది.[12]

**9. 22.** ఇక వ్యావహారికభాషలో అన్యభాషాపదాలూ మాండలికపదాలూ ఉన్నందువల్ల భాషా 'పరిశుద్ధత' లోపిస్తుందని, సులభంగా బోధపడదని, ఏక రూపత నశిస్తుందని వాదించటంలోని మంచిచెడ్డలను గమనించవలసి వుంది. తెలుగు ప్రత్యేకభాష కాబట్టి సంస్కృత ప్రాకృతపదాలుగాని తమిళ కర్ణాటాది భాషాపదాలుగాని మనకు అన్యభాషాపదాలే. వాటిని వాడటంలో లేని అభ్యంతరం రాజకీయ సాంఘిక సాంస్కృతిక కారణాలవల్ల తెలుగులోకి వచ్చిచేరిన ఉర్దూ ఇంగ్లీషు పదాలను వాడటంలో ఎందుకు రావాలి ? అన్యభాషాపదాల చేరిక ప్రపంచ భాషలన్నిటిలోనూ ఉంది [13]. వాటిని పరిహరిస్తే 'వ్యవహారహాని' వస్తుందని అప్పకవిలాంటి ఛాందసలాక్షణికుడు కూడా అంగీకరించాడు. [14] అందుకు మహాకవి ప్రయోగాలను కూడా అతడే అందిచ్చాడు. [15] కాకపోతే సంస్కృత ప్రాకృతాల విషయంలో చేసినట్లు రూపనిష్పాదనాదులను ఇతర భాషాపదాలను విషయంలో మన లాక్షణికు లెవ్వరూ చేయలేదు. అన్యదేశ్యాలను పరిహరించాలని ప్రయత్నించిన జొనాథన్ స్విఫ్ట్‌లాంటి పండితులందరూ విఫలప్రయత్నులే అయ్యారు. [16] మొదట్లో ఇతరభాషాపదాలైనా ఎరువు తెచ్చుకున్న తరవాత అవి తెలుగుమాటలే. వాటిని వాడటంలో తప్పులేదు. వాడినవాళ్ళు స్వభాష సరిగా రానివాళ్ళు కాదు.[17] ఎరువు మాటలుగా తమకు నచ్చిన లేదా తమరు ఆరాధించే పవిత్రమైన భాషలోని పదాలనే వాడాలనే 'ద్విభాషాపరిశుద్ధతావాదం' (bilingual purism) ప్రతి దేశంలోనూ ఉంది. అయితే ఆ వాదాదర్శం అసాధ్యంగా అగమ్యంగా మాత్రమే ఉంటున్నది.[18] నిరక్షరాస్యుల నిత్యవ్యవహారంలోనే ఎన్ని అన్యభాషాపదాలు దొర్లుతున్నాయో గమనిస్తే ఈ ఆదర్శం ఎంత అర్థరహితమో తెలుస్తుంది. ఇలాంటిదే మాండలికాల విషయంకూడా. నన్నయనాటినుంచి చిన్నయనాటివరకూ ఉన్న 'ప్రామాణిక' మహా కవుల ప్రయోగాల్లోనే ఎన్నెన్ని మాండలికపదాలు కనిపిస్తున్నాయో చిలుకూరి నారాయణరావుగారు, గిడుగు రామమూర్తిగారూ ఎత్తిరాశారు. [19] కవి సంఘజీవి. అతడు తనకు స్ఫురణకు వచ్చిన పదజాలంలో తన అభిప్రాయాన్ని స్పష్టంగా, విస్పష్టంగా అందించగల మాటలను ఎన్నుకొంటాడు. అవి మాండలికాలయినా వచ్చే ఇబ్బందిలేదు. ఒక మాటకున్న అర్థాన్ని ప్రకరణాన్నిబట్టి గ్రహించటం ఎప్పుడూ సాధ్యమే. అంతే కాదు. మాండలికపదాలన్నీ భాష అపభ్రష్టమైనందువల్ల ఏర్పడ్డవనుకోవటం పొరపాటు. ఒక్కొక్కప్పుడు, సాహిత్యపదజాలంలో లేని ప్రత్యేకార్థస్ఫూర్తిని అవి మాత్రమే కలిగించగలవు. [20] మాండలికాలను వాడినంత మాత్రాన కవితాశిల్పానికిగాని గౌరవానికిగాని లోపం రాదనటానికి వాటిని వాడిన

మన పూర్వకవులే నిదర్శనం. షేక్స్‌పియర్ కవితకు అందువల్ల లోపంలేదని క్రాటర్ అంటాడు.[21] సజీవ మాండలికాలను వాడటానికి అభ్యంతర మున్నప్పుడు గతానుగతిక సంకేతమయమైన నిస్సార గ్రాంథికరచనలు చేయటానికి అనంగీకారం అక్కరలేదా ? ఏ రచయితా పరప్రాంతీయులకు దురవబోధకమైన మాండలిక భూయిష్ఠ గ్రంథాలను రాయడు. నిజానికి ప్రపంచంలోని అనేకభాషలు ఏదో ఒక మాండలికంనుంచి ఏర్పడ్డవే. డాంటె టస్కన్ మాండలికంలో కవిత్వం చెప్పాడు. షేక్స్‌పియర్ లండన్ మాండలికంలో నాటకాలు రాశాడు. లాంకషైర్ మాండలికంలో వా, డార్సెట్ మాండలికంలో బార్నెస్, ఇంకా ప్రముఖంగా స్కాచ్ మాండలికంలో బర్న్స్ రచించారు (వ్యాసావళి, పే. 85) ఇలా అనేకం. అయితే తొలిదశలో మాండలికాలుగా ఉన్న భాషాభేదాలు కాలక్రమాన అనుకూలపరిస్థితుల్లో ప్రామాణికత్వాన్ని సంపాదించుకొంటాయి. అలాంటి పరిస్థితుల్లో గొప్ప రచయితల గ్రంథాల్లో సిమెంటువుల్లో ప్రవేశించటమే ప్రామాణికత. ఇష్టంలేనివారు మాండలిక రహితంగా రాయవచ్చునని అసలు రాయటమే మానతామనటంకాని, ప్రాచీన భాషలోనే రాస్తామనటంగాని అర్థరహితం.[22]

**9. 23.** గ్రాంథికవాదులు వ్యావహారికరచనలు సుబోధంగాలేవని ఆక్షేపించటాన్ని పరిశీలించాలి. పూర్వకవుల గ్రంథాలన్నీ ఒకే విధంగా అర్థమయ్యే స్థితిలోగాని, అర్థంకాని స్థితిలోగాని లేవు. ఆయా వ్యక్తుల అభిరుచులనుబట్టి, విషయాలనుబట్టి, రాసేతీరునుబట్టి, పాఠకుల అధికారాన్నిబట్టి అర్థంకావటమో కాకపోవటమో జరుగుతుంది. వ్యక్తినిష్ఠమైన ఈ లక్షణాన్ని ఒక వాదం మొత్తానికి ఆరోపించటం సబబుగాదు. వెయ్యి సంవత్సరాల నాటి భాషలో రాసిన కావ్యాదుల కన్నా నేటి వచనరచనలు ఎన్నోరెట్లు ప్రజాసామాన్యానికి కూడా అందుబాటులో ఉన్నాయన్నది వాస్తవం. ఆధునికభాషలో పఠనపాఠనాలు జరిగినా, రచనలున్నా ప్రాచీనసాహిత్యం క్రమంగా అర్థంకావటం మానివేసి సుదూరభవిష్యత్తులో నశిస్తుందనే భయమొకటుంది. అర్థంకాకపోవటమనేది ఇప్పుడూఉన్నది సాహిత్యం మీద అభిరుచిఉన్నవాళ్ళు ఎన్ని కష్టాలయినాపడి ఆదికాలంనుంచి సమకాలంవరకూ ఉన్న అన్ని రకాల రచనలూ చదువుతారు. అందరూ చదవకపోవచ్చు. అందుకు చింతించి ప్రయోజనం లేదు. ఎందుకంటే, ఒకనాడు చదువంతా సాహిత్యం,తర్కాది శాస్త్రాలూ మాత్రమే. ఇప్పుడో అశేషశాస్త్రాలు నేర్చుకోవలసివచ్చింది. శాస్త్ర విద్యాభిమానం ఉన్నవాళ్ళు తమకు ప్రత్యేకాభిరుచి ఉన్న ఏ ఒక శాస్త్రభాగాన్నో

అందులోని విభాగాన్నో ప్రత్యేకకృషి చేసి నేర్చుకొంటున్నట్లే, సాహిత్యాభిమానం కలవాళ్ళు తమకు నచ్చిన వాటిని చదువుకుంటారు. నిర్బంధంవల్ల చదువు రాదు. నిర్బంధంలేదని చదివేవాళ్ళు తగ్గరు. పూర్వకావ్యాలకు ఈ కాలపుభాషలో అర్థాలు చెప్పుకొని ఇప్పటిభాషలో అర్థంచేసుకొని వ్యాఖ్యానాలు రాస్తుంటారు. ప్రపంచ సాహిత్యం అంతటా ఇదే స్థితి.

**9. 24.** గ్రాంథికవ్యావహారికవాదాలవల్ల ఇరవయ్యో శతాబ్దంలోని తెలుగు భాషకు మేలే చేకూరింది. తొలి రోజుల్లో మంచి పుస్తకాలు ఆధునికభాషలో లేక పోయినా రాకపోయినా రచయితలు ఈ వివాదాలను పండితులకు వదిలివేసి తమకు నచ్చిన విధంలో అనేక నూతనసాహితీప్రక్రియలను తెలుగుకు ప్రసాదించారు. కొద్దిమంది సనాతనవాదులు ప్రాచీన కావ్యాభాషలో ఇప్పటికీ సాధన చేస్తున్నారు. మరికొంతమంది అరసున్నాలు, విసంధులు, బండిరాలు విసర్జించి అర్ధగ్రాంథికంలో పాఠ్యగ్రంథకర్తృత్వం కోసం పాకులాడుతున్నారు. అయితే నూటికి తొంభై మందికి పైగా ఆధునికభాషలోనే రాస్తున్నారు. మొదటమొదట కసిగా అన్యభాషా పదాలను విశృంఖలంగా వాడి గ్రాంథికవాదులను విసిగించాలని కొందరు ప్రయత్నించినా 1925 ప్రాంతాలనుంచి సరళసుందరరచన లనేకం వచ్చాయి. : వస్తున్నాయి. అయితే ఆధునికభాషాస్వరూప మేమిటని ప్రశ్నించవచ్చు. కృష్ణా గోదావరీ నదులకు ఆనకట్టలు కట్టగానే వ్యవసాయమూ, దానివల్ల ఆర్థికపరిస్థితులూ సాగరతీరంలో బాగుపడ్డాయి. రాజకీయప్రాబల్యం చేకూరింది. పత్రికలు అశేషంగా బయలుదేరేయి. ఆధునికప్రయాణసౌకర్యాలు, రేడియో వంటి వార్తాసౌకర్యాలూ ఏర్పడ్డాయి. పాఠశాలలూ కళాశాలలూ సంఖ్యాధికంగా పెరిగి ప్రజాసామాన్యానికి చదువు అశ్రమంగా లభించటం మొదలయింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పడగానే ఉన్నతవిద్య అందుబాటులోకి వచ్చింది. కందుకూరి వీరేశలింగంగారు తమకు తెలిసి సంఘసంస్కారాన్ని, తెలియకుండా భాషా సంస్కారాన్ని[23] తీసుకరావటం తరువాతి వారికి ఆదర్శమయింది. వేదం వేంకటరాయశాస్త్రిగారు 'ప్రాతోచితభాష' పేరిట అవ్యక్తంగానే ఆధునికభాషకు స్థానం కల్పించారు. గిడుగు వేంకటరామమూర్తిగారి ప్రచారధోరణి, గురజాడ అప్పారావుగారి రచనా ధోరణి ఎందరికో ఆదర్శమైనాయి. రచయితలు భావకవిత్వం నుంచి అభ్యుదయ కవిత్వంవైపు మొగ్గుచూపేసరికి ఆనాటి రాజకీయ వాతవరణం కూడా వ్యావహారికోద్యమానికి సహాయపడ్డది. రవీంద్రనాథఠాకూర్ వంగదేశంలో

జయప్రదంగా సాగించిన 'చలిత్ భాషా' ఉద్యమం, తరవాత తెలుగు దేశంలోకి అడ్డులేకుండా ప్రవేశించిన వంగగ్రంథానువాదాలూ అంతో ఇంతో ఇందుకు సహాయపడ్డాయి. ఆర్థిక రాజకీయ సాంఘిక సాంస్కృతిక వికాసాలకు మొదట బీజావాపనం జరిగిన తీరాంధ్రంలోనే భాషాభ్యుదయవాదంకూడా వచ్చినందువల్ల మొదటితరం రచయితల్లో రాజకీయనాయకుల్లో సంఘసేవకుల్లో అత్యధిక సంఖ్యాకులు అక్కడివారే అయినందువల్ల, ఆధునికప్రచారసాధనాలూ వార్తా సౌకర్యాలూ అక్కడే ఎక్కువగా ఉన్నందువల్ల, ఆ ప్రాంతపు భాషభేదమే ఆధునిక ప్రామాణిక భాషగా పరిణమించింది. ఈ శతాబ్దంలోనే తీరాంధ్రభాషే నేటి ప్రామాణికభాష అని గుర్తించటం జరిగింది.[24] ఇతర ప్రాంతాలనుంచి వెలువడే పుస్తకాల్లో పత్రికల్లో రేడియోలో సినిమాలలో ఇదే భాషాభేదం కొద్దిపాటి మార్పులతో కనిపిస్తున్నది-వినిపిస్తున్నది. గిడుగువారి ధర్మమా అని తెలుగు సాహిత్యానికి నూతనతేజం, భాషకు నూతనవికాసం కలిగేయి. శాస్త్రవిజ్ఞానాన్ని అందించటానికి, అధికారభాషగా ఆధునికప్రభుత్వయంత్రాంగాన్ని నడపటానికీ ఈ ప్రామాణికభాషే ఇప్పుడు ఉపయోగపడుతున్నది.

## జ్ఞాపికలు

1. (a) "Each of the southern languages has a poetical and a vernacular dialect which vary as widely as Saxon varies from English" -C. P Brown, Preface to Tel. - Eng. Dictionary, p. iv.

(b) 'It is a remarkable peculiarity of the Indian Languages that, as they begin to be cultivated, the literary style evinces a tendency become a literary dialect distinct from the dialect of common life with a grammar and vocabulary of its own" -Robert Caldwell, p. 4, as quoted by Gurajada, Minute of Dissent, p 54.

(c) "Hindu Grammarians, like those of China, neglect the colloquial dialect, which they suppose is already known to the student, and teach only the poetical peculiarities" -C P. Brown, Preface to a Grammar of the Telugu Language, p. 11.

(d) "In Telugu the dialect used in ordinary conversation differs so much from that used in grammatically written

books .... For the same reason a foreigner may be able to read and understand a Telugu book, but at the same time may be unable to converse with the Indians, or understand what they say to him. Owing to this great difference between the colloquial and the grammatical dialect, in the present work the former has been kept distant from the latter. – Arden in Preface to a Progressive Grammar of the Telugu Language. P- iv.

2. భాషాశాస్త్ర ప్రయోజనాన్ని వేదం వేంకటరాయశాస్త్రిగారిలాంటి సనాతన పండితులుగూడా 1915 నాటికి గుర్తించారు. "ఇటీవల మహాప్రాజ్ఞులు పాశ్చాత్య విద్వాంసులు కల్పించిన ఫైలాలజీ (Philology) పేరి సర్వభాషాశబ్దవ్యుత్పత్తి సంబంధాది విమర్శనశాస్త్రముచేత, దివ్యదృష్టి చేతనుంబలె, అద్భుత విషయము లనేకములు గోచరము లైనవి" (పు. 18) ; "కావున, ఈ నూతన శాస్త్రమందు నిష్ణాతత్వము వ్యుత్పత్తి సిద్ధికి మహోపకారకము ; ఈ శాస్త్రము శబ్దవ్యుత్పత్తులకు నికషోపలస్థానీయము" (పు. 19) - ఆంధ్రభాషాసర్వస్వార్థ నియమకతిపయములు.

3. అయితే ఉపయుక్తగ్రంథకరణసభవారు వి. శఠగోపాచార్యులు మొదలైన వారిచేత పరిష్కరింపించి పునర్ముద్రించిన 1856 నాటి భూగోళంలోనే విసంధి పాటించినందున, ఈ సభవారామోదించిన నూతనసంస్కారం ఏమీ లేదని చెప్పాలి.
(చూ. M. D. p. 18).

4. "When I say grammar and grammatical forms, I mean the traditional grammar of the Telugu Language and the forms sanctioned by it and employed by modern popular prose writers like Viresalingam and Lakshminarasimham" ... K. L. Rao in his 'Memorandum on Modern Prose', as quoted by Gurajada, M. D.' p. 1, "In para 11 he (KLR) says that the new school of linguistic reform has no grammar of its own. Here he probably means a a trealise on grammar" – G. V. Appa Rao, M. D., p.52.

"The new School pointed out that grammar is not a fixed unchanging scheme but a body of rules deduced from usage ; as usage changes, so must grammar change; and when you have the perfect, perpectual, immutable grammar, the language is dead." ...A. Galletti in "Grāmyam and Grammar in Italy', వ్యాస సంగ్రహం, పే.14.

5. "In considering the use of grammer as a corrective of what are called ungrammatical expressions, it must be bcıne in

mind that the rules of grammar have no value except as statements of facts; whatever is in general use in a language is for that very reason grammatically correct. A vulgarism and the corresponding standard or polite expression are equally grammatical each in its own sphere if only they are in general use. But whenever usage is not fixed whenever we hesitate between different ways of expression or have to find a new way of expression then grammar comes in and helps us to decide which expression is most in accordance with the genius of the language, least ambiguous, most concise' or in any other way better fitted to express what is required" –Henry Sweet's 'New English Grammar', part 1, p. 5, as quoted by Gurajada, MD' p. 47.

"We do not study grammar in order to get mastery over our own language, because in the nature of things we must have that mastery before we begin to study grammar at all, nor is grammar of much use in correcting vulgarisms, provincialisms and other linguistic defects, for these are more dependent on social influences at home and at school than grammatical training" - I bid., p. 4 & 5.

"Dr. Johnson in the plan of his dictionary issued in 1747, declared that one end of his undertaking was; 'to fix the English language'. But a man could not compile a vocabulary of the tongue without learning something of the nature of speech. By the time he finished his work, he had been cured of this particular error. It seemed impossible for most men of the past–the impossibility continues for most men of the present to-comprehend the elementary principle that in order to have language become fixed, it is first necessary that those who speak it should become dead, at least intellectually, if not physically. Then indeed it can undergo no change for there is no one to change it" —Lounsbury in 'The Standard of Usage', p. 143, as quoted by G. V. Ramamurti, *Vyasavali*, p. 98-102

"To change the rules of grammar first, and to seek to change usage in accordance with such change is an impossible process in respect of a living language and wanton vandalism in respect of a language that is dead" —Gurajada. M. D, p. 51-52,

6. (a) "It will perhaps be desirable to fix a time-limit and rule that no book written after that limit should be

quoted from. This will shut out almost the whole of Telugu liteurature which is quite recent and can not lay much claim to authority"—J. Ramayya in *Defence of Literary Telugu* p. 3

(b) "గ్రామ్యములని తెలుపుటకేనియు విచ్ఛిత్తివిశేషముంబట్టియేనియు, కొన్ని గ్రామ్యములను, వాక్యములంగూడ, గ్రహింపవలయును" (పే. 4)..."ఆంధ్ర దేశ్యములవలెనే అన్యదేశ్యములును ప్రయోగవ్యవహారరూఢములు నిఘంటువున నుండవలసినవే" (పే. 8).... "సంస్కృతమందును అన్యభాషాపదములు కలవు" (పే. 11).

(c) "వ్రాతలలోను అచ్చులోను ఉన్నమాత్రాన శాస్త్రోక్తలక్షణవిరుద్ధమును ప్రమాణీకరించుట సాధుమతముగాదు. "శాస్త్ర ప్రయోగవచసోః శాస్త్రం బలవ దుచ్యతే, అనిష్పన్నపదే తేన ప్రయోగాశ్రయణం హితమ్" (పే26)- వేదం వేంకటరాయశాస్త్రి, 'ఆంధ్రభాషాసర్వస్వార్థనియమకితిపయములు'

(d) "అనుకరణం హి శిష్టస్య సాధుర్భవతి. అశిష్టాప్రతిషిద్ధస్యవా. నైవ తద్దోషాయ వా నాభ్యుదయాయ. యథాలౌకికవైదికేషు" (పతంజలి) - పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, 'ప్రాకృతగ్రంథకర్తలూ. ప్రజాసేవానూ', వ్యాససంగ్రహం, పే. 175.

(e) "లోకేతు సర్వభాషాభి రర్థా వ్యాకరణాదృతే, సిద్ధ్యంతి వ్యవహారేణ కావ్యాదిష్వ ప్యసంశయం-నచ లక్షణ మస్తీతి ప్రయోక్తవ్య మలౌకికం" కుమారిలభట్టు, 'తంత్రవార్తికం'- అందే పే. 179.

7. See Madras Times, May 17, 1912 : ".. there is no need for the reform as there is, strictly speaking, no such thing as spoken as different from written Telugu"—as quoted by G. Appa-Rao, M. D., p. 53.

8. (a) "ఇట్టి మార్పులన్నిటికి ప్రవాహరూపముననుండు వ్యవహారమే కారణము. ఈ ప్రవాహమును నివారింప శక్యము గాదు. నివారింప యత్నించుట సమంజసము గాదు. ఇట్లు మాఱుచున్న శబ్దములను వాని యర్థములను గ్రహించుచు దీనినిబట్టి వ్యవహారబలమున నెట్టిదో వాని పరిగ్రాహ్యతను లోకమునకు బోధించుచు నానందించుట మాత్రమే భాషాతత్త్వజిజ్ఞాసువులకు గర్తవ్యము' -దువ్వూరి వేంకటరమణశాస్త్రి, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1925 (నవ్యాంధ్ర సాహిత్యవీథులు. 2-192).

(b) "అన్ని వ్యాకరణములకంటె విపులమగు పాణిని వ్యాకరణముగూడఁ బూర్ణముగను నసందిగ్ధముగను, భాషను సంస్కరింప సమర్థము కాకపోయెను. ఈవిషయ మాకృతిగణములు చెప్పుటవలనను, 'పృషోదరాదీని యథోపదిష్ట' మ్మనెడి సూత్రమువలనను, దత్సూత్రభాష్యమువలనను స్పష్టమగుచున్నది. (పే. 277)...ప్రకృతము బంగాళాభాషను సంస్కరించి యందు నూతన గ్రంథములను వ్రాయుట యెల్లరకుం దెలిసినదే. ఇట్లే ప్రాచీన కర్ణాటమనియు నూతన కర్ణాటమనియు విభాగము గలిగనది. ప్రకృతమగు నాంధ్రభాషలోను 'దేశ్యము' 'గ్రామ్యము' అని విభాగించిరి. ఈ విభాగమునకుఁ దాత్పర్య మాలోచింపఁగా నాంధ్రదేశమునం దంతటను వాడుకలోనుండు పదములు దేశ్యములనియుఁ గొన్నికొన్ని గ్రామములలో మాత్రము వాడుకచేయఁబడు పదములు గ్రామ్యములనియు, గ్రామ్యపదములను గంథములలో వ్యవహరించినచో నా గ్రంథమునందఱిటను విదితములు కావుగనుక వానిని విడిచి దేశమంతటను దెలిసికొనఁదగు దేశ్యపదములను వ్యవహరించుట సకలాంధ్రదేశోపకారమనియుఁ బ్రాచీనుల యభిప్రాయమని నిశ్చయింప నవకాశము కలదు. నగరములందును, నగరప్రాంతగ్రామములందును, వాడుకచేయబడు భాష దేశ్యమనునట్టి కేతన కిదియే యభిప్రాయమని చెప్పవచ్చును. ఎట్లనఁగాఁ బట్టణములలో నుండు జనులకుఁ బరస్పర సంబంధముండినట్లు పల్లెలలో నుండువారి కుండదు. పరస్పర సంబంధమున్నప్పుడు భాష యేకీభవించుట కవకాశము గలదుగాన నట్టి భాష దేశవిదితమని కేతన యూహించినట్లు చెప్పవచ్చు. అట్లు కానిచో దేశ్య శబ్దసారస్యమునకు భంగముకలుగును. (పే. 278)....ప్రాచీన కవులకట్టి స్వాతంత్ర్యముండుటను, ప్రకృత కవులకు లేకుండుటకును, గారణమందునా? గ్రంథకర్తలు కాకున్నను బ్రాజ్ఞులగు నాగరకు లార్యులు కాకుందురా? వారి వ్యవహారము గూడ నేల గ్రాహ్యము కాఁగూడదు? (పే. 280)—భాషయనఁగా స్వాభిప్రేతార్థము నితరులకు వ్యక్తపఱచుటకై యుచ్చారితవర్ణసమూహము కాని వర్ణానుమాపక రేఖాసముదయము కాదు. ఈ నిర్వచనమును, మహాభాష్యము నందుఁబతంజలి 'యే నోచ్చారితేన సాస్నాదిమానర్థః ప్రతీయతే స శబ్దః' అను గ్రంథముచే స్పష్టపఱచెను. 'ఉచ్చారిత ఏవ శబ్దః ప్రత్యాయకో నానుచ్చారితః' అను భాష్య గ్రంథముగూడ నీ నిర్వచనమునే సూచించుచున్నది. ఉచ్చారణభేదము లేనిచో లిపిభేదము శబ్దభేదప్రయోజకము కానేరదు. ప్రకృతకాలమున నర్ధానుస్వారరేఖ యుచ్చారణభేదజ్ఞాపకము కాకుండుటచే నిది యనావశ్యకము (పే. 282)....ఇట్లే శకటరేఫ మనావశ్యకమని యూహించునది" (పే. 283)—తాతా సుబ్బరాయశాస్త్రి, 'ఆంధ్ర భాషా సంస్కరణము', ఆం. సా. ప. ప. సం. 2, సం. 3 (1912).

(c) "పూర్వ వ్యాకరణము లనుటచే....మహాభారతమే గ్రామ్యపద భూయిష్ఠము గావలసివచ్చును. (పే.388)....సద్వ్యవహారమున నున్న భాషానియమము నెత్తి వ్రాసిన నదియె వ్యాకరణము. కాబట్టి తత్తత్కాల వ్యవహార భాషకుఁ దత్తత్కాలిక వ్యాకరణములు ప్రమాణమయి యుండును (పే. 389)... పురాతనాంధ్రవ్యవహార కాలమున ననాగరకవ్యవహారస్థము లగుటచే నవి గ్రామ్యములే యైనను వానిలో 'పంపేరు' తెంపేరు, చూసేరు, ఇస్తిని' మొదలగు పదము లిప్పటి నాగరకవ్యవహారభాషలోఁ బ్రవేశించినవి గనుక నవి యీ భాషలో గ్రామ్యములు కావు. తక్కిన 'యినుతి, యిందాము, సూసేరు' మొదలగు పదము లిప్పటికిని గామ్యజన వ్యవహారమాత్రస్థలములే యగుటచే నవి యీ భాషయందును గ్రామ్యములే యనుట నిర్వివాదాంశంము (పే. 391)—వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి, 'ఆంధ్రభాష', ఆం. సా. ప. ప. సం. 2, సం. 4 (1912),

9. (a) "In the first Christian centuries the influence of Latin was so overpowering in official life and in the schools that it obstructed a natural development. But soon after the 3rd century, the educational level rapidly sank, and political powers broke the power of not only of Rome, but also of its language. The speech of the masses, which has been held in fetters so long, now asserted itself in full freedom and with elemental voilence, the result being those far-reachaing changes by which Romantie languages are marked off from Latin. Language and nation or race must not be confounded"— Pucariu as quoted in *Language, its Nature, Origin and Development* Otto Jesperson, p. 206.

(b) "ఏ రూపమున భాషయుండవలయును-చేయుచు అని వ్రాయవలెనా, చేస్తూ అనియా యనునది యల్పవిషయము. ఏ రూపమున వ్రాసినను అభ్యంతరము కలుగదు. భాషకు ఏక విధమయిన ప్రామాణికత్వము వెలయవలయును. ఆ ప్రామాణికభాషకే ఒక్కతీరుననే వ్రాతయు, మాటయు శ్రేష్ఠులలోనైన నుండవలయును. అప్పుడు వారినే సామాన్యు లనుకరించుటచే భాషకు ఉన్నతికలుగును. మార్పువిషయమున భాషాచక్రము వెనుకకు తిరుగదనియు, ముందునకే పోవుననియును భాషావిదుల యనుభవము" —గం. జో. సోమయాజి, ఆం. భా. వి. (1969). పే. 597.

10. "పేరున్నవో లేనివో యుండఁదగినవో కానివో, యేవో కొన్ని గ్రంథములను గ్రాంథికవాదులే వ్రాసిరిగాని గ్రామ్యవాదులు వ్యావహారికభాషాశబ్దార్థవిషయకపూర్వపక్ష

సిద్ధాంతములతోడనే కాలము వ్యర్థసేయుచున్నారు." —పానుగంటి, 'ప్రకీర్ణోపన్యాసములు' పే. 255.

11. (a) "గ్రాంథిక, వ్యావహారికములనుపేర 1918 సంవత్సరమున నుండిన వైమత్యము 1948లో చాలవఱకు నశించిపోయినది. 1968లో ఆ భేదమే చెప్పుకొనవలసిన యవసరములేదు. అయినను కొందరు మృతసర్పములను మోదువారు ఎప్పుడైనను ఆ భేదమును స్వలాభముకొఱకు పేర్కొను చున్నారు. ప్రజారంజనముకొఱకు బయలుదేరిన సినిమాలు, రేడియో ప్రసారములు, వారపత్రికలు, దైనికపత్రికలు భాషకొక నూతనస్థితిని తెచ్చిపెట్టినవి.... చక్కని నుడికారము సిద్ధమగుచున్నది. అది మనము మాటాడుభాషకు విశేషము దూరముకాక, మాండలిక భేదములను తొలగించి, మధురమై విశిష్టముగా నున్నది." —గం. జో. సోమయాజి, ఆంధ్రభాషా వికాసము (1968), పే. 598.

(b) "A natural National Language, spoken and written, means that the whole people can join in the work of developing national civilization and reap its fruits, as homely and intelligible" -Sten Konow, వ్యాససంగ్రహం, పే. 29.

(c) "Clevage between the spoken and the literary language can not but have the most disastrous effects on all higher education" —Otto Jesperson, *LNOD*, pp: 300, 301.

12. (a) "A common nation holds that great writers, such as Shakespeare and Milton, are the architects of the English language; that is that individuals of special literary ability are those primarily responsible for the shape a language takes in the mouths of subsequent generations of ordinary speakers. This theory... is held with amazing tenacity by some scholars. Yet there is not a shred of evidence in its support..." —Charles F. Hockett: *A Course in Modern Linguistics* (1958), p. 563.

(b) "The architects of our language are not literary artists, but the masses of people who use the language for every day purposes. The greatness of a literary artist is not measured in terms of his stylistic novelty... but by the extent to which he can develop freedom and

variety of expression within the constraints imposed by the language. So far as language is concerned, the 'greatest of literary artists is infinitely more a receipient than a donor" —Ibid: p. 564.

13. ".....mass importation from another dialect or language is very comman" —Ibid, p. 403.

14. అప్పకవీయము, 1-64 నుంచి 1-67 వరకు.

15. అదే, 1-68 నుంచి 1-67 వరకు.

16. గిడుగు వ్యాసావళి, పుట. 98.

17. "కాలముఁబట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశభాషాలలితాంగి మాఱుటది సత్కవి సమ్మతమౌట, నన్యదేశ్యాలను నాంధ్రభాషఁ గలపౌటను, నౌచితిఁబట్టి మేము కవ్యాలను వాడుచుంటిమని పండితులేగతి నొప్పకొందురో"-తిరుపతి వేంకటకవులు, వ్యాసావళి, పే. 75 ; అన్యదేశ్యాలకోసం, చిలుకూరివారి 'ఆంధ్రభాషా చరిత్రము' 1. 575-621.

18. "..... It should be recognized that the bilingual purist pursues an unattainable ideal" —Hockett, p. 419.

19. ఆంధ్రభాషాచరిత్రము, ఉత్తరాంధ్రము, 2.1681-1746 ; బాలకవి శరణ్యము, 272-74.

20. (a) "It has been one of the fatal mistakes in the Science of Language to imagine that dialects are everywhere corruption of the literary language. Everywhere there has been a literary language, dialects are by no means mere modifications of it" —Max Muller, *Science of Language* ,1.58.

(b) "When literary languages have stereotyped one general term, their dialects will supply fifty, though each with a special shade of meaning"—Ibid.

(c) ''Popular dialects, in spite of many archaic details, are on the whole further developed than the various standard languages with their stronger tradition and literary reminiscences"— O. Jesperson, *LNOD* p. 68.

21. "......that it is not fatal to poetry is seen in the language of Shakespere" —Kranter as quoted, Ibid., p. 322.

22."మాండలిక భేదము లుంటే నిఘంటువులు వ్రాసి వాటిని చూపండి"-తాతా సుబ్బరాయశాస్త్రి 'శిష్టభాష', ప్రతిభ, నవంబరు 1936, పే. 176.

గిడుగు వేంకటరామమూర్తి, వ్యాసావళి, పే. 156-157 ; బాలకవిశరణ్యము, పే. 271-274. ఇప్పుడిప్పుడే 'మాండలికవృత్తి పదకోశ' సంపుటాలు ఒకదానివెంట ఒకటి వెలువడుతున్నాయి. మాండలిక పదాలను సాధ్యమైనంత త్వరలో వీలయినంత ఎక్కువగా పోగుచేసి నిఘంటుబద్ధం చేయాల్సి ఉంది.

23. See MD., p. 65; G. V. Appa Rao in MD, p. 85. says about him ; "The author was hardly conscious that he led a reform in the world of letters, nor seemed to realise the magnitude of the problems which were raised by that reform."

24. (a) "The Telugu spoken in the Krishna and Godavasi Districts, which is the purest and most largely used, has been taken as the standard" —Arden in his grammar, as quoted by G. V. Appa Rao, MD, p. 43.

(b) "The dialect spoken in the Northetn Circars is usually considered, the purest form of the language"—Grierson, LSI, 4. 577.

(c) "It is spoken and written in its purity along the coast strip between Nellore and Vizagapatanam and in the four districts of Madras Presidency included within these limits" -K. Veeresalingam on p. iv to his intro- to Brown's Tel. -Eng. Dictionary, second revised edition, as quoted by G. V. Appa Rao, MD. p. 43.

ప్రకరణం 10

# తెలుగులోని వైకృత పదాలు

—తూమాటి దోణప్ప

**10.0.** భాషా విషయంగా ఏ మానవ సమాజానికి కూడా స్వయం సమృద్ధతా; స్వయం సంపూర్ణతా అసంభవం. ప్రపంచంలోని అన్ని భాషలూ అన్యోన్యాశ్రయాలుగా పెంపొందుతాయన్నది చారిత్రక సత్యం. స్వచ్ఛమైన జాతి అన్నది ఎలా అరుదో, అలాగే పరభాషాస్పర్శకు లోనుగాని స్వచ్ఛమైన భాష అన్నది కూడా చాలా అరుదు. కొద్దో గొప్పో ప్రతిభాషమీద పరభాషల ప్రభావం తప్పని సరిగా ఉంటుంది. అందువల్ల ఏభాషలోనయినా పదజాలము(vocabulary) దేశ్య (indigenous) మనీ, దేశ్యేతర (non-indigenous) మనీ రెండు రకాలుగా ప్రవర్తితమవుతూ ఉంటుంది. మూల మాతృకనించి నిసర్గంగా-అంటే పైతృకంగా సంక్రమించిన పదజాలం దేశ్య భాగమని (Basic core vocabulary or inherited vocabulary) నిర్ధారించవచ్చు. ఆ యా భాషల చారిత్రక వికాసదశలలో సమీపవర్తి సజాతీయ భాషలనించిగాని, పరిసరస్థ విజాతీయ భాషలనించిగాని, మత సాంఘిక వాణిజ్య రాజకీయ సాంస్కృతికాది సంబంధాల మూలంగా దూరవర్తిభాషల నించిగాని ప్రత్యక్షంగానో పరోక్షంగానో వచ్చిచేరిన పదసముదాయాన్ని (acquired vocabulary) దేశ్యేతర భాగమని నిర్దేశించవచ్చు. ఈ రెండు విధాలయిన పద జాలంవల్ల భాష సుసంపన్నమై తత్తత్కాలోచితంగా వ్యవహర్తల భావ ప్రకట నావశ్యకాలను నిర్వహించ సమర్థమవుతూ ఉంటుంది. అన్ని భాషలకూ వర్తించే సర్వవ్యాపక సూత్రమిది. తెలుగు భాషగాని మరొక భాషగాని దీనికి అపవాదం కాదు. విశ్వవిజ్ఞానాన్ని తమ సంస్కృతిలో ఇముడ్చుకోవాలనే తెలుగు వాళ్ళ జ్ఞాన పిపాసకు నిదర్శనంగా ఎన్నెన్నో భాషలనించి భిన్నభిన్నయుగాలలో వేలాది పదాలు తెలుగులోకి ఎరువు తీసుకోబడ్డాయి.

అయితే కొన్ని భాషలు ఇతర భాషాపదాలను అతివేలంగా ఎరవు తెచ్చుకుంటాయి; కొన్ని పరిమితంగా ఎరువు తెచ్చుకుంటాయి: కొన్ని అనూదితాదానాలు (loan translations) గా స్వీకరిస్తారు. పరభాషలపట్ల దేశీయులు చిత్తవృత్తులు పరిపరి విధాలుగా ప్రవర్తితమవుతుంటాయి. పరభావ సహిష్ణుత, పరభాషా సంస్కృతుల యెడలగల ఆసక్తి, పరభాషాధ్యయన నిరతి, స్వీయ భాషలలోని భావ ప్రకటనశక్తి, నూతనభావ ప్రకటనావశ్యకం–ఇత్యాద్యనేక హేతువులపై ఎరవుపదాల రాకడ, వాటి నిలకడ ఆధారపడి ఉంటాయి. ఎరవు మాటలను స్వీకరించడం భాషాసాంకర్యమని భావించే 'స్వస్థానవేషభాషా' ప్రియులు దీనికొప్పుకోక నిరోధించినప్పటికీ, పరభాషాపదాల రాకడనుగానీ, వాటి ప్రచుర ప్రవృత్తినిగానీ సంపూర్ణంగా నివారించడం సులభసాధ్యమైన పని కాదు.

**10.1.** ద్విభాషా వ్యవహారానికిగాని, బహుభాషా వ్యవహారానికిగాని విభిన్న భాషల సంసర్గమే మూలకారణం. రెండు సమాజాల సమ్మేళనంలో సంస్కృతి ప్రసారణం (Cultural diffusion) ప్రవర్తితమవుతూ ఉంటుంది. భాషా సంసర్గం ఈ సాంస్కృతిక సంబంధాలలో ఒకటి. దీని ఫలితాలలో ప్రముఖమయినవి భాషలలోని పరస్పర ప్రభావ వినిమయాలు. సంప్రదాయ సిద్ధ నిర్మాణానికి విరుద్ధ లక్షణాలుకన్పిస్తే దాన్ని ఆదానం అనవచ్చు (Bloomfield, 1933). ఒక భాషలోని ఏ నిర్మాణ భాగమైనా ఇతర భాషలవల్ల ప్రభావితమయితే దాన్ని సైతం ఎరవు తెచ్చిందనవచ్చు (R.A. Hall, 1964). ఒకటో రెండో కొత్త అంశాలు అదనంగా చేరడమేకాక అనాదిగా వస్తున్న కొన్నింటికి ఉద్వాసన చెప్పడమో, లేక కొద్ది మార్పులతో వ్యవహరించడమో సంస్కృతి పరిణామ క్రమంలో సహజంగా జరిగే విషయాలు. భాషలలోని ఈ ఆదాన ప్రదానానికి ద్విభాషా వ్యవహర్తలను మూలంగా పేర్కొనవచ్చు. ద్విభాషా వ్యవహారాన్నే ద్విభాషాస్థితి (bilingualism) అని అనవచ్చు. సమీపవర్తిభాషలకు సంసర్గం అతిసహజం. రాజకీయంగా సాంస్కృతికంగా ఉన్నతస్థానంలో ఉన్న భాష దూరవర్తిగా ఉన్నప్పటికీ ఆ భాషా ప్రభావం ఇతర భాషలమీద పడితీరుతుంది. సంసర్గంలోని ప్రకృష్టభాష (upper or dominant language)సామాన్యంగా విజేతలదో విశిష్టులదో అయిఉంటుంది. కొన్ని కొన్ని వేళలలో విజితులభాష సాంస్కృతికంగా పైచేయిగా ఉంటే అది విజేతల భాషనుకూడా కొంతలో కొంత ప్రభావితంచేస్తుంది.

**10.2.** ఒక మాండలికంగాని, భాషగాని, మరొక మాండలికం, లేక తదంతర్గతమయిన వైయక్తిక వ్యవహారం (idiolect) నించిగాని మరొక భాష నించిగాని పదాలను ఎరవు తెచ్చుకోవడం, మామూలుపాతను పునరుద్ధరించడానికో, లేక హేళన చేయడానికో, పాతకాలపు సన్నివేశాలను పాత్రోచితంగా, రసోచితంగా చిత్రించడానికో ఒక భాషలో వ్యవహార విదూరమైన పూర్వయుగాలలోని పాతవడ్డ మాటల (archaisms) ను కొందరు కవులూ, పండితులూ ఎరవు తెచ్చుకోవడం కద్దు. అలాగే ఒక భాష మరొక భాషనుంచి ఎరవు తెచ్చుకోవచ్చు. ఒకే భాషలోని రెండు మాండలికాలమధ్య, లేక ఒకే మాండలికంలోని విభిన్న వైయక్తిక రూపాల మధ్య ఆదానప్రదానాలు అసాధారణం కావని శాస్త్రవేత్తలు స్పష్టపరిచారు (Hockett1958-403: Sturtevant, *Introduction to Linguistic Science*, 1947: 148). ఒకే భాషలోని వేర్వేరు మాండలికాలనుంచిగాని(dialect borrowing), అవే భాషయొక్క పూర్వదశలనించిగాని మాటలనుఎరవు తేవడాన్ని బహిర దానం (external borrowing) అని పరిభాషిస్తున్నారు. (Robert A. Hall *Jr. Introductory Linguistics*, 1964:319). రూపసామ్యం కారణంగా ఒక భాషయందలి ఒక దశలో పదాలను సృష్టించడం అంతరాదానం (internal borrowing) అని అంటున్నారు (*Ibid* : 323-327). భాషల సంసర్గ స్వరూప స్వభావాల స్థాయీభేదం ఎలాంటిదయినా, ఈ ప్రభావం భాషాంగాలన్నింటా ఏక రూపంగా ప్రసరించదు. సాధారణంగా భాషలలోని పదజాలం ఈ ప్రభావానికి లోనవుతూంటుంది. అందులోనూ మూర్తపదార్థబోధకాలు విరివిగా వినిమయ మవుతూ ఉంటాయి. వర్ణనిర్మాణంలోకూడా ఈ ప్రభావం ఉండక తప్పదు. రూప నిర్మాణంలోను, వాక్యరచనలోను సంసర్గప్రభావం ఉత్తరోత్తరా విరళంగా కన్పి స్తుంది. సంసర్గంలోని రెండుభాషల నిర్మాణరీతుల యందలి వైషమ్యం ఎంత అధికంగా ఉంటే పరిణామస్థాయి అంత అధికంగా ఉంటుంది. సజాతీయభాషలూ, విజాతీయభాషలూ అనే విచక్షణతో నిమిత్తంలేకుండా అన్ని వాగ్రూపాలకీ ఈ పరి ణామ ప్రక్రియ ప్రవర్తిస్తుంది.

**10.3.** అయితే ఒకవ్యక్తియొక్క వాగ్వ్యాపారంమీద అనేక భాషా వ్యవ హారంవలని ప్రభావం, అనేకానేక ఇతర కారణాలవల్ల మారుతూ ఉంటుంది. వీటిలో కొన్ని భాషాతీత విషయాలుకూడా లేకపోలేదు. భాషాతీతాంశాలనుకూడా పరిగణన లోకి తీసుకున్నప్పుడు సాంస్కృతిక ప్రసారణం, పరభాషానిరోధం-ఇత్యాద్యంశాల

సమగ్ర కథనం సాధ్యపడుతుంది. ఒక వ్యక్తికి పరభాషాసంస్కృతుల యెడగల దృష్టి, పరభాషాధ్యయనంపట్లగల శక్త్యాసక్తులూ, బహుభాషా వ్యవహర్తల సంఖ్యా, సమాజంలో వీరికిగల స్థానం, వీరి సాంఘిక నియమాలు-మొదలైన అనేకాంశాలను భాషాతీత విషయాలుగా చెప్పుకోవచ్చు. ఇలాంటి విస్తృతమైన ప్రాతిపదికగల ఆర్థిక మానసిక సామాజిక సాంస్కృతిక నేపథ్యంతో భాషల సంసర్గాన్నీ దాని ప్రభావాన్నీ సరిగా అవగాహన చేసుకోవలసి ఉంటుంది. కేవలం భాషావిజ్ఞానం తోడ్పాటు వల్లనేగాక, అన్యోన్యాశ్రితాలైన ఇతర అనుబంధ శాస్త్రాల (related disciplines) అదనపు సాయంవల్లనే సంపూర్ణమయిన ఈ అవగాహన సాధ్యమవుతుంది. పరిమిత ప్రయోజనాలదృష్ట్యా ఈ శాస్త్రాలు వేర్వేరైనప్పటికీ, అనేక ప్రమాణాలతో కూడిన ఈ సదవగాహనను సరిగా ప్రవర్తింపజేయాలంటే ఇతర శాస్త్రాలన్నింటినీ పరిపూరకాలు (Supplementary)గా ఉపయోగించుకున్నప్పుడే వీలవుతుంది. ఈ అన్ని రీతులకి చక్కని సమన్వయం సమకూర్చి పరిశీలిస్తేనే ప్రకృత సమస్యయొక్క సమ్యక్స్వరూపం బోధపడుతుంది.

**10.4.** భాషలసంసర్గప్రభావం చాల మట్టుకు ఏకపక్షవర్తిగానే ఉంటుందనడానికి ప్రపంచ భాషల చరిత్రలనించి అనేకోదాహరణాలు ఉట్టంకించవచ్చు. అరబ్బీ, గ్రీక్, చీనీ, లాటిన్, సంస్కృతం-ఈ అయిదు భాషలే ప్రపంచ సంస్కృతి వాహక సాధనాలుగా అగ్రశ్రేణి భాషలని శాస్త్రవేత్తల అభిప్రాయము. హీబ్రూ, ఫ్రెంచి భాషలు ఈ విషయంలో ద్వితీయ స్థానానీ ఆక్రమిస్తాయి. (Edward Sapir, 1921 :194). ఇస్లాం సంస్కృతి వాహకమైన అరబ్బీభాష మధ్యప్రాచ్యంలోని తుర్కీ పారశీకాది భాషలపై నెరపిన ప్రభావం అంతాఇంతా కాదు. కాని, దీనికి మారుగా అరబ్బీభాష పూర్వోక్తభాషలనించి ఎరవు తెచ్చుకున్నది ఇంచుమించుగా ఏమీ లేదనే చెప్పాలి. నూతన వైజ్ఞానిక పరికరాలకూ, నూతనౌషధాలకూ, వాటి నిర్మాణ ప్రక్రియలకూ నామకల్పన చెయ్యడంలో గ్రీకు లాటిన్ భాషల ప్రాధాన్యం నానాటికీ పెరుగుతూనే ఉండడం మనం ప్రత్యక్షంగా గమనిస్తూనే ఉన్నాం (Sapir, 1921:194; Earnst Klein *Etymological Dictionary of English Language*, Vol. I. Introduction, pp. X-XII). చీనాభాష శతాబ్దుల తరబడిగా జపానీ, కొరియన్, అన్నామైట్ భాషలను తన పదజాలంతో ముంచెత్తింది. చీనీ భాషాపదం లేకుండా జపానీ భాషలో ఒక్క వాక్యమైనా రచించడం దుస్సాధం అని పరిశీలకులంటారు. అయితే దీనికి బదులుగా ఈ భాషలనించి చీనీ

భాష స్వీకరించింది దాదాపు శూన్యమనే చెప్పాలి (Sapir : 192). అలాగే సంస్కృతభాష ద్రావిడ భాషలపై ప్రదర్శించిన ప్రభావం అనన్యమయింది. సంస్కృతాది హింద్వార్య (Indo-Aryan) భాషలనించి ద్రావిడ భాషలలోనికి ప్రవేశించిన అపారమైన పదజాలంతో పోల్చి చూస్తే, ద్రావిడ కుటుంబభాషలనించి హింద్వార్య భాషలలోకి వెళ్ళిన పదజాలం అత్యల్పమని అంగీకరించక తప్పదు (Kittel. *Kannada-Eng. Dictionary*, Preface; T. Burrow, *Sanskrit Language*, 1955 : 387, 388). భారతీయభాషలలో శాస్త్రగ్రంథాలు తయారవుతున్న ఈ ఆధునికయుగంలో సైతం మన రచయితలు, అనువాదకులు, పరిశోధకులు, పరిభాషా కల్పనకి 'అన్యథా శరణం నాస్తి' అని సంస్కృతాన్ని ఆశ్రయించక తప్పడంలేదు. ఈ విధంగానే మధ్యయుగాలనాటి ఫ్రెంచిభాష ఆంగ్లాది భాషలపై చూపిన ప్రభావంకూడా పరిగణించదగ్గదేగాని, ఫ్రెంచిభాషపై ఆంగ్లప్రభావం అస్తి నాస్తి విచికిత్స (Sapir : 193). ప్రాచీనాంగ్లభాష మత సంబంధి పదజాలాన్ని ఎక్కువగా లాటిన్ భాషనించి ఎరవు తెచ్చుకున్నది. అట్లే పాలీ సంస్కృత భాషల వాసనలేని బర్మీ సయామీ భాషలలోని రచనా వ్యాసంగం దురూహం (Sapir : 194).

అయితే కొన్ని భాషలు అన్ని విధాల తమకంటే అత్యున్నతమైన భాషలతో సంసర్గం కలిగి ఉన్నప్పటికీ పదాలను ఎరవు తెచ్చుకోవడంలో ఎంతో వైముఖ్యాన్ని ప్రదర్శించినట్లుకూడా గమనించవచ్చు. ఉదాహరణకి టిబెటిన్, కంబోడియన్ భాషలను సంస్కృతభాషా సాహచర్యం చాలా అధికం. కంబోడియన్ భాషలో వేలకొలది సంస్కృతపదాలు చోటు చేసుకున్నవి. టిబెటన్ భాషలోని ప్రాచీనసాహిత్యం భారతీయ సాహిత్యానికి, ముఖ్యంగా బౌద్ధమత ధార్మిక గ్రంథ సంచయానికి అనువాదప్రాయమయినప్పటికీ టిబెటన్ భాషలో సంస్కృతపదాలు గాని, పాలీ ప్రాకృతపదాలుగాని అత్యల్పంగా వాడుక చేయబడ్డాయి సంస్కృత పాలీ ప్రాకృతపదాలన్నీ టిబెటన్‌భాషలోని దేశ్యపదాలలోనికి అనువదించే ఒక నిర్దిష్ట కఠోర వైఖరి దీనికి హేతువుగా నిరూపించబడ్డది (Sapir, 1921: 196& 197; Weinreich 1953: 61). ఈ వైముఖ్యానికిమరికొన్ని ఉదాహరణలనుకూడ చూడవచ్చు. మధ్యయుగాలలో ఇంగ్లీషు, జర్మన్ భాషలు మాతృభాషలుగా వ్యవహారంలో ఉన్న దేశాలమీద ఫ్రెంచి, లాటిన్‌భాషల ప్రభావం దాదాపు తుల్యంగానే ఉన్నప్పటికీ ఈ భాషలనించి ఇంగ్లీషుభాష స్వీకరించిన పదజాలంలో పదోవంతు

కూడా జర్మన్‌భాష స్వీకరించలేదు. నూతనావశ్యకాలేర్పడ్డప్పుడుకూడా జర్మన్ భాషా వ్యవహర్తలు సాధ్యమయినంతవరకు దేశీయ పదాలతోటే నామకల్పన చేసుకోవడం సులువయినదిగా భావించడం దీనికే హేతువుగా చెప్పుకోవచ్చు (Sapir, 1921 : 195 & 196). ద్రావిడభాషలలో తెలుగు, కన్నడం, మళయాళంవంటి సాహిత్య వ్యావసాయిక భాషలవలెగాక, తమిళం సంస్కృత భాషా ప్రభావాన్నిపదే పదే నిరోధిస్తూ వచ్చినట్లు కన్పిస్తుంది. మరీ మించివస్తే తప్ప, వీలైనంతవరకు నూతనభావ వ్యక్తీకరణంపట్ల తమిళం దేశీయ పదాలతోటే సరిపుచ్చుకుంది. ఒకప్పుడు తత్సమభూయిష్ఠరచనని నిరోధించడానికి జాను తెనుగు, అచ్చ తెనుగు అనే పేర తలెత్తిన కావ్యరచనోద్యమాలు తెలుగువారికి కొత్తవి కావు. కన్నడంలోని అచ్చగన్నడ సంప్రదాయం సయితం ఈ కోవకు చెందిందే. ఆధునిక యుగంలో దేశీయకరణం పేరిట హిందీభాషలోని అరబ్బీ, తుర్కీ, పారసీ మాతృకాలగు పదాలను పరిహరించి వాటి స్థానంలో సంస్కృతాన్ని చొప్పించడానికిసాగుతున్న ఉద్యమాన్ని దీనికి మరో నిదర్శనంగా పేర్కొనవచ్చు.

**10.5.** నూతన వస్తుదర్శన స్పర్శన సాహచర్యాదులవల్లనూ, నూతనాచార విచారాలవల్లనూ, ఆహారవిహారాలవల్లనూ నూతనవస్తుద్యోతకాలుగా నూతనభావస్ఫోరకాలుగా కొత్తపదాల ఆవశ్యకం తప్పనిసరిగా పెరిగి తీరుతుంది. ఈ సందర్భంలో మాతృక (model language) లో ఉన్న రూపాన్ని యథాతథంగా ఎరవు తెచ్చుకోవచ్చు; లేక ప్రతిగ్రహీత భాషా (recepient language) నిర్మాణాన్ని అనుసరించిన ధ్వని పరిణామాలతో స్వీకరించవచ్చు. మరి కొన్నింటిని బోధించడానికి దేశ్యపదాలతోటే నామకల్పన చేయవచ్చు. అమెరిక నిండియన్ భాషలలో దేశీయపద భూయిష్ఠమైన వర్ణనాత్మక రీతి దీనికొక నిదర్శనంగా నిరూపించవచ్చు (Bloomfield, 1933 : 455). అనేక సందర్భాలలోనూతనభావవ్యక్తీకరణంపట్ల జర్మనులుకూడా దేశ్య పదాలనే విరివిగా వాడుకున్నట్లు మనం ఇంతకు ముందే గమనించాం. తమిళభాషా వ్యవస్థనుకూడా దీనికి తార్కాణంగా పేర్కొనవచ్చు. కొన్నింటిని వ్యక్తంచెయ్యడానికి దేశ్యపదా లున్నప్పటికీ, దేశ్యపదాలతో నామకల్పన చెయ్యడానికి వీలున్నప్పటికీ కొత్తపదం మీది మోజువల్లనో, ఝటితిస్ఫూర్తిని ఆశించడంవల్లనో, ప్రకరణోచితశయ్యావైయాత్యాన్ని పాటించాలనే నిశ్చయ జ్ఞానం కల్గడంవల్లనో ప్రదాతృభాషనించి సరికొత్త పదాలను ఎరవు తీసుకురాక తప్పదు. సమాజవ్యవస్థలో ఆయా వస్తువుల

ఆవశ్యకాన్నిబట్టీ, ఆయా భావాల ప్రాబల్యాన్నిబట్టీ తత్తద్బోధకాలైన పదాల వ్యవహార యోగ్యత ఏర్పడి ఉంటుంది. పరిణామ శీలమైన సమాజంలో వీటి అవసరం లేకపోతేనో, లేక సన్నగిలిపోతేనో ఇవి తదనురూపంగా చెలామణినించి తప్పుకుంటాయి. ఒక భాషలో ఒక భావాన్ని, లేక వస్తువుని సమర్థంగా ప్రకటించే పదం ఉన్నప్పటికీ, ఒక్కోకాలంలోని వ్యవహర్తలు దేశ్యపదాల స్థానంలో ఇతర భాషాపదాలను వాడడంకూడాకద్దు. నూతన పదాల వాడకం సంస్కార లక్షణమనే భావన దేశీయులలో ప్రస్ఫుట మవడం దీనికి ముఖ్య కారణం. ఆర్థిక సాంఘిక రాజకీయాదుల పరంగా ఉన్నత స్థానంలోఉన్న వారి వేషభాషాదికాలను తక్కిన వారు అనుకరించ యత్నించడం అన్ని దేశకాలాలలోను అతి సాధారణ విషయం.

భాషలలోని ఈ ఆదాన ప్రదానాలకి రెండు ముఖ్యప్రేరకాలను భాషావిజ్ఞాన కోవిదులు పేర్కొంటున్నారు. మొదటిది ఆవశ్యక పూరకం (need filling motive); రెండోది ప్రతిష్ఠాహేతుకం (Prestige motive). పైన ఉట్టంకించిన అన్ని అంశాలూ ఈ రెంటిండిలో ఇమిడిపోతాయి. కొన్ని కొన్ని సందర్భాలలో ఏకార్థబోధకాలైన ఎరవు మాటలూ, దేశ్యపదాలూ పక్కపక్కన వాడుకలో ఉండవచ్చు. ఉదాహరణకి ఇంగ్లీషులోని ఈ కింది జంటపదాలను పరిశీలించవచ్చు. ఈ జంటలలోని తొలిపదాలు వ్యుత్పత్తి పరంగా ఇంగ్లీషుభాషకు నిసర్గాలుగా వాడుక పడ్డవి; రెండోవి ఫ్రెంచి భాషనించి ఎరవుతేబడి ఇంగ్లీషులో ప్రవృత్తిపరంగా స్థిర పడ్డవి.

Answer-reply, body-corpse, ghost-spirit, hearty-cordial, room-chamber, ship-vessel, Spring-fountain, Yearly-annual.

(Surtevant, *Introduction to Linguistic Science* 1947 : 145).

**10.6.** ప్రాచీనకాలంనించీ తెలుగుభాష అన్య భాషాసంసర్గం కలిగి ఉన్నట్టుగా నిర్ద్వంద్వంగా నిర్ధారించవచ్చు. తెలుగుపైగల అన్యభాషల ప్రభావాన్ని చారిత్రికకాలంనించీ మనం ప్రదర్శించవచ్చు. అనేక భాషలతో తెలుగుకు ప్రత్యక్షంగానో పరోక్షంగానో చాల అంతరువులలో సంబంధాలు ఉంటూనే వచ్చాయి. జాగరితమైన జాతిగా విశ్వవిజ్ఞానాన్ని తన పరిధిలోకి తెచ్చుకోవాలనే జిజ్ఞాసగల సమాజంగా తెలుగుభాషా సమాజం నాటికీ నేటికీ వ్యవహరిస్తూనే ఉంది. జాతి ఆశలు, ఆశయాలు, ఆవశ్యకాలు పెరిగే కొద్దీ, సంకల్పవాహకమైన భాషసైతం పెరిగి

తీరుతుంది. తెలుగుభాష ప్రకృతరూపం ధరించడానికి అనేక భాషలు దోహదం చేశాయి. తెలుగుతో సంసర్గం పొందిన మొదటి భాషలు సంస్కృత ప్రాకృతాద్యార్య భాషలూ, తమిళాదీతర సజాతీయభాషలూ; ఇటీవలిది ఇంగ్లీషుభాష.

ఐతిహాసిక కాలంలో విజేతలయిన ఆర్యభాషావ్యవహర్తల రాజకీయాధికారమూ, వైదికజైన బౌద్ధమతాల సంసర్గమూ, ఆర్యభాషా, సంస్కృతులూ కారణాలుగా సంస్కృత ప్రాకృత భాషల ప్రభావం తెలుగుపై చాలా ఎక్కువగా పడింది. ఈ ముద్ర అనాటితోటే ఆగిపోలేదు. నాటినించీ నేటిదాకా ఏదో ఒక రూపంలో, ఏదో ఒక పాటి స్థాయిలో ఆ భాషల అధికారం తెలుగుమీద అవిచ్ఛిన్నంగా చెల్లుబడి అవుతూనే ఉంది. అనుస్యూతమైన ఈ ప్రభావం కారణంగా కొన్ని వేల ఎరవుపదాలు-శాబ్దికమైన మార్పులనుపొంది కొన్నీ, పొందకకొన్నీ-తెలుగులో ప్రవేశించాయి. శాబ్దిక పరిణామం పొందని పదాలను తత్సమాలనీ, పొందిన వాటిని తద్భవాలనీ శాస్త్రకారులు పరిభాషించారు. అలాగే తెలుగుకు సోదరభాషలైన తమిళం కన్నడంవంటి పరిసరస్థభాషల ప్రభావంసైతం అన్నియుగాలలోను, అంతో ఇంతో తెలుగుమీద లేకపోలేదు. మధ్యయుగాలలో అరబ్బీ, తుర్కీ, పారసీవంటి మధ్యప్రాచ్యభాషల ప్రభావం ప్రత్యక్షంగానో, నవీనోత్తరాహ భాషలయిన ఉర్దూ (దక్షినీ), మరాటీ మున్నగు భాషల ముఖంగానో తెలుగుపై ప్రసరించింది. ఇంచుమించుగా ఇదేకాలంనించి ఉర్దూ ఒరియా మరాటీ భాషల స్వీయ ప్రభావంకూడా యౌగపద్యంగా తెలుగుమీద పడుతూనే వచ్చింది. ఇక ఇంగ్లీషు కుంఫిణీ యుగంలో పడమటి సీమల భాషలయిన పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి భాషల ప్రభావం ఒక మోస్తరుగానూ, నాటినించి నేటిదాకా ఇంగ్లీషుభాషా ప్రభావం అతివేలంగానూపడి నూతనావశ్యకాల కనుగుణంగా తెలుగుభాష పరిపుష్టం కావడానికి దోహదంచేసింది (Galletti, Introduction, p. XI). అవిచ్ఛినంగా ప్రసరిస్తూ, వస్తున్న ఈ పరభాషా ప్రభావం తెలుగుపై పరిగణించదగ్గ పరిణామాలను కల్పించింది.

**10.7.** పదజాలవిభాగంలోనూ వాటి నిర్వచననిరూపణాలపట్లనూ తెలుగు లాక్షణికులలో ఏకవాక్యత కనిపించదు. విశేషించి వీరి ఈ విభాగం తక్కిన భాషలమాట అటుంచి తెలుగుకుకూడ పూర్తిగా వర్తించదు. తత్సమ, తద్భవ, దేశ్యాలని వీరి విభాగ ప్రక్రియను స్థూలంగా నిర్దేశించవచ్చు. ఈ పరిభాషాకల్పన కూడ ఆంధ్రలాక్షణికుల సొంతంకాదు; ప్రాకృత లక్షణ గ్రంథాలనించి ఎరవు తెచ్చిన పరిభాష (R. Pischel). అయితే ప్రాకృతలాక్షణికులు ఉపయోగించిన

తచ్ఛబ్దం సంస్కృతాన్ని మాత్రమే సూచిస్తుంది. ప్రాకృతభాషా తత్త్వానికి ఈ పరిభాష నూటికినూరుపాళ్ళు నప్పుతుంది. కాగా, తెలుగు లాక్షణికులు వాడిన తత్సమ తద్భవాలన్న పరిభాషలోని తచ్ఛబ్దం సంస్కృత ప్రాకృతాలకు మాత్రమే పరిమితార్థంలో ప్రవర్తిస్తుంది. అనంతర యుగాలలో తెలుగుతో సంసర్గ సంబంధం కల్గిన అరబ్బీ, తుర్కీ, పారసీ, మరాటీ, ఉర్దూ, పోర్చుగీసు, ఇంగ్లీషు మొదలైన సంస్కృత ప్రాకృతేతర భాషలనించి తెలుగుకు సజాతీయాలయిన తమిళం కన్నడంవంటి భాషలనించీ తెలుగులో ప్రవేశించిన పదజాలంపట్ల ఈ పరిభాష ప్రవర్తితం కాకపోవడమేకాక అవ్యాప్తిదోషంకూడ సంక్రమిస్తున్నది. కాబట్టి ఇంతకు ముందు సూచించినట్లుగా తెలుగులోని పదజాలాన్ని దేశ్యమనీ, దేశ్యేతరమనీ వర్గీకరించడం శాస్త్రీయమనీ సహేతుకమనీ నిర్ణయించవచ్చు.

భాషల సంసర్గంవల్ల రెండు పక్షాలలో ప్రవర్తితమయ్యే పరిమాణాలను వర్ణనాత్మకపద్ధతిలో నిరూపించవచ్చు. ఈ నిర్దిష్ట పరిమాణాలకు మూలమైన కారణాలనుకూడా చాలావరకు భాషావైజ్ఞానిక రీతులద్వారా నిర్ధారణ చేయవచ్చు. సంసర్గంలోని రెండు భాషలలో ప్రధానాంశాలయిన వర్ణసమామ్నాయాన్ని వ్యాకరణాన్ని పోల్చి వాటిలోని వైషమ్యాలను లక్ష్యీకరించినట్లయితే సంసర్గంలోని ఒక నిర్ణీత సన్నివేశంలో కన్పించే ప్రచురమైన పరిమాణాలను లెక్కించవచ్చు. సంసర్గ స్వభావానుగుణమైన సాంస్కృతిక సన్నివేశాలలో కొరవడ్డపదజాలాన్నిగూర్చి వివేచించి నైఘంటుకాదానాల (Lexical borrowings) ను కూడ నిరూపించవచ్చు.

సాధారణంగా తెలుగులోని తద్భవాలను నిరూపించే సందర్భంలో మాతృకలనుగూర్చి తెలుగు వ్యాకర్తలలో రెండు మతాలున్నట్లు గోచరిస్తున్నది. కేతన, విన్నకోట పెద్దన, కూచిమంచి తిమ్మన మొదలైన వారు తద్భవాలకు మాతృకగా సంస్కృతాన్ని మాత్రమే పేర్కొని, సమీపమాతృక (immediate sources) లయిన ప్రాకృతాల్ని పూర్తిగా విస్మరించారు. చింతామణి కర్త, బాల సరస్వతి, చిన్నయసూరి మొదలైన వారు సమీపమాతృకగా ప్రాకృతాన్నికూడ పేర్కొన్నారు. తద్భవాలలో అయిదింట నాలుగువంతులు ప్రాకృతభవాలు; అయిదింట ఒకపాలు మాత్రమే సంస్కృతభవాలు కన్పిస్తున్నాయి. చిన్నయసూరినిరూపించినట్లుగా తద్భవాలను సంస్కృతభవాలనీ, ప్రాకృతభవాలనీ వేర్వేరుగా వివక్షించడం చాలా శాస్త్రీయమైన దృష్టి.

**10.8.** మొదట సంస్కృతభవాలలోని ముఖ్యధ్వని పరిణామాలను పరిశీలిద్దాం.

(1) స్వరవిభక్తి లేక విప్రకర్ష (Anaptyxis) :

| తెలుగు | సంస్కృతం | ప్రాకృతం |
|---|---|---|
| అలుపము | అల్ప- | అప్ప- |
| కసుమాలము | కశ్మల- | కమ్హల- |
| చందురుఁడు | చంద్ర- | చందో- |
| నిద్దుర | నిద్రా | నిద్దా |
| మరియాద | మర్యాదా | మజ్జాయా |
| రాతిరి | రాత్రి- | రత్తి- |
| లగనము | లగ్న- | లగ్గ- |

(2) సంయుక్తత నిలిచిన రూపాలు కొన్ని :

| | | |
|---|---|---|
| కస్తురి | కస్తూరీ | కత్థూరీ |
| కర్జూరము | ఖర్జూర- | ఖజ్జూర- |

(3) సంస్కృతంలోని పదాదిరేఫ సంస్కృతభవాలలో లోపించలేదు. సంయుక్తతలోని ద్వితీయవర్ణమైన రేఫ ప్రాకృతాలలో సర్వేసర్వత్ర లోపిస్తుంది.

| తెలుగు | సంస్కృతం | ప్రాకృతం |
|---|---|---|
| క్రోసు | క్రోశః | కోసో |
| ద్రోవది | ద్రౌపదీ | దోవఈ |
| ప్రతిన | ప్రతిజ్ఞా | పఇణ్ణా, పడిణ్ణా |
| ప్రోడ | ప్రౌఢః, ప్రౌఢా | పోఢ, పోఢా |

(4) అజాదిత్వాని (Prothesis) కి ఉదాహరణ :

| | | |
|---|---|---|
| అరదము | రథః | రహో |

(5) పదాది యకార లోపం :

| | | |
|---|---|---|
| అమడలు | యమల- | జమల |
| అసము | యశస్ | జసో |
| ఉవిద | యువతీ | జువఈ |

| | | |
|---|---|---|
| ఉత్తుఁడు | యుక్తః | జుత్తో |
| ఎక్క (లి) | యక్షః | జక్ఖో |

(6) పదాదిహకారలోపం :

| | | |
|---|---|---|
| ఇతవు | హితమ్ | హిఅ, హియ |

(7) ఆపదాది దీర్ఘస్వరం హ్రస్వమైన రూపాలు కొన్ని :

| | | |
|---|---|---|
| కస్తురి | కస్తూరీ | కతూరీ |
| పసదనము | ప్రసాధనమ్ | పసాహణం |
| విరటుఁడు | విరాటః | విరాడో |
| సోపనము | సోపాన- | సోవాణ- |

(8) మహాప్రాణాలు అల్పప్రాణాలైన రూపాలు కొన్ని :

| | | |
|---|---|---|
| గోదుమ | గోధూమ | గోహూమ |
| బొజుఁగు | భుజంగః | భుయంగో |
| వదిన | వధూనీ | వహూణీ |

(9) వర్ణసమీకరణం (Assimilation) :

| | | |
|---|---|---|
| నిత్తెము | నిత్య | ణిచ్చ, నిచ్చ |
| పత్తెచ్చము | ప్రత్యక్ష | పత్తక్ఖ |
| సత్తెము | సత్య | సచ్చ |
| సోద్దెము | చోద్య | చోజ్జం |

(10) కేవలం పదాలేకాక సంస్కృతంలో ప్రసిద్ధఁగా వాడుకలో ఉన్న కొన్ని ప్రత్యయాలు సైతం తెలుగులోనికి రావడం ఒక విశిష్ట పరిణామం.

**10.9.** ఇక ప్రాకృత భవాల సంగతి పరిశీలిద్దాం :

**ముఖ్యధ్వని పరిణామాలు :**

(1) పదాద్యచ్చులలో ప్రాయికంగా మార్పు కనిపించదు.

| తెలుగు | ప్రాకృతం | సంస్కృతం |
|---|---|---|
| అక్కరము | అక్ఖర- | అక్షర- |

| | | |
|---|---|---|
| అచ్చర | అచ్ఛరా | అప్సరాః |
| ఆకసము | ఆకాస- | ఆకాశ- |
| ఇచ్చ | ఇచ్ఛా | ఇచ్ఛా |
| ఈసు | ఈసా | ఈర్ష్యా |
| ఉగ్గడన | ఉగ్ఘాడన- | ఉద్ఘాటన- |
| ఊసర | ఊసర- | ఊషర- |
| ఏకతము | ఏక్కంత- | ఏకాంత- |
| ఓలగము | ఓలగ్గం | అవలగ్న- |

(2) కింది ఉదాహరణాల్లో మార్పు కనిపిస్తున్నది :

| | | |
|---|---|---|
| జవ్వనము | జోవ్వణం | యౌవనమ్ |
| ఉంగరము | అంగురీయ | అంగులీయ |
| ఉంగుటము | అంగుట్ఠ | అంగుష్ఠ |

(3) ఉభయోష్ఠ్య వ్యంజనాలమీది అకారం ఓష్ఠ్యమైన ఒ కారంగా మారిన రూపాలు.

| | | |
|---|---|---|
| పొత్తరము, పొత్రము | పత్థర- | ప్రస్తర- |
| బొందు | బంధో | బంధః |
| బొబ్బర | బబ్బరో | బర్బరః |
| బొమ్మ | బంభ- | బ్రహ్మన్ |
| బొమ్మరము (బొంగరము) | భమ్మర- | భ్రమర- |

(4) సమీప మాతృకలోకి పదాది హల్లులమీది సంవృత స్వరమైన ఉత్వం తెలుగులో అర్ధ సంవృతమైన (half close) ఒకారంగా మారిన రూపాలు.

| | | |
|---|---|---|
| కొంతము | కుంత- | కుంత |
| కొలము | కుల- | కుల- |
| గొనము | గుణ- | గుణ- |
| మొల్లము | ముల్లమ్ | మూల్యమ్ |

(5) సమీప మాతృకలోని అవ-అవు-లు తెలుగులో వికల్పంగా ఔకారంగా పరిణమించాయి.

| | | |
|---|---|---|
| చవు, చౌ- | చఉ-, చవు | చతుః |
| కవుదు, కౌదు | కవడ- | కపట- |

(6) సమీప మాతృకలోని అయ—తెలుగున వికల్పంగా ఐకారంగా కన్పిస్తున్నది

| | | |
|---|---|---|
| పయనము, పైనము | పయాణం | ప్రయాణమ్ |
| మయనము, మైనము | మయణం | మదన- |

(7) కింది ఉదాహరణాలను పరిశీలిస్తే తాలవ్యహల్లుతో కూడిన అకారము తాలవ్యస్వరమైన ఎకారంగా మారినట్లు గుర్తించవచ్చు.

| | | |
|---|---|---|
| చెక్కెము (ఎముక లోని చమురు) | చక్కియ (తైలం) | చక్రికా |
| చెత్త | చత్త- | త్యక్త- |
| చెమురు (మాలకాకి) | చమ్మార- | చర్మకార |
| జెలగ | జలూగ- | జలూక- |

(8) కింది ఉదాహరణలో తాలవ్యవ్యంజనం లేకపోయినా అకారం ఏకారంగా మారింది.

| | | |
|---|---|---|
| దెస (అవస్థ) | దసా | దశా |

(9) సమీపమాతృకలోని ప్రథమస్వరంగా ఉంటున్న ఇత్వం తెలుగులో ఎత్వంగా మారిన రూపాలు : (ఇక్కడకూడా సంవృతమైన స్వరం అర్ధ సంవృతంగా మారింది.)

| | | |
|---|---|---|
| దెస (దిక్కు) | దిసా | దిశా |
| మెగము, మెకము | మిగ- | మృగ- |
| వెన్నుఁడు | విణ్హు- | విష్ణుః |
| సెక | సిఖా | శిఖా |

(10) అజాదిత్వానికి ఉదాహరణాలుగా కొన్ని రూపాలు :

| | | |
|---|---|---|
| అరంగు (వేదిక) | రంగ- | రంగ- |
| ఉరువు | రూవ- | రూప- |

(11) పదాది సకారలోపంవల్ల ఏర్పడ్డ కొన్ని అజాది రూపాలు :

| | | |
|---|---|---|
| ఆమని | సావణ- | శ్రావణ- |
| ఆవ | సాసవ- | సర్షపః |
| ఉంకువ | సుంక- | శుల్క- |

(12) పదాది హకారలోపంవల్ల తెలుగున ఏర్పడ్డ కొన్ని అజాది రూపాలు:

| | | |
|---|---|---|
| అనుమఁడు | హణుమ- | హనుమత్ |
| అరిదళము | హరిదల- | హరితాల- |
| అరణము | హరణం | హరణమ్ |
| అరుసము | హరుస- | హర్ష |
| ఇంగువ | హింగు- | హింగు |
| ఇవము | హిమ- | హిమ- |

(13) (i) ద్రావిడ భాషలలో పదమధ్యదీర్ఘస్వరాలు చాలా అరుదు. ప్రాకృత భవాల్లోని పదమధ్య దీర్ఘస్వరం తెలుగులో హ్రస్వ మవడానికి కొన్ని ఉదాహరణాలు (వీటిని ప్రాచీన తద్భవాలుగా చెప్పవచ్చు.) :

| | | |
|---|---|---|
| ఆకసము | ఆకాస- | ఆకాశ- |
| అమవస | అమావస్సా | అమావాస్యా |
| ఇంగలము | ఇంగాల- | అంగార- |
| కుప్పసము | కుప్పాస- | కూర్పాస- |

(ii) పదమధ్యదీర్ఘస్వరాలైన ఊ, ఏ, ఓ లు కూడ తెలుగున హ్రస్వ అకారాలుగా మారాయి.

| | | |
|---|---|---|
| జలగ | జలూగ- | జలూక- |
| మందస, మందసము | మంజూసా | మంజుషా |
| అచ్చ(చ్చె)రువు | అచ్ఛేరం | ఆశ్చర్యమ్ |

| | | |
|---|---|---|
| ఆక్కసము | అక్కోస- | ఆక్రోశ- |
| అందలము | అందోల- | అందోల- |
| సంతసము | సంతోస- | సంతోష- |

(iii) పై ధ్వని పరిణామరీతికి విపరీతంగా, అపదాది దీర్ఘ స్వరాలు నిలిచి పోయిన కింది రూపాలను అర్వాచీన తద్భవాలుగా పరిగణించవచ్చు.

| | | |
|---|---|---|
| అమాస | అమావస్సా | అమావాస్యా |
| బండారము | భండా అర- | భాండాగార- |
| పటారము | పట్టార, పట్టాఅర- | పట్టాగార- |
| లొటారము | లోట్టాఅర- | లోష్ఠాగార- |
| సింగారము | సింగార- | శృంగార- |

(14) పద మధ్య అచ్చులలోని కొన్ని విశేష పరిణామాలు :

(i) పదమధ్య అత్వం ఇత్వంగా మారిన రూపాలు :

| | | |
|---|---|---|
| జమిలి | జమల- | యమల- |
| సాహిణి | సాహణీ | సాధనీ |
| కడియము | కడయం | కటకమ్ |

(ii) పదమధ్య అత్వం ఉత్వంగా మారిన రూపాలు :

| | | |
|---|---|---|
| జనుము | సణ- | శణ- |
| సణుగు | సణ- | స్వన- |

(iii) పదమధ్య ఇత్వం అత్వంగా మారిన రూపాలు :

| | | |
|---|---|---|
| పున్నమ | పుణ్ణిమా | పూర్ణిమా |
| సడలు | సఢిలో | శిథిల- |

(iv) పదమధ్య ఉత్వం అత్వంగా మారింది.

| | | |
|---|---|---|
| దేవళము | దేవులమ్ | దేవకులమ్ |

(v) పదమధ్య ఉత్వం ఇత్వంగా మారిన రూపాలు :

| | | |
|---|---|---|
| అందియ | అందుయ- | అందుకా |
| చక్కిలము | సక్కులీ | శష్కులీ |

(vi) పదమధ్య అత్వం ఎత్వంగా మారిన రూపాలు :

| | | |
|---|---|---|
| ఆమెత | ఆమంతణ- | ఆమంత్రణ- |
| కత్తెర | కత్తరి | కర్తరీ |
| చక్కెర | సక్కరా | శర్కరా |
| బచ్చెన | పచ్ఛణ్ణ- | ప్రచ్ఛన్న- |
| మద్దెల | మద్దలిఆ | మర్ధలః, మర్దలికా |

(15) (i) బిందులోపానికి కొన్ని ఉదాహరణాలు :

| | | |
|---|---|---|
| ఆమెత | ఆమంతణ- | ఆమంత్రణ- |
| ఏకతము | ఏక్కంత- | ఏకాంత- |
| గరిడియ (బుట్ట) | కరండియా | కరండికా |
| గుమ్మడి | కుమ్హాండ- | కూష్మాండ- |
| పల్లకి | పల్లంకి ఆ | పల్యంకికా |
| వాసము | వంసో | వంశః |

(ii) బింద్వాగమానికి కొన్ని ఉదాహరణాలు ;

| | | |
|---|---|---|
| ఒంటె | ఓట్టియా | ఔష్ట్రికా |
| కుంటెన | కుట్టణీ | కుట్టనీ |
| గంబూర | కప్పూర- | కర్పూర |

(iii) కింది బింద్వాగమరూపాలు ప్రత్యేకంగా గమనించదగ్గవి.

| | | |
|---|---|---|
| గోసంగి | గోసగ- | ఘోషక- |
| జోనంగి (ఒకతెగకుక్క) | సుణగ- | శునక- |
| మండెంగ | మండగ- | మండక- |
| ముల్లంగి | మూలగ- | మూలక- |
| వడ్రంగి | వడ్డగ- | వర్ధక- |
| సంపెంగ | చంపగ- | చంపక- |

(16) అపదాది హకారలోపానికి కొన్ని ఉదాహరణాలు :

| | | |
|---|---|---|
| కాళియ, కాళె | కాహలిఆ | కాహలికా |
| పార | పహార- | ప్రహార- |

| | | |
|---|---|---|
| మేన-మేనత్తకాదుల లోని పూర్వభాగం | మేహుణ- | మైథున |
| రాటము | రహట్ట | అరఘట్ట |
| సాని (కొన్ని గృహనామాల లోని ఉత్తరభాగం, ఉదా. అల్లాసాని, చలసాని, పెమ్మసాని, లకంసాని, మొ.) | సాహణీ | సాధనీ |

(17) సమీప మాతృకలోని నాదవత్స్పర్శాలు (voiced stops) శ్వాసవత్స్పర్శాలవడం ప్రాచీన తద్భవాల లక్షణం.

| | | |
|---|---|---|
| కంతి | గన్థి | గ్రంథి |
| కసవు | ఘాస | ఘాస- |
| కోన (ఆలకాపరి, కోనారి) | గోణ | గో |
| తోరము (వ్రతసూత్రం) | దోరో | దోరః |
| పాలసుఁడు | బాలిసో | బాలిశః |

(18) సమీపమాతృకలోని శ్వాసవత్స్పర్శాలు నాదవత్స్పర్శాలుగా మారడం అర్వాక్కాలిక లక్షణం.

| | | |
|---|---|---|
| గుమ్మడి | కుమ్హాండ | కూష్మాండమ్ |
| గొంతి | కొన్తీ | కుంతీ |
| జక్కవ | చక్కవాఈ | చక్రవాకీ |
| జల్లెడ | చాలణీ | చాలనీ |
| దొండ | తుండ | తుండ |
| దొన (అంబులపొది) | తూణ | తూణ |
| బచ్చెన | పచ్ఛణ్ణ | ప్రచ్ఛన్న |
| బంతి (వరుస) | పన్తి | పంక్తి |

(19) మూలద్రావిడభాషలో లేని సకారం తెలుగు, కన్నడం మొదలైన భాషలలో నూతనరీతి (innovation) గా ఏర్పడింది. ప్రాచీన తద్భవాలలో సకారం కనిపించదు. దాని స్థానంలో చకారం కనిపిస్తుంది.

(a) సమీప మాతృకలోని పదాది సకారం తెలుగులో చకారంగా మారిన రూపాలు :

| | | |
|---|---|---|
| చక్కిలము | సక్కుల (లీ) | శష్కుల-, శష్కులీ |
| చక్కెర | సక్కరా | శర్కరా |
| చామన | సామణ | శ్యామల |
| చిక్కము | సిక్క | శిక్య |

(b) అజ్మధ్యంగా కూడా కింది రూపంలో చకారం కనిపిస్తుంది.

| | | |
|---|---|---|
| పాచిక | పాసగ | పాశక |

(c) అనునాసికానికిపరంగా కూడా ఈధ్వని పరిణామం ప్రవర్తితమయింది.

| | | |
|---|---|---|
| అంచ | హంసో | హంసః |
| అంచు | అంసుయ- | అంసుక- |
| కంచము | కంచం | కాంస్యమ్ |
| కంచు | కంసో | కాంస్యః |

(d) ద్విరుక్తతలో సైతం సకారం చకారంగా మారింది.

| | | |
|---|---|---|
| నిచ్చెన | నిస్సేణి | నిశ్రేణి |
| బచ్చు | వేస్సో | వైశ్యః |

(e) కాని, సకారప్రభావం ప్రగాఢంగా పడ్డ అర్వాచీనదశలో సకారద్విత్వ ఘటిత రూపాలట్టే నిలిచినందుకు కొన్ని ఉదాహరణాలు :

| | | |
|---|---|---|
| దిస్స (మొల) | దిస్స | దిశా |
| దుస్ససేనుఁడు | దుస్సాసనో | దుశ్శాసనః |
| లెస్స | లేస్సా | లేశ్యా |
| విస్స (న్న) | విస్స- | విశ్వ (నాథ)- |
| సస్సెము | సస్సం | సస్య |

(f) సకారాదులు చకారాదులుగా మారి నాదతను పొందిన రూపాలు కొన్ని కనిపిస్తున్నాయి. వీటి చకారాది రూపాలు గ్రంథస్థం కాలేదు.

| | | |
|---|---|---|
| జట్టి (అమ్మకం) | సట్ట- | సార్థ- |
| జన (ను) ము | సణ | శణ |

| | | |
|---|---|---|
| జమ్మి | సమీ | శమీ |
| జావ | సావ- | స్రావ- |
| జడ(సింహాదులకేసరం) | సడా | సటా, శటా |

(g) సమీప మాతృకలోని సకారం చాలా వరకు సకారంగానే నిల్చింది. వీటిని అర్వాచీన రూపాలనవచ్చు.

(i) పదాది రూపాలకు కొన్ని ఉదాహరణాలు :

| | | |
|---|---|---|
| సన్నము | సణ్ణ | శ్లక్ష్ణ |
| సిరి | సిరీ | శ్రీ |
| సున్న | సుణ్ణ- | శూన్య- |
| సేస | సేస- | శేష- |
| సొన్నము | సొణ్ణం | స్వర్ణమ్ |

(ii) పదమధ్య సకార ఘటిత రూపాలు :

| | | |
|---|---|---|
| ఆస | ఆసా | ఆశా |
| దోసము | దోష- | దోస- |
| రోసము | రోస- | రోష- |
| వేసము | వేస- | వేష |

(h) (i) సమీపమాతృకలోని చకారం సకారంగా మారడం అర్వాచీనం, ఈ ధ్వని పరిణామం కన్నడాంధ్రాలతో దేశ్యపదాలలో సైతం కనిపిస్తున్నది. తెలుగులోని సలుపు, సాలు, సెలవు, సొక్కు, సొలము వంటి సకారాది రూపాలు చకారాదులకు పరిణతరూపాలు. శ్వాసపత్స్పర్శమైన చకారం, శ్వాసవద్దంతమూలీయ విస్తారితోష్మం (unvoiced alveolar slit fricative)గా మారడాన్ని తెలుగు వ్యాకర్తలు గసడదవాదేశ విధిగా పేర్కొన్నారు.

| | | |
|---|---|---|
| సనగ, సెనగ | చణగో | చణకః |
| సమ్మెట | చమ్మెట్ఠి | చర్మయష్టి |
| సపరము | చమర-, చామర- | చమర-, చామర- |
| సున్నము | చుణ్ణ- | చూర్ణ- |

(ii) సమీప మాతృకలోని పదాది ఛకార రూపాలు సకారంగా మారిన రూపాలు కొన్ని. మొదట సమీప మాతృకలోని పదాది మహాప్రాణత తొలగిపోయి. సకారాదిత ఏర్పడ్డట్లు భావించవచ్చు.

| | | |
|---|---|---|
| సురియ (< చురియ) | ఛురిఅ, ఛురియా | ఛురికా, క్షురికా |
| సేనము (<*చేనము (చిన్న ఉలి) | ఛేణం, ఛేయణ | ఛేదనమ్ |

(20) సమీప మాతృకలోని మాహా ప్రాణ వర్ణాలు అల్పవర్ణాలుగా మారాయి.

(i) పదాది పరిణామానికి కొన్ని ఉదాహరణాలు :

| | | |
|---|---|---|
| కజ్జము | ఖజ్జ– | ఖాద్య– |
| గడియ | ఘడియా | ఘటికా |
| చురియ | ఛురిఅ | ఛురికా |
| జగడము | ఝగడ– | ఝకట– |
| డీలు | ఢిల్ల– | శిథిల– |
| తిరము | థిర– | స్థిర– |
| దిట్టము | ధిట్ట– | ధృష్ట– |
| పరుసము(స్పర్శమణి) | ఫరుస– | స్పర్శ– |
| బాస | భాసా | భాషా |

(ii) అజ్మధ్యంలోని పరిణామానికి కొన్ని ఉదాహరణాలు :

| | | |
|---|---|---|
| లేక | లేఖా | లేఖా |
| మేగము | మేఘ– | మేఘః |
| పుదమి | పుఢవీ | పృథివీ |
| కద | కధా (శౌరసేని) | కథా |
| సోబనము | సోభణం | శోభనమ్ |

(iii) ద్విరుక్తస్థితికి కొన్ని ఉదాహరణాలు :

| | | |
|---|---|---|
| రక్కసుఁడు | రక్ఖసో | రాక్షసః |
| ఉగ్గడన | ఉగ్ఘాటన– | ఉద్ఘాటన– |

| | | |
|---|---|---|
| రచ్చ | రచ్చా | రథ్యా |
| ఒజ్జ | ఉవజ్ఝాయ- | ఉపాధ్యాయ- |
| ఇట్టిక | ఇట్టికా | ఇష్టికా |
| అసడ | అసడ్ఢా | అశ్రద్ధా |
| హత్తి | హత్థి | హస్తిః |
| ఉద్ధరువు | ఉద్ధారో | ఉద్ధారః |
| అప్పళించు | అప్ఫాళ- | ఆస్ఫాల- |
| నిబ్బరము | నిబ్భర | నిర్భర |

(iv) అనునాసిక వర్ణాలకు పరంగా వచ్చిన మహాప్రాణాలు తెలుగున అల్పప్రాణాలుగా మారడానికి నిదర్శనాలు :

| | | |
|---|---|---|
| సంకలియ | సంఖలి ఆ | శృంఖలికా |
| సింగము | సింఘో | సింహః |
| పించము | పింఛం | పింఛమ్ |
| సంజ | సంఝా | సంధ్యా |
| కంటియ | కంఠిఆ | కంఠికా |
| మెంతి | మేంథీ | మేంథీ |
| గందము | గంధ- | గంధ- |
| కంబము | కంభో | స్కంభః |

(v) కొన్ని పదాలలో మహాప్రాణత యథా తథంగా నిలిచి పోయింది. ఇట్టి వాటిని ప్రాకృత సమాలుగా పరిగణించడం శ్రేయం, శాస్త్రీయం.

| | | |
|---|---|---|
| అజ్ఝము | అజ్ఝాయ- | అధ్యాయః |
| ఒజ్ఝ(లు) | ఉవజ్ఝాయో | ఉపాధ్యాయః |
| అట్ఠము | అట్ఠ- | అష్ట- |
| పైఠాణము (ఒక నగరం పేరు) | పఇట్ఠాణం | ప్రతిష్ఠాన- |
| ఖాణము (గుఱ్ఱపు దాణా) | ఖాణమ్, ఖాయణమ్ | ఖాదనమ్ |
| థవర (నేర్పరి) | థవిరో (శక్తిమంతుడు) | స్థవిరః (వృద్ధుడు) |

(vi) తెలుగులో ఠకార ఘటిత రూపాలు అన్యదేశాలని తెలుగు లాక్షణికుల తీర్పు. కాని వీటిని ప్రాకృత సమాలుగా పరిగణించడం శాస్త్రీయం. ఇలాంటి రూపాలు కొన్ని :

| | | |
|---|---|---|
| ఠవణి (స్వరస్థాయి) | ఠావణి | స్థాపనీ |
| ఠాణము | ఠాణం | స్థానమ్ |
| ఠాయము | ఠాయం | స్థాయ |
| ఠాయి | ఠాయి | స్థాయిన్ |
| ఠావు | ఠావ | స్థాప |

(21) (i) సమీప మాతృకలోని అపదాది ణ కారం తెలుగులో నకారంతో వర్ణసంయోగం (Phonemic merger) పొందిన రూపాలను కొన్ని ఉదాహరణాలు (మూలద్రావిడంలోని ణ కారం తెలుగులో న కారంతో కలిసిపోయిన ధ్వని పరిణామానికి దీన్ని అనుప్రాసంగా చెప్పవచ్చు,

| | | |
|---|---|---|
| ఆనతి | ఆణత్తి | అజ్ఞప్తిః |
| గానుగ | ఘాణో, ఘాణగ, ఘాయణగ | ఘాతనక |
| చాన (వి) (కలయంపి) | చాణం, ఛాఅణం | ఛాగణమ్ |
| బోనము | భోణం, భోయణం | బోజనమ్ |
| మానికము | మాణిక్కం | మాణిక్యమ్ |
| సాన | సాణ | శాణః |

(ii) ద్విరుక్త ణకారం కూడ తెలుగులో ద్విరుక్త నకారంగా మారింది.

| | | |
|---|---|---|
| జన్నము | జణ్ణో | యజ్ఞః |
| పున్నమ | పుణ్ణిమా | పూర్ణిమా |
| వన్నియ | వణ్ణి అ, వణ్ణియా | వర్ణికా |
| సన్న | సణ్ణా | సంజ్ఞా |
| సౌన్నము | సౌణ్ణం | స్వర్ణమ్ |

(iii) హకారం ద్వితీయ వర్ణంగా ఏర్పడిన సంయుక్తతలోని ణ కారం తెలుగులో ద్విరుక్త న కారంగా పరిణమించింది.

| | | |
|---|---|---|
| కన్న (య్య) | కణ్హ- | కృష్ణః- |
| చిన్నె | చిణ్హ- | చిహ్న- |
| పన్నము | పణ్హ- | ప్రశ్న- |
| వెన్నుఁడు | విణ్హు- | విష్ణుః- |
| సన్నము | సణ్హ- | శ్లక్ష్ణ- |

(iv) ఈ పరిణామం ప్రవర్తితంకాని రూపాలు కొన్ని తెలుగులో నిలిచిపోయాయి.

| | | |
|---|---|---|
| ఖాణము | ఖాణం | ఖాదనమ్ |
| గాణ | గాణ-, గాయణ | గాయన- |
| దుగుణము(రెండురెట్లుకలది) | దుగుణం | ద్విగుణమ్ |
| రాణి | రాణీ | రాజ్ఞీ |
| వక్కణము | వక్ఖాణం | వ్యాఖ్యానమ్ |

(v) సమీప మాతృకలోకి అఖ్యర్థ్య (intervocalic) ణకారం తెలుగులో డకారంగా మారింది. (మూర్ధన్యానునాసికం (retroflex nasal) అనునాసికతను కోల్పోయి తద్వర్గీయమగు నాదవత్స్పర్శం (retroflex vocied stop) గా మారిందని చెప్పొచ్చు.)

| | | |
|---|---|---|
| అగ్గడి | అగ్గణీ | అగ్రణీ |
| గడన | గణణా | గణనా |
| గామిడి | గామిణీ | గ్రామణీ |
| చల్లడము | చల్లణ-, చల్లణగ- | చలనక |
| జల్లెడ | చాలణీ | చాలనీ |

(22) సమీప మాతృకలోని జ కారం తెలుగులో అరుదుగా ద కారంగా మారింది.

(i) పదాది ధ్వని పరిణామానికి కొన్ని ఉదాహరణలు :

| | | |
|---|---|---|
| దంట (<జంట) | జమల- | యమల- |

| | | |
|---|---|---|
| దవనము(ధాన్యం) | జవసం (గోధుమలు మొ. ధాన్యం) | యవసమ్ |
| దొత్తిగ (<జొత్తిగ) | జోత్తం, జోత్తగం, జోత్తయం | యౌక్త్రిక |
| దోన్యము (<జోస్యము) | జోఇసియం | జ్యోతిషమ్ |

(ii) అపదాది ధ్వని పరిణామానికి ఉదాహరణం :

| | | |
|---|---|---|
| మందస, మందసము (< మంజస) | మంజూసా | మంజూషా |

(23) మీది ధ్వని పరిణామానికి వ్యతిరేకమైన జ <ద ధ్వని పరిణామం కింది ఉదాహరణాల్లో కనిపిస్తుంది.

| | | |
|---|---|---|
| జూజము (< జూదము) | జూద- (శౌరసేనీ) | ద్యూత- |
| జాజు (< జాదు) | ధాదు (శౌరసేనీ) | ధాతు- (గైరికాది) |

(24) (i) సమీప మాతృకలోకి అఘ్మధ్య మకారం తెలుగులో వ కారంగా కన్పిస్తున్నది. (ద్రావిడభాషల్లో వ, మలు పరస్పరం వినిమయ వర్ణాలు.)

| | | |
|---|---|---|
| ఇవము | హిమ- | హిమ- |
| కవము | కమ- | క్రమ- |
| తలివము (పరుపు) | తలిమ- | తలిమ- |
| తవలము | తమరం | తమరమ్ |
| దవనము | దమణ- | దమనక- |

(ii) సమీప మాతృకలోని పదమధ్యలకారం తెలుగులో న కారంగా మారిన రూపాలు :

| | | |
|---|---|---|
| ఆనబ (ఆనప ఆనప) | అలాబూ | అలాబూ |
| చామన | సామల- | శ్యామల- |
| పనపు | పలావ- | ప్రలాప- |

(iii) సమీప మాతృకలోకి అపదాది లకారం తెలుగులో శకారంగామారిన రూపాలకు కొన్ని ఉదాహరణలు (మూల ద్రావిడం, కొన్ని ద్రావిడ భాషలు శకార ప్రాచుర్యం కలవి. ఆ లక్షణానికి పరిశిష్టాలు కాబోలు) :

| | | |
|---|---|---|
| అప్పళించు | అప్ఫాల- | ఆస్ఫాల |
| దవళము | ధవల- | ధవల- |
| దేవళము | దేవఉలం | దేవకులమ్ (దేవాలయం) |
| వక్కళము (చలించేవి) | పక్ఖల- | ప్రస్ఖల |

(25) సమీప మాతృకలోని అపదాది వ, మలు కొన్నిచోట్ల తెలుగులో గ కారంగా కనిపిస్తున్నాయి. వీటి వకార ఘటితరూపాలుకూడా తెలుగులో లేక పోలేదు. మొదట వ కారంగానే నిలిచి, ఆ పిమ్మట గ, వ ల వినిమయంవల్ల గ కారంగా మారి ఉండవచ్చు.

ఈ ధ్వని పరిణామానికి కొన్ని ఉదాహరణాలు :

| | | |
|---|---|---|
| ఇగము (< ఇవము | హిమ- | హిమ- |
| తగరము(<తవరము) | తమరం | తమరమ్ |
| పగడము(<పవడము) | పవాళో | ప్రవాళః |

(26) సమీప మాతృకలోని మూడక్షరాల పరిమితిగల పదాలలోని అంత్య ద్విరుక్తత తెలుగులో అద్విరుక్త మవుతున్నది. ఇది తెలుగు నిర్మాణరీతి కనుగుణ మైన ధ్వని పరిణామంగా నిర్ణయించవచ్చు. తెలుగునందలి పదపరిమాణాన్ని కుదించడమే దీని లక్ష్యంగా తోస్తుంది.

| | | |
|---|---|---|
| ఓలగము | ఓలగ్గ- | అవలగ్న- |
| బాసట | పాసట్ఠ- | పార్శ్వస్థ |
| ఓహట (ఇరు) | ఓహట- | అవఘట్ట- |
| ఆరతి | అరత్తిఅం | ఆరాత్రికమ్ |
| ఆలతి | ఆలత్తి | ఆలప్తి |
| సవతి | సపత్తీ | సపత్నీ |
| చవుతి, చవితి | చఉత్థీ | చతుర్థి |
| హళది | హలద్దీ | హరిద్రా |
| బచ్చెన | పచ్ఛణ్ణ- | ప్రచ్ఛన్న |

(27) కృతకప్రామాణిక రూపాల (Hyper forms)కు కొన్ని ఉదాహరణాలు :

| | | |
|---|---|---|
| ప్రక్క (<పక్క) | పక్ఖ- | పక్ష- |
| హారతి (<ఆరతి) | ఆరత్తి అం | ఆరాత్రికమ్ |

(28) తెలుగు దాని ఉపగ్రహ భాషలైన కుఇ, కువి, కొండదొర భాషలలో తప్ప మూల ద్రావిడంలోను, ఇతర ద్రావిడ భాషలలోను పదాది సంయుక్తత కన్పించదు. పైన పేర్కొన్న తెలుగు మొదలైన భాషలలోమాత్రం రేఫ ద్వితీయ వర్ణంగా కల్గిన పదాది సంయుక్తత విశిష్టలక్షణంగా గోచరిస్తున్నది. ఇట్టి పదాది సంయుక్తత ఈ భాషలలో అర్వాచీన దశలో ఏర్పడ్డదిగా భావించవచ్చు. తెలుగులోని క్రింద, త్రాగు, ప్రాత, బ్రదుకు, మ్రింగు, వ్రాయు, స్రుక్కు మొదలైన దేశ్యపదాలలో రేఫ ఘటిత పదాది సంయుక్తత కన్పిస్తున్నది, వీటి మూలరూపాల (Protoforms) లో సంయుక్తత లేనే లేదు. వర్ణవ్యత్యయం వల్ల ఈ సంయుక్తత ఏర్పడింది. చాల అరుదుగా ఈలాంటి సంయుక్తత పదాదియందు ప్రాకృత భవాలలో కన్పిస్తున్నది.

| | | |
|---|---|---|
| క్రీడి | కిరీడి | కిరీటిన్ |
| క్రోవి | కురవయ | కురవక |

(29) తెలుగులోని తద్భవాలు సాధారణంగా తెలుగు నిర్మాణరీతికి అనుగుణంగా వచ్చిచేరాయి. కొన్ని తద్భవాలు కవిపండితుల కల్పితాలుగా సిద్ధరూపాల సామ్యం మీద రూపొందించిన సాధ్యరూపాలుగా కన్పిస్తాయి.

| | | |
|---|---|---|
| ఉదుబటుఁడు | ఉబ్బడ- | ఉద్భట- |
| చక్కరవతి | చక్కవత్తి | చక్రవర్తి |
| తిరసకరించు | తిరక్కార- | తిరస్కార-, తరస్కా |
| దోగి | ద్రోహి | ద్రోహి |
| మిత్తురుఁడు | మిత్తం | మిత్రమ్ |
| ముగుదుఁడు | ముద్ధో | ముగ్ధః |
| లక్కుముఁడు | లక్ఖణో | లక్ష్మణః |
| వాలుమీకి | వమ్మీఅ | వాల్మీకి |
| వెంగము | వంగ- | వ్యంగ్య- |
| వేసుఁడు | వాసో | వ్యాసః |

ప్రకరణం 11

# తెలుగులో అన్యదేశ్యాలు

*డాక్టర్ వి. స్వరాజ్యలక్ష్మి*

**11.0.** ఏ భాషలోనైనా పదాలు దేశ్యాలు (indigenous), అన్యదేశ్యాలు (Foreign) అని రెండు రకాలుగా ఉంటాయి. మూలభాషలనుంచి సంక్రమించినవి దేశ్యాలు; తదితరాలు అన్యదేశ్యాలు. భాషలో కొత్తపదాలు చేరడానికి ముఖ్యమైన కారణం ఆదానం (Borrowing). సాధారణంగా ఒక భాషను మాట్లాడే ప్రజలు భౌగోళికంగా సమీపవర్తి భాషలనుంచిగాని, సాంఘిక, రాజకీయ, మత, సాంస్కృతిక, వాణిజ్య సంబంధాలవల్ల దూరవర్తి భాషలనుంచిగాని కొత్తపదజాలాన్ని గ్రహిస్తారు. ఒక భాషావ్యవహర్త ఒక వస్తువునుగాని, ఒక భావాన్నిగాని సూచించడానికి తగిన పదం తన భాషలో లేనప్పుడు తనకు సన్నిహిత సంబంధంగల వ్యవహర్తభాషలో ఆ పదం ఉంటే దాన్ని స్వీకరిస్తాడు. పరిపాలనావ్యవస్థలో పరిపాలకుల భాషలోని పదజాలం పరిపాలితుల భాషలో చేరే అవకాశం ఎక్కువగా ఉంటుంది. వాణిజ్య సంబంధాలవల్ల భాషలు పదాలను పరస్పరం ఇచ్చిపుచ్చుకుంటాయి. ఇలాటి పదాలనుబట్టి భాషావ్యవహర్తల సంబంధస్వభావాన్ని ఊహించవచ్చు.

ద్రావిడభాషాకుటుంబానికి చెందిన తెలుగును చారిత్రకంగా పరిశీలిస్తే ప్రాచీన దశలో తత్సమతద్భవ పదజాలం ఎక్కువగా చేరినట్టు చెప్పవచ్చు. మహమ్మదీయుల పరిపాలనా కాలంలో అరబిక్, పర్షియన్ భాషాపదాలు తెలుగువారి రాజకీయ, సాంఘికరంగాలలో వ్యవహారంలోకి వచ్చాయి. ఆ తరువాత వరుసగా పోర్చుగీసు, ఇంగ్లీషు మొదలైన యూరోపియన్‌భాషల ప్రభావం తెలుగుపైన ఎక్కువగా కనిపిస్తుంది. తెలుగులోని తత్సమ, తద్భవేతర భాషాపదాలను గురించి ఈ ప్రకరణంలో వివరిస్తాను.

**11.1.** మహమ్మదీయులు 18వ శతాబ్దంలో ఆంధ్రదేశంపై దండయాత్రలు జరపకముందే ఆంధ్రులకి మహమ్మదీయులకి వాణిజ్య సంబంధం ఉన్నట్లు తెలు

స్తున్నది. ఎందుకంటే తిక్కన సోమయాజి భారతభాగంలో త్రాసు (<తరాజూ) అనే పదాన్ని రెండుసార్లు వాడాడు. (చక్రధరరావు 1966: 8). అంటే ఈ పదం ఆయన కాలంనాటికే బాగా వాడుకలో ఉండి ఉండాలి. ముసల్మాను పాదుషాలలో అల్లావుద్దీన్‌ఖిల్జీ సైన్యం మొట్టమొదట దక్షిణానికి వచ్చి ఓరుగల్లుని ముట్టడించింది (1284). అల్లావుద్దీన్ సైనికులలో కొందరు తిరిగి ఢిల్లీవెళ్ళక దక్షిణం లోనే స్థిరపడిపోయారు. ఆ సంఘటనే ఆంధ్రుల, ముసల్మానుల కలయికకి నాంది అయింది. తరువాత ఢిల్లీ సుల్తానయిన ఘయాసుద్దీన్ తుగ్లకు కాలంలో కాకతీయులు ఢిల్లీ సుల్తాన్లకి సామంతులయ్యారు. మహమ్మద్ బిన్‌తుగ్లక్ తన రాజధానిని ఢిల్లీనించి దేవగిరికి మార్చటంతో మరికొంతమంది ముస్లిముల రాకకు కారణమయింది. ముసల్మానుల దాడిని ఆపటంకోసం, ఆంధ్రసంస్కృతిని కాపాడటానికి 1336 లో విజయనగర సామ్రాజ్యం స్థాపించబడింది. అదే కాలంలో 1347లో హసన్‌గంగూ బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు విజయనగరరాజులకి బహమనీరాజులకి యుద్ధాలు తరచు జరుగుతుండేవి. విజయనగరరాజులు గుఱ్ఱాలని అరబ్బులవద్ద, పారశీకులవద్ద కొంటూండేవారు. తుపాకివాడకం కూడా తురకలవద్దనే నేర్చుకొన్నారు. మహమ్మదీయసైనికులు మంచి శిక్షణ కలవారని తమ సైన్యంలో చేర్చుకొంటూండేవారు. వారి సైనికులు హైందవులతో కలియటంవల్ల కొన్ని కొత్తమాటలు సైనిక వ్యవస్థలోకి రావటం జరిగింది. మహమ్మదీయ సైనికులు దక్షిణవాసులతో మాట్లాడటానికి తమతోతెచ్చిన మిశ్రమ భాషని ఉపయోగించేవారు. వారు మాట్లాడే భాషలో పంజాబీ, హర్యానీ, ఖడీబోలీపదాలూ, అరబిక్, పర్షియన్ పదాలూ ఉండేవి. ఈ భాషే రానురాను సాహిత్యభాషగా మార్పుచెందింది. సాహిత్యవేత్తలు దీన్నే 'హింద్వీ' అని, 'దక్నీ' అని పిలిచేవారు. ఇది 18వ శతాబ్దంవరకు రాజభాష కాలేకపోయినప్పటికీ, స్థానిక ప్రజలు విరివిగా వాడటంవల్ల తెలుగుపై ప్రభావం చూపింది.

తెలుగుభాషా పరివర్తనకి ఒక సైనికోద్యోగులే కారకులుకారు. దక్షిణభారతం లోని అప్పటి రాజకీయ పరిస్థితులుకూడా కారణమయ్యాయి. అప్పుడు వేరువేరు ప్రాంతాల్ని పాలించే హిందూరాజులలో ఐక్యంలేదు రాచకొండవెలమలు, కొండ వీటిరెడ్లు దేవరాయలకి శత్రువులయ్యారు. వీరు బహమనీ రాజులతో కలిసి విజయ నగరంతో యుద్ధం చేసేవారు. ఆ మహమ్మదీయపాలకులతో మంచి సంబంధంకలిగి ఉండటానికి కనీసం కొందరు ముఖ్యోద్యోగులైనా వారి రాజభాష అయిన పర్షి

యన్‌ని నేర్చుకోవలసివచ్చింది. వీరభద్రారెడ్డిమంత్రి అయిన బెండపూడి అన్నయామాత్యుడు (క్రీ. శ. 1420) పర్షియన్, అరబిక్, టర్కిష్ భాషలను నేర్చుకొన్నాడని శ్రీనాథుడు భీమఖండంలో చెప్పాడు. క్రీ. శ. 1530 లో బహమనీరాజ్యం చీలిన తరువాత గోలకొండను కుతుబ్‌షాహీలు పాలించారు. సుల్తాను కులీకుతుబ్‌షా ఆంధ్రప్రాంతమంతా ఒకేరాజు అధికారంలో ఉండటం అవసరమని అనుకొని విజయనగర రాజులతో యుద్ధంచేసి కొండవీడు, బెల్లంకొండల్ని వశపరచుకొన్నాడు. క్రీ. శ. 1565లో ఇంబ్రహీం కుతుబ్‌షా కాలంలో జరిగిన తల్లికోట యుద్ధంలో రెండు శతాబ్దాలపాటు ఆంధ్ర సంస్కృతిని కాపాడుతూ వచ్చినటువంటి విజయనగర సామ్రాజ్యం నాశనమయింది. మహ్మదు కులీకుతుబ్‌షా కాలంనాటికి(క్రీ. శ 1580) వారి రాజ్యానికి ఉత్తరాన గోదావరి, దక్షిణాన తుంగభద్రానది సరిహద్దులుగా ఉండేవి. అంటే ఆంధ్ర భూభాగంలో చాలాభాగం మహమ్మదీయుల పాలనలోకి వచ్చిందన్నమాట. వీరికాలంలో తెలుగువాళ్ళ సంస్కృతి కొత్తపంథాలో నడిచిందని చెప్పొచ్చు. ఆంధ్రదేశంలో అంతకుముందున్నటువంటి పరిపాలనా వ్యవస్థని కొంతవరకు మార్చారు. అప్పటిరాజభాష పర్షియన్. అందుకని పరిపాలనావ్యవస్థలోని కొన్ని మాటలు పర్షియన్‌నుంచి తీసికొనబడ్డాయి. ఉదా: దీవాను, కొత్వాలు మొ॥వి. చాలామంది తెలుగువారు ఉన్నత పదవుల్లో ఉండటంతో పరిపాలనా సౌలభ్యంకోసం తమ మాతృభాష అయిన తెలుగునేకాక అరబిక్, పర్షియన్‌లను కూడ నేర్చుకుంటూండేవారు. వారేకాక సామాన్య ప్రజలుకూడ కొన్నికొన్ని మైన పర్షియన్, ఉర్దూ మాటల్ని వాడే అవసరం ఉండేది.

ఒక పరిపాలనా విషయంలోనేకాక వ్యాపార, వాణిజ్యరంగాలలో కూడ పర్షియనులు, మహమ్మదీయులు అధిక్యత కలిగి ఉండేవారు. ఆ పరిస్థితులలో వాణిజ్య సంబంధమయిన మాటలుకూడ తెలుగుభాషలోకి వచ్చాయి. ఉదా : గసగసాలు, ఖరీదు, కిస్‌మిస్ మొ॥వి. క్రీ. శ. 1687 లో ఔరంగజేబు గోలకొండను పూర్తిగా వశం చేసుకొన్నాడు. క్రీ. శ. 1707 లో ఔరంగజేబు మరణించిన తరువాత ఢిల్లీరాజ్యం బలహీనం అయిన సమయంలో క్రీ. శ. 1723 లో నిజాముల్ ముల్కు 'అసఫ్‌జా' అనే బిరుదంతో స్వతంత్రరాజ్యాన్ని స్థాపించాడు. క్రీ. శ. 1766 వ సం॥లో నిజాముకు ఆంగ్లేయులకి జరిగిన ఒడంబడిక ప్రకారం ఉత్తర సర్కారులు ఆంగ్లేయులు తీసుకొన్నప్పటికి తెలంగాణాప్రాంతం మాత్రం ముస్లింల అధికారం కింద ఉండేది. తెలంగాణాప్రాంతంలో మాట్లాడే తెలుగు, ఉర్దూ ప్రభావం

వల్ల ఎక్కువ మార్పు చెందటానికి ఇదే కారణం. నిజాం పరిపాలనాకాలంనాటి జనాభాలెక్కల్ని పరిశీలిస్తే కొత్త వృత్తి కులాలు (occupational classes) కనిపిస్తాయి. కస్బాబులు లేక కటికవాళ్ళు, కలాలువాళ్ళు (సారా మొదలైన మత్తు పదార్థాలు తయారుచేసేవాళ్ళు) కొత్త పరిశ్రమలు స్థాపించారు. చిమ్‌టా, కటార్ మొదలైన పరికరాల్ని వాడటం జరిగేది. కొంతమంది పర్షియనులు తివాసీ పరిశ్రమ మొదలుపెట్టారు. బట్టలమీద అద్దకంకూడా మహమ్మదీయులు మొదలుపెట్టిన పరిశ్రమే. మొదటినుంచి నవాబులు ఆడంబరంగా ఉండేవాళ్ళు కనక జరీవస్త్రాలనేత, కలంకారీ అద్దకాలకి ఎక్కువ ప్రోత్సాహం లభించి విదేశాలలోకూడ ప్రఖ్యాతి పొందాయి. ఈ విధంగా ప్రజల సాంస్కృతిక జీవనం కొంతమారింది. ఇంకా రెండు సంస్కృతుల సంసర్గం ఫలితంగా కొత్తమాటలు తెలుగులోకి వచ్చాయి. అప్పటి అధికారభాష పర్షియన్ అయి ఉండటంతో పర్షియన్, అరబిక్, ఉర్దూలను నేర్చుకొన్నవారికి ఉన్నతోద్యోగాలు, విదేశాలకు పోవటానికి అవకాశం ఇచ్చేవారు. ఇంగ్లీషువాళ్ళుకూడ 1885 వ సం॥లో ఉర్దూను రాజభాషగా ప్రకటించారు. ఇట్లా అన్నివిధాల పైస్థాయిలో ఉండి పర్షియన్, అరబిక్, ఉర్దూ భాషలు తెలుగుపై ప్రభావం చూపాయి.

**11.2**. పర్షియన్, అరబిక్ భాషలనుంచి తెలుగులో ప్రవేశించిన పదాలలో కొన్ని చాలా సహజ ధ్వనిపరిణామ పద్ధతులకు భిన్నంగా మార్పులు పొందినట్టు కనిపిస్తుంది. ఉదా :

| *తెలుగు* | *పర్షియన్* | *అర్థం* |
|---|---|---|
| ఎకిమీడు | హకీమ్ | 'యజమాని' |
| హస్తిభారము | ఉస్తువార్ | 'పునాది' |
| సిరినామా | నర్‌నామా | 'చిరునామా' |

పై మాటల్నిచూస్తే సాధారణంగా తెలుగులో జరిగే ధ్వని పరిణామాలకు భిన్నమైన పరిణామాలు కనిపిస్తాయి. తెలుగులో సాధారణంగా పదాది హకార లోపం కనిపిస్తుంది. ఉదా : ఉషారు (<హుషార్) కాన దానిపైన అచ్చులో మార్పురాదు. కాని ఎకిమీడు (<హాకిమ్) లో 'ఆ' 'ఎ' కావడం కనిపిస్తుంది. అలాగే తక్కిన ఉదాహరణలుకూడా సాధారణజనంలో ఉన్న పద్ధతిలోకాక ఛందస్సుకోసమో, రచనానుకూలంగానో మార్పులుచేసి కవులు కావ్యాలలో ప్రయోగించి ఉంటారు.

**11.3.** 15వ శతాబ్ది ఉత్తరభాగంనుంచి శాసనాల్లో పరిపాలనా వ్యవస్థకు సంబంధించినవి, సామాన్యప్రజలు ఉపయోగించేవి, సైనిక వ్యవస్థలో ఉపయోగించేవి, న్యాయశాస్త్రానికి సంబంధించినవి సుమారు 200 పదాలు పర్షియన్, అరబిక్ భాషలకు సంబంధించినవి కనబడ్డాయి (మోదేకుర్తి సత్యనారాయణ, *భారతి*, అక్టోబర్, 1959.) అయితే సహజ ధ్వని విపరిణామ పద్ధతులకి భిన్నంగా పదాలు కొన్ని శాసనాలలో కనిపిస్తున్నాయి. ఉదా : ప. ఖర్చ్, తె. కురుచ; ప. కాగజ్, తె. కాకితం; మొ. కురుచలో అ > ఉ సహజధ్వని విపరిణామానికి విరుద్ధం. అజ్మధ్యస్థంగా నాదధ్వనులే సాధారణంగా కనిపించవలసి ఉండగా 'కాకితం'లో శ్వాసస్పర్శాలు కనిపిస్తున్నాయి. అంటే నాదోష్మమైన 'గజ'లు 'గ,జ/ద'లుగా మారవలసి ఉండగా ఆ స్థానంలో 'క,త'లు కనిపిస్తున్నాయి. ఈ పదం ఇలాగే కావ్యాల్లోకూడా కనిపిస్తుంది. బహుశా కవుల, శాశనలేఖకుల ప్రయోగాలలో అలాంటిరూపం ఉండి ఉంటుంది. 'మరహమ్మతు' అనే మాట మరమ్మతుకు సమానంగా బాగుచేయటం అనే అర్థంలో కనిపిస్తుంది. ఇలా పదంమధ్య హకారంచేరే అవకాశాలేమీలేవు. పర్షియన్‌లో 'దయకలిగిఉండు' అనే అర్థంలో మరహ్మత్/మర్హమత్ అనే పదం కనిపిస్తుంది. బహుశా శాసన లేఖకులు రెండు పదాలను సమానార్థకాలుగా భావించి 'మరమ్మతు'కు మూలరూపం 'మరహ్మత్' అని అనుకొని ఉంటారు.

**11.4.** ప్రాచీన కావ్యాలలో సుమారు 900 ల అన్యదేశ్యాలు ముఖ్యంగా పర్షియన్, అరబిక్, భాషలకు సంబంధించినవి కనిపిస్తాయి. రాజకీయ సంబంధమైన సుల్తాను, పాదుషా, ఫర్మానా, హుజూరు, కితాబు మొ. వి., సైనిక పరమైన సిపాయీ, తుపాకీ, బందుకు, ఫిరాయించు, ఫౌజు, బందోబస్తు, మొ. వి., వ్యాపార సంబంధమైన దుకాణం, త్రాసు, మొ. వి., రెవిన్యూ పదాలైన కౌలు, కుశ్కీ, దుంబాలా మొ. వి., న్యాయశాఖకు సంబంధించిన దివాను, నకలు, నకాబత్తు మొ. వి., సామాన్యజనులు ఉపయోగించే వస్తుసామగ్రికి సంబంధించిన కుర్చీ, ఖాబు, మొ. వి., వస్త్రవిశేషాలైన కలంకారీ, జంబుఖానా, కుల్లాయ, జరతారు మొ. వి., ఆటలకు సంబంధించిన గంజిఫా మొ. వి.., పైన పేర్కొన్న అన్యదేశ్యాలలో కనిపిస్తాయి (చక్రధరరావు : 1965). వీటిలో చాలామాటలు కొన్ని దేశ్యాలను వాడకంలో లేకుండాచేశాయి. ఉదా : దుకాణం, కౌలు, సిపాలు, ఖూనీ మొ. వి.

**11. 5.** ఒక భాష వేరొక భాషనుంచి పదాల్ని ఎరువు తెచ్చుకున్నప్పుడు స్వభాషావర్ణ నిర్మాణానికి అనుకూలమైన పద్ధతిలో పదాలను మార్చుకుని తనలో ఇముడ్చుకుంటుంది. పర్షియన్ 'సుల్తాను' పదానికి రూపాంతరాలైన సురతాణ, సురతాణి, సురత్రాణ, సురథాణి, సురథాణు, సురదాణి, సురధాణి సురధాణ, సురధానిలాంటి కావ్య ప్రయోగాలకు సరియైన వివరణలు ఇవ్వటం కష్టమే అయినా తెలుగులో లేని ధ్వనులుగల అన్యదేశ్యాలలోని ధ్వనులు ఎటాంటిమార్పులు చెందాయో సంగ్రహంగా ఇక్కడ వివరిస్తాను.

1. తెలుగులో దంత్యస్పర్శోష్మాని [చే] కి సమానమైనధ్వని ఉర్దూలోలేదు. కాబట్టి తాలవ్యేతర స్వరం పరమైనా ఉర్దూనుంచి అరువు తెచ్చుకున్న పదాలలో తాలవ్య స్పర్శోష్మమే కనిపిస్తుంది.

ఉదా : చాక్, చార్.

2. ఉర్దూలో ఉన్న (z) కు పరంగా తాలవ్యాచ్చు వచ్చినప్పుడు దాన్ని తెలుగులో జ గానే ఉచ్చరిస్తాం. ఉదా : అ జిలా, తె. జిల్లా; అ.జిద్, తె. జిద్దు.

3. ఉర్దూ (z) కు పరంగా తాలవ్యేతరస్వరంవస్తే తెలుగులోదాన్ని జే(dz) గా ఉచ్చరిస్తాం. ఉదా : వ. జమీందార్, తె జేమీందారు; ప. జమానా, తె. జేమానా; ప. జరీ, తె. జేరీ; ప. జప్త్, తె. జేప్తు.

4. తాలవ్యేతర స్వరం పరమైన అన్యదేశ్యాలలోని [J] ను [జే] గా కూడా ఉచ్చరిస్తాం. ఉదా : ఉ. జోడ్, తె. జోడు; ప. జాగీర్దార్, తె. జాగీర్దారు/ జే గీర్దారు.

5. సమీపమాతృకలోని పరహనుమూలీయ స్పర్శవర్ణం క [q] తెలుగులో [ఖ] వర్ణంగా మారుతుంది. ఉదా : ఉ. క̤రార్, తె. ఖరారు 'ఒడంబడిక'; ఉ. క̤స్సాబ్, తె. ఖసాబు 'ఒక వృత్తికులం'; ఉ. క̤ాబు, తె. ఖాబు 'పెద్దపాత్ర.'

మెకంజీ రాత ప్రతుల్లో పై పదాలకు రూపాంతరాలు కనబడ్డాయి. ఉదా : కరారు, కసాబు మొ నేటి తెలుగులో 'ఖాబు' అనే మాటకు బదులు 'గాబు' అనే మాట వాడకంలో ఉంది.

6. [క̤] [క] గా మాత్రమే మార్పుచెందటంకూడా కనిపిస్తుంది. ఉదా : ఉ. క̤బ్జా, తె. కబ్జా.

7. పదమధ్యంలోకూడా క̣>ఖ లేక క̣>క మార్పులు కనిపిస్తాయి. ఉదా. అ. మక̣ాం, తె. మకాం'అగటం'; అ. తన్క̣ీ, తె. తనఖా 'నిర్ణయం ; అ. ముక్̣రర్ ; తె. మొకర్రరు, మొఖరరు, 'నియనించు'.

పదమధ్యంలో క, ఖలతో రూపాంతరాలు కనపెడటాన్నిబట్టి క̣>కతో కూడిన పదాలే సరియైనవని, పైన (11.6.5.) చూపిన ఉదాహరణలలో 'ఖ' లేఖక దోషం అయి ఉంటుందని ఊహించవచ్చు.

8. ఉర్దూలోని సాప్తపథీనోష్మం [ x ] తెలుగులో మహాప్రాణ హను మూలీయ శ్వాసస్పర్శం [ ఖ ] గా మారుతుంది. ఉదా : ప ఖ̱రీద్, తె. ఖరీదు; ప. ఖ̱ర్చ్, తె, ఖర్చు ; ఆ. ఖ̱రాబ్, తె. ఖరాబు; అ. ఖ̱ాలీ, తె. ఖాళీ.

పదమధ్యంలోకూడా ఈ మార్పు కనిపిస్తుంది. ఉదా : ప. దాఖ̱ిలా, తె. దాఖలా; అ ఆఖ̱ిర్, తె. ఆఖరు

9. ఖ̱>క మార్పులుకూడా కొన్ని పదాల్లో కనిపిస్తుంరి. ఉదా : అ ఖబర్, తె. కబురు; అ తారీఖ్̱, తా. తారీకు.

10. ఉర్దూలోని మహాప్రాణ హనుమూలీయం [ ఖ ] అల్పప్రాణం అవుతుంది. ఉదా. ఉ. ఖండియా, తె. కండువా.

11. సాప్తపథీననాదోష్మధ్వని [ గ ] తెలుగులో హనుమూలీయ నాద స్పర్శం [ గ ] గా మారుతుంది. ఉదా : ఉ. గ̇రీబ్, తె. గరీబ్ ; ఉ. గ̇ులామ్, తె. గులాము.

12. ఉర్దూలోని హనుమూలీయ నాదమహాప్రాణస్పర్శం [ ఘ ] తెలుగులో కొన్ని పదాలలో అదే విధంగా ఉంటుంది; కొన్ని పదాలలో అల్పప్రాణంగా మార్పు చెందుతుంది. అంటే వ్యవహారంలో ప్రయోగం (functional load) తక్కువగా ఉండే పదాలలో మార్పులేకపోవటం, ప్రయోగం ఎక్కువగా ఉండే పదాలలో మార్పు కలగటం జరిగి ఉండవచ్చు. ఉదా : ఉ. ఘరానా; తె. మరానా; ఉ. ఘాబ్రా, తె. గాబరా.

13. ఉర్దూలోని దంతోష్ఠ్యశ్వాసోష్మం ఫ [ f ] తెలుగులో కొన్నిచోట్ల అలాగే కనిపిస్తుంది. ఉదా : ఉ. ఫ̱ర్మానా, తె. ఫ̱ర్మానా; ఉ ఫ̱సల్, తె. ఫ̱సల్; ఉ. ఫ̱ిర్యాద్, ఫ̱ిర్యాదు.

14. ఫ కొన్నిచోట్ల పగామారుతుంది. ఉదా: ఉ ఫకీర్, తె. పకీరు ప. ఫర్ద్, తె. పద్దు. మెకంజీ రాతప్రతుల్లో 'పకీరు'కు 'ఫకీర్' అనే రూపాంతరం కూడా కనిపిస్తుంది. బహుశా మామూలుతెలుగులో 'ఫ' లేని కారణంగా అది సమీపధ్వని అయిన ఫగా మారిఉంటుంది. తరువాత అది అల్పప్రాణం అయి ఉంటుంది. ఉర్దూభాషాజ్ఞానం బాగా ఉన్నవారి ఉచ్చరణలో ఫ అలాగే నిలిచి ఉంది.

15. పదాది హకారం కొన్ని పదాల్లో అలాగే నిలిచి ఉండగా, కొన్ని పదాల్లో లోపిస్తుంది. ఉదా: ఉ హజారామ్, తె. హజారము; ఉ హవల్దార్, తె. హవాల్‌దారు; ఉ. హవేలీ; తె. హవేలి ఉ. హుషారు; తె. ఉషారు; ఉ హమామ్ ఖానా, తె. అమామ్‌ఖానా. పదమధ్యంలోని హకారంలో కింద చెప్పిన ధ్వని పరిణామాలు కనబడతాయి.

- అ. సంయుక్తాక్షరంలో మొదటిహల్లు 'హ' అయినట్లయితే, అది దానికి పరంగా వచ్చిన హల్లులతో సమీకరణం చెందుతుంది. లేదా లోపించి దాని పూర్వ స్వరం దీర్ఘమౌతుంది. ఉదా: ఉ. షహ్నాయి, తె. సన్నాయి; ఉ. ప్రహా, తె. పారా, పహరా.
- ఆ. హకారం సంయుక్తాక్షరంలో రెండవహల్లు అయినట్లయితే లోపిస్తుంది. ఉదా: ఉ. సర్హంగ్, తె. సరంగు.
- ఇ. హకారానికి 'ఇ' పరంగా వస్తే, 'హ' లోపిస్తుంది. ఉదా: ఉ. సిపాహి, తె. సిపాయి; ఉ. కాహిలా, తె. కాయిలా.

**11. 6.** పర్షియన్, ఉర్దూభాషలనుంచి తెలుగులోకి వచ్చిన పదాలవల్ల తెలుగు వర్ణాలవ్యాప్తి (distribution) లో కూడా మార్పువచ్చింది. తెలుగు అనునాసికాలైన [మ] [న] [ణ] లు స్పర్శాలకు పూర్వం పరిపూరకప్రవృత్తిలో ఉంటాయి. అంటే ఓష్ఠ్యాలకు ముందు ఓష్ఠ్యంగాను, మూర్ధన్యాలకు ముందు మూర్ధన్యంగాను అనునాసికం వినిపిస్తుంది ఉర్దూలో 'మ, న' అనేవి రెండే అనునాసికాలున్నాయి. అవి అన్ని పరిసరాలలోనూ వస్తాయి. అంటే మ,న, లు స్పర్శాలకు ముందు కూడా భేదిస్తాయి. ఉర్దూమాటలైన చమ్కి, చిమ్టా, చమ్డా మొదలైన పదాలు తెలుగులోకి రావడంతో [మ] వ్యాప్తిలో మార్పువచ్చింది. కాని తెలుగులోని వర్ణనిర్మాణానికి అనుగుణంగా స్వరభక్తివల్ల 'చమడా, చిమటా, చమికి' మొదలైన రూపాలుకూడా కొన్ని మాండలికాలలో కనిపిస్తున్నాయి.

**11. 7**. రెండుభాషలమధ్య సంబంధం ఎక్కువగా ఉన్నప్పుడు స్వతంత్ర పదాలే కాకుండా అనుబంధరూపాలుకూడా ఎరువుగారావచ్చు. ఎరువుమాటలలో కనిపించే కొన్ని అనుబంధరూపాలు దేశ్య రూపాలకుకూడా చేర్చడం జరుగవచ్చు. ఉదాహరణకు 'ఫౌజుదారు' మొదలైన ఆదానపదాల్లో కనిపించే 'దారు' అనే అను బంధరూపం కొన్ని కొన్ని తెలుగు పదాలపైనకూడా కనిపిస్తుంది. ఉదా : కొను గోలుదారు, అమ్మకందారు, మొ. అలాగే కరారునామా, కౌలునామా మొదలైన చోట్ల కనిపించే 'పత్రం' అనే అర్థం ఇచ్చే 'నామా' రూపం ఇంగ్లీషునుంచి ఎరువు తెచ్చుకున్న వీలు (will) తో చేరి 'వీలునామా' అనే రూపం తెలుగులో ఏర్పడింది. ఈ విధంగా ధాతువును ఒక భాషనుంచి, అనుబంధరూపాన్ని మరొక భాషనుంచి ఎరువు తెచ్చుకొని పదాన్ని సృష్టించడాన్ని (loanblend) అని అంటారు. ఇటు వంటివి నామవాచకాల్లోనేకాక క్రియలలోకూడా కనపడతాయి. ఉర్దూ ప్రేరణార్థక రూపాలపైన తెలుగుప్రత్యయాలు చేరటంవల్ల క్రొత్తక్రియారూపాలేర్పడుతాయి. ఉదా : బనాయించు, చలాయించు, దవుడాయించు మొదలైనవి.

**11.8**. **లోకనిరుక్తి** (Folk-etymology) : అన్యదేశ్యాల ప్రభావంవల్ల నిసర్గపదాలలో మార్పురావచ్చు. విశ్వాసఘాతకుడు అనే అర్థం ఇచ్చే 'నమ్మక్ హరామ్' (మెకంజీ వ్రాతప్రతి 133, పు. 101) అనే పదంలో 'హరామ్' అనేది అన్యదేశ్యం, నమ్మకం అనేది తెలుగుపదం. ఉర్దూలో నమ్మక్‌హరామ్ ఈ అర్థంలో కనిపిస్తుంది నమక్ అంటే ఉర్దూలో ఉప్పు అని అర్థం. కాని తెలుగులో నమక్ అనే పదం లేదు. కాబట్టి ఎక్కువగా వాడకంలో ఉన్న నమ్మకం అనే పదం 'నమక్' అనే పదం సమాసంలో వాడబడింది. ఈ విధంగా ఎరువు తెచ్చు కున్న పదాన్ని నిసర్గమైన పదంలాగా మార్చటమే లోకనిరుక్తి.

**11. 9**. ఉర్దూలోని -గార్ అనే ప్రత్యయం agentive suffix లాగా వాడబడుతుంది. ఉదా : మదద్ 'సహాయం,' మదద్‌గార్ 'సహాయకుడు'. తెలుగులో అదే వర్ణరూపం (phonemic shape) కలిగిఉన్న-'గారు' గౌరవర్థసూచక ప్రత్య యంగా వాడబడుతుంది. ఉదా: మాస్టర్‌గారు, అయ్యగారు మొ. వి. అన్యదేశ్య మయిన 'మదద్‌గారు' ఎరువుతెచ్చుకోవడంతో తెలుగు ప్రత్యయం అయిన 'గారు' అర్థంలో మార్పు వచ్చింది. అంటే ఈ ప్రత్యయం వాడబడే పరిసరాలు ( environments) ఎక్కువయ్యాయి. ఈ విధంగా ఎరువుతెచ్చుకున్న భావాన్ని

చెప్పటంకోసం అన్యదేశాన్ని ఎరువుతెచ్చుకొనేఐమలు నిసర్గమై అంతకుముందే భాషలో ఉన్న పదాంశాల పరిసరాల్లో మార్పుతేవడాన్ని (loan shift) అంటారు.

**11. 10**. ఉరూభాషా ప్రభావం ఎక్కువగా కనిపించే తెలంగాణాప్రాంతపు భాషలో వాక్య నిర్మాణంలోకూడా కొంతమార్పు కనిపిస్తుంది ఉర్దూలో గమ్యార్థ పదానికి చతుర్థీ విభక్తి ప్రత్యయం వాడనవసరంలేదు కనుక తెలుగులోకూడా అలాంటి ప్రత్యయలోపమే కనిపిస్తుంది. ఉదా : తె నేను బయటపోయిన, ఉ. మైఁ బాహర్ గయా.

**11.11**. తెలుగులో ఎక్కువగా వాడుకలో ఉన్న కొన్ని ఉర్దూ పదాలు, కింద ఇవ్వబడ్డాయి.

| *ఉర్దూ* | *తెలుగు* | *అర్థం* |
|---|---|---|
| ప>ప | | |
| పహ్రా | పహరా, పారా | 'కావలి' |
| దర్యాప్త్ | దర్యాప్తు | 'పరిశోధన' (investigation) |
| ఫ>ప | | |
| ఫిరానా | పిరాయించు | 'తిప్పు' (to turn) |
| త>త | | |
| తుక్డా | తుకుడా | 'ముక్క' |
| తాకీద్ | తాకీదు | 'ఆజ్ఞ' |
| తకరార్ | తకరారు | 'వివాదం' |
| మత్లబ్ | మతలబు | 'ఉద్దేశం' |
| మెహనత్ | మెహనత్తు | 'శ్రమ' |
| థ>త | | |
| థోడా | తోడెం | 'కొంచెం' |
| థాల్ | తల్లె | 'పళ్ళెం' |

| ఉర్దూ | తెలుగు | అర్థం |
|---|---|---|
| ట>ట | | |
| టలానా | టలాయించు | 'కాలయాపనచేయటం' |
| అటకానా | అటకాయించు | 'ఆపటం' |
| లూట్ | లూటీ | 'కొల్లగొట్టటం' |
| ఠ>ట | | |
| ఠోకర్ | టక్కరు | 'ఒకదాని నొకటి తగులుకోటం' |
| చిఠీ | చిఠ్ఠీ, చీటీ | 'ఉత్తరం' |
| చ>చ | | |
| చలాన్ | చాలాను | 'డబ్బుచెల్లించే పత్రం' |
| గచ్ | గచ్చు | 'గచ్చునేల' |
| చాకరీ | చాకరీ | 'సేవ' |
| ఛ>చ | | |
| ఛత్రీ | చత్రీ | 'గొడుగు' |
| ఛపానా | చపాయించు | 'ముద్రించటం' |
| క>క | | |
| కారోబార్ | కార్వాయి | 'పని' |
| చాకరీ | చాకరీ | 'సేవ' |
| షికార్ | షికారు | 'వాహ్యాళి' |
| ఖ>క | | |
| ఖాతా | కాతా | 'లెక్క, లెక్క పుస్తకము' |
| క఼>క | | |
| క఼బ్జా | కబ్జా | 'ఆక్రమించటం' |
| క఼లమ్ | కలం | 'పెన్ను' |
| క఼ిస్త్ | కిస్తీ | 'వాయిదా' |
| బక఼ాయ | బకాయి | 'ఋణం' |
| నక఼్ల్ | నకలు | 'తిరిగిరాసినది (copy)' |

| ఉర్దూ | తెలుగు | అర్థం |
|---|---|---|
| బ > బ | | |
| బర్తరఫ్ | బర్తరపు | 'ఉద్యోగంనుంచి తీసి వేయటం' |
| బందోబస్త్ | బందోబస్తు | 'ఏర్పాటు' |
| బేజార్ | బేజారు | 'విసుగు' |
| బద్‌నాం | బదనాం | 'అపవాదు' |
| జబర్‌దస్త్ | జబరుదస్తు | 'బలవంతం' |
| మజ్‌బూత్ | మజుబూతు | 'గట్టి' |
| భ > బ | | |
| భట్టీ | బట్టీ | 'బట్టలుడకబెట్టే పెద్ద పొయ్యి' |
| ద > ద | | |
| దగ్గా | దగా | 'మోసం' |
| దఫా | దఫా | 'సారి' |
| దురుస్త్ | దురుస్తు | 'బాగు (చేయటం)' |
| బంద్ | బంధు | 'మూయటం' |
| అదాలత్ | అదాలతు | 'న్యాయస్థానం' |
| ధ > ద | | |
| ధబ్బా | దబ్బా | 'మరక' |
| డ > డ | | |
| డబ్బా | డబ్బా | 'డబ్బా' |
| తుక్‌డా | తుకుడా | 'ముక్క' |
| గడ్‌బడ్ | గడబిడ | 'అల్లరి' |
| ఢ > డ | | |
| ఢీలా | డీలా | 'బలహీనం' |
| జ > జ | | |
| జగహ్ | జగా | 'స్థలం' |

(22)

| ఉర్దూ | తెలుగు | అర్థం |
| --- | --- | --- |
| జమానా | జమచేయు | 'కూడబెట్టటం' |
| హ్రాజ్ | హ్రాజు | 'వేలంపాట'(తెలం.మాండలికం) |
| **ఝ>జ** | | |
| ఝాడూ | జాడు | 'చీపురుకట్ట' |
| ఝగ్డా | జగడం | 'పోట్లాట' |
| **గ>గ** | | |
| గష్త్ | గస్తీ | 'గస్తీ (watch)' |
| గుత్త | గుత్తా | 'గుత్త (contract)' |
| జగహ్ | జగా | 'స్థలం' |
| హంగామా | హంగామా | 'కల్లోలం' |
| **ఘ>గ** | | |
| ఘబ్రా | గాభరా/గాబరా | 'భయం' |
| **ఫ>ప** | | |
| ఫుర్సత్ | పురుసతు | 'తీరిక' |
| తారీఫ్ | తారీపు | 'మెచ్చుకోలు' |
| లిఫాఫ | లిపాప | 'కవరు' |
| **స>స** | | |
| సవార్ | సవారీ | 'వాహనం' |
| సౌదా | సవుదా (చవుదాలు) | 'వస్తువులు' |
| సిపాహి | సిపాయి | 'సైనికుడు' |
| హిసాబ్ | హిసాబు | 'లెక్క' |
| పసంద్ | పసందు | 'ఇష్టం' |
| **ష>ష** | | |
| షికార్ | షికారు | 'వాహ్యాళి' |
| తమాషా | తమాషా | 'వేడుక' |
| షర్త్ | షరతు | 'ఒడంబడిక' |

| ఉర్దూ | తెలుగు | అర్థం |
|---|---|---|
| ష>స | | |
| షిఫారిష్ | సిఫారసు | 'recommendation' |
| గష్త్ | గస్తీ | 'watch' |
| జె>జ | | |
| జరూర్ | జరూరు | 'అవసరం, తొందర' |
| రోజ్ | రోజు | 'దినం' |
| జెర్ర | జర్ర | 'కొద్ది' |
| హాజెర్ | హాజరు | 'ఉండుట' |
| జెప్త | జప్తు | 'బలాత్కారంగా తీసుకొనటం' |
| ఖ>ఖ | | |
| ఖాతిర్ | ఖాతరు | 'గౌరవం' |
| ఖా మోష్ | ఖామూషు | 'నిశ్శబ్దం' |
| ఖుద్ | ఖుద్దు | 'స్వయంగా' |
| ఖ>క | | |
| దస్త్ఖత్ | దస్కతు | 'సంతకం' |
| గ>గ | | |
| గాయిబ్ | గాయెబు | 'కనబడకపోవటం' |
| దగా | దగా | 'మోసం' |
| వగేరా | వగైరా | 'మొదలైనవి' |
| గలత్ | గలతు | 'తప్పు' |
| హ>హ | | |
| హైరాన్ | హైరాను | 'ఏమీతోచనిస్థితి' |
| హాజెర్ | హాజరు | 'ఉండటం' |
| మహల్ | మహలు | 'పెద్ద భవనం' |

| ఉర్దు | తెలుగు | అర్థం |
| --- | --- | --- |
| హ > Φ(లోపం) | | |
| హుషార్ | ఉషారు | 'ఉత్సాహం' |
| సిపాహి | సిపాయి | 'సైనికుడు' |
| జగహ్ | జగా/జాగా | 'స్థలం' |
| పహ్‌రా | పారా | 'కాపుదల' |
| షహ్‌నాయ్ | సన్నాయి | 'ఒకరకం మేళం' |
| మ>మ | | |
| మత్లబ్ | మతలబు | 'ఉద్దేశం' |
| మదద్ | మద్దతు | 'అండ, సహాయం' |
| అమల్ | అమలు | 'to execute' |
| తమాషా | తమాషా | 'వేడుక' |
| బదనాం | బదనాం | 'అపవాదు' |
| న>న | | |
| నక్‌ల్ | నకలు | 'తిరిగి వ్రాసినది (copy)' |
| నిషాన్ | నిషానీ | 'గుర్తు' |
| ఇనాం | ఇనాం | 'బహుమానం' |
| మున్షీ | మున్షీ | 'రాసేవాడు (scribe)' |
| ల>ల | | |
| లూటీ | లూటీ | 'కొల్లగొట్టటం' |
| లిఫ్‌ఫా | లిపాపా | 'కవరు' |
| అదాలత్ | అదాలతు | 'న్యాయస్థానం' |
| ర>ర | | |
| రోటీ | రొట్టె | 'తినుబండారం' |
| తర్జుమా | తర్జుమా | 'అనువాదం' |
| ఫిక్ర్ | ఫికరు | 'ఆలోచన' |

## తెలుగులో యూరోపియన్‌భాషాపదాలు

**11. 12.** తెలుగుపై ప్రభావంచూపిన యూరోపియన్‌భాషలలో పోర్చు గీసు మొదటిది. 1498లో పోర్చుగీసులు భారతదేశపు పశ్చిమతీరంలోకి ప్రవే శించడంతో పోర్చుగీసు తెలుగుభాషలకు సంబంధాలేర్పడ్డాయి. పోర్చుగీసులకి, విజయనగరరాజులకి వాణిజ్యసంబంధాలుండేవి. విజయనగరసామ్రాజ్యంలోని శాంతోం, మైలాపూరం, నాగపట్టణం మొదలైనచోట్ల పోర్చుగీసులకి స్థావరా లుండేవి. 16వ శతాబ్దిలో పోర్చుగీసులు దక్షిణభారతరాజకీయాలలో జోక్యంచేసు కోవటంవల్ల, వాళ్ళతో రాజకీయ సంబంధం ఉంచుకోవడంకోసం పరిసర ప్రాంతాల రాజకీయోద్యోగులు పోర్చుగీసుభాషను నేర్చుకొవలసి వచ్చింది. 1571లో పోర్తు గాలు చక్రవర్తి ఆజ్ఞాపత్రాన్ననుసరించి చాలామంది భారతీయ క్రైస్తవులను దుబా సీలుగా నియమించడం జరిగింది. అందువల్ల దేశీయులు చాలామంది పోర్చుగీసు భాషను నేర్చుకోవడం ప్రారంభించారు. అంతేగాక చెన్నపట్టంలో ఇంగ్లీషు కుంఫిణి దొరలు వచ్చిన కొత్తలో వారు స్థాపించిన న్యాయస్థానాలలో పోర్చుగీసుభాషనే వాడేవారు. దానపత్రాలు, భూవిక్రయపత్రాలు, మొ. వి. పోర్చుగీసు తెలుగుభాష ల్లోనే ఉండేవి.

**11.13.** పోర్చుగీసువారు తమతోటి మనదేశానికి కొన్ని పళ్ళని, కాయ లని తీసుకొనిరావటం వాటిని సూచించేపదాలుకూడా తెలుగులోచేరాయి. అనాస, గొయ్యా (జామ), గోబి (క్యాబేజి), బొప్పాయి, టమాటో ఇలా వచ్చిన పదాలే, (**తూమాటిదొణప్ప**, 1962). తెలుగులో తాళపుచేవిలో-చెవి 'శావి' అనే పదంనుంచి వచ్చిన రూపం. వస్త్రసంబధమైన కమీజు, బొత్తాం; వస్తుసంబంధమైన అల్మార, బాల్చి, మేస్త్రి మొదలైన పదాలు పోర్చుగీసు భాషనుంచి తెలుగులోచేరినవే. 'ఇస్త్రీ' అనేదికూడా పోర్చుగీసుమాటే.

**11.14.** 'క్రిస్తాను' అనే పోర్చుగీసుమాట స్వరభక్తితో 'కిరస్తాను' అయింది. పోర్చుగీసు 'తోవాల్య' అనే పదంనుంచి చివరి 'య' లోపించి 'తువ్వాల, తువ్వాలు' అనే పదాలు ఏర్పడ్డాయి. పోర్చుగీసుభాషనుంచి తెలుగులోకివచ్చిన ఇతర పదాలు కొన్ని : (a) సైనిక సంబంధాలు : కపితాను, కమాను, పటాలము, సార్జంతు, మొ. (b) వస్త్రసంబంధాలు. మే (జోడు), ఇస్త్రీ, కమీజు, కాజా, బొత్తాము, మొ. (c) వర్తకసంబంధాలు : కుంపిణి, కోస్తా, గిడ్డంగి, గోదాము, బంకు,

మొ. (d) గృహపరికరాలు : బాల్చీ, పీపా, మేజా, సబ్బు, మొ. (e) ఇతరాలు : బిస్కతు, బాతు మొదలైనవి.

**11.15** పోర్చుగీసుల తర్వాత భారతదేశానికివచ్చి సుస్థిరప్రభుత్వాన్ని నెలకొల్పి ఇక్కడ భాషలపై ప్రభావం చూపిన యూరోపియనులు ఆంగ్లేయులు. ఈస్టిండియా కంపెనీవారు క్రీ. శ. 1600లో ఎలిజబెత్తురాణినుంచి భారతదేశంలో వ్యాపారంచేయటానికి అనుమతి సంపాదించి వచ్చి 18వ శతాబ్దినాటికి తమ అధికారాన్ని ఇక్కడ నెలకొల్పారు. ఆంగ్లేయులు వైజ్ఞానికసాంస్కృతిక సాంఘిక రంగాలలో అనేకమైన మార్పులు తెచ్చారు. దాని ఫలితంగా ఇంగ్లీషుపదాలనేకం తెలుగులో ప్రవేశించాయి. నిత్యావసరాలకు సంబంధించినలైటు, స్విచ్చి, కాఫీ, రోడ్డు, బస్సు, కారు, పెన్ను మొదలైనవి; పరిపాలనా సంబంధమైన కోర్టు, ఆఫీసు ఆర్డరు, ఫైలు మొదలైనవి ; సాంస్కృతిక సంబంధమైన ఫ్యాషను, డాన్సు, సినిమా, ఫ్యాను రేడియో, క్లబ్బు మొ. పదాలు తెలుగులోకి వచ్చాయి.

**11.16**. ఇంగ్లీషు పదాలు తెలుగులోకి వచ్చేప్పుడు పద స్వరూపాలలో, ధ్వనులలో కొన్ని మార్పులు కనిపిస్తాయి.

i. తెలుగు స్వరాంతభాషకావడంవల్ల వ్యజనాంతాలైన ఇంగ్లీషు పదాలపైన అచ్చుచేరి, చివరివ్యంజనం స్పర్శం అయితే ద్విరుక్తమవుతుంది. ఉదా : రోడ్ > రోడ్డు ;

స్పర్శేతర వ్యంజనం పదాంతలో అంటే అది హ్రస్వాచ్పూర్వకమైతేనే ద్విరుక్తమవుతుంది. ఉదా: పెన్>పెన్ను;బస్>బస్;ఫ్యాన్>ఫ్యాను;రైల్>రైలు.

ii. అవిద్యావంతులభాషలో పదాది సంయుక్తాక్షరాలు స్వరభక్తితో విడివడి ఉచ్చారణలో కనిపిస్తాయి. ఉదా : క్లాసు>కిలాసు; గ్లాసు>గిలాసు.

iii. పదమధ్యంలోకూడా స్వరభక్తి కనిపిస్తుంది. ఉదా : డాక్టర్>డాకటరు; కలక్టర్>కలకటరు.

iv. స్వరభక్తి సాధ్యంకానిచోట సంయుక్తాక్షరంలోని మొదటివర్ణం లోపిస్తుంది. ఉదా : స్టేషన్>టేషన్.

v. స్ట అనే సంయుక్తవర్ణం ష్టగా మారుతుంది. ఉదా : ఫస్టు>ఫష్టు.

vi. దంతోష్ఠ్యశ్వాసోష్మం [ఫ] తెలుగులో [ప] గా మారుతుంది. ఉదా : కాఫీ>కాపీ; ఫస్టు>పష్టు.

ప్రకరణము 12

# తెలుగులిపి పరిణామం

— తిరుమల రామచంద్ర

**12.0.** యరలవ మదనస యనుచును
ఐరువడి నీ యక్షరముల భయనయతతులన్
నిరతమును వ్రాయనేర్చిన
వరకరుణా వానివ్రాలు వట్రువలమరున్

(వేటూరి ప్రభాకరశాస్త్రి, చాటుపద్య మణిమంజరి)

మన దస్తూరీ గుండ్రంగాను, అందంగాను అమరడానికి మనపూర్వులెవరో పైన పేర్కొన్న పదాన్ని గోసాయిచిట్కాగా చెప్పారు. ఇప్పటి అక్షర సమామ్నాయం స్వరూపం చూచి ఇది మొదటినుంచి ఆణిముత్యాలకోవ అని ఎవరూ అనుకోరాదు. ఎన్నో వంకరటింకరగీతలు రాతిబండలమీద, రాగిరేకులమీద, తాటాకులమీద, కడితాలమిద రాపాడిరాపాడి ఇప్పటి స్వరూపం తీర్చుకొన్నాయి. ఈ పరిణామానికి దాదాపు రెండువేల యేండ్లు పట్టింది.

భాష ధ్వనిరూపంలో వ్యక్తమవుతుంది. ఈ ధ్వనులు ఇవి, ఇన్ని పీటికి ఇవి గుర్తులు అనే నిర్ణయమే అక్షర సమామ్నాయం. అక్షరమంటే క్షరంకానిది; నశించనది. మాట, పలుకు గాలిలో కలిసిపోతాయి; కాని వాటి సంకేతమైన అక్షరం మాత్రం ఎన్నేండ్లయినా ఉంటుంది.

**12.1.** ప్రాచీన పారశీకులు బాణాలవంటి గుర్తులతో ఒక లిపిని వాడుక చేశారు. దీనిని పాశ్చాత్యవిద్వాంసులు 'క్యూనీఫారం' లిపి అన్నారు. ఈజిప్టు దేశంలో ఒకప్పుడు చిత్రలిపిగా ఉన్నది క్రమంగా వంకరగీతల లిపిగా మారి ప్రపంచమంతా వ్యాపించి పెక్కులిపులకు మాతృక అయిందని పాశ్చాత్యవిద్వాంసుల వాదం.

**12.2.** మన భారతీయలిపికూడ చాల ప్రాచీనమైనదని, చిత్రలిపినుంచే స్వతంత్రంగా పరిణమించినదని పలువురు ప్రాచ్యపాశ్చాత్య విద్వాంసుల విశ్వాసం మనకు ప్రాచీనతమసాహిత్యమైన ఋగ్వేదంలోను (*ఋగ్వేదం* 1-164-24), యజుర్వేదభాగమైన తైత్తిరీయసంహితలోను ఉన్న అక్షరచర్చను, శతపథ బ్రాహ్మణంలోఉన్న అక్షరవర్ణచర్చనుబట్టి, పంచవింశ బ్రాహ్మణంలోఉన్న గణన విధానాన్నిబట్టి, శతపథ బ్రాహ్మణంలోని సమయచర్చనుబట్టి మనకు లేఖన పద్ధతి ఉండి ఉంటుందని ఊహించడానికి అవకాశముంది. క్రీస్తుకు పూర్వం 8వ శతాబ్ది వాడైన పాణిన్యాచార్యుడు లిపి, లిపికరశబ్దాలను, యవనానీ అనేలిపి విశేషాన్ని తెలుపడంవల్ల (*అష్టాధ్యాయి* 4-1-49, 1-3-75, 1-3-87, 4-3-116, 1-3-4), క్రీస్తుకు పూర్వం 4వ శతాబ్దివాడని పండితులు విశ్వసించే కౌటిల్యుని అర్థశాస్త్రం రాజకుమారులు చౌలవిధి తర్వాత లిపి, సంఖ్యాగణనం నేర్చుకోవాలని చెప్పడాన్నిబట్టి, లిపి మనకు ప్రాచీన కాలంనుంచి ఉన్నట్లే స్పష్టమవుతున్నది. వైదికసాహిత్యంలోనే కాక జైనబౌద్ధసాహిత్యాలలో లిపి ప్రస్తావన కోకొల్లలు. క్రీస్తుకు పూర్వం 300 ఏండ్లనాటి జైనుల సమవాయాంగణ సుత్తంలో 18 లిపులు, మహాయానబౌద్ధుల ప్రథమప్రమాణగ్రంథమైన లలితవిస్తరంలో 64 లింపులు (లిపిశాలా సందర్శన పరివర్తం) ఉదాహృతాలు. బుద్ధునికిముందునుంచే తమిళ సంగం సాహిత్యంలో లేఖనసంప్రదాయం ఉన్నట్టు శ్రీ టి. వి. మహాలింగం తెలిపారు : (*ESIP* 110-126).

**12.3.** ఇటీవల పురాతత్వశాస్త్రజ్ఞులు శ్రీ ఐ. కార్తికేయశర్మ అమరావతిలో జరిపిన త్రవ్వకాలలో వెలువడిన ప్రాచీన శాసనాన్నిబట్టి తెలుగుదేశంలో లిపి అశోకుని ముందునుంచే ఉన్నట్టు స్పష్టమవుతున్నది. (తెలుగుభాషాసమితి, *విజ్ఞాన సర్వస్వం, లలితకళసంపుటి*-అమరావతి). ఈ శాసనలిపి అశోకశాసనాలలిపికి సన్నిహితంగా ఉన్నది. ఈ లిపిని బ్రాహ్మీలిపి అని వ్యవహరించారు.

ఈ బ్రాహ్మీలిపి మనదేశంలో చిత్రలిపితో రూపు దాల్చిందని సర్ కనింగ్ హామ్ వాదం (*CII* 1;52). కాని డేవిడ్ డిరింజర్, జార్జ్ బ్యూలర్ మొదలయిన వారు బ్రాహ్మీలిపి ఈజిప్టుచిత్రలిపినుంచి ఆవిర్భవించిన ఫొనీషియన్ లిపినుంచి పుట్టిందని భావించారు. శ్రీ ఆర్. బి. దేశ్‌పాండే ఈ వాదాలను ఖండించారు. (*IP* 1. 31, 38, 48). బ్రాహ్మీలిపి పుట్టుక సంగతి ఎలా ఉన్నా దీనినుంచే భారతదేశం లోని లిపులన్నీ పుట్టాయి. ఇంతకుముందు చెప్పిన అమరావతి శాసనాలు కాక,

ఆంధ్రదేశంలో అశోకుడు వేయించిన శాసనాలు గుంటూరుజిల్లా భట్టిప్రోలులో ఒక స్తూపంలో స్తూపస్థాపకుల పేర్లున్న మూడు కరండకాలు-రాతిబరిణలు దొరికాయి. ఈ కరండకాల మీదిలిపికి అశోకలిపికి పోలికలు చాలా ఉన్న ఘ, చ, ద, ధ, మ, ల, శ, ష అక్షరాలు భిన్నంగా కనిపించడంవల్ల దీనిని ద్రావిడ బ్రాహ్మి అని, ఇది క్రీస్తుకు మూడు శతాబ్దాలకు పూర్వమే విడిపోయి ఉంటుందని బ్యూలర్ (*EI* 3. 825) అభిప్రాయపడ్డారు.

**12.4.** దక్షిణ బ్రాహ్మినుంచే తెలుగులిపి ఆవిర్భవించింది. మనదేశాన్ని పెక్కు రాజవంశాలవారు పాలించారు. వీరు తమ శాసనాలను తమ మాతృభాష లోను, ప్రాంతీయభాషలలోను వేయించారు. ఆయా శాసనాలలిపులు ఆయారాజుల పేరుతో సాతవాహనలిపి లేక ఆంధ్రలిపి, ఇక్ష్వాకులిపి. పల్లవలిపి, వేంగిలిపి, చాళుక్యలిపి, కాకతీయలిపి అని ప్రచారం పొందాయి. (తెలుగుభాషాసమితి : *తెలుగు సంస్కృతి* 3. 1057-58) దీనికి కారణం ఆయారాజుల కాలంలో జరిగిన మార్పులు, ఈ మార్పులలో అందమైన ఘట్టం ఇక్ష్వాకులకాలం. ఈ ఇక్ష్వాకుల కాలం తెలుగునాడులో యాభై సంవత్సరాలకన్నా హెచ్చుకాలం నిలవలేదు. తర్వాత శాలంకాయనులు వేంగీనగరం రాజధానిగా కొంత తెలుగు ప్రాంతాన్ని ఏలారు. వీరికి వైంగేయులు అనిపేరు వచ్చింది. వీరికాలంలో బ్రాహ్మిలిపిలో మరికొన్ని మార్పులు వచ్చాయి. శాలంకాయనుల తర్వాత విష్ణుకుండినులు తెలుగుదేశం పాలించారు. ఇది లిపి పరిణామంలో మరొక ఘట్టం. ఈ కాలపులిపిని వేంగీలిపిఅన్నారు. ఇది తెలుగు కన్నడ దేశాలలోనేకాక దక్షిణాపథమంతటా వ్యాప్తి చెందింది. ఇది తెలుగు కన్నడలిపికి పూర్వరూపం. ఇదే ఇండో చైనా, మలేషియా, జావా, ఇండోనీషియాలలోని హిందూవలస రాజ్యాలలోను మొట్టమొదట వాడబడింది.

**12.5.** విష్ణుకుండినుల కాలంలో లిపిలో చెప్పుకోదగిన మార్పువచ్చింది. శాలంకాయనుల కాలంలో కొన్ని అక్షరాలపై కనిపించిన చిన్న అడ్డుగీత విష్ణుకుండినుల కాలంలో దాదాపు అన్ని అక్షరాలపైనా కనిపించింది. అప్పటి తెలుగు భాషలో ఉండి, తర్వాత మరుగయిపోయి, నేడు తమిళభాషలో మిగిలిన 'ఴ' అనే వింత అక్షరం విష్ణు కుండినుల కాలంలో కనిపించడం మరొక విశేషం. ఈ వింత అక్షరం నన్నయకాలందాకా వాడుకలో ఉంది (అహదనకర శాసనం, *భారతి* 14. 825:47). దీని ఉచ్చరణ తెలుగులో క్రమంగా డ, ఱలుగా మారింది. వర్ణమాల

నుంచి అంతరించిపోయింది. విష్ణుకుండినుల శాసనాలలోని అక్షరాల అడ్డుగీత క్రమంగా పొడవై, వంకరై నేటి తలకట్టుగా స్థిరపడింది.

**12.6.** విష్ణుకుండినుల తర్వాత తెలుగుదేశాన్ని క్రీ. శ. ఏడవ శతాబ్దంలో చాళుక్యులు ఆక్రమించుకొన్నారు. వీరు దేశభాషాభిమానులు. వీరి కాలంలో తెలుగు భాషకు ఆదరం లభించింది; శాసనాలు తెలుగుభాషలో వెలువడినాయి. ఈ చాళుక్య రాజులు వేయించిన శాసనాలలో ప్రాచీనతమమయినది కుబ్జవిష్ణువర్ధనునిది. దీని కాలం క్రీ. శ. 622. ఈ కాలపులిపిని వేంగీ చాళుక్యలిపి అని వ్యవహరించారు.

ఈ వేంగీచాళుక్యలిపిని మనం తెలుగు-కన్నడలిపిఅని అనవచ్చు. ఇదిచాలా వ్యాప్తి చెందింది. బాదామీ చాళుక్యులను కూలదోసిన రాష్ట్రకూటులుకూడ ఈలిపినే వాడారు. ఈ లిపి మార్పులు చెందుతూ 10 వ శతాబ్దికి సంపూర్ణంగా వికసించి ఆధునిక తెలుగు-కన్నడ లిపిగా పరిణమించింది.

**12.7.** చాళుక్యులు వేంగీదేశాన్ని ఆక్రమించుకొన్న కాలంలోనే, పశ్చిమాంధ్ర ప్రాంతాన్ని తెలుగుచోళులు పాలించేవారు. వీరు మొదట పల్లవుల సామంతులైనా, తర్వాత స్వతంత్రులయ్యారు. వీరు తమ శాసనాలు వేంగీచాళుక్యలిపిలో వేయించారు. వీరిలో, రేనాటి చోళరాజయిన ఎరికల్ముత్తురాజు శాసనమొకటి కడపజిల్లా కమలాపురం తాలూకా ఎర్రగుడిపాడు గ్రామంలో చెన్నకేశవస్వామి దేవాలయం పక్క రాతిపై చెక్కబడి ఉంది. దీనికాలం క్రీ. శ. 575. ప్రసుతం మనకు లభించిన మొట్టమొదటి తెలుగుశాసనం ఇదే. (M. Venkata Rangayya, *History of Telugu chodas*; తిరుమల రామచంద్ర, *మన లిపి పుట్టుపూర్వోత్తరాలు* 1957) సత్యాశ్రయుడనే రేనాటి చోడరాజు శాసనమొకటి కడపజిల్లా పొట్లదుర్తి-మాలెపాడు గ్రామంలో ఉంది. ఇది మనకు దొరికిన ప్రాచీన శాసనాలలో రెండవది.

ఈవేంగీ చాళుక్యలిపికి క్రీ.శ. 10, 11, 12 శతాబ్దాలనుంచి పరివర్తనకాలం, దీనిని బర్నెల్ సంధికాలం అన్నాడు. ఈ మార్పు 14వ శతాబ్దంనుంచి మరింతస్పష్టమయింది. ఇదే ఇప్పటి తెలుగు కన్నడలిపుల ప్రాచీనరూపం.

నన్నయ ఈ వేంగీ-చాళుక్యలిపిలోనే తన భారతం వ్రాసి ఉంటారు. అతని భారత ప్రతులు మనకు లభించకపోయినా, ఆయన రచించిన నందంపూడి శాసనం లభించింది. ఆ కాలపు మరికొన్ని శాసనాలు దొరికాయి. వానినిబట్టి అప్పటిలిపి

ముందుకన్నా ఎంతగా మారిందో గ్రహించగలం. నన్నయకాలానికి మనలిపి బాగా తలకట్టు దిద్దుకొని చదికిలబడింది.

**12.8.** నన్నయకాలంనుంచి వేంగీ-చాళుక్యలిపిలో మార్పులు ప్రారంభమై తర్వాత రెండు వందల సంవత్సరాలకు కన్నడ-తెలుగులిపులను రెండుగా విడదీశాయి. అంతవరకు ఈ లిపి రాజమహేంద్రవరంనుంచి పశ్చిమ సముద్రతీరంవరకు వ్యాప్తిలో ఉండేది. దీనిని కచ్చితంగా తెలుగులిపి అనిగాని, కన్నడలిపి అనిగాని అనలేము. క్రమంగా తెలుగు మరీ గుండ్రనైంది; కన్నడలిపి కోణాకారమైనది. కాకతీయుల కాలానికి ఈ మార్పు స్థిరపడింది. మంచన, జక్కన తెలుగులిపిని ప్రత్యేకంగా తెలుపడం దీనికి ఉదాహరణం. ఈ లిపి పరిణామవృక్షం కింద సూచించిన రీతిగా భావించవచ్చు.



**12. 9.** సంధి కాలంలోలిపి పెక్కుమార్పులు చెందింది. చకారానికి తలకట్టు వచ్చింది. ఛ కారం ఎడమభాగం గుండ్రనైంది. ఠ, థ, ధ, లకు తలకట్లు వచ్చాయి. ఫ, భ లు చాలా మారాయి. అనుస్వారం చక్కగా చూపినా, బిందు రూపంలో చూపినా, అక్షరం పై భాగంలోనో, అక్షరానికి ఎగువ కుడిభాగంలోనో పెట్టే అలవాటు మారి అక్షరం పక్కన సపంక్తిలో పెట్టడం అలవాటయింది. మహాప్రాణాలకు ఒత్తులు-పొల్లులు ఏర్పడ్డాయి. ఒత్తుమొదట్లో బోరగిలవేసిన అర్థచంద్రాకారంగా ఉండి క్రమంగా పొక్కిలిలో నిలువుగీతగా నిలిచింది.

**12. 10.** రెడ్డిరాజులకాలానికి-శ్రీనాథుని కాలానికి-ఒకటి రెండక్షరాలు మినహాగా అన్నీమారాయి. అప్పటికి తెలుగులిపి ప్రపంచంలో పద్దామనిపిస్తుంది. ఇప్పటి తెలుగులిపి సన్నిహితదశ ఏర్పడింది. 'క' పూర్తిగా మారి ఇప్పటి రూపానికి వచ్చింది. 'ష' స్పష్టంగా నేటి రూపం తాల్చింది.

చ, జ లకు [ts], [dz] అనే దంత్యోచ్చారణఉంది. దీనిని తెలపడానికి చ, చలపై త ఒత్తు-—-వంటి, తెలుగు రెండుఅంకెవంటి గుర్తుపాత తెలుగు అచ్చు పుస్తకాలలో కనిపిస్తుంది. వ్రాతలో అలాటి గుర్తువాడడం అరుదు. ఈ ఉచ్చారణ గల వర్ణాలను మన వైయాకరణులు దంత్య చ, జ లు అని అన్నారు. వీటి ఉచ్చారణ తెలుపడానికి వీటిపైన చుక్కలు పెట్టాలని అప్పకవి సూచించాడు త్స,ద్స,ఱ,శ లు తెలుపడానికి చజరలలపై చుక్కలు పెట్టాలని అతని సూచన. 16వ శతాబ్దికి పూర్వపు తాటాకు పుస్తకాలలోగాని, కడితాలవ్రాత ప్రతులలోగాని ఇలాటి గుర్తులున్నాయేమో చూడవలెనంటే, మనకు అప్పటి వ్రాత ప్రతులు దొరకరేదు. శాసనాలలో ఇలాటిగుర్తులులేవు. ఱ, శ లకు ప్రత్యేకస్వరూపాలే ఉన్నాయి. దంత్య చ, జలను పేర్కొనడానికి ఈ-'‿' గుర్తును ఏర్పాటుచేసినవారు 19వ శతాబ్దిలో సి. పి. బ్రౌను. చ వర్గంలో మొదటి చ పైన తెలుగు '౧' గుర్తు, దంత్య చకారం పైన తెలుగు '‿' గుర్తువేయించాడు ఈయన. దీనిని రావిపాటి గురుమూర్తిశాస్త్రి తన వ్యాకరణంలోను పొందుపరిచారు. (తెలుగువ్యాకారణము, అక్షర లక్షణ ప్రకరణము).

**12. 11.** తెలుగులో అరసున్న మరొక వింతలిపి. ఇదికూడ వ్రాతలో 16వ శతాబ్దికి ముందు కనిపించదు. 12వ శతాబ్దినాటిదనిచెప్పే అధర్వణకారికావళి

"పూర్ణేందు సదృశః పూర్ణః అర్ధస్త్వర్ధేందు సన్నిభః" అని పూర్ణార్ధ బిందువులను సూత్రీకరించినా, దాని సమకాలపు శాసనాలలోగాని, అంతకుముందున్న శాసనాలలో గాని అరసున్న కనిపించదు. అప్పటివారు పదమధ్యానునాసికాలను అవసరమైతే ఊది పలకడం, అవసరంకాకపోతే తేల్చి పలకడం అలవాటు; వ్రాయడం మాత్రం అనునాసిక మధ్యమైన దానిని ద్విత్వాక్షరంగానే వ్రాసేవారు-'నేణ్టి', 'కూన్తు' లాగా (*SII* 4.286). అనునాసికాలకు అనుస్వారం వ్రాయడం ప్రాకృతభాషా ప్రభావాన్ని బట్టి అలవాటయిన తర్వాత అనునాసికయుత సంస్కృతపదోచ్చారణలో చిక్కు కలుగలేదు గాని, తెలుగు పదాల ఉచ్చారణలో చిక్కు వచ్చింది;ఏది తేల్చిపలకాలో, ఏది ఊది పలకాలోనని, దానికొకపద్ధతి అనుసరించినట్టు శాసనాలలో కనిపిస్తుంది : 'రాముండ్డు' అనే దానిని ఒత్తిపలకాలి; 'రాముండు' అనే దానిని తేల్చి పలకాలి. దీర్ఘం మీది 'నేంటి', 'మూండు' వంటి పదాలలోని అనునాసికాన్ని తేల్చిపలకసాగారు; ఏ కారణంగానో. కాని, వీటినిగూడ ఒత్తిపలుకడం లేకపోలేదు-మూండ్డు, కూంత్తురు లాగ (*SII* 4.476). ఇది నేడు తమిళనాడులో పూర్వం స్థిరపడిన తెలుగువారి ఉచ్చారణలో నేటికీ మిగిలింది-వేండ, వాండు ఇత్యాది. అనునాసికాలకు అనుస్వారం అలవాటయిన తర్వాత కొన్ని మాటలను తేల్చి పలకడంకోసం ఖండ బిందువును వైయాకరణులు తర్వాత సృష్టించారు. ఇది ఒకప్పుడు వ్యవహారంలోఉండి, కాలక్రమాన లోపించిన ఉచ్చారణల జ్ఞాపక చిహ్నంగా కొందరి వాడుకలోఉండి, తర్వాత వైయాకరణుల దృష్టికి వచ్చి ఉంటుందని భావించవచ్చు.

**12.12.** ముఖ్యాక్షరాలు ఎంతమారుతూవచ్చాయో గుణింతాలు అంతకు రెండింతలు మారాయి. ద్విత్వాక్షరాలను సూచించే ఒత్తులు చాలావరకు పూర్వ స్వరూపంలోనే ఉన్నాయి.

**12.13.** తలకట్టు అక్షరం మారుతూవచ్చినప్పుడు ఏర్పడిన ఆకారమే గాని విడిగాచేరిందికాదని ఇదివరకే తెలుసుకొన్నాము. కాని, తలకట్టు అకారానికి చిహ్నమనేభావం తర్వాత స్థిరపడింది.

**12.14.** ఆకారం, ఆకారం దీర్ఘం సూచించడానికి చిన్న అడ్డుగీతపెట్టడం అశోకభట్టిప్రోలు శాసనకాలంనుంచి ఉంది. ఈ అడ్డుగీత అక్షరం కుడి పైచివర

పెట్టేవారు. తర్వాత ఇది అక్షరంపైన అడ్డుగీతగామారి, శ్రీనాథునికాలానికే కుడి కొసవంగి సుడిదేరింది. విజయనగరకాలంలో ఇది మరింత చిన్నదై స్థిరపడింది.

**12.15.** ఇ గుణింతానికి ఆకారం సూచించే అడ్డగీతమీద చిన్ని నిలువు గీత పెట్టడం అశోకశాసనాలలో కనిపిస్తుంది. ఇది సాతవాహనులకాలానికి తురాయి లాగలేచి, చాళుక్యలిపిలో తురాయికొస కుడివైపుకువంగి, సున్నగా మారింది. శ్రీనాథుని కాలానికి పెద్ద కమానులాగ అయి, విజయనగరకాలానికి కమాను కుడి కొనలోపలికి సుడితిరిగి నేటిగుడికి మూలమయింది.

**12.16.** ఈ గుణింతం సూచించడానికి పైన రెండు నిలువుగీతలు పెట్టే వారు. ఈ రెండు నిలువుగీతలు క్రమకగా వర్తులాకృతిదాల్చి ఎడమవైపునకు సుడి తిరిగి విజయనగర కాలానికి నేటి రూపానికి సమీపమయింది.

**12.17.** ఉ గుణింతం సూచించడానికి అశోకభట్టిప్రోలు శాసనాలలో అక్షరంకింద అడ్డుగీతకాని, నిలువుగీతగాని కనిపిస్తుంది. ఈ అడ్డుగీత నన్నయ కాలానికి అక్షరం కుడిప్రక్కన అంటుకొని ఉండటం కనిపిస్తుంది. ఇది శ్రీనాథుని కాలానికి కొనపైకివంగి పొడవయింది. విజయనగర కాలానికి ఇప్పటిలాగ తీర్చి నట్టయింది.

**12.18.** ఈ గుణింతం తెలుపడానికి అక్షరం అడుగున రెండు నిలువు గీతలు కనిపిస్తాయి. ఇవి భట్టిప్రోలు శాసనంలో హంసపాదుగా మారాయి ; ఇక్ష్వా కుల కాలంలో కుడివైపునకువాలాయి. ఇదిక్రమంగా పక్కకు ఒరిగినప్పుడు ఇంగ్లీషు 'ర' అక్షరంలాగమారి, విజయనగరకాలానికి కొమ్ముదీర్ఘంగా ఇప్పటి స్వరూ పానికి సన్నిహితమయింది. కాకతీయులకాలంవరకు ప, ఫ, వ లకు ఉకార ఊకార సూచకాలైన కొమ్ము, కొమ్ముదీర్ఘం అక్షరం ప్రక్కనే వ్రాసేవారు. ఇలావ్రాయడం వల్ల ఘకార, మకార భ్రాంతి కలుగుతుందని కాబోలు రెడ్డిరాజుల కాలంనుంచి ఈ పు-వు-వు-అక్షరాలకు పొక్కిలిలో కొమ్ము వ్రాయటం అలవాటైంది.

**12.19.** ఋ గుణింతం ప్రాచీన సంస్కృత శాసనాలలో అక్షరం కుడి వైపున ఋఋలగా ఒక వంపుతో సూచించేవారు. ఋకారోచ్చారణ ప్రాకృతభాషలో లేకపోవడంవల్ల ఇది అశోకసాతవాహనేక్ష్వాకులకాలంలో కానరాదు. సంస్కృత

శాసనాలు వేయడం ప్రారంభమైన తర్వాత కనిపిస్తుంది. చాళుక్యుల కాలానికే ఇది వట్రువసుడిగా మారింది. రెడ్డిరాజులకాలంవరకు ఇది అక్షరాన్ని అంటి పెట్టుకొని ఉండేది. విజయనగరకాలానికి అక్షరాన్ని అంటిపెట్టుకోవడం మానింది. సంస్కృత శాసనాలలో ఋకారాన్ని, ఋ గుణింతాన్ని నిర్దుష్టంగా వ్రాయడం పాటించే వారు. గాని, తెలుగు పద్య వచన శాసనాలలో దీనిని రి, రు, క్రారావడిగాను చెక్కేవారు. దీనికి కారణం ఋకారోచ్చరణ విశిష్టంగా ఉండటం. ఔత్తరాహులు దీనిని రిగా పలుకుతారు: మనం రుగా పలుకుతాము. అశోకుని శాసనాలలో ఇది అ, ఇ, ఉ, ఎ లుగా మారింది. మృగ అనే పదం 'మగ, మిగ, ముగ, మెగ' లుగా కనిపిస్తుంది. మనం మ్రిగ, మ్రుగలుగా వ్రాయడం కనిపిస్తుంది. ఉదా: "ప్రిథ్వీవల్లభచోళ కుల శేఖర" (*SII* 4.438), కులోత్తుంగచోడగొంకరాజునకిష్టభ్రిత్యుండైన' (*SII* 4.211). ఋకారరేఫాల ఉచ్చారణ సామీప్యాన్నిబట్టి కలిగిన భ్రాంతితో రేఫానికి వట్రువసుడి పెట్టడమూ విరివిగా కనిపిస్తుంది. ఉదా : "సంతేశ్వరకొమార గురువు మహి పాతృల కొమారుడు తిరుమలదాసు మహాపాతృండు" *SII* 4.197).

**12.20.** ఏ కారం గుణింతం సూచించడానికి అశోక, భట్టిప్రోలు లిపులలో అక్షరం ఎడమవైపు ఎగువన అడ్డుగీత కనిపిస్తుంది. వేంగి-చాళుక్యలిపిలో ఈ గీత కొన ఎడమకువాలింది. కాకతీయులకాలంలో కొక్కెంలాగ మారింది. విజయనగరకాలానికి ఇప్పటిరూపం దగ్గరికివచ్చింది. సంస్కృత ప్రాకృతాలలో హ్రస్వ ఎ కారం లేదు గనుక తెలుగు పదాలు వ్రాసినప్పుడు సందర్భానుగుణంగా హ్రస్వ దీర్ఘాలతో చదవవలసివచ్చేది. తర్వాత ఈ దీర్ఘ ఏ కారాన్నే హ్రస్వంగా భావించి దీర్ఘాక్షరం చూపడానికి ఆ అక్షరం కుడివైపునమీద చెక్కారు. అది క్రమంగా కొసవంగి నేటిరూపం పొందింది. ఎ, ఏల ఉచ్చారణ తమిళ ప్రథమ వ్యాకరణమైన తొల్‌కాప్పియంలో తెలుపబడిందని, త్రికోణాకారంలోఉన్న ఏకారం హ్రస్వంగా భావించబడి, దానిమధ్యన ఒక చుక్కపెట్టి హ్రస్వ ఎకారంగా చూపబడిందని మద్రాసు మ్యూజియం క్యూరేటర్ శ్రీ పి. ఎన్. మోహన్‌దాస్ తెలిపారు (*శంకర పార్వతి ఎండోమెంట్ లెక్చర్స్* 1968 : 15, 16).

**12.21.** ఐ గుణింతాన్ని అక్షరానికి ఏ గుణింతం ఇచ్చిన మీదట, అక్షరం కుడిపక్కన కిందుగా అంటిపెట్టుకొన్న అరసున్నవంటి గుర్తు పెట్టేవారు. ఇది కాకతీయులకాలానికి అక్షరాన్ని అంటిపెట్టుకొనడంమాని, శ్రీనాథుని కాలానికి మొదటి కొనలో సుడి తిరిగింది.

**12.22**. ఓ గుణింతం అశోకుని శాసనాలలో అక్షరంపైన రెండు చిన్న అడ్డుగీతలు పెట్టి సూచించేవారు. ఇవి నన్నయకాలానికి రెక్కలువిచ్చిన పక్షిలాగ మారాయి. కాని, ఓ గుణితంఇచ్చి, అక్షరం ప్రక్కన కొమ్ముకు దీర్ఘమిచ్చే పద్ధతి కూడ మొదటినుంచీ ఉంది. మ, య, హలలో మాత్రం తప్పని సరిగా మిగిలింది. ఏమైనా ఎ, ఏ, ఒ, ఓ ల హ్రస్వదీర్ఘాలభేదం 16వ శతాబ్దివరకు అంతటా పాటించినట్లు కనిపించదు.

**12.23**. ఔ గుణింతం ప్రాచీన ప్రాకృతశాసనాలలో లేదు. నన్నయకాలానికి నేటి ల ఒత్తును ఏటవాలుగా పెట్టినట్టున్న గుర్తు కనిపిస్తుంది. శ్రీనాథునికాలానికి ముఖ్యాక్షరానికిమించి, నేటి 'ఌ' వర్ణం తలమీద మోపినట్టు ఉంటుంది. మ, య వంటి అక్షరాల కొమ్ములకు ఔత్వమిచ్చే పద్ధతి ఏర్పడింది.

**12.24**. సున్నను (అనుస్వారాన్ని) మనమిప్పుడు అక్షరం పక్కన వరుసలో వ్రాస్తున్నాము. కాని, మొదట అక్షరంపైనగాని, కుడివైపు పై పక్కన గాని పెట్టేవారు. అనుస్వారాన్ని మకారానునాసికాలకు మారుగావాడే పద్ధతి వచ్చిన తర్వాత, బిందువు అనునాసికాలన్నిటికీ సమానమని భావించారు. ఉదా : అమ్బుజ ⟶అంబుజ, మకారానికి బిందువు వాడడం అశోకుని శాసనాలలోనే ఉంది. కాని హకారానికి ముందు మాత్రం మకారం వాడడం గిర్‌నార్ శాసనంలో కనిపిస్తుందని శ్రీ ఎ. సి బర్నెల్ తెలిపారు (*SIP* 22). ఈ అనుస్వార బిందువును పంక్తిలో వ్రాయడం తెలుగులో నన్నయనాటికి అలవాటయింది. అక్షరం పక్కన చుక్క కనిపించకపోవచ్చుననే ఉద్దేశంతో ఈ చుక్కను నిండుగా, చంద్రమండలంలాగ గుండ్రంగా చెక్కే అలవాటైంది.

**12.25.** మనం ద్విత్వాక్షరాలను ఒత్తులుఅంటున్నాము. అశోకభట్టిప్రోలు లిపులలో ద్విత్వాక్షరాలను సూచించడానికి ఒక అక్షరం కింద మరొక అక్షరం చెక్కడం చూడవచ్చు. ద్విత్వాక్షరాలలో పైఅక్షరం అప్రధానం; కిందిదిప్రధానం. గుణింతాలు ప్రధానమైన కింది అక్షరానికే చెక్కవలసింది; కాని పై అక్షరానికే చెక్కేవారు. కొంత కాలానికి ఈ పొరపాటును లేఖకులు, లిపికరులు గ్రహించికింది అక్షరానికి గుణింతాలు, ఒత్తులు ఇవ్వసాగారు. కాని తలకట్టు స్థిరపడిన తర్వాత

పై అక్షరానికే గుణింతాలు ఇవ్వడం అలవాటయింది. ఇది నన్నయ కాలపు శాస నాలలో కనిపిస్తుంది. ఇది శ్రీనాథుని కాలానికి స్థిరపడింది.

**12.26.** ఈ ఒత్తులు ఇవ్వడంలోని విచిత్రం మరొకటుంది. తలకట్టు అకారానికి చిహ్నమనేభావం బలపడిన తర్వాత తలకట్టులేనివి అర్థాక్షరాలనేభావం కలిగింది. తలకట్టుకల వాటిని తలకట్టు తొలగించి, తలకట్టులేనివాటిని ఉన్నవి ఉన్నట్టు పంక్తికి దిగువ చిన్నవిగా వ్రాయడం, చెక్కడం మొదలయింది. క, త, న, య, ర, ల, వ ల ఒత్తులు ఇప్పుడు కొత్తవిగా, మూలాక్షరాలకు భిన్నంగాకనిపి స్తున్నా, నిజానికి పాత అక్షరాల స్వరూపాలే. య ఒత్తును కియ్యవడి, క్యావడి అనీ అంటారు. య ఒత్తుకు, పూర్వపు క ఒత్తుకు భేదం తెలియడానికి క వంటి యవడి అనే వ్యవహారం ఏర్పడి ఉంటుంది. వడి అంటే అక్షరం. ఇలాగే ర ఒత్తును క్రారా వడి అంటారు. దీనికి కారణం ఏమిటో తెలియదు. తెలుగు–కన్నడలిపుల సంధి కాలంలో క వర్ణపు పశ్చార్థభాగం (అడుగుభాగం) వంటి ఆకారంగల ర ఒత్తు అని కాబోలు : ఇది అక్షరం కిందగాక, అక్షరం పక్కన పెట్టేవారు. నేడిది మరు గయింది. ఈ క్రారావడి మరొకరూపం వలపలగిలక, 'కర్మ' అనీ వ్రాయడానికి 'కమ్ఱ' అని వ్రాసేవారు. ర ఒత్తును అశోకశాసనాలనుంచి అక్షరం పై చివరన ఏటవాలుగా వ్రాసే పద్ధతి ఉన్నది. దీనినే క్రమంగా కుడివైపున గిలకలాగ వ్రాయడంవల్ల వలపలిగిలక అయింది. వలపల అంటే కుడి పక్కన (చూ. తిరు మల రామచంద్ర, *మనలిపి పుట్టుపూర్వోత్తరాలు* 1957).

**12.27.** ఇప్పుడు మనం విరామ, సమాప్తుల సూచకంగా కామా, ఫుల్ స్టాపులను వాడుతున్నాము. కాని, పూర్వం ఒంటి నిలువుగీతను విరామ చిహ్నం గాను, జంటనిలువుగీతను సమాప్తి చిహ్నంగాను వాడడం కనిపిస్తుంది.

**12.28.** విదేశ పరిపాలనలవల్ల అచ్చుయంత్రాలు రావడంతో మనలిపి మరింత గుండ్రనై స్థిరరూపం పొందింది. పాశ్చాత్యులు అనుసరిస్తున్న విరామాది చిహ్నాలు అలవాటయ్యాయి. పాశ్చాత్యదేశాలలో ముద్రణ పరిశ్రమ అభివృద్ధిఅయిన కొద్దీ, దాని ప్రభావఫలితాలు మనలిపిమీదనూ ప్రసరించి, టైపు యంత్రాలు, మోనోటైప్, లైనోటైపువంటి నూతన ప్రక్రియలూ రావడంతో అక్షర స్వరూపం చెడకుండా ఎన్నో మార్పులు, సౌకర్యాలు కలిగాయి.


అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఐ ఒ ఔ క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ
మౌర్యకాలపు బ్రాహ్మీ లిపి క్రీ.పూ. 3వ శతాబ్దము
భట్టిప్రోలు ధాతుకరండము మీది బ్రాహ్మీ లిపి క్రీ.పూ. 3వ శతాబ్దము
సాతవాహన కాలపు బ్రాహ్మీ (గుహా) లిపి క్రీ.శ. మొదటి శతాబ్దము
ఇక్ష్వాకు కాలపు బ్రాహ్మీ లిపి క్రీ.శ. 3వ శతాబ్దము
గుప్తుల కాలపు లిపి క్రీ.శ. 4వ శతాబ్దము
శాలంకాయన కాలపు పురాతన తెలుగు-కన్నడ లిపి - క్రీ.శ. 5వ శతాబ్దము
పల్లవుల కాలపు గ్రంథ, తమిళ లిపులు క్రీ.శ. 7వ శతాబ్దము
తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 7వ శతాబ్దము.
పూర్వచాళుక్య యుగపు తెలుగు కన్నడ లిపి క్రీ.శ. 10వ శతాబ్దము
రాజరాజ నరేంద్రుని కాలపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 11వ శతాబ్దము నన్నయ భట్టు యుగము - మార్పు కాలము
కాకతి గణపతి దేవుని కాలపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 13వ శతాబ్దము,... తిక్కన యుగము
ప్రోలయ వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ.శ. 14వ శతాబ్దము - ఎఱ్ఱాప్రగడ యుగము
పెదకోమటి వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ.శ. 15వ శతాబ్దము - శ్రీనాథుని యుగము
కృష్ణదేవరాయల కాలపు తెలుగు లిపి క్రీ.శ. 16వ శతాబ్దము - పెద్దన యుగము


ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ ఱ ఴ
మౌర్యకాలపు బ్రాహ్మీ లిపి క్రీ.పూ.3 వ శతాబ్దము
భట్టిప్రోలు ధాతుకరండము మీది బ్రాహ్మీ లిపి — క్రీ.పూ.3 వ శతాబ్దము
సాతవాహన కాలపు బ్రాహ్మీ (గుహా) లిపి క్రీ.శ. మొదటి శతాబ్దము
ఇక్ష్వాకు కాలపు బ్రాహ్మీ లిపి క్రీ.శ.3 వ శతాబ్దము
గుప్తుల కాలపు లిపి క్రీ.శ. 4 వ శతాబ్దము
శాలంకాయన కాలపు పురాతన తెలుగు-కన్నడ లిపి - క్రీ.శ.5 వ శతాబ్దము
పల్లవుల కాలపు గ్రంథ.తమిళ లిపులు క్రీ.శ.7 వ శతాబ్దము
తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 7వ శతాబ్దము
పూర్వచాళుక్యయుగపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 10వ శతాబ్దము
రాజరాజనరేంద్రుని కాలపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 11వ శతాబ్దము నన్నయభట్టయుగము-మార్గకాలం
కాకతిగణపతిదేవుని కాలపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ.13వ శతాబ్దము — తిక్కన యుగము
ప్రోలయ వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ.శ.14 వ శతాబ్దము — ఎఱ్ఱాప్రగడ యుగము
పెదకోమటి వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ.శ.15వ శతాబ్దము — శ్రీనాథుని యుగము
కృష్ణదేవరాయల కాలపు తెలుగు లిపి క్రీ.శ.16 వ శతాబ్దము — పెద్దన యుగము

**12.29.** ముగింపు : మనలిపి అతిప్రాచీనమైనదనడంలో సందేహం లేదు. ఇదీ చిత్రలిపినుంచే పరిణమించిది. దీనికి మొదట బ్రహ్మీలిపి అనేపేరు వచ్చింది. ఇది ఉత్తరదక్షిణ బ్రాహ్మీలని రెండుశాఖలైంది. దక్షిణబ్రాహ్మీలిపే తెలుగు దేశాన్ని పాలించిన ఆయా రాజుల పేరుతో ప్రచలితమై నేటి తెలుగులిపిగా పరిణమించింది.

## జ్ఞాపికలు

1. "వాచకత్వము లేఖనోచితత్వము నాంధ్రలిపిరీతిగా సర్వలిపులయందు"— కేయూర బహుచరిత్ర, అవతారిక, 46.
2. "దంత్య చ, జ, గురు ర, లలకుఁదనరుబొట్లు"-అప్పకవీయము.

# ఆధునికభాష : సంగ్రహావర్ణనం

—చేకూరి రామారావు

**13.0.** భాషలో అనుసూత్యంగావచ్చే మార్పులను గ్రహించాలంటే సాధ్యమైనంతవరకు ఇతరభాషలనుంచివచ్చిచేరిన శబ్దజాలాన్ని వేరుచేసి పరిశీలించడం అవసరం. తెలుగులో ఇట్లా భిన్నకాలాలలో తెరలుతెరలుగా కొత్తపదాలు వచ్చి చేరాయి. కొన్ని భాషలో అంతకుముందే ఉన్న మాటలతో వేరుచేసి చూపించ లేనంతగా కలిసిపోయినా మరికొన్ని వేరుగానే ఉండిపోయినాయి. సంస్కృతం నుంచి వచ్చిచేరిన మాటల్లో అట్లా కలిసిపోయిన వాటిని తద్భవాలనీ, కలవకుండా ఉన్నవాటిని తత్సమాలనీ అనటం సంప్రదాయం. కలిసిపోవటమంటే భాషలోలేని ధ్వనుల సంయోజనంతో ఉన్న మాటలు ఉన్న ధ్వనుల సంయోజనంగా మారి పోవటం. తెలుగు వ్యవహర్తల్లో చారిత్రకంగా అధికవిద్యావంతులైనవారు అన్య భాషాపదాలను, సాధ్యమైనంతవరకు ఆ భాషోచ్చారణకు సన్నిహితమైన ఉచ్చార ణను అనుసరించే అలవాటున్నవారుకావటంవల్ల ఇట్లా కలవని మాటలు తెలుగులో ఎక్కువగానే కనిపిస్తున్నాయి. అందువల్లనే తెలుగులో తత్సమశబ్ద బాహుళ్యం. నేటి తెలుగులో ధ్వనుల నిర్మాణాన్ని సమగ్రంగా పరిశీలించాలంటే దేశ్యశబ్దాల్ని అన్యభాషాశబ్దాల్నుంచి వేరుచేసిచూడాలి. అప్పుడే ఏ ధ్వనులు తెలుగుకు సహజ పరిణామసిద్ధాలో, ఏవి అన్యత్రావచ్చిచేరినవో తెలుసుకొవచ్చు.

తెలుగులో తత్సమ, తద్భవ విభాగం వ్యవహర్తలందరికీ ఒకే రకంగా ఉండదు. తెలుగు, సంస్కృతాది సాహిత్యాలతో కొద్దో గొప్పో పరిచయం ఉన్న వారి భాషలో తత్సమాలయినవి ఇతరుల వ్యవహారంలో తద్భవాలుకావచ్చు. ఇతర భాషాశబ్దాల భిన్నత్వాన్నినిలబెట్టే అవసరంలేనివారి వ్యవహారంలో తత్సమాలు తద్భవాలయిపోతాయి.

**13. 1.** ఇప్పటి తెలుగులో దేశ్యభాగాన్ని, తద్భవభాగాన్ని మాత్రమే దృష్టిలో ఉంచుకొని పరిశీలిస్తే ఈ కింది విధంగా వర్ణవిభాగం నిర్దేశించవచ్చు.

**హల్లులు**

| | | ఓష్ఠ్య | దంత్య | దంత మూలీయ | మూర్ధన్య | తాలవ్య | హనుమూలీయ |
|---|---|---|---|---|---|---|---|
| స్పర్శ | శ్వాస | ప | త | | ట | | క |
| | నాద | బ | ద | | డ | | గ |
| స్పృష్టోష్మ | శ్వాస | | | | | చ | |
| | నాద | | | | | జ | |
| ఊష్మ | | | | స | | | |
| అనునాసిక | | మ | | న | ణ | | |
| పార్శ్వీక | | | | ల | ళ | | |
| కంపిత | | | | ర | | | |
| అంతస్థ | | వ | | | | య | |

**అచ్చులు**

| | పురస్ | కేంద్ర | పశ్చాత్ |
|---|---|---|---|
| అగ్ర | ఇ ఈ | | ఉ ఊ |
| మధ్య | ఎ ఏ | | ఒ ఓ |
| అధస్ | | అ ఆ | |

**13. 2.** ఇతరభాషలనుంచి వచ్చిన వ్యంజనాలు :

| | | | | |
|---|---|---|---|---|
| ఫ | థ | ఠ | ఛ | ఖ |
| భ | ధ | ఢ | ఝ | ఘ |
| f | | ష | శ | హ |
| | | | ఞ | ఙ |

వీటిలో ఒక్క 'f' ను మినహాయిస్తే తక్కిన వర్ణాలన్నీ సంస్కృత, ప్రాకృత, హిందీవంటి ఇండో–ఆర్యన్ భాషలనుంచి వచ్చిన మాటలద్వారా తెలుగులో చేరినాయి. అవి ఆ మాటలకే పరిమితమయి ఉన్నాయికూడా. 'హ' వర్ణం కొన్ని కన్నడంనుంచి వచ్చిన మాటల్లోకూడా ఉన్నది. ఉదా. హత్తు, హెచ్చు, హొన్ను మొ. మహాప్రాణవర్ణాలుకొన్ని తెలుగుమాటల్లో అరుదుగా కనిపిస్తున్నాయి, పది, ముప్పై, నలభై, యాభై, డెబ్బై, ఎనభై, తొంభై వంటి మాటల్లో వినిపించే మహాప్రాణోచ్చారణకు మూలం చెప్పటం కష్టం. ఇతర భాషాప్రభావం కారణమనటానికి ఆధారాల్లేవు.

ఖారం, ఘాలి, ధారం, భావి అనే తెలుగు మాటల్లో మహాప్రాణోచ్చారణకు కృతక ప్రామాణికత్వం కారణంగా కనిపిస్తుంది.

నేటి తెలుగువారి ఉచ్చారణలో చదువుకున్న వారిలోనైనా మహాప్రాణోచ్చారణ తక్కువే. ఓష్ఠ్య వర్ణాల్లో వినిపించినంతగా నిరోష్ఠ్యవర్ణాల్లో వినిపించదు. ఠ, ఢ, ఛ, ఝ లు, కంఠం, శుంఠవంటి కొన్నిమాటలు మినహాయిస్తే ఎక్కువగా కావ్య భాషకే పరిమితమైనట్టు కనిపిస్తుంది. ఉదా : ఠావు, ఠేవ, పరిఢవిల్లు, ఛత్రము, ఛాత్రుడు, ఝషము, ఝుంకారము, మొ॥.

తెలుగులో మహాప్రాణోచ్చారణకు అర్థభేదకసామర్థ్యంలేదు. మహాప్రాణోచ్చారణ నిర్దిష్టమైనశబ్దాలను అల్పప్రాణంతో ఉచ్చరించినా అర్థావగాహనకు ఆటంకంలేదు. వ్యవహర్తల ప్రాచ్య, ప్రాచీనవిద్యాగంధాన్నిగాని, సాంస్కృతికంగా వారి ఔన్నత్యాన్నిగాని సూచించటానికి మహాప్రాణోచ్చారణ ప్రవర్తిస్తుంది. ఏదైనా విషయాన్ని నొక్కి చెప్పాల్సినప్పుడుకూడా మహాప్రాణోచ్చారణ ఉపయుక్తమవుతున్నది. ఉదా : వెంఠనే, ఒట్ఠి, ఖర్మ, సరిగ్ఘా, ఏమ్హిలేదు. స్పర్శేతరాల్లో కూడా కనిపించటంవల్ల దీన్ని హావర్ణోచ్చారణగా గ్రహించవచ్చు.

**13.3.** తెలుగు లిపిలో కనిపించే శ,ష,స వర్ణాల్లో చివరిదే ప్రాచీన భాషనుంచి వచ్చింది. శ, ష లు సంస్కృతం, హిందీ మాటలనుంచి ప్రవేశించాయి. 'శ' వర్ణానికి నిర్దిష్టమైన ఉచ్చారణ తెలుగులో వినిపించటం అరుదు. నిరోష్ఠ్యాచ్చుల ముందు (ఇ, ఈ, ఎ, ఏ, అ, ఆ) శ, స లకు భేదం వినిపించదు. కొందరి ఉచ్చారణలోమాత్రం, ఓష్ఠ్యాచ్చులముందు వినిపిస్తుంది. ఉదా : శుభ్రం, త్రిశూలం, శోభనం.

'f' ముఖ్యంగా ఉర్దూ నుంచి, ఇంగ్లీషునుంచి, వచ్చిన మాటల్లో ఉంది. ఉదా : ఫసలీ, ఫైసలు, కాఫీ. ఈ వర్ణోచ్చారణ కొందరి వ్యవహారంలో సంస్కృత 'ఫ' వర్ణోచ్చారణకు బదులుగానూ, సంఖ్యావాచకాల్లోనూ ఉంది. ఉదా : కఫం, ఫలితం, నలభై, యాభై, ఎనభై.

ఇతర భాషలనుంచి తెలుగులోవచ్చి స్థిరపడిన అచ్చులులేవు. ఆధునిక భాషలో వివృతమైన ఎ, ఏ లు, ఒ, ఓ లు ఇంగ్లీషు మాటల్లో వినిపించినా అవి స్థిరపడ్డట్టు కనిపించదు. ఒక్క ఏ మాత్రం గుర్తించదగినంతగా చాలామంది వ్యవహారంలో వినిపిస్తుంది. ఉదా : bank, cash, glass మొ-; తెలుగులో భూత కాల సమాపక క్రియల ఉచ్చారణలో కొన్ని మండలాల్లో ఉంది. ఉదా: వచ్చాడు, ఆగాడు మొ.

**13.4.** తెలుగువర్ణాల ఉచ్చారణ : హల్లులు : స్పర్శాలు : స్పర్శా లన్నిటికి పదాదిన, సంయోగంలో అధికస్పృష్టోచ్చారణ (fortis articulation), అచ్చులమధ్య అల్పస్పృష్టోచ్చారణ (lenis articulation) ఉంది. నోటిలో కండరాలను కుంచించి ఎక్కువ వత్తిడితో ఉచ్చరించే వాటిని అధికస్పర్శాలంటారు. కండరాలను వదులగా ఉంచి ఉచ్చరించిన వాటిని అల్పస్పర్శాలంటారు. ఈ అల్పస్పృష్టోచ్చారణ నాదవర్ణాల్లో ఎక్కువగా గుర్తించవచ్చు. ఉదా : గడ, పగలు దారి, పొద్దు.

అచ్చులమధ్య 'డ' వర్ణం హిందీ భాషలో వినిపించే శిథిల స్పర్శంతో తుల్యోచ్చారణ కలిగి ఉంటుంది. ఉదా : గడ, పడవ.

స్పృష్టోష్మాల్లో 'జ' వర్ణానికి అచ్చులమధ్య ఉష్మోచ్చారణ ఉంది. ఉదా : గాజు [gāzu], బూజు [būzu]. స్పృష్టోష్మాలకు తాలవ్యాచ్చులముందు తాలవ్యోచ్చారణ, తాలవ్యేతరాచ్చులముందు దంతమూలీయోచ్చారణ ఉంది. ఉదా : చిన్న, చీమ, చెల్లెలు, చేదు, చైట; చొక్క, చూపు, చొక్కా, చోటు చెల్లి, చేప. ఈ ఉచ్చరణభేదం అన్ని మండలాల్లోనూ లేదు. తాలవ్యోచ్చారణ మాత్రమే ఉంది.

అనునాసికాలు : 'మ' వర్ణానికి అచ్చులమధ్య, పదాంతంలోను అనునాసిక 'వ' కారోచ్చారణ ఉంది. సంస్కృతాది భాషలనుంచి వచ్చిన శబ్దాలోమాత్రం

ఈ ఉచ్చారణం విద్యావంతుల భాషలో లేదు. సంస్కృత శబ్దాలయినా, సంవత్సరం వంశం. మాంసం, సింహంవంటి మాటల్లో పదాంతంలోను, సంయోగంలోను వ, శ, స. హ ల ముందు ఉచ్చారణఉంది. ఈ అనువాసిక వకారోచ్చారణ కోస్తాజిల్లాల్లో ఎక్కువగా ఉంది. తెలంగాణ, రాయలసీమ వ్యవహర్త లందరిలో ఈ ఉచ్చారణలేదు. పరోక్షవిధిలో ఆగమంగావచ్చే 'మ' వర్ణానికి మాత్రం అచ్చుల మధ్య అయినా స్పృష్టోచ్చారణే ఉంది. ఉదా : చెప్పుమన్నాడు.

"న" వర్ణానికి పదాదిన, ద్విరుక్తిలో, అచ్చులమధ్య దంతమూలీయో చ్చారణ ఉంది; దంత్యవర్ణాలముందు దంతోచ్చారణ ఉంది. ఉదా : నాన్న, కొంత.

తెలుగులో 'ఙ', 'ఞ' అనే గుర్తులతో సూచించే ఉచ్చారణ క్రమంగా క వర్గ, చ వర్గ వర్ణాలముందే ఉంది కాబట్టి వీటిని ప్రత్యేకవర్ణాలుగా గుర్తించ నక్కర్లేదు. భాషా పరిశోధకులు వీటిని 'న' వర్ణోచ్చారణ భేదాలుగానే గుర్తిస్తు న్నారు. మవర్ణ భేదాలుగా గుర్తించినా ఇబ్బందిలేదు.

'ణ' వర్ణం అచ్చులమధ్య, ట వర్గ స్పర్శాలముందు వస్తుంది. దీనికి ద్విరుక్తి సంధిలోమాత్రమేఉంది. గుర్తించదగిన ఉచ్చారణ భేదాలు లేవు. అచ్చుల మధ్య మాత్రం కొద్దిగా శిథిలోచ్చారణ ఉంది.

ద్విరుక్త 'ణ' కార ఘటితమైన "దణ్ణెం" అనే రూపం కొన్నిచోట్ల విని పించినా దానికి పూర్వరూపమైన 'దండెం' కూడా వ్యవహారంలో వినిపిస్తుంది. 'గొణ్ణెం' అనే శబ్దానికి గొళ్లెం, గొండెం అనేరూపాంతరాలున్నాయి. దీనికి "గొండ్లెము' అనేది పూర్వరూపం.

మ, న వర్ణాలకున్న పరిసర బాహుళ్యంగాని, బహుశబ్ద ఘటితత్వంగాని 'ణ' వర్ణానికి లేవు. గ్రామీణుల వ్యవహారంలోగాని, శ్రామికుల వ్యవహారంలోగాని ట వర్గ వర్ణాలముందు తప్ప దీని ప్రయోగం కనిపించదు.

**పార్శ్వికాలు** : పార్శ్విక వర్ణాల్లో దంతమూలీయ, మూర్ధన్యభేదం ఉంది. 'ల' దంతమూలీయం, 'ళ' మూర్ధన్యం; వీటికి గుర్తించదగిన ఉచ్చారణ భేదాలు లేవు.

'ళ' వర్ణం పదాదిన రాదు. అద్విరుక్తిలో 'ళ' వర్ణ ఘటితశబ్దాలు దొరకటం కష్టం. ద్విరుక్తిలో సమీకరణంవల్ల ఏర్పడ్డ ఒళ్లు, కళ్లెం, పళ్లెం, గొళ్లెం (వీటిలో

కొన్ని అన్యభాషా పదాలు కావచ్చు) వంటి నామాల్లోను, కుళ్లు, తుళ్లు, మళ్లు, వెళ్లు వంటి కొన్ని క్రియల్లోను, మళ్లీ వంటి అవ్యయంలోను కనిపిస్తున్నది. ఇవి పది పన్నెండు శబ్దాలకన్నా మించిలేవు. వ్యాకరణ కార్యాలవల్ల కళ్లు, పళ్లు, ముళ్లు, కాళ్లు, కోళ్లు, తాళ్లు, తేళ్లు వంటి మాటల్లోనూ, అవ్యవహితోచ్చారణలో ద-ల వర్ణా సంయోగంవల్ల ఈ 'ళ' వర్ణోచ్చారణ వినిపిస్తుంది. చాలామంది గ్రామికుల ఉచ్చారణలో ఈ 'ళ' వర్ణోచ్చారణ వినిపించదు.

రేఫం : రేఫవర్ణం దంతమూలీయకంపితం. సంయోగంలో ట వర్గ వర్ణాల తరవాత వచ్చినప్పుడు మూర్ధన్యోచ్చారణ ఉంది. ఉదా : కుట్ర, కొండ్ర, తండ్రి. మిగతాచోట్ల దంతమూలీయోచ్చారణ ఉంది. ద్విరుక్తిలో ఇది అధిక కంపిత మౌతుంది. ఉదా : కర్ర, కర్రు. తవర్గ వర్ణాల తరవాత దంత్యోచ్చారణ ఉంది. ఉదా : పాత్ర, పౌత్రం, అత్రం.

అంతస్థాలు : కొంత స్వరధర్మం, కొంత వ్యంజన ధర్మం ఉన్న వర్ణాలు అంతస్థాలు. య వర్ణం ఉచ్చారణలో 'ఇ' వర్ణతుల్యం. 'వ' 'ఉ' వర్ణ తుల్యం. ఉచ్చారణలో సర్వతుల్యత్వం ఉన్నా అక్షర (Syllable) నిర్మాణంలో వ్యంజనాల్లాగే ప్రవర్తిస్తాయి.

య, వ లు ద్విరుక్తిలో ఎక్కువ ఒరపిడితో ఉచ్చరిత మవుతాయి. ఉదా : అయ్య, అవ్వ.

పదాదిన తాలవ్యాచ్చులముందు 'య' కారోచ్చారణ; ఓష్ఠ్యాచ్చుల ముందు 'వ' కారోచ్చారణ ఆదనంగా వినిపించినా అక్కడ వీటికి వర్ణత్వంలేదు. అదైనా నియతంకాదు. ఇవి లేని ఉచ్చారణ కూడా తరచుగా వినిపిస్తుంది. ఉదా : ఇది-యిది; ఎవరు-యెవరు; ఊరు-వూరు; ఒకడు-వొకడు.

అచ్చులు : నాలుక మూర్ధం వైపుగా లేచే ఎత్తునుబట్టి, ఉచ్చారణలో నాలుక ముందు, మధ్య, వెనక భాగాల ప్రాధాన్యాన్ని బట్టి, పెదవుల ఆకారాన్ని బట్టి అచ్చుల విభాగం ఉంటుంది. తెలుగులో ఇ, ఈ, ఎ, ఏ లు నిరోష్ఠ్యతాలవ్యాచ్చులు. ఉ, ఊ, ఒ, ఓ లు ఓష్ఠ్య పశ్చాదచ్చులు. అ, ఆ లు కేంద్ర నిస్తాలవ్య నిరోష్ఠ్యాచ్చులు. ఇ, ఈ, ఉ, ఊలు అగ్రాచ్చులు; ఎ, ఏ, ఓలు మధ్యాచ్చులు; అ, ఆ లు నిమ్నాచ్చులు. తెలుగు అచ్చులకు పరంలో అ, ఆ లు వచ్చినప్పుడు వివృతోచ్చారణ ఉంది. ఉదా : పిల్లి-పిల్ల; పీకు-పీక, మెట్టు-మెట్ట, మేకు-మేక, గుడ్డు-గుడ్డ, గూడు-గూడ, గోడు-గోడ, కంపు-కంప, కాడు-కాద. ఈ ఉచ్చా

రణ భేదం కోస్తా జిల్లాల్లో అధికంగా ఉంది. ఈ స్వరవివృతి కొందరి ఉచ్చా రణలో సంస్కృత శబ్దాల్లో కూడా వినిపిస్తుంది. ఉదా క్షేత్రయ్య, సేకరణ. ఇది ఇతర మండలాల్లో అరుదు.

ఈ ఉచ్చారణ భేదం ఉన్నచోట్ల వివృతిని కలిగించిన 'అ' కారం సంధిలో గాని, వ్యాకరణ కార్యంలోగాని లోపించినా ఈ వివృతోచ్చారణ నిల్చి ఉంటుంది. ఉదా : మేకు + అ?, మేక + అ?

ఈ వివృతిని అక్షరం కింద గీత ద్వారా సూచిస్తే క్రియల్లో ఈ విధంగా నిష్పత్తి చూపించొచ్చు. లే + అక > లేక, పో + అక > పోక.

ఇదికాక వివృతమైన ఏ ఉచ్చారణ క్రియల్లో ఇ + ఆ అచ్చుల సంయోగం వల్ల కూడా ఏర్పడుతుంది. ఉదా : ఆగి + ఆడు > ఆగేడు, చెప్పి + ఆడు > చెప్పేడు, వెళ్ళి + ఆడు > వెళ్లేడు.

పదాంతంలోనూ, మకారాంత పదాల్లో చివరి 'మ' కరానికి పూర్వం వచ్చి నప్పుడు 'ఎ' వర్ణానికి వివృతోచ్చారణ ఉంది. ఉదా ; గిన్నె, పళ్లెం.

ఈ విధంగా వివృతోచ్చారణను సూత్రబద్ధం చేసి చెప్పవచ్చు గాబట్టి వివృతాచ్చులను ప్రత్యేకవర్ణాలుగా కాక ఉచ్చారణ భేదాలుగా గుర్తిస్తేచాలు.

తెలుగు సంధిలో అచ్చులు లోపించినప్పుడు ఇంకా చాలా ఉచ్చారణ భేదాలు వినిపిస్తాయి. అవి సంధిలో ప్రస్తావించబడతాయి.

**13.5. వర్ణసంయోజన నియమావళి** : ఏ భాషలోనయినా అన్నివర్ణాలు అన్నిపరిసరాల్లోనూ రావు. కొన్నిరకాల వర్ణ సంయోజనాలు మాత్రమే సాధ్యమవు తాయి. కేవల ఏకశబ్దపరిమితిలో తెలుగు మాటలనే తీసుకొంటే ఈ కింది నియమాలను గమనించవచ్చు.

1. య, ణ, శ అనే వ్యంజనాలు పదాదినరావు. – 'యాభై' 'యాస' లలో ఆదివర్ణం 'య' కారంగా గుర్తిస్తే ఈ శబ్దాలు ఇందుకపవాదాలవుతాయి.

2. ట వర్ణం పదాదిన అరుదు. డ వర్ణం మాత్రం కొన్ని మాటల్లో కనబడుతున్నది. తెలంగాణంలో తొంభైకి టొంబై అనేరూపం ఉంది. ఉదా : టక్కరి, టెంకె, టెంకాయ, డేకు, డోకు, డబ్బు, డెక్క, డెబ్బై, డేగ.

3. పదాది 'వ' వర్ణం తరవాత ఓష్ఠ్యేతరాచ్చులే రాగలవు. ఉదా : వల, వాడు, విల్లు, వీలు, వెన్న, వేట.

4. పదాదిన ద్విరుక్త, సంయుక్త, వ్యంజనాలుండవు. ప్రాచీనభాషలో వర్ణ వ్యత్యయంవల్ల ఏర్పడ్డ క్రంత, గ్రద్ద, త్రిప్పు, ప్రాత, బ్రతుకు వంటి మాటల్లో రెండోవ్యంజనమైన రేఫం ఆధునిక భాషలో జారిపోయింది. కొంతమంది వ్యవహారంలో అరుదుగా ఉంది. వ్రాత, వ్రాలు అనే మాటలు క్రమంగా రాత, వాలు అని మారాయి.

5. ధాతువుల్లో మొదటి అక్షరంలో మాత్రమే దీర్ఘాచ్చు ఉంటుంది.

6. నామాల్లో జంతు, పక్షి, వృక్ష, నగర, వాచక, శబ్దాల్లో మాత్రమే ఏ, ఓ లు మధ్యాచ్చుగా కనిపిస్తున్నాయి. అబ్బాయి, అమ్మాయి అనే మాటల్లోనూ, తల్లాడవంటి గ్రామనామాల్లోనూ 'అ' మధ్య స్వరంగా కనపిస్తున్నది. తాబేలు, కుందేలు, పొటేలు, పూరేడు, గన్నేరు, పల్లేరు, తంగేడు, నేరేడు, మారేడు, వెంబేడు. ఒంగోలు–వీటిలో ఓలు ప్రోలుకు రూపాంతరంగా భావించవచ్చు. కాని ఏలును జంతువాచకశబ్దంగా ఇప్పటి భాషలో నిరూపించటం కష్టం అట్లాగే ఏడు, ఏరు వృక్షవాచకశబాలుగా నిరూపించటం ప్రయాసతో కూడుకొన్నపని. ఒకప్పుడు ఇవన్నీ భిన్నశబ్దాలు కావచ్చు. నేటి వ్యవహర్తలకు ఇట్లాంటి పరిజ్ఞానం ఉందని తేల్చటం కష్టం.

7 'ఒ' వర్ణం మొదటి అక్షరంలో మాత్రమే ఉంటుంది. అంతంలో దీర్ఘాచ్చురాదు. ఇట్లా, అట్లా అనే శబ్దాలు ఇందు కపవాదాలు.

8. దీర్ఘాచ్చు తరవాత ద్విరుక్త వ్యంజనం ఉండదు. కొన్ని బంధువాచక శబ్దాలో మాత్రమే ఉంది. ఉదా : అమ్మ, నాన్న, బామ్మ, మామ.

9. స్పర్శాలముందు, స్పృష్టోష్మాలముందు అనునాసికవర్ణం ఆ వర్గజమై ఉంటుంది. కాని ఒకటి రెండు మాటలు మాత్రం ఇందుకపవాదాలుగా నిల్చినాయి. ఉదా : కాన్పు, పాన్పు వీటికి కానుపు, పానుపు అని రూపాంతరా లున్నాయి.

10. ఈ కింది వ్యంజన సంయోగాలు నేటి తెలుగులో కనిపిస్తున్నాయి.

త్ర = పాత్రం. దీనిరూపాంతరం పొత్తరం, ంద్ర = తండ్రి, కొండ్ర. వీటిని 'ంర' అనే సంయోగంగా గ్రహిస్తే మూడు వ్యంజనాల సంయోజనం తెలుగులో లేదనవచ్చు. న–ర మధ్యవచ్చే 'ద' ధ్వని సూత్రం ద్వారా సాధ్యం అంటే 'ద' వర్ణానికిక్కడ స్వతంత్రప్రతిపత్తిలేదని, న–రల సంయోగ ఫలితమేనని దీనిభావం. తెలంగాణంలో చెల్క, అర్క, ఎన్క, గట్క వంటి మాటల్లో చాలా వ్యంజన సంయోజనాలు సాధ్యమైనా వాటిని మధ్య–స్వరలోప సూత్రం ద్వారా సాధించవచ్చు.

11. శబ్దాంతంలో మ, య వర్ణేతర వ్యంజనాలు రావు, 'య' వర్ణమైనా చాలా కొద్ది మాటల్లోనేఉంది. ఉదా : సంఖ్యా వాచకాలు : ఇరవై , ముప్పై, నలభై, యాభై, అరవై, డెబ్బై, ఎనభై, తొంభై. ఇక్కడ ఐ = అయ్.

12. మవర్ణోపధ శబ్దాల్లో పూర్వాచ్చులు ఇ, ఉ ఉంటే పరాచ్చులు కూడా అవే ఉంటాయి. 'అ' ఉంటే, ఉ-అ లు, 'ఎ' ఉంటే 'ఉ' మాత్రమే ఉంటాయి. ఉదా : నడిమి, కుడుము,మడమ, ఎడము, పెదెము, పళ్లెము, కొక్కెము. పదాంతంలో ఉన్న 'ఉ' వర్ణాన్ని గుర్తించకపోతే ఈ నియమాన్ని ఇంతకన్న భిన్నంగా చెప్పాల్సి ఉంటుంది.

13. మూడచ్చుల మాటల్లో చివరిఅచ్చు నిరోష్ఠ్యమైతే మధ్యాచ్చు నిరోష్ఠ్యం, చివరి అచ్చు తాలవ్యేతరమైతే మధ్యాచ్చు తాలవ్యేతరమూ అవుతుంది. 'అ' వర్ణం తాలవ్యేతరమూ, నిరోష్ఠ్యమూ. ఈ నియమం పై నియమం (12) వర్తించగా మిగిలిన శబ్దాలకే వర్తిస్తుంది. మిగతా శబ్దాల్లో నడిమి అచ్చు అ, ఇ, ఉ లలో ఒకటి అయి ఉంటుంది. అంటే ఎ, ఒ లు ఉండవు. చివరి అచ్చు అ, ఇ, ఉ లలో ఒకటి మాత్రమే కాక ఎ వర్ణం కూడా ఉంటుంది. 'ఒ' వర్ణం మాత్రంఉండదు.

| అచ్చు$_1$ | అచ్చు$_2$ | అచ్చు$_3$ |
|---|---|---|
| | ఇ, అ | ఇ,ఎ,అ |
| | ఉ, అ | ఉ, అ |

ఉదా : పొడుగు, కుడితి, ములికి, గాడిద, ఎలికె.

14. ధాతువుల్లో దీర్ఘాచ్చు మొదటి అక్షరంలోనే ఉంటుంది. చివరి అచ్చు 'ఉ' వర్ణేతరముండదు. మధ్యాచ్చులు ఇ, అ, ఉ లు మాత్రమేఉంటాయి. యోపధ ధాతువులు మాత్రమే ఇమ్మధ్యం కాగలవు. ఉదా : తెలియు (తెలియదు), కదలు (కదలిక), అడుగు, అమ్మధ్య ధాతువులనైనా కదలిక (<కదలు), బదలిక (<బదలు) వంటి నామ నిష్పాదన ప్రక్రియ కోసం గుర్తించాల్సి వచ్చింది. ఆధునిక భాషలో 'తెలియు' తప్ప ఇమ్మధ్య ధాతువుగా గుర్తించాల్సినవి లేవు.

15. ఏక శబ్దంలో స, ణ వర్ణాలకు ద్విత్వంలేదు. కస్సు, బుస్సు అనే ధ్వన్యనుకరణాలకు శబ్దపరిగ్రహణం జరగలేదు. తెలంగాణలో కొన్నిచోట్ల 'లెస్స' అనే మాట వాడుకలో ఉంది. ణ వర్ణానికి ద్విత్వం అరుదుగా గొణ్ణం, దణ్ణం,

దణ్ణెవంటి కొన్ని మాటల్లో మాత్రమే కనిపిస్తున్నది. కళ్లం, కళ్లె, కళ్లెం, గొళ్లెం, పళ్లెం వంటి నామాలు కుళ్లు, తుళ్లు, మళ్లు, వెళ్లు వంటి క్రియలూ లేకపోతే 'ళ' వర్ణ ద్విత్వంకూడాలేనట్టే. ఇవి ఆధునిక కాలంలో ఏర్పడ్డ రూపాలు కావచ్చు.

16. ద్విరుక్తవర్ణాలు మొదటి హ్రస్వాచ్చు తరవాతనే ఉంటాయి.

ఈ పై నియమావళి ఏకశబ్దపరిమితికి మాత్రమేవర్తిస్తాయి. ప్రకృతి ప్రత్యయ సమ్మేళనంలోగాని, భిన్న శబ్దయోగంలోగాని చాలారకాల వర్ణసంయోజనాలుసాధ్యం కావచ్చు. ఉదా : వస్తాడు, చెప్తాడు, వెళ్తుంది, కొద్తుంది, చేద్దాం, తిట్టుద్ది.

**13.6.** సంధి : త్వరితోచ్చారణలో అవ్యవహితంగావచ్చిన శబ్దాల్లో జరిగే ధ్వనుల మార్పిడి సంధి. వ్యవహితోచ్చారణలో పదాలమధ్య సంధి ప్రవర్తించదు. స్వరలోపమూ, దానిఫలితంగా దగ్గరగావచ్చిన వ్యంజనాల్లో సమీకరణాదిమార్పులు తెలుగుసంధిలో జరుగుతాయి.

1. దగ్గరగావచ్చిన రెండచ్చుల్లో పూర్వహ్రస్వాచ్చు లోపిస్తుంది. ఉదా : ఆయన + ఎవరు > ఆయనెవరు ; వారు + ఉన్నారు > వారున్నారు.

2. లోపించిన హ్రస్వాచ్చు తాలవ్యమైతే పరంలోఉన్న నిస్తాలవ్యాచ్చుకు తాలవ్యత వస్తుంది. ఉదా : బండి + అంతా, కోడి + అదిగో, చెప్పి + ఉంటాడు, అది + ఒకటే.

3. స్వరాది ప్రత్యయం పరమైనప్పుడు సంధికి వికల్పతలేదు. ఉదా : మూర + ఎడు > మూరెడు, వచ్చింది + ఆ > వచ్చిందా?, పాట + ఏ > పాటే.

4. దీర్ఘస్వరాంతరూపాలకు తాలవ్యాచ్చులు పరమైతే 'య' ఆగమం, ఓష్ఠ్యాచ్చులు పరమైతే 'వ' ఆగమం వస్తాయి. ఉదా : మా + ఇల్లు > మాయిల్లు, మా + ఊరు > మావూరు. అకారం పరమైనపుడుకూడా 'య' ఆగమం కొందరి భాషలో కనిపిస్తుంది. ఉదా : మా + అమ్మ > మాయమ్మ, మా + అన్న > మాయన్న. ఆకార పరమైనపుడు వచ్చే 'య' కారాగమం మా, మీ, నా, నీ శబ్దాల తరవాతనే వస్తున్నట్టు కనిపిస్తున్నది.

5. (a) రెండు సమవ్యంజనాలమధ్య,

(b) పూర్వవ్యంజన్యం 'ల,న' లలో ఒకటయి పరవ్యంజనం దంత్య, దంతమూలీయ, తాలవ్య, మూర్ధన్యవర్ణాల్లో ఒకటయినప్పుడు,

(c) పూర్వవ్యంజనం మూర్ధన్యమయి, పరవ్యంజనం దంతమూలీయమయినప్పుడు,

(d) పూర్వవ్యంజనం దంత్యమై పరవ్యంజనం స్పృష్టోష్మమైనప్పుడు. (చ, జ) మధ్యనున్న హ్రస్వాచ్చు లోపిస్తుంది.

ఉదా : (a) చేప + పిల్ల > చేప్పిల్ల, పిరికి + గుండె > పిర్గుండె.

(b) కాలి + తో > కాల్తో, నూనె + తో > నూన్తో, తల + నూనె > తల్నూనె, మన + లో > మన్లో, పాల + డబ్బు < పాల్డబ్బు, మన + చోటు > మన్చోటు, పాల + చెంబు > పాల్చెంబు.

(c) మూట + లో > మూట్లో, వాడి + ని > వాణ్ని.

(d) పాత + చింతకాయ > పాచ్చింతకాయ.

6. (a) స్వరలోపానంతరం — పరంలో చ, జ లున్నప్పుడు పూర్వంలో త, ద, లు కూడా చ, జ లుగా మారతాయి;

(b) పరవ్యంజనం శ్వాసమైతే పూర్వవ్యంజనం శ్వాసంగానూ, నాదమైతే నాదంగానూ మారుతుంది;

(c) 'న, ల' లు మూర్ధన్య వర్ణసంయోగంలో (పూర్వంకాని, పరంకాని) మూర్ధన్యవరాలుగా మారుతాయి.

ఉదా : పాత + జల్లెడ > పాజ్జల్లెడ, ఇరుకు + గది > ఇరుగ్గది, పాదు + తవ్వి > పాత్తవ్వి, నీడ + లో > నీళ్ళో, పాల + డబ్బా > పాళ్డబ్బా.

సంధి జరగటానికి వీలున్న రెండు పరిసరాలు వెంటవెంటనే ఉండి సంధి జరిగితే కొన్నిచోట్ల మూడుహల్లుల సంయోగం ఏర్పడుతుంది. అట్లాంటిచోట్ల పర సంధి ముందుగా జరిగి పూర్వసంధిని నిరవకాశం చేస్తుంది. ఉదా: మాటలు + రావు > మాటల్రావు, గుడ్డ-లు-లేవు > గుడ్డల్లేవు.

కొన్నిచోట్ల పూర్వపరసంధుల్లో ఏదైనా జరగొచ్చు. దారి + లు + లేవు > దార్లులేవు, దారుల్లేవు, కారు + లు + లో > కారు + ల + లో > కార్లలో, కారుల్లో.

సంధికి ప్రమేయముఉన్న వ్యంజనాలు ఏకస్థానికాలయినప్పుడు ఇట్లా పూర్వపర సంధులమధ్య వికల్పత్వం కనిపిస్తున్నది.

కాని గూడు-లు-లేవు > గూళ్ళులేవు, కోటు-లు-లేవు > కోట్లులేవు.

ఇక్కడ పూర్వపరిసరంలోనే అచ్చుపోయింది. మొదటిది సంధి పరిసరం కాదు; పదనిర్మాణ పరిసరం.

7. ద్విరుక్త వ్యంజనం ఇంకోవ్యంజనం ముందు అద్విరుక్తమవుతుంది. బహువచనాది ప్రక్రియలో స్వరలోపంవల్ల ఈ రకం పరిసరం ఏర్పడుతుంది.

చెట్టు + లు > చెట్ట్ + లు > చెట్లు
గుడ్డు + లు > గుడ్డ్ + లు > గుడ్లు
తొట్టి + లో > తొట్ట్ + లో > తొట్లో

**13.7. నామపదనిష్పత్తి** : *బహువచనం*: ఏకవచన నామానికి 'లు' అనే ప్రత్యయం చేరిస్తే బహువచననామం అవుతుంది. ప్రకృతి ప్రత్యయ విభాగం లేకుండానే కొన్ని నామాలు బహువచన బోధకాలు. ఉదా : పాలు, నీళ్ళు, పెసలు, ఉసిళ్ళు, పేలాలు, బియ్యం. వీటికి వ్యస్తంగా ఏకవచన ప్రయోగంలేదు. ఇట్లాంటి వాటిని నిత్యబహువచనాలంటారు. బహువచన ప్రత్యయయోగంలో ఏకవచన నామంలో కొన్ని మార్పులు జరుగుతాయి.

1. దీర్ఘస్వరాంత శబ్దాల్లో మార్పులుండవు. ఉదా : లుంగీలు, లంగాలు. ప్రాయికంగా ఇవి అన్యదేశ్యాలు.

2. అగ్రేతర (ఇ, ఉ లుకాక) స్వరాంతశబ్దాల్లో అంత్యస్వరలోపం త్వరితోచ్చారణలోనే ఏర్పడుతుంది. ఉదా : గోదలు, కోడెలు.

3. కొన్ని శబ్దాల్లో తుది అక్షరం (Syllable) లోపిస్తుంది. ఉదా : పేను + లు > పేలు, చేను + లు = చేలు, పూవు + లు = పూలు, వేయి + లు = వేలు.

కొందరి వాడుకలో పేండ్లు, చేండ్లు అని ఉన్నాయి. కొందరి వ్యవహారంలో 'పువ్వులు' అనేరూపం ఉంది.

4. ఇదంత శబ్దాల్లో అకారేతర దీర్ఘస్వరపూర్వకమైన 'య' కారానికి 'త' కారం ఆదేశం అవుతుంది. ఉదా : చేయి + లు > చేతి = లు, గోయి + లు > గోతి + లు, నూయి + లు > నూతి + లు.

పొయ్యి, వాయి; రాయి అనే శబ్దాలకు క్రమంగా 'పొయ్యిలు, వాయిలు, రాళ్ళు' అనే రూపాలు బహువచనాలు.

5. 'ల్లు, న్ను' అంతంలో వచ్చే ఔపవిభక్తిక నామాలకు 'ండు' ఆదేశమవుతుంది. ఉదా : కన్ను + లు>కండు + లు>కండ్లు, కల్లు + లు>కండు + లు కండ్లు, పల్లు, పన్ను + లు>పండు + లు>పండ్లు, పల్లు (= పల్లం), కల్లు (= మద్యం) లు అనౌపవిభక్తికాలు.

6. 'లి' అంతలో వచ్చే చతుర్మాత్రాక శబ్దాల్లో ండి ఆదేశం జరుగుతుంది. ఉదా : రోకలి + లు>రోకండి + లు >రోకండ్లు, తిరగలి + లు>తిరగండి. + లు >తిరగండ్లు, కౌగిలి + లు > కౌగిండి + లు >కౌగిండ్లు.

7. -ండి -ండు అంతగా ఉన్న శబ్దాల్లో అనునాసిక వర్ణానికి కొందరి భాషలో లోపం జరుగుతుంది. ఉదా : బండి + లు >బండ్లు, బళ్లు, పుండు + లు > పుండ్లు, పుళ్ళు, తిరగండ్లు, తిరగళ్ళు, [చూ. సంధి సూత్రాలు].

8. రెండక్షరాల కన్నా ఎక్కువున్న. ఇదంత శబ్దాల్లో చివరి వ్యంజనమైన 'ల' కారం మూర్ధన్య మవుతుంది, ఉదా : మొసలి + లు > మొసళ్ళు, నెమలి + లు > నెమళ్ళు. మొసండ్లు అనే రూపాలుకూడా ఉన్నాయి. అప్పుడు వీటిని 6వ సూత్రంలో చేర్చుకొని 'చతుర్మాత్రాక' బదులు 'ద్విమాత్రాధిక' శబ్దాల్లో అనాల్సి ఉంటుంది. ఉలి, పులి, పిల్లి రెండక్షరాల మాటలు.

9. ఉదంత శబ్దాల్లో చివరి స్వరానికి ముందున్న 'ల' కారం మూర్ధన్యమవుతుంది. ఉదా : కాలు + లు > కాళ్ళు, కుందేలు + లు > కుందేళ్లు.

10. కొన్నిచోట్ల చివరి అచ్చుకు ముందున్న రేఫం కూడా మూర్ధన్యలకారం అవుతుంది. ఉదా : వేరు + లు>వేళ్ళు, ఊరు + లు>ఊళ్ళు, గోరు + లు >గోళ్లు, వెదురు + లు >వెదుళ్లు, పందిరి + లు>పందిళ్లు. ఇట్లాంటి శబ్దాలు ప్రాయికంగా త్రిమాత్రాకాలు. చతుర్మాత్రాకాలు అరుదు.

11. ఏకవచనంలో లేని అనునాసికవర్ణం బహువచనయోగంలో కొన్ని శబ్దాల్లోచేరుతుంది. ఉదా : కాడి + లు, >కాండి + లు, ఏడు + లు>ఏండు + లు. (ఈ శబ్దాల్లోని అనునాసికవర్ణం ప్రాచీనం ; బహువచన రూపాల్లో మాత్రం మిగిలింది.

'కాండి' ని వ్యాకరణమూలరూపం (underlying form) గా గ్రహిస్తే దీర్ఘాచ్చుమీది అనునాసిక వర్ణానికి ఇంకోహల్లు ముందులోపం చెప్పి ఏకవచన

రూపాన్ని సాధించుకోవాలి. తెలంగాణంలో 'ణి' అనే ఏకవచనరూపం ఉంది. దీని నుంచి బహువచనం సాధించాలంటే స్వరలోపం తర్వాత డ కారంగమం చెప్పుకోవాలి. కాణి + లు > కాణ్ + లు > కాణ్ + డ్ + లు > కాండ్లు. (13.5 వర్ణసంయోజననియమావళిలో 10వ నియమంలో 'డ' కారాగమంతో సామ్యం గమనించండి).

12. యకారేతర వ్యంజన పూర్వకమైన నామాంత ఇ వర్ణం ఉవర్ణంగా మారుతుంది. ఉదా: గది + లు > గదులు, కాకి + లు > కాకులు. కాని పొయ్యి + లు > పొయ్యిలు.

13. దంతమూలీయ మూర్ధన్యేతరపరకమైన నడిమి 'ఇ' (చివరి అచ్చుకు ముందటి అచ్చు) మూడక్షరాలమాటల్లో 'ఉ' గా మారుతుంది. చతుర్మాత్రాక శబ్దాల్లో ఈ మార్పు జరగదు. ఉదా : ములికి + లు > ములుకులు, అడివి + లు < అడువులు. కాని ఆవిరులు, ఊపిరులు, కావిళ్ళు, వేవిళ్ళు, పిడికిళ్ళు.

మాత్రాసంఖ్య బదులు ఇక్కడ కూడా దంతమూలీయ మూర్ధన్య వ్యంజనాలే ఈ మార్పును నిరోధిస్తున్నాయనవచ్చు.

ఈ మార్పు తత్సమశబ్దాల్లో జరగదు. ఉదా : అతిథి + లు > అతిథులు, సమితి + లు > సమితులు. సముతులు అని వ్యవహరించేవారికి 'సమితి' తద్భవం.

14. నామాంతంలోని 'ఉ' మూర్ధన్యవర్ణ పూర్వకమైతే లోపిస్తుంది. ఉదా : చెట్టు + లు > చెట్లు, కోటు + లు > కోట్లు, పండు + లు > పండ్లు. ఈ స్వర లోపం జరిగిన తరవాత ఇంకో వ్యంజనం ముందటి ద్విరుక్త వ్యంజనం అద్విరుక్త మవుతుంది.

ఇదంత నామాల్లో పూర్వ సూత్రంవల్ల చివరి <u>'ఇ'</u> <u>'ఉ'</u> గా మారుతుంది. అది కూడా ఈ సూత్రం వల్ల లోపిస్తుంది. *దడి–దళ్లు, బడి–బళ్లు, బండి బండ్లు, కొండి–కోళ్లు* మొ॥. **బండులు, *కోడులు* అనే రూపాలు **పండులు *కోటులు* అనే రూపాల్లాగే అసాధువులు. *బడులు, దడులు* అనే రూపాలు కూడా అసాధు వులే అనుకుంటాను. కాని *గుడులు, మడులు* అనే బహువచన రూపాలు పూర్తిగా అసాధువులని నిర్ణయించటం సులభంకాదు. ఈ రకమైన అపవాదాలు (ఇవి నిజంగా అపవాదాలయితే) ద్విమాత్రాక శబ్దాల్లోనే కనిపించటం విశేషం. వచన భేదం

చూపించదగిన ఉదంతమైన రెండు మాత్రల (రెండు హ్రస్వాచ్చుల) నామాలే కనపడటంలేదు. అంటే 'ఉ' లోపం సందేహాస్పదమైన పై శబ్దాలతో పోల్చి చూడటానికి స్వతస్సిద్ధంగా ఉదంతమైన రెండు మాత్రల శబ్దాలు కనిపించటం లేదని.

15. తత్సమ శబ్దాల్లోమహద్వాచక 'డు'వర్ణకం లోపిస్తుంది. ఉదా. స్నేహితుడు + లు > స్నేహితులు, పండితుడు + లు > పండితులు. కొందరి వ్యవహారంలో ఈ కార్యం దేశ్యశబ్దాల్లోనూ కనిపిస్తుంది, ఉదా : తమ్ముడు + లు > తమ్ములు.

16. అకార, ఎకార పూర్వకమైన 'మ' కారాంతశబ్దాలో తుదిమకారానికి లోపం పూర్వస్వరానికి దీర్ఘమూవస్తాయి. చివరి మకారాన్ని స్వరయుతంగా గ్రహిస్తే స్వరానికికూడా లోపం జరుగుతుంది, ఉదా. గుర్రం + లు > గుర్రాలు, కళ్ళెం + లు > కళ్ళేలు, ఎకారానికి వివృతి మొదటే ఉంది. దీర్ఘమైనప్పుడు ఈ వివృతి అధికమవుతుంది.

17. ఎద్దు శబ్దానికి బహువచనంలో 'ఎడ్లు' అనే రూపం వికల్పంగా ఏర్పడ్డ 'ఎడ్లు' రూపం ఏర్పడుతుంది.

18. పెండ్లి, రాత్రి శబ్దాలకు క్రమంగా పెండ్లిండ్లు, పెళ్ళిళ్ళు; రాత్రిండ్లు, రాత్రిళ్ళు అనే బహువచన రూపాలున్నాయి.

19. సర్వనామాలకు ఏకవచన బహువచన రూపాలీకిందివిధంగా ఉంటాయి: నేను–మేము, మనం; నీవు, నువ్వు–మీరు; అతను, ఆయన, వాడు– వారు; ఆమె–వాళ్ళు.

20. విశేషనామాల (proper nouns) ను కూడా సామాన్య నామాలు (common nouns) గా వాడినప్పుడు 'లు' వర్ణకంతో బహువచన నామాలుగా వాడవచ్చు. ఉదా : రామారావులు, కృష్ణమూర్తులు.

**13.8.** *ఔపవిభక్తికాదికాలు* : నామాలు విభక్తులముందు, విభక్త్యర్థక శబ్దాలముందు, ఇతర నామాలముందు ప్రయోగించినప్పుడు సమాసాల్లోను కొన్ని మార్పులకు గురి అవుతాయి. వీటిలో కొన్నింటిని సాంప్రదాయికంగా ఔపవిభక్తికాలంటారు.

1. బహువచన ప్రత్యయ యుక్తనామాల చివరి 'ఉ' 'అ' గా మారుతుంది. ఉదా. పుస్తకాలను, పుస్తకాలకు, పుస్తకాలకోసం, పుస్తకాల పురుగు. కాని పెసలు విశేషణంగా ప్రయోగించినప్పుడు రేఫాదేశం అవుతుంది. పెసరచేను. బహువచన ప్రత్యయ విభాగం స్పష్టంగా చెయ్యటానికి వీల్లేని శబ్దాల్లోకూడా చివరి 'లు'లోని 'ఉ' 'అ'గా మారుతుంది. ఉదా : పాలడబ్బా, నీళ్ళపాలు.

2. బహువచనంలో అంతిమ మకారలోపం జరిగి, స్వరదీర్ఘత ఏర్పడ్డ రూపాలు కు,ను విభక్తులముందుకూడా ప్రయుక్తమవుతాయి. అయితే 'ని' ఆగమంగాచేరుతుంది. ఉదా : పొలం + కి > పొలానికి, దేశం + ని > దేశాన్ని, ఈ కార్యం ఇతర విభక్తులముందు, శబ్దాలముందు జరగదు, ఉదా. మంచంమీద, పొలంలో. కొందరి వ్యవహారంలోని ఆగమంలేదు.

3. కొన్ని మకారాంతశబ్దాలు ఇతర నామాలముందు ప్రయుక్తమైనప్పుడు 'మ' కారానికి 'పు' ఆదేశం అవుతుంది. ఆధునికభాషలో ఇది నిత్యంకాదు. ఉదా. బియ్యం : బియ్యంగింజ, బియ్యపుగింజ: మంచం : మంచంకోడు, మంచపుకోడు, బెల్లం : బెల్లంపానకం, బెల్లపుపానకం.

4. 'ఇల్లు' మొదలైన శబ్దాలకు మొదటి అచ్చు తరవాత భాగానికి 'ంటి' ఆదేశమవుతుంది. ఉదా. ఇల్లు : ఇంటికి, ఇంటిపైన, పల్లు : పంటినొప్పి, కన్ను : కంటిరెప్ప.

5. కొన్ని 'ర, రు, లు, డు' అంతంలో ఉన్న శబ్దాలకు చివరి అక్షరానికి 'టి' ఆదేశమవుతుంది. ఉదా. గోరు: గోటితో, నోరు: నోటినిండా, ఏరు : ఏటిఒడ్డు, రోలు : రోటిలో, పాడు : పాడుమట్టి, గూడు : గూటిలో, నెత్తురు : నెత్తుటి మడుగు, నుదురు, నుదుటిరాత, పగలు : పగటిపూట, మొదలు : మొదటిరోజు, పెరడు : పెరటిచెట్టు, తాబేలు : తాబేటికాయ, కుందేలు : కుందేటికొమ్ము, పడమర : పడమటిల్లు.

6. చివరి వ్యంజనం దంతమూలీయ మూర్ధన్య వర్ణాలో ఒకటైనా ఇదంత చతుర్మాత్రాక శబ్దాల్లో చివరి అక్షరానికి 'టి' ఆదేశమవుతుంది. ఉదా. పందిరి : పందిట్లో, వాకిలి : వాకిటికి, నాగలి : నాగటికర్రు. రోకలి : రోకటిపోటు, చావిడి: చావిట్లో, పిడికిలి : పిడికిట్లో.

7. ఇగంతమైన రెండచ్చుల మాటల్లో దీర్ఘస్వర పూర్వకమైన 'య' వర్ణానికి 'త' వర్ణాదేశం అవుతుంది, ఉదా: చేయి, చేతిపని, రాయి : రాతిగోడ, గోయి : గోతిలో, నేయి : నేతిమిఠాయి.

'నోరు' అనే అర్ధంలో 'వాయి' నుడికారాల్లో మాత్రమే మిగిలింది. ఉదా. నోరూవాయీ లేనివాడు. వేరే 'వాయి' శబ్దం ఆనౌపవిభక్తికం. "ఒక్కోవాయికి" దాయిశబ్దానికి 'దాతి' అనే రూపమే ప్రథమలోకూడా స్థిరపడింది.

8. అ్రువంటి మాటల్లో చివరి అక్షరాని (syllable) కి 'తి' ఆదేశమవుతుంది. ఉదా. అఱు : అత్తిపుండు, గొఱ్ఱు : గొత్తిఅడ్డ.

9. ఈ కిందివి 'టి' ఆగమంగా వచ్చే వాటిల్లో కొన్ని.

(a) మారుటితల్లి, పొద్దుటిపూట, మాపటివేళ, రేపటికి, చాలా నేపటికి.

(b) నిన్నటిపత్రిక, మొన్నటిపని, ఇవాళటివంట,

(c) పుల్లటి మజ్జిగ, తియ్యటిరసం, చప్పటికూర, చక్కటి అమ్మాయి.

అట్లాగే ఇంకా అంతటి, అన్నిటి, కిందటి, అట్లాటి మొ. వి.

10. 'ను, లు, రు, డు' అంతంలో ఉన్నశబ్దాల్లో చివరి 'ఉ' 'ఇ' గా మారింది. మనుష్యవాచక శబ్దాల్లో ఈ మార్పు క్రమబద్ధంగా కనిపిస్తున్నది, ఉదా. చేను : చేనికి (కాని 'చేలో'), ఊరు : ఊరికి, కాలు : కాలికి, వారు : వారికి, వాడు: వాడికి, అతను : అతనికి, అల్లుడు : అల్లుడికి, చెల్లెలు : చెల్లెలికి, కోడలు : కోడలికి.

11. సంఖ్యావాచకాలకు భిన్నార్థాల్లో 'టి, ఇంటి', అనే ప్రత్యయాలు ఆదేశాగమాలుగా వస్తాయి. ఉదా *మూడీటికి/మూడింటికి* ఇరవై అయిదు పైసలు. *పదకొండింటికి* వస్తానన్నాడు.

12. ప్రథమేతర సర్వనామాలకు విశేషణ రూపాలు (oblique forms) ఇట్లా ఉంటాయి. ఉదా. నేను–నా, మేము–మా, మనం–మన, నీవు/నువ్వు–నీ, మీరు–మీ.

సర్వనామాల్లోనూ, విశేషార్థాల్లో ప్రయోగించే సంఖ్యావాచకశబ్దాల్లోనూ బహువచననామాల్లోనూ తప్ప మిగతాచోట్ల ఔపవిభక్తికత నేటిభాషలో క్రమ క్రమంగా క్షీణిస్తున్న సూచనలగపడుతున్నాయి. ఉదా : పంటినొప్పి ~ పన్ను నొప్పి, రోకటిపోటు ~ రోకలిపోటు, చేతిమీద ~ చెయ్యిమీద.

**13.9 నామవిభక్తులు** 1. ను కర్మర్థంలోనూ, కు సంప్రదానాది అర్థాల్లోనూ నామానికి చేరతాయి. వీటికి ఇకారాంతశబ్దాల తరవాత ని కి అనే రూపాలున్నాయి. విభక్తి చేరినప్పుడు సర్వనామరూపాల్లో కొన్ని మార్పులీ కిందివిధంగా జరుగుతాయి. నా + ను > నన్ను, నీ + ను > నిన్ను, మా + ను > మమ్మల్ని, మీ + ను > మిమ్మల్ని, మన + ను>మనని, మనల్ని.

నా, నీ, మా, మీ ల తరవాత ఎప్పుడూ కు ను లే ఉంటాయి. మిగతా శబ్దాల్లో ఇకారేతర స్వరం తరవాత ని, ను లు కి, కులలో ఏదైనారావచ్చు. మాటకు ~ మాటకి, ఆవును ~ ఆవుని.

2. కు ఈ కింది అర్థాల్లో ప్రయుక్తమవుతుంది.

(a) 'ఉండు' క్రియతో స్వామ్యార్థంలో, ఉదా. నాక్కుకళ్ళజోడుఉంది. వాడికి పది ఎకరాల పొలం ఉంది.

(b) దేహమనస్థితి బోధకాఖ్యాతాలతో, ఉదా. నాకు ఆకలిగా ఉంది. వాడిక్కి కోపంగా ఉంది.

(c) 'అని' కాంక్షార్థంలో వచ్చినప్పుడు, ఉదా. నాకు వెళ్ళాలని ఉంది.

(d) దానార్థకక్రియ ఉన్నప్పుడు గ్రహీతకు, ఉదా. వాడిక్కి రెండు రూపాయలిచ్చాను.

(e) కొన్ని జ్ఞానార్థక క్రియలతో, ఉదా. నాక్కు వాళ్ళు తెలుసు. నాక్కు హిందీరాదు.

(f) కొనుగోలు, మార్పిడి మొదలైన అర్థాల్లో ఉదా. రూపాయిక్కి నాలుగు మామిడిపండ్లు.

(g) బాంధవ్యార్థంలో, ఉదా. వాళ్ళక్కు ఇద్దరు పిల్లలు. ఆయన నీక్కే మవుతాడు ?

(h) సామాన్య సంబంధార్థంలో, ఉదా. ఈ గదికి రెండు కిటికీ లున్నాయి. ఆవుకు రెండు కొమ్ములుంటాయి.

(i) ప్రయోజనార్థంలో, ఉదా. చల్లకు వచ్చి ముంతదాచటం ఎందుకు.

(j) గమ్యార్థంలో, ఉదా. రేపు ఊరికి వెళ్తున్నాను.

(k) హేత్వర్థంలో, ఉదా. చలికి వణుకుతున్నాడు. పిల్లికి భయపడ తాడు. ఆకలికి తట్టుకోలేడు.

(l) కాలార్థంలో, ఉదా. రేపటికి వస్తాడు. ఎల్లుండికి ఈపని అవుతుంది

(m) వచ్యర్థధాతువులకు అముఖ్య కర్మగా, ఉదా. నాకు చెప్పాడు.

3. తో ఈ క్రింది అర్థాల్లో ప్రయుక్తమవుతుంది.

(a) కరణార్థంలో, ఉదా. నోటితో మాట్లాడి నొసలుతో వెక్కిరిస్తాడు

(b) సహార్థంలో, ఉదా. వాడు ఆ అమ్మాయితో పారిపోయాడు.

(c) వచ్యర్థధాతువుల అముఖ్యకర్మగా, ఉదా. అతనితో మాట్లాడాను. వారితో చెప్పాను.

(d) రీత్యర్థంలో (manner), ఉదా. శ్రద్ధతో చదువుతాడు.

(e) కర్తృవిశేషణంగా, ఉదా. అతను ఆకలితో వచ్చాడు. ఆమె జ్వరంతో పరీక్ష రాసింది.

(f) ప్రతి క్రియాపేక్షక క్రియలతో, ఉదా. ఇండియా పాకిస్తాన్‌తో యుద్ధంచేసింది. ఆమె పక్కవాళ్ళతో ఎప్పుడూ పోట్లాడుతుంది.

(g) మూలపదార్థార్థంలో, ఉదా. కర్రతో చేసినకుర్చీ, పిండితోచేసిన రొట్టె, మట్టితో పెట్టిన గోడ.

4. లో ఈ కింది అర్థాల్లో ప్రయుక్తమవుతుంది.

(a) ఔపశ్లేషికార్థంలో, ఉదా. గిన్నెలో పాలున్నాయి.

(b) కాలార్థంలో, ఉదా. విశాలాంధ్ర 1956 లో ఏర్పడింది.

(c) దేశకాలాల వాతావరణార్థంలో, ఉదా. బెజవాడలో ఎండలెక్కువ. సెప్టెంబరులో వాన లెక్కువ.

(d) అభివ్యాపకార్థంలో, ఉదా. ఇండియాలో వరి పండుతుంది. సముద్రంలో చేపలుంటాయి.

(e) వైషయికార్థంలో, ఉదా. అతనికి తెలుగులో ప్రవేశం ఉంది. ఈతలో అతనికి నేర్పుంది.

(f) నిర్ధారణార్థంలో, ఉదా. వాళ్ళ నలుగురిలో ఇతను మంచివాడు.

౫. నుంచి ఈ కింది అర్థాల్లో ప్రయుక్తమవుతుంది.

(a) గమనార్థక ధాతువులతో దేశకాలాల్లో వ్యాపారాది, ఉదా. అతను వాళ్ళ ఊరినుంచి వస్తున్నాడు. ఆ పిల్లవాడు 8 గంటలనుంచి చదువుతున్నాడు.

(b) పర్యంతార్థంలో, ఉదా. అతను 10 ఏళ్ళనుంచి మెడిసిన్ చదువుతున్నాడు.

(c) హేత్వర్థంలో, ఉదా. నీనుంచి నాకి కష్టాలు వచ్చినాయి.

(d) మూలస్థలార్థంలో, ఉదా. చెట్టునుంచి పువ్వులుకోశాడు.

ఈ పైవికాక దగ్గర, వరకు, కోసం, మీద, పైన, కింద, పక్క, గురించి, వల్ల, బట్టి మొదలైన శబ్దాలు భిన్న విభక్త్యర్థాల్లో వస్తాయి.

## క్రియలు

**13.10.** తెలుగులో అకర్మక, సకర్మక, ప్రేరణార్థక ధాతువులు విడిగా ఉండటమేగాక ప్రత్యయాదులచేత ఒక వర్గాన్ని ఇంకోవర్గంగా మార్చవచ్చు. ఈ కిందివి దిఙ్మాత్రసూచకాలు :

| 1 | అకర్మకం | సకర్మకం | అకర్మకం | సకర్మకం |
|---|---|---|---|---|
| (a) | వంగు | వంచు | దిగు | దించు |
| | పెరుగు | పెంచు | | |
| (b) | జరుగు | జరుపు | | |
| | ఆగు | ఆపు | | |
| | తిరుగు | తిప్పు | | |
| (c) | చూచు | చూపు | | |
| | గడచు | గడపు | | |
| (d) | కలియు | కలుపు | తడియు | తడుపు |
| | మాయు | మాపు | | |

| | | | | |
|---|---|---|---|---|
| (e) | అంటు | అంటించు | ఎక్కు | ఎక్కించు |
| (f) | బిగియు | బిగించు | ముగియు | ముగించు |
| (g) | కాలు | కాలుచు | మారు | మారుచు |
| (h) | మొలుచు | మొలిపించు | కురియు | కురిపించు |
| 2. | *సకర్మకం* | *ప్రేరణం* | *సకర్మకం* | *ప్రేరణం* |
| (a) | తిట్టు | తిట్టించు | అడుగు | అడిగించు |
| (b) | అను | అనిపించు | తిను | తినిపించు |
| (c) | కాలుచు | కాలిపించు | మారుచు | మారిపించు |

3. ప్రాచీన భాషలో ఉన్న చేయు, వేయువంటి ధాతువులేకాక ఈనాటి భాషలో కొట్టు, తీయు, పెట్టు వంటి ధాతువులు అకర్మకధాతువులను సకర్మక ధాతువులుగా మార్చటానికి ఉపయుక్తమవుతున్నాయి. ఈ ధాతువులను అనుబంధించినప్పుడు ప్రధానక్రియలు అన్నంతరూపంలో ఉంటాయి. అనుబద్ధ ధాత్వాది పరుషం సరళంగా మారుతుంది.

| | | | | |
|---|---|---|---|---|
| (a) | పగులు | పగలగొట్టు | పడు | పడగొట్టు |
| (b) | తెలియు | తెలియజేయు | | |
| (c) | అరుగు | అరగదీయు | విరుగు | విరగదీయు |
| (d) | కాగు | కాగబెట్టు | ఆరు | ఆరబెట్టు |
| | నాను | నానబెట్టు | కరుగు | కరగబెట్టు |
| (e) | ఆరు | ఆరవేయు | నాను | నానవేయు |

సకర్మక ప్రత్యయస్థానంలో వాడిన ధాతురూపాలు కేవల ప్రత్యయ మాత్రాలుగా కాక క్రియకు కొంత అర్థాన్నికూడా చేరుస్తున్నట్టు కనిపిస్తున్నది. వ్యాపారరీతి (manner) బోధకంగా ప్రవర్తించటం విశేషం. ఉదా : పగలదీయు-పగలగొట్టు; విరగదీయు-విరగ్గొట్టు; తిరగదీయు-తిరగ్గొట్టు; అరగదీయు-అరగ్గొట్టు వంటి మాటల జంటలను పరిశీలిస్తే ఈ అర్థభేదాన్ని గమనించవచ్చు.

4. 'కొను' అనే ధాతువు భిన్నార్థాల్లో ధాతువు కనుబంధించబడుతుంది. ప్రధానక్రియ ధాతురూపంలోనే ఉంటుంది. యోపధధాతువుల్లో 'య' కారం 'స' కారంగా మారుతుంది.

(a) స్వార్థం, చేయు-చేసుకొను; అమ్ము-అమ్ముకొను; చదువు-చదువుకొను.

(b) పారస్పర్యార్థం. మాట్లాడు - మాట్లాడుకొను; కొట్టు - కొట్టుకొను; తిట్టు - తిట్టుకొను.

వాక్యంలో కర్తృనామబంధం బహువచనం అయినప్పుడే పారస్పర్యార్థం వస్తుంది. ఏకవచననామకర్తృకమైనప్పుడు స్వార్థమే వస్తుంది. ఉదా ; (1) అతను నన్ను తిట్టుకొంటున్నాడు. (2) వాళ్ళెప్పుడూ తిట్టుకుంటారు.

(c) *సకర్మకీకరణం* : తెలియు-తెలుసుకొను.

(d) కొన్ని ధాతువులు 'కొను' తో మాత్రమే ప్రయోగయోగ్యాలు. ఉదా : అనుకొను, ఇరుక్కొను, ఊరుకొను, ఒప్పుకొను, కనుక్కొను, గింజుకొను, తేరుకొను, పుచ్చుకొను, పుంజుకొను, మొత్తుకొను.

5. ఈ కింది శబ్దపల్లవాలు ఆ అర్థాల్లో అట్లాగే ప్రయుక్తమవుతాయి.. ఉండు, పడు అనేవి అనుబంధక్రియలు. ఉదా : కూరుచుండు, నిలుచుండు, అగపడు, కనబడు, తిరగబడు, నిలబడు.

6. నామాదులనుకూడా ప్రత్యయాదులవల్ల క్రియలుగా ప్రయోగించవచ్చు.

(a) భయం : భయపడు, భయపెట్టు
కష్టం : కష్టపడు, కష్టపెట్టు
పుల్లి : పుల్లబడు

(b) లో : లోబడు.
వెనక : వెనకబడు
పీలు : పీలుపడు

(c) పాత : పాతబడు
ఎర్ర : ఎర్రబడు

(d) సంతోషం : సంతోషించు
క్షమ : క్షమించు.

**13.11.** **క్రియాపదాలు :** తెలుగు క్రియాపదాలు సమాపక, అసమాపక భేదాలతో రెండు విధాలు. అసమాపక క్రియారూపాలు ఉపవాక్యాంతంలో కాని, ప్రధానవాక్యంలో ఒక పదబంధం స్థానంలో కాని వస్తాయి. అసమాపకక్రియకు కాలబోధకత ఉండవచ్చు. క్రియావిభక్తులుండవు. సమాపకక్రియలకు ఏవో కొన్నిటిని మినహాయిస్తే క్రియావిభక్తులుంటాయి.

1. *అసమాపక క్రియా ప్రత్యయాలు ;*

| | అవ్యతిరేక | వ్యతిరేక |
|---|---|---|
| క్త్వార్థక : | ఇ | అక (హేత్వర్థంలోను, కాల పరిమాణబోధక వాక్యాల్లో), అకుండా (వ్యాపారక్రమ బోధక వాక్యాల్లో) |
| శత్రర్థక : | తూ | |
| | తా | |
| చేదర్థక : | ఇతే | అకపోతే |
| అప్యర్థక | ఇనా | అకపోయినా |
| భావార్థక : | అటం<br>అడం | అకపోవటం (-డం) |
| నుజ్యంతం : | అ (న్) | |
| ఉదా : | *అడుగు* | |
| | అడిగి | అడగక |
| | | అడగకుండా |
| | అడుగుతూ | |
| | అడుగుతా | |
| | అడిగితే | అడగకపోతే |
| | అడిగినా | అడగకపోయినా |
| | అడగటం | అడగకపోవటం |
| | అడగ (న్) | |

2. *సమాపక క్రియలు :* సమాపకక్రియలకు కాలబోధక క్రియలతో పాటు లింగ-వచన-పురుష బోధకమైన క్రియావిభక్తులు చేరతాయి

(a) *కాలబోధక ప్రత్యయాలు :* భూత : ఇన, వర్తమాన : తున్న;తున్; భవిష్యత్తు: త; ఉభయప్రార్థన: ద. విధ్యర్థకానికిప్రత్యయాలు లేవు. యథాతథంగా

ప్రయుక్తమవుతుంది. బహువచనంతో **అండి** చేరుతుంది. తెలంగాణంలో ని, రి, ండి చేరతాయి, ఉదా : రాండి. రాని, రారి.

(b) *క్రియావిభక్తులు :*

| | ఏకవచన | బహువచన |
|---|---|---|
| ఉత్తమ : | ను | ము |
| మధ్యమ : | వు | రు (మహన్మహతి) |
| ప్రథమ మహత్తు : | డు | |
| ఇతర : | ది | వి (యి) (అహమత్తు) |

ఇవే క్రియావిభక్తులు వ్యతిరేక సమాపక క్రియల్లోకూడా వాడతారు. కాని 'ది, వి' ప్రత్యయాలు 'దు, వు' లుగా మారతై. కొన్ని తెలంగాణ మాండలికాల్లో పరిస్థితి కొంత భిన్నంగా ఉంది. 'ది,వి'లు దీర్ఘస్వరాంత క్రియారూపాల తరవాత మాత్రమే 'దు, వు' లుగా మారతాయి ఉదా : చెయ్యది–రాదు.

3. *వ్యతిరేక క్రియలు* : (a) భూతకాల వ్యతిరేక క్రియలు అన్నంత రూపాలకు 'లేదు' అనే ప్రత్యయం చేర్చటంవల్ల ఏర్పడతాయి. ఇది సర్వలింగ, వచన, పురుషబోధకం. ఉదా : రాలేదు.

(b) వర్తమాన వ్యతిరేకక్రియలు 'అటమంత' రూపానికి 'లేదు' చేర్చటం వల్ల ఏర్పడతాయి. ఈ రూపంకూడ పురుషభేదాన్నిబట్టి మారదు. ఉదా : రావటం లేదు.

(c) భవిష్యద్బోధక వ్యతిరేకక్రియలు అన్నంతరూపాలకు క్రియావిభక్తులు చేర్చటంవల్ల ఏర్పడతాయి. ఉదా : రాను–రాము, రావు–రారు, రాడు–రారు, రాదు–రారు, రావు.

(d) వ్యతిరేకవిధి అన్నంతరూపాలకు వద్దు చేర్చటంవల్ల ఏర్పడుతుంది. ఉదా : రావద్దు. వ్యతిరేకవిధికి ఇంకా చాలా రూపాలు వాడుకలో ఉన్నాయి. ఉదా : రాకు, రాబాకు, రాబోకు, రామాకు, రామోకు, మొ.

4. ***అన్నంత క్రియ*** : అన్నంతక్రియకు భిన్నార్థాల్లో భిన్నక్రియలు అనుబద్ధమవుతాయి.

(a) సామర్థ్యార్థం :-కల, కలుగు, లే : ఉదా : రాగలడు, రాగలుగుతాడు, రాలేడు. 'కల' కు కాలబోధక ప్రత్యయ యోగంలో 'కలుగు' ఆదేశమవుతుంది. వ్యతిరేకంలో 'లే' ఆదేశం.

(b) అనుమత్యాద్యర్థం :-వచ్చు. ఉదా : లోపలికిరావచ్చు, మీరిక బయటికి వెళ్ళవచ్చు, నేను రేపు ఊరికి వెళ్ళవచ్చు.

(c) నిషేధార్థం :-కూడదు,-రాదు. ఉదా : అసత్యం మాడరాదు, అబద్ధం చెప్పకూడదు. ఈ రూపానికి పురుషభేదంలేదు,

(d) 'తప్పనిసరి' అర్థంలో : వలయు > ఆలి : ఉదా : విద్యార్థులుబాగా చదవాలి. కాలబోధకత అవసరమైనప్పుడు ఈ రూపాలకు ఉండు, వచ్చు ధాతువు లనుప్రయుక్తమవుతాయి. అయితే '-ఆలి' '-ఆల్సి' అవుతుంది. ఉదా : వెళ్ళాల్సి వచ్చింది. వెళ్ళాల్సి ఉంటుంది.

(e) అసామర్థ్యార్థంలో:- చాలు>చాల. ఉదా: వాడు ఈపని చెయ్యజాలడు

(f) కర్మణ్యర్థం :-పడు. ఉదా : తరవాత చెప్పబడుతుంది. కల, చాలు, పడులకు క్రియావిభక్తులు చేరతాయి.

(g) అనుమత్యర్థంలో '-ఇచ్చు' అనుబద్ధమవుతుంది. దీనిదానార్థంలో 'ఇచ్చు' కు వలెనే రూపాలుంటాయి. ఉదా : రానిచ్చాడు, రానీ, రానీయ్యలేదు. విధ్యేకవచనంలో 'ఇచ్చు' కు 'ఈ' ఆదేశం,

(h) సమీపభవిష్యార్థంలో 'పో' ధాతువు అనుప్రయుక్తమవుతుంది. ఉదా : రాబోయ్యాడు, పడబోయింది.

(i) ఈ అన్నంతరూపానికి అరుదుగా ప్రయోజనార్థంకూడా ఉంది. అక్కర లేదు, అవసరంలేదు అనే రూపాలు అనుప్రయుక్తమవుతాయి. ఉదా : రానక్కర లేదు, రానవసరంలేదు.

*13.12.* క్రియాధాతువులోమార్పులు : ప్రత్యయాలుచేరినప్పుడు ధాతువులో కొన్ని మార్పులు జరుగుతాయి. ఈ మార్పులు ప్రత్యయవర్గాలనుబట్టి ఉంటాయి.

1. విధ్యాదులు : (విధి, నుజీ, భావార్థకం, కజీ).
2. భూతాదులు : (భూతం, అప్యర్థకం).

3. అభూతాదులు : (వర్తమానం, చేదర్థకం, ఉభయప్రార్థన).

i. విధ్యాదులు, క్త్వార్థకప్రత్యయాలుకాక మిగతా ప్రత్యయాలముందు 'ఉండు' 'ఉన్' గా మారుతుంది.

ii. అనుబంధక్రియలుగా వచ్చిన ఉండు, కొను ధాతువులు విధ్యాదుల్లో ఓ, కోలుగా మారుతాయి. ఉదా : కూర్చో, చేసుకో.

iii. అనుబద్ధమైన ఉండు, కొనులు భూతాది ప్రత్యాయాల ముందు వికల్పంగా 'ఉన్, కున్'లుగా మారతాయి. ఉదా : కూర్చున్నాడు, చేసుకున్నాడు.

iv. (a) ధాతువు చివర 'యు' విధ్యాదికేతరప్రత్యయాలముందు 'స' కారంగా మారుతుంది. ఉదా : చేయు, చేసి, చేశాడు, చేస్తే, చేస్తాడు.

(b) 'చు, చ్చు' లకు, ఇంచు ప్రత్యయంలో 'ంచు'కు అభూతాది ప్రత్యయాల ముందు 'స' కారా దేశమవుతుంది. ఉదా : పిలుచు, పిలుస్తాడు, పిలిస్తే, ఇచ్చు : ఇస్తాడు, ఇస్తే; చేయించు : చేయిస్తాడు, చేయిస్తే; గిచ్చు, గుచ్చు, నచ్చు. కొందరి వ్యవహారంలో నొచ్చు, పుచ్చు ; మెచ్చు, హెచ్చు-లకు ఈ ఆదేశంరాదు. ఆదేశం వచ్చే ధాతువులు : ఇచ్చు, చచ్చు, తెచ్చు, వచ్చు.

(c) ఆదేసకారం దకారాది ప్రత్యయంముందు దకారంగా మారుతుంది. ఉదా : పిలున్ + దాం > పిలుద్దాం, ఇన్ + దాం > ఇద్దాం, చేయిన్ + దాం > చేయిద్దాం. కొందరు తెలంగాణా వారి వ్యవహారంలో పిలుజ్దాం, ఇజ్దాం, చేయిజ్దాం అనే రూపాలున్నాయి. వారి భాషలో సమీకరణ కేవలం నాదతవరకే. ఇక్కడ జకారోచ్చారణ ఊష్మం.

v. రెండక్షరాల ధాతువుల్లో దీర్ఘస్వరపూర్వకమైన 'చ' వర్ణానికి విధ్యాదిక ప్రత్యాయాలముందు కొందరి వ్యవహారంలో 'య' వర్ణా దేశమవుతుంది. ఉదా : తూచు : తూయి > తుయ్యి, తూచటం, తూయటం. దాచు : దాయి, దాచటం, దాయటం.

vi. మూడక్షరాల ధాతుల్లో చివరివ్యంజనమైన 'చ' వర్ణానికి విధ్యాది ప్రత్యయాలముందు 'వ' వర్ణాదేశమవుతుంది. ఉదా : పిలుచు : పిలువు, పిలవటం.

ప్రత్యయంగా విడదీయబగిన 'చు' లో 'చ' వర్ణానికి కొందరి భాషలో కార్యం జరగదు. ఉదా : కాలు + చు : కాల్చు, కాల్చటం, కాల్చు, కాలవటం.

vii ధాతువు చివరి వ్యంజనమైన ద్విరుక్త 'ట' వర్ణానికి అభూతాది ప్రత్యాయాలముందు 'డ' వర్ణాదేశం అవుతుంది. ఉదా : కొడితే. కొడతాడు, కొడదాం. నట్టు,మెట్టులకు ఈ కార్యం జరగరు. ఉదా: నట్టుతూ మాట్లాడాడు,మెట్టితే.

viii. న్ను, ళ్ళు, ప్పు అంతంలో ఉన్న ధాతువులకు అభూతాదిక ప్రత్యయాల ముందు తుది ద్విరుక్త వ్యంజనం అద్విరుక్తమవుతుంది. ఉదా : తన్ను : తంతాడు, తంతే. వెళ్ళు : వెళ్తాడు, వెళ్తే. చెప్పు : చెప్తాడు, చెప్తే. అయితే ఈ కార్యం జరగని ధాతువులే ఎక్కువ. ఉదా : దున్ను, మన్ను, కుళ్ళు, మళ్ళు; తప్పు, తిప్పు, దెప్పు రొప్పు, విప్పు.

ix. స్వరసమత : మూడక్షరాల ధాతువుల్లో ప్రత్యయాది అ, ఇల ననుసరించి ధాతువుల్లో ప్రథమేతరాచ్చులుకూడా క్రమంగా అ, ఇలుగా మారతాయి. ఉదా : అడుగు : అడగ, అడిగి; కరగు : కరగ, కరిగి. 'తెలియు' కు : తెలీదు, తెలియదు, తెలవదు అనే రూపాలున్నాయి.

x. కొన్ని ధాతువులకు ఆదేశరూపాలు (suppletive forms) ఈ కింది విధంగా ఉన్నాయి. ఇవి విధ్యాది ప్రత్యయాలముందే ఇట్లా ఉంటాయి. వచ్చు : రా, తెచ్చు : తే, ఇచ్చు : ఇయ్యి, ఇవ్వు, అవు : కా, అవ-, చూచు: చూడు, లేచు: లే, లేవ-, చచ్చు : చావు, పోవు : పో.

xi. పడుధాతువు భూతాదికప్రత్యయాలతో కలిసి రూపాలు ఇట్లా ఉంటాయి. పడు : పడ్డాడు, పడ్డా, పడినా. చెడుధాతువులకు కూడా ఇంతే. ప్రాచీనభాషలో ఇడు ఈ తరగతికి చెందినదే.

**13.13. ప్రత్యయాల్లో మార్పులు** : i. అన్వాది ధాతువుల తర్వాత, ప్రత్యయంలో 'త' వర్ణం మూర్ధన్యమైన 'ట' వర్ణమవుతుంది. అను, కను, కొను, తిను, విను-ఇవి అన్వాదులు. అను : అంటే, అంటాడు, అంటున్నాడు.

ii. కాలబోధక ప్రత్యయాల్లో చివరి 'అ' కారానికి దపీతర ప్రత్యయాల ముందు రాయలసీమ, సర్కారుజిల్లాల వ్యవహారంలో దీర్ఘం వస్తుంది. ఉదా : చేయు : చేసినాడు, చేస్తాడు. తెలంగాణంలో చేసిండు, చేస్తడు.

iii. సర్కారు జిల్లాల వ్యవహారంలో సమాపకక్రియల్లో దపీతర ప్రత్యయాలముందు భూతకాలబోధక ప్రత్యయంలో నవర్ణం లోపిస్తుంది. చేయు : చేస్ + ఇనాడు > చేస్ + ఇఅ + డు > చేశాడు. ఇ + అ > ఏ

iv. దీర్ఘస్వరాంతధాతురూపాలకు 'అటం' చేరినప్పుడు 'వ' కారం ఆగమంగా వస్తుంద. ఉదా : రా + అటం > రావటం, తే + అటం > తేవటం, తీసుకో + అటం > తీసుకోవటం.

v. దీర్ఘ స్వరాంత ధాతువుల తరవాత స్వరాది ప్రత్యయాల స్వరానికి లోపం జరుగుతుంది. కొందరి భాషలో అటం లోని మొదటి అచ్చుకూడా లోపిస్తుంది. అపుడు పై సూత్రంలో వచ్చే వ కారాగమం జరగదన్నమాట. 'వ' ఆగమంగా వస్తుంది. ఉదా : రా + అక > రాక, తే + అక > తేక.

vi (a) అన్నంత క్రియా రూపాల తరవాత పరుషాలు సరళాలవుతాయి. ఉదా : రాన్ + కలదు > రాగలదు, పోన్ + కూడదు > పోగూడదు, చెప్పన్ + పట్టి > చెప్పబట్టి.

(b) సరళాదేశానంతరం 'న' కారానికి వ్యంజనాల ముందులోపం జరుగుతుంది. ఉదా : చెప్పన్ + వచ్చు > చెప్పవచ్చు > చెప్పొచ్చు, రాన్ + వచ్చు > > రావచ్చు > రావొచ్చు. (వ > ఒ > వొ)

కొన్ని స్వరాదిపదాలు పరమైనప్పుడుకూడా ఈ నకారానికి వికల్పంగా లోపం జరుగుతుంది. ఉదా : చెప్పన్ + అవసరంలేదు > చెప్పనవసరంలేదు. చెయ్యన్ + అక్కర్లేదు > చెయ్యక్కర్లేదు.

కొన్ని స్వరలోప, సమీకరణకార్యాలు భిన్నమాండలికాల్లో భిన్నవిధాలుగా ఉన్నాయి.

i. అన్వాది ధాతువులకు పరంగా వచ్చినపుడు భూతకాల బోధకమైన ఇన ప్రత్యయంలో ఇ లోపిస్తుంది. ఉదా: అను + ఇనా + డు > అన్నాడు.

ii. 'ది' ప్రత్యయంముందు స్వరలోపం భిన్నవిధాలుగాజరిగే అవకాశం ఉంది. ఉదా : తిను + ఇనది > తినింది, తిన్నది.

iii. భవిష్యంలోకూడా కొన్ని గుర్తించదగిన భేదాలున్నాయి. ఉదా : వచ్చు + త + ది > వచ్చుద్ది, వస్తది; కొట్టు + త + ది > కొట్టుద్ది, కొడతది; చెప్పు + త + ది > చెప్పుద్ది, చెపుతది.

**13.14. వాక్యనిర్మాణం :** వాక్యాలు సామాన్య వాక్యాలు, సంశ్లిష్ట వాక్యాలు, సంయుక్తవాక్యాలు అని మూడు విధాలు. సామాన్యవాక్యాల్లో ఒకే

ఆఖ్యాతం (predicate) ఉంటుంది. ఒక సామాన్య వాక్యానికి అసమాపక క్రియా రూపాలున్న ఉపవాక్యాలు చేరిస్తే సంశ్లిష్టవాక్యాలు ఏర్పడతాయి. కొన్ని సామాన్య వాక్యాలను ఒకచోట చేరిస్తే సంయుక్తవాక్యా లేర్పడతాయి.

**సామాన్యవాక్యాలు** : తెలుగులో సామాన్యవాక్యాలు క్రియరహితాలు, క్రియాసహితాలు అని రెండు రకాలు.

*క్రియారహితాలు* : ఏక పదార్థ బోధకమైన రెండు నామాలు ఒకచోట చేరిస్తే క్రియరహితవాక్యాలు ఏర్పడతాయి. ఈ వాక్యాల్లో మొదటినామం ఉద్దేశ్యం; రెండోనామం విధేయం. మొదటినామం సాధారణంగా సర్వనామంగాని, విశేష నామంగాని అయి ఉంటుంది. సర్వనామం విశేషణంగాఉన్న నామంకూడా ఉండ వచ్చు. రెండోనామం సిద్ధనామంగాని, విశేషణాదులనుండి నిష్పన్నమైన నామం కాని కావచ్చు.

| | |
|---|---|
| అతను | వెంకటేశ్వరులు |
| ఈమె | సుజాత |
| ఆయన | డాక్టరు |
| అది | ఎర్రగుర్రం |
| ఆ కుర్రవాడు | మంచివాడు |
| ఆ అమ్మాయి | తెలివైనది |
| ఆ కలం | నాది |
| ఈ అమ్మాయి | అందమైనది |

విశేషణాదులకు ఈ కింది ప్రత్యయాలు చేర్చటంవల్ల నామాలు నిష్పన్న మవుతాయి.

| | ఏకవచన | బహువచన |
|---|---|---|
| మహత్తు | వాడు | వారు, వాళ్ళు (మహన్మహతి) |
| అమహత్తు | ది | వి (అమహత్తు) |

ఉదా : మంచివాడు, మంచివారు, మంచివాళ్ళు, మంచిది, మంచివి.

ఉత్తమ మధ్యమపురుష సర్వనామాలు ఉద్దేశాలుగా ఉన్నప్పుడు విధేయ నామం ఆయా పురుషలను బోధించే ప్రత్యయాలను గ్రహిస్తుంది. అవి:

| | ఏకవచన | బహువచన |
|---|---|---|
| ఉత్తమ | ను.ని | ము, మ్, మి |
| మధ్యమ | వు,వి | — |

నామ విభక్తులలో ను–ని, కు–కిల మధ్య భేదం లాంటిదే ఇక్కడి ను-ని, వు-వి, ము-మిల మధ్యభేదం సిద్ధ, సాధ్య ఇకారాంతశబ్దాల తరవాత 'ని, వి, మి' లు మాత్రమే ఉంటాయి. మిగతా అచ్చుల తరవాత వికల్పంగా ఏవైనా రావచ్చు. 'మి' అట్లారాదు. ఉదా. నేను మనిషిని; నువ్వుస్త్రీవి;మీరు పురుషులు; మీరు స్త్రీలు; మనం మనుషులం; నేను తెలుగు వాడిని; నువ్వు తెలుగు దానివి; మేం తెలుగువాళ్ళం; మనం తెలుగువాళ్ళం; మేం పదిమందిమి.

స్త్రీవాచకాన్ని బోధించే 'ది' ప్రత్యయానికి 'అది' శబ్దానికి లాగా ప్రత్యయాలముందు 'దాని' అనేరూపం ఆదేశమవుతుంది.

విశేషణాల తరవాతవచ్చే వాడు, వారు, ది, వి ప్రత్యయాలకు వాటితో సరూపమైన సర్వనామాలకు ఔపవిభక్తిక రూపాలుంటాయి. వాడు-వాడి, వారు-వారి, వాళ్ళు-వాళ్ళ, ది–దాని, వి–వాటి,

ప్రత్యయమాత్రమై విశేషణాల తరవాతవచ్చే పై శబ్దాల్లో తదర్థబోధకత లేదు. ఇదమర్థబోధక సర్వనామరూపాలిక్కడరావు.

ఈ క్రియారహితవాక్యాలు ఉపవాక్యాలు (subordinate clauses)గా ప్రయుక్తమయినప్పుడు 'అవు' ధాతు రూపాలను అనుబంధించుకోవాలి. ఉదా : అతను మంచివాడు అయితే; అతను ధనవంతుడయినా గుణవంతుడు.

విధేయనామానికి 'కాదు' అనే రూపం అన్నిపురుషల్లోను అనుబంధించటం వల్ల వ్యతిరేకరూపాలేర్పడతాయి. కా- అనే 'అవు' ధాతువుయొక్క అన్నంత రూపానికి క్రియా విభక్తులు ఆయాపురుషల్లో చేర్చటంవల్లకూడా వ్యతిరేకరూపాలు ఏర్పడతాయి. అతను చెడ్డవాడుకాదు, కాడు.

'ఉండు' ధాతు నిష్పన్న క్రియారూపాల లోపంవల్లకూడా కొన్ని క్రియారహిత వాక్యాలేర్పడతాయి. ఉదా : ఆయనకు ముగ్గురు పిల్లలు. ఆమెకు సిగ్గు ఎక్కువ. ఆ బావి చాలా లోతు.

ఈ పై వాటికి వ్యతిరేకవాక్యాలు 'లే' అనే 'ఉండు' ధాతువుయొక్క అన్నంత రూపానికి క్రియావిభక్తులు చేర్చటంవల్ల ఏర్పడతాయి.

**13.15.** **క్రియాసహితవాక్యాలు :** వీటిలో మళ్ళీ కర్తృరహితవాక్యాలు, కర్తృసహితవాక్యాలు అని రెండు రకాలు. కర్తృరహితవాక్యాల్లో 'ఉంది' అనే క్రియారూపం ఉంటుంది. దేహమనస్థితి బోధకనామాలు గా అనే ప్రత్యయంతో ఈ వాక్యాల్లో ఉంటాయి. ఉదా : నాకు ఆకలిగా ఉంది. వాడికి సంతోషంగా ఉంది. ఈ పై వాక్యాలు ఈ కింది కర్తృసహిత వాక్యాలతో సమానార్థకాలు. నేను ఆకలిగా ఉన్నాను. వాడు సంతోషంగా ఉన్నాడు.

కర్తృసహితవాక్యాలను క్రియలనుబట్టి అకర్మక, సకర్మక, ప్రేరణ వాక్యాలుగా విభజించవచ్చు.

అకర్మక వాక్యాల్లో కర్మఉండదు. సకర్మకవాక్యాల్లో ఉంటుంది. ప్రేరణ వాక్యాల్లో కర్తృప్రేరక నామం ఉంటుంది. అకర్మక : అతను నిద్రపోయాడు. సకర్మక : ఆమె అన్నం వండింది. అతను అన్నం తిన్నాడు. ప్రేరణ : ఆమె అతన్ని నిద్రపుచ్చింది. ఆమె అతనిచేత అన్నం వండించింది.

ఆ ప్రేరణంలో అకర్మక క్రియ ఉంటే దాని కర్తృపదానికి ను విభక్తి, సకర్మక క్రియ ఉంటే దాని కర్తృపదానికి చేత వర్ణకమూ వస్తాయి. అర్థభేదంలో రెంటికీ ఈ విభక్తులు రావచ్చు. ఉదా : ఆమె అతన్ని B. A వరకు చదివించింది. ఆమె అతన్ని ఒంటిగంటవరకు చదివించింది. ఆమె అతనిచేత ఒంటిగంటవరకు చదివించింది.

తెలుగు వాక్యంలో పదబంధాలు 'కర్తృ-కర్మ-క్రియా' క్రమంలో ఉంటాయి. క్రియావిశేషణాలు కర్తృపదం తరవాత, క్రియకుపూర్వం ఉంటాయి. ప్రాధాన్య వివక్షలో ఈ క్రమం వ్యత్యస్తం కావచ్చు. ఉదా : అతను నిన్న ఊరినుంచి వచ్చాడు. అతను ఊరినుంచి నిన్నవచ్చాడు. నిన్న ఊరినుంచి అతను వచ్చాడు.

క్రియను నామంగామార్చి వాక్యంలో ఏ క్రియేతరపదబంధాన్నయినా విధేయ స్థానంలో వాడటంద్వారా కూడా ప్రాధాన్య వివక్షచేయ్యవచ్చు. ఉదా: అతను ఊరినుంచి వచ్చింది నిన్న. అతను నిన్నవచ్చింది ఊరినుంచి. నిన్న ఊరినుంచి వచ్చింది అతను.

**విధి, ప్రశ్నాదిక భేదాలు :** వాక్యాల్లో విధి–నిర్విధి, ప్రశ్న-అప్రశ్న-కర్తృప్రధాన-కర్మప్రధాన భేదాలుకూడా ఉన్నాయి.

**విధి :** విధి వాక్యాల్లో కర్తృపదం మధ్యమపురుషలో ఉంటుంది. కర్తకు వ్యాపారాదేశంచేసే వాక్యాలు విధి వాక్యాలు, విధి వాక్యాలెప్పుడూ భవిష్య ద్బోధకాలే. విధిలో క్రియ ధాతురూపంలో ప్రయుక్తమవుతుంది,

(1) అనియతా దేశంఉన్న ధాతువులకు ఆదేశరూపమే విధిలో ఉపయుక్తమవుతుంది. ఉదా : రా, పో, తే, చూడు, చావు మొ॥

(2) ఆదిస్వరం దీర్ఘమైఉండి 'యు' అంతలోఉన్న ధాతువులకు చివరి 'ఉ' 'ఇ' గా మారి అకారేతర దీర్ఘస్వర, యకారాలకు హ్రస్వస్వర ద్విరుక్త యకారాలవుతాయి. ఉదా : చేయు–చెయ్యి, కోయు–కొయ్యి, రాయు-రాయి.

రెండక్షరాల ధాతువులో చివరి అక్షరమైన 'చు' కొందరి భాషలో 'యు' గా గ్రహించాల్సి ఉంటుంది. తూచు, తోచు, దాచు, ఇట్లాంటివి.

(3) మూడక్షరాలధాతువుల్లో చివరి, చు, యులకు 'వు' అవుతుంది. ఇన్మధ్యం ఉన్మధ్యం అవుతుంది ఉదా : పిలుచు–పిలువు, కలియు–కలువు.

(4) ఉచ్చారణవేగంతో చివరి వ్యంజనాలయిన య, వ ల తరవాతి అచ్చు లోపిస్తుంది. ద్విరుక్తయవర్ణం అద్విరుక్తమవుతుంది. ఒక్కొక్కప్పుడు చివరి 'వ' వర్ణం పూర్వస్వరానికి దీర్ఘంగా మార్చవచ్చు. అంటే-ఉవ్‌కి ఊకి భేదం సన్నగిల్లిపోతుంది. చెయ్యి > చెయ్యే > చెయ్; పిలువు > పిలువ్ > పిలూ.

ఎరుగ్వాదులకు విధిలేదు. ఎరుగు, చెడు, జంకు, జడియు, తగు, నచ్చు, నట్టు, బెదురు మొదలైన ధాతువులు చాలా వాటికి విధిలో ప్రయోగం ఉండదు. కొన్ని ధాతువులకు కొను ప్రత్యయంచేరిస్తే విధిలో ప్రయోగార్హాలు. ఉదా : తెలియ–తెలుసుకో.

విధి ఏకవచన క్రియారూపానికి అండి ప్రత్యయంచేరిస్తే బహువచనరూప మేర్పడుతుంది. దీర్ఘస్వరాంత ధాతువులతరవాత ఈ ప్రత్యయాదిస్వరంలోపిస్తుంది. కొందరిభాషలో దీర్ఘం హ్రస్వమవుతుంది. రా + అండి > రాండి > రండి. కొన్ని నిర్విధివాక్యాలు విధిబోధకాలుకావచ్చు. ఉదా : మీరిక బయటికి దయచెయ్య వచ్చు. మా అమ్మాయి పెళ్ళికి మీరు తప్పకుండా రావాలి.

ప్రశ్న : 1. వాక్యాంతశ్శబ్దాపేక్షక ప్రశ్నలు 2. వాక్యేతర శబ్దాపేక్షక ప్రశ్నలు 3. విషయనిర్ధారకప్రశ్నలు అని మూడు రకాల ప్రశ్నలు సర్వభాషల్లోను ఉంటాయి.

వాక్యానికి '-ఆ' అనే అపదం చేర్చటంవల్ల వాక్యాంతశ్శబ్దాపేక్షక ప్రశ్నలేర్పడతాయి. ఉదా : ఆయన ఊరినుంచి వచ్చాడా ? సమాధానం వచ్చాడు లేక రాలేదు అని ఉంటుంది.

ఎవరు, ఎందుకు, ఎప్పుడు వంటి కిమర్థబోధక శబ్దాలతో వాక్యేతరశబ్దాపేక్షక ప్రశ్నలేర్పడతాయి. ఆయన ఊరినుంచి ఎప్పుడు వస్తాడు ? రేపు, ఎల్లుండి, వెలరోజుల తరవాత వంటి పదాలు సమాధానాల్లో ఉంటాయి.

కదా, కదూ వంటి అపదాలు వాక్యానికిచేర్పటంవల్లవిషయ నిర్ధారక ప్రశ్నలు ఏర్పడతాయి. ఆయన నిన్న ఊరినుంచి వచ్చాడుకదూ ? ఈ వాక్యంలో 'ఆ మనిషి నిన్న ఊరినుంచి వచ్చాడు' అన్నవిషయల వక్తకు పూర్వమే తెలుసు. ఆ విషయం నిర్ధారణ చేసుకోవటానికి అడిగిన ప్రశ్న.

**కర్మప్రధానవాక్యాలు** : కర్మ పదాన్ని ఉద్దేశ్యంచేసి కర్తృపదాన్ని విధేయంలో భాగంగాచేసి చెప్పే వాక్యాలు కర్మ ప్రధానవాక్యాలు. ఉదా : అతను వ్యాసం రాశాడు; వ్యాసం అతనిచేత రాయబడింది.

గుప్త కర్తృ, కర్మలు వ్యక్త నిర్మాణంలో వ్యత్యస్తమైతే కర్మప్రధాన వాక్యాలు ఏర్పడతాయి. ఈ రకపు వాక్యాలు ఆధునిక వాగ్వ్యవహారంలో చాలా అరుదు. రచనా వ్యవహారంలో కనిపిస్తాయి.

**13.16. సంశ్లిష్ట వాక్యాలు** : అసమాపకక్రియాయుక్త ఉపవాక్యాలు చేరిన సామాన్యవాక్యాలు సంశ్లిష్ట వాక్యాలవుతాయి.

**క్త్వార్థక** : 1. సమానకర్తృకమైన రెండుక్రియల్లో పూర్వక్రియ క్త్వార్థకమై ఉంటుంది. ఉదా : అతను ఇంటికివెళ్ళి కాఫీ తాగాడు. ఈ వాక్యాలిట్లాంటి అర్థంలో భిన్న కర్తృకం కావటానికి వీల్లేదు.

* రామారావు అన్నంతిని సుబ్బారావు కాఫీ తాగాడు.

కాని పరస్పర విరుద్ధార్థబోధ ఉన్నక్రియలు వాడినప్పుడు భిన్నకర్తృకత సాధ్యమే. ఉదా : ఇటీవల ఎన్నికల్లో కాంగ్రెసు ఓడిపోయి జనతాపార్టీ గెల్చింది.

2. కొన్ని క్రియలతో క్త్వార్థకం హేత్వర్థక మవుతుంది. ఉదా : అతను జ్వరంవచ్చి పడుకున్నాడు. అతడు తిండి తినక చిక్కిపోయాడు.

3. కొన్ని క్రియలతో రీత్యర్థక క్రియావిశేషణం అవుతుంది. ఉదా : అతను లంచాలు తిని సంపాయించాడు. అతను రిక్షాలాగి బతుకుతున్నాడు.

4. కాల బోధక సామాన్యవాక్యానికి ఉపవాక్యంగా-అతను స్నానంచేసి వారంరోజులయింది. పై వాక్యానికి ఈ కింది వాక్యంతో తుల్యార్థబోధకత ఉంది. అతను వారం రోజుల కిందట స్నానం చేశాడు.

ప్రధానవిషయబోధలో ఈ వాక్యాలు వ్యతిరేకక్త్వార్థకంతో అంతగా భేదించవు. ఉదా : అతను స్నానంచేసి వారంరోజులయింది. అతనుస్నానంచేయక వారంరోజులయింది.

కాని అన్ని క్రియలతోను ఈ వ్యతిరేకవాక్యాలు సాధ్యంగావు. * అతనికి పెళ్ళికాక రెండేళ్ళయింది; * అతనికి మశూచికం రాక ఐదేళ్ళయింది; * వాడు చావక ఆరునెలలయింది; * ఆమె అందంగా ఉండి ఐదేళ్ళయింది. పునఃపునస్సంభవ యోగంలేని క్రియలు వ్యతిరేకక్త్వార్థక రూపంతో ఈ వాక్యాల్లో రాలేవు.

5. క్త్వార్థకరూపద్విరుక్తి వ్యాపారాధిక్యాన్ని తెలియజేస్తుంది. వ్యతిరేక క్త్వార్థకద్విరుక్తి కాలదైర్ఘ్యాన్ని సూచిస్తుంది. ఉదా : చెప్పిచెప్పి నానోరు పడిపోతున్నది; రాకరాకవచ్చాడు.

6. జడవాచకకర్తృపదాలతో క్త్వార్థకం పరిణామ సూచకమవుతుంది. అద్దం కిందపడి పగిలింది.

7. ప్రకృతిలో సహజ సిద్ధంగా వ్యాపారాలతో క్త్వార్థకం హేత్వర్థకమవుతుంది. ఉదా : వానలు కురిసి చెరువులు నిండినాయి; తుపానువచ్చి పడవలు మునిగినాయి; గాలివానవచ్చి మామిడిపండ్లు రాలిపోయినాయి.

8. కాలబోధకంగా కొన్ని క్త్వార్థకరూపాలున్నాయి. ఉదా : పొద్దెక్కి నిద్దర్లేచాడు. పొద్దుగూకి చుట్టాలువచ్చారు. చీకటిబడి ఇంటికి వెళ్ళాడు.

నియతంగా జరిగే ప్రకృతి సహజమైన వ్యాపారాల్ని బోధించే క్త్వార్థక క్రియలున్నపుడే ఈ వాక్యాలు సాధ్యం.

ఈ కింది వాక్యాలు వ్యాకరణవిరుద్ధాలు. * అతను వానకురిసి ఇంటికి వచ్చాడు; * అతను ఎండకాసి బయటికివెళ్ళాడు. * అతను ఫ్యాక్టరీ కూతకూసి నిద్ర లేచాడు.

**శత్రర్థకం** : ప్రధాన క్రియతోపాటుజరిగే వ్యాపారాన్ని సూచించటానికి ఉపవాక్యంలో క్రియ శత్రర్థకరూపంలో ఉంటుంది. ప్రధాన అప్రధానక్రియలు రెండూ ఏకకర్తృకాలై ఉండాలి. ఉదా : అతను కాఫీ తాగుతూ పేపరు చదువుతున్నాడు.

శత్రర్థక క్రియలు ప్రధానక్రియకు రీతి విశేషణాలుగాకూడా ప్రవర్తిస్తాయి. ఉదా : అతనెప్పుడూ నవ్వుతూ పలకరిస్తాడు.

**అప్యర్థకం** : రెండు వ్యాపారాల్లో వైరుధ్యమున్నప్పుడీ వాక్యాలుపయోగిస్తారు. ధాతువునకు – ఇనా ప్రత్యయం చేర్చటంవల్ల అప్యర్థక క్రియలేర్పడతాయి. ఉదా : అతను వచ్చినా ఫలితముండదు; వాడు రాకపోయినా పరవాలేదు.

**చేదర్థకం** : ఒక వ్యాపారంమీద ఆధారపడి ఇంకో వ్యాపారం జరిగినప్పుడీ వాక్యాలుపయోగిస్తారు. తే, ఇతే ప్రత్యయాలుచేరిస్తే చేదర్థక క్రియలు ఏర్పడతాయి. ఉదా : మా ఇంటికొస్తే డబ్బిస్తాను; నేను బజారుకు వెళితే తెస్తాను.

'జరగవలసింది జరగలేదు' అనేభావాన్ని వ్యక్తంచెయ్యటానికిక్త్వార్థకక్రియ మీద ఉండు ధాతువుయొక్క చేదర్థకరూపం చేరుతుంది. ఉదా : నువ్వునిన్నవచ్చి ఉంటే డబ్బు ఇచ్చేవాడిని. ఇక్కడ ప్రధాన క్రియనుకూడా చేదర్థక సమాపక క్రియగా భావించవచ్చు. శబ్దరూపం క్రియాజన్య విశేషణంనుంచి నిష్పన్నమైన నామమైనా వాక్యంలో దీని ప్రవర్తన సమాపకక్రియే.

సంభావ్యమాన వ్యాపారాలున్నప్పుడే చేదర్థం సాధ్యమవుతుంది. సమాప్తినందిన వ్యాపారాలమధ్య ఈ బోధ ఉండదు.

ఉదా : వానలు కురిస్తే పంటలు పండుతాయి. పైసలుంటే దోసె తినేవాణ్ణి.

పై వాక్యాల్లో భూతకాలిక క్రియలు వాడితే కలిగేది చేదర్థబోధకాదు. చేదర్థబోధలో పై వాక్యాల్లో భూతార్థ బోధకు ఉండు ధాతువునుప్రయుక్తం చెయ్యవచ్చు.

పైసలుండి ఉంటే దోసే తినేవాణ్ణి క్కాని

* 'పైసలుండి ఉంటే దోసె తిన్నాను' అనే వాక్యం వ్యాకరణ సమ్మతంగా కనపడదు.

**13.17.** **నామ్నీకరణాలు** : ఒక వాక్యాన్ని కొన్ని మార్పులతో మరో వాక్యంలో కర్తృకర్మ పదస్థానాల్లో ప్రయోగించే పద్ధతిని నామ్నీకరణంఅంటారు

**అవి** : ఒకరన్న మాటల్ని అదే వక్తగాని, ఇంకోవక్తగాని పునశ్చరణచేస్తే దాన్ని అనుకృతి అంటారు. ఈ అనుకృతి ప్రత్యక్షపరోక్షభేదాలతో రెండురకాలు. ప్రత్యక్షానుకృతిలో మూలవక్త అన్నమాటలు అదేవిధంగా అనుకృతమవుతాయి. పరోక్షానుకృతిలో మాటలఅర్థమే అనూదితమవుతుంది. అందువల్ల ప్రత్యక్షానుకృతి శబ్దప్రధానం, పరోక్షానుకృతి అర్థప్రధానం. రెండిట్లోనూ 'అని' ప్రయుక్తమవుతుంది.

*ప్రత్యక్షానుకృతి* : సుబ్బారావు "నేను రేపు వస్తాను" (అని) అన్నాడు.
*పరోక్షానుకృతి* : సుబ్బారావు తను రేపు వస్తాను (అని) అన్నాడు.

ప్రత్యక్షానుకృతిలో అనుకృతవాక్యంలో ఉత్తమపురుష సర్వనామరూపాలు ప్రధానవాక్యంలో ప్రథమపురుషనామంతో సమబోధకత కలిగి ఉంటే అవికూడా ప్రథమపురుషలోకిమారి వాటికి ఏకవచనంలో తను, బహువచనంలో తము ఆదేశమవుతాయి. క్రియావిభక్తుల్లో మార్పుండదు. ప్రధాన వాక్యంలో క్రియ అను, చెప్పు వంటి వచ్యర్థక ధాతు నిష్పన్నం. అనుధాతు నిష్పన్నక్రియ సమీపంలోఉంటే 'అని' ప్రయోగం వికల్పం.

ప్రత్యక్షానుకృతిలో ఏ శబ్దమైనా అనుకృతంకావచ్చు. అది అర్థవంతమైన శబ్దసముదాయం కావచ్చు. కాకపోవచ్చు. ఏ భాషలో దైనాకావచ్చు అసలుభాషలోనే కాకపోవచ్చు. చేష్టాదికాలుకూడా అనుకృతం కావచ్చు.

పరోక్షానుకృతిలో కథనంచేసే భాషలోని వాక్యమేకావాలి. అనుకృతిలో వాక్యాలు విధ్యాదివాక్యాలేవైనా కావచ్చు. పరోక్షవిధిలో వాటికి ఈ కింది మార్పులు జరుగుతాయి.

**విధి** : *ప్రత్యక్షవిధి* : అతనునాతో 'నువ్వురేపురా' (అని) అన్నాడు.

**పరోక్షవిధి** : అతను నన్ను రేపు రమ్మన్నాడు.

అనుకృత వాక్యంలో కర్త లోపిస్తుంది. ప్రధాన వాక్యంలో అముఖ్యకర్మకు ద్వితీయావిభక్తి వస్తుంది. క్రియకు 'అమ్' అనేశబ్దం ఆగమమవుతుంది. ఆ మార్పుల్ని ఈ కింద గమనించవచ్చు. చెప్పు + అమ్ + అని > చెప్పమని; రా + అమ్ + అని > రా + మ్ + అని > రమ్మని.

అనుకృతిలోనేకాక కొన్ని ఇతర వాక్యాలకుకూడా 'అని' చేరుతుంది. ఇక్కడ అని విషయార్థబోధకం. ఉదా : అతను వస్తాడని నాకు తెలుసు; వాడి ట్లాగే చేస్తాడని నేనెరుగుదును; వాడు ప్యాసవుతాడని నాకు నమ్మకం; వాళ్ళకు పెళ్ళయిందని విన్నాను.

కొన్ని వాక్యాలలో అని కాంక్షార్థకం. ఇట్లాంటి వాక్యాల్లో ప్రధాన వాక్యంలో క్రియ 'ఉండు' గాని, అనుకొన, ఆలోచించువంటి వాటిల్లో ఒకటిగాని అయి ఉంటుంది. ఉపవాక్యంలో క్రియ 'వలయు > ఆలి' అంతంలో ఉన్నదిగాని, ఉభయ ప్రార్థన రూపంగాని అయి ఉంటుంది. ఉభయప్రార్థన క్రియారూపం విడిగా వాడినప్పుడు ఉత్తమబహువచనకర్తృకమై ఉంటుంది. కాని ఇక్కడ అట్లాంటి నిబంధనలేదు. ఉదా : ఆమెకు కొత్తచీర కొనుక్కోవాలని ఉంది; ఆయన కారు కొందామనుకుంటున్నాడు; వాళ్ళు ఊరికి వెళ్ళాలని ఆలోచిస్తున్నారు.

'అని' చేర్చిన కొన్ని వాక్యాలు ప్రధానవాక్యానికి హేతువిశేషణాలుగా ప్రవర్తిస్తాయి. నేను పండక్కి చీరకొనిపెట్టలేదని మా ఆవిడ అలిగింది

ఈ వాక్యాల్లో ప్రధానక్రియావ్యాపారం కర్త, లేక అనుభోక్త (Agent or experiencer) స్వాధీనంలో లేకపోతే వ్యాకారణ విరుద్ధాలవుతాయి. ఉదా : ఆమెసరిగ్గా మందులు తీసుకోలేదని జ్వరంతిరగబెట్టింది.

**అది:** ఒక వ్యాక్యానికి 'అది' చేర్చి ఇంకో వాక్యంలో నామపదస్థానంలో ప్రయోగించవచ్చు. అప్పుడది విషయార్థబోధకం అవుతుంది. వాళ్ళు ఊరికి వెళ్ళింది నాకు తెలుసు.

ఉపవాక్యానికి 'అది' చేర్చినప్పుడు దాని క్రియ విశేషణంగా మారుతుంది. వెళ్ళారు + అది > వెళ్ళిన + అది > వెళ్ళింది.

క్రియాజన్యవిశేషణానికి విశేష్యంగాకూడా 'అది' చేరవచ్చు. అప్పుడు 'అది' ఆ వాక్యంలోదే ఇంకోనామాన్ని సూచించవచ్చు. ఉదా : వాళ్ళుఎక్కడికి వెళ్ళింది నాకుతెలుసు = వెళ్ళినచోటు.

ఇందువల్ల ఒక్కోసారి వాక్యాలు భిన్నార్థబోధకాలు కావచ్చు. ఉదా : నువ్వు తిన్నది నాకు తెలుసు. దీనికి ఈ కింది రెండు వాక్యాలూ అర్థాలే 1. నువ్వు తిన్నావని నాకు తెలుసు. 2. నువ్వు ఏంతిన్నావో నాకు తెలుసు.

**13.18.** ఓ, ఏమో : కిమర్థక ప్రశ్నలకు -'ఓ' చేర్చి ఇంకోవాక్యంలో ప్రయోగించవచ్చు. ఇట్లాంటి వాక్యాలు విషయార్థంలోనూ, సందేహార్థంలోనూ, పరోక్షప్రశ్నావాక్యాల్లోనూ ఉపయోగిస్తారు. ఉదా : వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో నాకుతెలుసు = వాళ్ళు వెళ్ళినచోటు; వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో కనుక్కో (పరోక్ష ప్రశ్న); వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో ఎవరికి తెలుసు (సందేహం).

సందేహార్థంలో ఉపవాక్యానికి అదనంగా 'ఏమో' శబ్దాన్ని చేర్చవచ్చు. వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో, ఏమో, నాకుతెలీదు. సందేహార్థంలో ఉపవాక్యం ప్రధానవాక్యం సాయంలేకుండానే ప్రయోగార్హం. ప్రధాన వాక్యార్థమైన 'X కి తెలీదు' ఉపవాక్యంలోనే గతార్థమవుతుంది.

కిమర్థకశబ్దంలేని వాక్యాలకు 'ఏమో' అనే శబ్దంచేర్చి పై అర్థాల్లో కొన్నిటికి ప్రయోగించవచ్చు. విషయార్థంలో 'ఏమో' ప్రయుక్తంకాదు. వాళ్ళు వచ్చారేమో కనుక్కో. వాళ్ళు వచ్చారేమో నాకు తెలీదు.

అటం : వ్యాపారబోధకనామాల స్థానాల్లోకూడా కొన్ని వాక్యాలను ప్రయోగించవచ్చు. అప్పుడు ఉపవాక్యానికి 'అట' చేరుస్తాం. ఇట్లాంటిరూపాలను భావార్థకాలని ప్రాచీనులన్నారు. ఉదా : ఆమెకు మిషను కుట్టటంవచ్చు. అతనికి సణగటం అలవాటు.

సామాన్యవాక్యాల్లో ప్రాధాన్య వివక్షకోసం పదవ్యత్యయం జరిగినప్పుడు కూడా క్రియ భావార్థకరూపంగా మారుతుంది. మీరు ఎందుకువచ్చారు ?⟶మీరు రావటం ఎందుకు ?

కాని ఇట్లాంటి పదవ్యత్యయం నామాన్ని సూచించే ప్రశ్నార్థక శబ్దాలున్నప్పుడు సాధ్యం కాదు.

మీరు ఏం తిన్నారు ? ⟶మీరుతినటం ఏమిటి ?

మీ ఇంటికి ఎవరు వచ్చారు⟶మీ ఇంటికి రావటం ఎవరు ?

ఆటం చేర్చగా ఏర్పడిన వాటిని భావార్థక నామాలంటారు. నామాలకులాగే వీటికి విభక్తి ప్రత్యయాలు చేరతై.

ప్రధాన ఉపవాక్యాల్లో కర్త ఒకటేఅయినప్పుడు ప్రయోజనార్థంలో అట మంత నామానికి 'కి' విభక్తి చేరుతుంది. ఉదా : మాఆవిడ నాతో పోట్లాడటానికి సిద్ధమవుతున్నది.

ప్రధానక్రియ మనోవ్యాపారబోధకమైనప్పుడు 'కి' విభక్తి చేరిన అటమంత నామం హేత్వర్థకమవుతుంది. ఉదా:ఆమె తెలుగులో మాట్లాడటానికి సిగ్గుపడుతుంది.

'తో' చేరిన అటమంతనామం పూర్వవ్యాపార సమాప్తిని సూచిస్తుంది. స్థితి బోధకక్రియల నుంచి నిష్పన్నం చేసిన అటమంత నామాలకి యోగం లేదు. ఉదా: అతను అన్నం తినటంతోనే నిద్రపోతాడు. *ఆమె అందంగా ఉండటంతోనే ఇతను ప్రేమించాడు.

**13.19. క్రియాజన్య విశేషణాలతో నామ్నీకరణాలు:** కొన్ని వాక్యాలు నామపదాలకు విశేషణాలుగా ప్రవర్తిస్తాయి. ఇట్లాంటి విశేషణవాక్యాల్లో క్రియ విశేషణరూపంగా మారుతుంది. ప్రధాన వాక్యంలో నామపదంతో సరూపమైన ఉప వాక్యంలో నామం విభక్తితోసహా లోపిస్తుంది. అందువల్ల వీటిని లుప్తవిభక్తిక నామ్నీకరణాలనికూడా అనవచ్చు. ఇట్లా విభక్తి లోపించినా అర్థగ్రహణంతో బాధ లేదు. అయితే అన్ని విభక్త్యర్థాల్లోనూ ఈ నామ్నీకరణాలు సాధ్యంకావు. ఉదా :

ఆ అబ్బాయి ఊరికివెళ్ళాడు⟶ ఊరికివెళ్ళిన అబ్బాయి; అతను ఇడ్లెన్ను తిన్నాడు ⟶అతనుతిన్న ఇడ్లెన్లు; వాడు కొడవలితో గడ్డికోశాడు⟶వాడు గడ్డి కోసిన కొడవలి; వాడు సీతతో వచ్చాడు⟶ * వాడువచ్చిన సీత; అతను ఆ అమ్మాయికి ఉత్తరంఇచ్చాడు⟶ అతడు ఉత్తరంఇచ్చిన అమ్మాయి. వాడు పల్లెకు వచ్చాడు⟶*వాడువచ్చినపల్లె. అతను మార్కెట్‌నుంచి పూలుతెచ్చాడు ⟶అతను పూలుతెచ్చిన మార్కెట్; అతను ఊరినుంచివచ్చాడు⟶* అతను వచ్చిన ఊరు; ఆమె పెట్టెలో డబ్బు దాచింది⟶ * ఆమెడబ్బుదాచిన పెట్టె; వాడు వాళ్ళలో మంచివాడు⟶ * వాడు మంచివాడయిన వాళ్ళు;

వీటిలో పువ్వుగుర్తులుంచిన నామబంధాలు అనిష్పన్నాలు. విభక్తి ప్రత్యయం ఒకటే అయినా అర్థభేదాలవల్ల కొన్ని నామబంధాలు నిష్పన్నంకావు.

క్రియాజన్య విశేషణాలమీద కొన్ని అవ్యయాలుకూడాచేరి క్రియావిశేషణాలుగా గాని, వాక్యవిశేషణాలుగా గాని ప్రవర్తిస్తాయి. అతను వచ్చినప్పుడు, అతను చెప్పినందుకు, నువ్వు అన్నట్టు, అమెవచ్చేముందు-ఇట్లాంటివి ఇంకా సాధ్యాలు.

క్రియాజన్యవిశేషణాల తరవాత (ఏ విశేషణాల తరవాతయినా) తదర్థబోధకమైన సర్వనామాలు మాత్రమే రాగలవు. తదర్థకశబ్దరూపమున్నా తదర్థబోధకత ఉండదు. ఉదా : వచ్చినవాడు; * వచ్చినవీడు; మంచివాడు; * మంచి వీడు.

**18.20.** **సంయుక్తవాక్యాలు :** కొన్ని ప్రధాన వాక్యాలు కలిపి సమ ప్రతిపత్తి ఉన్న దళాలతో ఏకవాక్యం చెయ్యలేము. భిన్నవాక్యాలు భిన్నవాక్యాలుగనే ఉంటాయి. లేకపోతే క్త్వార్థక వాక్యాల్లాగా ఉపవాక్యాలన్నా అవుతున్నాయి. కాని, అయితేవంటి కొన్ని అవ్యయాలు రెండు వాక్యాలను అనుసంధించగలవు. అయితే అట్లా అనుసంధించబడ్డ వాక్యాలు ఏకవాక్యమయినట్టు ఆధారాలు తక్కువ. ఉదా : అతను చదువుతాడు కాని తలకెక్కదు; అతను వచ్చాడుగాని ప్రయోజనం లేదు; అతను డబ్బుగలవాడు, అయితే గర్వంలేదు.

రెండు ప్రశ్నార్థకవాక్యాలు ఒకచోటచేరిస్తే వాక్యాల అర్థాలనుబట్టి సముచ్చయార్థకలుగాని: వికల్పకార్థకాలుగాని కావచ్చు. ఉదా : అతను ఎక్కడ ఉంటున్నాడు ? ఏంజేస్తున్నాడు ? అతనుఇవ్వాళ మద్రాసు వెళ్తున్నాడా ? గుంటూరు వెళ్తున్నాడా ?

ఇంగ్లీషు హిందీభాషల్లోలాగా రెండు వాక్యాల్నికలిపే సముచ్చయార్థక, వికల్పార్థక శబ్దాలు తెలుగులోలేవు.

నామబంధాలను మాత్రంచివరి స్వరాలకు దీర్ఘీకరించటంద్వారా ఏకనామబంధం చెయ్యవచ్చు. ఉదా : లలితా సుబ్బారావూ కలిసివచ్చారు.

నామబంధాలకు 'ఓ' శబ్దంచేరిస్తే వికల్పార్థంలో కలపవచ్చు. రామారావో సుబ్బారావో వస్తారు.

[వాక్యనిర్మాణానికి సంబంధించి ఇందులో చెప్పని కొన్ని విశేషాలు తెలుగు వాక్యం అనే పుస్తకంలో దొరుకుతాయి]

# తెలుగు మాండలికాలు : ప్రమాణభాష

— భద్రిరాజు కృష్ణమూర్తి

## 14.0. ఉపోద్ఘాతం :

జీవద్భాషకు మార్పు సహజం. మార్పువల్ల భాషలో బహురూపత, వైవిధ్యం (variation) ఏర్పడతాయి. ఈ బహురూపత మూడువిధాలు : (1) *చారిత్రకం.* ఒక కాలంలో ఉన్న రూపాలకు కాలాంతరములో ఏర్పడ్డ తుల్యరూపాలకు మధ్య తేడాలుంటాయి. ఇప్పటి తెలుగులో 'వాడు' (ప్రథమైకవచనం) రూపానికి పూర్వాపూర్వ రూపాలు 'వాఁడు<వాణ్డు<వాన్టు<*అవన్టు' అని. ఇదేవిధంగా భాషాభాగాల్లో ఎలాటి మార్పులు రావటంవల్ల ఆనిధుకభాష పూర్వభాషనుంచి ఏలా పరిణమించిందో ఇంతకు ముందరి అధ్యాయాల్లో చూశారు. (2) *ప్రాంతీయం,* ఒకేకాలంలో ఒక ప్రాంతంలో ఉన్న వాడుకకు మరొక ప్రాంతంలో ఉన్న వాడుకకు మధ్య సమాన శబ్దాల్లోనూ, వ్యాకరణ భాగాల్లోనూ, తేడాలుండవచ్చు; **ఉదా.** వచ్చినాడు, వచ్చిండు, వచ్చాడు. ఇలాంటివి ప్రాంతీయభేదాలు. (3) *సాంఘికం.* సాంఘికవ్యవస్థలో ఉన్న మార్పులు - ఆర్థిక సాంస్కృతిక పరమైనవి-వ్యవహర్తమాటల్లో ప్రతిఫలిస్తాయి. ఈతేడాలను వర్గమాండలికాలంటారు, చాప/సాప. వెండి/యెండి, లేదు/నేదు, అట్టా/గట్టా మొదలైన మాటలమబట్టి వ్యవహర్త సాంఘికస్థాయిని గుర్తించవచ్చు. తరగతులనుబట్టి వచ్చే భేదాలు ఒకేకాలంలోనే ఒకే ప్రాంతంలోనే ఉండవచ్చు.

పైన పేర్కొన్నవిగాక ఇతర హేతువులవల్ల వ్యవహార వైవిధ్యంలో అవాంతర భేదాలు ఎన్నో రకాలు ఉండవచ్చు; ఉదా. లిఖితభాష/వాడుకభాష; ఉపన్యాసభాష/సంభాషణభాష ; గృహవ్యవహారం/బహిరంగ వ్యవహారం ; అలాగే వృద్ధులభాష, స్త్రీలభాష, విద్యార్థులభాష, పసిపిల్లలభాష - కొన్నిచోట్ల గుర్తించ దగిన తీరుగా ఉంటాయి. తెలంగాణా విద్యార్థుల్లో 'చెమ్చా', 'లైటుగొట్టటం'[1] బాగా వ్యాప్తిలో ఉన్నాయి. ఇవి ఇతరులు వాడరు. కొన్నిరకాల తిట్లు ఆడవాళ్ళ

నోటనే వినవస్తాయి. ఇంతేగాక వృత్తులనుబట్టి, వక్తృశ్రోతల పరిచయాన్ని, సందర్భాన్నిబట్టి వాడుకలో మార్పులు కనిపిస్తాయి. తెలుగు మాతృభాషగా మాట్లాడే వాళ్ళతీరు ద్వితీయభాషగా మాట్లాడేవాళ్ళతీరు వేరుగా ఉంటాయి. ఈ అధ్యాయంలో ముఖ్యంగా ప్రాంతీయవర్గమాండలికాల స్వరూపమూ, వాటికీ ప్రమాణభాషకూ ఉన్న సంబంధమూ ప్రధానంగా చర్చిస్తాను.

## 14.1 వేటితెలుగులో భాషామండలాలు :

వృత్తిపదపరిశోధన ఆధారంగా తెలుగునాడును నాలుగు భాషామండలాలుగా విభజించవచ్చునని తేలింది. అవి : (1) పూర్వమండలం (కళింగదేశం : శ్రీకాకుళ, విశాఖపట్టణం జిల్లాలు), (2) దక్షిణమండలం (రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం జిల్లాలు), 3. ఉత్తరమండలం (తెలంగాణా; మహబూబ్‌నగర్, ఖమ్మం, జిల్లాల్లో కోస్తా రాయలసీమలను ఆనుకొన్న తాలూకాలు ఆయాభాషా మండలాల్లో కలుస్తాయి), (4) మధ్యమండలం (ఉభయ గోదావరులు. గుంటూరు, కృష్ణాజిల్లాలు) ఈ కింది వృత్తిపదాల్లో ఆయా మండలాలకే పరిమితమైన విలక్షణ శబ్దాలు 'ఇటాలిక్సు'లో సూచించబడ్డాయి.

| | 1. పూర్వ మండలం (కళింగ) | 2. దక్షిణ మండలం (రాయలసీమ) | 3. ఉత్తర మండలం (తెలంగాణా) | 4. మధ్య మండలం (ఇతర కోస్తాలు) |
|---|---|---|---|---|
| 1. | ... | తువ్వనేల | *దుబ్బనేల* | తువ్వనేల |
| 2. | మోట | *కపిల* | మోట | మోట |
| 3. | *మదుం* | తూము | తూము | తూము |
| 4. | *పూణ/పూదు* | *కాడిమాను/ కాడిమాకు* | *కాండీ/కాణి/కాని* | కాడి |
| 5. | నాగలి | *నాగేలి/మడక* | నాగలి | నాగలి |
| 6. | మేడి | *మేడితోక* | *పాళె* | మేడి |
| 7. | *నక్కు* | *కర్రు/కాడు* | కర్రు | కర్రు |
| 8. | ఏదికర్ర | *వొగ/నగ* | ఏటికర్ర/ఏటికోల | ఏడికర్ర |
| 9. | పేడ | పేడ | *పెండ* | పేడ |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 10 తుంత | గాను/గాలు | గారె/గర్ర/ వయ్యో | చక్రం |
| 11. అనపకాయ | సొరకాయ | అనిగెంకాయ | సొరకాయ |
| 12. గోంగూర | గోగాకు | పుండికూర/ పుంటికూర | గోంగూర |
| 13. చోడి (బహు. చోళ్లు) | రాగి | తమిదె | తమిదె |
| 14. గంటె/గంటి | సద్ద | సజ్జ/సద్ద | సజ్జ |
| 15. ... | వసె | పయ్యో | పయ్యో |
| 16. గాబు | కలుపు | కలుపు | కలుపు |
| 17. ఎలుగు/కంచె | కంచె/కర | ఎలుగు/కంచె | కంచె |
| 18. ఆసు | అనుమాను | అసు/తానె | అసు |
| 19. చిలప | చిలప/ఇచ్చె/చిట్టె | చిట్టె | చిలప/ఇచ్చె |
| 20. నాడె | నాడె/కొమ్మ | నాడె | నాడె |
| 21. పైన | పన్నె | పన్నె/పనె | పన్నె/పన్ని/పని |
| 22. పోము | పోగు | పోగు | పోగు |
| 23. రాట్నం | రాటం/రాట్లం | రాట్నం | రాట్నం/రాటం |
| 24. పునాది | బునాది/గునాది గునాదరం | బునాది/పునాది | పునాది |
| 25. చూరు | చూరు/చంచు | చూరు | చూరు |
| 26. గొలుసు | చిలుకు | గొండ్లెం | గొండ్లెం |
| 27. గునపం | గడ్డపార/గడారు | గడ్డపార | గడ్డపలుగు/గడ్డపార |

పై ఉదాహరణలలో 2–17 వ్యవసాయపదాలు. 18–23 చేనేత పదాలు. 24–27 ఇండ్ల కట్టుబడి పదాలు. ఇవి వరుసగా వృత్తిపదకోశ సంపుటాలు, 1, 2, 4 నుంచి ఉద్ధరించ బడ్డాయి. రెండు మండలాలు కలిసేచోట రెండురకాల వాడుకలూ వినిపిస్తాయి. ఒకే మండలంలో రెండుమూడు మాటలున్నపుడు అవి ఉప మాండలిక భేదాలను సూచిస్తాయి.

**14.2.** పై మాండలికవిభజన దేశీయవృత్తుల్లో జానపదులు వాడే భాష ఆధారంగా చేసింది. ఈరకమైన వృత్తుల్లో ఉన్నవాళ్ళు ఒకచోటినుంచి మరొక చోటికి వలసపోవటం అంతగా జరగదు. అందువల్ల ఈ ప్రాంతీయభేదాలు ఇటీవల ఏర్పడ్డవిగాక తెలుగుభాషా చరిత్రలో కొన్ని శతాబ్దులుగా పాతుకుపోయిన వని చెప్పవచ్చు. ప్రజలమధ్య వ్యవహారప్రాబల్యం సన్నగిల్లటమే ప్రాంతీయ భేదాలు ఏర్పడటానికి ప్రధానకారణం. రాజకీయపు సరిహద్దులు, నైసర్గిక సీమలు (పర్వత పంక్తులు, నదులు) కూడా భాషామండలాలకు పొలిమేర లవుతాయి. వాటి కిరువైపులా ఉన్న వ్యవహర్తలు కలవటం, ఒకరితో ఒకరు మాట్లాడుకోటం తరచుగా జరగదు. ఒక ప్రాంతం వాడుకలో ఏర్పడ్డ నూతనశబ్దాలు, ధ్వని పరిణామాలు, ఆ ప్రాంతంలోనే వ్యాపించి సరిహద్దు తగిలినచోట ఆగిపోతాయి. ప్రతి ప్రాంతానికి సాంస్కృతికవాణిజ్య కేంద్రంగా ఏదో ఒక పట్టణం ఉంటే పరిసరప్రజల రాకపోకలకు అది కూడలి అవుతుంది. ఈ విధంగా భిన్నభాషా మాండలికాలకు భిన్నకేంద్రాలు ఏర్పడవచ్చు.

శ్రీకాకుళం విశాఖపట్టణం జిల్లాలు 16వ శతాబ్దం దాకా కళింగరాజ్య భాగంగా ఉండి మిగిలిన దేశంతో రాజకీయ సంబంధం లేకపోవటంవల్ల అక్కడి పలుకుబళ్ళు మిగిలిన తెలుగుదేశంకంటె విలక్షణంగా ఉంటాయి. (చూ. § 4.60): మదుం, పూజు(=కాడి), నక్క, ఉండ(=చెక్రం), ఆనప, చోడి, గంటె, గాబు (=కలుపు), పైన(=పన్నె, దువ్వెన), పోము (=పోగు), గొలుసు (=గొళ్లెం), గునపం, మొ. శబ్దాలు ఈ ప్రాంతానికే విలక్షణంగా ఉన్నాయి. తెలుగు చోడుల కాలంలోను, విజయనగర పరిపాలనలోను ఏకప్రాంతంగా ఉన్న రాయలసీమ, నెల్లూరు జిల్లాల వాడుకలో ఎక్కువ సమరూపత కన్పిస్తుంది. ఈ ప్రాంతానికే విలక్షణంగా ఉన్న మాటలు : కపిల (=మోట), నాగేలి/నాగెల, నొగ, గాను/గాలు, రాగి, పసె(=ఒకరంగు), కర, కొమ్ము, రాటం, గునాది (=పునాది), బిలుకు, గడారు, మొ.వి. ఈ ప్రాంతంలోనూ కొన్ని పలుకుబళ్లలో పెన్నానదికి ఉత్తరాన ఒకతీరు, దక్షిణాన ఒకతీరు కనిపిస్తుంది. నాగేలి, కర్రు ఉత్తరాన, మడక, కారు దక్షిణాన. తెలంగాణా రాయలసీమలకు కృష్ణా తుంగ భద్రలు నైసర్గిక సీమలైనట్లు గుర్తించవచ్చు. అదే భాషావ్యవహారంలోనూ ప్రతి బింబిస్తున్నది. కాకతీయులు, మహమ్మదీయులు పరిపాలించిన తెలంగాణా ప్రాంతా నికి రాజకీయమైన సరిహద్దే వ్యవహార సీమగా కూడా మనకు కనిపిస్తుంది. ఉర్దూ

ప్రభావంవల్ల హైదరాబాదు చుట్టుపట్ల కొన్ని తెలుగు మాటల బదులు ఉర్దూమాటలు వచ్చినా, తెలంగాణా ప్రాంతానికే విలక్షణమైన దేశ్యశబ్దాలుకూడా ఎన్నోఉన్నాయి. ఉదా. దుబ్బనేల (= సన్నటి ఇసకనేల), కాజి/కాని (= కాడి), గారె/గిర్ర (= చక్రం; హైదరాబాదు చుట్టుపట్ల పయ్యె < ఉర్దూ పహియా), పుండికూర/పుంటికూర (= గోంగూర), పెంద (= పేడ), చిట్టె (= చిలప), మొ. వి. రాజకీయమైన అస్తిమితత్వమే కృష్ణాగోదావరీ మధ్యదేశం ప్రత్యేక భాషామండలంగా కనిపించక పోవటానికి కారణం. అంటే ప్రతిమాట వాడుకలోనూ మిగిలిన మూడు మండలాల్లో ఏదో ఒకదానితో కలవటమే మధ్యాంధ్ర మండల వ్యవహారంలోని విలక్షణత. దీన్ని మిశ్ర వ్యవహారమండలం అనవచ్చు. (చూ. *భద్రిరాజు కృష్ణమూర్తి* 1962 : 50-3).

## 14.3. మాండలిక పరిశీలన విధానం :

మాండలిక పరిశీలన ప్రయోజనదృష్టినిబట్టి ఎన్నోరకాల జరగవచ్చు. (1) ఏదో ఒక 'అర్థం' తీసుకొని ఆ అర్థంలో ప్రతిచోట ఏమాట వాడుతారో ఊరూరూ తిరిగి సేకరించవచ్చు. లేదా 20, 30 మైళ్ళ దూరంలో ఉన్న ఊళ్లు తిరిగి సేకరించవచ్చు. 'పొలం దున్నే పనిముట్టు' కు 'నాగలి, నాగేలు, నాగెల నాంగలి, మడక' అనే మాటలు వాడుకలో ఉన్నట్లు తెలిసింది. ఈ మాటల్లో 'మడక' తప్ప మిగిలినవన్నీ అన్యోన్యం రూపాంతరాలు, అంటే చారిత్రకంగా ఒకే ప్రాచీన శబ్దం నుంచి ఏర్పడ్డవి. (< * నాఞ్గేల్); 'మడక' వీటికి పర్యాయ పదం. (2) దేశం అంతటా ఒకే శబ్దం ఉచ్చారణ భేదాలతో మాత్రమే ఉంటుందని తెలిసిన కొన్ని మాటలు తీసుకొని ఆయా భేదాలను ధ్వని విధేయ లిపిలో సేకరించటం. 'రేగడి, రేగడ, రేగిడి, రేవడి, రేవడ, రాగడి, రాగిడి' మొ. వి. రే/రా, గ/వ, డ/డి భేదాలు ఏ ప్రాంతల్లో వస్తున్నాయి అనే సూక్ష్మపరిశీలన దీనివల్ల సాధ్యమవుతున్నది. అలాగే లేక/లేదు శబ్దాల్లో మొదటిపదంలో 'లే, వివృతం (అకారం పరమైనప్పుడు) రెండో పదంలో సంవృతం (అకారేతరాచ్చు పరమైనప్పుడు). దేశం అంతటా ఈరకంగానే ఉందోలేదో ప్రాంతీయ దృష్టితో పరిశీలించి తెలుసుకోవచ్చు. (3) కొన్ని వ్యాకరణ ప్రక్రియలకు చెందిన విశేషాలను కూడా దేశమంతటా నూటికి పైగా కేంద్రాలను తీసుకొని సేకరించవచ్చు. ఉదా. భూతార్థక ప్రత్యయం-చెప్పాడు, చెప్పినాడు, చెప్పిండు (ఏ/ఇనా/ఇన్): లేదా సంధికార్యాలు మొ.వి.

**14.4.** ప్రాంతీయ భేదాలనే గుర్తించదలుచుకొన్నప్పుడు ఏదో ఒకవర్గానికి చెందిన వారి వాడుకనుంచె ఉద్దేశించిన వివరాలు సేకరించాలి. ఇలా సేకరించిన వాడుకకు ఒక్కొక్కదానికి ఒక సంకేతం పెట్టుకొని తెలుగుదేశపటంలో గుర్తించవచ్చు. వాడుక మారినచోట సంకేతం మారుతుంది. ఈ విధంగా తయారుచేసిన పటాలను మాండలికపటాలంటారు. పదాలు ప్రధానంగా గీచిన పటాలను 'word atlas' అని, ధ్వనులు ప్రధానంగా గీచిన పటాలను 'phonetic atlas' అని, వ్యాకరణ విశేషాలు లక్ష్యంగా గీచిన పటాలను 'grammatical atlas' అని వ్యవహరించవచ్చు. ఇంతవరకు తెలుగులో జరిగిన మాండలిక పరిశీలన ప్రధానంగా పదాలవాడుక లక్ష్యంగా చేసింది. అది కూడా భాషామండలాలు నిరూపించే ఉద్దేశంతో చేసిందికాదు; వృత్తుల్లో ఉన్న పదాలను కోశస్థంచేసే దృష్టితో చేసింది. అందువల్ల పై మాండలిక నిర్ణయం స్థూలదృష్టితో చేసింది మాత్రమే.

పైవిధంగా గీచిన పటాలను వాడుక మారినచోట గుర్తులు మారుతుంటాయి. అలాంటి గుర్తులన్నీ ఒకవైపుకు వచ్చేటట్లు వేరుచేసి పటంలో గీచినగీతను వ్యవహార భేదరేఖ (isogloss) అంటారు. ఇలాంటి వ్యవహారభేదకరేఖలు చాలా పటాల్లో కలిసి నియత ప్రాంతాలను వేరుచేస్తున్నప్పుడు వాటన్నింటినీ బొత్తిగా మరోపటంలో గీయవచ్చు. బొత్తిగా ఏర్పడ్డ వ్యవహారభేదకరేఖలే భాషామండలాలకు సరిహద్దులుగా గుర్తించాలి. అంటే ఒక మండలం వాడుక ఇక్కడ సన్నగిల్లి అక్కణ్నించి మరోమండలం వాడుక మొదలవుతుంది. పై నిరూపించిన విధానం ఈ అధ్యాయం చివర ఇచ్చిన మచ్చు పటాల్లో చూడవచ్చు (పేజీలు 414-426).

**14.5.** మాండలికపద పటాలనుబట్టి ప్రతిపదానికి ఉన్న పుట్టు పూర్వోత్తరాలను గ్రహించవచ్చు. ప్రజలు ఏయే దిక్కుగా వలసపోయింది ఊహించవచ్చు. భాషకు సాంఘికరాజకీయచరిత్రకు సమన్వయం పదపటాల్లో గోచరిస్తుంది. ఒక కొత్త మాట ఏదో ఒక కేంద్రంలో పుట్టి చుట్టుపక్కల ఎంతదూరం వ్యాపించిందీ తెలుసుకోవచ్చు. ఉదా. పయ్యే (=చక్రం), తుకం (=నారు) అనేమాటలు అన్యదేశ్యాలు; ఉర్దూ తుఖమ్, తుఖ్మ = 'గింజ, జీవాణువు'; పహియా = 'చక్రం' నుంచి వాడుకలో కలిసినవి. వీటి వ్యాప్తి హైదరాబాద్ కేంద్రంగా చుట్టుపక్కల జిల్లాలకు పరిమితంగా ఉంది. (చూ. మాం. వృ. కో. 1.77, 91). ఇతర

తెలంగాణా ప్రాంతంలో 'గిర'/'గిర్ర'/'గిల్ల'(=చక్రం), 'నారు' పదాలే వ్యాప్తిలో ఉన్నాయి. ఈవిధంగా కొత్తమాటలకు పాదైన కేంద్రాన్ని 'focal area'అంటారు. అవి ప్రసరించిన మేర అంతకు ముందున్న పాతమాటల వాడుక మాసిపోతుంది. ఈ రకమైన మార్పులకు లోబడకుండా ఉన్న దూరస్థలాలో కొన్ని పాతమాటల వాడుక నిలిచిపోవచ్చు. అలాంటి ప్రాంతాన్ని పురాతనవ్యవహారప్రాంతం (relic area) గా గుర్తించవచ్చు: ఆదిలాబాదుజిల్లా ఉత్తరపు కొసన 'నారు' కు 'నేరు' అనేవాడుక ఉంది. (చూ. మాం. వృ. కో. 1.91). పూర్వద్రావిడంలో ఉన్న *ఞాఱు, శబ్దం నుంచి తెలుగులో నిష్పన్నమైనది నారు/నేరు అని ఉండవచ్చు. 'నా'/'నే'ల మార్పు 'ఞా' మాతృకకు సూచన[2]. ఈప్రాంతంలోనే 'కాడికి' పూర్వరూపం 'కాఞ్డి' కూడా వాడుకలో ఉంది. దీని అర్వాచీనరూపాలు కాణి/కాని మిగిలిన తెలంగాణాలో ఉన్నాయి. రెండు భాషామండలాల మధ్య వ్యవహార భేదక రేఖలు కిందుమీదుగా పోతున్నట్లు ఈ అధ్యాయం చివరి పటాల్లో చూడవచ్చు. ఇలాంటి ప్రాంతాన్ని మాండలికసంధిప్రాంతం (transition zone) గా గుర్తించవచ్చు. అంటే రెండు మండలాలలో విలక్షణంగా ఉన్నమాటలు అన్నీ ఈ ప్రాంత ప్రజల వాడుకలో వినిపిస్తాయి. ఖమ్మంజిల్లా తూర్పు ప్రాంతంలో గాలు/రోజా/గిర్ర(చక్రం) మూడు ప్రాంతాలకు విలక్షణమైన వాడుకలున్నాయి (చూ. పటం 4). పది ఇరవై ఏళ్ళ కొకసారి మళ్ళీ పదసేకరణచేసి పటాలుగీచి అంతకుముందు గీచినవాటితో పోల్చి చూస్తే వ్యవహార భేదకరేఖలు మరోతీరున గుర్తించవలసి రావచ్చు. దీన్ని బట్టి ఒక పదంవ్యాప్తి ఏదిక్కున పోతున్నదో దానికిగల సాంఘిక రాజకీయ హేతువులేమిటో గ్రహించవచ్చు. పైన చూపిన 'పయ్యె', 'తుకం' మాటలబదులు మళ్ళీ దేశ్యశబ్దాలు వ్యాపించి వీటివ్యాప్తి సంకుచితం కావచ్చు. ఉర్దూ పాఠ్యభాషగాగాక తెలుగుకు ప్రాధాన్యం పెరుగుతున్నదికాబట్టి ఈ ఊహ సమంజసమని తోస్తుంది. కాని పునఃపరిశీలనవల్లగాని ఈ సంగతి తేలదు.

**14.6**. మాండలిక పదపరిశోధనవల్ల ప్రాచీనకవి రచిత గ్రంథాల్లో వచ్చిన మాటలకు స్పష్టార్థ నిరూపణ సాధ్యమౌతుంది. నిశితంగా పరిశీలించినప్పుడు కొందరు కవులు, వాడిన మాండలిక పదాలు ఆధారంగా వారేప్రాంతం వారో ఊహించవచ్చు. 'గునపం', 'గడ్డపాఱ' శబ్దాలు పింగళిసూరన కళాపూర్ణోదయంలో కనిపిస్తున్నాయి. (కళా. 6 : 8 ; 6 : 23). ఈమాటలకు అంతకుపూర్వ

కావ్యాల్లో అట్టే ప్రయోగాలులేవు. ('గునపం' మాత్రం ఎఱ్ఱాప్రగ్గడ హరి. ఉ. 2 : 16. లో ఉన్నట్టు సూ. ఆం. నిం.) . పింగళి సూరన పూర్వులు గోదావరీ పరిసరాలనుంచి పలనాడు, పాకనాడు ప్రాంతాలకు వ్యాపించినట్లు ఈ కింది పద్యం వల్ల తెలుస్తున్నది (ప్రభావతీ ప్రద్యుమ్నము , అవతారిక)

ఉ రంగుగ గౌతమీ పరిసరంబులఁ గృష్ణకెలంకులన్ ఘనుల్
పింగళి రామయాదులు లలింబలనాటను బాకనాటనుం
బింగళి గాదయాదు లిటఁ బెంపువహించిన యస్మదాదులా
పింగళి గోకమంత్రి యిలు పేరనే చాలఁ బ్రసిద్ధు లెల్లచోన్"

ఈ పద్యంలో 'ఇట' ఏ ప్రాంతమో తెలియటంలేదు (చూ. చాగంటి శేషయ్య 10. 99 [1953]). 'గునపం' అనేమాట వాడుక ఇప్పుడు పూర్వాంధ్రం,తూర్పు గోదావరి ప్రాంతానికి మాత్రం పరిమితం. ఇతర ప్రాంతాల్లో గడ్డపార, గడ్డపలుగు శబ్దాలున్నట్టు మాండలిక పరిశోధనలో తెలిసింది. (చూ. మాం. వృ. కో. 4.72; పటం 16). గోదావరి మాండలికపదం వాడుకనుబట్టి పింగళి సూరన మధ్యాంధ్ర మండలం నుంచి తరవాత దక్షిణాంధ్రానికి వచ్చినట్టు ఊహించవచ్చు. ఇతని తండ్రి కృష్ణాజిల్లాలోనికి 'నిడిమానూరు' అగ్రహారికుడు. కళాపూర్ణోదయ కృతికర్త నంద్యాల కృష్ణమరాజు దక్షిణ మండలంలో ఉన్నవాడు.

అదేవిధంగా 'మోట' అనే అర్థంలో 'కపిల' శబ్దం నెల్లూరు ప్రాంతంలో వాడుకలో ఉన్నది. తిక్కన భారతంలోనే దీనికి ఏకైకప్రయోగం కనిపిస్తున్నది (భారతం, ఆశ్రమ. 1.72).

"కుడువ నిచ్చు తఱియఁ గురువర క్రక్కించు
నవసరంబు నెఱిఁగి యరిన్నపాలు
నీవు ధీరవృత్తి నిడుఁద్రాట బోనిమ్ము
క్రమ్మ కపిల యనఁగ గ్రమ్మి చెఱుపు."

(మాండలిక పదపరిశీలన ప్రయోజనాల వివరాలకు చూ. మాం. వృ. కో. 1.30-46.)

**14.7.** మాండలిక పటాలు ఆధారంగా ఆయా పదాల స్థూలచరిత్రను ఈ కిందివిధంగా గుర్తించవచ్చు.

(1) నాలుగు మండలాల్లోనూ ఒకే శబ్దం (రూప భేదాలున్నా) కనిపిస్తే (*a*) అది దేశ్యమయితే భాషామండలాలు ఏర్పడక పూర్వమే దేశమంతటా వ్యాపించి వాడుకలో నిలిచి ఉన్నట్టు గమనించాలి. (*b*) అది అన్యదేశ్యమైతే ఇటీవల మాత్రమే ఆధునిక వ్యవహారంలో వ్యాపించినదై ఉండాలి. ఉదా(*a*) పేడ/పెండ; (*b*) పొరంబోకు/పోరంబోకు. కొన్ని ప్రాకృత భవాలు దేశ్యశబ్దాలులాగా ప్రాచీన కాలంలోనే వ్యాప్తిలోకి వచ్చి నిలిచిపోయినవి ఉన్నాయి. ఉదా. గానుగ (< ప్రా. ఘాణ < సం. ఘాతన.)

(2) మూడు మండలాల్లో దేశ్యశబ్దమూ,నాలుగోమండలంలో అన్యదేశ్యమూ ఉంటే, అన్యదేశ్యం ఇటీవల వ్యాప్తిలోకి వచ్చి అంతకు ముందున్న దేశ్యశబ్దాన్ని తోసివేసినట్టు గ్రహించాలి. తెలంగాణా, రాయలసీమల్లో కొంతమేర వాడుకలో ఉన్న 'తానె' అతను ముందున్న 'ఆసు' పదాన్ని తోసివేసి ఇటీవల వచ్చి ఉంటుంది. 'తానె' ఉర్దూ నుంచి వచ్చిన అన్యదేశ్యం (చూ. మాం. వృ. కో. 2.48; పటం 3).

తెలంగాణా ఉత్తర ప్రాంతంలో 'పాలె' మిగిలిన దేశమంతటా ఉన్న 'మేడి, మేడితోక'కు పర్యాయం. ఇది మరాఠీ ప్రాంతంనుంచి వ్యాపించిన మాట. (మరా. ఫాళ్ 'కర్రు' - అర్థ విపరిణామం).

(3) ఒక మండలంలో మాత్రమే దేశ్యపదం మిగిలి, ఇతర మండలాల్లో అన్యదేశ్యం ఉంటే, దేశ్యపదం ప్రాచీనం, అన్యదేశ్యం అర్వాచీనమని, సాంఘిక చరిత్రలో వచ్చిన మార్పులవల్ల అన్యదేశ్యం వ్యాపించి ఉంటుందని గుర్తించాలి. ఒక్క దక్షిణ మండలంలోనే 'కపిల/కపిలె' అనే మాట నిల్చి ఉంది. మిగిలిన దేశమంతటా 'మోట' (<హిం. మోట్). మోటకు: కపిలకు కట్టుబడి తేడాలుండ వచ్చు. (చూ. మాం. వృ. కో. 1.47-8, 67; పటం. 3).

(4) ఒకమండలంలో వాడే రెండు దేశ్యపదాలకు సరిగా మరోమండలంలో ఒకేమాట వాడుకలో ఉంటే (*a*) రెండు మాటల అర్థమూ ఒకేపదానికి ఆరోపించటంవల్ల రెండోది జారిపోయి ఉండవచ్చు, లేదా (*b*) ఒక పదానికున్న అర్థం విరిచి రెండు పదాలకు దాన్ని ఆరోపించవచ్చు. ఉదా. (*a*) పూర్వమండలం (కళింగ దేశం) లో వరినారుకు 'ఆకు' అని, మిరప, పొగనారుకు 'నారు' అని రెండు మాటలుండగా మిగిలిన ప్రాంతంలో ఈ రెంటికి 'నారు' అనే మాటనే

వాడుతారు. (b) తెలంగాణాలో 'తుకం', 'నారు' రెండూ వాడేచోట మొదటి పదాన్ని 'వరినారు' అర్థంలోను, 'నారు' ఇతరమైన మొలకలకు వాడుతారు. 'తుకం' ఉర్దూనుంచి వచ్చి చేరిన ఇటీవలిమాట (చూ. మాం. వృ. కో 1.91).

(5) ఒకే అర్థంలో రెండు మాటలుండి, ఒకటి ఎప్పుడూ సమాసగతం గాను, మరొకటి వ్యస్త, సమస్త రూపాల్లోనూ వస్తుంటే, కేవల సమాస గతమైన రూపాంతరం ప్రాచీనమని గుర్తించాలి; ఉదా. చెవుడు కట్టెముల్లు, చెవుడు కర్ర చెవుడు దారం, చెవుడు పలుపు. దీని రూపాంతరం 'చేడు' వ్యస్తంగాను, సమాసాల్లోనూ కూడా వస్తుంది. దీని అర్థం 'నేస్తున్న గుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర'.

చెవుడు -, చెముడు-పదాలు కొన్నిచోట్ల రాయలసీమలోను. శ్రీకాకుళం లోను మాత్రం వచ్చాయి. అంటే దేశం అంతటా ఒకప్పుడు 'చెవుడు-' శబ్దమే ఉండి దాని సంక్షిప్తరూపంగా 'చేడు' ఏర్పడి ఉంటుంది. (చూ. మాం. వృ. కో. 2, పుట 45; పటం. 5). 'చెవుడు-, చెముడు-' శబ్దాలున్నవి పురాతన వ్యవహార ప్రాంతాలు (relic areas) గా గుర్తించవచ్చు.

(6) ఇప్పుడు రాకపోకల సంబంధంలేని దూరప్రాంతాల్లో ఒకమాట వాడుక పరిమితంగా లంకల మాదిరిగా కనిపిస్తే, ఆ మాట అతిప్రాచీనమనీ, ఆ తరువాత వాడుకలోకి వచ్చిన అర్వాచీన రూపంవల్ల దీని వ్యాప్తి కాలక్రమాన సంకుచితమై పోతున్నదనీ ఊహించాలి. పైన (5) లో ఇచ్చిన ఉదాహరణ దీనికి సరిపోతుంది. శ్రీకాకుళంజిల్లాలో కొద్దిచోట్ల, రాయలసీమలో కొద్దిచోట్ల మాత్రమే 'పరిటె' అనేశబ్దం ఉంది. మిగిలినదేశ మంతటా 'పంటె' శబ్దం. ఈ రెండిటి పూర్వరూపం 'పరింటె' అయి ఉంటుంది. (ఇటువంటిదే. గంటె, గరిటె < * గరింటె). పరిటె/పంటె 'చేత్తో నూలుచుట్టే పనిముట్టు' (చూ. మాం. వృ. కో. 249 : పటం 9).

## 14.8. వర్గమాండలికాలు :

ఇంతవరకు నిరూపించిన మాండలిక విభాగం స్థిరవృత్తుల నాశ్రయించి బతికే జానపదుల వాడుక ఆధారంగా చేసింది. విద్యాగంధంలేని పామరులభాషకు చదువుకొన్న నడిమితరగతి వారి భాషకు మధ్య తేడాలు ఎన్నో కనిపిస్తాయి. ఇవి ఉచ్చారణలోను, వ్యాకరణంలోను, పదజాలంలోను ఉండవచ్చు. ఉచ్చారణకు

సంబంధించినంతవరకు శిష్టశిష్టేతరులు మధ్యనున్న భేదాలు అన్ని భాషామండలాలకు సామాన్యమైనవని ఎన్నో ఉన్నాయి. ఉచ్చారణనుబట్టి ఒకవ్యక్తి విద్యావంతుడు అవునోకాదో చెప్పవచ్చుగాని ఏకులస్థుడో చెప్పటం కష్టం. స్థూలంగా పైకులాలవాళ్లు చదువుకున్నవారు కావటం, వెనకబడ్డకులాల్లో చదువు తక్కువగా ఉండటంవల్ల వర్గమాండలికాలు కులాశ్రయ ధర్మాలని కొందరు అపోహపడ్డారు. గాని అది సరిఅయిన దృష్టికాదు. తక్కువ కులం వ్యక్తి చదువుకొన్న వాడైతే చదువుకొన్నవారి ఉచ్చారణ పూర్తిగా పట్టుబడుతుంది. శిష్టశిష్టేతరుల ఉచ్చారణలు ఈ కిందివిధంగా ఉంటాయి.

| *శిష్టోచ్చారణలో* | *జానపదోచ్చారణలో* |
|---|---|
| 1 (a) ఒత్తులు నిలుస్తాయి : భాగవతం, ధర్మం | 1. (a) ఒత్తులు పోతాయి : బాగవతం, దర్మం |
| (b) హకారం నిలుస్తుంది : హరిపిల్లు, రోహిణి | (b) హకారం పోతుంది : అరిల్లు, రోయిణి |
| 2. అద్విరుక్త చకారం అంతటా నిలుస్తుంది : చవుడు, చుక్క, పలచన. | 2. చకారం సకారం అవుతుంది: సవుడు, సుక్క, పలసన. |
| 3. పదాది వకారం నిలుస్తుంది : (ఇ, ఈ, ఏ, ఏల ముందు) విల్లు, వీధి, వెండి, వేడి. | 3. వకారం పోతుంది : యిల్లు, యీది, యెండి, యేడి. |
| 4. సంయుక్త హల్లులు నిలుస్తాయి : భక్తి. చేస్తాడు, కలెక్టర్ | 4. (a) హల్లులు సమీకరణం పొందుతాయి : బత్తి, సేత్తాడు. (b) స్వరభక్తి రావచ్చు, కలకటేరు. |
| 5. శ, ష, స, ల భేదం ఉంటుంది : శాస్త్రి, భాష, కాసు. | 5. శ, ష లు సకారంగా మారతాయి: సేత్రి, బాస, కాసు, |
| 6. మూర్ధన్య దంత మూలీయ భేదం నిలుస్తుంది : పళ్లెం : పళ్లెం, దాన్ని : వాణ్ణి | 6. మూర్ధన్యాలు దంతమూలీయా అవుతాయి : ళ > ల, ణ > న పల్లెం : పల్లెం, దాన్ని : వాన్ని. |

| | |
|---|---|
| 7. 'f', 'ప' వేరుగా ఉంటాయి. ఆఫీసు, కాఫీ, తోఫు, | 7. 'f', 'ప' గా మారుతుంది : ఆపీసు, కాపీ, తోపు. |
| 8. పదాది గకారం దేశ్యశబ్దాల్లో నిలుస్తుంది : గట్టు, గడ్డ, గండి, | 8. 'గ', 'గె' గా మారుతుంది. గెట్టు, గెడ్డ, గెండి, |

**14.9. శిష్టవ్యవహారస్వరూపం :**

జానపదులు స్రక్రమంగా విద్యావంతులైనప్పుడు శిష్టోచ్చారణను అనుకరిస్తారు. అసలు శిష్టోచ్చారణలో శిష్టత ఏ ధర్మాలవల్ల ప్రాప్తించిందో తెలుసుకోవచ్చు. పై ఉచ్చారణ భేదాల్లో 1, 4, 5, 7 చాలా వరకు అన్యదేశ్యాలకు చెందినవి. జానపదుల భాషలోకంటె చదువుకొన్నవాళ్ళ భాషలో సంస్కృత శబ్దాల వాడుక ఎక్కువ. పాఠ్యపుస్తకాలవల్ల, వార్తాపత్రికలవల్ల ఇది సాధ్యమవుతుంది. ఇంగ్లీషు మనదేశానికి రాకముందు చదువుకొన్న వాళ్లందే సంస్కృతం చదువుకొన్నవాళ్లే. ఆనాటి నుంచి ఈనాటివరకు సంస్కృత భాషాజ్ఞానం మన సమాజంలో ఒకతరగతి భేదాన్ని సృష్టించింది. అలానే ఇంగ్లీషు తెలిసినవాడు సంస్కృతాంధ్రాలు తెలిసినవాడికన్నా సంస్కారవంతుడుగా పరిగణింపబడుతున్నాడు. దీనికి కారణం ఎక్కువభాషలు తెలిసినవాళ్ళు ఎక్కువ తరగతుల్లో కలిసిపోగలరు. ఎక్కువ మందితో వ్యవహారదక్షత ఏర్పడుతుంది. అల్పవ్యవహారపరిధిగల జానపదులకు అధికవ్యవహారదక్షతగల విద్యావంతులు ఆదర్శమై వాళ్లభాష, కట్టు, నడవడి ఒరవడి అవుతాయి. వాటిని అనుకరించి జానపదులు నాగరకులనిపించుకోవటానికి ప్రయత్నిస్తారు. విద్యావిధానం, నగరజీవితం ఈప్రక్రియకు ఉపకరణా లవుతాయి. ఈనాడు క్రాపు, సూటు, బూటు, పెళ్లిళ్లలో దండలు వేసుకోవటం వగైరా రెండు సంస్కృతుల సమ్మేళనంలో అన్య సంస్కృతి నుంచి దేశీయ సంస్కృతిలో వచ్చిన మార్పులు. సమాజంలో వ్యక్తులకు తెలియకుండానే విలువలు మారుతుంటాయి. ఈ విలువల మార్పులో ప్రయోజనదృష్టి కొంతవరకు కనిపిస్తుంది. కాని, కారణాలు పూర్తిగా పరిశోధిస్తేనేగాని తెలియవు. ప్రపంచంలో అన్ని సమాజాల్లోనూ ఈ ప్రక్రియ కనిపిస్తుంది. నార్మన్ దండయాత్ర తర్వాత ఫ్రెంచి జీవితవిధానం, ఫ్రెంచిభాష బ్రిటిష్ ప్రజలని, ఇంగ్లీషుభాషని ఎంతో ప్రభావితం చేశాయి. అధికవ్యవహార దక్షత (ఎక్కువ మందితో మాట్లాడగల

నేర్పు) ఉన్నవాళ్ళు సంస్కారవంతు లనిపించుకొంటారు. వాళ్లవాడుక మిగిలిన వాళ్లకు ప్రమాణం అవుతుంది. స్థూలంగా భాషలో ప్రామాణ్యం ఏర్పడేతీరు ఇది.

**14.10.** ఉచ్చరణలో లాగానే కొన్ని పదాల రూపనిష్పత్తిలో గూడా నాగరకుల భాషకు జానపదుల భాషకు భేదాలున్నాయి. పోతుంది, తెలియదు (తెలీదు, తెలీదు) – శిష్టుల వాడుకలో ఉంటే పోతది, తెలువదు మొదలైనవి ఇతరుల వాడుకలో ఉన్నాయి. నిజంగా పోతది, తెలవదు రూపాలకు తక్కువ విలువకట్టడానికి, పోతుంది, తెలియదు రూపాలకి ఎక్కువ విలువ కట్టడానికి భాషాగతమైన కారణాలులేవు. కురుస్తుంది : కురవదు, రెండూ శిష్టవ్యవహారంలో ఉన్నాయి. వాటిలాగానే తెలుస్తుంది : తెలవదు కూడా తెలుగు వ్యాకరణసూత్రాల వల్ల సాధ్యాలవుతాయి. కురవదు : తెలవదు రెంటికి ప్రాచీన కావ్యభాషలో కురి యదు, తెలియదు అనే ప్రమాణరూపాలున్నాయి. చారిత్రకంగా జరిగిందేమంటే పిలుచు : పిలవదు గణంలో కురియు : కురవదు శిష్టులభాషలో చేరాయి. కాని తెలియు : తెలియదు చేరలేదు. జానపదుల భాషలో ఇవి గూడా ఆగణంలోనే చేరాయి. కలియు : కలవదు, నెరయు : నెరవదు, ఇలాంటివన్నీ, అన్నితరగతుల వ్యవహారంలోనూ 'పిలుచు' వర్గంలో చేరిపోయినాయి. అయినప్పుడు 'తెలవదు' ఎందుకు ప్రమాణం కాలేదు? ఇతరకారణాలవల్ల 'శిష్టత' సంపాదించిన వాళ్ల భాషలో ఈ మార్పు రాలేదు కాబట్టే 'తెలవదు' శిష్టేతర వ్యవహారానికి ఉపలక్షక మయింది. అంటే దీన్నిబట్టి ఏది శిష్టం, ఏదిఅశిష్టం అనే నిర్ణయం కేవలం భాషకు సంబంధించింది కాదు. ఇతర సామాజిక విషయాలనుబట్టి గూడా ఏర్పడు తుంది. కోస్తా జిల్లాల వాడుకలో 'అలా, ఇలా, ఏలా' (గోదావరి) అనే రూపాలు 'అట్లా, ఇట్లా, ఎట్లా' (గుంటూరు) అనే వాటికంటే నాజూకు అవుతున్నాయి. 'వస్తున్నది' (గుంటూరు) కంటె 'వస్తోంది' (గోదావరి) కి ఇప్పుడు విస్తృతి పెరి గింది. చేసుకొనేందుకు (గుంటూరు) అని ఇదివరకు రాసేవాళ్ళు 'చేసికొందికి' అని రాస్తున్నారు. 'ఏంది' కంటె 'ఏమిటి' నాజూకైన మాట. ఒకేకాలంలో శిష్టవ్యవ హారంలో ఉన్న రూపాలమధ్య పోటీ ఏర్పడి కొన్ని వాడుకలో నిలుస్తాయి. కొన్ని జారిపోతాయి. ఆ నిల్చినవి ప్రామాణికాలు.

**14.11.** తెలుగు నాడంతటా వ్యాప్తిలోఉన్న పైభేదాలేగాక ప్రాంతీ యంగా కూడా శిష్టశిష్టేతర వ్యవహార భేదాలు కనిపిస్తాయి. కళింగ మండలంలో

పామరులు లకారం నకారంగా ఉచ్చరిస్తారు: లేదు⟶ నేదు. లాగుతూ⟶ నాగుతూ; అన్యాదుల క్రియా రూపాల్లో ట ⟶ త : అంటాడు⟶ అంతాడు.

తెలంగాణా ప్రాంతంలో అ ఆలు పరమైన వకారం కూడా జానపదుల వాడుకలో లోపిస్తుంది, వచ్చిండు ⟶ అచ్చిండు, వాన ⟶ అన. త్రికంలోని అ/ఆ, ఇ/ఈ ల స్థానంలో గ/గా, గి/గీ లు వస్తాయి. అంత ⟶ గంత, ఇప్పుడు ⟶ గిప్పుడు; అట్టా ⟶ గట్టా. వర్ణవ్యత్యయంవల్ల ర్ల ⟶ ల్ర గా మారుతుంది. బర్లు⟶బల్రు, ఊర్ల = (ఊర్లో)⟶ఊల్ర. సెప్పరి (<చెప్పరు), వస్తాండు (<వస్తా ఉన్నాడు), మొ.వి గూడా తెలంగాణా పామర భాషలో వినవస్తాయి.

**14.12.** ఆధునిక వచన రచనల్లోను, సినిమా, రేడియో, మొ. జనతా వ్యవహార సాధనాలలోను వాడే తెలుగులో చాలా వరకు ఏకరూపత కనిపిస్తుంది. ఇది స్థూలంగా మధ్యాంధ్రంలోని విద్యావంతుల వ్యవహారం ఆధారంగా ఏర్పడ్డది. గడిచిన 50, 40 ఏండ్లుగా రచనలన్నీ ఈ మాండలికంలోనే జరగటంవల్ల, రచయిత లెక్కువగా ఈ ప్రాంతంవారు కావటంవల్ల ఇదే రాష్ట్రమంతటికీ ఆధునిక ప్రమాణభాషగా చలామణీ అవుతున్నది. ఇతరమాండలిక ప్రయోగాలు ఈ ప్రమాణ భాషతో కలిసి ఇది విస్తృతం అవుతున్నది. ప్రమాణభాష సాధారణంగా రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక ప్రాధాన్యంగల రాజధానీ నగరాల్లో నివసించే విద్యావంతుల భాషపై ఆధారపడి ఉంటుంది. తెలుగుదేశ చరిత్రలో విజయనగరం, కొండవీడు, నెల్లూరు, అద్దంకి, రాజమహేంద్రవరం, వరంగల్లు, చంద్రగిరి వేరువేరు కాలాల్లో రాజధానులుగా ఉండేవి. ఫ్రాంసులో పారిస్, ఇంగ్లండులో లండన్, ఇటలీలో రోమ్ లాగా ఏదో ఒక పట్టణమే కొన్ని శతాబ్దులపాటు సాంస్కృతిక కేంద్రంగా ఉన్నట్టు తెలుగు దేశానికి ఏ ఒక్కటి రాజధానిగాలేదు. ఆధునిక బెంగాలీ భాషకు కలకత్తా కేంద్రం; ఆధునిక మరాఠీకి పూనా, కన్నడానికి మైసూరు, హిందీకి ఢిల్లీ (ఇటీవల అలహాబాదు) ; తెలుగునాడులో అలాటి పట్టణం ఏ ఒక్కటీలేదు. అందువల్ల భాగ్యవంతమైన కృష్ణాగోదావరీ పరిసర మధ్యమండలం విద్యకు, ధనానికి, సంస్కృతికి, విద్యావంతులకు ఆటపట్టయింది. ఈ కారణంగా నేటి ప్రమాణభాష అక్కడి రచయితల రాతలనుంచి వ్యాపించింది.

**14.13.** ఆధునిక ప్రమాణ భాషలోనూ ప్రాంతీయభేదాలు లేకపోలేదు..

అంటే చదువుకొన్నవాళ్ళు తమ ప్రాంతపు పలుకుబళ్ళను రచనలోకి ఎక్కిస్తారు. కాని అట్టి భేదాలు గ్రామీణవ్యవహారంతో పోల్చుకుంటే చాలా తక్కువ; అర్థావగాహనకు అడ్డు వచ్చేవికావు. ఉదా. అలా, అట్లా,అట్టా- మూడూ శిష్ట రచనల్లో కనిపిస్తాయి; భూతార్థక ప్రత్యయంలో శిష్టులరచనలో తేడాలున్నాయి. ఉదా. వచ్చాడు/వచ్చినాడు. తెలంగాణాలో శిష్టులు 'వచ్చిండు' అని అంటున్నా, సభల్లోను, రచనల్లోను 'వచ్చినాడు' అనే అంటారు. విధ్యర్థంలో 'చెప్పుడి, చేయుడి' స్థానంలో ఇప్పుడు 'చెప్పండి, చేయండి' అనే వాడుకలు వస్తున్నాయి. వ్యతిరేకవిధిలో చెప్పకు/చెప్పవాకు/చెప్పబాకు/, చెప్పొకు/చెప్పొక, మొ.వి. నిర్ధారణలో చెప్పాలి/చెప్పాలె/చెప్పాల, మొ.వి. చదువుకున్నవారే వేరువేరు ప్రాంతాల్లో అంటారు. అయినా 'చెప్పకు. చెప్పాలి' వంటి రూపాలకు ఎక్కువగా లిఖితవాఙ్మయంలో చెలామణీ ఏర్పడుతున్నది. కోస్తా జిల్లాల్లో శిష్టులు 'వస్తూ, పోతూ' అనీ, శిష్టేతరులు 'వస్తా, పోతా', అనీ అంటారు. రాయలసీమలో శిష్టులు కూడా 'వస్తా, పోతా'రూపాలు వాడుతారు. అన్నమాచార్యుల కీర్తనల భాషలోనూ శత్రర్థ ప్రత్యయంగా- 'తా' కనిపిస్తుంది. అయినా అప్పుడు రాయలసీమ రచయితలు 'తూ' రూపాలనే రాతల్లో వాడుతున్నారు. పైవిధంగా శిష్టుల వాడుకలో ఉన్న బహురూపత క్రమంగా తగ్గి లిఖితప్రమాణ భాషలో ఏకరూపత ఏర్పడుతుంది. ఈ ప్రక్రియ పూర్తి కావటానికి కొన్ని దశాబ్దులు పట్టవచ్చు.

## 14.14. శిష్టభాష, ప్రమాణభాష :

(a) ఒకకాలంలో శిష్టభాషాలక్షణమనిపించుకొన్నది మరోకాలంలో అశిష్టం కావచ్చు. నన్నయభాషలోను, సమకాలీన శాసనాల్లోనూ గసడదవాదేశ సంధి కనిపిస్తుంది. ఉదా. 'వాడుసెప్పె' మొ. ఇప్పుడు 'వాడు సెప్పాడు' అని 'చ', 'స' గా మారిస్తే పామరజన వ్యవహార మనిపిస్తుంది. 'తెచ్చుతాడు' మొ.వి. కేతన గ్రామ్యాలన్నాడు. అదే (>తెస్తాడు) ఇప్పుడు శిష్టరూపమైంది.

(b) ఒక ప్రాంతంలో శిష్టవ్యవహారం మరొక ప్రాంతంలో శిష్టేతరం కావచ్చు. రాయలసీమలో శిష్టవ్యవహారంలో 'వస్తా', 'పోతా',మొ. శత్రర్థకరూపాలు కోస్తా జిల్లాల వాడుకలో 'తక్కువరకం' వాడుకగా పరిగణించ బడతాయి. 'వచ్చినాడు' మొ. రాయలసీమ శిష్టరూపాలు కళింగ మండలంలో గ్రామీణ వ్యవహారంలో వినిపిస్తాయి. పై కారణాలవల్ల శిష్టం – అశిష్టం అనే భేదాన్ని ప్రాంతీ

యంగా, వర్గరూపంగా కొద్ది పరిధిలో కూడా తమతమ దృష్టితో నిరూపించవచ్చు. కాని ప్రమాణ - అప్రమాణభేదం రాష్ట్రం మొత్తానికీ, భాష అంతటికీ సంబంధించన విలువ. ప్రతి ప్రాంతంలోని శిష్టవ్యవహారమంతా ప్రమాణంకాదు, కాని ప్రమాణ భాషలో చేరినది ఏమండలంలోనూ అశిష్ట వ్యవహారమై ఉండదు. అనుకరణ ఏముఖంగా జరుగుతున్నదన్నదాన్ని బట్టి ఏది ప్రమాణమో ఏది అప్రమాణమో గుర్తిస్తాము; ఉదా. శిష్టుల్లోనే 'అట్లా' ప్రయోగం తగ్గి 'అలా' ప్రయోగం పెరుగుతున్నది.

(c) ఒక లక్షణమే కొన్ని మాటల్లో శిష్టవ్యవహార ధర్మం కావచ్చు, మరి కొన్ని మాటల్లో శిష్టేతర ధర్మం కావచ్చు. వకారలోపం 'వెళ్ళాడు', 'వేశాడు' శబ్దాల్లో శిష్టుల్లోనూ ఉంది ఉదా : వాడెళ్ళాడు, వాడు నన్ను 'పడేశాడు'. కాని ఇతర శబ్దాల్లో వస్తే శిష్టేతర భాషాలక్షణ మౌతుంది ; ఉదా. వాడు యేడికి (= వేడికి) తట్టుకోలేడు అలాగే. 'కురవదు', 'కలవదు' శిష్టం, శిష్టేతరం కూడా. కాని తెలవదు శిష్టేతరుల వాడుకే.

(d) సాంఘిక చరిత్ర కారణంగా తద్భవాలకు, దేశ్యశబ్దాలకు పరపతి తగ్గి, అన్యదేశ్యాలకు, తత్సమాలకు విలువ (శిష్టవ్యవహార యోగ్యత) పెరుగుతుంది 'కూడు, బువ్వ, కత, పొద్దు, మంగలి. చాకలి, గొల్ల', మొ. మాటలకు ఈనాడు విలువ తక్కువ. వాటి బదులు 'అన్నం, కథ, రోజు, క్షురక, రజక, యాదవ' శబ్దాలకు విలువ ఎక్కువయింది.

(e) మాండలిక భేదాలున్న పదాలు మాత్రం సందర్భాన్నిబట్టి ప్రమాణ భాషలో చేరవచ్చు. సొరకాయ–ఆనపకాయ, భోగట్టా-సంగతి, చెక్క–వక్క, ఇలాటివన్నీ ప్రమాణభాషలో చేరాయి. ఉత్తమరచనల ద్వారా మాండలికపదాలు ప్రమాణభాషలో చేరతాయి.

(f) శిష్టశిష్టేతరభేదం - రెండువర్గాల వాడుకలో ఉన్న ఉచ్చారణలు, వ్యాకరణ కార్యాలు, పదాలను ఆశ్రయించి ఉంటుంది. ఒకరి వాడుకలోనే ఉన్న వాటిలో ఈభేదం కనిపించదు. వృత్తిపదాలు చాలా వరకు దేశ్యాలు; ఆయా వృత్తుల నాశ్రయించి బతికే జానపదుల వ్యవహారంలోనే ఉంటాయి. ఆ పదాల్లో శిష్టశిష్టేతరభేదం నిరూపించటం సాధ్యంకాదు. నాగలి, గొర్రు, గుంటక, మేడి గొడ్డలి - ఇలాటి మాటల్లో ఈతేడా కనిపించదు. అలానే కలెక్టరాఫీసు గుమాస్తా

తన పనిలో వాడే మాటలకు శిష్టేతరుల్లో తుల్య శబ్దాలుండవు కాబట్టి అవి గూడా వర్గమాండలికాలకు లక్ష్యంకావు. బహురూపత (రూపాంతరత్వం) ఉన్నచోటనే ప్రమాణీకరణానికి ఆవశ్యకత ఏర్పడుతుంది.

**14.15.** ప్రమాణభాషకు ఆవశ్యకత ఏమిటి అన్న ప్రశ్న మిగిలిపోయింది. ప్రమాణభాషకు ఈ కిందిలక్షణాలు, ప్రయోజనాలు ఉంటాయి. (1) ప్రమాణభాష ఎక్కువమంది ప్రజలకు సమ్మతంగా ఉంటుంది. (2) విద్యాబోధన ప్రమాణభాషలో జరుగుతుంది. ప్రమాణభాష నేర్చుకోటమే విద్యావంతుడనిపించుకోటానికి లక్షణ మవుతుంది. (3) మాండలికాలకంటే ప్రమాణభాషా ప్రయోగానికి వ్యాప్తి ఎక్కువ. ఉపన్యాసాలు, వచనలరచనలు, వార్తాపత్రికలు, సినిమాలు; రేడియో, టెలివిజన్, మొదలైన విజ్ఞాన వ్యాపకసాధనలన్నీ ప్రమాణభాషనే వాడుతాయి, (4) ప్రమాణభాష వ్యవహర్తల సాంస్కృతిక వైజ్ఞానిక ఐకమత్యానికి ఒక సంకేత మవుతుంది. ప్రాంతీయవర్గ మాండలికాలు వాళ్ళ వేర్పాటుకు గుర్తులవు తాయి. (5) ప్రమాణభాష ప్రాథమికంగా ఏదో ఒక ప్రాంతంలో చదువుకొన్న వాళ్ళ వాడుక ఆధారంగా ఏర్పడి మాండలిక ప్రయోగాలను కలుపుకొంటూ వ్యాప్త మవుతుంది. (6) కొన్ని భాషల్లో ప్రాచీన కావ్యభాషే ప్రమాణభాషగా వ్యవహర్తలు గుర్తిస్తారు. అప్పుడు మాండలికాల ప్రభావం ప్రమాణభాషపై అట్టేపడదు. ఉదా. అరబిక్, తమిళం. కాని వ్యవహారానికి దూరమయ్యేకొద్దీ ఈ పరిస్థితి క్రమంగా మారి ఏదో ఒక మండలంలో ఉన్న శిష్టభాషే ప్రాచీన ప్రమాణభాషను తోసివేసి వస్తుంది. ఈ మార్పుకు కొన్ని శతాబ్దులు పట్టవచ్చు.

జానపదులు విద్యావంతులైన కొద్దీ నాగరకులు ప్రమాణభాషను మరింత క్లిష్టంచేసి తమ వ్యక్తిత్వాన్ని, దూరాన్ని నిలువుకోటానికి ప్రయత్నిస్తారు. ఈనాడు అధిక సంస్కృతీ కృతమైన హిందీ 'ఖడీబోలీ' కంటె దూరమై పోవటం దీనికి లక్ష్యం. వర్ధమాన భాషల్లో ప్రమాణభాషను మాండలిక సమ్మేళనంతో సులభ గ్రాహ్యం చెయ్యటం అవసరం.

## జ్ఞా పి క లు

1. ముఖస్తుతితో ఆశ్రయించే వ్యక్తి 'చెమ్చా' : ఆకర్షణీయంగా ముస్తాబు కావటం 'తైటుగొట్టటం'.
2. పూర్వద్రావిడ ఞాన్ శబ్దంనుంచి తెలుగులో నేను/నా-రూపలేర్పడాయి.




పటం 1 (మాం. వ్యా. కో. I, పటం 8, పుట 67)



పటం 4 (మాం. వ్యా. భా. I, పటం 18 పుట 77)



పటం 5 (మాం వ్యా. సా. I, పటం 27, పుట 91)



పటం 6 (మాం. వ్యా. క్షే. I, పటం 29, పుట 98)



పటం 8 (మాం. వ్యా. కో. I, పటం 81, పుట 95)



పటం 8 (మాం. వ్యా. కో. I, పటం 81, పుట 95)




పటం 9 (మాం. వ్యా. కో. II, పటం 5, పుట 45)



పటం 10 (మాం. వృ. వా. II, పటం 9, పుట 49)




పటం 13 (మాం. వ్యా. కో. IV. పటం 16, పుట 72)

# అర్థపరిణామం

—జి. ఎన్. రెడ్డి

**15.0.** భాషాపరిణామం ప్రధానంగా రెండు రకాలు. అవి : (1) భాషకు బాహిరరూపమైన శబ్దస్వరూపంలోను నిర్మాణంలోనూ జరిగేమార్పు. (2) పదజాలానికి సంబంధించినట్టి అర్థంలో కలిగే మార్పు. దీన్నే అర్థపరిణామము (**semantic change**) అంటాం. పదస్వరూపం మారినప్పుడు అర్థంకాని, అర్థవిపరిణామం జరిగినప్పుడు పదస్వరూపంగాని మార్పు చెందాలనే నియమంలేదు. కాబట్టి భాషాపరిణామంలో శబ్దార్థపరిణామాలు భిన్నాలేకాని పరస్పరాశ్రయాలు కావు. భాషలో గోచరించే పరిణామం, ముఖ్యంగా అర్థపరిణామం, ఎందుకు జరిగిందో నిరూపించలేము కాని అది ఎలా జరిగిందో మాత్రం వివరించవచ్చు. తెలుగులో జరిగిన అర్థపరిణామ స్వరూపాన్ని తెలుసుకోవడానకి ముందు అర్థతత్త్వాన్ని గురించి కొంత గ్రహించడం అవసరం.

**15.1.** భాషానిర్మాణంలో శబ్దార్థసంబంధం యాదృచ్ఛికం. నిర్హేతుకం. ఒకే వస్తువును తెలపడానికి వివిధభాషా సమాజాల్లో భిన్నాలైన శాబ్దికసంకేతాలు (పదాలు) ఉండటం, ఒకే భాషలోనే ఒక వస్తువును లేదా భావాన్ని తెలపడానికి రెండుమూడుపదా లుండటం, శబ్దార్థపరిణామం పరస్పరాశ్రయాలు కాకపోవడం మొదలైన లక్షణాలనుబట్టి శబ్దార్థాల మధ్య అవినాభావసంబంధం లేదని శబ్దార్థ సంబంధం కేవలం యాదృచ్ఛికమేనని స్పష్టమౌతుంది. ధ్వన్యనుకరణం లేదా శబ్దానుకృతి (**onomatopoetic**) తో ఏర్పడ్డ పదాలు (కాకి, కోకిల, మేక, ఇత్యాది) కొన్ని శబ్దార్థ సంబంధం ఉన్న పదాలుగా తోచవచ్చు. కాని ఇటువంటి పదాలు ఏ భాషలోనైనా వేళ్ళమీద లెక్కింపదగినంత మాత్రంగానే ఉంటాయి.

అర్థవేది (**semanticist**) ఒక భాషలోని పదాల అర్థాన్ని రెండు విధాల పరిశీలించవచ్చు. (1) వివరణాత్మక పద్ధతి; (2) చారిత్రక పద్ధతి. ఒకకాలానికి

లేదా దశకు మాత్రమే భాషను పరిమితం చేసికొని దాని పూర్వాపరావస్థలతో సంబంధం లేకుండా పదాల అర్థస్వరూపాన్ని లక్షణాలను వర్గీకరించి వివరించి చెప్పినప్పుడది వివరణాత్మకఅర్థవిజ్ఞానం (synchronic or descriptive semantics) అవుతుంది. ఒకభాషలోని పదాలలో వివిధ కాలాల్లో లేదా వివిధ దశల్లో జరిగిన అర్థపరిణామాన్ని కాలక్రమ పద్ధతిలో చారిత్రకదృష్టితో పరిశీలించి వివరించినప్పుడది చారిత్రకఅర్థవిజ్ఞానం(diachronic or historical semantics) అవుతుంది.

**15.2.** ఈనాటి తెలుగుభాషా పదజాలాన్ని వివరణాత్మక పద్ధతిలో వాటి శబ్దార్థ స్వరూప లక్షణాదులను కిందివిధంగా వర్గీకరించి పరిశీలించవచ్చు :

(1) **ధ్వన్యనుకరణపదాలు** (onomatopoetic words) : కాకి, మేక, గురక, డప్పు, (వాద్యవిశేషం) ఇత్యాది నామవాచకాలు కొన్ని; ఢామ్మని, టపీమని, బుడుంగుమని, ఇత్యాది క్రియావిశేషణాలు కొన్ని : గణగణ, గుడగుడ, కుతకుత, కిచకిచ, పరపర, ఇత్యాది ఆమ్రేడితక్రియావిశేషణరూపాలు కొన్ని నేటి తెలుగులో ఉన్నాయి. కాని శబ్దానుకృతులైన ఇట్టి పదాలసంఖ్య అతి స్వల్పం

(2) **నిష్పన్నరూపాలు** (derived forms) : ఒక భాషలో పదజాలం అనంతంగా లేదా అత్యధికంగా ఉన్నట్లు తోచినా ఆ పదాలను విశ్లేషించి పరిశీలించి నప్పుడు మౌలికమైన పదాల (primary words) సంఖ్యపరిమితమని తెలుస్తుంది. పదప్రత్యయాది సంయోజనం వల్ల ఒక మౌలికపదం నుండి వివిధార్థాలను, అర్థాంతరాలను తెలియజేసే పదాలు, పదబంధాలు అనేకం భాషల్లో ఏర్పడడం సహజం. తెలుగులో క్రియాధాతువులకు కృత్ప్రత్యయాలుచేరి అర్థాంతరాన్ని తెలిపే కృదంత రూపాలు (primary derivatives) ఎన్నో ఉన్నాయి ;

ఉదా. ఎండు + అ ▶ ఎండ, అమ్ము + అకం ▶ అమ్మకం, ఒడ్డు + అన ▶ ఒడ్డన; తిను + అడం/అటం ▶ తినడం/తినటం; కోరు + ఇక ▶ కోరిక; పెట్టు + బడి ▶ పెట్టుబడి.

(3) నామధాతువులకు తద్ధిత ప్రత్యయాలు చేర్చినందువల్ల అర్థాంతరాన్ని తెలిపే తద్ధితరూపాలు (secondary derivatives) ;

ఉదా. నేర్పు + అరి ▶ నేర్పరి, టక్కులు + ఆడి ▶ టక్కులాడి, గంప +

ఎదు>గంపెదు, ఆట + కత్తె>ఆటకత్తె, దొంగ + తనం > దొంగతనం, కుట్ర + దారు>కుట్రదారు.

(4) **సమాసాలు** (compounds) : అర్థవంతమైన పదాలు రెండుమూడు చేరి ఏకపదంగా వ్యవహరింపబడేవి సమాసాలు. మౌలికపదాల కూర్పుతో ఏర్పడే పదబంధాలవల్ల వివిధార్థబోధనసమర్థమైన పదజాలం భాషలో ఏర్పడుతుంది. సమాస నిర్మాణ విధానం వివిధభాషల్లో వివిధరకాలుగా ఉండవచ్చు. సమసాలను ముఖ్యంగా మూడురకాలుగా వర్గీకరించవచ్చు. (a)ద్వంద్వ సమాసాలు (coordinate constructions), ఉదా. కూరగాయలు, అక్కాచెల్లెళ్ళు, భార్యాబిడ్డలు, పడుగుంబేక (లు) (నేతలో పొడుగు, అడ్డం), మొదలైనవి. d) కర్మాధారయ సమాసాలు (endo-centric constructions), ఉదా. అగ్గిపెట్టె, ఇనుపగొట్టం గళ్ళచీర, దిష్టిబొమ్మ, ఇస్త్రీపెట్టె, నవురుచాలు (పొలాన్ని మూడోసారి దున్నడం), తలకాల్వ (పెద్దకాలవ), ఎర్రబక్క తెగులు (పైర్లకు వచ్చే ఒకరకం తెగులు), ఆసుకోలకర్ర మొదలైనవి. నిర్మాణసాదృశ్యం ఉన్నప్పటికీ నిగూఢమైన అర్థ భేదాలను బట్టి తెలుగు కర్మధారయ సమాసాలను ఎన్నో అవాంతర భేదాలుగా వర్గీకరించవచ్చును. (c) బహువ్రీహిసమాసాలు ( exo-centric constructions) : సమాసగత పదాల మౌలికార్థానికి పూర్తిగా భిన్నమైన అర్థాన్ని తెలిపే పదబంధాలు ఇవి. ఉదాహరణకు : కాకిముక్కులు, రెడ్డిసాని కాటికెలు (వడ్లల్లో రకాలు), గొల్లకావిడి (ఆరుద్రానక్షత్రం), పిల్లలకోడి (కృత్తికానక్షత్రం), కోడి జుట్టు (అలంకారానికి పెంచే ఒకరకం మొక్క), పైడికంటి (గుడ్లగూబ జాతికి చెందిన చిన్నపక్షి) మొదలైనవి.

(5) **శబ్దపల్లవాలు** (idioms, compound verbs) : ధాత్వాదులకు ధాతువులు చేరి విలక్షణమైన అర్థాన్ని బోధించేరూపాలు శబ్దపల్లవాలు, ఉదా. తలపోయు, తలపెట్టు, నిలబడు, దయచేయు, కూర్చొను, మేల్కొను, ఎక్కుపెట్టు వాపోవు, మొదలైనవి.

(6) **ఆమ్రేడితరూపాలు :** (reduplication) : ఒకపదాన్ని అవ్యవహితంగా పునరుక్తి చేసినందువల్ల విశిష్టార్థం సిద్ధించవచ్చు, ఉదా. 'ప్రతి' అనే అర్థంలో ఊరూరు, ఇల్లిల్లు, వాడవాడ, వీధివీధి, మొదలైనవి; వచ్చి వచ్చి, చూసి చూసి, ఎగిరెగిరి, ఇటువంటి క్త్వార్థకామ్రేడిత రూపాలు; ముక్కలు ముక్కలు, పొడిపొడి, మొదలైనపునరుక్తి రూపాలు విశిష్టార్థంతో ప్రయోగింపబడుతున్నాయి.

(7) **లక్ష్యార్థప్రయోగాలు** (metaphorical usage) : తెలుగుపదాలనేకం వాచ్యార్థంలోనేగాక లక్ష్యార్థంలోను కార్యకారణ, ఉపమానోపమేయ, అంగాంగి, ఆధారాధేయాది సంబంధాన్ని బట్టి రూఢిలో ఉన్నాయి. తీపిమాట, వాడిచూపు, ముష్టివాడు, రాతిగుండె, మొదలైన బంధాల్లోని పూర్వపదం, రంపం పళ్ళు, మంచంకాలు మొదలైన పదాల్లోని రెండోపదం దీనికి ఉదాహరణాలు. అర్థ భేదాన్ని బట్టి లక్ష్యార్థప్రయోగాల్ని మరి కొన్నిరకాలుగా వర్గీకరించవచ్చు.

(8) **జాతీయాలు** (idioms) : పదాలకున్న సహజార్థాన్ని మరుగు పరచి విలక్షణమైన అర్థంలో ప్రయోగించబడే పదాలు లేదా పదబంధాలు జాతీయాలు, ఉదా. శిలాక్షరాలు, అందెవేసినచేయి, టోపీవేయు, కొండెక్కు, నిండుకొను, కనుమూయు, శ్రీకారంచుట్టు, నాందిపలుకు, కుంభకోణం, మొదలైనవి.

(9) **అనేకార్థపదాలు** (polynyms) : ఏ భాషలోనైనాసరే కేవల ఏకార్థ పదాలు మృగ్యమే అని చెప్పాలి. ఒకపదానికి మౌలికమైన అర్థంతోపాటు లక్ష్యార్థంవల్ల లేదా అర్థవ్యాప్తివల్ల అనేకపదాలు ఏర్పడడం జరుగుతుంది. చారిత్ర కంగా తగిన ఆధారాలున్నప్పుడు ఒకదానికి కలిగే అనేకార్థలను గుర్తించవచ్చు. వివరణాత్మక దృష్టితో పరిశీలించినప్పు ప్రతిమాటకు బహుళార్థకత్వం సామాన్య లక్షణంగానే తోస్తుంది. 'మాట' అనేపదానికి బ్రౌణ్య తెలుగునిఘంటువు (1852)లో గ్రంథస్థమైన అర్థాలు, ప్రయోగాలు చూడండి.

మాట n. s. A word, promise: opinion, slander, rumour, నీమాట చెప్పలేదు. He did not speake of you, he did not mention you. ఇది వేరేమాట This is another affair, another thing. వానిమాట కాదు. This is not about him, I am not talking about him, nor him. గడియకు ఒకమాట చెప్పినాడు. He changed his mind every hour. మంచి మాట (interj) Very well ! మంచిమాట లాడితే విన్నారు. On speaking them fair they consented, దానిమాటయేల ? Why do you speak of her ? why make mention of it ? దాన్ని గురించి రెండో మాటలేదు. There is no alternative. వారివద్దమాటలుపడ్డాడు he was reproached ro reprimanded by them. In some phrases the word మాట need not be translated ; as ఆమె తిరుగా వస్తున్నదనేమాట తెలిసి

knowing that she would return. నేను దాన్ని కొన్నమాట రూఢి It is very true I bought it. ఆమాట యెరగను. I know nothing of that. యిందుచేత మాటవచ్చును. By this you will get Into disgrace. అట్లాచేస్తే మాటరాదా ? If you do so you will get into disgrace. అతను మాటతప్పలేదు, He has not failed of his promise. నేనుపోయిన మాట వానికి యెట్లతెలిసినది ? How did he know that I was gone ? పొయ్యేమాటావుండేమాటా ? Does he propose to go or stay ?వాడు వుండే మాట యింకా తెలియలేదు. I do not as yet know that he will remain. మాటకు మాట Word for word., literally. నామాట అడుగు దాటకు Transgress not my command. తనమీద మాటరాకుండా యిట్లా చేసెను He did this to avoid blame మాట వినుట To obey; యెంత మాట What nonsense ! అతడు చెప్పిన మాటఅక్కడనే ఉన్నారు, What he said was, 'They are there' వానిమాట వానివొళ్ళో వేసినాను. I acted as he desired. నీకుమాట నాకు మూట A command is easy to give but hard to perform. వెయ్యి మాటలేల ? in a word; నాకు తురకమాటలు రావు I do not know the Hindustani language. ఆ పెండ్లి మాట యీ గ్రంథములో లేదు. There is no mention of the marriage in this book. నామాటవేరు, నీమాటవేరు. I say one thing, you say another; my opinion is different from yours. వాడికీ నాకూ మాటలులేవు. He and I do not speak. వాడితోనీకేమి మాటలు? why do you speak with him ? వీనిమాట తెలిసిపోయినది, యింకోవానిమాట ఏమో తెలియలేదు. I know about this man, I do not know about the other. యీమాట వింటే ఆయన ఏమనును? If he hears of this what will he say ? కడపటి మాటయేమి ? What was the upshot of the business? యిప్పట్లో వాని మాట సాగదు. He has now no influence. కడకు వానిమాట ముందరికి వచ్చినది. At last his words proved true. వాడు వస్తాడా రాడా ? Is he coming or not ? యింకాయేమాట తెలియలేదు. I do not know the result. మాటలకు పట్టుకొంటే విడువడు. If he begins talking he will never stop అదెక్కడిమాట. What is the good of talking about it ? మాటలుగా వ్రాసివుండే పుస్తకము A book written in prose. మాటలు

మంచివే కాని మనసు మంచిది కాదు. He talks well but has a bad heart. యింకా మాటలురాని బిడ్డ A child that cannot yet speak. వానికిఆవూరిలో మాటవాసికద్దు. He has influence throughout the town. ఆయనమాటలకు ఎదురులేదు His word is law. మాటలకు మాత్రమే పేదరికములేదు As far as words go he is rich enough, వొకమాట యిచ్చి పదిమాటలు తీసికొన్నాడు His reproaches were returned tenfold. నా నోటి మాటలు పీకి నాకడుపు మంట పోసికొన్నాడు He tormented me with harassing questions.

(10) సారూప్యపదాలు (homonyms) : ఒకపదానికి అర్థవ్యాప్తి వల్ల ఏర్పడ్డ అనేకార్థాలు సాధారణంగా సంబంధాత్మకాలు. వాటి సంబంధాన్ని అర్థ పరిణామ సూత్రాల ద్వారా వివరించవచ్చు. పరస్పరసంబంధం లేనట్టి భిన్నార్థా లుండి రూపభేదంలేని పదాలు సారూప్యపదాలు. ఒకప్పుడు భిన్నార్థాలతో భిన్న రూపాలతో ఉండిన రెండుపదాలకు ధ్వనిపరిణామంవల్ల తర్వాతికాలంలా శాబ్దికంగా అభేదం ఏర్పడవచ్చు. అప్పుడు దానికి మౌలికమైన రెండర్థాలుండవచ్చు. అటు వంటప్పుడు వివరణాత్మకదృష్టికి పరస్పరసంబంధంలేని రెండు భిన్నార్థాలు ఆపదానికి ఉంటాయి. అటువంటి పదాలను సారూప్యపదాలంటాము. నిఘంటువుల్లో ఇట్టిపదాలు సాధారణంగా వేర్వేరు ఆరోపాలు (1. 2... సంఖ్యా సంకేతాలతో) గా ఉంటాయి. ఉదాహరణకు : ఈనాటి తెలుగులో వాడు (=అతడు), వాడు (= శోషిల్లు) అనే రెండు పదాలు ఒకప్పుడు శాబ్దికంగా భిన్నరూపాలు. తెలుగు భాషాపరిణామంలో దీర్ఘం మీది అనునాసికవర్ణానికి లోపం జరిగినందువల్ల వాండు > వాఀడు > వాడు అనే సర్వనామం 'వాడు' అనే క్రియతో అభేదంగా పరిణమించింది. అట్లానే 'నాడు' అనే మాటకు పరస్పర సంబంధంలేని రెండు భిన్నార్థాలున్నాయి; నాండు> నాఀడు> నాడు (= దినం), నాడు (= దేశం)తో అభిన్నంగా పరిణమించింది. కారు, ఊరు, మీరు, మరుగు, మొదలైన అర్థద్వయం ఉన్న సారూప్యపదాలు తెలుగుభాషా పరిణామంలో సాధుశకటరేఫల వర్ణైక్యం వల్ల ఏర్పడి నట్టివే. ఇతర భాషలనుండి కొన్ని పదాల్ని స్వీకరించినందువల్ల తెలుగులో భిన్నవ్యుత్పత్తిగల సారూప్యపదాలు కూడా కొన్ని ఏర్పడ్డాయి.

| ఉదా. | తెలుగు | సంస్కృతం |
|---|---|---|
| | అరి (కప్పం) | అరి (శత్రువు) |
| | కల (స్వప్నం) | కల (కళ) |

| | |
|---|---|
| | *అరబిక్* : |
| కలం (కొలమానం) | కలం (లేఖిని) |
| | *ఇంగ్లీషు* : |
| లేడి (ఆడజింక) | లేడి (lady) |
| కారు (పంటకాలం) | కారు (car) |
| పంపు (పంపడం) | పంపు (pump) |

(11) **పర్యాయపదాలు (synonyms)** : ఒకపదానికి అనేకార్థాలున్నట్లే ఒక అర్థాన్ని అంటే ఒకవస్తువును లేదా భావాన్ని తెలియజేయడానికి అనేక పదా లుండవచ్చు. వీటినే సమానార్థకపదాలు లేదా పర్యాయపదాలంటారు. ఈనాటి తెలుగులో ఉదాహరణకు కొన్ని పర్యాయ పదాలు : వంద, నూరు; నాగలి, మడక; బండి, రాట్నం, గిలక; గేదె, బర్రె, ఎనుము; బాడుగ, అద్దె, కిరాయి; వ్యవసాయం, సేద్యం, కమతం, సాగు; కుండ, తూము, కుంచం, బుడ్డి, మూత; ఆరివిల్లు, సింగాడి, కొర్రు, వరదగూడు; పట్టెడ, పలుపు, జోత, దొత్తె, జొత్తిక; హద్దురాయి, నెంబర్రాయి, సర్వేరాయి, బౌండ్రాయి, నామూర్రాయి,

అన్య దేశ్యపదాలు ఒక భాషలో ప్రవేశించినపుడు దేశ్యంతో, అన్యదేశ్యా లైన పర్యాయపదాల జంటలు కొన్ని ఏర్పడుతాయి. ఉదా : పెండ్లాం. భార్య; గుడి, ఆలయం; ఊరు, గ్రామం; పెండ్లి, వివాహం; కొండ; పర్వతం; చుక్క, నక్షత్రం; వాన, వర్షం, మొదలైనవి. వీటిలో రెండవపదం సంస్కృతం. గది, రూము: బడి; స్కూలు; సిరా, ఇంకి; బాట, రోడ్డు, మొదలైన పర్యాయపదాల్లో రెండవపదం ఇంగ్లీషు పదం. మామూలు వ్యవహారంలోని కొన్ని పదాలకు బాల భాషలో పర్యాయపదాలుండవచ్చు. ఉదా. ఆముదం, ఉగ్గు; పాలు, బాయి; ఉయ్యాల, లాలి; అన్నం, బువ్వ; కుక్క, ఉజ్జు; కోడి, బోబు, మొదలైనవి. ఇంతవరకు పేర్కొన్న వాటిలో పూర్తిగా సమానార్థకాలై పరస్పరం మార్చి ప్రయోగించదగిన పర్యాయపదాలు చాలా తక్కువ. అసలు ఏభాషలోనైనా ఒక దాని స్థానంలో మరొకదాన్ని ప్రయోగించదగినట్టి పర్యాయపదాలుండవు. పర్యాయ పదాలు సమానార్థకాలైనా వాటి ప్రయోగంలోను రూఢిలోను అర్థాంతరచ్ఛాయ లుంటాయి. పర్యాయ పదాలు చాలా వరకు ప్రాంతీయ, వైయక్తిక, సాంఘిక మాండలిక భేదాలకు సంబంధించి ఉంటాయి.

**15.3.** వివరణాత్మకమైన అర్థదృష్టితో నేటి తెలుగుభాషా పదజాలాన్ని స్థూలంగా పరిశీలించి ఇంతవరకు పేర్కొన్న [15.2. (1) నుండి (11) వరకు] విధంగా వర్గీకరించవచ్చు. ఈపద్ధతికి భిన్నమైంది చారిత్రక పద్ధతి. చారిత్రకపరిశీలనవల్ల పదాలకు నానార్థాలు లేదా అర్థవిస్తృతి ఏఏ కాలంలో ఏర్పడ్డదో, సారూప్యపదాలు, పర్యాయపదాలు, ఏఏ కాలల్లో వ్యాప్తికి వచ్చినాయో కొంతవరకు నిరూపించడం సాధ్యం కావచ్చు. కాని ఇట్టి పరిశీలనకు చారిత్రక సూత్రాలమీద నిర్మితమైన సమగ్రాంధ్ర భాషాకోశం అనివార్యం. తెలుగు భాషకు ఇంతవరకు చారిత్రక నిఘంటువులే లేనందువల్ల ఉన్న నిఘంటువులు కూడా సమగ్రాలు కానందువల్ల అర్థవిపరిణామ పరిశీలనలో లోతుకు పోలేము.

**15.4.** ఒకదశలో ఒక పదానికి ఉన్న అర్థంతోపాటు మరొక అర్థం ఆ పదానికి ఏర్పడ్డప్పుడు లేదా ఒక అర్థాన్ని తెలియజేసే పదంతోపాటు మరొక పదం కూడా ఆ అర్థాన్ని తెలిపినపుడు అర్థపరిణామం జరిగిందని చెప్పవచ్చు. ఉదాహరణకు : కొమ్ము అనే పదానికి నిఘంటువులు ఇచ్చిన (1) పశుశృంగము, (2) ఏనుగు దంతము, (3) పందికోర, (4) ఊదెడి వాద్యవిశేషం, అనే అర్థాలు క్రమంగా ఏర్పడ్డవని గ్రహించవచ్చు. ఒకపదానికి అపూర్వమైన ఒక అర్థం ఏర్పడ్డప్పుడు పూర్వార్థం భ్రష్టం కానక్కరలేదు; ఉదా. తడి అనే పదానికి నిఘంటువుల్లో గ్రంథస్థమైన అర్థాలు : (1) తేమ, ఆర్ద్రత, (2) నీరు, (3) తడి బట్ట, ఆర్ద్రవస్త్రము. ఇటీవల తడి అనేమాటకు డబ్బు అనే అర్థం (వాడి చేతిలో తడి లేదు) వాడుకలోకి వచ్చింది. ఈ క్రొత్త అర్థంతోపాటు పూర్వార్థాలు కూడా వాడుకలో ఉన్నాయి. ఒకపదానికి నూతనార్థమొకటి సన్నిహితులైన కొందరిలో మాత్రమే వ్యాప్తి పొందవచ్చు. కాని విస్తృత వ్యాప్తి. దానికి లేకుండ సమాజంలో గుర్తింపదగినట్లు రూఢిపడనప్పుడు ఆ పదంలో అర్థపరిణామం జరిగిందని చెప్పలేము; ఉదా. **విభూతిపండు** కోడిగుడ్డు అనే అర్థంలోను, మందు మత్తుపానీయమనే అర్థంలోను తెలుగుదేశంలో కొందరి వ్యవహారానికి మాత్రమే పరిమితమై ఉన్నాయి.

**15.5.** ఒక మూలభాషనుండి జన్యభాషలు పరిణమించినప్పుడు మూలభాషలో ఉన్న పదానికి జన్యభాషల్లో అర్థాంతరాలు ఏర్పడవచ్చు. సోదర మాండలికాలు క్రమంగా శాబ్దికమైన పరిణామంతోపాటు అర్థపరిణామాన్ని గూడా

కొంతవరకు పొంది భిన్నభాషలుగా పరిణమించడం చారిత్రకసత్యం. ద్రావిడభాషా కుటుంబానికి చెందిన తెలుగుభాషలో అర్థపరిణామాన్ని చారిత్రక దృష్టితో పరిశీలించదలిచినప్పుడు మూలద్రావిడ భాషాపదాలకు తెలుగులో ఎట్టి అర్థవిపరిణామం ఏర్పడిందో పరిశీలించడం అవసరం. కాని తెలుగుకుమాతృకయైన మూలద్రావిడం గ్రంథస్థమైన భాషకాదు. దాన్ని కేవలం తులనాత్మక పద్ధతివల్లనే పునర్నిర్మించుకో వలసి ఉంది. తులనాత్మకపద్ధతి మూలభాష వర్ణసమామ్నాయనిర్ణయానికి, పదాంశస్వరూపనిర్ణయానికి ఉపయోగకారియేకాని మూలభాషయొక్క సమగ్ర స్వరూపాన్ని లేదా మూలభాషా పదాంశాల అర్థాన్ని నిర్ణయించడానకి ఉపయోగ కారికాదు. కాబట్టి, తెలుగుభాషలో పైతృకమైన దేశ్యపదాలలోని అర్థపరిణామాన్ని మూలభాషా పదజాలంతో పోల్చి నిరూపించడం సులభసాధ్యంకాదు.

**15.6.** ఒకభాషలో ఆదానప్రదానాలవల్ల అన్యభాషా పదజాలం ప్రవేశించినప్పుడు అన్యదేశ్యపదాల్లో శాబ్దికమైన మార్పులే కాకుండా అర్థవిభేదం కూడా స్వీకృతభాషలో కలగడం అసహజంకాదు. ఇది కూడా అర్థపరిణామమే. ఇంగ్లీషు భాషలాగా తెలుగు కూడా స్వీకృతభాష (borrowing language). మూల ద్రావిడం నుండి ప్రత్యేకభాషగా పరిణమించిన తొలిదశలోనే తెలుగుభాష సంస్కృతభాషా ప్రభావితమైంది. సంస్కృత ప్రాకృత పదాలనేకాలు నన్నయ పూర్వపు శాసనాలలో ప్రయోగింపబడి ఉన్నాయి. కావ్యభాషలోను, వ్యవహారంలోను ప్రవేశించిన తత్సమ పదాలు చాలా మూలభాషలలోని అర్థపరిణామాన్ని పొంది ఉన్నాయి. అట్టి పదాల్లో కొన్ని కింద ఉదాహరించబడ్డాయి. (ఈ కింది తత్సమ పదాల అర్థ నిర్ణయానికి శబ్దరత్నాకరం, సూర్యరాయాంధ్ర నిఘంటువు ముఖ్యాధారాలు. సంస్కృతరూపం తత్సంబంధమైన మౌలికార్థం కుండలీకరణాల్లో చూపబడినాయి.)

*అపరాధం* (< సం. అపరాధః తప్పు; నేరం) తెలుగులో తప్పు అనే అర్థంతోపాటు జుల్మానా, దండువు, ధనశిక్ష; అనే అర్థం ఈ పదానికి ఏర్పడింది. (వాడు పదిరూపాయల అపరాధం చెల్లించినాడు).

*అభిమానం* (<సం. అభిమానః 1, ధన బల కులాదులవలనఁ గలుగు దర్పం, గర్వం, 2. ఆత్మగౌరవం). ఆత్మగౌరవం అనే అర్థంతోపాటు ఇష్టం, ప్రీతి, గౌరవం అనే అర్థాలు కూడా ఈ పదానికి తెలుగులో ఉన్నాయి. (నేనంటే అతనికి చాలా అభిమానం); అభిమానించు, ప్రీతితోచూచు.

**అతిశయం** (< సం. అతిశయః ఎక్కువైనది, అధికము, ఆధిక్యము) తెలుగు వ్యవహారంలో ఈ పదానికి ఆశ్చర్యం, అద్భుతం, గొప్ప, గర్వం అనే అర్థాలుకూడా కన్పిస్తాయి. (మీరు మాయింటికి రావడం అతిశయము); ఆమెకు అతిశయం ఎక్కువ)

**అదృష్టం** (< సం. అదృష్టమ్ 1. చూడబడినది, 2. ఎఱుగబడినది. 3. కర్మజన్యములై సుఖదుఃఖ హేతువులగు ధర్మాధర్మములు) తెలుగులో భాగ్యం, మేలు అని దీనికి పరిణమించిన అర్థం. (అదృష్ట జాతకుడు, అదృష్ట శాలి). దీనికి భిన్నమైంది దురదృష్టం

**అంతస్తు** (< సం. అంతస్థః 1. రహస్యము, 2. మఱుఁగుచోటు 3. మేడపై భాగము) ఈ పదానికి తెలుగులో మేడభాగం అనే అర్థంతోపాటు గౌరవం, పరువు, హోదా అనే అర్థాలు కూడా వాడుకలో ఉన్నాయి. (ఈ పని వాడి అంతస్తుకు తగదు; వాళ్ళు మన అంతస్తుకు తగినవాళ్ళు కారు).

**అనుమానం** (< సం. అనుమానమ్ 1. అనుమతికి సాధనము, ప్రత్యక్షాది ప్రమాణములలో నొకటి, 2. ఊహించుట, ఊహ.) తెలుగులో ఈ పదానికి సందేహం, సంశయం అనే అర్థంలోనే ఎక్కువ వ్యాప్తి. (ఈ పనిచేసింది వాడని నా కనుమానం; వాడనుమానం మనిషి; ఈ అర్థంలో తిక్కన ప్రయోగం.

కం॥ "జననీవధంబుచేసిన, ననుమానమె నరకమగుట..."

భారతం, శాంతి. 5.267)

**అన్యోన్యం** (< సం. అన్యోన్య - 1. పరస్పరం, 2. ఇతరేతరము, 3. ఒక అర్థాలంకారము) ప్రీతి, ఇష్టమనే అర్థం ఈ పదానికి వాడుకలోకన్పిస్తుంది. (వాళ్ళిద్దరు అన్యోన్యంగా ఉంటారు).

**అభ్యంతరం** (< సం. అభ్యంతరమ్ 1, లోపలిది. 2. అభిజ్ఞము తెలిసినది. 3. అంతరంగికము, 4. అంతఃకరణము) ఈ పదానికి తెలుగులో అడ్డు, ఆటంకం అనే అర్థంలోనే రూఢి (అతనిమాట కభ్యంతరం లేదు). అభ్యంతరం చెప్పు = అడ్డుచెప్పు.

**అభ్యర్థి** (< సం. అభ్యర్థిః యాచించువాడు, కోరువాడు,) ఎన్నికలలో నిలబడిన వ్యక్తి లేదా ఉద్యోగాదులకు దరఖాస్తుపెట్టిన వ్యక్తి అని ఈనాటివాడుక.

**అయోమయం** (<సం. అయోమయః ఇనుముతో చేయబడినది. అయో వికారము) ఈ పదానికి మూలంలో ఉన్న అర్థం తెలుగులోలేదు. కేవలం అస్తవ్యస్త స్థితిని, అర్థం కాని స్థితిని తెలుపడానికి ఈ పదాన్ని తెలుగులో వాడుతారు. (దేశంలో పరిస్థితులు అయోమయంగా ఉన్నాయి; ఎంత చదివినా అయోమయంగా ఉంది.)

**అవస్థ** ( సం. అవస్థా. 1. స్థితి.ఉనికి, 2. దేహాదులకు కాలము ననుసరించి వచ్చినదశ.) ఈ పదానికి తెలుగులో బాధ, దురవస్థ, హీనస్థితి అనే అర్థపరిణామం కన్పిస్తుంది. అవస్థపడు, అవస్థపెట్టు అనే శబ్దపల్లవాలు కూడా ఈ అరంలోనే ఉన్నాయి.

**అసహ్యం** (<సం. అసహ్యమ్ సహింపరానిది, సాధ్యము కానిది) తెలుగులో దీనికి చెడ్డ, నీచం, నిష్టం, రోత అనే అర్థాల్లోనే వ్యాప్తి.

**అవసరం** (<సం. అవసరః 1. తటి, సమయము, ప్రస్తావనము కార్యోచిత సమయము, 2. (తర్క) సంగతి విశేషము) కార్యోచిత సమయమనే మూలార్థంలో నన్నయ ప్రయోగం ఉంది. మధ్యా. "అవసరజ్ఞుండయి వ్యాసుఁ డేతెంచెనంత......" (అది. 4 254) కాని, నేటి తెలుగులో ఈ పదానికి అవశ్యం, అక్కర, తొందర అనే అర్థాలు ఎక్కువ వ్యాప్తిలో ఉన్నాయి. ఈ అర్థం ప్రబంధకాలంలోనె రూఢిలో ఉందనడానికి ఆధారం !

గీ॥ "హంసవరులార ? మాకొక్క యవసరంబుఁ
గలిగి పంపించితిమి" (ప్రభావతీ ప్రద్యుమ్నము 1-111)

**ఉత్తరం** (< సం. ఉత్తరః 1. ఉత్తరపుదిక్కు, 2. మీదిది, పైది, 3. అధికము, ఎక్కువ, 4. అతిక్రమించినది, దాటినది, 5. ప్రతివచనము, సమాధానము). సంస్కృతంలోని అర్థాలతో పాటు ఈ పదానికి లేఖ, జాబు అనే అర్థం తెలుగులోనే పరిణమించయుండడం గమనింప దగింది

గీ॥ "అచటి కరుగుచునండి సురాధినేత,
మిమ్ము రమ్మని యిదె యుత్తరమ్ము పనిచె"
(కువలయాశ్వ చరిత్రము 4-203)

**ఉద్యోగం** (< సం. ఉద్యోగః 1. యత్నము, పూనిక, 2. ప్రయా

సము, పాటుపడుట) పని, జీవనోపాధికి నిర్వహించే కార్యం అనే అర్థంలోనే ఈనాడు ఈ పదానికి ఎక్కువ వ్యాప్తి (ఉద్యోగులు, ఉద్యోగప్రయత్నం, నిరుద్యోగ సమస్య.

*ఉచితం* (< సం. ఉచితమ్ 1. తగినది, యుక్తము 2. అలవాటుపడినది, పరిచితము, 3. మితము) సంస్కృతంలోని అర్థాలతోపాటు ఈ పదానికి తెలుగులో డబ్బు చెల్లించనక్కరలేని అనే అర్థం కూడా ఉంది. (ఈ పుస్తకాలు నాకు ఉచితంగా ఇచ్చారు.)

*కల్యాణం* (< సం. కల్యాణమ్ 1 అక్షయము, నాశము లేనిది. 2. శుభయుక్తము, 3. ఉత్సవము, పండుగ) తెలుగులో వివాహం, పెండ్లి అనే అర్థ పరిణామం కన్పిస్తుంది. శా॥ "......రుక్మిణీ, కల్యాణంబు వినంగ నాకు మదిలో కౌతూహలం బయ్యెడిన్" (భాగ. 10పూ. 1682) (కల్యాణోత్సవం, కల్యాణమండపం).

*గతి* (< సం. గతి 1. గమనం, పోక, 2. నడక. 3. త్రోవ, 4. ఉపాయము, 5. ఎఱుక, 6. స్థానము, 7. పరిణామము) ఈ పదానికి తెలుగులో అమూలకమైన శరణం, దిక్కు, వలె, విధం, రీతి అనే అర్థాలు పరిణమించి ఉన్నాయి. (ఎదీ గతినాకు రంగా;)

గీ॥ "...వీర లేమిగతి బల్కిన నదియెల్ల మనముఁ గైకొనవలయుగాక
(భార. విరాట. 5.275)

*గ్రహచారం* (< సం. గ్రహచారః గ్రహముల గమనము) తెలుగులో దీనికి దురదృష్టం అనే అర్థమే కన్పిస్తుంది. 'గాచ్చారం' అని రాయలసీమ మాండలికంలో. (గ్రహచారపదం సూర్యరాయాంధ్ర నిఘంటువులో మృగ్యం.)

*ఘటం* (< సం. ఘటః 1. కుండ. 2. ఏనుగు కుంభస్థలము, 3. కుంభకము, 4, శిఖరము) ఈ పదానికి తెలుగు వ్యవహారంలో శరీరానికీ, వ్యక్తికి నిందార్థంలో వ్యాప్తి కన్పిస్తుంది (ఆ ఘటం ఇంకా చావలేదు).

*దాహం* (< సం. దాహమ్ మంట, జ్వాల, కాలుట) మౌలికార్థంలో నన్నయ ప్రయోగం"...లక్కయింట నగ్ని దాహంబు, నెట్లు బ్రదికిరొక్కొ..." [ఆది. 7-195], దప్పిక, పానీయమనే అర్థాలు ఈ పదానికి తెలుగులో ఏర్పడిన పరిణామం. (దాహం తీసుకోండి).

చ. "దప్పిగొన్నమ, ర్త్యునకు మనోహరాంబువులు గ్రోలక
మంచున దాహమాఱునే" (జైమినీ భారతం 9-272).

*పరిశోధన* (<సం. పరిశోధనమ్ శోధించుట) ఈ పదానికీనాడు విద్యా రంగంలో నూతన విషయాన్వేషణ అనే అర్థముంది.

*పరిశ్రమ* (< సం. పరిశ్రమ అలవాటు, మిక్కిలి అలపు). ఈ పదానికి వస్తూత్పత్తి యంత్రాగారం (industry) అనే అర్థం వాడుకలోకి వచ్చింది. (ఖాదీపరిశ్రమలు, కుటీర పరిశ్రమలు).

*పూజ్యం* (< సం: పూజ్యః పూజనీయము, గౌరవింపదగిన) తెలుగులో శూన్యం, సున్న, ఖాళీ అనే అర్థాలు.

*ప్రమాదం* (< సం. ప్రమాదః 1. అనవధానత, ఏమఱుపాటు, 2. మత్తు) ఈ పదానికి రూఢిలో ప్రాణాపాయసంఘటన అనే అర్థం పరిణమించింది. (అగ్ని ప్రమాదం, రైలు ప్రమాదం).

*ప్రియం* (<సం. ప్రియమ్ ప్రేమ, ప్రీతి; స్నేహము, సంతోషము). హెచ్చువెలగలది అనే అర్థం కేవలం తెలుగు వ్యవహారానికి సంబంధించింది.

*భద్రం*(< సం. భద్రమ్ శుభము, శుభకార్య యోగ్యమైనది, శుభకార్యము, శ్రేష్ఠము) దీనికి జాగ్రత్త అని తెలుగులో పరిణమించిన అర్థం.

*మర్యాద* (<సం. మర్యాదా 1. పొలిమేర, 2. సముద్రతీరము, ఒడ్డు, 3. హద్దు, 4. పద్ధతి, ఆచారము) తెలుగులో ఈ పదానికి గౌరవం, పూజ్యభావం, సత్ప్రవర్తన అనే అర్థాలు ఏర్పడినాయి.

*ముష్టి* (< సం. ముష్టిః పిడికిలి; పిడికెడు) ఈ పదానికి బిచ్చం అనే అర్థం తెలుగులో సంభవించిన పరిణామం.

"సీ, మిన్నంత సంపదఁజెన్నారి యుండియు
ముష్టికి లోనయ్యె ముదిత నడుము..."
(చంద్రాంగద చరిత్ర 2-42)

ముష్టివాడు. 'ముష్టికి మూడునంచులా' అని తెలుగు సామెత.

*ముహూర్తం* (< సం. ముహుర్తమ్ 1. నిమేషకాలము, లిప్త. 2. అల్ప కాలము, 3. నలుబది ఎనిమిది నిమిషముల కాలము) వివాహాది కార్యాలకు నిర్ణయించబడిన శుభసమయం అని దీనికి తెలుగులో అర్థం.

*వాచకం* (< సం. వాచకిమ్ వాచ్యార్థమును తెల్పెడి శబ్దము) తెలుగులో దీనికి భాషను బోధించే పిల్లల పాఠ్యపుస్తకం అని అర్థం. అధ్యేతలు స్వయంగా చదువుకొనడానికి నిర్ణీతమైనది ఉపవాచకం.

*విపరీతం* (< సం. విపరీతః వ్యత్యస్తము, అపక్రమము) నేటి తెలుగులో ఎక్కువ, ఆధిక్యం అని వాడుక.

**15.7.** నన్నయ భారతం మనకు లభ్యమైన తొలి తెలుగు కావ్యం. నన్నయ ప్రయోగించిన తత్సమ దేశ్యపదాలలో కొన్నిటికి తర్వాతి కాలంలో అర్థ పరిణామం కన్పిస్తుంది. ఉదాహరణకు :

*అవ్వ* : నన్నయలో ఈపదానికి స్త్రీ అని సామాన్యార్థం. "... అంతిపురంబున నున్న ముదుసలి యవ్వలెల్లం బఱతెంచి ..." (సభా. 1.150.) స్త్రీ సంబోధనా వాచకంగా కూడ దీనికి నన్నయలో ప్రయోగం ఉంది. "అవ్వా నీవెవ్వరి కూఁతురవు..." (అరణ్య 3-184) నేటి వ్యవహారంలో ఈ పదం కేవలం వృద్ధనారీవాచి. రాయలసీమ మాండలికంలో మాతామహికి అవ్వ పితామహికి 'జేజి' అని కొందరి వ్యవహారం.

*ఎఱుక* : నన్నయలో జ్ఞానం ని దీనికర్థం "ఏయది హృద్య మపూర్వం, బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రంబై యుండు." (ఆది 1.30); "....ఎఱుక గలరె మగుపలెందు" (ఆది. 2-84). ఈ పదానికి పరిచయం కలిగి ఉండటం అని మాత్రమే నేటి వ్యవహారం. ఎరుకచెప్పు = సోదెచెప్పు, వ్యక్తి భవిష్యత్తును గురించి చెప్పు.

*ఒప్పుకొను* : ఈపదానికి 'తీసుకొను' అనే అర్థంలోనే నన్నయ ప్రయోగం " ..ఒప్పుకొనుము వీని నుర్వీశ యని సుతునిచ్చి గంగసనిన..."(ఆది 4-169) "...ఇక్ష్వాకుమారుండు మేరుగిరి శృంగంబునుం బోలె నాకెత్తికొన నశక్యుండయ్యె వీని నొప్పుకొనుమనిన..." (సభా. 1-152); "...నీవు సర్వసంపదలు స్వరా

జ్యంబును నొప్పుకొని..." (సభా. 2-264). సమ్మతించు అంగీకరించు అని మాత్రమే ఈ పదానికి నేటి వ్యవహారంలో కన్పించే అర్థం.

*కంపు* : వాసన, సువాసన అనే అర్థాల్లోనే దీన్ని నన్నయ వాడినాడు. "...కందియును మహాసుగంధ కుసుమ తతులు దొంటియట్ల తమకంపు విడువక యుండు...". అర్థపరిణామం వల్ల నేడీ పదానికి దుర్గంధం, చెడువాసన అని అర్థం ఏర్పడింది.

*కాఁపులు* : కాపురమున్నవారు అనే అర్థంలో నన్నయ ప్రయోగం. "...ఇందుల కాఁపుల నందఱఁదొల్లి యిల్వరుసన మ్రింగుచు..." (ఆది. 6-267) ఈ పదం నేడు వ్యవసాయ వృత్తిలోని వారిలో ఒక కులాన్ని తెల్పుతుంది.

*కొప్పు* : నన్నయలో ఈపదానికి జుట్టుముడి, వేనలి, కొన అనే అర్థాలున్నాయి. "...నేలఁబడిన వానిఁ గొప్పువట్టి యీడ్చికొని వచ్చె ధర్మజు కడకు..." (ఆది. 7-45) "...పడియున్న పాములందన వింటి కొప్పుననెత్తి" (ఆది- 2-168). స్త్రీల శిరోజబంధ విశేషమే కొప్పు అని నేడు రూఢిలోకి వచ్చిన అర్థం.

*తగవు* : తగినది, యుక్తం, న్యాయం, న్యాయమైనది అనే అర్థాల్లో నన్నయ ప్రయోగాలు. "...మనమునఁ దగవూహింపక నన్నుఁ బలుకుటుచితమె నీకున్" (అరణ్య. 1-364). "...అమరలోకంబు వేశ్యలమైన మాకు నిట్టి తగవులు నడవవు ..." (అరణ్య. 1-362). కారణకార్య సంబంధాన్ని బట్టి ఈ పదానికి జగడము, తగాదా అనే అర్థం నన్నయ తర్వాత పరిణమించింది.

*పెద్ద* : ఈ పదానికి నన్నయ ప్రయోగాల్లో వివిధార్థచ్ఛాయలు కన్పిస్తున్నాయి. 1. ఎక్కువ. "శ్రీమహాభారతంబు నందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు" (ఆది. 1-11); 2. చాల: మిక్కిలి: "...కడుం బెద్దదవ్వు పోయిన యట్లు" (ఆది 1-117); 3. ఎక్కువః (కాలమునకు సంబంధించి) "...పెద్దకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి..." (ఆది 4-109); 4. శ్రేష్ఠం : "...ధర్మంబుల కెందుఁ బెద్ద యండ్రు సత్యంబు" (ఆది. 4-96); 5. అధిపతి ; "...ఇంద్రుఁడు పెద్ద సర్వలోకములకు..." (ఆది. 5-120); 6. గొప్ప : "మీదయ మాకుఁ గల్గగ నమిత్రుల నోర్చుట యేమిపెద్ద..." (అరణ్య, 3-170); "కపినాథ : నికిది యేమి పెద్ద" (అరణ్య. 3-353);

7. పెరుగు (క్రి.): "అపత్యంబు పెద్దయగుటం జూచి" (అది. 8-300); నన్నయ కాలంలో స్థలకాలాదులకు విశేషణంగా ఉన్న ఈపదం నేటి వ్యవహారంలో జ్యేష్ఠార్థాన్ని పరిమాణాధిక్యాన్నీ తెలుపుతుంది. (పెద్దకొడుకు, పెద్దరాయి) పెద్ద మనిషి అనే పదబంధానికి న్యాయాన్యాయ వివేచన గలవాడని.

బూతు : ఈమాటకు నన్నయలో పొగడే వాడు అనే అర్థం. "...బూతు వొగడినట్లు వొగడెదు..." (సభా. 2-48); దీని కీనాడు అశ్లీల వచనం అని అర్థం.

రేపు : ఉదయం ప్రొద్దున అని నన్నయ ప్రయోగాల్లో దీని అర్థం. "మరునాడు రేపకడయ కద్రువయు, వినతయుం జని..." (ఆది. 2-37); "వల్కలంబులు గట్టి రేపును మధ్యాహ్నంబు నప్పుడును..." (అది. 5-61); అర్థపరిణామంలో ఈ పదానికి ప్రొద్దున అనే అర్థంపోయి మరునాడనే అర్థం ఏర్పడింది.

జీవితం : "నరేంద్రోత్తమ ! భృత్యకోటికి సమానముగాఁదగు జీవితంబు లాయత్తము సేసి యిత్తె" (సభా. 1-37). నన్నయలో 'జీతం' అనే అర్థంలో ప్రయోగింపబడిన జీవిత శబ్దానికి ఆ అర్థమీనాడు లేదు

దూషించు : ఈ తత్సమక్రియకు నన్నయలో పరిహరించు, విసర్జించు అనే ప్రయోగాలున్నాయి. "ఒక్కని కారణంబునఁ గులంబున కెగ్గగునేని వాని దూషించి కులంబు రక్షించుట ధర్మంబని శుక్రుండు జెప్పె ." (సభా.2-179). ఈనాడు దీనికి నిందించు తిట్టు అని వాడుకలోని అర్థం.

బాన : భాషా శబ్దానికి తద్భవమైన ఈ పదాన్ని నన్నయ విధం, వైఖరి, తీరు అనే అర్థంలో వాడినాడు. "వీని బాస చూడ వేఱంచు" (అది, 6-295); "పలికిన బాసఁజూడ నత్యుత్తమ క్షత్రియాన్వయు డగుదురు" (అది. 7-228). ఈ పదానికి ప్రమాణమని తర్వాత ఏర్పడిన అర్థ పరిణామం. నన్నయ భారతంలో అర్థపరిణామ దృష్ట్యా ఆసక్తిని కలిగించే పదప్రయోగాలు ఇంకా చాలా ఉన్నాయి. ఇక్కడ కొన్ని మాత్రమే ఉదహరించ బడినాయి.

**15 8** ఆంధ్రదేశంలో మహమ్మదీయుల పరిపాలన కారణంగా క్రీ. శ. 13 వ శతాబ్దాంతంనుండి హిందూస్థానీ పదాలు అరబిక్ (అర.) పర్షియన్ (పర్షి.) ఉర్దూ భాషలకు సంబంధించినవి) తెలుగువారి వ్యవహారంలోకి, కావ్యరచనల్లోకి

ప్రవేశించినాయి. మనకు తెలిసినంత వరకు కావ్యాలలో ప్రయుక్తమైన హిందూస్తానీ పదాలలో మొదటిది త్రాసు. "...త్రాసులంబోని చిత్తంబులతోడుతఁ, బ్రజవివాదము లెడఁబక్షముడిగి..." (శాంతి.2-374) అని 'త్రాసు' శబ్దానికి తిక్కన ప్రయోగం. 'తరాజూ' అనే పర్షియన్ భాషా పదానికి వికృతిరూపం త్రాసు. ''ధనము కలిమియు లేమియుఁద్రాసునందు నిలిపి యెత్తంగ..." (శాంతి. 4-33) అనే పద్యంలోకూడా త్రాసుకు రెండవ ప్రయోగం తిక్కనలో కనిపిస్తుంది కేతన కూడా ఈపదాన్ని ప్రయోగించినాడు. "అచ్చులు ద్రాసులుఁ దూములుఁ బొచ్చెంబుగజేసి ..." (*విజ్ఞానేశ్వరీయము*, ప్రాయశ్చిత్తకాండము, 65), నాచన సోముని హరివంశంలో 'కోహళి' ప్రయోగంవుంది. "పార్వతీ పతికిఁ బ్రభాత భూతపతి గొన్న మెలరుఁ గెందమ్మి గొన్న కోహళి యనంగ..." (ఉత్తర హరివంశము, 3-66). ఇందలి కోహళి శబ్దం 'కులాహ్' అనే పర్షియన్ శబ్దానికి వర్ణవ్యత్యయ రూపం. శ్రీనాథుని రచనల్లోను, చాటువుల్లోను కూడా హిందూస్తానీ పదాలు చాలా కన్పిస్తాయి;

ఉదా ; పూజారి వారి కోడలు
తాఁజారగ బిందెజారి దబ్బునఁ బడియెన్
మైజారు కొంగు దడసిన
బాజారే తిరిగిచూచి పక్కున నవ్వెన్.

పై చాటువులోని మైజారు (< పర్షి. మీజర్ 'కట్టుకొను వస్త్రం'), బాజారు (<ఉర్దూ; పర్షి. బజార్ 'విపణివీధి'). ఇవి హిందూసానీ పదాలే. తెలుగులోనికి ఎరువు తెచ్చుకున్న హిందూస్తానీ పదాలు వందలకొద్దీ ఉన్నాయి. ప్రతిదేయాలైన కొన్ని హిందూస్తానీ పదాల్లో కూడా అర్థపరిణామం కన్పిస్తుంది; ఉదా.

అమీను (<ఉర్దూ. అమీన్ <పర్షి. అమీన్ విశ్వసపాత్రుడైన వ్యక్తి ఉద్యోగి) న్యాయస్థానంలో ఒక ఉద్యోగి అని మాత్రమే తెలుగులో వ్యవహారం.

అసలు (< అర. ఉర్దూ. అసల్. మూలం, వృక్షమూలం). తెలుగులో దీనికి మూడర్థాలు ఏర్పడ్డాయి. 1. వడ్డీకిచ్చిన ధనం. 2. శ్రేష్ఠమైన, కల్తీలేని (అసలు సరుకు) 3. కొందరి వ్యవహారంలో ఒక ఊతపదం. "అమ్మనీయల్లుని నసలేనెరుంగ, ఏరీతి-దెలియదు నేయుపాయంబు" (పల్నాటి వీరచరిత్ర, పుట 73)

అసివారు రూ. సవారి (రీ), స్వారి (రీ) (< ఉర్దూ, అస్వార్, సవార్

<పర్షి. అస్వార్ 'ఆశ్వారోహి, రౌతు, అశ్విక సైనికుడు'). తెలుగులో వాహ్యాళి, విహారం, అని అర్థ పరిణామం ఉదా : "ఎప్పుడు నలువ తేరెక్కి యష్టాదశ ద్వీపాళీ నసివాలు దిరిగెలీల" (కాశీఖండం 4-195): "ఆపంచగౌడ ధాత్రీపదం బెవ్వాని కసివాలుగా నేగునట్టి బయలు" (మనుచరిత్ర 1-11) (పైప్రయోగా ల్లోనేగాక సూర్యరాయాంధ్ర నిఘంటువులో కూడా 'అసివాలు' అని శకటరేఫతో ఆరోపముండడం దోషం. సవారి అనే రూపాంతరానికి 'బండిగూడు' అనే అర్థం కూడా ఉంది. స్వారి అనే రూపాంతరానికి 'గుర్రం పై ఎక్కిపోవుట' అనే అర్థం రాయలసీమలో కనిపిస్తుంది.)

*ఇనాము* రూ. ఈనాము (< ఉర్దూ ఇనామ్ < అర ఇన్అమ్ 'బహుమతి') ఈ అర్థంలో వరాహపురాణంలో ప్రయోగం ఉంది. "కరి మయూర మరాళికలకు నొయ్యార మీనామిచ్చి నడపు సన్నంపు నడలు" (వరాహ. 4-159) బహుమతి అనే అర్థంతోపాటు బహుమతిగా ఇవ్వబడిన భూమి అని కూడ నేడు దీనికి రూఢ్యర్థం.

*ఇలాకా* (< ఉర్దూ ; అర. ఇలాకా, దేశం, క్షేత్రం) ప్రదేశం, తాలూకా, సంబంధించిన అని తెలుగులో దీనికి అర్థాలు.

*కమరు* రూ. కమ్మరు (< ఉర్దూ; పర్షి. కమర్ నడుము, కటిస్థలము) వడ్డాణం, మొలనూలు. "లజ్జయెరుగని కటిమండలంబుమీద వలువ వజ్రాల కమరు గర్వంబు సూప . ." (కాశీఖండము 3-24).

*కలంకారి* (< ఉర్దూ. కలంకారీ. ఖలం = పుల్ల; కార్ = పని రాత. చిత్ర లేఖనం). తెలుగులో మైనపు కలంతోచేసే అద్దకపుపని, ఆధునిక 'చిత్రకారుల పరిభాషలో Batik painting.

*గస్తు* : రూ. గస్తీ (< ఉర్దూ. గస్త్; పర్షి. గస్తీ; తిరుగు, పరిభ్రమించు) రాత్రుల్లో తిరుగుతూ కాపలాకాయు "ఆలీల ‹ గౌజవి దయ్యంబుల దివ్వెకోలల వారిగా గస్తు దిరిగి..." (గౌరన హరిశ్చంద్రోపాఖ్యానం 16-68).

*గోరీ* (< ఉర్దూ, పర్షి. గోరీ, సమాధి) తెలుగులో ఈపదానికి మహమ్మదీయుల సమాధి అని మాత్రమే అర్థం.

*జవాను* (< ఉర్దూ : పర్షి. జవాన్ యువకుడు). నౌకరు, బంట్రోతు అని మాత్రమే తెలుగులో అర్థం.

*జాబు* (< ఉర్దూ; పర్షి. జవాబ్ సమాధానము). లేఖ, ఉత్తరం అని తెలుగులో అర్థం.

*జరూరు* (< ఉర్దూ: అర. జరూర్ : ఆవశ్యకం, తప్పనిసరి). తొందరగా, వేగంగా.

దమ్ము (< ఉర్దూ: పర్షి. దమ్ శ్వాసం, గాలి, క్షణకాలం). తెలుగులో ఊపిరి అనే అర్థంతోపాటు (దమ్ముపట్టు) బహువచన ప్రత్యయం చేరిన దమ్ములు అనే రూపానికి ధైర్యం సాహసం అనే అర్థాలున్నాయి.

దుబారా (< ఉర్దూ దుబారా; పర్షి. దుబారహ్ రెండోమారు). తెలుగులో వ్యర్థంగా లేదా అధికంగా చేసే ఖర్చు అని మాత్రమే అర్థం.

దావా (< ఉర్దూ దావా; పర్షి. దవీ వ్యాజ్యం, వాదం, గర్వం) దావా చేయు, కోర్టులో ఫిర్యాదుచేయు.

నమాజు (< ఉర్దూ; పర్షి. నమాజ్. ప్రార్థన) మహమ్మదీయులు చేసే ప్రార్థన.

ఫౌజు (< ఉర్దూ; పర్షి. ఫౌజ్, గుంపు; బృందం) సైన్యం.

*బాకీ* (< ఉర్దూ; అర. బాకీ శేషం, మిగిలింది) తెలుగులో దీనికి అప్పు, ఋణం అనే అర్థాలు కూడా ఉన్నాయి.

మామూలు (< ఉర్దూ; అర. మామూల్ సహజం. ప్రత్యేకతలేని, విశిష్టం కాని). విశేష్యార్థంలో (ఏక. మామూలు, బహు. మామూళ్ళు) ఉద్యోగులకు చిన్న మొత్తాలుగా ఇచ్చే లంచం అని అర్థపరిణామం

ముల్కీ (< ఉర్దూ; పర్షి. ముల్కీ స్వదేశస్థుడు) పాతనైజాం రాష్ట్రానికి చెందిన వ్యక్తి.

*మేజువాణీ* (< పర్షి. మేజ్‌బానీ ఆతిథ్యం, ఆతిథ్యమివ్వటం). వినోదం, వినోద కార్యక్రమం.

*రహదారు* (< ఉర్దూ. రహ్‌దార్ మార్గరక్షకుడు, చౌకిదారు) తెలుగులో వాహనం అనే అర్థంతో ఈ కింది ప్రయోగం ఉంది. "చిలుక రహదారు రాహుతు తలిరాకు..." (అనిరుద్ధ చరిత్రము 3-77). ఈనాడు మార్గం, రస్తా అని ఈపదానికి అర్థాలు

*రజా* (< ఉర్దూ; పర్షి. రోజా ఉపవాసం, దినం) సెలవుదినం.

*వస్తాదు* (< పర్షి- ఉస్తాద్, ఉపాధ్యాయుడు). ప్రవీణుడు, మల్లయుద్ధంలో నైపుణ్యం కలవాడు.

*సీసా* (< పర్షి. సీసహ్ గాజు). గాజుతో చేసిన చిన్న బుడ్డి.

*హుషారు* ( < పర్షి. హోష్‌యార్ జాగరూకత, జాగ్రత్తకలవాడు)చురుకుదనం సంతోషం.

*దస్తూరీ* (< పర్షి దస్తూర్ ఆచారం, సంపద). చేతివ్రాత అని దీనికి తెలుగులో అర్థ పరిణామం.

*తగాదా* (< పర్షి. తగాదహ్ ప్రయత్నంచేయు). వాదించు, అభిప్రాయ భేదాన్ని ప్రకటించు, చిన్న కలహం అని తెలుగులో పరిణమించిన అర్థం.

*జాబిత* (< అర. జాబితా చట్టాలు, చట్టవిధి, చట్టప్రకారం) ఈ పదానికి తెలుగులో వస్తువుల పట్టిక అనే అర్థంలోనే వాడుక.

నిఘంటువులకు ఎక్కని హిందూస్థానీపదాలు వ్యవహారంలో ఎన్నో ఉన్నాయి. హిందూస్థానీ ప్రాతిపదికలు గల శబ్దపల్లవాలు కూడా తెలుగులో ఏర్పడి ఉన్నాయి. ఉదా :- అటకాయించు, కేటాయించు, దబాయించు, బుకాయించు, మినహాయించు, గాబరాపడు, గప్పాలుకొట్టు, బేజారెత్తు మొదలైనవి. వీటిలో కొన్నింటి ప్రయోగాలకు విశేషార్థచ్ఛాయలు కూడా గుర్తించవచ్చు. ఉదా. టోపీవేయు (మోసంచేయు) పాగావేయు (పెద్ద ప్రయత్నంచేయు) మొ.వి.

**15.9.** భాషా పరిణామంలో ధ్వనులమార్పుకు సంబంధించి ధ్వనిసూత్రాలను ప్రతిపాదించినట్లు భాషాశాస్త్రజ్ఞులు అర్థపరిణామానికి సంబంధించిన సూత్ర నిర్ణయం చేయడం సులభసాధ్యం కాదు. సాధారణంగా భాషలో జరిగే అర్థపరి

ణామవిధానాలు గుర్తించవచ్చునుకాని అర్థపరిణామ హేతువుల్ని మాత్రం నిర్ణయించలేము. ఈశతాబ్దాదిలో Breal అనే ఫ్రెంచిభాషా శాస్త్రజ్ఞుడు(Breal,1900) భాషల్లోజరిగే అర్థపరిణామాన్ని కొన్ని రకాలుగా వర్గీకరించాడు. అతడు ప్రతిపాదించిన వర్గీకరణ విధానాన్ని ఆధారంగా జేసుకొని తెలుగుభాషా చరిత్రలో జరిగిన అర్థపరిణామాన్ని ఈ కింద స్థూలంగా పరిశీలిస్తాను.

**15.10 అర్థవ్యాకోచం** Extension of meaning or generation of meaning) : ఒక దశలో పరిమితార్థబోధకమైన ఒక పదం అర్థవిస్తృతిని పొంది జాతివాచకమైనప్పుడు ఆపదంలో కలిగిన పరిణామం అర్థవ్యాకోచం

*చెంబు* ; శోణార్థకమైన చెమ్ < కెమ్ ఈపదంలోని మూలధాతువు. ఈపదానికి అర్థం ఎర్రని వస్తువుతో అనగా రాగి లోహంతో చేయబడిన చిన్నపాత్ర అని. అర్థవ్యాకోచం వల్ల అట్టి ఉపయోగం, అకారం కల్గిన ఏ లోహంతో చేసిన పాత్రకైనా తర్వాత చెంబు అనేమాట ప్రచారంలోకి వచ్చింది : వెండిచెంబు, ఇత్తడి చెంబు మొ.

*అష్టకష్టాలు* : ఎనిమిది రకాలైన కష్టాలు: 1. దేశాంతరగమనం, 2. భార్యావియోగం, 3. ఆపత్కాలబంధుదర్శనం, 4. ఉచ్ఛిష్టభోజనం, 5. శత్రుస్నేహం, 6. పరాన్నప్రతీక్షణం, 7. అప్రతిష్ఠ, 8. దారిద్ర్యం. వ్యవహారంలో అష్టకష్టాలన్నప్పుడు సంఖ్యాపరిమితిలేని అనేకకష్టాలని సామాన్యార్థం.

*అవధాని* : అవధానం చేసేవ్యక్తిని అవధాని అనడం అసలు అర్థం. కాని ఈనాడు అట్టి పరిమితార్థంలోగాక ఈపదం వ్యక్తులపేర్లలో కులసూచకార్థ విస్తృతిని పొందింది. ఇటువంటిదే సోమయాజి, ఉపద్రష్టవంటి పదాల్లోను ఏర్పడిన అర్థవ్యాకోచం.

*మహారాజు* : రాజులకు రాజని దీని అర్థం. వ్యవహారంలో ధనవంతుడని అర్థ విస్తృతి ఏర్పడింది. మహారాజరాజశ్రీ అని ఉత్తరాల్లో కొందరు పేర్లకు పెట్టే విశేషణం.

**15.11 అర్థసంకోచం** (Restriction of meaning or specialisation): విస్తృతార్థమున్న ఒక పదానికి పరిమితార్థ మేర్పడినప్పుడు జరిగిన పరిణామానికి అర్థసంకోచమనిపేరు; ఉదా.

చీర : మొదట ఈ పదానికి స్త్రీపురుష లందరూ ధరించే వస్త్రమని అర్థం. తిక్కన కాలంలో ఈపదానికున్న అర్థమిదే "...జనపాలక నందనుండు జయ లక్ష్మింజే, కొననడె చీరలు దెచ్చుట, పనియే..." (విరాట.4-48). ఈ నాడీ పదానికి స్త్రీలు ధరించే వస్త్రమని అర్థపరిమితి ఏర్పడింది. ఇట్టిదే కోక అనేపదం కూడా. శ్రీనాథుని కాలంలో ఈపదానికి సామాన్యమైన వస్త్రమనే అర్థం. "కుళ్ళాయుంచితి కోకఁజుట్టితి" అని శ్రీనాథుని చాటువు.

పెద్ద : నన్నయ ప్రయోగాల్లో పెద్దఅనేమాటకు వివిధార్థచ్ఛాయలున్నాయి (చూ. పుటలు 432-33). ఈనాడీపదం జ్యేష్ఠారాన్ని, పరిణామాధిక్యాన్ని మాత్రమే సూచించడానికి పరిమితమైంది.

ఆరాధ్యుడు : పూజనీయుడని ఈపదానికిగల సామాన్యార్థం. శైవుల్లో ఒక తెగను మాత్రమే సూచించే పరిమితార్థం తెలుగులో దీనికి ఏర్పడింది.

సాహెబు (< అర. సాహెబ్) చెలికాడు, సహచరుడని ఈపదానికి మౌలికార్థం. మహమ్మదీయుడని దీని కేర్పడ్డ అర్థ పరిమితి.

వస్తాదు (< పర్షి. ఉస్తాద్) ఉపాధ్యాయుడు అని దీనికి మౌలికార్థం. అర్థసంకోచంవల్ల ఈ పదానికి కుస్తీలుపట్టే విద్యనునేర్పే ఉపాధ్యాయుడని,తరువాత కుస్తీలుపట్టేవాడు లేక మల్లుడనే అర్థం పరిణమించింది.

పత్రం : పర్ణం, ఆకు అని మొదట దీనికుండిన విస్తృతార్థం. అర్థ సంకోచం వల్ల తాటియాకు, కాగితం అనే అర్థాలు కూడా దీనికి ఏర్పడ్డాయి. ఈనాటి వ్యవహారంలో ఋణపత్రమనే దీని అర్థపరిమితి.

**15 12. అర్థగౌరవం : (Elevation of meaning or amelioration)** : ఒక కాలంలో నిందార్థంలో లేదా సామాన్యార్థంలో వాడబడే పదాలు విశిష్టార్థ బోధకాలైనప్పుడు ఆ పదాలకు అర్థగౌరవం ఏర్పడిందని గుర్తించడం పరిపాటి. దీన్నే అర్థోత్కర్ష అనికూడా అంటారు; ఉదా.

సభికులు : జూదగాండ్రని ఈ పదానికున్న మౌలికార్థం. తర్వాత రాజుగారి కొలువులోనివారు, సభలోని ప్రేక్షకులనే విశేషారం దీనికి కల్గింది.

ముహూర్తం : నిమేషకాలం, అల్పకాలమని దీని అర్థం. శుభకార్యాలకు నిర్ణీతమైన పవిత్రకాలం అని దీని కేర్పడిన అర్థగౌరవం.

**15.13.** అర్థాపకర్ష(Degradation of meaning or pejoration): రూఢిలో మౌలికార్థానికి నష్టంకలిగి పరిహాసార్థంలోగాని నిందార్థంలోగాని నిమ్నార్థంలోగాని జరిగిన అర్థపరిణామానికి అర్థాపకర్షమని పేరు ; ఉదా.

ఛాందసుడు : ఈ పదానికి వేదవేత్త అని మౌలికార్థం. తెలుగులో లోకజ్ఞానం లేనివాడనే నిందార్థం దీని కేర్పడింది.

సన్యాసి : ఇహలోక బంధాలను సన్యసించిన మోక్షకామి యనిమౌలికార్థం. ఎందుకు కొరగానివాడని నేటి వ్యవహారంలో కల్గిన అర్థాపకర్షం.

దేవదాసి : దేవాలయాల్లో పూజాకైంకర్యాలలో నృత్యగానాదులకు నియమింపబడిన భక్తురాలు అని మౌలికార్థం. అర్థన్యూనతవల్ల ఇది వేశ్యకు పర్యాయపద మైంది.

కళావంతులు : నృత్యసంగీతాది కళలను అభ్యసించే స్త్రీలు అని అర్థంగల ఈ పదానికి ఈనాడు 'భోగంవాళ్ళు' అని అర్థచ్యుతి ఏర్పడింది.

కైంకర్యం : సేవ, పూజ అనే అర్థంగల ఈ పదానికి అపహరించు, దొంగలించు అనే అర్థాపకర్ష వ్యవహారంలో ఉంది.

**15.14.** లక్ష్యార్థసిద్ధి (Transfer of meaning): భాషలో సాధారణంగా అనేక పదాలకు ఆధారాధేయ, కార్యకారణం, అంగాంగి, ఏకదేశాది సంబంధంవల్ల లక్ష్యార్థాలు ఏర్పడి రూఢికెక్కడం సహజం. తెలుగులో లక్ష్యార్థసిద్ధి పొందిన పదాలు చాలా ఉన్నాయి; ఉదా.

ముష్టి : పిడికిలి అని దీని అర్థం. పిడికిట్లో ఆధేయమైన బియ్యానికిది వాచ్యమై బిచ్చమనే లక్ష్యార్థాన్ని ఇస్తోంది.

దాహం : దహించుట, తపించుట అనే అర్థముండే ఈ పదానికి కారణకార్య సంబంధంవల్ల దప్పి, పానీయమనే అర్థం నేర్పడింది.

సూది : సూచికావాచియైన ఈ పదం సాదృశ్యాన్ని బట్టి డాక్టర్లు మందును శరీరంలోకి ఎక్కించడానికి ఉపయోగించే సూదివంటి పరికరానికి పేరుగా అర్థపరిణామం గల్గింది.

*మర్యాద* : సంస్కృతంలో మర్యాదశబ్దానికి హద్దు, సరిహద్దు అనే అర్థం. నన్నయలో ఈ పదానికి నియమం, శాసనం అని అర్థముంది. "ఇది నా చేసిన మర్యాద" (ఆది. 4-272). ఈనాటి వ్యవహారంలో లక్ష్యార్థం, మన్నన అని.

**15.15.** సభ్యోక్తి (Euphemism) : సభలోగాని కొందరి సమక్షంలో గాని ప్రత్యక్షంగా వాచ్యం చేయకూడని పదాల (అశ్లీలాలు, అశుభార్థకాలు) అర్థాన్ని పరోక్షంగాగాని నూతనపదబంధకల్పనలవల్లగాని తెల్పేవిధానానికి సభ్యోక్తి అనిపేరు. తెలుగులో అశుభంగా భావించబడే మరణాన్ని తెలుపడానికి అనేక సభ్యోక్తులున్నాయి. కీర్తిశేషులగు, కాలమగు, కాలధర్మమగు, దివంగతులగు, శివైక్యము పొందు మొదలైనవి. అశ్లీలంగాభావింపబడే ఒంటికి, రెంటికి(ఈపదాలు కూడా మొదట సభ్యోక్తులుగా ఏర్పడినవే) తెలిపే పదాలు చాల ఉన్నాయి. వీటిలో మాండలిక భేదాలుకూడా ఎన్నోఉన్నాయి; ఉదా. దొడ్డికెళ్లు, బయటకుపోవు, కాల్వకుపోవు, చెరవుకెళ్ళు, బహిర్భూమికిపోవు, చెంబట్టకెళ్ళు, మొదలైనవి.

**15.16.** లోకనిరుక్తి (Folk etymology) : వ్యుత్పత్తి స్పష్టంగా నిరూపించలేని పదానికి సామాన్యులు ఒక అర్థాన్ని ఊహించడం, తదనుగుణంగా ఆ పదంలోని ఒకటి రెండు వర్ణాలను మార్చడం లోకనిరుక్తి లేదా జననిరుక్తి అవుతుంది. తెలుగులో లోకనిరుక్తి కి చెందిన పదాలు కొన్ని మచ్చుకు:

*చందమామ* : ఈ తెలుగుమాటకు సంస్కృతమూలం చంద్రమస్. లోకమాతయైన లక్ష్మీదేవికి సోదరుడు చంద్రుడు. ఈ భావాన్ని స్ఫురించేటట్లు తెలుగు ప్రజలు చంద్రమస్ శబ్దాన్ని జననిరుక్తి దృష్టిలో చందమామగా గ్రహించారు.

*ఆకాశరామన్న* : 'ఆకాశనామన్' శబ్దానికి తెలుగువారు కల్పించుకొన్న రూపాంతరం ఆకాశరామన్న. ఈ పదబంధంలోనికి ఆకాశశబ్దానికి ఆకాశకుసుమం, ఆకాశ పంచాంగం ఇత్యాది పదబంధాలలాగా అభావమని అర్థం. 'ఆకాశనామన్' (ఆకాశనామకుడు) అనే పదానికి లోకులు కల్పించి రూఢికెక్కించిన లోకనిరుక్తి రూపం ఆకాశరామన్న.

*చక్రకేళి* : చక్రంలా గుండ్రంగా ఉండే అరటిపండని దీనికి లోకనిరుక్తి. ఈ పదబంధంలోని చక్ర 'శర్కర' శబ్దభవమేగాని చక్ర సంబంధికాదు. కదళీ శబ్దభవము కేళి. ప్రాకృతంలోని 'సక్కరాకయళీ' తెలుగులో వర్ణవ్యత్యయంవల్ల 'చక్రకేళి' అయింది.

ఐదువ (రాలు) శబ్దరత్నాకరకర్త ఈ పదానికి ఐదువన్నెలు గలది (సుమంగళి) అని వ్యుత్పత్తిని చెప్పి వన్నె అనగా సుమంగళియొక్క అలంకారమని వివరించి ఆ ఐదువన్నెలు 1. మంగళసూత్రము, 2. పసుపు, 3. కుంకుమము, 4. గాజులు, 5. చెవ్వాకు అని పేర్కొన్నాడు. నిఘంటువులో ఉన్న ఈ అర్థం లోకనిరుక్తికి సంబంధించిందే. సుమంగళివాచియైన 'అవిధవా' అనే సంస్కృత పదానికి తద్భవమైన 'ఐదువ' లేక 'అయిదువ' తెలుగులో అదే అర్థంలో ప్రయోగించబడింది. ఐదు అనే సంఖ్యావాచకానికి ఐదువ పదానికి ఎలాంటి సంబంధంలేదు.

అర్థతత్వరంగంలో ఇటీవల ప్రచారానికి వస్తున్న సిద్ధాంతాలను విధానాలను తెలుగుభాష కన్వయించి పరిశీలించ వలసిన అవసరం ఏంతైనా ఉంది.

ప్రకరణం 16

# తెలుగుభాషాచరిత్ర : సింహావలోకనం

— భద్రిరాజు కృష్ణమూర్తి

**16.0** అవతారిక : ద్రావిడభాషా కుటుంబాన్ని మూడు ఉపకుటుంబాలుగా విభజించవచ్చు.[1] దక్షిణ, మధ్య, ఉత్తర ద్రావిడభాషలని. దక్షిణ ద్రావిడ ఉపకుటుంబం మరి రెండు శాఖలుగా చీలింది : (1) తమిళం, మలయాళం, కన్నడం, కొడగు, తొద, కోత; (2) తెలుగు, కూయి, కువి, కూబి (= కొండ), గోండి. పెంగొ, మండ, పర్జి, కోలామి, నాయకి, ఒల్లారి, గదబ మధ్య ద్రావిడ భాషలు. కురుఖ్ (= కూఁడుఖ్), మాల్తో, బ్రాహూయీ ఉత్తర ద్రావిడ భాషలు. తెలుగు తనకు దక్షిణ పశ్చిమాలనున్న తమిళ కన్నడాదులకంటె, పూర్వోత్తరాలనున్న కూయి మొదలైన వాటికే పుట్టుకలో సన్నిహితమని శాస్త్రజ్ఞులంతా ఒప్పుకొన్న సత్యం. కాని తెలుగు-కూయి శాఖ మధ్య ద్రావిడ ఉపకుటుంబానికి చెందిందా, దక్షిణ ద్రావిడకుటుంబానికి చెందిందా అన్న విషయంమాత్రం ఇంకా వివాదగ్రస్తంగా ఉంది. ఇది దక్షిణ భాషోపకుటుంబానికి చెందింది అనటానికే ఆధారాలు ఎక్కువ కనిపిస్తున్నాయి, ఉదా.[2]

$$(1) \quad \begin{bmatrix}\text{ఇ}\\ \text{ఉ}\end{bmatrix} > \begin{bmatrix}\text{ఎ}\\ \text{ఒ}\end{bmatrix} \Big/ \#(\text{హ}) - \text{హ} + \text{అ}$$

ప్రాచీన ద్రావిడంలో ధాతుగతమైన ఇ, ఉ వర్ణాలు, పరాక్షరంలో అత్వంఉన్నప్పుడు క్రమంగా ఎ, ఒ వర్ణాలవుతాయి. (§ 2.12). ఈ సూత్రం దక్షిణ ద్రావిడ ఉపకుటుంబానికంతటికీ వర్తిస్తుంది. అంటే ఇది తమిళ-కన్నడశాఖ, తెలుగు-కూయి శాఖ ఏకశాఖగా ఉన్నకాలంలో జరిగిన మార్పై ఉండాలి. ద్రావిడ మాతృకలో 'ఉప్పు' అనే అర్థంలో *చుప్ : *చువర్ అనే రూపాలుండేవి, సూత్రం 1 వల్ల

1. ఈ అధ్యాయంలో కుండలీకరణాల్లో § గుర్తుతో ఇచ్చిన అంకెలు ఈ గ్రంథంలో వచ్చిన ప్రకరణాలకు, విభాగాలకు చెందినవిగా గుర్తించాలి.

2. A > B/—C. 'C' అనేది పరంగాఉన్నప్పుడు 'A', 'B' గా మారుతుంది. ఈ విధంగా సూత్రాలను చదువుకోవాలి. ఇవి చారిత్రక పరిణామాన్ని సూచిస్తాయి.

*చువర్ దక్షిణ ద్రావిడోప కుటుంబంలో *చొవర్‌గా మారింది. పదాది చ వర్ణం ఈ భాషల్లో కొన్ని శబ్దాల్లో లోపించింది (చూ. సూత్రం 2). పై మాతృకల జన్యరూపాలు రెండు శాఖల్లోనూ ఈ కింది విధంగా ఉన్నాయి.

I. (a) త. మ. క. తె. *ఉప్పు*; కొ. *ఉవ్‌వు*; తు. *ఉప్పు*; కోత, తొద *ఉవ్*.

(b) త. *ఉవర్*, మ. *ఉవర్*, *ఓర్*; క. *ఒగర్*; తు. *ఉబరు*, *ఉగరు*; తె. *ఒగరు*. (త. మ. తు. *ఉ-<ఒ-*; § 2.12)

II. గోం. సొవర్, హొవర్, ఒవర్; కొండ సోరు, పెంగొ హోర్; కూయి సారు, కువి హారు, మండ జార్.

మధ్య ద్రావిడ భాషల్లో : ప. చువ్, కోలామీ సువ్, నాయ సువ్వ్-, ఒల్లారి సువ్, గదబ చుప్పు.

అత్వపరంగా ఉకారం ఒకారంగా మారటం ద. ద్రా. శాఖల్లో స్పష్టంగా గుర్తించవచ్చు. *చువ్ + అర్ ▶ *చువర్ జన్యరూపాలు మధ్యద్రావిడ భాషల్లో కనిపించవు.

(2) (a) చ > స/# —
(b) స > హ/# —
(c) హ > ϕ/# —

ఈ మూడు సూత్రాలు ద. ద్రా. శాఖల్లో ముందు వెనకలుగా ప్రవర్తిస్తాయి. పదాది చకారం మాండలికంగా (ప్రాంతీయ వర్గ మాండలికాల్లో) సకారంగా మారినప్పుడు, అది హకారంగా మారి ఆ తరవాత లోపిస్తుంది. ఈ మార్పు ద. ద్రా. భాషల్లో మొదటి శాఖలో పూర్తిగా ప్రవర్తించి రెండో శాఖకు వ్యాపిస్తున్న కాలంలో అది విడిపోయి ఉంటుంది. కూయి-గోండీ ఉపశాఖలో ఈ మార్పులు ఇప్పటికీ నడుస్తున్నాయి. అందువల్లనే గోండిలో 'సొవర్, హొవర్, ఒవర్' మూడు రూపాలూ కనిపిస్తాయి. ఈ సూత్రాల ప్రవృత్తి మధ్యద్రావిడ భాషల్లో కనిపించదు.

ద్రావిడ మాతృకలోలేని పదాది మూర్ధన్య దంతమూలీయ వర్ణాలు, సంయుక్త హల్లులు వర్ణవ్యత్యయం కారణంగా తెలుగు - కూయీ శాఖలో ఏర్పడ్డాయి (§ 2.13). దీని ఛాయలు తమిళ - కన్నడ శాఖలోనూ కనిపిస్తాయి.

ద. ద్రా. శాఖల్లో ప్రథమైకవచన రూపం నాన్-/నేన్- (< *ఞాన్) కనిపిస్తుంది. మధ్యోత్తర భాషల్లో దీని సోదర రూపాలులేవు. అందువల్ల ద. ద్రా. శాఖలు రెండూ కలిసి ఉన్న కాలంలో ఇది కల్పించబడి ఉంటుంది. ప్రాచీన మాతృకలో *యాన్ (= తెలుగు ఏను) నుంచి ఏర్పడ్డ రూపాలు అన్ని ద్రావిడ భాషలలోనూ ఉన్నాయి (వివరాలకు, చూ. కృష్ణమూర్తి 1968 a).

**16.1.** ప్రాచీన ద్రావిడ మాతృకలో 16 హల్లులు, 10 అచ్చులు ఉండేవి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| హల్లులు : | ప | త | ట̲ | ట | చ | క |
| | మ | న | | ణ | ఞ | |
| | | | ల | ళ | | |
| | | | ర | | | |
| | | | | ఴ | | |
| | వ | | | | య | |
| అచ్చులు: | ఇ ఈ | | | ఉ ఊ | | |
| | ఎ ఏ | | | ఒ ఓ | | |
| | | | అ ఆ | | | |

ప్రా. ద్రా. లో పదాదిన దంతమూలీయ మూర్ధన్యాలు లేవు. అంటే ప త చ క మ న ఞ వ య - లే పదాదినవచ్చే హల్లులు. పదాలు అచ్చుతోగాని, హల్లుతో గాని మొదలయ్యేవి. ధాతువులన్నీ ఏకాచ్కాలుగానే ఉండేవి : (హల్లు) + అచ్చు, (హల్లు$^1$) + అచ్చు + హల్లు$^2$. అచ్చు హ్రస్వ దీర్ఘాల్లో ఏదైనా కావచ్చు; హల్లు$^1$ పైన ఉదాహరించిన తొమ్మిదికే పరిమితం; హల్లు$^2$ పదహారు హల్లుల్లో ఏదైనా కావచ్చు. ధాతువు ననుసరించి వచ్చే అచ్చులు అ ఇ ఉ లుగానే ఉండేవి. ఇవి ప్రత్యయ (derivative or farmative) భాగాలు. అచ్చుల మధ్య/క చ ట ట̲ త ప/ లకు [గ స డ ఱ ద వ] అనే ఉచ్చారణ ఉండేది. ట̲ దంతమూలీయం, ట మూర్ధన్యం. అనునాసికం తరవాత స్పర్శాలన్నీ నాదవంతాలయ్యేవి [గ జ డ ద̲ ద బ] అని వర్ణరచనలో /పకల్/ /పొఞ్క్-/ ఉచ్చారణలో [పగల్], [పొఞ్గు] అని భావించాలి. ఈ రకమైన రాత ఇంకా తమిళంలో నిలిచిఉంది.

**16.2.** **ప్రాక్తెలుగు :** తెలుగు చారిత్రక స్థితికి రాకముందు పైనిరూపించినవి గాక మరికొన్ని ధ్వనుల మార్పులు జరిగాయి.

(3) *యా > ఏ/#—

పదాదియకారపరంగా వచ్చిన *ఆ తెలుగులో ఏ గా కనిపిస్తుంది. ఉదా. *యాన్ > ఏను, *యానయ్ > ఏనుఁగు, *యాళ్ > ఏలు, మొ. వి. యకారం లోపిస్తుంది (§2.8.)

(4) * ఞా > నే/నా/#—

పదాది *ఞా, నే/నాలుగా మారుతుంది. ఞాన్ > నేను/నా-, *ఞాజ్క్ఌల్ > నాజ్గలి > నాఁగలి (§2.25).

(5) $హ_1హ_1$ > $హ_1$/ {దీర్ఘాచ్చు/అనునాసికం}—

ద్విరుక్తహల్లు దీర్ఘాచ్చుకు పరంగా ఉన్నా, అనునాసికానికి పరంగాఉన్నా అద్విరుక్త మౌతుంది, ఉదా. *అట్టమ్ > ఆట (ము), *పాట్టు > పాట; *తోణ్ట్ట- > తోణ్ట > తోఁట, *వేణ్ట్ట- > వేణ్ట > వేఁట, *ఇన్ప్పు > ఇంపు. అచ్చ తెలుగులోని శ్వాసస్పర్శాలన్నీ ప్రా. ద్రా. ద్విరుక్త స్పర్శాల నుంచి ఏర్పడ్డవి.

(6) *అయ్ > ఏ/# (హ)—

ధాతుగత *అయ్, తెలుగులో ఏ అవుతుంది. *కయ్ > *కే- > చే-, *అయ్మ్- > ఏను ('5'), ఐదు.

(7) *క > చ / # —తాలవ్యాచ్చు.

తాలవ్యాచ్చు పరంగా ఉన్న కకారం చకారం అవుతుంది. ఉదా. *కెయ్ > చేయు, *కెవి > చెవి, *కిళి > చిలుక, మొ. (§2.15) వర్ణవ్యత్యయ సూత్రాలుగూడ ప్రాక్తెలుగు దశకు చెందినవే (§2.18). అచ్చుల మధ్య ప్రా.ద్రా. దంతమూలీయ ట్ర వర్ణం-ఱ-గా ఉచ్చరించటంగూడా అప్పటిదే. క్రీ. పూ. 4 వ శతాబ్దినుంచే తెలుగుకు సంస్కృత ప్రాకృత సంపర్కం ఏర్పడి ఉంటుంది. అందువల్ల ఒత్తక్షరాలు, శ ష హాలు తొలి తెలుగుదశకే ప్రత్యేకవర్ణాలుగా చేరాయి. పదమధ్య గసడదవలతో పాటు పదాది సరళాలు ఏర్పడటం (§2.19) తో శ్వాసనాదభేదం వర్ణాత్మక (phonemic) మైంది. వర్ణవ్యత్యయంవల్ల *అవన్డు > వాన్డు [= వాణ్డు], *అవర్ > వారు, *అత్-అన్-ఇ [అదని] > దాని. *ఇత్-అన్-ఇ [ఇదని] > దీని, మొ. సర్వనామరూపాలేర్పడ్డాయి. *అవర్ ప్రా. ద్రా. లో

కేవలంపురుషవాచకశబ్దాలకు బహువచనంలో వాడేవారు; అదితెలుగులో మహద్బహు వచనమైంది. -అర్/-వర్ ప్రత్యయం మహత్తు (స్త్రీ పురుష) బహువచన ప్రత్యయంగా కొన్ని శబ్దాల్లోను, సంఖ్యావాచకాల్లోను మాత్రం నిలిచింది, ఉదా. ఎవ్వరు, అల్లురు, మల్లురు, మూవురు, ఇరువురు, మొ. వి. 'లు' సామాన్య బహు వచన ప్రత్యయంగా ఉండేది.

**16.3.** ప్రేరణార్థంలో వచ్చిన -ఇంచు/-పించు ప్రత్యయాలు అనుచిత విభాగంవల్ల ఏర్పడ్డవి. ప్రా. ద్రా. లో *వి/*ప్పి ప్రేరణ ప్రత్యయం. భూతభవి ష్యత్తుల్లో దీనికి పరంగావచ్చే ప్రత్యయాలు *-న్ త్త్-, *-మ్ప్- అని ఉండేవి. తాలవ్యాచ్చు ప్రభావంవల్ల దంత్య 'త్త', 'చ్చ'గా మారింది.

| ప్రా. ద్రా. | తమిళం | తెలుగు |
|---|---|---|
| (భూ.) కెయ్-వి-న్ త్త్- | చెయ్-వి-త్త్- | చెయ్-వి-న్ చ్- |
| (భ) కెయ్-వి-మ్ప్- | చెయ్-వి-ప్ప్- | (> చేయించ్-) |
| | | చెయ్-వి-మ్ప్- |
| | | (> చేయింప్-) |
| (భూ) నట-ప్పి-న్ త్త్ | నట-ప్పి-త్త్- | నడ-పి-న్ చ్- |
| (భ) నట-ప్పి-మ్ప్- | నట-ప్పి-ప్ప్- | నడ-పి-మ్ప్-. |

ప్రాచీనభాషలో-ఇందులోని 'చు' భూతేతర ప్రత్యయాలు (ముజ్ఞిత్తులు) పరంగా ఉన్నప్పుడు 'పు' కావటానికి కారణం 'ంచు' 'ంపు' లు ప్రా. ద్రా. లో కాల బోధక ప్రత్యయాలు కావటమే. ప్రత్యయ ద్విరుక్తివల్ల సకర్మకక్రియ లేర్పడే ప్రక్రియ ప్రాక్తెలుగులోనే నశించింది. (§ 2.42). క్త్వార్థకంలో ప్రా. ద్రా. లో ఉన్న *ఇ, *చ్చి/చి ప్రత్యయాల్లోని చత్వసత్వాలు ధాతుగతాలై 'ఇ' ఒక్కటే క్త్వార్థక ప్రత్యయంగా పరిగణించ బడ్డది. విన్-ఇ, నిల్-చి, విన్-అక, నిల్-అక రూపాలను పోల్చిచూస్తే 'చి' లో 'చ' ధాతు భాగంగా పరిగణించటం అర్వాచీన మని తెలుస్తుంది; చేసి, కోసి, మొ. చోట్ల గూడా ప్రప్రథమంలో 'సి' ఏ క్త్వార్థక ప్రత్యయం (§ 2.46) ప్రా. ద్రా. నుంచి ద. ద్రా. శాఖలద్వారా తెలుగులో ఏర్పడ్డ ధాతుప్రత్యయ నిర్ణయం ఇంకా శాస్త్రీయంగా సమగ్రంగా జరగలేదు. ధ్వనుల మార్పులను గురించి మనకు తెలిసినంత నిష్కర్షగా ఇంకా ఈ భాగం తెలియదు.

**16.4.** తెలుగు దక్షిణ ద్రావిడభాషల నుంచి ఎప్పుడు వేరుపడ్డదో గట్టిగా చెప్పలేము గాని క్రీ. పూ. 5, 6 శతాబ్దులకే తెలుగు ప్రత్యేక భాషగా ఏర్పడట్లు తెలుస్తుంది. ప్రాక్తెలుగు స్థితిలోనే కూయి, కువి, గోండి మొ. సోదర భాషలు తెలుగునుంచి పదాలను ఎరవు తెచ్చుకొన్నట్టు ఆధారాలున్నాయి, ఉదా.

*ద. ద్ర. I:* మ. *చేఋ*, కోత. *కేర్*, తొద *కోఙ్*, క. *కేఋ*.

*ద. ద్రా.* II ; తె. *చెరుగు, చేట* ; గోం. *సేతి, హేతి, ఏతి*; *హేచ్*, *ఏచ్* = చేట; కూయి *సేసి*, కొండ *సేజ్లి*, పెంగొ, కువి, మండ *హేచి* = చేట.

*మ. ద్రా:* కో. *కేద్* = చెరుగు, నా. *కేద్* ; *కేత్* = చేట; ప. *కేద్* / *కేడ్* = చెరుగు ; *కేతి* /*కేటి* = చేట ; ఒల్లారి, గదబ *కేయ్* = చెరుగు, *కేటి*, *కేటెన్* = చేట.

*ఈ. ద్రా:* కు. *కేఁస్* — = చెరుగు, *కేఁతెర్* = చేట ; మా. *కేస్* = చెరుగు ; *కేత్‌ను* = చేట.

పై పదకుటుంబానికి ప్రాచీన ద్రావిడ మాతృకలో రూపాలు : కేట్ర్ -: కెట్టు-(క్రి.), కేట్ర్ ట్ర్ -(నా.). ఇక్కడ 'ట్ర' దంతమూలీయం. ప్రా.ద్రా. 'క' తాలవ్యాచ్చుల ముందు 'చ' గా మారటం ప్రాక్తెలుగు దశలోనే జరిగింది. (చూ. సూత్రం 7 పైన), ద్విరుక్త దంతమూలీయ 'ట్ర' తొలితెలుగు దశలో మూర్ధన్య 'ట' గా మారింది.

(8) (a) ట్ర ⊳ అ / అ—అ.

(b) ట్ర్ ట్ర ⊳ ట్ట.

అచ్చులమధ్య వచ్చే *ట్ర, అగా మారింది ; ద్విరుక్తత ఉన్నప్పుడు దంతమూలీయం మూర్ధన్యమైంది. అందువల్ల *కెట్రు-> చెఱుగు, *కేట్ర్‌ట ⊳ * చేట్ట ⊳ చేటగా ఏర్పడ్డాయి. కఱచు : కాటు, ఊఱు: ఊట, ఏఱు: ఏటి, మొ. ఇంటల్లో అ/ట లకు జనకవర్ణం దంతమూలీయ 'ట్ర' వర్ణం. తాలవ్యీకరణం తెలుగు, తమిళ, మలయాళాల్లోనే జరిగింది. అప్పుడు గోండి, కూయి, కువి, పెంగొ, మండ-భాషల్లో 'క' కారయుక్త రూపాలే ఉండాలి. కాని సకారాది రూపాలే కనిపించటంవల్ల ఈ పదం తెలుగునుంచి ఎరవుతెచ్చుకొన్నదై ఉండాలి, ఈ భాషల్లో దంతమూలీయ *ట్ర్ ట్ర స/చ లుగా మారుతుంది. చూ. కూయిసేసి, కువిహేచి; గోండీలో *ట్ర్ ట్ర, త అవుతుంది, చూ. సేతి. అంటే ఈ భాషలు తెలుగునుంచి ఎరవుతెచ్చుకొన్నప్పుడు

ఆ మాట *చేట్ట్ టు అనే రూపంలో ఉండి ఉండాలి. (7)వ సూత్రం వర్తించి (8) వ సూత్రం ఇంకా వర్తించక ముందున్న తాలవ్యీకృతరూపం, గోండి, మొ. సోదరభాషల్లోకి పోయి ఉంటుంది. అందువల్ల తెలుగులోలాగా పదాది 'చ' కార ఛాయలు కనిపిస్తున్నా, దంతమూలీయ హల్లుకు ఆయా భాషల్లో పొందే సహజపరిణామాలే గోచరిస్తున్నాయి. (8) వ సూత్రం ప్రవర్తించిన తరవాత ఈ మాటను ఎరువుతీసుకొంటే 'సేట' అనే ఈ భాషల్లో నిలచేది. దీన్నిబట్టి తెలుగు, గోండీ, కూయి, మొ. భాషలకు ప్రాక్తెలుగు స్థితిలోనే సన్నిహితంగా ఉండేదని తెలుస్తుంది. తెలుగు, తమిళ, కన్నడాలమధ్య జరిగిన ఆదాన ప్రదానాలు చారిత్రక కాలంలోనివే గాని ప్రాక్తెలుగుదశకు చెందినవికాదు.

**16.5.** తెలుగు చరిత్రను పరిణామ దృష్టితో నాలుగు దశలుగా విభజించవచ్చు. (1) క్రీ. శ. 200-700 ; (2) క్రీ. శ. 700–1200 ; (3) క్రీ. శ. 1200–1600; (4) క్రీ. శ. 1600–1900. ధ్వనుల్లోను ప్రకృతి ప్రత్యయ స్వరూపంలోను ప్రధానమైన మార్పులు పై యుగాల్లో కనిపిస్తాయి. కావ్య సాహిత్యం నన్నయకాలానికి అయిదారు శతాబ్దుల ముందే తెలుగులో ఏర్పడి ఉండాలి. శాసనస్థమైన వ్యవహారభాషకు–నన్నయకాలపు సాహిత్యభాషకు గుర్తించదగినంత వ్యత్యాసం కనిపిస్తుంది. కావ్యభాష వ్యవహారభాష పరస్పరం ప్రభావితాలైన ఆధారాలు మొదటినుంచీ మనకు గోచరిస్తున్నాయి. 15 వ శతాబ్దిదాకా శాసనాల్లో బహుళప్రయోగంలో ఉండి కావ్య భాషలో విరళంగాఉన్న వాడుకలు వ్యవహారభాషకు చెందినవి; అలాగే కావ్యభాషలో బహుళంగా ఉండి శాసనాల్లో విరళంగా ఉన్నవి కావ్యభాషకు సాంప్రదాయికంగా సంక్రమించినవిగా గుర్తించాలి. ఆదీగాక, వ్యవహారంలో వచ్చిన మార్పులు శాసన భాషలో క్రమబద్ధంగా కనిపిస్తాయి. కావ్యభాషలో మార్పులు వచ్చినచోట అవి వ్యవహారభాషా ప్రభావంవల్ల వచ్చినవిగానే గుర్తించాలి. 'చేసెదరు' కావ్యభాషలో ప్రమాణరూపం. తత్సదృశమైనది ఒకప్పుడు వ్యవహారంలోగూడా ఉండేది. అది కాలాంతరంలో 'చేసేరు'గా మారింది. 16 వ శతాబ్దినుంచి, 'చేసేరు, చేసెదరు' రెండు రూపాలూ అర్వాచీన ప్రబంధాల్లోను, యక్షగానాల్లోనూ కనిపిస్తాయి. ఈ ద్వైవిధ్యం వ్యవహారంలో వచ్చిన మార్పును కావ్యభాషల్లో ఎక్కించటంవల్ల ఏర్పడ్డది. వ్యవహారభాష సహజంగా మారుతుంది ; కావ్యభాష తనంతటతాను మారదు.

వ్యవహారభాషలో వచ్చిన ధ్వని పరిణామాలు శాసన భాషలో ప్రతిబింబిస్తాయి. 'ట' కారం అచ్చులమధ్య 'డ' అవుతుంది. ఈ మార్పు ఏ ఒక్క మాటలో వచ్చినట్లు శాసనాల్లో కనిపించినా స్థూలంగా కాలనిర్ణయం సాధ్యమౌతుంది. కొంత కాలం వాడుకలో మార్పువచ్చిన తరవాతనే రాతలో మార్పువస్తుంది. ఉచ్చారణ మారినా లేఖనం సాంప్రదాయికంగానే కొన్ని శతాబ్దులు సాగవచ్చు. కాని ఒక వర్ణం మరొక వర్ణంగా పూర్తిగా మారిన తరవాత లేఖకులకు సంప్రదాయ జ్ఞానం తగ్గుతుంది. తత్ఫలితంగా విలోమలేఖనం (inverse spelling) జరుగుతుంది. ఒక కాలంలో 'ట, డ' లు వేరుగా ఉచ్చరించేవారు, రాసేవారు; ఉదా. 'ఏటు', 'వాడ'. 7వ శతాబ్దిలో 'ట' డ గా మారింది. చాలాచోట్ల 'ఏ టు' రాస్తున్నా, ఎక్కడన్నా ఆ తరవాత ఒక లేఖకుడు 'ఏడు' అని రాయవచ్చు. దీన్నిబట్టి అంతకు ముందే ట > డ ఆరంభమైందని గుర్తిస్తాము. కొంతకాలం తరవాత 'ఏడు' అని రాయటం బహుళంగాను, 'ఏటు' అని రాయటం విరళంగాను జరుగుతుంది. ఇంకా కొంతకాలం జరిగిన తరవాత సంప్రదాయం నిలబెట్టాలని ప్రయత్నించే ఒక లేఖకుడు 'ఏడు, వాట' అని రాస్తాడు. అంటే ఏ మాటలో 'డ' ట నించి చారిత్రకంగా వచ్చిందో, ఏది శబ్దసిద్ధమైన 'డ' కారమో గుర్తించే జ్ఞానం క్రమంగా తగ్గి 'డ' రాయవలసినచోట 'ట' రాయటం విలోమలేఖనం అంటారు. శకటరేఫసాధురేఫల చరిత్రలోను ఇలాంటి పరిణామమే కనిపిస్తుంది. లేఖనంలో ఉన్న గుర్తులన్నిటికీ ప్రత్యేకోచ్చారణలు సమకాలంలో ఉండేవని ఊహించగూడదు. గుణంగా ఉన్న సంప్రదాయము చారిత్రకంగా దోషం అయినప్పుడు మార్పు పూర్తి అయిందని గుర్తించాలి.

**16.6.** ధ్వనులు : తొలి తెలుగుదశలో (క్రీ. శ. 700 దాకా) దేశ్య వర్ణాలు : ' /క గ చ జ ట డ ణ త ద న ప బ మ య ర ఱ ల ళ వ స ఴ/ (21 హల్లులు), /అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఒ ఓ/ (10 అచ్చులు) ఉండేవి. అప్పటికే సంస్కృత ప్రాకృతాల ప్రభావంవల్ల మహా ప్రాణవర్ణాలు (10), శ ష హలు (3) తెలుగులో చేరాయి. ఈ వర్ణాల్లో 7 వ శతాబ్దిదాకా అట్టే మార్పులు రా లేదు. 7-9 శతాబ్దులమధ్య భాగంలో ఎన్నో రకాల ధ్వని పరిణామాలు తెలుగులో మొదలై ఆ తరవాతియుగంలో దేశం అంతటా వ్యాపించాయి.

(9) (a) ట > డ/ (1) # —
/ (2) ● - అ

అచ్చుల మధ్య, వర్ణవ్యత్యయం కారణంగా పదాదిన 'ఱ', 'ద'గా మారింది. అచ్చు (< *అఱ్-చ్చు) (క్రీ.శ. 882) >దచ్చు, ఏఱు (క్రీ. శ. 725), ఏడు (క్రీ. శ. 798) (§ 3.3). రాతలో 13వ శతాబ్దిదాకా 'ఱ' కనిపిస్తుంది; కళింగ మండలంలో ఎక్కువగా లేఖనంలో నిలిచిపోయింది. 12వ శతాబ్దిలోనే విలోమలేఖనం వల్ల నిఱు (< నిడు), విహారవాఱ (< విహారవాడ) వంటి రూపాలు కనిపిస్తాయి (§ 4.3).

(b) ఱ > ర/ # హ —

వర్ణవ్యత్యయం కారణంగా పదాదిహల్లుకు పరంగావచ్చే 'ఱ', 'ర' గా మారుతుంది. ఈ మార్పు గూడా 8వ శతాబ్దికే ఏర్పడ్డట్లు తెలుస్తున్నది. ఉదా. క్ఱొచ్చె (700-725), క్రొచ్చె (925-50) (§§ 3 9, 4.29). దీనికి ప్రాక్తెలుగు రూపం *కొఱ్చ్చె < *కొఱుచ్చె అయి ఉండాలి.

(10) ఱ > ర

శకటరేఫ సాధురేఫగా ఉచ్చరించటం ఏడో శతాబ్దికే కొన్నిచోట్ల మొదలై ఉంటుంది; ఉదా. ఇరుకుటూరు (క్రీ. శ. 669), చిట్టేరు (క్రీ. శ. 763). 11వ శతాబ్ది దాకా ర-ఱల భేదం రాతలో నిలబెట్టే ప్రయత్నం లేఖకులు చేశారు. 'ఱ' బదులు 'ర' రాయటం 12 వ శతాబ్ది నుంచి ఎక్కువై 15, 16 శతాబ్దులకల్లా విలోమలేఖనాల సంఖ్య పెరుగుతుంది. 17వ శతాబ్దిలో 'తుఱక' శబ్దం శాసనాల్లో ఉంది. ఈ మార్పు మధ్యాంధ్రంలో మొదలై ఇతర ప్రాంతాలకు వ్యాపించినట్లు కనిపిస్తుంది (§§ 3.14, 5.12, 6.9). స్పర్శహల్లు పరమైనప్పుడు ఱ ⟶ ర మార్పు మరీ ప్రాచీనమై ఉంటుంది; తూఱ్పు (క్రీ. శ. 675), తూర్ప్వఁాన (క్రీ. శ. 641) (§ 3.19). బహుశా అదేకాలంలో హల్పరక 'ఱ' గూడా 'ర' అయి ఉంటుంది, *త్ఱోవ>త్రోవ (క్రీ. శ. 945).

(11) [ణ / ళ] > [న / ల] / # అ — అ

దేశ్య శబ్దాల్లో అచ్చులమధ్య వచ్చే మూర్ధన్య ణ, ళలు క్రమంగా దంతమూలీయ 'న, ల'లుగా మారిపోవటం 8 వ శతాబ్దినుంచి కనిపిస్తుంది. కొణి > కొని, ఏళన్ > ఏలన్, పణి > పని, పళ్ళి (క్రీ. శ. 669) > పల్లి (క్రీ. శ. 764) (§ 3.15-18).

(12) న్ట > ణ్డ.

ఉదా. కొన్టూరి (క్రీ. శ. 700), తాన్టి కొన్ట (క్రీ. శ. 395-410); కొణ్డ (క్రీ. శ. 742-98), ఇక్కడి 'ట' వర్ణం చారిత్రకంగా దంతమూలీయ డ వర్ణం.

(13) φ > డ/న—ర

సంధివశాన న-రల సంయోగం వచ్చినపుడు వాటిమధ్య అంతకుముందులేని 'డ' ఉచ్చారణ సౌలభ్యానికి చేరుతుంది: పంద్రెండు (క్రీ. శ. 625-50), వాణ్డ్రు (క్రీ. శ. 1084). వీటి పూర్వరూపాలు *పన్-రెండు, *వాన్-రు అయిఉండాలి.

(14) ం > ఁ / # { ...అ / ఆ } — హ

దీర్ఘాచ్చుపైన, అపదాది హ్రస్వాచ్చుపైన వచ్చే అనుస్వారం (వర్గానునాసికం) అనునాసిక్యం (nasalization)గా మారుతుంది. ఈ మార్పు 19వ శతాబ్దినుంచి కనిపిస్తుంది. (§§ 3.22-23). లేఖన చిహ్నంగా అర్ధానుస్వారం చాలా ఇటీవలిది. అనుస్వారం వర్గానునాసికాల స్థానంలో రాసే అలవాటు క్రీ. శ. నాలుగు శతాబ్దిలో మొదలై 12వ శతాబ్దికల్లా స్థిరపడ్డది. నిండు సున్నకు అనునాసికోచ్చారణ ఉన్న చోట పరహల్లును ద్విరుక్తంగాను, అర్ధానుస్వార (ఆనునాసిక్య) ఉచ్చారణ ఉన్న చోట అద్విరుక్తంగాను రాసే వాడుక వాటి పరస్పర భేద సూచకమైంది, ఉదా. సుంక్కము (క్రీ. శ. 1600), తోఁటలు (క్రీ. శ. 1604). ఈ సంప్రదాయం 17వ శతాబ్దికి స్థిరరూపం పొందింది (§ 6.15).

(15) —క—, చ, త, —ప— > —గ—, స, ద, —వ— / # ప్రథమావిభక్త్యంత పదం # —

ఈ మార్పు 7వ శతాబ్ది నుంచి శాసనభాషలో కనిపిస్తుంది. నిత్యసంధిగా కావ్యభాషలో ప్రవర్తించినా వాడుకలో స్వత్వరూపంలో ఉన్న ఉదాహరణలు గూడా ఎన్నో ఉన్నాయి (§§ 3.25, 4.26).

(16) ర > φ / # హ—

వర్ణవ్యత్యయం వల్ల ఏర్పడ్డ పదాది సంయుక్త హల్లుల్లో రెండోదిగావచ్చే ర వర్ణం

(< *ర, ట్ర, ఱ) లోపించటం 10, 11 శతాబ్దుల్లో మొదలైంది. గొచ్చి (10 శతా.), మాని (క్రీ. శ. 1062). కాని కావ్యభాషా ప్రభావంవల్ల ఈ మార్పు మొదట విరళంగానే కనిపిస్తుంది(§ 8.9). 14వ శతాబ్ది తరవాత 'రావడి' లేని రూపాలు విరివిగా శాసనభాషలో దొరుకుతాయి, ఉదా. కొత్త, కింద (§§ 4.16, 5.13, 6.14). ఇప్పటికీ క్రొత్త, క్రిందలాటి శబ్దాలు రచనలో ఉండటం కావ్య భాషా ప్రభావంవల్లనే అని గుర్తించాలి. సంయుక్త హల్లుల్లో మొదటి వర్ణం వకారమై, ర పరంగా వచ్చిన అచ్చు 'ఆ' అయినప్పుడు, వకారమే లోపిస్తుంది. ప్రాక్తెలుగు *వరాదు > రాదు; వ్రాయు > రాయు.

(17) ద > ద / #__

పదాది దకారం (> *ట, *ఱ) 11వ శతాబ్దికి ముందే దకారంగా మారింది. ఉదా. దున్ను (క్రీ.శ. 1314), డున్ను (క్రీ.శ. 1213) (§4.9), దగ్గర, దొంగ, దాగు, దంచు, మొ. శబ్దాల్లో ఉన్న 'ద'కు పూర్వరూపం డ. ఈ సూత్రానికి డెబ్బది >డెబ్బై అపవాదం. నన్నయ నన్నెచోడుల రచనల్లో రెండు రూపాలు కనిపిస్తాయి. (§ 7.8).

(18) (a) ఇయ > ఎ / # ... — #
(b) ఎ > ఇ / # ... — #

కొన్ని నామపదాల్లో ప్రథమేతరాక్షరాల్లో (సామాన్యంగా పదం చివర) వచ్చే ఇయ, 'ఎ'గా మారుతుంది; ఉదా. నూనియ > నూనె (క్రీ. శ. 1600) > నూని, గొఱియ > గొఱె/గొఱ్ఱె > గొఱి (క్రీ.శ. 1600) (§6.8(e)). 14, 15 శతాబ్దులవరకు మధ్యాంధ్రంలో 'ఎ'అని ఉన్నప్పుడు, శ్రీకాకుళం, విశాఖల్లో 'నూన్య, చెల్యలు' అనిరాసేవారు (§ 4.60). ఇక్కడి 'య' బహుశా వివృతమైన 'ఎ'కారానికి గుర్తేమో! ఇప్పుడు మనం పళ్ళేలు' అని ఉచ్చరించే మాటను శాసనాల్లో పళ్యాలుఅని రాశారు (§ 5.7), 'ఇయ' కు 'య' ఆదేశంగా రావటం 11, 12 శతాబ్దుల్లోనే కనిపిస్తుంది. దివియ > దివ్య (క్రీ.శ. 1081) (§8.20). 17వ శతాబ్దినుంచి 'ఎ/ఇ'లే ప్రాచీన 'ఇయ' స్థానంలో వస్తాయి. వివృతాచ్చు రూపాలు ('ఎ'తో ఉన్నవి) దక్షిణాంధ్రంలోను, సంవృతాచ్చు ('ఇ') తో ఉన్నవి ఉత్తరప్రాంతంలోను కనిపిస్తాయి (§ 5.7). ఇప్పుడుగూడామధ్యాంధ్రంలో గిన్నె, గొర్రె, గంటె, మొ. మాటలకు సరిగా శ్రీకాకుళం విశాఖపట్నం మాండలికంలో గిన్ని, గొర్రి, గంటి అనే ఉచ్చారణలు నియతంగా వినిపిస్తాయి.

(19) డ ⟶ ళ / # ... — + {ల, ళ}

బహువచన ళు(=లు) ప్రత్యయం పరమైనప్పుడు పూర్వాన ఉన్న 'డ' వర్ణం అజ్లోపంతో 'ళ' వర్ణంగా మారుతుంది, గుడి+లు > గుడ్లు (7 వ శతాబ్ది) > గుళ్ళు (క్రీ. శ. 1381). రాతలో 'డ్లు' రాసినా 'ళ్ళు' గానే ఉచ్చరించేవారేమో మనకు తెలియదు; కాని శాసనాల్లో 'ళ్ళు' రాయటం 12 వ శతాబ్దితరవాత ప్రచురంగా కనిపిస్తుంది (§§ 3.32 4.28, 5.21).

(20) అం ⟶ ఆ / # ... — + {ళు, లు, న}

బహువచన ళు/లు, ఆగమనవర్ణం పరమైనప్పుడు విశేష్యాల చివరి అం (= అము), ఆ గా మారుతుంది. నరకా– నం (క్రీ. 1008\, భోగా–నకు (క్రీ.శ. 1060), కుంచా–లు (క్రీ.శ. 1088) వర్షా–లు (క్రీ. శ. 1091). ఈ మార్పు శాసనభాషలో 11వ శతాబ్దినుంచి కనిపిస్తున్నా అంతకుముందే (9/10 శతా.) మొదలై ఉంటుంది. ఇదిగూడా ఉచ్చారణలో వచ్చిన మార్పే. పుస్తకములు, వర్షములు లాటి రూపాలు 10 శతాబ్దులకు ముందే ఇప్పటి భాషలోలాగా పుస్తకాలు, పుస్తకానికి, వర్షాలు, వర్షానికి లాగా మారిపోయినట్లు గుర్తించవచ్చు (§ 3.32). ఇది నేటిభాషకు కూడా వర్తించే సంధి సూత్రం.

12 వ శతాబ్ది తరవాత కేవలం ఉచ్చారణకు సంబంధించిన మరికొన్ని మార్పులు శాసనరచనలో కనిపిస్తాయి. వీటివల్ల వర్ణనిర్మాణంలో భేదం అట్టేరాదు. పై నిరూపించిన మార్పులను phonemic changes అంటారు; కింద నిరూపించేవి phonetic changes మాత్రమే.

(21) ϕ ⟶ {య / — {ఇ, ఎ} —; వ / — {ఉ, ఒ} —} / #—

ఉచ్చారణలో పదాది తాలవ్యాచ్చులముందు 'య', ఓష్ఠ్యాచ్చులముందు 'వ' చేరటం మొదటినుంచీ దక్షిణ ద్రావిడ భాషల్లో కనిపిస్తుంది; ఉదా. యేళు (క్రీ. శ. 719-20), వుద్దిని (క్రీ. శ. 972). తెలుగు మాటల్లో ఈ స్థానంలో పదాదియవలకు

వర్ణసిద్ధి లేదు. శాసనాల్లో ఇవి కలిసిన రూపాలు కలవని రూపాలు గూడా అన్ని శతాబ్దుల్లోనూ కనిపిస్తాయి; ఉదా. కొట్టరువు ఎఱియమ (క్రీ. శ. 1163) (§§ 3.26, 4.24, 5.5).

(22) ⁻చ⁻ ⟶ ⁻చే⁻ / —తాలవ్యేతరాచ్చు
-జ- -జే- /

అ ఆ ఉ ఊ ఒ ఓ ల ముందు చే జే అని ఇ ఈ ఎ ఏ ల ముందు చ జ అని ఈనాడు ప్రమాణభాషలో ఉన్న ఉచ్చారణ 11వ శతాబ్ది నుంచే గుర్తించినట్టు ఆధారా లున్నాయి. /చ చే/ లు, /జ జే/ లు సవర్ణాలు. వాటిని ప్రత్యేక సంకేతాలతో సూచించ నక్కరలేదు. దంత్యోచ్చారణ నిర్దేశించటానికి 'త్స', తాలవ్యోచ్చారణకు 'ఎత్వం' కలిపి రాయటమూ ఈ భేదం ఉన్నదనటానికి ఆధారం; ఉదా. మొదత్స (క్రీ.శ. 1018), పత్సలు (? 14 శతా), పుత్సుకొని (క్రీ.శ. 1393), ఆ చెంద్రాకఞ స్థాయి (క్రీ.శ. 1697) (§§ 3.4, 5.2-3. 11, 6.4, 13). స, శ లఉచ్చారణ గూడా నేటి తెలుగులాగా తారుమారుగావటం 14, 15 శతాబ్దుల్లోనే మొదలై ఉంటుంది; ఉదా. సెనివారానను (క్రీ. శ. 1418), స్యూర్యదృలు (క్రీ. శ. 1692), శెంఖు, మొ. వి. తత్సమపదాల్లో 'చ' ను 'చె' గానే ఉచ్చరించేవారు, ఉదా. హరి శ్చెంద్ర (క్రీ. శ. 1596), ఆ చెంద్రార్క (క్రీ. శ. 1503) (§ 5.2, 3).

(23) స ⟶ శ /—తాలవ్యాచ్చు.

పడశిన (క్రీ. శ. 1273), చేశిన (క్రీ. శ. 1290), చేశెను (క్రీ. శ. 1494), శావ (క్రీ. శ. 1574) (§§ 4.18, 5.18, 6.28(g)) ఈనాటి ఉచ్చారణకు ఏడు శతాబ్దుల చరిత్ర ఉందని పై ఉదాహరణలవల్ల తెలుస్తుంది.

(24) ఏ ⟶ ఏ̱ / # —హ అ

పరాక్షరంలో అత్వం ఉన్నప్పుడు ధాతుగత 'ఏ' వర్ణం ఉచ్చారణలో వివృతమై ఏ̱ ('Cat' లో ఉన్న అచ్చులాగా) అవుతుంది. ఇది 15, 16 శతాబ్దుల శాసన రచనల్లో కనిపిస్తుంది. ప్రత్యేక వర్ణత్వం లేకపోవటంవల్ల 'యా' గాను, కొన్ని చోట్ల 'అ' గాను ఇది రాతలో సూచించబడ్డది; ఉదా. పండితుల చాత (క్రీ.శ. (9546), (< సేవ; క్రీ. శ. 1574), మ్యేరకు (క్రీ శ. 1638) (§§ 5.3. 6.8(c)). పళ్యాలు (క్రీ. శ. 1518) పదాన్ని ఈనాడు కోస్తా జిల్లాల్లో ఉచ్చరించి నట్లు (పళ్ శ్రే లు అని) ఉచ్చరించి ఉండవచ్చు (§ 5.7).

(25) దీర్ఘాచ్చు + య → హ్రస్వాచ్చు + య్య

అకారేతర ధాతు గతాచ్చుకు య పరంగా ఉన్నచోట్ల పై సూత్రం వర్తిస్తుంది. దీనికి ఆధారాలు 15వ శతాబ్ది నుంచి వాడుక భాషలో కనిపిస్తాయి, ఉదా. పొయ్యం గలారు (క్రీ. శ. 1403), ఇయ్యం గలారు (క్రీ. శ. 1403), చెయ్యక (క్రీ. శ. 1585) (§ 5.14).

(26) వ → $\phi$ / # —తాలవ్యాచ్చు

తెలుగులో పదాది వకారం అ ఆ, ఇ ఈ, ఎ ఏ ల ముందే వస్తుంది. ఇ ఈ, ఎ ఏ ల ముందు వకారలోపం నేడు పామరభాషలో వినిపిస్తుంది. వెండి, వేడి, విల్లు, వీధి > యెండి, యేడి, యిల్లు, యీది. ఈ మార్పు శాసన రచనలో 15 శతాబ్దికే ఉన్నట్టు తెలుస్తున్నది; ఉదా. ఇండ్లు < విండ్లు (క్రీ. శ. 1403), ఎలుంగను < వెలుంగను (క్రీ. శ. 1416) (§ 5.17). ఇది పామర వ్యవహారమని కేతన (§ 7.10, 5).

**16.7.** ఒ/వ ల మార్పు గూడా 17వ శతాబ్ది నుంచే ఉంది, ఉదా. వద్దు/ఒద్దు, ఒక/వక (§ 6.8(b)). హ్మ, హ్న లను మ్హ, న్హ లుగా ఉచ్చరించటం 12వ శతాబ్ది నుంచి కనిపిస్తుంది. ఉదా. బ్రాంహలు, వన్హి (§ 6.8(I)). థ/ధ ల భేదం 17 వ శతాబ్దికే నశించింది, ఉదా. పృధివి, అర్థసమస్య (§ 6.9(b)); ఇది ప్రాఙ్నన్నయ కాలంలోనే మొదలైంది (§ 7.10, 8). తత్సమాల్లో 'ఋ' వర్ణాన్ని తెలుగులో మొదటినుంచీ రి/రు గానే ఉచ్చరించేవాళ్ళు. ఉదా. రిషభ (క్రీ. శ. 1158), ప్రుదివి (క్రీ. శ. 1259). నన్నయ ఋ/రి యతిని, తిక్కన ఋ/రు యతిని పాటించారు (§§ 4. 7, 5. 4, 7. 5, 1). అచ్చుల మధ్యన మకారాన్ని అనునాసిక వకారంగా ఉచ్చరించటం 17 వ శతాబ్దికే కనిపిస్తుంది, ఉదా. మావిడి (§ 6.8 (f)). అరబ్బీ, పారశీకాల ప్రభావంవల్ల అన్యదేశాల్లో *f*, *x*, *y*, *z* మొ. కొత్త ధ్వనులు తెలుగులో చేరాయి. కాని వీటిని ఎప్పటినుంచి ప్రత్యేక వర్ణాలుగా ఉచ్చరించేవారో మనకు తెలియదు (§6.8(f), § 8.3). '*f*' ను 'ఫ' గ రాస్తున్నా 16 వ శతాబ్ది తరవాత కొందరైనా దాన్ని ప్రత్యేకవర్ణంగా పలికి ఉంటారు.

**16.8.** సంధి. సంధి ప్రక్రియలో కావ్యభాషకు వ్యవహారభాషకు తేడాలు మొదటినుంచి కనిపిస్తున్నాయి. సంధి ఉచ్చారణకు సంబంధించిన ధర్మం ; లేఖన

ధర్మం కాదు. వ్యవధానంతో పలికినప్పుడు రెండు పదాలమధ్య ఉత్వసంధి గూడా నిత్యం కాదు. శాసనభాషలో ఈ వైవిధ్యం ఎక్కువగా కనిపిస్తుంది. పదాంత హ్రస్వాచ్చు (అ ఇ ఉ), పరంగా అచ్చుతో మొదలయ్యే పదం వచ్చినప్పుడు, అవ్యవహితోచ్చారణలో లోపిస్తుంది; వ్యవధానం ఉంటే రెండచ్చులూ యథాతథంగా ఉంటాయి. వ్యవధానంలో యడాగమం రావచ్చు. ఉదా. *సంధికి* : ఊర్ణంధు (క్రీ. శ. 663), తమన్న (<తమఅన్న, క్రీ. శ. 1280), మహాదేవైన (క్రీ. శ. 1378), కాంచనంగారనుజుండు (క్రీ. శ. 1482) (§§ 3.24, 4.24, 5.21,). తత్సమ పదాల్లో తెలుగు సంధి క్వచిత్తుగా కనిపిస్తుంది. నీలీశ్వర (§ 3.27) *విసంధికి:* పన్నస ఇరవది (క్రీ. శ. 600), రేనాణ్డు ఏళన్ (క్రీ. శ. 576–600), కొట్టరువు ఎఱియమ (క్రీ. శ. 1163), కొలుపు ఒకటి (క్రీ. శ. 1409), (§§ 3.24, 4.24,). *యడాగమ వడాగమాలకు:* ఇరవదియాదినాల్కు (క్రీ.శ. 600), సత్త్యేరాజు యిచ్చిన (క్రీ. శ. 1152). విచ్చేశివుదయగిరి (క్రీ. శ. 1515), (§§ 3.24, 27, 4.24, 5.21,).

కావ్యభాషలో పరిమిత ప్రవృత్తిగల అచ్సంధి సూత్రాలన్నీ ఆధునికభాషలో ఏకసూత్రంగా సులభీకృతమైనాయి.

$$(27)\ \text{అ} \longrightarrow \Phi\ /\ \ldots\ —\ \#\ \text{అ}\ /\ \text{ఆ}$$

పదాంత హ్రస్వాచ్చు ఏదైనా (అ = అ, ఇ, ఉ, ఎ), పరపదాద్యచ్చు ముందు సంహితలో లోపిస్తుంది. 15, 16 శతాబ్దుల కావ్యభాషలోనే ఈ సూత్రం వర్తిస్తున్నట్టు ఆధారాలున్నాయి; ఉదా. ఇన్నని, నాగవల్లట (§ 8.1). సంధివశాన ఇ + అ ⟶ ఎ, ఇ + ఆ ⟶ ఏ నాలుగైదు శతాబ్దుల కిందటే జరిగిఉంటుంది. మెంత్రాకు, ఏట్రావల, మోవ్రాన వలదె, మొ. చోట్ల వచ్చిన అచ్చు వివృత ఏకారమై ఉంటుంది (చూ. పైన సూత్రం 24). హల్సంధులు గూడా నేటి ప్రమాణ భాషలో ఉన్నట్టుగానే 15, 16 శతాబ్దుల కావ్యాల్లో కనిపిస్తాయి (§ 8.12–13), ఉదా. అడుకొన్కని, ఇంట్లోకి, ముప్పది రెంద్రాగములు, రెణ్ణెల్లు, నెల్లాళ్ళలో (చూ. § 13.6). ప్రథమ మీద గసడదవాదేశం ప్రాచీన కావ్యభాషలో నిత్యంగా కనిపిస్తున్నా శాసనభాషలో వైకల్పికంగానే ఉండేది. ఇది గూడా ఉచ్చారణ వ్యవధానాన్ని బట్టి ఉంటుంది. 8–11 శతాబ్దులలో శాసనాల్లోనూ గసడదవలు వచ్చిన

రూపాలే ఎక్కువ (§§ 3.25, 4.26). ద్రుతం మీద సరళాదేశం శాసనాల్లో నిత్యంగా కనిపించదు (§ 4.28).

**16.9. నామం, నామ విభక్తులు.** ప్రా. ద్రా లో మహదమహద్భేదం ఉండేది. పురుషవాచక శబ్దాలు మహత్తు; ఇతరాలు అమహత్తు (చూ. కృష్ణమూర్తి 1974). ఈ నిర్మాణం ఇంకా ద. ద్రా. ద్వితీయశాఖలోను, మధ్య ద్రావిడ భాషల్లోను నిలిచి ఉంది. స్త్రీ పురుష సమూహాన్ని నిర్దేశించే చోట మహద్బహువచన రూపమే అన్ని ద్రావిడ భాషల్లోనూ ఉంది. ద. ద్రా. I శాఖలో కేవల స్త్రీ సమూహానికి గూడా 'వారు' వంటి రూపం వాచకమైంది. ఈ మార్పు తెలుగులోనూ కనిపిస్తుంది. తమిళాది ద. ద్రా. భాషల్లో, స్త్రీవాచక ఏకవచనరూపం *అళ్ ఏర్పడ్డది. తొలి తెలుగు దశలో మహద్బహువచన ప్రత్యయం- (అ) రు, -వురు; సామన్య బహువచన ప్రత్యయం *-ళు. ఏకవచనంలో కొద్ది మాటల్లోనే లింగ బోధక ప్రత్యయం చేరేది. మహదర్థంలో '-న్డు' (< ప్రా. ద్రా. *న్‌ట్రు), ఏడో శతాబ్దికే '-ణ్డు'గా మారింది, ఉదా. వాన్డు (క్రీ. శ. 600), వాణ్డు (క్రీ. శ. 625-50) (§ 3.35); ణ్డు లోని అనునాసికం లోపించి పూర్వాచ్చు నాశ్రయించిన అనునాసిక్యంగా 15 వ శతాబ్ది దాకా ఉండి తరవాత లోపించింది, వాణ్డు > వాఁడు > వాడు. దేవుడికి (క్రీ. శ. 1247) వంటి రూపాల్ని బట్టి 13 వ శతాబ్దినుంచే అనునాసిక్య లోపం మొదలైనట్టు ఊహించవచ్చు (§ 4.40). మహత్తుల్లో ముకారాంతాలు లేవు. కొన్ని అప్రాణి వాచకాలు *-మ్‌తో అంతమయ్యేవి. ప్రా. ద్రా. *మ్ తెలుగులో ను గా మారింది. మ్రాను, చేను, కొలను మొ. వాటిలో చివరి 'ను' ప్రా. ద్రా. *మ్ నుంచి ఏర్పడ్డది; చూ. తమిళం మరమ్, కయ్, కుళమ్. ము వర్ణానికి రూపాంతరాలుగా మ్బు, మ్మ, మ్' లు గూడా శాసనాల్లోను, కావ్యాల్లోనూ కనిపిస్తాయి. ఉదా. కొట్టంబు (క్రీ. శ. 575-600), దేశము (క్రీ.శ. 650), పురస్సరం (క్రీ. శ. 680) (§ 3.28). బహువచన నామవిభక్తులముందుఅమహత్తు 'ము' లోపించి పూర్వాచ్చు దీర్ఘం కావటం 11 వ శతాబ్దినుంచే జరిగింది (చూ. పైన సూత్రం 20).

మహద్బహువచనంలో -రు ప్రత్యయం మొదట వాడుకలో ఉండి తరవాత తగ్గుతూ వచ్చింది. ఉదా. వేవురు (క్రీ. శ. 625-50), ఎల్లుర (8 వ శతా). (§§ 3.23, 4.33, 6.25), సామాన్య బహువచన ప్రత్యయం-ళు 7వ శతాబ్దికే

లుగా మారిపోయింది; ఉదా. రాజుల్ల (క్రీ. శ 600), అణవోతు-లు (క్రీ. శ. 600-25) (§§3.31, 4.39; చూ. పైన సూత్రం 11). పూజ్యార్థంలో 'గారు' 12వ శతాబ్ది నుంచి శాసనభాషలో ఉంది (§3.39) బహువచన 'ళు/లు' పరమైనప్పుడు ఈ క్రింది సూత్రం ప్రవర్తిస్తుంది.

$$(28)\ \text{హా}_1\text{హా}_1 \longrightarrow \text{హా}_1 \;/\; \text{—} \begin{Bmatrix}\text{లు}\\ \text{ళు}\end{Bmatrix}$$

పుట్లు (క్రీ. శ. 633-63), భట్లు (క్రీ. శ. 1048). ఇదిపై నిరూపించిన సూత్రం (5) కు సాధారణీకృత రూపం. 'ళు', 'లు' గా మారకముందే సంధిలో 'రల' లకు మూర్ధనత్వం వచ్చింది. ఉదా. ఊర్ళందు (క్రీ. శ. 633-63), మంగడ్ల (క్రీ. శ. 742-98) (§3.32). మూర్ధన్య 'ళ్ళు' చారిత్రకంగా వచ్చినా ఇప్పటికీ అలాటి శబ్దాల్లో నిల్చి ఉంది. కాళ్ళు, రోళ్ళు మొ. వి. పై ఉదాహరణల్లో 'డ్లు' రాతలో ఉన్నా ఉచ్చారణ 'ళ్ళు' గానే ఉండవచ్చు. 12, 13 శతాబ్దులదాకా 'డ్లు' రాతలో కనిపిస్తుంది (§4.39). ఇప్పుడు వ్యావహారిక రూపాలుగానే చెలామణి అయ్యే 'నెల్లు, రాత్రిళ్ళు' లాటివి 14వ శతాబ్దినుంచే శాసనభాషలో ఉండేవి (§4.39)

ద్వితీయా విభక్త్యంగ నిర్మాణంలోను, నామవిభక్తుల స్వరూప ప్రయోగాల్లోను 10వ శతాబ్ది దాకా శాసనభాషకు కావ్యభాషకు మధ్య చెప్పుకోదగ్గ మార్పులు లేవు (§§ 3.33-36). 'ను, కు, నన్, అన్' ల ముందు, ము వర్ణలోపం, పూర్వాచ్చుకు దీర్ఘం, నగాగమం 11వ శతాబ్దికే ఏర్పడ్డాయి (చూ. సూత్రం 20 పైన). హల్సంధి వచ్చిన ద్వితీయాంత రూపం 12వ శతాబ్దికే ఏర్పడ్డది. ధర్మాన్ని (కీ. శ. 1140) (§4.41). 'న' గా గమ(ంతోపాటు) నిగాగమ రూపాలు 13వ శతాబ్దిలో ఉన్నాయి, ఉదా. దీపానకుం (కీ.శ. 1292), దీపానికి (కీ. శ. 1241) (§4.43) తరవాత నిగాగమరూపాలే వ్యవహారభాషలో స్థిరపడ్డాయి. వలన > వల్న > వల్ల 13వ శతాబ్దిలో ఉంది (§4.44). మహత్తు 'డుజు' తో ద్వితీయావిభక్తి చేరి హల్సంధి వచ్చిన రూపాలు 16వ శతాబ్దికే ఏర్పడ్డాయి. ఉదా. బ్రంహ్మేశ్వరుణ్ణి (క్రీ. శ. 1583). ఈ వాడుక ఈనాటిది గాదని దీన్నిబట్టి నిరూపించవచ్చు. (§5.26). 15, 16 శతాబ్దులకల్లా కరణసహార్థాల్లో 'చేత, తోడ' లే వ్యాప్తిలోకి వచ్చి 'అన్, నన్, మెయిన్', మొ. వి. కావ్యభాషకే పరిమితమైపోయినాయి. (§4.42). 'వల్లనుండి, లోననుండి' మాదిరి సమస్త విభక్తులు 15, 16 శతాబ్ది

లకు ప్రచురమైనాయి (§6.30,) 'నుంచి/నించి' - పట్టి 17 వ శతాబ్ది నుంచీ కనిపిస్తున్నాయి. (§6.27(6) §8.6).

**16.10.** సంఖ్యా వాచకాలు : 1 నుంచి 10 వరకు ప్రా. ద్రా. రూపాలు ఇలాఉండేవి : *ఒన్ట్టు/ఓర్ ~ ఒరు, ఒక్క '1', *ఈర్ ~ ఇరు, ఇరణ్టు '2' *మూ-.మూన్ట్టు '3', *నాల్~ నలు, నాల్న్కుక్క/నాల్న్కు '4', *చయ్మ్-, చయ్మ్తు '5', *చాట్టు '6' *ఏఴ్ '7', *ఎణ్ '8', *తొణ్/తొళ్ '9' పత్తు, పన్-, పత్-ఇన్- '10'; శతార్థంలో *నూట్టు అని ప్రా. ద్రా. లో ఉండేది. పై శబ్దాల్లో ఒన్-, ఓర్~ ఒరు, ఈర్~ఇరు, మూ-, నాల్ ~ నలు విశేషణాలుగానే ప్రయోగించబడేవి. ఒన్-ట్టు, ఇరణ్-టు, మూన్-ట్టు, నాల్-కుక్క, చయ్మ్-తు, లలో చివరి ట్టు, టు, కుక్క, తులు అమహత్ప్రత్యయాలు. టు ~ ట్టు ~ తు లు సపదాంశాలు; తు వర్ణం దంతమూలీయ, మూర్ధన్య అనునాసికాలకు పరమైనప్పుడు ట్టు, టు లుగా మారటం ప్రా. ద్రా. లోనే జరిగింది.

తెలుగులో 1-7 సంఖ్యావాచకాలను పై ప్రా. ద్రా. రూపాలనుంచి నిష్పన్నం చెయ్యవచ్చు. అపదాది స్పర్శాలు నాదవంతాలు కావటం, పదాది చకార లోపం, న్టు (=న్ట్టు) > ణ్డు, ఱ > డ, వర్ణవ్యత్యయం, మొ. మార్పులవల్ల తెలుగు రూపాలేర్పడ్డాయి. ప్రా. ద్రా. *చయ్మ్-లో చలోపం, 'అయ్' 'ఏ' గా మారటం, చివరి 'ము' 'ను' గావటంవల్ల ఏను శబ్దం ఏర్పడ్డది; ఐదు (>అయ్మ్ -తు <*చయ్మ్-తు). బహుశా అనునాసికలోపం అయిన కన్నడరూపం, ఎరువుగా తెలుగులోకి చేరి ఉంటుంది. లేకపోతే ప్రాచీన కావ్యాల్లో 'ఐఁదు/అయిఁదు' అని అరసున్నతో ఉండవలసింది. నన్నయకాలంలోను, అంతకుముందు 'ఏను' రూపమే కనిపిస్తుంది. ఏఁబది (> యాభై) లో ఉన్న మొదటిపదం ఇదే.

తమిళంలో 'పత్తు' కు వికల్పరూపం 'పహ్తు'. ఇక్కడ 'అయ్దమ్' అనే వింతధ్వని (హకార సదృశమైనది) కనిపిస్తుంది. బహుశా ఈ కారణంవల్లనే తెలుగు కన్నడాల్లో -ఫై, -భై, -ఫత్తు, అనే రూపాలు 'పది'కి సపదాంశాలుగా ప్రాచీన కాలంలోనే ఏర్పడ్డాయి. దేశ్య (ద్రావిడజన్య) శబ్దాల్లో మహాప్రాణం ఏర్పడ్డది ఈ పదాంశంలోనే.

**16.11.** సంఖ్యావాచకాలతో చేరే మహత్ప్రత్యయం ప్రా. ద్రా. లో-వర్. ఇది తెలుగులో-వురు (>-గురు) గా మారింది. 'ఇద్దఱు' కు పూర్వరూపం

*ఇర్-దరు; ఈ పదంలో రెండోభాగం అందఱు, ఇందఱు, ఎందఱు లలోగూడా కనిపిస్తుంది. బహుశా, ఇరువురు/ఇద్దఱు వర్గమాండలికాలై ఉంటాయి. నన్నయ కాలానికే రెండూ కావ్యభాష కెక్కాయి. క్రమంగా 'ఇరువురు' రూపం జారి పోయింది.

**16.12.** 'ఒక్కఱు'కు ఔపవిభక్తి రూపంగా ఏర్పడ్డ ఒక్కటి ప్రథమలో గూడా నిలిచిపోయింది. చారిత్రకంగా ఇది అర్వాచీనం (§4.48). ఏఱు 8 వ. శతాబ్దికే ఏడుగా మారింది (ఱ > డ). చూ. ఏఱు (క్రీ. శ. 725), ఏడు (క్రీ. శ. 742-98) (§ 3.37). ఎనిమిది, తొమ్మిది శబ్దాల చరిత్ర మనకు స్పష్టంగా తెలియదు. 'ఎణుంబొది'అనే ప్రాచీనరూపంలో 'బొది' పదికి రూపాంతర మని ఒక ఊహ. ఎనిమిది/ఎన్మిది రూపాలు 12 వ శతాబ్ది నుంచి బహుశం (§ 4.48). తొమ్మిదికి తొంభ అనే ఒత్తక్షరమున్న రూపం క్రీ.శ. 1006 లోనే శాసనాల్లో దొరికింది (§ 3.37). పదికి ఈ నాడు వాడుకలో కనిపించే రూపభేదా లన్నీ కొన్ని శతాబ్దుల కిందటనే ఏర్పడ్డాయి. ఇరుభది (క్రీ. శ. 682), ఇర్వయి (క్రీ.శ. 1250), ముప్పై (క్రీ.శ. 1280), నల్పయి (క్రీ.శ. 1250), నలభయి (క్రీ.శ. 1600), ఎంబై (క్రీ.శ. 1291), యాంభది (క్రీ.శ. 1600), అఱువై (క్రీ.శ. 1390), ఎనభై (క్రీ. శ. 1394), తొంభయి (క్రీ.శ. 1394). 13 వ. శతాబ్దినుంచి ది > యి అయిన రూపాలు కొల్లలు (§§ 3.37, 4.48, 5.37, **6.29**). పంద్రెండు < పన్-రెండు. ఇక్కడ 'ద', వాండ్రు, మొ. శబ్దాల్లో లాగా సంధివశానవచ్చింది (చూ. సూత్రం 13). - వురు > -గురు 12 వ. శతాబ్దినుంచి శాసనాల్లో కనిపిస్తుంది. (§ 4.48) పూరణార్థంలోవచ్చే అవ - > అవ- > ఓ- మార్పు 12వ శతాబ్దికే పూర్తి అయింది. మూఁడోనదపు (క్రీ. శ. 1186), రెండోమేళం (క్రీ. శ. 1518).

**16.13.** ఒక్క తెలుగులో తప్ప మరే ద్రావిడ భాషలోను సహస్ర సంఖ్యకు దేశ్యశబ్దంలేదు. తెలుగులో వేయు (క్రీ. శ. 633-63), వేలు (క్రీ. శ. 1008) మొ. శబ్దాలు మొదటినుంచి కనిపిస్తాయి.

**16.14.** సర్వనామాలు : ఉత్తమ పురుషలో ఏను, ఏము రూపాలకు ప్రా. ద్రా. మాతృకలు *యాన్, *యామ్. ఉభయార్థంలో ప్రా. ద్రా. లో *ఞామ్ అనే రూపం ఉండేది. పై రూపాల సామ్యంవల్ల *ఞాన్ అనే మరో ఏకవచన

రూపం ద. ద్రా. ఉపకుటుంబంలో ఏర్పడ్డది. ఏన్/అన్‌లతోపాటు నేన్/నాన్ అనే జంటరూపాలు ఏకవచనంలో ఏర్పడటం ద. ద్రా. కుటుంబంలోనే కనిపిస్తుంది, *ఞామ్ నుంచి తెలుగులో నిష్పన్నమైన రూపం 'నేము'. ఇది శాసనభాషలో కనిపిస్తుంది (§ 6.28). ద. ద్రా. మొదటిశాఖలో ఎన్-/నన్-, ఎన్-/నమ్-లు ద్వితీయావిభక్త్యంగ రూపాలు. ఈ శాఖతో ఞాన్, ఞామ్>నాన్-, నామ్- శబ్దాల చివరి హల్లు లోపించటంవల్ల ద్వితీయావిభక్త్యంగ రూపం ఏర్పడుతుంది. ఈ హల్లులు ఏక బహువచన బోధకాలు కావటంవల్ల 'నమ'ల భేదం ప్రథమ హల్లుకు ఆరోపితమై నా-, మా-రూపాలేర్పడ్డాయి. ఈ విలక్షణతవల్ల తెలుగు తమిళాది ద. ద్రా. I శాఖకు చెందినదిగాదని, కూయి, కువి, మొ.వాటికే సన్నిహిత మని నిరూపించవచ్చు. మధ్యమపురుషలో ఏకవచన బహువచనాల్లో ప్రా. ద్రా. మాతృకలు *నీన్, *నీమ్ ద. ద్రా. I శాఖలో ద్వితీయావిభక్త్యంగ రూపాలు నిన్, నిమ్ అనీ, ద. ద్రా. II శాఖలో ద్వితీయావిభక్త్యంగ రూపాలు నిన్/నీ-, *నిమ్/*నీ- అని రావలసిఉండగా రెండోజత మిమ్-/ మీ—గా మారి ఏకత్వ బహుత్వ భేదాన్ని నిలుపుకొన్నది (చూ. కృష్ణమూర్తి 1968). ద్వితీయాద్యంగ సాదృశ్యంవల్ల నేము-/ మా-, మేము/మా-గాను, నిమ్ము/మీ- మిమ్ము/మీ-గాను మారిపోయినాయి. ద. ద్రా. భాషలన్నిటిలోను ప్రథమపురుష బహువచన ప్రత్యయం 'ర్', 'మ్' స్థానంలో రావటంవల్ల 'నీర్' అనే మరోరూపంగూడా ప్రా. ద. ద్రా. దశలోనే ఏర్పడ్డది. ద్వితీయాద్యంగ సాదృశ్యంవల్ల ప్రాచీనతెలుగులో 'నీరు' 'మీరు'గా మారింది. కాని 'మిమ్ము' లో '*మీము' అనే పూర్వరూపం గూఢంగా నిల్చివుంది. ఒక్క తెలుగులోనే 'నీవు' రూపం కనిపిస్తుంది. ఇక్కడి 'వు' ఎలావచ్చిందో మనకు తెలియదు. ఓష్ఠ్య ప్రాబల్యంవల్ల తాలవ్యాచ్చు ఓష్ఠ్యాచ్చుగా మారి 'నువ్వు' రూపం అర్వాచీనంగా ఏర్పడి ఉంటుంది. ఆత్మార్థంలో ప్రా. ద్రా. *తాన్, *తామ్ శబ్దాలు తెలుగులో తాను, తాములుగా నిలిచిఉన్నాయి. కావ్యభాషలో బహుళంగా ఉన్న ఏను, ఏముల స్థానంలో నేను, మేములు సర్వత్రా వ్యాపించాయి.

ప్రథమ పురుషలో ప్రాచీన ద్రావిడ మాతృకలు *అవన్డు *ఇవన్డు అని ఉండేవి. వర్ణవ్యత్యయంవల్ల ప్రాచీనతెలుగులో ఇవి వాన్డు, వీన్డుగా మారాయి. ఇక్కడ 'ఱ' ను దంతమూలీయ డు వర్ణంగా ఉచ్చరించే వారేమో! ఇవి 9వ శతాబ్దికే వాణ్డు, వీణ్డుగా మారాయి (చూ. సూత్రం 12). ద. ద్రా. *I* శాఖలో చివరి 'ఱ' వర్ణం లోపం వచ్చి అవన్, ఇవన్ శబ్దాలే మాతృకలైనాయి. అమ

హత్తులో అది/దాని-, ఇది/దీని- పూర్వరూపాలు *అత్తు /అత్ - అన్ - ఇ, *ఇత్తు / ఇత్-అన్ - ఇ గా ఉండేవి. ఇక్కడ - అన్ - ఇ ద్వితీయాది విభక్తుల్లో చేరే ఆగమం.

పై నిరూపించిన సర్వనామాల్లో కొద్దిపాటి ధ్వని పరిణామాలు తప్ప చారిత్రక కాలంలో వచ్చిన కొత్తమార్పు లేవీలేవు; ఈ మార్పుల్లో న్లు > ణ్ణు, అనునాసికం > అనునాసిక్యం > లోపం ఈ మార్పులు గుర్తించదగ్గవి (చూ. పైన).

**16.15.** క్రియలు. తెలుగు పూర్వదశలో క్రియా రూపాలు ప్రా. ద్రా. మాతృకనుంచి ఎన్ని రకాల మార్పులు చెందిందీ మనకింకా స్పష్టంగా తెలియదు. ప్రేరణార్థకంలో–ఇంచు/-ఇంపులు ఎలా వచ్చిందీ ఇంతకుముందు చూశారు. (-16.8). తద్ధర్మార్థంలో వచ్చే ఉను, దు / తు ప్రత్యయాలు ప్రా. ద్రా. నుంచి ఏర్పడ్డవే. ఆధునిక భాషలో కొద్ది క్రియాపదాల్లోనే ఇవి నిల్చి ఉన్నాయి ; ఉదా. రావచ్చు, పోవచ్చు, నాకు పాడటం తెలుసు, ఎరుగుదును, మొ. వి. చేదర్థక వాక్యాల్లోను కొన్ని మాండలికాల్లో ఈ రూపాలు నిల్చి ఉన్నాయి. ఉదా. డబ్బుంటే ఇల్లుకట్టి ఉందును, మొ. వి. వీటి స్థానంలో ఇటీవల 'ఉండేవాణ్ణి' లాటి విధేయ విశేషణాలు ప్రమాణభాషలో వ్యాపిస్తున్నాయి.

వచ్చెదవు, చేసెదవు లాటి ఎదగాగమ రూపాలు 14, 15 శతాబ్దులకే వచ్చేవు, చేసేవు గా మారి భవిష్యదర్థంలో లోపించాయి. ఇప్పుడు కొన్ని మండలాల్లో వీటికి విలక్షణ ప్రయోగం ఉంది, ఉదా. సరిగా నడు, కిందపడేవ్ ? ఈత నేర్చుకొండి, నీళ్ళలో మునిగేరు ? వంటివి. తద్ధర్మార్థక ధాతుజన్య విశేషణంమీద 'ఆది' చేర్చి విధ్యర్థంలో ప్రయోగించటం మొదటినుంచీ కావ్యభాషలోను కనిపిస్తుంది (§8.49). ఉదా. నడుపునది (క్రీ. శ. 1069) : విధ్యర్థంలో -ఏ + ది: చేశేది, ఎత్తేది (§ 5.48). ఈ రూపాలు 14,15 శతాబ్దులకే ఏర్పడ్డాయి. భవిష్యదర్థంలో అన్నంతంమీద వచ్చే 'కల' సామర్థ్యార్థకమై పోయింది. ఇది బహుశా 15, 16 శతాబ్దుల్లో జరిగి ఉండవచ్చు.

**16.16.** 12 వ శతాబ్దిదాకా కావ్యభాషకు శాసనభాషకు సమాపక–అసమాపక క్రియల్లో ఎక్కువ తేడాలు కనిపించవు. 'ఇస్తిమి' వంటి రూపాలు 12 వ శతాబ్దికే శాసనాల్లో కనిపిస్తాయి. 'ఇచ్చితిమి' రూపంలో 'చ్చి' లో హ్రస్వాచ్చు

లోపించి ఈ కింది ధ్వని పరిణామం అప్పటికే సామాన్యుల వాడుకలో వచ్చి ఉండాలి :

(29) (చ్) చ → స /—త

చ వర్ణం (ద్విరుక్తమైనా, అద్విరుక్తమైనా)తవర్ణం పరమైనప్పుడు'స'గా మారుతుంది.

విధేయ విశేషణాల్లో 'వ' కారలోపం 11 వ శతాబ్దిలోనే ఆరంభమై 12, 13 శతాబ్దులకల్లా ప్రచురమైంది; ఇచ్చిన వాణ్ణు ▷ ఇచ్చినాణ్ణు (క్రీ. శ. 1096) (§ § 3 41, 4.53). 'చేస్తుంది' (క్రీ శ. 1275)అనే రూపం వర్తమానక్రియగా 'తు' ప్రత్యయంతో మొదటిసారి శాసనాల్లో కనిపిస్తుంది (§ 4.56). 'చు' వర్ణం కంటె చారిత్రకంగా 'తు' వర్ణం ప్రాచీనమైనట్టు తులనాత్మక విధానంవల్ల మనకు తెలుస్తుంది. 'చేయుచు' వంటిరూపాలు ఒకానొక వర్గమాండలికం నుంచి కావ్యభాషకు ఎక్కిఉంటాయి. (§ 4.56). 'ఇనన్' అవ్యర్థంలో 'ఇనాను' గా మారింది ; ఆ తరవాత తుది 'ను' లోపించింది, ఉదా. అమ్మినాను (క్రీ. శ. 1269), (§5.49); చేవర్థంలో -ఇతే (ను) 13వ శతాబ్దిలో కనిపిస్తుంది, పోయితేను (క్రీ. శ. 1250), చేస్తే (కీ. 1252) (§ 4.56). వర్తమాన భవిష్యదర్థంలో వచ్చే -ఎద-, 15 వ శతాబ్దికే -ఏ-గా మారిన ఆధారాలున్నాయి. ఉదా, సేసేరుగాన (క్రీ. శ. 1444) ధరించేము (క్రీ. శ. 1515). అన్నమాచార్యుల కీర్తనలలో ఇలాటి రూపాల వాడుక బహుళం.

విధేయ విశేషణాలు 16 వ శతాబ్దికి సమాపక్రియలైన ఆధారాలున్నాయి. (§ § 4.59, 5.47, 61), వర్తమానార్థక క్రియలు ఇప్పటి భాషలోలాగా ఉన్నవి 15వ శతాబ్దికే ప్రచురంగా కనిపిస్తాయి, ఉదా సేవసేస్తున్నాండు (క్రీ. శ. 1453) (§ 5.47). క్రియాజన్య విశేషణ ప్రత్యయం 'ఎడి', 14 వ శతాబ్దికే 'ఏ' అయింది, ఉదా. రక్షించేది. ఇతర క్రియాజన్య విశేషణా (భూత వ్యతిరేకా) ల్లో మార్పులేదు.

ఎన్నాళ్ళో జనుల వాడుకలో ఉండి మరుగుపడి ఉన్న తద్ధర్మ భవిష్యదర్థక -తా- ప్రత్యయం మొదటిసారిగా 16వ శతాబ్దిలో శాసన భాషలో గోచరిస్తుంది. ఉదా. చేస్తారు (క్రీ.శ. 1551) (§ § 6.38. 7.28). ఈనాటి భాషలో చేశాడు, చేసినాడు, చేసిండు, మొ.న సమాపకక్రియలకు 'వ' కారం లోపం వచ్చిన విధేయ విశేషణాలే మూలరూపాలు. ఈ కారణం వల్ల 'చేసెను, చేసితిని' వంటి రూపాలు వ్యవహార భ్రష్టమైనాయి (§ 6.36)

**16.17.** ఇంచు/ఇంపుల సపదాంశత నశించి '-ఇంచు' సర్వత్ర వ్యాపించటం 13వ శతాబ్ది నుంచే కనిపిస్తుంది. ఉదా. జరిగించుము (క్రీ.శ. 1214; 4.55). ఉభయ ప్రార్థనంలో వచ్చే '-దము'. '-దాము, -తాము'లుగా 16వ శతాబ్ది కావ్యాల కెక్కింది, చూతాము, వెదాకుదము (§ 8.20). వ్యతిరేక భూత క్రియ అన్నంతానికి 'లేదు' చేర్చి కూర్చటం 1600 నుంచే ఉంది, 'సేయలేదు' (§ 6.42). అత్మార్థంలో - కొని సంకుచతమై వాడుకలో -క గా మారటం 16 శతాబ్దికే జరిగింది. ఉదా. అనుభవించుక (§ 6.31). విధ్యర్థంలో -వలెను చేరటం గూడా 16వ శతాబ్ది తరవాతనే, ఉదా. నడిపించవలెను (క్రీ.శ. 1708; § 6.40). కావ్యభాషలో ఎక్కువగా కనిపించే కర్మణ్యర్థక ప్రయోగాలు క్రమంగా విరళమైనాయి (§ 8.23). శత్రర్థంలో -తూ-తో పాటు -తా- ప్రత్యయం గూడా మాండలికంగా తలెత్తింది, చేస్తూ (క్రీ.శ. 1600), యిస్తా (క్రీ.శ. 1691) (§ 6.43(2)).

**16.18** సముచ్చయార్థంలో వచ్చే ప్రత్యయం -ఉమ్ (క్రీ. శ. 641) క్రమంగా -ఉను/-ను లుగా మారింది. దీనిలో ఉత్వం దీర్ఘమై ఎప్పుడూను (క్రీ.శ. 1008) వంటి రూపాలు 11వ శతాబ్దికే కనిపిస్తాయి (§ 3.62). పూర్వాచ్చును బట్టి -(ఉ)న్నూ,-(ఇ)న్నీ, రూపాలు అర్వాచీనం. 16వ శతాబ్ది తరవాత ను లోపం వచ్చి పూర్వాచ్చు దీర్ఘత సముచ్చయార్థకంగా నిలిచిపోయింది (§ 5.64). దీని పరిణామం ఈ కింది విధంగా సూచించవచ్చు.

*వాణ్డుమ్ ▶ వాణ్డును > వాణ్డూను / వాణ్డున్నూ > వాండూ ▶ వాడూ.

**16.19.** **వాక్యరచన.** ఇతర ద్రావిడభాషల్లో లాగా తెలుగులో అఖ్యాతం నామపదబంధం కావచ్చు, క్రియాపదబంధం కావచ్చు (§§3.70-71). యత్తదర్థక ప్రయోగం, కర్మణిప్రయోగం సంస్కృత ప్రాకృత ప్రభావాలవల్ల తెలుగులో ఏర్పడ్డవి (§3.78); ఈ ప్రయోగాలు కావ్యభాషలో బహుళంగా కనిపిస్తాయి, ఉదా. అతని చేయంబడిన ధర్మువులు (క్రీ.శ. 892-922) (§3.74). సకర్మక క్రియావిశేషణానికి ముందు షష్ఠిలో కర్తృపదం ప్రయోగించటం ప్రాచీన భాషా లక్షణం, ఉదా. తమ ప్రతిష్ఠ చేసిన ఈశ్వరాలయంబునకు (క్రీ.శ. 1060), నీ చేసిన యుపకారంబు (క్రీ.శ. 892-922), అతని కొల్పించిన చెఱువులు

(క్రీ.శ. 892-922) (§ 3.75). 15వ శతాబ్దిలో షష్ఠ్యర్థ కర్త ప్రథమలో రావటం కనిపిస్తుంది (క్రీ.శ. 1414) (§ 5.68).

ఇప్పటి భాషలో వాక్యరచనావిన్యాసంలో ఎన్నో విశేషాలు తెలిశాయి (రామారావు 1975); వీటి చారిత్రక పరిణామం క్రమంగా సూచించటానికి ఎంతో పరిశోధన జరగాలి.

# ఉపయుక్త గ్రంథాలు (BIBLIOGRAPHY)

తెలుగు :


1. అథర్వణాచార్య. *వికృతి వివేకము* (లేక *అథర్వణాకారికావళి*) మద్రాసు : వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1955.

2. అప్పకవి, కాకునూరి. *అప్పకవీయము*. మద్రాసు : వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1958.

3 అహోబలుడు. *అహోబల పండితీయమ్*. హైదరాబాదు : ఆంధ్రరచయితల సంఘం, 1965

4. ఈశ్వరదత్తు, కుందూరి. *శాసనశబ్ద కోశము*. హైదరాబాదు : ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1967.

5. కందప్పచెట్టి, ఎమ్. వేయిశబ్ద విచారము. *భారతి*, మార్చి, 1968.

6. ——— 11 వ శతాబ్ది వర్తమానార్థక క్రియలు, *భారతి*. సెప్టెంబర్, 1968.

7. కృష్ణమూర్తి, భద్రిరాజు (సం.) *మాండలికవృత్తిపదకోశం*. 1, 2. భాగాలు, హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1962, 1971.

8. కేతన, మూలఘటిక. *ఆంధ్రభాషాభూషణము*. మద్రాసు : వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1949.

9. గురుమూర్తిశాస్త్రి. రావిపాటి. *తెలుగు వ్యాకరణము*.

10. గోపాలకృష్ణరావు, కే. *తెలుగుపై ఉర్దూపారసీకముల ప్రభావము*. హైదరాబాదు : ఆంధ్ర సారస్వత పరిషత్తు, 1968.

11. చక్రధరరావు, లకంసాని. *ఆంధ్రశాసన సారస్వతమందలి ఉర్దూ మరాఠీ పదములు*. అముద్రిత సిద్ధాంత వ్యాసం. వాల్తేర్ : ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, 1965.

12. చిన్నయసూరి, పరవస్తు. *బాలవ్యాకరణము*. మద్రాసు : వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1950.

13. తిక్కన, కొట్టరువు, *శ్రీమదాంధ్ర మహాభారతము.*

14. ——— *నిర్వచనోత్తర రామాయణము.*

15. దొణప్ప, తూమాటి. *భాషాచరిత్రక వ్యాసావళి.* హైదరాబాదు : ఆంధ్ర సారసత్వ పరిషత్తు 1972.

16. నన్నయ *ఆంధ్రశబ్ద చిన్తామణి.*

17. ——— *శ్రీ మదాంధ్ర మహాభారతము.*

18. నన్నెచోడుడు. *కుమారసంభవము.*

19. నారాయణరావు, చిలుకూరి. *ఆంధ్రభాషాచరిత్రము.* 1, 2 సంపుటాలు. వాల్తేరు : ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, 1937.

20. పాణిని. *అష్టాధ్యాయి.*

21. పెద్దన, విన్నకోట *కావ్యాలంకార చూడామణి.*

22. పోతన, *శ్రీ మదాంధ్ర మహాభాగవతము.*

23. ప్రభాకరశాస్త్రి, వేటూరి. *చాటుపద్య మణిమంజరి.*

24. రమణారెడ్డి, కె. వి. *మహోదయం.* విజయవాడ : విశాలాంధ్రప్రచురణాలయం, 1969.

25. రాధాకృష్ణ, బూదరాజు. *ప్రాచీనాంధ్రశాసనాలు* (పీఠిక : సంగ్రహభాషాచరిత్ర (హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ), 1971.

26. ———(సం.) *తెలుగు మాండలికాలు : కరీంనగర్ జిల్లా* హైదరాబాదు, తెలుగు అకాడమీ, 1971.

27. ——— (సం.) *మాండలికవృత్తిపదకోశం,* 4 వ భాగం. హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1968.

28. ——— *వ్యావహారికభాషావికాసం.* విజయవాడ : విశాలాంధ్ర ప్రచురణాలయం, 1972.

29. రామకృష్ణయ్య, కోరాడ. నన్నయకుఁబూర్వ మాంధ్రభాషా స్థితి. *భారతి* 7. 879-886, 1929.

30. ——— ద్రావిడభాషలు, సంధి, *భారతి* 8. 57-61, 1930.

31. ——— ఆంధ్రభాషా వాఙ్మయములు : ప్రాకృత సంపర్కము. *భారతి* 18. 4-8, 1940.

32. ——— *దక్షిణదేశ భాషా సారస్వతములు : దేశి.* మద్రాసు : శ్రీవత్స ప్రెస్, 1949.

33. రామచంద్ర, తిరుమల. *మనలిపి పుట్టుపూర్వోత్తరాలు.* బెజవాడ : విశాలాంధ్ర ప్రచురణాలయం, 1957.

34. రామయ్య, జయంతి. ప్రాచీనాంధ్ర శాసనచతుష్కము. *ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.* కాకినాడ : ఆంధ్రసాహిత్య పరిషత్తు 24. 158-162.

35. రామకృష్ణశాస్త్రి, శిష్టా. ఆంధ్రులు, తెనుగులు వారి మూలభాషాదేశములు, *భారతి.* ఏప్రిల్, 1958.

36. రామకృష్ణారావు, అబ్బూరి. వేంకటావధాని, దివాకర్ల (సం.) *నన్నయ పదప్రయోగకోశము.* హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1960.

37. రామారావు, చేకూరి. తెలుగులో నామ్నీకరణాలు. *భారతి*, మే, 1968.

38. ——— సందేహార్థక నామ్నీకరణాలు. *భారతి*, జూలై, 1968.

39. ——— ఇత్యర్థక నామ్నీకరణం, కాంక్షార్థక నామ్నీకరణం. *భారతి.* ఆగస్ట్; 1968.

40. ——— వ్యాపారార్థక నామ్నీకరణం *భారతి*, మార్చి 1969.

41. ——— లుప్తవిభక్తిక నామ్నీకరణం. *భారతి*, ఏప్రిల్, 1970.

42. ——— తెలుగులో బహువచన రూపనిష్పత్తి. *భారతి*, జూన్, 1970.

43. ——— తెలుగులో 'అని' చేసేపని, *అక్షరార్చన.* పే : 253-262, హైదరాబాదు: పాటిబండ మాధవశర్మ షష్టిపూర్తి సన్మానసంఘం, 1972.

44. ——— తెలుగులో అసమాపక క్రియ : క్త్వార్థకం. *ఆంధ్ర పత్రిక* సంవత్సరాది ప్రత్యేక సంచిక, 1973.

45. —— *తెలుగువాక్యం*, హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1975.

46. —— తెలుగులో స్వరసమీకరణం. *భారతి* సెప్టెంబర్, అక్టోబర్, 1975.

47. వేంకటరత్నం, తెలికచర్ల, *వ్యాసనంగ్రహము*. విజయవాడ : ఆంధ్రా ప్రింటర్స్, 1933.

48. వేంకటరామమూర్తి, గిడుగు. *ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజం*. (మొదటి ముద్రణ 1933) విజయవాడ : విశాలాంధ్ర ప్రచురణాలయం.

49. —— *బాలకవి శరణ్యం* (మొదటి ముద్రణ : 1933) విజయవాడ :

50. —— *వ్యాసావళి* (మొదటి ముద్రణ : 1938) విజయవాడ : విశాలాంధ్ర ప్రచురణాలయం, 1958.

51. వేంకటరావు, నిడుదవోలు. *దక్షిణాంధ్ర వాఙ్మయము*. మద్రాసు : మద్రాసు విశ్వవిద్యాలయం, 1960.

52. వేంకటలక్ష్మణరావు, కొమర్రాజు. అక్షరములు. *ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము*, 1 వ భాగం. మద్రాసు : విజ్ఞానచంద్రికా మండలి, 1916.

53. —— *లక్ష్మణరాయ వ్యాసావళి*. మద్రాసు : విజ్ఞానచంద్రికా గ్రంథమాల, 1923.

54. వేంకటావధాని, దివాకర్ల. *ప్రాఙ్నన్నయ యుగము*. హైదరాబాదు : గ్రంథకర్త ప్రచురణ, 1960.

55. —— *నన్నయ భారతము*. హైదరాబాదు : గ్రంథకర్త ప్రచురణ, 1960.

56. —— రామకృష్ణారావు, అబ్బూరి (సం.) *నన్నెచోడ పద ప్రయోగ సూచిక*. హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ. 1962.

57. శ్రీనాథుడు. *శృంగారనైషధము*.

58. సత్యనారాయణ, మోదేకుర్తి. తెలుగుశాసనాలలో అన్యదేశ్యాలు. *భారతి*. అక్టోబర్, 1959.

59. సీతారామాచార్యులు, బహుజనపల్లి. *ప్రౌఢవ్యాకరణము* (లేక త్రిలింగ లక్షణశేషము) మద్రాసు : వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ 1947).

60. —— *శబ్దరత్నాకరము.* మద్రాసు : మద్రాసు స్కూల్ బుక్ అండ్ లిటరేచర్ సొసైటీ, 1958.

61. సుబ్రహ్మణ్యం, పి. ఎస్. తెలుగులో యుష్మదస్మదర్థకాల చరిత్ర. *భారతి* ఫిబ్రవరి, 1969 a.

62. సోమన, నాచన. *ఉత్తర హరివంశము.*

63. సోమన, పాల్కురికి. *బసవపురాణము.*

64. —— *పండితారాధ్య చరిత్ర.*

65. సోమయాజి, జి. జె. *ఆంధ్రభాషా వికాసము.* వాల్తేరు : ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, 1947.

66. హుస్సేన్, ఎహతెహామ్. అను. యన్. సదాశివ్. *ఉర్దూసాహిత్య చరిత్ర.* హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1963.

## ENGLISH


1. Allen, W. S. *Phonetics in Ancient India*, London, 1953.

2. Appa Rao, G. V. *Minute of Dissent to the Report of the Telugu Composition Subcommittee*, Madras : V. Rama Swamy Sasthrulu and sons, 1914.

3. Bender, E. *Urdu grammar and Reader*. Philadelphia : University of Pennsylvania, 1967.

4. Biligiri, Syed Hossain and Willmott, C. *Historical and Descrpitive sketch of His Highness the Nizam's Dominions* Vol. I. Bombay : Times of India steam press, 1883.

5. Bloch, Jules. *The Grammatical structure of Dravidian Languages*; 1946; translated by R. Harshe, R. b., Poona: Deccan college, 1954.

6. Bloomfield, L. *Language*. New York : Holt, 1933.

7. Breal, M. *Semantics*, London, 1900.

8. Brown, C. P. *A Telugu-English Dictionary*. Madras : society for promoting christian knowledge, 1930.

9. Buhler, George. *Indian Paleography*. Calcutta : Indian studies, Past and Present, 1960.

10. — . *On the Origin of Indian Brahmi Alphabet*, Indian Studies No. 3, Strassburg, 1898.

11. Burnell, A. C. *Elements of South-Indian Paleography*. London, 1878.

12. Burrow. T. *The Sanskrit Language*. Oxford : Oxford University Press, 1955.

13. . *Collected papers on Dravidian Linguistics*. Annamalai nagar : Annamalai University, 1968.

14. ——— and M. B. Emeneu. *A Dravidian Etymological. Dictionary*. Oxford : Oxford University Press, 1961.

15. Caldwell, R. *A Comparative Grammar of the Dravidian or South Indian Family of Languages.* (3rd ed. Reprinted 1936) Madras : University of Madras.

16. Diringer, David. *The Alphabet.* New york, 1953.

17. Emeneau, M. B. *The Nasal phonemes of Sanskrit.* Langnage 22. 86–93, 1946.

18. ——*Kolami, A Dravidian Language.* Berkeley : University of California, 1955.

19. — The South Dravidian Languages. *JAOS* 87:365-413, 1967.

20. Fries, C. F. and Pike, K. L. Co-existent phonemic systems, *Language* 25. 29-50, 1949.

21. Galletti, A. *Telugu Dictionary*, Oxford, 1935.

22. Hall Jr., R. A. *Introductory Linguistics.* Philadelphia : chilton, 1964.

23. Haugen, E. *Bilingualism in the Americas.* Univesity of Alabama press, 1965.

24. Hockett, C. F. *A course in Modern Linguistics.* New York : Macmillan, 1958.

25. Hussain, Masood. *Phonetic and Phonological Study of the Word in Urdu.* Department of Urdu Studies No. I. Aligarh: Aligarh Muslim University.

26. Kandappachetty, M. *Historical Grammar of Inscriptonal Telugu*, Based on 12th 13th, 14th Century Inscriptions. Unpublished doctorate Dissertation. Tirupathi : S. V. University, 1966.

27. Kelley, G. Telugu Vowel Phonemes. *Indian Linguistics. Vol. II*, 1959.

28. ——— External Sandhi and Vocalic Phonemes in Telugu. *JAOS*, 1963.

29. ——— *A Grammar of Telugu* (mimeographed) Ithaca : N. Y. : Cornell Univesity, 1965.

30. Kittel, F. *A Kannada - English Dictionary.* Mangalore : Basel Mission Book and Tract Depositary, 1894.

31. Klein, E. *Comprehensive Etymological Dictonary of the English Language*. Amsterdam : Elsevier Publishing Co., 1966.

32. Krishnamurti, Bh. The History of Vowel Length in Telugu Verbal Bases. *JAOS* 75. 237-252, 1955.

33. ———. Proto Dravidian Ẓ. *Indian Linguistics : Turner Jublee Volume* 259–293, 1958 a.

34. — . Alternations i/e and u/o in South Dravidian. *Language* 34.458-468, 1958 b

35. ———. Sandhi in Modern Colloquial Telugu. *Indian Linguistics* 17. 178–188, 1958 c.

36. ———. *Telugu Verbal Bases : A Comparative and Descriptive Study*. Berkeley : University of California press, 1961.

37. ———. Darvidian Personal Pronouns. *Studies in Indian Linguistics*, 189–205. Annamalainagar and Poona, 1968 a.

38. ———. Compound Verbs in Telugu. *Indian Linguistics* 27.7–17. 1968 b.

39. ———. *Konda or Kubi : A Dravidian Language*. Hyderabad: Tribal Cultural Research & Training Centre & Training Institute, 1969.

40. ———. Causative Constructions in Indian Languages. *Indian Linguistics* 32.18–35, 1971.

41. ———. Verbs of Cognition in Telugu. *Osmonia papers in Linguistics*, 1.1-15, 1975

42. Lehman, Winfred P. *Historical Linguistics : An Introduction*. The University of Texas, 1964.

43. Mahadeva Sasthry, K. *Historical Grammar of Telugu*. Tirupathi: S. V. Uniuersity, 1966.

44. Mahendale, M. A. *Historical Grammar of Inscriptional prakrit*. Poona : Deccan college, 1948.

45. Pischel, *R. Comparative Grammar of the Prakrit Languages*; tr; from German by Subhadra Jha. Varanasi : Motilal Banarsi Dass. 1957.

46. Radhakrisha, B. A *Historical and Comparatiue Grammar of Early Telugu (Inscriptional)* Doctorate Dissertation (unpublished) Waltair : Andhra University, 1964.

47. Ramachandra, V. *A Critical Study of Errapraggada's works.* unpublished Doctorate Dissertation. Tirupathi : S. V. University, 1964.

48. Ramamurti, G.V. *A Memorandum on Modern Telugu,* 1913.

49. ———. *Arguments for and against Modern Telugu.* Scapes Co, Cocanoda, 1914.

50. Ramarao, C. Direct and Indirect Reports : A hypothesis concerning the universals of language. *Pakha Sanjam* Vol I No. 1, 1968.

51. ———. Co-ordination or Subordination : A Study of Dravidian Ktvarthaka, *Indian Linguistics.* 32.43–53, 1971.

52. ———. Some Aspects of Co-ordination in Telugu. in Ghatage, A. M, et al (eds.) *Studies in Transformational grammar.* Poona : Deccan College, Pp 62–65, 1971.

53. ———. Some Nonquotative uses of Quotative Morphemes. in Agesthialingam et al (eds.) *Third Seminar on Dravidian Lingnistics,* Pp 135–153, 1975.

54. ———. *Time passes.* (To be published in the Proceedings of Third All India Conferenee of Linguists). 1975.

55. ———. *Vowel Harmony in Telugu.* (To be published in Working Papers of Delhi University Linguistics Association Vol. 1), 1975.

56. Ranganadha charyulu, K. K. A Historical *Grammar of Inscriptional Telugu* (From 1401 A D to 1900 A D). Doctorate dissertation (unpublished) Hyderabad : Osmnia University, 1978.

57. Reddy, G. N. *A study of Telugu semantics.* Tirupathi : S. V. University, 1966.

58. Sapir. Edward. *Language : An Introduction to the Study of Speech.* New York : Harcort, Brace & world 1921.

59. Sturtevant, Edgar H. *An Introduction to Linguistic science.* New Haven : Yale University Press 1947.

60. Stern, Gustav. *Meaning and Change of Meaning.* Gothenburg. 1931.

61. Subbayya, K. V. A Premier of Dravidian Phonology. *Indian Antiquary* 38.159-170 and 769-800.

62. Subrahmanyam, P. S. The Intransitive and Transtive suffixes of kui. *JAOS* 85 : 551-565, 1965.

63. ———. The Central Dravidian Languages. *Dravidian Linguistics (Seminar papers)*, 107-134. Annamalainagar: Annamalai University, 1969.

64. ———. The Gender and Number Categories in Dravidian. *Journal of the Annamalai University*, 1969.

65. Weinreich, U. *Language in contact.* The Hague: Mouton & Co., 1964.

